ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్



Like us to follow
@mohanpublications




- పుత్తా పుల్లారెడ్డి

# కథాభారతం - అరణ్యపర్వం

# కథాభారతం

## ఆరణ్యపర్వం
(ఆంధ్ర మహాభారతానుసరణం)

పుత్తా పుల్లారెడ్డి





### *ఆదికవి - వాగనుశాసనుడు - నన్నయ భట్టారకుడు*

**క్రీ.శ. 1002 - 1061**

ఉ. సాత్యవతేయ విష్ణుపద సంభవమై, విబుధేశ్వరాబ్ధి సం
గత్యుప శోభితంబయి జగద్విదితంబగు భారతీయ భా
రత్యమరాప గౌఘము నిరంతర సంతత పుణ్య సంపదు
న్నత్యభివృద్ధి సేయు వినినం గొనియాడిన నెల్లవారికిన్

ఆది 1-72



ఈ గ్రంథం తిరుమల – తిరుపతి దేవస్థానం వారి
ఆర్థిక సహకారంతో ముద్రించబడినది.

# కథాభారతం

## ఆరణ్యపర్వం

(ఆంధ్ర మహాభారతానుసరణం)

పుత్తా పుల్లారెడ్డి



# కథాభారతం

## ఆరణ్యపర్వం
## (ఆంధ్ర మహాభారతానుసరణం)

**పుత్తా పుల్లారెడ్డి**



ప్రచురణ సంవత్సరం : **2009**

ప్రతులు : **1000**

వెల : **రు. 180-00**

ప్రచురణకర్త :
**పుత్తా పుల్లారెడ్డి (రచయిత)**
1-435-6-1, మారుతీ నగరు,
కడప నగరం.
సెల్ : 093433 65203

అక్షర విన్యాసం మరియు ముద్రణ :
**కొండూరు జనార్దన రాజు**
ఆర్.కె. గ్రాఫిక్స్ & స్క్రీన్స్,
మునిరావు వీధి, కడప - 516 001.
సెల్ : 98491 97044



నాలో కవిత్రయకృత శ్రీమదాంధ్ర మహాభారత పఠనానురక్తికి బీజావాపకులైన

మా తండ్రి

## శ్రీమాన్ పుత్తా వేంకట సుబ్బయ్య గారు



నాలుగున్నర దశాబ్దాలకాలంపాటు గృహిణిగా కుటుంబ బాధ్యతను స్వీకరిస్తూ
నా ఉద్యోగ నిర్వహణ కాలంలోనూ, ఉద్యోగ విరమణానంతర కాలంలోనూ
నేను ఉద్యోగ బాధ్యతలలోనే కాకుండా ఆంధ్ర మహాభారత పఠనంలోనూ,
రచనలలోనూ నిమగ్నుడనయ్యే సావకాశం నాకు కల్పించిన
అనుకూలవతియు అనువ్రతయు అయిన నా సహధర్మచారిణి

**చి. సౌ. జయలక్ష్మికి**

ప్రేమపూర్వకంగా ఈ గ్రంథాన్ని సమర్పిస్తున్నాను.

పుత్తా పుల్లారెడ్డి.

**డా॥ శలాక రఘునాథ శర్మ,**
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయ విశ్రాంతాచార్యులు (తెలుగు శాఖ),
రాజమండ్రి.



## సౌజన్య సంభావనము

**భాసురభారతార్థముల భంగులు నిక్క మెరుంగ నేరమిన్,**
**గాసట బీసటే చదివి, గాథలు త్రవ్వు తెలుంగు వారికిన్,**
**వ్యాసమునిప్రణీత పరమార్థము తెల్లము సేసినట్టి య**
**బ్భాసన కల్పులం దలతు నాద్యుల నన్నయ తిక్కనార్యులన్.**

ఇది కవిత్రయంలో స్థానం స్వశక్తితో సంపాదించుకున్న ప్రబంధపరమేశ్వరుని వాక్కు. ఇందులో నిగూఢంగా ఒక ఆవేదన అభివ్యక్తమవుతున్నది. 'అయ్యో! మానవులు అజ్ఞానంతో దివ్యమధు కలశాన్ని అందుకోలేక పోతున్నారే' అనేది ఆ ఆవేదన స్వరూపం. అయితే ఆ పరిస్థితి అన్ని కాలాలలో అదేవిధంగా ఉంటున్నది. ఆవేదనతో అతలాకుతలంఅయ్యే అంతరంగంగల మహానుభావులుకూడా ఆయాకాలాలలో ఉండనేఉంటారు. అటువంటి మహానుభావుడు శ్రీ పుత్తా పుల్లారెడ్డిగారు.

పుల్లారెడ్డిగారు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాగునీటిశాఖలో ఇంజనీరుగా పనిచేసి విశ్రాంతి పొందిన వ్యక్తి. అవిశ్రాంతంగా కవిత్రయ మహాభారతాన్ని అధ్యయనం చేసే శీలం కలవ్యక్తి. ఆయన ఇరవైనాలుగు పర్యాయాలు తెలుగు భారతాన్ని, కవిత్రయం నిర్మించిన పద్య గద్యాత్మక మహాభారతాన్ని, పఠించారన్న సంగతి ఒక్కటిచాలు, ఆయనకు రాజరాజనరేంద్రునకు వలె భారత బద్ధ స్పృహ ఎంత ఉన్నదో తెలుసుకోవటానికి.

ఆత్మానందం కోసం చదువుకోవటంతో తృప్తిపడని శ్రీ పుల్లారెడ్డి అంతరంగం ఆంధ్రజాతికి ఆ అమూల్య మధుకోశాన్ని మరొక రూపంలో 'అందించాల'నే అలజడిని సృష్టించుకుంది. ఫలితంగా ఆరణ్యపర్వంలోఉండే ఆఖ్యానాలనన్నింటినీ ఇంపు సొంపులతో కూడిన వచనరచనతో ఆయన తెలుగుజాతికి అందించే పూనికకు శ్రీకారం చుట్టారు. ఇతి శ్రీకారంకూడా పెట్టారు. ఈ మార్గంలో కవిత్రయమహాభారతాన్నంతా రచించాలనే దృఢసంకల్పంతో ఉన్నారు. 'ఫలసిద్ధి పొందుతార'నటంలో నాకేమాత్రమూ సందేహంలేదు.

మొత్తం ఆరణ్యపర్వంలోని ఏబదికథలను వీరు ఈ సంపుటంలో అందిస్తున్నారు. ప్రతి కథకు ఆకరం కవిత్రయ భారతంలో ఏ ఆశ్వాసంలో ఏ పద్యం నుండి ఏ పద్యం వరకు ఉన్నదో నిరూపించారు. కథావసానంలో ఆ కథ ద్వారా తెలియదగిన నీతిని చిన్న వాక్యాలతో సవదరించారు. ఆ కథలో రసవత్తరమైన పద్యాలను రెండు మూడింటిని కవిద్వయభారతం నుండి (నన్నయ ఎఱ్ఱన్నల భారతం నుండి) ఉదాహరించారు. ఇది ఈ రచనలోని ప్రయోజనాత్మక ప్రణాళిక.

శ్రీ పుల్లారెడ్డి గారిని నేను మనసారా అభినందిస్తున్నాను. సినిమా కథలను చూచి, 'భారతం' అంటే 'ఇదే' అనే భ్రాంతిలో ఉన్నవారికి, పద్యగ్రంథాలను స్వయంగా చదువుకోలేని జిజ్ఞాసువులకూ ఈ గ్రంథం కొంగుబంగారమై అలరారుతుంది. వారికి భగవంతుడు ఇతోఽధికంగా ఆయురారోగ్య భాగ్యాలను ప్రసాదించుగాక!

తేది : 30.12.2008.

**డా॥ జానమద్ది హనుమచ్ఛాస్త్రి,**
**వ్యవస్థాపక కార్యదర్శి, సి.పి. బ్రౌన్ గ్రంథాలయం,**
'మహతి', 1/1845, గాంధీ నగర్,
కడప - 516 004.



# అభినందన

**"యదిహాస్తి తదన్యత్రయన్నేహాస్తి నతత్ క్వచిత్"** ఇది మహాభారత ప్రశస్తిని గురించిన జనవాక్యం.

బాల్య మాదిగ కవిత్రయ భారతంపట్ల అత్యంతానురక్తిగల పుత్తా పుల్లారెడ్డిగారికి ఉద్యోగ విరమణానంతరం భారతం నిత్యపారాయణ గ్రంథంగా పరిణమించడం అతని సంస్కారానికి సంకేతం.

ఇదివరకే మహాభారతమందలి ఏర్చికూర్చిన **'మహాభారతం - విదురుడు; మహాభారతం - మున్నూరు సూక్తులు'** అనే గ్రంథాలను ప్రచురించి పాఠకుల మన్ననలనందుకొన్నారు.

మహాభారతంలో ప్రధానంగా ఆరణ్యపర్వం కథల అక్షయపాత్ర. అందలి కథలన్నీ ధర్మాచరణ ప్రేరకాలు.

ప్రముఖ తత్త్వవేత్త డా. సర్వేపల్లి రాధాకృష్ణ పండితుల వాక్యం మననీయం. మన మనసులు సచ్చింతనా పూరితాలు కావాలి.

"Mental slums are more dangerous to mankind than material slums.

మానవజాతి మస్తిష్కంలోని మురికిగుంటలు, భౌతికమైన మురికి గుంటలకంటే ప్రమాదకరమైనవి అన్నారు సర్వేపల్లివారు.

శిబిచక్రవర్తి త్యాగశీలం, అష్టావక్రుని పాండితీ గరిమ, ద్రౌపది అచంచల భక్తి, దుర్యోధనాదుల అసూయాగ్రస్త మనస్తత్వం మొదలైన ఆణిముత్యాలవంటి కథలను నన్నయ ఎర్రనలను పూర్తిగా అనుసరిస్తూ చిత్రించినారు.

ప్రతి కథ చివర కథలోని నీతిని, అంతస్సారాన్ని చిన్న వాక్యాలలో పొదిగినారు.

కవిత్రయ మహాభారత సముద్రమును మథించి, అమృత ఫలాలను పాఠకులకు అందించిన తీరు అభినందనీయం.

పుల్లారెడ్డిగారు మహాభారత నామావళి నిర్మాణాన్ని చేపట్టడం ముదావహం.

వాగ్దేవి వారికి సర్వశుభములను ప్రసాదింప వేడుకోలు.

శుభం భూయాత్.

కడప.
22.12.08.

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

# కథా భారతం - అరణ్య పర్వం
## (ఆంధ్రమహాభారతానుసరణం)

### ముందుమాట

ఈ అనుసరణ గ్రంథము వెలుగు చూడడం వెనుకగల గాథను పాఠకులందరూ తెలుసుకోవడం అవసరమనే ఉద్దేశ్యంతో ఈ కొద్ది మాటలను ముందుమాటగా మీ ముందుంచుతున్నాను.

నేను తెలుగుభాషను సాంప్రదాయకంగా అభ్యసించిన వాడనుకాను. సాధారణంగా "ప్రీయూనివర్సిటీ కోర్సు" వరకు తెలుగును ఒక పాఠ్యాంశంగా చదువుకొనడంవరకే నా సాంప్రదాయక తెలుగు అభ్యాసము. ఆ తరువాత ఇంజనీరింగు చదివి, ఆ ఉద్యోగంలో నిమగ్నుడనై యుండినందున ఇంజనీరుగా 1999లో పదవీ విరమణ చేసేంతవరకు తెలుగునందు విశేషంగా కృషి చేయలేకపోయినాను. కానీ నిరంతరం ఎంతోకొంత కృషిని కొనసాగించడం వల్లనూ, పదవీ విరమణ తరువాత ఇంకాకొంత అదనంగా కృషి చేసినందుననూ, నాకు తెలుగు భాషపైన కొంతవరకైనా అధికారము ఏర్పడింది.

నా బాల్యము నుండియే నాకు 'కవిత్రయము వారి శ్రీ మదాంధ్రమహాభారతమ'ంటే అమితమైన ప్రేమ ఉండేది. ఆ ఎనలేని ప్రేమకు కారకుడు నిత్యం మహాభారతాన్ని పారాయణంలాగా చదువుతూ ఉండిన మా తండ్రి శ్రీమాన్ పుత్తావెంకటసుబ్బయ్య గారే. ప్రతి పదానికి అర్థంకూడ వివరంగా చెప్పుతూ ఉండేవారాయన. ఆయనతో చిరకాలము కలసిఉండే అదృష్టము నాకు లేకుండా నా చిన్నతనంలోనే, అనగా నా పదునారవఏటనే, ఆయన అల్పాయుష్కులుగా (45వ ఏట) పరమపదించినాడు. అయినా ఆ కొద్దికాలపు అనుబంధంలోని ప్రేరణచేతనే నేను తెలుగు భాషపై, ముఖ్యంగా శ్రీమదాంధ్ర మహాభారతంపై ప్రేమను పెంచుకొన్నాను. కానీ ఇంతకాలము కలిసిఉండి కూడా నా సంతానానికి కానీ, వారి సంతానాలకు కానీ, నేను ఈ విషయంలో ఎలాంటి ప్రేరణనూ కలిగించలేక పోయినాను. అది నా దురదృష్టమేమో? ఇది శాఖా చంక్రమణం. సరే. దాన్ని వదలివేద్దాం.

బాల్యం నుండి నేటిదాకా యాభైసంవత్సరాలుగా పూర్తిసమయం వెచ్చించలేకపోయినా, ఉన్నకాలంలోనే శ్రీమదాంధ్ర మహాభారతాన్ని ఆమూలాగ్రము చదువుతూనేఉండినాను. చదివిందే చదివినాను. ఎన్నిసార్లు చదివినానో లెక్కలేదు. పదవీవిరమణతరువాత ఇంకాఇంకా చదివినాను. చదివినకొద్దీ అందులో నా పరిజ్ఞానం పెరుగుతూనే వచ్చింది. నేటి కొక 'స్థాయిని అందుకొన్నాన'ని భావిస్తున్నాను. కానీ తెలుసుకోవలసింది ఇంకా ఎంతో ఎంతో ఉందనేవిషయం నాకు నిస్సంశయంగా తెలుసు.

అందుచేత పద్యకావ్యాన్ని చదివి అర్థం చేసుకోలేని వారి కొరకున్నూ, సాధారణ పాఠకులలో పఠనాసక్తిని పెంచడం కొరకున్నూ, మహాభారతాన్ని కథల రూపంలో అందిస్తే 'బాగుంటుందేమోన'నిపించింది. ఆ ఆలోచనయే ఈ గ్రంథము వ్రాయడానికి మూలమైంది.

కథలకు కాణాచి అయిన అరణ్యపర్వాన్ని మొదటగా ఎన్నుకొన్నాను. అరణ్యపర్వాన్ని ప్రాథమికంగా యాభై కథలుగా విభజించినాను. వాటి నన్నింటినీ నా శక్తి మేరకు కూర్చినాను. అరణ్య పర్వములోని ప్రధానకథా, ఉపకథలూ అన్నీ ఈ యాభై కథలతో పూర్తి అవుతాయి. ఏవో కొన్ని తీర్థాలు, వాటిసేవవల్ల కలిగే పుణ్యాలు,

ఇంకా అట్లాంటి కొన్ని నీరస విషయాలున్నూ, కథలుగా మలవడానికి పనికి రానివిన్నీ, ఇట్లాంటి ఏవో కొన్నింటిని మాత్రమే వదలి వేసినాను. అందుచేత ఈ యాభై కథలను వరుసగా చదివితే, నన్నయ, ఎఱ్ఱనల ఆరణ్యపర్వాన్ని పూర్తిగా చదివినట్లే అవుతుంది. ఆ అనుభూతికూడా కలుగుతుంది. కాదంటే ఏ కథకాకథ చదువుకోవడానికికూడా ఎలాంటిఇబ్బందీఉండదు.

పద్యాలలోని భావాలను యథాతథంగా సరళవచనంలో వ్రాసినందున సాధారణ పాఠకులు కూడ నన్నయ, ఎఱ్ఱనల కవిహృదయాలను, వారి కవిత్వాలలోని ఉపమానాల సొంపును, కొంత వరకైనా అందుకో గలుగుతారు. అయినా చెరకును తానుస్వయంగా నమలితింటే కలిగేఅనుభూతి, గానుగలో తీసిన చెరకురసం త్రాగడంలో ఉంటుందా? ఈ కథలను చదివితే, ఇవే ఇంత బాగున్నాయే ఇంక మూలగ్రంథము 'ఎంతబాగుంటుందో?' అనే భావం పాఠకులలో 'కలగాల'న్నదే నా ఆశయం. సాధారణ పాఠకులలో అట్లాంటి భావనతో నూటికొకరో వేయింటికొకరో మూలగ్రంథాన్ని చదివినా నా ఈ కృషి ధన్యమైనట్లే.

మూల గ్రంథంలోని కొన్ని ఎన్నిక చేసిన పద్యాలను ఆయాకథలవద్ద పొందుపరచినాను. 'కథలు చదివిన తరువాత పాఠకులు ఆ పద్యాలను చదివితే, అవి సులభంగా బోధపడతాయి. అట్లా చదివినవారు ఆ పద్యాలశైలికి అందానికి ఆకర్షితులవుతారు. అప్పుడు ఆ పద్యాలపైనా ఆ పద్య కావ్యాల పైనా వారికి అభిలాష పెరుగుతుంది', అనే భావంతోనే అట్లా ఆయాకథలకు సంబంధించిన మంచి మంచి పద్యాలను ఏరి పొందుపరచినాను. అభిలాష పెరిగితే మూలగ్రంథం చదివే అవకాశాలు పెరుగుతాయి కదా? అదేకదా నా ఆశా, ఆశయమూ కూడ?

**క. "ఆరంభ రహితు పొందునె యారయ సంపదలు, హీనుడయ్యును పురుషుం**
**దారంభ శీలుడై, యకృతారంభుల నోర్చు నెంత యధికులనైనన్. - సభాపర్వం 1-123**

అన్న భారత సూక్తిని దృష్టిలో ఉంచుకొని, నేనీ కార్యాన్ని ఆరంభించినాను. అంతే కానీ నేనేదో గొప్ప 'రచయితన'నే భావంతో మాత్రం కాదు.

ఇంక చివరిగా చెప్పదలచుకొన్న దేమంటే మూలగ్రంథమైన శ్రీమదాంధ్ర మహాభారతంలోని అరణ్యపర్వంలో నన్నయ భట్టారకులు మొదటి 45 శాతంభాగాన్ని రచించగా, ఎఱ్ఱాప్రగడగారు మిగిలిన చివరి 55 శాతంభాగాన్ని పూర్తిచేసివారు.

నేను నన్నయగారి భాగంనుండి 26 కథలనూ, ఎఱ్ఱనగారి భాగంనుండి 24 కథలనూ ఎన్నుకొన్నాను. స్థూలదృష్టికి కథలసంఖ్యలో నన్నయగారి భాగంలోనివే ఎక్కువగా ఉన్నట్లు అనిపించినా, కథల నిడువులనుబట్టి చూస్తే నన్నయగారి భాగంలోని కథలు 40 శాతం కాగా, ఎఱ్ఱనగారి భాగం లోనివి 60 శాతంవరకు ఉన్నాయి.

ఈ సందర్భంలో ఇంకొక విషయాన్ని కూడా పాఠకుల దృష్టికి తేవడం 'మంచిద'నుకొంటున్నాను. ఈ గ్రంథము నా ప్రథమ ప్రయత్నము. పిమ్మట 'మహాభారతం - విదురుడు', 'మహాభారతం-మున్నూరు సూక్తులు' అనే గ్రంథాలను వ్రాయడం, ప్రచురించడం, ఆవిష్కరించడం కూడా జరిగిపోయింది.

ఈ గ్రంథ ప్రచురణకు ఇతోధిక ఆర్థిక సహకారాన్నందించిన తిరుమల - తిరుపతి దేవస్థానం వారికి నా కృతజ్ఞతలు.

ఈ గ్రంథాన్ని సమీక్షించి అభినందన పత్రాన్ని అందించిన బ్రహ్మశ్రీ డా॥ జానమద్ది హనుమచ్ఛాస్త్రి గారు నా ఈ ప్రథమ ప్రయత్నాన్ని వెనుదట్టి ప్రోత్సహించినారు. అందుకు నేను వారికి సదా కృతజ్ఞుడను.

ఈ గ్రంథాన్ని ఆమూలాగ్రం పరిశీలించి అక్షరదోషాలన్నింటినీ సవరణకు వీలుగా చూపించి, ఇంకా ఈ గ్రంథాన్ని సుసంపన్నం చేయగలిగిన ఎన్నో సూచనలనందించి, నన్ను ప్రోత్సహించి, నాకు 'సౌజన్యసంభావనము' కావించిన విశ్రాంత తెలుగు ఆచార్యులు బ్రహ్మశ్రీ డా॥ శలాక రఘునాథశర్మ గారికి నా నమోవాకపూర్వక కృతజ్ఞతలను ఇందుమూలంగా సమర్పిస్తున్నాను.

చివరగా ఈ పుస్తకం పాఠకుల కందించడానికి ముందు కార్యక్రమాలైన టైపింగు మొదలైన విషయాలన్నింటిలోనూ అయాచితంగానే తమ సహకారాలను అందించిన చిరంజీవులు పి. ప్రతాపరెడ్డికీ, కొండా చెన్నకృష్ణారెడ్డికీ, నా కృతజ్ఞతాపూర్వక ఆశీస్సులు.

పూజ్యులు నన్నయ ఎఱ్ఱనల పద్యాల భావాలనే పూర్తిగా అనుసరిస్తూ ఈ కథలను వ్రాసినాను. అందుచేత ఇది వారి పద్యాలకు వచన సరళానుసరణ మాత్రమే. దీన్ని వ్రాయడంలో సరళ గ్రాంథికాన్నీ శిష్ట వ్యావహారికాన్నీ కూడ ఉపయోగించినాను. వ్యావహారికంలో రాయలసీమ మాండలికాన్నికూడా అక్కడక్కడా ఉపయోగించినాను. ఈ నాప్రయత్నం కొంత వరకైనా సఫలీకృతమైనట్లే భావిస్తున్నాను. అయినా తుదినిర్ణయం పాఠకులదే కదా?

ఇట్లు
బుధ జన విధేయుడు

**పుత్తా పుల్లారెడ్డి**

# విషయ సూచిక

| వ.సం. | విషయం | పుట సంఖ్య |
|---|---|---|

## నన్నయ భట్టారకుల భాగం

# 1. అక్షయపాత్ర.

**(అరణ్యపర్వం 1-5 నుండి 44 వరకు.)**

**(అనుద్యూతంలో ఓడి పాండవులు అడవులకు పోయేటప్పుడు జరిగిన కథ.)**

ధర్మరాజు శకునితో అనుద్యూతంలో ఓడినాడు. అనుద్యూతంలోని పందెం ప్రకారం పాండవులు పంద్రెండేడ్లు అరణ్యవాసమూ, ఒక ఏడు అజ్ఞాతవాసమూ చేయవలె. అందుకొరకై వారు అరణ్యానికి బయలుదేరినారు. అప్పుడు పౌరులందరూ వారిని వెంబడించినారు. "కర్ణుడూ, జయద్రథుడూ, శకునీ తనకాప్తులై ఉండగా లోభియైన దుర్యోధనుడు రాజ్యమేలుతూఉంటే, అతడి రాజ్యపాలనలో మేమెట్లా ఉండగలం? ఈ భూమిమీద ఇంక ధర్మమెక్కడుంది? ప్రజల నెవరు రక్షిస్తారు? పరమ ధార్మికులైన పాండవులు పోయే చోటుకే మనమందరము పోదాము." అనుకున్నారా పౌరులు. అట్లాఅనుకొని పాండవులను వెంబడించిన పౌరులు, "పాపభీతి కలిగిన వీరులారా! మమ్ము విడచిపోవడం మీకు న్యాయమా? మాకు మీరు కాక వేరే దిక్కేమిటి? దుర్జన సహవాసంవల్ల, మంచివారికి కూడా 'పాపం వస్తుందన'డంలో సందేహముందా? నువ్వులూ, నీళ్లూ, బట్టలూ, పువ్వులతో కలిసి ఉండడంవల్ల, అవి ఆ పూల పరిమళాన్ని పొందడం తెలిసిన విషయమే కదా? అట్లాగే సజ్జనుల సహవాసంచేత శ్రమ లేకుండానే ఎవరికైనా సద్గుణాలు అబ్బుతాయి కదా? మీరు సాధువులు మెచ్చుకొనే సద్గుణాలతో ఒప్పినవారు. జన్మచేతనూ, విద్యచేతనూ, చేసే పనులచేతనూ, మీరు పేరెన్నిక కన్నవారు. మీ సాహచర్యంవల్ల మేముకూడ ధర్మాత్ములమై ధన్యులం కాగలము. చెడ్డపనులు చేయనివారుకూడా, చెడ్డవారిని చూడడంవల్లా, వారితో కలిసి తిరగడంవల్లా, వారితో మాట్లాడడంవల్లా, వారితో సహవాసం చేయడంవల్లా, చెడిపోతారు. కాబట్టి దుర్యోధనుని రాజ్యంలో ఉండడం మా కిష్టంలేదు. అందువల్ల మేము మీతో రావడానికి అనుమతి నివ్వాలి." అని నమస్కరించి అడిగినారు. వారికి ధర్మరాజు ఇట్లా సమాధానము చెప్పినాడు.

"మాలో లేని సద్గుణాలుకూడా, మా మీద మీకున్న ప్రేమవల్ల మీకు ఎక్కువగా కనిపిస్తున్నాయి. మీరు మా వెంటరావడం మా కిష్టంలేదు. మీరు భయంకరమైన అడవుల్లో నివసించడంవల్ల కలిగే దుఃఖ భారాన్ని మోయగలరా? వద్దు. మీరు మానుకోండి." ఇట్లాచెప్పి ధర్మరాజు పౌరులను ఒప్పించి వెనుకకు మరలించినాడు. పౌరులా విధంగా వెనుకకు మరలి ఎడతెగని ఏడుపులతో హస్తినాపురానికి తిరిగి పోయినారు.

తిరిగి ప్రయాణం సాగించి, పాండవులు గంగాతీరంలో 'ప్రమాణం' అనే పేరుగల మర్రిచెట్టు క్రింద విడిదిచేసినారు. గంగలో స్నానాలుచేసి, ఆ నాటి మిగిలినపగలూ, రాత్రీ అక్కడే గడపినారు. తెల్లవారే సమయానికి హస్తినాపురంనుండి, పాండవులవద్దకు కొందరు బ్రాహ్మణులు వచ్చిచేరినారు. వచ్చినవారు నిరంతరం వేదమంత్రాలు చదివి, పాపాలు పోగొట్టుకొని పుణ్యాత్ములైనవారు. లోకమంతటికీ పూజనీయులు. బ్రహ్మదేవునితో సమానమైనవారు. వారందరూ అగ్నిహోత్రాలతో వచ్చినారు. వారి వెంట వారివారిబంధువులూ

శిష్యులూకూడాఉన్నారు. వారంతా పాండవులపై మిక్కిలిఅనురాగం కలిగినవారు. ఈ విధంగా తమతోపాటుగా ఆరణ్యవాసం చేయడానికి నిర్ణయించుకొని వచ్చిన బ్రాహ్మణులను మిక్కిలి అనురాగంతో, గౌరవంతో, ధర్మరాజు పూజించినాడు. వారిచేత ఆశీర్వాదాలు పొందినాడు. ఆ తరువాత ధర్మరాజు వారితో ఇట్లాఅన్నాడు.

"శత్రువుల వంచనతో అంతా పోగొట్టుకొని ఘోరమైన అడవిలో అక్కడ దొరకే పండ్లూ, కూరగాయలు, వేళ్లూ, తింటూ నిష్ఠతో బ్రతకవలసిన మాతో మీరెందుకు రావడం? వచ్చి ఎందుకు కష్టపడతారు? మీ మీ ఇండ్లకు తిరిగిపొండి. భయంకరమైన ఏనుగులతో, పులులతో, కూడిన భయంకరమైన ఆరణ్యవాసం మీకు తగునా?".

ధర్మరాజిట్లా అనగా బ్రాహ్మణులు మిక్కిలి దుఃఖించినారు. 'రాజా! మాకు మీరుతప్ప వేరేగతి లేదు. కాబట్టి మీరు మమ్మల్ని వదలడం ధర్మంకాదు. ఆశ్రయించిన వారినీ, తమపై భక్తి కలిగిన వారినీ, ఎవరూ ఎప్పుడూ విడువరు. అటువంటప్పుడు మమ్ములను, బ్రాహ్మణోత్తములను, మీ పైన భక్తి కలిగినవారిని, మీ బోటి ధార్మికులు విడిచి పెట్టడం భావ్యమా? చెప్పు. 'మమ్మల్ని ఎలా పోషించాలి?' అనే విషయం నీ వేమీ ఆలోచించ వద్దు. అడవి నుండి వేళ్లూ, పండ్లూ, మేమే తెచ్చుకొని తింటాము. జపాలు హోమాలు చేస్తూ మీకు సంతోషం కలిగిస్తూ ఉంటాము. అధర్మ మార్గంలో నడచి మీకు కీడుచేసిన ధృతరాష్ట్రుని కుమారుల రాజ్యంలో మేము ఉండలేము" అన్నారు.

ధర్మరాజు తప్పనిసరియై, వారు తమవెంట రావడానికి అనుమతించినాడు. ఆ తరువాత ధర్మరాజు ఇట్లా ఆలోచించినాడు" ఇంతకు మునుపు ఈ బ్రాహ్మణులు ఇష్టమైన శుచియైన అన్నాలను తృప్తిగా తినేవారు. వీరు ఇక్కడ ఈ అడవులలో కూరగాయలు తింటూ ఉండడం నేను ఎట్లాచూడగలను? ఇట్లా ఆలోచిస్తూ ధర్మరాజు దుఃఖంతో మూర్ఛపోయి నేలకొరగినాడు.

'శౌనకుడ'నే బ్రహ్మర్షి అప్పుడా ధర్మరాజును సేదతీర్చినాడు. ఆ తరువాత ఆయనకు దుఃఖం పోయేట్లుగా వేదాంత విషయాలు ఎన్నో చెప్పినాడు. 'బంధు మిత్రులపైన ప్రేమను, ధనంమీది ఆశను వదలితే దుః ఖాలన్నీ పోతాయ'నీ బోధించినాడు.

ఈ బోధనంతా విన్న ధర్మరాజు, "నే నెప్పుడూ నా భోగాలకై ధనాన్ని కోరలేదు. 'బ్రాహ్మణోత్తములను ఈ భయంకరమైన అడవిలో ఎట్లా పోషించకలన'ని మాత్రమే దిగులు పడుతున్నాను. నా బోటి గృహస్థు అతిథి సత్కారాలు చేయవలసిఉందికదా? అందుకు మాత్రమే ధనం కావాలనుకుంటున్నాను" అన్నాడు.

అప్పుడు శౌనకుడు ధర్మరాజుతో, "వసువులు, రుద్రులు, ఆదిత్యులు మొదలైనవారు తపస్సు చేసి ఐశ్వర్యాలను పొందినారు. ఇట్లాగే నీవు కూడా తపస్సు చేసి నీ కోరిక తీర్చుకో." అన్నాడు.

"సరే" నని శౌనకునకు చెప్పిన ధర్మరాజు ధౌమ్యునితో, "అడవులకు వచ్చి దుఃఖాలు 'పడవద్దు' అంటే వినకుండా 'మీ తోనే వస్తాము' అన్నారు ఈ బ్రాహ్మణులు. ఈ భయంకరమైన అడవిలో వీరికి ఆహారం ఎట్లా సమకూర్చగలను? అట్లని వీరిని విడిచి పెట్టనూలేను. ఏమి చేయమంటావు?" అన్నాడు.

ధౌమ్యుడు చాలసేపు ఆలోచించినాడు. ఆ తరువాత ధర్మరాజుతో ఇట్లాఅన్నాడు. "పూర్వం జీవకోటి అంతా పుట్టింది. కానీ వాటికి ఆహార మేదీలేదు. అందుచేత జీవకోటిఅంతా ఆకలితో మలమల మాడిపోతూ ఉండింది. ఇదంతా సూర్యుడు చూచినాడు. దయతో జీవకోటికి 'ఈ బాధను తొలగించాల'నుకున్నాడు. వెంటనే ఆయన ఉత్తరదిశగా ప్రయాణంచేసి భూసారాన్ని స్వీకరించినాడు. దక్షిణదిక్కుగా ప్రయాణంచేసి మేఘరూపం ధరించినాడు. రకరకాల ధాన్యపు గింజలను సేకరించినాడు. రాత్రులలో చంద్ర కిరణాలతో ఆ ధాన్యాల పైరులను పెంచినాడు. ఆ ధాన్యాలనుండి అన్నాన్ని పుట్టించినాడు. అట్లా ఆ సూర్యుడు ప్రజలను రక్షించినాడు. అందుకే 'అన్నం ఆదిత్యమయం' అంటారు. అంటే అన్నం తయారు కావడానికి సూర్యుడే ముఖ్యుడు. ఈ విషయాన్ని పూర్వం భీముడు, ఈ భీముడు ధర్మరాజు తమ్ముడు కాదు. ఒకానొక పూర్వకాలపు రాజు. వైన్యుడు, కార్తవీర్యుడు, నహుషుడు, మొదలైన వాళ్ళు తెలుసుకొన్నారు. వారంతా యోగసమాధిలోఉండి సూర్యుణ్ణి ఆరాధించి, ఆహారాన్ని సంపాదించి, ప్రజలను ఆపదల నుండి కాపాడినారు. ఓ ధర్మరాజా! నీవు కూడా, సూర్యుణ్ణి కోరిపూజించు. నీ కోరికలు తీరుతాయి. ఆ సూర్యుణ్ణి దేవతలు, పాములు, మునులు, చారణులు, ఎప్పుడూ నమస్కరించి పూజిస్తూనే ఉంటారు. అతడు సమస్తవేదస్వరూపుడు. త్రిమూర్తులతో సమానమైనవాడు. తన వెలుగులతో చీకట్లను పోగొట్టి దిక్కులన్నింటినీ ప్రకాశింపచేసేవాడు. గొప్ప దయకలవాడు. విజ్ఞానవంతుడు. మూడు లోకాలను రక్షించ దలచుకొన్నవాడు.

ఈ విధంగా చెప్పి పవిత్రమైన మనస్సుకల ధర్మరాజుకు ధౌమ్యుడు 'సూర్యుడు, అర్యముడు, భగుడు,' అనే పేర్లు మొదట్లో ఉండే సూర్యుడి నూటఎనిమిదిపేర్ల మంత్రాన్ని ఉపదేశించినాడు. ఆ మంత్రము కోరిన కోరికలను తీర్చకలగినది. ఆయన ఆ నూట ఎనిమిది పేర్లకు కల స్పష్టమైన అర్థాలను కూడా ధర్మరాజుకు వివరించినాడు. ఉచ్చరించవలసిన పద్ధతిని సహితం నేర్పినాడు. శాస్త్రాలలో చెప్పినట్లుగా ఆ మంత్రాన్ని ఉపదేశించినాడు. ఆ తరువాత ధౌమ్యుడు, "ఈ మంత్రాన్ని పూర్వం ఇంద్రుని వద్దనుండి నారదుడు పొందినాడు. నారదుని వద్దనుండి వసురాజు గ్రహించినాడు. ఆ వసురాజు వద్దనుండి నేను స్వీకరించినాను. ఇప్పుడు నేను నీకిచ్చినాను. ఇది దేవతలచేత కూర్చబడింది. దీనితో సూర్యుణ్ణి మిక్కిలి భక్తితో ఆరాధించు" అనిచెప్పినాడు.

తనకు హితుడూ పురోహితుడూ అయిన ధౌమ్యుడు చేసిన ఉపదేశాన్ని ధర్మరాజు గౌరవంగా స్వీకరించినాడు. ఇష్టంగా పూలకానుకలతో సూర్యుణ్ణి పూజించినాడు. గంగాజలంలో నిలబడినాడు. ఇంద్రియాలను మరల్చినాడు. స్వచ్ఛమైన వ్రతదీక్ష పూనినాడు. ఉపవాస ముండినాడు. ప్రాణాయామం చేసినాడు. సూర్యుని నూటఎనిమిదిపేర్లూ జపంచేసినాడు. అప్పుడు సూర్యుడు ప్రత్యక్షమైనాడు. ఆ సూర్యుడు వేదస్వరూపుడు. పాపాలను హరించేవాడు. పద్మాలకు ప్రియమైనవాడు. మూడు లోకాలకు కన్నుల వంటివాడు. అట్టి సూర్యుడు ధర్మరాజుకు ప్రత్యక్షమై ఇట్లా అన్నాడు.

"నీ తపస్సుకు మెచ్చుకొన్నాను. నీవు అరణ్యాలలోఉండే ఈ పండ్రెండేండ్లుకూడ అడవిలోని పండ్లూ, వేళ్లూ, కూరగాయలూ, నీ వంటఇంట్లో ద్రౌపది ఈ పాత్రలో వండితే, తరగని నాలుగు విధాలయిన ఆహారాలవుతాయి" అని చెప్పి సూర్యుడు ధర్మరాజు కొక రాగి పాత్ర నిచ్చి మాయమైనాడు. ఆ రాగి పాత్రనే 'అక్షయ పాత్ర' అంటారు.

ధర్మరాజీవిధంగా సూర్యుని చేత గొప్పవరాన్ని పొంది, ఎందరో బ్రాహ్మణోత్తములను చక్కగా పోషించ గలిగినాడు. ఆ ద్రౌపది అక్షయపాత్రలో వండిన కూరగాయలూ, వ్రేళ్లూ మిక్కిలి రుచిగాఉండి ఇష్ట భోజనం చేసినట్లుగా వారిని తృప్తిపరుస్తూ ఉండినాయి.

**నీతి :** ధర్మమార్గము తప్పరాదు.

**చ.** **అదరఁగ ధర్మనందనుఁ డహర్పతిచేత వరంబు పేర్మితోఁ**
**బడసి, మహీసురోత్తముల భవ్యులఁ బల్వుర నిర్వహించె; న**
**ప్పుడు ద్రుపదాధిరాజసుత పొల్పుగ వండిన శాకమూలముల్**
**గదురుచి నిష్టభోజనసుఖంబులఁ దృప్తులఁజేయుచుండఁగన్.** **అరణ్య 1-44**

## 2. విదురుని వియోగము - పునరాగమనము.

**(అరణ్య 1-45 నుండి 71 వరకు.)**
**(పాండవులు అడవులకు పోయిన కొద్ది కాలానికే జరిగిన కథ.)**

పాండవులు అరణ్యవాసానికి బయలుదేరిపోయి కామ్యకవనం చేరినారు. అప్పు డిక్కడ హస్తినాపురంలో ఒకనాడు ధృతరాష్ట్రుడు విదురుణ్ణి తనవద్దకు పిలిపించుకొన్నాడు. "నీవు శుక్రుడి కంటె తెలివైనవాడవు. పాండవులకు కౌరవులకు సముడవు. సమ్మతుడవు. ఇంక పాండవులు ఏం చేయగలరో చెప్పు?" అన్నాడు.

అందుకు విదురుడిట్లా సమాధానం చెప్పినాడు. "మహారాజా! పాండవులు దేవతాంశలతో పుట్టినవారు. వారంతా ధైర్యంతో కూడిన మనస్సులుకలవారు. నీవు కూడా వారి గొప్పతనం తెలియని వాడవుకావు. భీముడు అర్జునుడు ప్రసిద్ధమైన పరాక్రమం కలిగినవారు. వివిధ దివ్యాస్త్ర జ్ఞానంలో ప్రసిద్ధులు. యుద్ధాలలో శత్రువులను బ్రతుకనిస్తారా? మునుపు నేను పూనుకొని, 'కపట జూదం వల్ల పాండవులకూ, నీ కొడుకులకూ మధ్య విభేదం పుడుతుంది' అని చెప్పినాను. కానీ నీవు నా మాట వినకుండా పూనికతో నీ కొడుకు మాటలే విన్నావు" అని చెప్పి ఇంకా ఇట్లా అన్నాడు.

"అయిందేదో అయింది. ఇంకనైనా వారిని తిరిగి రప్పించి, పూర్వం నీవే ఇచ్చిన రాజ్యంలో వారిని నిలుపు. అట్లైతే కీర్తీ ధర్మమూ నిలుస్తాయి. రాజ్యానికీ అర్థకామమోక్షాలకూ ధర్మమే ఆధారము. అవన్నీ ధర్మం కలిగినచోటునే ఉంటాయి. ధర్మాన్ని వదలి, అధర్మ మార్గంలో వర్తించేవాడవై, కర్ణ శకుని దుశ్శాసనులు చెప్పేమాటలువిని, దుర్యోధనుడు చేసే చెడుపనులకు సమ్మతించవద్దు." ఇట్లా చెప్పి విదురుడు ఆ తరువాత ఇంకా ఇట్లాచెప్పినాడు.

"ఈ దుర్యోధనుడు పుట్టిన పాపసమయంలో, ఎన్నో చెడుశకునాలు కనిపించినాయి. ఆ నాడే నేను నిర్ణయించి, 'వీనివల్ల కౌరవులకు కీడుకలుగుతుంద'ని చెప్పినాను. ఈ కులమంతా చెరచే దుర్యోధనుణ్ణి వదలిపెట్టి, కులాన్ని రక్షించడం ధర్మం. ధర్మరాజును సమస్త రాజ్యానికి అధిపతినిచేసి పుత్రులను, పౌత్రులను, మిత్రులను, మంత్రులను, బంధువర్గాన్ని అంతటినీ రక్షించు. సభామధ్యంలో ద్రౌపదీ భీమసేనులను ప్రార్థించడానికి దుశ్శాసనుణ్ణి పంపించు. ఇంద్రుణ్ణి మించినవాడూ, సూర్యునివంటి తేజస్సుకలవాడూ, అజాతశత్రుడూ, గొప్పవాడూ, జయింపరానివాడూ, అయిన ధర్మరాజు, నీ కొడుకులుచేసిన కీడును మనసులో పెట్టుకోడు. ప్రతీపుని కులాన్ని ఉద్ధరించగలిగిన ధృతరాష్ట్ర మహారాజా! ధర్మరాజును స్థిరమైన బుద్ధితో పట్టాభిషక్తుణ్ణి చేయి. అట్లా నీవు చేసే పనివల్ల, నీవు పాపంలేని కీర్తితో ప్రకాశిస్తావు".

ఇట్లా మాట్లాడిన విదురుని మాటలు విని, ధృతరాష్ట్రుడు మిక్కిలి కోపగించుకొని, ఇట్లా అన్నాడు. "నా శరీరంనుండి పుట్టిన మొదటికుమారుణ్ణి విడువడానికి ఎట్లా వీలవుతుంది? కుమారుణ్ణి దయ లేకుండా దెబ్బ తీసేవారుంటారా? నీవు ఇట్లా మాట్లాడవచ్చునా? నీవు నా కొడుకులు పైకిరావడాన్ని ఎప్పుడూ సహించవు. నీ సహాయం నా కొద్దు. పాండవుల వద్దకుగానీ, ఇంకెక్కడి కైనాకానీ, నీ ఇష్టమయిన చోటుకు పో".

ఆ మాటలు విన్న వెంటనే విదురుడు మనోవేగంతోపోయే రథమెక్కి పాండవులున్న కామ్యకవనానికి పోయినాడు. అప్పుడు ఆ విదురుడు రావడం దూరంనుండే చూచినధర్మరాజు భీమునితో ఇట్లా అన్నాడు. "గాండీవమూ మున్నగు ఆయుధాలను మోసంతో అప్పుడు గెలుచుకోవడం మరచిపోయిన మందబుద్ధి దుర్యోధనుడు ఇప్పుడు జూదంనెపంతో వాటినికూడ కైవసం చేసుకోవడానికి మనలను తిరిగి జూదానికి రప్పించడానికి విదురుణ్ణి పంపిఉండవచ్చు. కాకుంటే విదురు డిప్పుడిక్కడకు రాడు. నేను ఇంకొకసారి జూదమాడదలచుకోలేదు. ఇదే పనిగా విదురుడు పూనుకొని వస్తున్నాడేమో? ఏమి చేద్దాం? అతడు చెప్పినట్లు చేయకుండా ఉండడం మనకు మానుషధర్మమా?" అంటూ ఊగిసలాడుతూ మాట్లాడుతూ ఉండినాడు.

అట్లా ధర్మరాజు భీమసేనుడూ తమలో తాము మాట్లాడుకుంటూ ఉండగా, విదురుడు అక్కడకు చేరినాడు. పాండవులు లేచి ఆయనకు ఎదురుగా పోయి వినయంగా ప్రేమగా సత్కారాలు చేసి సంతృప్తి పరచినారు. తరువాత ఆయన వచ్చిన కారణమడుగగా వారికి విదురుడు ఇట్లా చెప్పినాడు.

"ఈనాడు ధృతరాష్ట్రుడు నన్ను పిలిచి, ఒంటరిగా నాతో, 'మనసులో వారికీ మాకూ కూడ నీవు బాగా మేలుకోరేవాడవు. నే నిప్పుడేమి చేయవలెనో చెప్పవయ్యా?' అని అడిగినాడు, నేను అప్పుడు రెండుపక్షాల వారికీ, లోకాలకూకూడ మేలుకలిగించే మేలైనమార్గాన్ని చెప్పినాను. అందరికీ రుచిగా ఉండే ఆహారం, రోగంతో బాధపడేవాడికి అరుచిగా ఉండేవిధంగా, ఆ నా మాటలు ఆ ధృతరాష్ట్రునికి రుచించలేదు. చేయవలసిన పనులను ఉన్నవున్నట్లు చెప్పితే గొప్పబుద్ధిమంతులు ఆదరిస్తారు. కానీ నీచకృత్యాలతోకూడిన బుద్ధికలవారికి, అవేమాటలు విషంలాగా విరసంగా ఉంటాయి. అందువల్లనే ధృతరాష్ట్రుడు నన్నంగీకరించకుండా, నిందించి, 'నీవు మాపైన వ్యతిరేకమైన మనసుకలవాడవు, ఇక్కడ ఉండవద్దు. పాండవుల వద్దకు పో,' అన్నాడు. నేనిక్కడకు వచ్చినాను. ముసలి శ్రోత్రియుణ్ణి పెండ్లాడిన రూపలావణ్యాలు కలిగిన యువతిలాగా, రాజ్యలక్ష్మి ఆ దుర్యోధనుని యందు ప్రేమలేక విరక్తిపొంది ఉంది. ధర్మాన్ని వదలిన ధృతరాష్ట్రుని కొడుకుసంపదలు, తమంత తామే వలచి వచ్చి నిన్నుపొందుతాయి. నేను చెప్పినట్లు చేయండి." ఈ మాటలు విని ధర్మరాజు "అట్లాగే చేస్తాము." అన్నాడు. ఆ తరువాత విదురుడు పాండవులతోపాటు ఆ కామ్యకవనంలోనే ఆనందంగా కాలం గడుపుతూ ఉండినాడు.

ఇక్కడ ధృతరాష్ట్రుడు పాండవుల వద్ద 'విదురుడున్నాడ'ని విన్నాడు. ధైర్యం కోల్పోయినాడు. "ఆ విదురుడు శుక్రునంతటి నీతివిశారదుడు. అతని సహాయముంటే ధర్మరాజుకు దుర్యోధనునిపై విజయం సులభమౌతుంది." అని భావించినాడు. అంతేకాకుండా ఆ విదురుడు తనకు హృదయం లాంటీ, చూపులాంటీవాడు. అలాంటి విదురుణ్ణివదలి తానునిముషమైనా ఏ పనీచేయలేడు. అందుకని సంజయుణ్ణి పిలిపించి "ప్రేమకలవాడూ, నా మనసు తెలిసినవాడూ, ధర్మం మీద ప్రేమ కలిగినవాడూ, నా తమ్ముడూ, అయిన విదురుణ్ణి 'కామ్యకమ'నే అందమైన అడవినుండి ఇక్కడకు వేగంగా తోడుకొనిరా. పో." అని ఆజ్ఞాపించినాడు.

వెంటనే సంజయుడు మిక్కిలివేగంగా కామ్యకవనానికి పోయినాడు. అక్కడ ధర్మరాజును సందర్శించినాడు. అప్పుడా ధర్మరాజు చుట్టూ వేలకొలది బ్రాహ్మణులు ధౌమ్యుడితోపాటుగా ఉన్నారు. 'ధర్మం, క్షమ', అనే ఆభరణాలు ధరించిన నలుగురుతమ్ములూ తనను సేవిస్తూఉన్నారు. విదురుడు సంప్రీతిగా అక్కడ ఆసీనుడైఉన్నాడు. ద్రౌపది ప్రీతితో ధర్మరాజును సేవిస్తూఉంది. ఆ ధర్మరాజు సజ్జనులకు బంధువు వంటివాడు. దేదీప్యమానంగా వెలిగిపోతూ ఉన్నాడు. అట్లాంటి ధర్మరాజును చూచి, సంజయుడికి మనసులో సంతోషంకలిగింది. "అరణ్యవాసం చేస్తూకూడ మూడులోకాలూ ఏలుతున్న రీతిగా ధర్మరాజు సంతోషనిండిన మనసుతో ఉన్నాడే?" అనుకొంటూ ఆయనకు భక్తితో నమస్కరించినాడు. "ధృతరాష్ట్రుడు ఎప్పుడూ మిమ్ములనూ, ధర్మపు ఆంతర్యం తెలిసిన విదురుణ్ణీ, స్మరిస్తూ ఉంటాడు. మీ అనుమతితో, తన తమ్ముణ్ణి తనవద్దకు 'తీసికొని రమ్మ'ని నన్ను పంపినాడు." అని ధర్మరాజుకు విన్నవించినాడు.

ఆ మాటలు విని ధర్మరాజు విదురునితో, "ప్రజలందరూ ధృతరాష్ట్రుని ఆజ్ఞను పాలిస్తున్నప్పుడు మన మింకా మిక్కిలి భక్తితో ఆయన ఆజ్ఞను పాటించవలె కదా? కాబట్టి ఆలస్యం లేకుండా పో." అన్నాడు.

ధర్మరాజు ఆ విధంగా, విదురుని హస్తినాపురం పోవడానికి అనుమతించగానే, విదురుడు బయలుదేరి పోయినాడు. హస్తినాపురం చేరినాడు. అంతఃపురంలోనికి పోయి ధృతరాష్ట్రునికి తలవంచి వినయంగా నమస్కరించినాడు. ధృతరాష్ట్రుడు విదురుణ్ణి మిక్కిలిప్రేమతో కౌగిలించుకొన్నాడు. తలను వాసన చూచినాడు. "నీవు ఎల్లప్పుడూ క్షమించడమే ఇష్టంగా కలవాడవు. నాకు బుద్ధిలేకుండా పోయింది. అందుకు క్షమించు" అన్నాడు.

అందుకు విదురుడు "నీవూ, నీ కుమారుడూ న్యాయంతప్పి మాట్లాడినా నేను మాత్రం మీకు మేలు కూర్చే మాటలే మాట్లాడవలె కదా? వీరులైన పాండవులతో వైరం చేయడం నీతికాదు. నీకు శుభం కాదు." అని అంటూ ఎప్పటిలాగా ధృతరాష్ట్రునికి పనులలో సహాయం చేస్తూ హస్తినాపురంలోనే ఉండిపోయినాడు.

**నీతి :** మంత్రియైనవాడు రాజు అన్యాయంగా మాట్లాడినా తానుమాత్రం రాజుకు మేలుకలిగించే మాటయే మాట్లాడవలె.

**మత్తకోకిల**

దేవమూర్తులు పాండుపుత్రులు ధీరచిత్తులు; వారిపెం
పీ వెరుంగని వాఁడవే? ధరణీశ! వాయుసుతుండు గాం
డీవియున్ భుజవిక్రమప్రకటీకృతుల్; వివిధాస్త్రవి
ద్యావిశేషులు; వైరివీరుల c దక్కనిత్తురె పోరులన్. అరణ్య 1-46

చ. అతిశయితామరోత్తముఁడహర్పతి తేజుఁడజాత శత్రుఁడూ
ర్జితుఁడజితుండు; నీసుతులు సేసిన యెగ్గుడలంపఁ దాతనిన్
ధృతి నభిషిక్తుఁ జేయుము ప్రతీపకులోద్వహా; యిట్లయైన నీ
కృతమునఁ గౌరవాన్వయ మకిల్బిషకీర్తిఁ బ్రకాశితంబగున్. అరణ్య 1-51

క. వనవాసము సేయుచుఁ, ద్రిభువన రాజ్యము సేయునట్టి వడువున సంతో
ష నిబద్ధబుద్ధియగు యమతనూజునకు భక్తి నెఱఁగి, తానిట్లనియెన్. అరణ్య 1-66

## 3. మైత్రేయ శాపం.

**(అరణ్య 1-72 నుండి 104 వరకు.)**

**(పాండవులు అరణ్యవాసం చేస్తూఉన్న కాలంలో 'మైత్రేయుడ'నేఋషి అడవులలో పాండవులను చూచి, 'దుర్యోధనుడికి బుద్ధిచెప్పి, పాండవులకష్టాలు తీర్చాలను'కొని హస్తినాపురం వచ్చి దుర్యోధనుని నిర్లక్ష్యానికి కోపగించుకొని అతడికి శాపమిచ్చిన కథ.)**

పాండవులు అరణ్యవాసానికి పోయినారు. ఇక్కడ ధృతరాష్ట్రుడు విదురుణ్ణి పిలిపించినాడు. "నీవు శుక్రుడి కంటె బుద్ధిమంతుడవు. పాండవ కౌరవు లిద్దరికీ సమానుడవు. ఇకమీదట పాండవులేమి చేస్తారు?" అన్నాడు. అప్పుడు విదురుడు పాండవుల గొప్పతనాన్ని పొగడినాడు. "అధర్మద్యూతంవల్ల నీ కొడుకులకుపాండవులకు 'వైరం కలుగుతుంద'ని నేను నీకు ముందేచెప్పినాను. నీవు నా మాట వినకుండా నీ కొడుకు మాటనే విన్నావు. ఇంకనైనా వారిని అడవులనుండి వెనక్కి రప్పించు. ధర్మాన్ని నిలుపు." అంటూ ఇంకా ఇట్లాఅన్నాడు. "ఈ దుర్యోధనుని మాటలు వినవద్దు. వీడు పుట్టినప్పుడు అనేక అపశకునాలు పుట్టినాయి. అందువల్ల వీడిచేత కులానికే కీడు కలుగుతుంది. కులాన్ని చెరచే ఈ దుర్యోధనుణ్ణి విడిచి పెట్టు. ధర్మరాజును రాజ్యము మొత్తానికి రాజునుచేయి. అందరినీ రక్షించు." ఇట్లా అంటూ ఇంకా కౌరవులను దూషిస్తూ ధర్మరాజును పొగడుతూ మాట్లాడినాడు.

విదురుని మాటలు విని ధృతరాష్ట్రుడు కోపగించుకొన్నాడు. "నా శరీరంనుండి పుట్టిన మొదటి కొడుకును విడవడం ఎట్లా వీలవుతుంది? నీ విట్లనడం న్యాయమా? నా కొడుకులు పైకి రావడం నీవెప్పుడూ సహించవు. నీ సహాయం నాకక్కరలేదు. నీవు పాండవుల దగ్గరకైనా పో. లేకపోతే ఇంకెక్కడికైనాపో." అన్నాడు.

ఈ మాటలు వినగానే విదురుడు వేగంగా ధర్మరాజు దగ్గరకు కామ్యకవనానికి పోయినాడు. ఈ విషయం తెలుసుకొని దుర్యోధనుడు సంతోషించినాడు. అట్లా ఆయన పోయిన కొద్దిదినాలకే 'విదురుడు పాండవులవద్ద ఉన్నాడ'ని తెలిసికొన్నాడు ధృతరాష్ట్రుడు. ధృతరాష్ట్రుడికి భయం పుట్టింది. శుక్రునంతటి బుద్ధిశాలియైన విదురుడు పాండవులవద్ద ఉండడంకంటె తన వద్ద ఉంటేనే 'తనకొడులకు మేలు' అనుకొన్నాడు. అంతేకాక విదురుడు తనకు చూపులాంటివాడు. కాబట్టి వెంటనే సంజయుణ్ణి పంపించి విదురుణ్ణి తిరిగి తనవద్దకు పిలిపించుకొన్నాడు. వచ్చిన విదురునితో "నాకు బుద్ధిలేకపోయింది క్షమించు." అన్నాడు.

విదురుడు తిరిగి ధృతరాష్ట్రుణ్ణి కలుసుకోవడం దుర్యోధనునికి ఇష్టం లేకపోయింది. అంతే కాదు అనుమానం కూడ కలిగించింది. కర్ణుడు శకుని దుశ్శాసనులను పిలిపించినాడు. వారితో ఇట్లా అన్నాడు.

"పాండవుల మేలుకోరే విదురుడు ఇక్కడ నుండి పాండవులవద్దకు పోయినందుకు మనం సంతోషించినాము. కానీ ఇంతలోనే ఆయన తిరిగివచ్చి ధృతరాష్ట్రుడికి మంత్రిగాకొనసాగుతున్నాడు.

రాజుకూడా అతనిపై అనురాగంతో మంతనాలు జరుపడం మొదలుపెట్టినాడు. వీరిద్దరూకలిసి పాండవులను మళ్లీ ఇక్కడకు రప్పిస్తారేమో? అట్లా రప్పిస్తే, వారు తిరిగివస్తే, అగ్నితోనో విషంతోనో జలాలతోనో వారికి అపాయం కలిగిద్దాము."

ఈ మాటలు విని శకుని దుర్యోధనుణ్ణి చూచి, "ఇట్లా ఎందుకు అల్పబుద్ధితో ఆలోచిస్తున్నావు? ఒకవేళ విదుర ధృతరాష్ట్రులు వారిని పిలిపించినా, సత్యసంధులైన పాండవులు ప్రతిజ్ఞను పాటించకుండా ఎందుకు తిరిగి వస్తారు?" అన్నాడు.

అప్పుడు కర్ణుడు తన అభిప్రాయాన్ని దురోధనునికి ఇట్లాచెప్పినాడు. "ఈ సమయంలో మనం పాండవులపైకి దండెత్తిపోయి, వారినిచంపి భూమిపై శత్రుశేషం లేకుండా చేసుకుందాం. ఇట్లాచేస్తే వారిరాజ్యభాగంకూడా శాశ్వతంగా నీకేచెందుతుంది."

ఈ మాటలువిన్న మదోన్మత్తుడైన దుర్యోధనుడు మిక్కిలిసంతోషంతో వెంటనే యుద్ధానికిసన్నద్ధుడై, సర్వసైన్యాన్నీ సమీకరించి, దండయాత్రకు బయలుదేరినాడు.

దివ్యదృష్టితో ఇదంతా తెలుసుకొన్న వేదవ్యాసుడు వెంటనే అక్కడకు వచ్చినాడు. "ఇది ధర్మంకాదు. ఈ దండయాత్రవద్దు." అని దుర్యోధనుణ్ణి ఆపినాడు. ధృతరాష్ట్రుడితో ఇట్లాఅన్నాడు.

"రాజ్యాన్ని పోగొట్టుకొని పాండవులు ఒంటరిగా అడవుల్లో ఉన్నారు. వారినిప్పుడు 'వధించాల'ని నీ కొడుకు దుర్యోధనుడు వారిపై దండెత్తుతూఉన్నాడు. ఇట్లాంటిఆలోచన అతడికితగునా? ఓర్పుగా సత్యాన్ని పాటించి ధర్మంగా పదుమూడు సంవత్సరాలు పాండవులు పూర్తిచేస్తారు. ఆ తరువాత వారే మీ మీద యుద్ధానికి పూనుకొంటారు. వారు సాటిలేని పరాక్రమవంతులు. వారడవిలో 'ఒంటరిగా ఉన్నార'ని నీ కొడుకు వారిపై దండెత్తిపోయి 'భంగపడి రావాల'నుకొంటున్నాడు. 'అది మంచిపనికాద'ని, ప్రేమతో చెప్పి, అతణ్ణి ఆపు. నేనూ, నీవూ, భీష్ముడూ, విదురుడూ ఉండికూడ అధర్మాన్ని సహించడం తగునా? ఎప్పుడూ పాండవులతో విరోధంకోరడం మేలా?"

ఈ మాటలువిని ధృతరాష్ట్రుడు దుఃఖించి, "నాకూ, గాంధారికీ, భీష్మ విదుర కృప ద్రోణులకూ ఇష్టంకాని కపటద్యూతంజరిగింది. దుర్యోధనుడు 'దుర్బుద్ధికలవాడ'ని తెలిసినా, పుత్రవాత్సల్యం వల్ల నేను అతణ్ణి విడువలేకుండా ఉన్నాను. ఏమి చేయమంటావు?" అన్నాడు.

అప్పుడు వేదవ్యాసుడు "మమకార బంధాలన్నింటిలోనూ తల్లిదండ్రులకు పుత్రులమీద ఉండే బంధం గొప్పది. ఎంతధనం ఉన్నప్పటికీ, పుత్రులులేనివారి మనసుకు సంతోషముండదు". అని చెప్పి ఇంకా, ఇంద్ర సురభి సంవాదాన్ని గురించి చెప్పి, "ఆ సురభికి తన పుత్రులపైన ప్రేమ ఉన్నట్లే నీకుకూడా నీ పుత్రులపై ప్రేమ ఉండడం సహజమే. అయినా దీనులై అడవుల్లో దుఃఖాలు పడుతున్న పాండవులపై దయచూపు. నాకు నీవూ. పాండురాజూ, విదురుడూ ప్రేమలో సమానులే. అదే విధంగా నీ కొడుకులు

నూరుగురూ, పాండురాజు కొడుకులు అయిదుమందీ, నీకుకూడా సమానులై ఉండవలె. మంచివారి మైత్రివల్ల చెడ్డవారు కూడా నిజంగా మంచివారవుతారు. ధర్మరాజు సహవాసంతో నీ కొడుకు ధర్మమార్గుడూ ప్రశాంతుడూ అవుతాడు. రాజర్షి అయిన ధర్మరాజుతో మైత్రిచేయడం అందరికీ మంచిది. కాబట్టి ధర్మరాజును పూజిస్తూ, కొంత కాలముండడానికి దుర్యోధనుణ్ణి ఆయనవద్దకు పంపు. దానివల్ల ఇరుపక్షాలకు మేలు కలుగుతుంది." అని చెప్పినాడు. ధృతరాష్ట్రుడు వెంటనే, "మునీంద్రా! దుర్యోధనుడు నా మాట వినడు. కురుకులాన్ని కాపాడాలనేబుద్ధి మీకుంటే మీరే అతడికీ విషయం చెప్పండి." అని చెప్పి నమస్కరించినాడు. వ్యాసుడప్పుడు "పుణ్యాత్ముడైన మైత్రేయుడు అనే మునిశ్రేష్ఠుడు వచ్చి దుర్యోధనునికి ధర్మాన్ని గట్టిగా బోధిస్తాడు." అనిచెప్పి అంతర్ధానమైనాడు.

ఆ తరువాత కొన్ని రోజులకు న్యాయవేత్తా, బుద్ధిమంతుడూ అయిన మైత్రేయ మహర్షి కామ్యకవనంలో ధర్మరాజును చూచినాడు. ఆయన బాధలను తెలుసుకొన్నాడు. 'అన్యాయం జరిగింద'ని గ్రహించినాడు. ఆ అన్యాయాన్ని 'సరిదిద్దాల'నుకొన్నాడు. కామ్యకవనం నుండి బయలుదేరి హస్తినాపురం చేరినాడు. ఆయన అట్లా హస్తినకు రాగానే, ఇంద్రుడితో సమానుడైన ధృతరాష్ట్రుడు ఆయనకు ఎదురేగినాడు. 'తన పుత్రులకు మేలుకలుగాల'నే కోరికతో ఆ మునీంద్రుని ఎంతోభక్తిగాపూజించినాడు. విశేషంగా పరిచర్యలు చేసినాడు. ఆ తరువాత మునిశ్రేష్ఠుడు విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు ధృతరాష్ట్రుడు చేతులు జోడించి, "భట్టారకా! మీ రిప్పు డెక్కడనుండి వచ్చినారు?" అని అడిగినాడు. అందుకా మైత్రేయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు.

"ధృతరాష్ట్రా! నిన్నూ, నీ కుమారుణ్ణీ, చూడడానికి పాండవుల వద్దనుండి వచ్చినాను. వారు కామ్యకవనంలో తపోభారంతోఉన్నారు. వారందరికీ జడలు పెరిగిపోయిఉన్నాయి. జింకచర్మాలు మొరటు నారబట్టలు కట్టుకొనిఉన్నారు. కాయలు కూరలు పండ్లు మాత్రమే ఆహారంగా స్వీకరిస్తూ ఉన్నారు. నేను అనేక తీర్థాలను దర్శిస్తూ తిరుగుతూ ఉండినాను. అట్లా తిరుగుతూ కురుక్షేత్ర సమీపంలోని కామ్యకవనంలోనికి ప్రవేశించినాను. అక్కడ పాండవులను చూచినాను."

ఈ మాటలు విన్న ధృతరాష్ట్రుడు తలవంచుకొన్నాడు. "అక్కడ సత్యవ్రతం కలిగిన పాండవులకు కుశలమేనా? వారు హస్తినాపురం గురించి ఏమైనా ఆలోచిస్తున్నారా? ఆ పాండవులు పరాక్రమంలో యమునితో సమానమైనవారు. వారు లోగడ అంగీకరించిన ఒప్పందాన్ని మీరడానికి పూనుకోవడం లేదుకదా? కురుపాండవ సోదరభావానికి 'విఘాతం కలిగించాల'నుకోవడం లేదు కదా?" అని ప్రశ్నించినాడు.

ఆ మాటలకు మైత్రేయుడు, "ఓ రాజా! వారు క్షేమంగాఉన్నారు. మహర్షులు వారివద్దకు నిరంతరం వచ్చిపోతూఉన్నారు. పాండవులకు సంతోషం కలిగేట్లు దీవిస్తూఉన్నారు. స్వయంగా పాండవులు ధర్మబుద్ధికలవారు. అందుచేత వారి క్షేమానికేమీ లోపంలేదు. వారే చేసికొన్న ఒడంబడికతప్పితే, సూర్యచంద్రుల గతులుకూడతప్పుతాయి. వారిని అనవసరంగా నీ కొడుకు మిక్కిలి శత్రుత్వంతో మోసం చేసినాడు" అని

ధృతరాష్ట్రుడికి చెప్పినాడు. ఆ వెంటనే దుర్యోధనుణ్ణిచూచి, "అయ్యా! నీవు బుద్ధి కలిగినవాడవైతే పాండవులతో విరోధం మానుకో. అట్లయితే నీకూ పాండవులకూ కురువంశానికంతటికీ మేలవుతుంది. నామాట విను, పాండవులు వజ్రశరీరులు. ఒకరొకరు దేవేంద్రునితో సమానమైనవారు. ఒక్కొక్కరు పదిలక్షల ఏనుగుల బలంకలిగినవారు. భయంకరమైన యుద్ధమంటే ఉత్సాహం చూపేవారు. వారిలో మిక్కిలి బలవంతుడైన భీముడు, బకుణ్ణీ హిడింబుణ్ణీ రాక్షసంగా చంపినాడు. అతడు పదివేల ఏనుగులబలం కలిగిన జరాసంధుణ్ణి ఒంటరిగా ఓడించి, చంపిన అద్భుతవీరుడు ఘోరాటవిలో కిమ్మీరుణ్ణి వధించినాడు. ఆ కిమ్మీరుడు మహావీరుడు చలించని మహాభయంకరమైన శరీరం కలిగినవాడు. అట్లాంటి కిమ్మీరుణ్ణి వధించిన గొప్ప భుజాలు కలిగిన భీముణ్ణి ఎదిరించగలవారున్నారా? వారికి శ్రీ కృష్ణుడూ ధృష్టద్యుమ్నుడూ బంధువులు. సహాయం చేసేవారు. ముసలితనానికీ చావుకు లోనయ్యే మానవమాత్రులు వారి నెదిరించి ఎట్లా బ్రతుకుతారు? నీవు వారితో పొత్తు కుదుర్చుకొని ఉండు. ఇది సరియైనపని" అని చెప్పినాడు.

ఇట్లా చెప్పిన మైత్రేయునిమాటల నేమాత్రం లెక్కచెయ్యకుండా దుర్యోధనుడు కాలిబొటన వ్రేలితో నేలను రాచినాడు. చేతులెత్తి తొడలపై చరుచుకొన్నాడు. ఆపైన పరిహాసంగా నవ్వినాడు. అట్లా ఉన్న దుర్యోధనుణ్ణి చూచిన మైత్రేయునికి విపరీతంగా కోపంవచ్చింది. "నీ తప్పువల్ల యుద్ధం జరుగుతుంది. ఆ యుద్ధంలో భీముని గదదెబ్బకు నీ రెండుతొడలు విరుగుతాయి." అని శపించినాడు.

ఆ శాపంవిని భయపడి ధృతరాష్ట్రుడు, "మునీంద్రా! అట్లా కాకుండా దయచూడు. శాపాన్ని వెనక్కి తీసుకో." అని ప్రార్థించినాడు. ఆ ధృతరాష్ట్రుని ప్రార్థనతో మైత్రేయుడు కొంత శాంతించినాడు. "వీడికి సక్రమమైన బుద్ధికలిగితే, ఈ శాపం తగులదు. అట్లా కాకుండా బుద్ధిహీనుడై గర్వంతో ప్రవర్తిస్తే, శాపాన్ని అనుభవించక తప్పదు." అని చెప్పి మైత్రేయుడు అక్కడ నుండి పోయినాడు.

**నీతి :** అసూయ మంచిది కాదు గర్వం పనికి రాదు

**విశేషం :** పాండవు లొక్కొక్కరు 'పదిలక్షల ఏనుగుల బలం కలిగిన వార'ని మైత్రేయుడు చెప్పినాడు ఈ విషయం భారతంలో ఇంకెక్కడా కనిపించదు భీముడొక్కడే పదివేల ఏనుగుల బలం (నాగాయుతబలం) కలిగిన వాడని పలుచోట్ల చెప్పబడింది మిగిలిన పాండవుల బలాన్నిగురించి ఇట్లాంటి ప్రస్తావన ఎక్కడా లేదు ఇది ఎట్లో విచారించదగియున్నది

**చ.** **అలఘు తపోభరంబున జటాజినముల్ ధరియించి, రూక్షవ**
**ల్కలముల గట్టి, కూరలును గాయలుఁగందులు భోజనంబుగా,**
**నలయక 'కామ్యకం'బను మహావిపినంబుననున్న పాండవే**
**యుల కడనుండి వచ్చితిఁ, గురూత్తమ! నీసుతు నిన్నుఁ జూడఁగన్.** **అరణ్య 1-94**

# 4. కిమ్మీరవధ.

**(అరణ్య 1-107 నుండి 120 వరకు.)**
**(పాండవుల అరణ్యవాసకాలంలో భీముడు కిమ్మీరుణ్ణి వధించినాడు**
**ఆ కథను విదురుడు ధృతరాష్ట్రుడికి చెప్పినాడు.)**

పాండవులు అరణ్యాలకు బయలుదేరి వెళ్లి, గంగా తీరంలో 'ప్రమాణం' అనే పేరుగల మర్రిచెట్టు క్రింద విడిదిచేసి, ఒక రాత్రి గడపినారు. మరునాడు బ్రాహ్మణోత్తములు కొందరు వచ్చి, తాముకూడ పాండవులవెంట అరణ్యవాసానికి బయలుదేరినారు. ఆ తరువాత పాండవులు బ్రాహ్మణులతో కూడి రెండు దినాలు ఎడతెగకుండా ప్రయాణం చేసినారు. కామ్యకవనం ప్రవేశించినారు. వారట్లా కామ్యకవనం ప్రవేశించేటప్పటికి అర్ధరాత్రమయింది. వారప్పుడక్కడ ఒక రాక్షసుణ్ణి చూచినారు. వాడొక నిశాచరుడు. రాక్షసమాయలు చేస్తూ అడవిలో తిరుగుతూ ఉండినాడు. చాల పదునైనకోరలతో నోరుతెరచి భయంకరంగా కనిపిస్తున్నాడు. అతని కనుగ్రుడ్లు మెరుస్తూఉన్నాయి. వెంట్రుకలు పచ్చనిరంగులో ఉన్నాయి. అతడు నడుస్తూఉంటే ఆ పచ్చని వెంట్రుకలు కదులుతూ ఉన్నాయి. వాడు అప్పుడే ఉదయించిన సూర్యకాంతితో కూడిన మేఘంలాగా ఉన్నాడు. ప్రాణులన్నీ భయపడేట్లు గర్జిస్తూఉన్నాడు. అతడు నడిచేటప్పుడు భూమి అదరుతూఉంది. ఆ అదరులకు తీగలు సమీపంలోని చెట్లకు చుట్టుకుంటున్నాయి. ఆ విధంగా చెట్లు తీగలకౌగిలింతలు పొంది ఆనందిస్తున్నాయి. పాండవులు అట్లాంటి రాక్షసుణ్ణి తమకెదురుగా చూచినారు.

పాండవులు బ్రాహ్మణుల గుంపుకంటె ముందునడుస్తున్నారు. వారు నల్లజింకల చర్మాలను వస్త్రాలుగా ధరించిఉన్నారు. అట్లా వస్తున్న పాండవులను ఆ రాక్షసుడు దూరంనుండే చూచినాడు. వారు నడచే మార్గానికి అడ్డంగా నిలబడినాడు. ఆ రాక్షసుడు మహాపర్వతంలాగా ఎత్తైన శరీరం కలిగిఉన్నాడు. ఇంతకు ముందెన్నడూ, ఎక్కడా ఎవరూ చూడనంత పెద్దశరీరం కలిగిఉన్నాడు. వాడి ఆ పెద్దశరీరాన్ని చూచి భయపడి, ద్రౌపది గట్టిగా కళ్లుమూసుకొన్నది. దుశ్శాసనుని చేతులతో లాగబడిన వెంద్రుకలు వేలాడుతూఉండగా ఆమె, అయిదు పర్వతాలనడుమ ఉన్న నదిలాగా కనిపించింది. అప్పుడా పాండవులయిదుగురూ ద్రౌపదిని పట్టుకొని అనునయించినారు.

కార్యశూరుడైన ధౌమ్యుడు, గొప్ప ప్రతిభతో పాడవులు చూస్తూఉండగానే రాక్షసులకు కీడుచేసే మంత్రాలతో, ఆ రాక్షసుడి మాయల విజృంభణాన్ని అణచి వేసినాడు. అప్పుడు ఆ రాక్షసుడి మాయలు చెల్లకుండా పోయినాయి. పొడవైన చేతులుగల ఆ రాక్షసుడికి చాలాకోపంవచ్చింది. కళ్లు ఎర్రబడ్డాయి. తన పెద్దకనుగ్రుడ్లు అన్ని వైపులకూ తిప్పుతూఉన్నాడు. అట్లాంటి రాక్షసుణ్ణి చూచి ధర్మరాజు "నీ వెవరివాడవు? ఎవడవు? ఈ అడవిలో ఎందుకున్నావు?" అని అడిగినాడు. అందుకు వాడిట్లా అన్నాడు.

"నేను బకాసురుడి తమ్ముడను. మానవులకు యముని వంటివాడను. 'కిమ్మీరుడ'నే పేరుతో ప్రసిద్ధి పొందినవాడను. అన్ని జంతువులను తినడానికై ఈ కామ్యకవనంలో ఉంటున్నాను. రాక్షసమాయతో యుద్ధంలో మాయలుతెలియని అమాయకులైన మనుషులనుచంపి తింటూఉంటాను. యుద్ధంలో నన్ను దేవతలు కూడ జయించలేరు. నాకు భయపడి జనులంతా ఇక్కడనుండి దూరంగా తొలగిపోతూ ఉంటారు. మీరెవరు? ఇక్కడి కెందుకు వచ్చినారు? నేను మిమ్మల్నందర్నీ ఇప్పుడేచంపితింటాను."

ఇట్లా అన్న కిమ్మీరుడితో దర్మరాజు "నేను ధర్మరాజును. ఈతడు భీముడు. అతడు అర్జునుడు. అదిగో అక్కడివారు నకులసహదేవులు. మేమందరం పాండురాజు కుమారులం. ప్రత్యేక కారణంవల్ల అరణ్యవాసం చేయడాని కిక్కడకువచ్చినాము" అన్నాడు.

ఈ మాటలు విన్న వెంటనే రాక్షసుడు వికటాట్టహాసము చేసినాడు. "ఎట్లెట్లా? ఈతడు భీముడా? నాకెంత అదృష్టమో? వాడిని ఎప్పుడుచంపుదామా? అని నేను కాచుకొనిఉన్నాను. నా ముందుకు తానే వచ్చినాడు. మహాబలవంతుడైన మా అన్న బకుణ్ణి నాఇష్టసఖుడైన హిడింబుణ్ణి చంపినవాడీ దుష్టుగ వాతాపిని ఆలస్యం లేకుండా మ్రింగి జీర్ణం చేసుకొన్న అగస్త్యుని లాగా, వీణ్ణి తిని నేను జీర్ణం చేసుకొంటాను" అన్నాడు. ఆ కిమ్మీరుడి మాటలు విన్న ధర్మరాజు కోపగించుకొన్నాడు. ధర్మరాజు కోపాన్ని తెలుసుకొని, వీరుడైన అర్జునుడు గాండివాన్ని ఎక్కుపెట్టినాడు. నకుల సహదేవులు కూడా పదునైన కత్తులను తమ చేతుల్లోకి తీసుకొన్నారు.

అప్పుడు భీముడూ, కిమ్మీరుడూ ఒకరినొకరు భయంకరంగా ఎదుర్కొన్నారు. వారిద్దరూ మహాభయంకరమైన పరాక్రమాలుకలవారు. ఎక్కువగా కోపం కలిగినవారు. బాగా చేవగలిగిన పెద్దపెద్ద చెట్లను చేతులలో ధరించినారు. ఇద్దరూ గర్వించి ఉన్నవారే. ఇద్దరూ శత్రువులను చంపేవారే. వీరత్వంలో దేవతలతో సమానమైనవారే. పెనుగాలికి పొంగే సముద్రాలలాగా ఇద్దరూ భయంకరంగా పొంగి ఒకరి నొకరు ఎదుర్కొన్నారు.

వారి చేతులలోనిచెట్లు కఠినమైన వారిదేహాలపైపడి ముక్కలు ముక్కలై పోయినాయి. మదించిన ఏనుగుల తలలపై పడిన తామరతూడులలాగా ఆ చెట్లు ముక్కలైపోయిన ట్లనిపించినాయి. ఆకాశంలో చెట్లు ముక్కలైనశబ్దాలు ప్రతిధ్వనించినాయి. ఇట్లా ఒక్కముహూర్తకాలం వారిద్దరూ చెట్లయుద్ధం చేసినారు. దగ్గరలోని చెట్లన్నీ అయిపోయినాయి. ఆ ఇరువురూ రాళ్లయుద్ధం ప్రారంభించినారు. అట్లా చేసే రాళ్లయుద్ధంలో భీముడు విసరిన రాళ్లతో కిమ్మీరుడి వక్షస్థలం దెబ్బతిన్నది. అప్పుడా కిమ్మీరుడు భీముణ్ణి రాహువు సూర్యుణ్ణి

పట్టుకొన్నట్లుగా పట్టుకొన్నాడు. ఆ పట్టులోని బలాన్నిబట్టి భీముడు, కిమ్మీరుడి బలం తరిగిపోయినట్లుగా గుర్తించినాడు. యమదండాలవంటి తన చేతులతో ఆ రాక్షసుని నడుమునూ గొంతునూ పట్టుకొన్నాడు. నేలపై పడద్రోచినాడు. కర్రవంటి వానిదేహాన్ని నడుమకు విరచినాడు. బకుణ్ణి చంపిన విధంగానే కిమ్మీరుణ్ణికూడ చంపినాడు.

"బకుడు హిడింబుడు 'చచ్చినార'ని దుఃఖించి దుఃఖించి పెద్దగాఅరచి దుఃఖించలేక యమపురానికి పోయినావా? అయ్యో! రాక్షసా!" అంటూ, భీముడు కిమ్మీరుని శవాన్ని దారి కడ్డంలేకుండా దూరానికి విసరివేసినాడు.

ఈ విధంగా భీముడు కిమ్మీరుణ్ణి సులభంగా చంపి ఆ అడవిలో ఉండే వారందరికీ రాక్షస బాధలేకుండా చేసినాడు. ధర్మరాజు, అర్జునుడు, నకులుడూ, సహదేవుడూ, ధౌమ్యుడూ ఇంకా వారివెంట అరణ్యవాసానికి వచ్చిన బ్రాహ్మణులూ, భీముడిని పొగడినారు.

**నీతి :** గర్వం పనికి రాదు.

**ఉ॥ ఘోరపరాక్రముల్, ప్రబలకోపపరుల్, పృథుసారభూరి భూ**
**మీరుహపాణు లుద్ధతు లమిత్రవిఘాతులు, వీరబృంద బృం**
**దారకు లార్చు చొండొరుల ఁదాఁకిరి, దారుణభంగిఁ బొంగి, కి**
**మ్మీర సమీరసూనులు, సమీరవిధూతపయోధులట్ల యై.** **అరణ్య 1-117**

## 5. ద్రౌపది దుఃఖం - ఓదార్పు

**(అరణ్య 1-133 నుండి 146 వరకు.)**

పాండవులు అరణ్యవాసం చేస్తూ కామ్యకవనంలో ఉండిన సమయంలో యాదవులూ పాంచాలురూ మొదలైన రాజులంతా వారిని చూడడానికి అక్కడకు వచ్చినారు. అక్కడ రాజులందరూ శ్రీకృష్ణుని చుట్టూచేరి ఉండగా ద్రౌపది అక్కడకు వచ్చింది. వచ్చిన ద్రౌపది కమలాలవంటి తన హస్తాలను జోడించి కృష్ణునితో ఇట్లా అన్నది. "దేవా! మొదటి సృష్టిసమయంలో నీవు 'బ్రహ్మదేవుడవ'ని, అసితవంశం వాడయిన 'దేవలుడు' అనే ఋషి చెప్పినాడు. సత్యనిష్ఠతో క్రతుధర్మాన్ని తిరిగి నెలకొల్పడంచేత నీవు ఎల్లప్పుడూ 'సత్యంతో కూడిన యజ్ఞపురుషుడవ'ని కశ్యపుడు చెప్పినాడు. తలమీద ఆకాశాన్నీ, కాళ్లతో భూమినీ, కళ్లతో సూర్యుణ్ణీ, ఇతర అవయవాలతో లోకాలనూ, సంపూర్ణంగా నిండిఉండడం వల్ల నీవు 'సర్వాంతర్యామి' (అన్నింటిలో ఉండేవాడు) వని నారదుడు చెప్పినాడు. 'నశించని జ్ఞానానికి నీవు నిధివ'ని మునిశ్రేష్ఠులందరూ చెప్పినారు. ఎడతెగని దయకలవాడా! సర్వేశ్వరా! యుద్ధంలో వెనుతిరుగని రాజశ్రేష్ఠులకూ, ఆత్మజ్ఞానం కలిగిన యోగులకూ, తృప్తితో ఉండే సాధువులకూ, నీవే గతివి. నీలోని బుద్ధికి అందనిది ఏదీలేదు. నాకు జరిగిన అవమానం ఇప్పటికే నీ మనసుకు అందిఉంటుంది. అయినా నా తృప్తికోసం నేనుపడిన అవమానాన్ని నేనే చెప్తాను. విను" అని ఇట్లా చెప్పింది.

"రాజులకురాజైన పాండురాజుకు కోడలనైనాను. యుద్ధాలలో నేర్పరులైన పాండవులకు భార్యనైనాను. పూజ్యుడవైన నీకు చెల్లెలినయినాను. మిక్కిలి శక్తితో ఒప్పారే ధృష్టద్యుమ్నునికి సోదరిని. అట్టి నేను ధృతరాష్ట్రుని కొడుకు దుశ్శాసనునిచేత తలపట్టి ఈడ్వబడినాను. ఆ పాపాత్మునిచేత వస్త్రాలు అపహరించబడి, భయంకరమైన అవమానాన్ని పొందినాను. అట్లాంటి స్థితిలో పాండవులు, ఇతరుల లాగా చేవలేక నన్నుచూస్తూ ఉండిపోయినారు. భీష్ముడు మొదలైన పెద్దలైన బంధువులంతా చూస్తూ ఉండికూడా, ఏమీ మాట్లాడలేదు. శరణుకోరిన వారిని దయామూర్తులై రక్షించే పౌరుషవంతులే (పాండవులే) నేను శరణంకోరి ఏడ్చినా, వినలేదుకదా? ఇంక భీమార్జునుల బాహుబలమెందుకు పనికివస్తుంది? సోదరులూ పుత్రులూ బంధువులూ అందరూ ఉండికూడ నేను ఎవరూ లేనిదాననయినాను. అట్టి సమయంలో కర్ణుడు నన్నుచూచి నవ్వినాడు. కృష్ణా! కర్ణుడినవ్వు లోకాలన్నీ అసహ్యించుకొనే దుశ్శాసనుడు చేసినపనికంటె ఎక్కువగా మంటలాగా తాకి నా మనసును మిక్కిలి భయంకరమైన రీతిగా కాల్చివేస్తూ ఉన్నది". అని చెప్పి ఏడుస్తూ ఇంకా ఇట్లా చెప్పింది.

"పూర్వం వేదాలు చదువుతూ, చిన్నతనపు ఆటల వేడుకలో ఉన్నప్పుడు, 'ప్రమాణకోటి' అనే చోట దుర్యోధనుడు, నిద్రపోయే భీమసేనుణ్ణి కదలకుండా కట్టివేసి, గంగ మడుగులో త్రోపించినాడు. విషాన్ని పెట్టించినాడు. విషసర్పాలను పట్టించి, తెప్పించి, కరపించినాడు. తల్లితో కూడిన పాండవులను అయిదుగురినీ

వారణావతంలో లక్కఇంట్లో ఉండేట్లుచేసి, ఆ లక్క ఇంటికి నిప్పుపెట్టించినాడు. ఇట్లా ఇంతకుమునుపు అనేకరకాలైన అపకారాలు చేసినాడు. ఇప్పుడు తిరిగి దుర్యోధనుడు మోసపు జూదంతో రాజ్యాన్ని అపహరించినాడు. రాజులందరి సమక్షంలో తమ్ము అవమానించినప్పటికీ పాండవులు పరాక్రమం చూపలేకపోయినారు. అట్లాంటివారు నా అవమానాన్ని ఎట్లా పోగొట్టకలుగుతారు?". అని కన్నీటి ధారలతో తడిసిన చన్నులతో నిలబడింది. చిగురుటాకులవంటి చేతులతో కన్నులు తుడుచుకుంటూ ఉండింది.

ఆ ద్రౌపదిని చూచి కృష్ణుడిట్లాఅన్నాడు "అమ్మా! ద్రౌపదీ! తపిస్తూఉన్న నీ మనస్తాపమువల్లనూ, అర్జునుడి తీవ్రమైన బాణాలూ పడడంవల్ల తగిలే దెబ్బలతోనూ, ఆ ధృతరాష్ట్రుడి కొడుకులసేన యమపురికి పోతుంది సుమా! ఇదే జరగబోయేది. ఈ ఏడుసముద్రాలు ఇంకినా, రాత్రీ పగలూ తారుమారైనా నామాట తప్పదు."

కృష్ణుడిట్లా అనగానే, అర్జునుడు ద్రౌపదిని చూచి ఇట్లాఅన్నాడు. "ఈ పురుషోత్తముడైన శ్రీకృష్ణుడు మనకందరకు క్షేమం కలిగిస్తూ ఉంటాడు. ఇంకా మనపాపాలు నిందలు అనే బురదను కడిగి వేస్తూఉంటాడు అందుచేత చెడుగర్వంతో మండే శత్రుసమూహం తప్పక నాశనమవుతుంది. మూడులోకాలనూ జయించగలిగిన శ్రీ కృష్ణుడు మనవైపుండగా నీవు దుఃఖిస్తూ ఉండడమెందుకు?"

ఈ మాటలు వినగానే ధృష్టద్యుమ్నుడు కోపగించుకొని, ద్రౌపదితో ఇట్లా అన్నాడు. "వినయం లేని దుర్యోధన దుశ్శాసనులను భీముడూ, కర్ణుణ్ణి అర్జునుడూ, ద్రోణుణ్ణి నేనూ యుద్ధంలో చంపుతాము. కమలాక్షీ! ఎందుకు దుఃఖిస్తావు?"

ఈ విధంగా వారందరూ ఓదార్చగా ద్రౌపది కలక తేరింది.

**నీతి :** దుఃఖించేవారిని ఓదార్చడం గొప్పవారి లక్షణం.

చ. **తనుకుచునున్న నీ హృదయతాప నిమిత్తముననన్, సురేంద్రనం**
**దనుపటు బాణపాతహతిఁ, దద్ధృతరాష్ట్ర బలంబు మృత్యుసా**
**దనమున కేఁగు ఁజుమ్మిదియ తథ్యము; నా వచనంబు దప్పది**
**వ్వననిధు లేదు నింకిన, దివంబును రాత్రియు సంచలించినన్.** ఆరణ్య **1-141**

# 6. సౌంభకవధ.

**(అరణ్య 1-147 నుండి 199 వరకు.)**

**(శ్రీకృష్ణుడు ధర్మరాజుకు పాండవులు అజ్ఞాతవాసంలో ఉండగా చెప్పిన కథ.)**

శ్రీకృష్ణుడు పాండవుల ద్యూత అనుద్యూతాల సమయాలలో సౌంభకుణ్ణి చంపడానికై మార్తికావత దేశానికి పోయిఉండినాడు. అందువల్ల శ్రీకృష్ణునికి ఆ విషయాలేవీ అప్పుడు తెలియలేదు. శ్రీకృష్ణుడు ఆ సౌంభకుణ్ణి సంహరించి ద్వారకచేరినవెంటనే విషయంతెలిసి కామ్యకవనానికివచ్చి, పాండవులను కలుసుకున్నాడు. ఆయనకు ద్రౌపది తనకు జరిగిన అవమానాన్నంతా చెప్పుకొని దుఃఖించింది. ఆయన ఆమెను ఓదార్చినాడు.

అటు తరువాత కృష్ణుడు ధర్మరాజుతో ఇట్లాఅన్నాడు. "ధర్మరాజా! నేను ద్వారకలో సాత్యకి చెప్పగా ద్యూతమూ, అనుద్యూతమూ, మీరు అడవులపాలు కావడమూ, అంతా విన్నాను. తక్షణమే బయలుదేరి ఇక్కడకు వచ్చినాను. శోకంలోఉన్న నిన్నుచూచి, నా మనసంతా శోకంతో నిండిపోయింది. ఆ సమయంలో నేను మీవద్ద లేకపోవడంవల్ల, ఈ చెడువ్యవసనమైన జూదంజరిగింది. కోరికలవల్ల పుట్టిన 'స్త్రీజనసంపర్కము' అనేవ్యసనము, ద్యూత వ్యవసనము, వేట వ్యసనము, మత్తు పదార్థాలు సేవించే వ్యసనం, అనే ఈ నాలుగు వ్యసనాలలో మనిషి ఎవరూ పడిపోకుండాఉండవలె. అందులోనూ మిక్కిలి అనర్థాలకు మూలకారణమయిన కపటద్యూతం వదలిపెట్టకపోతే పాపం చుట్టుకుంటుంది." ఈ మాటలు చెప్పి, శ్రీకృష్ణుడు ఇంకా ఇట్లాఅన్నాడు. "నేను అప్పుడక్కడ ఉండిఉంటే, కృపుడూ, ద్రోణుడూ, విదురుడూ, భీష్ములను తోడుచేసుకొనేవాడను అనేక కారణాలు ఋజువులూ చూపించి, ధృతరాష్ట్రుణ్ణి ఒప్పించి ఉండేవాడను. ఆ విధంగా చెడుజూదం జరుగకుండా చూచేవాడను. ప్రేమతో హితవు చెప్పినా ఒప్పుకోని ధర్మబాహ్యులుంటే, వారిని శిక్షించేవాడను. ఎక్కడైనా, నే నుండగా, మీకు కీడుకలుగనిస్తానా?" అనిచెప్పి ఇంకా ఇట్లా అన్నాడు.

"నేను సముద్రతీరంలో సాల్వునితో యుద్ధంచేసి వాడిని చంపడంకోసం, అక్కడే ఉండిపోయినాను. ఆ కారణంగా మీకు 'ద్యూతమ'నే చెడువ్యసనం జరిగినప్పుడు, నేను మీ దగ్గర లేకుండాపోయినాను." శ్రీకృష్ణుడిట్లా అనగానే ధర్మరాజు, "ఆ సాల్వునితో యుద్ధం ఎట్లాజరిగింది?" అని అడిగినాడు. అప్పుడు ఆ కథనంతా శ్రీకృష్ణుడు ధర్మరాజుకు ఈ విధంగా చెప్పినాడు.

"ధర్మరాజా! నీ రాజసూయయాగంలో అర్ఘ్యము విషయంలో శిశుపాలుడు విభేదించడం, వాణ్ణి నేనుచంపడం నీకుతెలుసుకదా? ఆ విషయాన్ని వానితమ్ముడుసాల్వుడు విన్నాడు. మిక్కిలి కోపగించు కొన్నాడు. ఆ సాల్వుడికి ఎక్కడకు కావాలంటే అక్కడకు పోగల 'సౌంభకము' అనే పేరుగల నగరముంది. అతడా నగరంతోకూడా యుద్ధసన్నాహంతో ద్వారకానగరంపైకి దండెత్తినాడు. 'శత్రురాజులకు యముడివంటివాడైన మాఅన్న శిశుపాలుణ్ణి చంపిన కృష్ణు డెక్కడ?' 'శిశుపాలుణ్ణి చంపినాన'ని పొగరుగా

తిరుగుతున్న వృష్ణివంశంలోని ఆ దుర్మార్గుడెక్కడ? నా గెలుపు గొప్పతనం వెలిగిపోయేట్లుగా అతణ్ణి యుద్ధంలో చంపుతాను' అంటూ అడ్డగించ శక్యంకాని పరాక్రమంతో గొప్ప చతురంగబలాలతో ద్వారకను అన్నివైపులనుండి ముట్టడించినాడు. అతడి సైన్యంలోని ఏనుగులు ఆ ద్వారకచుట్టూ ఉండే మేలైన విశాలమైన ఉద్యానవనాలనూ, తాటిచెట్ల, మద్దిచెట్ల, దేవదారు, హింతాల తమాలవృక్షాల, గుంపులను వేర్లతోకూడ పెకలించివేసినాయి. కానీ కోటనుమాత్రం భేదించలేకపోయినాయి.

ఆ కోటలో గుర్రాలకు ఏనుగులకు కావలసినంత గడ్డీ నీళ్లూ ఉన్నాయి. సైనికులకు, పౌరులకు, వీరులకు, అవసరమైన ఆహారధాన్యాలూ, వాటిని పచనం చేయడానికి కావలసిన వంటకట్టెలు, పుష్కలంగా ఉన్నాయి. కోటకు శతఘ్నులు మొదలైన ఆయుధాలను ప్రయోగించే యంత్రాలు అమర్చబడి ఉన్నాయి. నాలుగు దిక్కులా నాలుగుగోపురాలూ, అందులో నాలుగు పెద్దవాకిళ్లూ ఉన్నాయి. ఆ కోటలోని సైనికులందరూ పుష్కలమైన జీతాలతో తృప్తిచెందినవారే. కోటలో అసంఖ్యాకంగా చతురంగ బలాలున్నాయి. పదునైన కొత్తఆయుధాలైన అలాత, శర, చక్ర, తోమర, పరశు, పాశ, అంకుశ, కూటాలు ఆ కోటలో ఉన్నాయి. వీరయోధులు కావలికాస్తున్న విశాలమైన అట్టాలకాలున్నాయి. అందుచేత ఆ సాల్వుడు శత్రువుల కసాధ్యమైన ఆ కోటను భేదించలేకపోయినాడు. కోట వెలుపల ఉండే చలిపందిరులనూ, నీడనిచ్చేచెట్లనూ, రచ్చబండలనూ, దేవాలయాలనూ వదలి, మిగిలిన సమతలమైన చోట్లన్నింటా దట్టంగా సైనిక శిబిరాలను నిర్మింపచేసినాడు. ఆ తరువాత కోటకు ప్రతిదినం ఉపద్రవం కలిగిస్తూ ఉండినాడు.

ఆ సౌరభకుడి విజృంభణాన్ని యాదవులు సహించలేకపోయినారు. పోరాడాలనే ఆవేశంతో సకల ఆయుధాలనూ సమకూర్చుకొన్నారు. చారుదేష్ణుడూ, ప్రద్యుమ్నుడూ, సాంబుడూ అనే యాదవ రాకుమారులు 'శత్రువులను నిర్మూలించాల'నే కోరికతో మహోత్సాహంతో కోటలోనుండి బయటకు వచ్చినారు. అట్లా బయటకు వచ్చిన ఆ ముగ్గురూ విజృంభించే గొప్పబలం కలిగినవారు. విద్యాధరులతో సమానమైనవారు.

సాంబుడు సాల్వసేనాపతిఅయిన క్షేమవృద్ధితో తలపడినాడు. ఆ సాంబుడు శ్రీరామునితో సమానమైన పరాక్రమం కలిగినవాడు. అజేయుడు. శత్రువులు అనే ఏనుగులకు సింహంవంటివాడు. ఇక క్షేమవృద్ధికూడా సహజమైన సాహసంతో గొప్పవాడు. సాంబుడు బాణపరంపరతో భూమిని కప్పివేసినాడు. ఇట్లా జాంబవతీపుత్రుడైన సాంబుడు వేసిన పెద్దపెద్దబాణాలకు, క్షేమవృద్ధి భయపడలేదు. గొప్పవాడైన క్షేమవృద్ధికూడా సాంబుణ్ణి ఎదిరించి అనిమొనలో ఆలస్యంలేకుండా లక్షబాణాలను ప్రయోగించినాడు. అట్లా క్షేమవృద్ధి బాణాలువేసే నేర్పును సహించకుండా, సాంబుడు బంగారు పుంఖాలు కలిగిన బాణాలతో వాడి రథాలకు కట్టిన గుర్రాల మర్మస్థానాలను నొప్పించినాడు. ఆ గుర్రాలు తమ ఆయువుపట్లు భేదించబడడంవల్ల కలిగిన బాధతో వణికిపోయినాయి. వెంటనే మిక్కిలివేగంతో సారథికి లొంగకుండా రథాన్ని ఈడ్చుకుంటూ పారిపోయినాయి. ఆ విధంగా సాల్వసేనాపతి యుద్ధంనుండి వెనుదిరిగినాడు.

అప్పుడు 'వేగవంతుడ'నే సాల్వుడి శూరయోధుడు సాంబుణ్ణి పరాక్రమంతో తాకినాడు. వేగంగా బాణ సమూహాలతో దిక్కులన్నింటినీ బాణాలపంజరంగా చేసినాడు.

సాంబుణ్ణి 'తప్పుకోమ'ని చెప్పినాడు చారుదేష్ణుడు. కోపంతో వేగవంతుణ్ణి తానెదుర్కొన్నాడు. పరాక్రమంతో వాడితలపగిలేటట్లు వేగంగా గదతోమోదినాడు. ఆ దెబ్బతో వేగవంతుడి తలనుండి నెత్తురుఅనే నీటివెల్లువ ప్రవహించింది. ఈ విధంగా చారుదేష్ణుని కఠోరమైన గదదెబ్బకు వేగవంతుడు చచ్చినాడు. పిడుగు పాటుకు ఎత్తైన కొండకొన పగిలి నేలపై దొర్లినట్లుగా వాడు నేలకూలినాడు.

ఇది చూచి 'విచింత్యుడ'నే వాడు ఊహించనలవికాని పరాక్రమంతో చారుదేష్ణుని పైన మిక్కిలి వాడియైన బాణం వేసినాడు. ఆ చారుదేష్ణుడు విల్లుచేతిలో ధరించి ఆ క్షణంలోనే మంత్రించి వాడిపై ఆగ్నేయాస్త్రం ప్రయోగించినాడు. ఆకాశమంతా భయంకరంగా నిప్పురవ్వలు క్రమ్ముకున్నాయి. ఆగ్నేయాస్త్రం ఆ విచింత్యుడి రొమ్మును ఖండించింది. విచింత్యుడు నేలకూలినాడు. అప్పుడు భూమి అదరింది. ఘనుడైన ఆ విచింత్యుడు చావడంచూచి సాల్వునిసేన, "హాహా" అనే శబ్దాలు వ్యాపించగా కలతచెందింది.

అప్పుడు సాల్వుడు తనసేనలో వ్యాపించిన కలవరపాటును ఆపినాడు. అన్నిరకాల ఆయుధాలతో కూడిన రథాన్ని ఎక్కినాడు. యాదవకుమారులను తానే స్వయంగా ఎదుర్కొన్నాడు. యాదవులసేన పైకిదూకి సేననంతటినీ ఆయుధమయంగా చేసినాడు. అంతట సాల్వునిపై ప్రద్యుమ్నుడు కోపగించుకొన్నాడు. తెల్లని గుర్రాలను పూన్చిన రథం ఎక్కినాడు. ఆ రథంమీద బంగారుతో చేయబడిన మకరం (మొసలి) జెండాపై ప్రకాశించింది. ఉడుముతోలుతో చేయబడిన అంగుళీ త్రాణాన్ని చేతివ్రేళ్లకు తగిలించుకొన్నాడు. సాటిలేని వాడియైన బాణాల గుంపుతో సాల్వుణ్ణి నిలిపినాడు. ఆ సాల్వునిపైన ఇంకా దట్టమైన అమ్ములవాన కురిపించినాడు. ఆ సాల్వుడుకూడా పూనుకొని చాలపదునైన బాణాలను ప్రయోగించినాడు. గొప్ప వీరులూ అస్త్రవిద్యాకోవిదులూ అయిన ఆ ఇద్దరిమధ్య యుద్ధం భయంకరంగా జరిగింది. ఆ యుద్ధాన్ని చూచి ద్వారకానగరంలోని ప్రజలూ సౌంభకనగరంలోని ప్రజలూ కూడ మిక్కిలి భయంతో కలత చెందినారు. ప్రద్యుమ్నుని పదునైన బాణాలచేత మర్మస్థానాలలో దెబ్బలు తిని సాల్వుడు వేగంగా మూర్ఛపోయినాడు. భూమివణకి పోయేట్లుగా రథంపై కూలినాడు. కానీ అంతలోనే ఆ సాల్వుడు మూర్ఛనుండి తేరుకొన్నాడు. 'కోపం'అనే అగ్నితో వెలుగొందినాడు. దిగ్గజాలలాంటి బలం కలిగిన రుక్మిణీ పుత్రుడైన ప్రద్యుమ్నునిపై సాల్వుడు యమునిదండం లాంటి భయంకరాలైన ఆయుధాలను ప్రయోగించినాడు. ఆ దెబ్బకు ప్రద్యుమ్నుడు మూర్ఛపోయినాడు. అప్పుడాతని సారథి అతణ్ణి వేగంగా యుద్ధభూమినుండి దూరంగా తీసుకొనిపోయినాడు.

ఈ విధంగా సారథి, మూర్ఛపోయిన ప్రద్యుమ్నుణ్ణి తీసికొనిపోయి యుద్ధరంగానికి దూరంగా రథాన్ని నిలుపుకొనిఉన్నాడు. కొంచెంసేపటికి ప్రద్యుమ్నుడు మూర్ఛనుండి తేరుకొని సారథితో "భయంకరమైన యుద్ధరంగానికి దూరంగా నన్నిట్లా తీసికొనిరావడం నీకు తగునా? శత్రువుల పరాక్రమం చూచి భయపడినావా? చెప్పు." అన్నాడు. అంతటితో ఆగకుండా ప్రద్యుమ్నుడు చెదరిపోయిన మనసుతో సారథినిచూచి ఇంకా ఇట్లాఅన్నాడు "సారథీ! యుద్ధం నుండి పారిపోవడం, పారిపోయే శత్రువును చంపడం, శరణు కోరినవాడిని రక్షించకుండా ఉండడం, యాదవవంశంలోని ఉత్తములకు కలలోనైనా ఉన్నాయా? పరాక్రమాన్ని వదిలి యుద్ధరంగాన్నుండి పారిపోతే బలరాముడూ, శ్రీకృష్ణుడూ, ఇతరరాకుమారులూ, అక్రూరుడూ మొదలైనవాళ్లు సభలో 'ఇదేమిటి?' అని నవ్వరా? పాడుపని చేసినావు. ఇంకనైనా వేగంగా సాల్వునికి ఎదురుగా సాంబుడు చారుదేష్ణుడు ఉన్నచోటుకు రథాన్ని పరుగెత్తించు."

ఈ ప్రద్యుమ్నుని మాటలకు సమాధానంగా సారథి ఇట్లాఅన్నాడు. "రథికుడూ సారథీ ఒకరి శరీరాన్ని ఇంకొకరు రక్షించుకోవలె. కాబట్టి రథికునికి అనుకూలంలేనిచోట సారథి ధైర్యంతో రథికుణ్ణి రక్షించవలె. రథికుడు కూడ తన సారథిని రక్షించికోవలె. సాల్వుని బాణాలతో బలంతగ్గిఉన్న నిన్ను ఇట్లా తెచ్చినాను. దీనికి ఓర్చుకోవలె. నా రథపుగుర్రాల గొప్పతనం చూడు." ఇట్లా చెప్పి సారథి అప్పుడు కుడికీ ఎడమకు నడుపుతూ, విచిత్రంగా గుండ్రంగా నడుపుతూ సాల్వునికి అప్రదక్షిణంగా రథాన్ని పరుగెత్తించినాడు.

దానిని సహించక సాల్వుడు, మూడు బాణాలతో సారథిని కొట్టినాడు. ఇంకా రాక్షసమాయతో చాలాబాణాలు ప్రద్యుమ్నునిపైన ప్రయోగంచినాడు. ప్రద్యుమ్నుడు ఆ మాయబాణాలన్నింటినీ ముక్కలుగా చేసినాడు. సాల్వుని ముఖంమీద వక్షంమీద ఒకేసారి భయంకరంగా బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించినాడు. బ్రహ్మాస్త్రం చేత బాధింపబడి సాల్వుడు మూర్ఛపోయి రథంమీద పడిపోయినాడు. ఆకాశంలో "హాహా" కారాలు విస్తరించినాయి. అప్పుడు దేవగణాల ప్రేరణతో నారదుడూ, వాయుదేవుడూ ప్రద్యుమ్నునివద్దకు వచ్చినారు. "వీడిని నీవు చంపలేవు. బాణాలు వేయకుండా ఊరకుండు. వీనిని నారాయణుడే పూనుకొని వధించగలడు" అన్నారు. ఆ మాటలు విని ప్రద్యుమ్నుడు బాణాలు వేయకుండా ఊరకున్నాడు. సాల్వుడు కూడ "ప్రద్యుమ్నుణ్ణి జయించలేను." అనుకొన్నాడు. అంతటితో ద్వారకా నగరపు ముట్టడిని మానివేసినాడు. తన సౌంభకాన్నెక్కి తిరిగి పోయినాడు.

ఇంతలో నీ రాజసూయాగం పూర్తిఅయింది. నేను ద్వారకకుపోయి చూస్తే అక్కడి ఉద్యానవనాలన్నీ శత్రుసైనికుల చేత నాశనమైనాయి. ప్రవేశద్వారసీమలు గుర్తు పట్టలేనంతగా మారిపోయినాయి. విప్రగృహాలలో వేదపారాయణాలు వినిపించడంలేదు. స్త్రీలెవరూ ఆభరణాలుధరించి ఉండలేదు. అట్లాంటి ద్వారకనుచూచి

ఆహుకుని కుమారుడైన మాతంౖడి వసుదేవునివల్ల ఆ సౌంభకుని విషయమంతా తెలుసుకొన్నాను. 'సాల్వుణ్ణి చంపికానీ ద్వారకలో ప్రవేశించకూడద'ని నిశ్చయించుకొన్నాను. 'ద్వారకను జాగ్రత్తగా రక్షించుకొండ'ని బలరాముడు మొదలైన వాళ్లను ఏర్పాటు చేసినాను. అప్పుడే 'ప్రయాణ భేరిని మ్రోగించుమ'ని ఆజ్ఞాపించినాను. స్వస్తివచనాలు పలికిన బ్రాహ్మణులకు నమస్కారము చేసినాను.

'శైబ్యము, సుగ్రీవము, మేఘపుష్పము, మణిఘోషమూ, అనే గుర్రాలను పూన్చిన దివ్య రథాన్ని ఎక్కినాను. పాంచజన్యశంఖారావం పంచమహావాద్యాలతో దిక్కులు చెవుడుపడేట్లుగా మ్రోగింది. ప్రజలఆశీస్సులు అందంగాఅతిశయించినాయి. ఆకాశంలో గరుడకేతనం ప్రకాశంతో ఎగిరింది. ఆ విధంగా లెక్కలేనంతటి చతురంగబలాలతో దండయాత్రకు బయలుదేరినాను. అట్లాపోయి కొండలు అడవులు సరస్సులు నదులు దాటి, మార్తికావతదేశం చేరినాను. నేనక్కడకు చేరడానికి ముందే సాల్వుడు సౌంభకమెక్కి సముద్రగర్భంలో దాగుకొన్నాడు. నేనుకూడ వదలకుండా వానివెంటనే పోయినాను. రకరకాలైన వాడిఅయిన అస్త్రాల వర్షాన్ని వ్యాపింపచేస్తూ సాల్వుని సేనతో యుద్ధం చేసినాను. వీరులైన సాల్వయోధులు కూడ లెక్కకు మిక్కిలిగా బాణసముదాయాన్ని ప్రయోగించినారు. అవన్నీ నారథాన్నీ గుర్రాలనూ అందమైన జెండాకొయ్యనూ దట్టంగా కప్పివేసినాయి. వా...న్నింటినీ నన్ను చేరనీయకుండానే పెక్కు ఆయుధాలూ బాణాలూవేసి సాల్వునితో మహాయుద్ధంచేసినాను.

ధర్మరాజా! ఆ యుద్ధంలో ఎక్కుపెట్టబ... 'శా...'మనే వింటినుండి వందలకొద్దీ బాణాలు ప్రయోగించినాను. వాటి వాడిమొనలచేత ముక్కలై రాక్షసుల కళే...లగుంపులు గాలిచేత చెదరగొట్టబడిన నీటితో తిరుగుడుపడుతూ ఉండిన సముద్రంకడుపులో పడిపోయినా... ...క్షసుల శవాలు సముద్రంలో పడడం చూడడానికి, 'సుగ్రీవుని సేనలు సేతువును నిర్మించడానికి సముద్రం... ...న కొండ లేమో?' అన్నట్లుండింది. పెద్దపెద్ద రాక్షసుల శరీరాలు సముద్రంలో కూలుతున్నప్పుడు సముద్రం ప్రళయకాలంలో ఘూర్ణిల్లుతున్నట్లుగా శబ్దము చేసింది. నా సైన్యంలో చెలరేగినధ్వనులు, భటుల సింహనాదాలతో గుర్రాల సకిలింపులతో ఏనుగుల ఘీంకారాలతో కలిగిన శబ్దం, ఆ సముద్రశబ్దాన్ని మించి మ్రోగింది.

అట్లాంటి నా సేన ఉత్సాహాన్నీ, తన సేన క్షీణతనూ సాల్వుడు చూచినాడు. సహించలేకపోయినాడు. తిరిగి సౌంభకమెక్కినాడు. నాతో మాయయుద్ధం చేయదానికి పూనుకొన్నాడు. పరశువులు, పాశాలు, అంకుశాలు, కరవాలాలు, శూలాలు, ముద్గరాలు, నా మీద పడేట్లు కురిపించినాడు. నేను కూడా పూనుకొని ఆ రాక్షసుడి శస్త్రాలను తొలగిపోయేట్లుగా చేసినాను. సాల్వుడు భయపడకుండా తిరిగి మాయచేసి నామీద

కఠినమైన రాళ్లవర్షం కురిపించినాడు. అంతేకాకుండా చీకటికలిగి వానముసురుతో చలితో కూడినరోజులనూ, బాగా వెలుతురుగా వేడిగాఉండే తెరపి రోజులనూ ఒకదాని వెంబడి ఇంకొకదాన్ని సృష్టించినాడు. ఆకాశంలో నూరుగురు సూర్యులు, నూరుగురు చంద్రులు, లక్షమంది అగ్నిహోత్రులు వెలిగేట్లు చేసినాడు. నేను నా మనసులో 'ఇదిపగలు, ఇదిరాత్రి' అని తెలుసుకోలేకపోయినాను. ధర్మరాజా! నేనందుకు ఆశ్చర్యపడుతూ సర్వమాయలనూ తొలగించగలిగిన ఆగ్నేయాస్త్రంతో ఆ రాక్షసుడు కల్పించిన మాయలన్నింటినీ తొలగించినాను.

ఆ సమయంలో ఒకడు, తాను ద్వారక నుండి వేగంగా వచ్చినట్లుగా చెప్పుకొన్నాడు. తాను ఆహుకుడు పంపగా 'వచ్చినాన'ని చెప్పి, 'సాల్వుని చేతిలో అక్కడ వసుదేవుడు బంధింపబడినాడు. నీవు ఎవడితో యుద్ధం చేస్తావు? తిరిగి పోయి ద్వారకను వసుదేవుణ్ణి రక్షించుకో." అన్నాడు. అది విని నేనదరిపడినాను. "మహాబలపరాక్రమాలు కలిగిన బలరాముడు మొదలైనవాళ్లు రక్షిస్తూఉంటే వసుదేవుడెందుకు బంధింపబడతాడు? ఇది సరియైన వార్తకాదు." అని సందేహపడుతూ మనసు చెదరి ఉండినాను. అప్పుడు రాక్షసులచేత బాధింపబడుతున్న వసుదేవుణ్ణి అక్కడ చూచినాను. ఆయన అప్పుడు, చేసిన పుణ్యం క్షీణించి భూమికి దిగివచ్చే యయాతీవలె ఆభరణాలకాంతులు తగ్గిపోగా, జుట్టు విడిపోయి, వస్త్రాలు చెదరిపోయి సౌంభకము నుండి దిగివస్తూ పాపులైన రాక్షసులచేత పీడించబడుతూఉండినట్లున్న అట్లాంటి వసుదేవుణ్ణి దూరంనుండే చూచి, మిక్కిలి భ్రాంతితో దుఃఖంతో గ్రుడ్డివాడనైపోయినాను. నాచేతిలోని విల్లు జారిపడిపోయింది. దుఃఖంచేత వశంతప్పిన దేహంతో నేను రథంమీద కూలిపోయినాను. దాన్ని చూచి భయపడి, నా సైన్యమంతా తల్లడిల్లింది. ఎక్కువగా కలతచెంది ఆక్రోశించింది.

చాలా సేపటికి నాకు తెలివివచ్చింది. సాల్వుని సౌంభకంలో వసుదేవుడు కనిపించలేదు. వెంటనే 'అది మాయ' అని తెలుసుకొన్నాను. ఆ తరువాత మాయావి అయిన ఆ సాల్వుణ్ణి చూచి కోపగించుకొని బాణాలు ప్రయోగించినాను. ఆ సాల్వుడు సౌంభకంతోసహా అదృశ్యమయినాడు. రాక్షసుల "హాహా" రవాలు దశదిశలా విస్తరించినాయి. అంతట నేను శబ్దభేదిబాణాలు ప్రయోగించి ఆ రాక్షసుల నందరినీ వేగంగా చంపివేసినాను.

అప్పుడు సాల్వుడు తన సౌంభకాన్ని ప్రాగ్జ్యోతిషపురంగా మార్చినాడు. తానుకూడ రాక్షసుడయినాడు. నాపైన పర్వతాలవాన కురిపించినాడు. కఠినమైన వంకరటింకరగా ఉండే పెద్దపెద్దరాళ్లు కలిగిన భయంకరమైన కొండలు వచ్చి నేను కలతచెందేట్లుగా నన్నుకప్పినాయి. వజ్రాస్త్రంతో వాటినన్నింటినీ తొలగించినాను.

అప్పుడు నన్నుచూచి దారుకు డిట్లాఅన్నాడు. “మహావీరుడు మాయలమారి అయిన సాల్వుణ్ణి ఉపేక్షించ వచ్చునా? యుద్ధనీతి తెలిసిన మహావీరులు అల్పుడైన శత్రువునైనా ఉపేక్షించరు కదా?”

ఇట్లా అన్న దారుకునిమాటలు విని సాల్వునిపై కోపగించుకొని చక్రాన్ని మంత్రించి సౌంభకంపైకి ప్రయోగించినాను. ఆ చక్రము నిప్పుమంటలవల్ల భయంకరమైంది. శత్రుపక్షం వహించిన రాక్షసులనూ యక్షులనూ గంధర్వులనూ దైత్యులనూ దానవులనూ కాల్చిబూడిదచేయగలిగిన భయంకరమైనది. అట్లాంటి చక్రం నేను ప్రయోగించగా ప్రళయకాలంలోని సూర్యుడిలాగా వెలిగిపోతూ ఆకాశంలో వేగంగా ప్రయాణంచేసి సౌంభకము మధ్యలోపడింది.

ఆలస్యం లేకుండా భయంకరమైన సుదర్శన చక్రాగ్నిచేత కాల్చబడి భూమిపైన పడిందా సౌంభకము. ఆ సౌంభకము అట్లాపడడం ఈశ్వరుని బాణాగ్నిచేత కాల్చబడిన త్రిపురాలవలె కనిపించింది. సాల్వుడు కూడా తీవ్రమైన చక్రవేగానికి రెండుముక్కలై నేలరాలినాడు.”

ఇట్లా ఈ కథనంతా ధర్మరాజుకు చెప్పి శ్రీకృష్ణుడు పాండవులవద్ద వీడ్కోలు పొందినాడు. సుభద్రాభిమన్యులను బంగారు రథంమీద ఎక్కించుకొని, తోడుకొని, ద్వారకకు పోయినాడు. ధృష్టద్యుమ్నుడు కూడ ద్రౌపదేయులను తోడ్కొని ద్రుపదపురానికి పోయినాడు. పాండవులు రథాలెక్కి ఆయుధాలు ధరించి, ఇంద్రసేనుడు మొదలైన మూలభృత్యులు ముందు పోతుండగా, కొన్ని వేలమంది బ్రాహ్మణులతో కామ్యకవనం నుండి బయలుదేరి, ద్వైతవనానికి పోయినారు.

**నీతి :** దైవం తలచుకొంటే రాక్షసులమాయలు చెల్లుతాయా?

**చ.** **“ప్రతినరపాలకాలు, శిశుపాలు, బలాధికుఁజంపి, దర్పసం**
**హితుఁడగుచున్న వృష్ణిఖలుఁడెక్కడ? నెక్కడ? నాతనిం జయో**
**న్నతి వెలయంగఁజంపెద రణంబున,” నంచు నలంఘ్యవిక్రమో**
**ర్జితుఁడయి, దానిచుట్టు విడిసెం జతురంగమహాబలంబుతోన్.** **ఆరణ్య 1-151**

# 7. కిరాతార్జునీయం.

(అరణ్య 1-267 నుండి 335 వరకు.)

(కిరాతరూపంలో వచ్చిన పరమశివుణ్ణి మెప్పించి పాశుపతాస్త్రాన్నిపొందిన అర్జునుని కథ.)

పాండవులు కపటద్యూతంలో రాజ్యం కోల్పోయి అడవులపాలైనారు. అడవులలో ఇడుమలు పడుతూఉండి ఒకనాడు భీముడు, ధర్మరాజుతో ఇట్లా అన్నాడు." అన్నా! మనం కష్టపడితే ఏదోవిధంగా అరణ్యవాసాన్ని పూర్తిచేయకలమేమో? కానీ, అజ్ఞాతవాసం పూర్తిచేయడం సాధ్యమా? అది సాధ్యం కాకపోతే బ్రతికినంతకాలం మనకు ఈ అరణ్యవాసం తప్పదు కదా? కాబట్టి వేరే విధంగా ఆలోచించాల్సిన అవసరముంది. సంవత్సరాలకు బదులుగా నెలలను లెక్కించడం లోకంలో ఉన్న ఆచారమే కదా? మనము అడవిలో ఇప్పటికి పదమూడునెలలు గడపినాము. ఈ పదమూడునెలల కాలాన్నీ పదమూడేండ్లుగా లెక్కించుకొందాం. ఇదేమీ ధర్మవిరుద్ధంకాదు. ఇందు కంగీరించు. వెంటనే పోయి మనరాజ్యాన్ని మనం తీసుకొందాం. అడ్డొచ్చిన వారి నందరనూ అంతంచేద్దాము."

ఈ మాటలు విని ధర్మరాజు భీముడితో, "నీకు పాండిత్యముంది. పరాక్రమముంది. ఆటోపముంది. వాటిల్లో నీకుకల ప్రతిభ చాలగొప్పది. నీవు చెప్పింది తగినపనే. అయినా ధీరుడివై నేను చెప్పే ఈ మాటలు విను. చిన్న ప్రయత్నంతో జరిగేపనిని సాహసంతోచేస్తే దోషంలేదు. కానీ ఇది మహాకార్యం. సాహసంతో సాధ్యమయ్యేది కాదు. బాగాఆలోచించి చేస్తేకాని పనిజరగదు. బాగాఆలోచించి చేసేపనులకు దేవుడుకూడా అనుకూలిస్తాడు. అందుచేత మనమిప్పుడు బాగా ఆలోచించవలసి ఉంది." అని చెప్పి ఇంకా ఇట్లా అన్నాడు.

"ధృతరాష్ట్రుని కొడుకులు దుర్యోధనుడూ మొదలైన వాళ్లంతాకూడ వీరులు. మనం వారిని ఉపేక్షించలేము. వారంతా మనలను ఎల్లప్పుడూ చంపడానికే ప్రయత్నంచేసే దుర్మార్గులు. ఇంకా కర్ణుడు భూరిశ్రవుడు మొదలైనవీరులు జయించరాని పరాక్రమం కలిగినవారు. వాళ్లంతా వారికి స్నేహితులై ఉన్నారు. మనచేత రాజసూయయాగం కోసం, ఓడించబడిన రాజులంతా పోయి, దుర్యోధనునిచేత సత్కరింపబడినారు. వారు జరుగబోయే యుద్ధానికి కాచుకొనిఉన్నారు. వారు వాడికై ప్రాణాలను విడువడానికి కూడ సిద్ధంగా ఉన్నారు. వారంతా శస్త్రాస్త్ర విద్యలలో ఈ లోకంలో ప్రసిద్ధిపొందినవారే. వినవయ్యా! భీమసేనా! కర్ణుడు యుద్ధంలో బేధించడానికి వీలుకాని కవచం కలిగిఉన్నాడు. అతడు విలువిద్యలో మిక్కిలి నేర్పు కలిగినవాడు. బాహుబలం అధికంగా కలిగిన గర్వశాలి. వాని విషయం తలచుకొంటే నాకు రాత్రిళ్లు నిద్రపట్టుదు. అంతేకాదు, భీష్మ ద్రోణ కృపాదులు వారి మీదా మన మీదా సమానమైన ప్రేమ కలిగినవాళ్లే అయినా, వారివద్ద ఉండడంవల్ల వారివైపే యుద్ధం చేస్తారు. వారు అపారమైన దివ్యాస్త్రాలలో విశారదులు. వారిని జయిస్తేకాని దుర్యోధనుణ్ణి జయించలేము."

ధర్మరాజు భీముడితో ఇట్లా చెప్పుతూ దుఃఖించే సమయంలో, వారి అదృష్టంవల్ల వేదవ్యాసుడు ప్రీతితో అక్కడకు వచ్చినాడు. వచ్చిన వ్యాసమహర్షి పాండవులకు స్వయంగా తాత. తండ్రికి తండ్రి. బ్రహ్మతో సమానమైనవాడు. లోకాలన్నింటిచేత పూజింపబడేవాడు. తానే స్వయంగా మూర్తీభవించిన ధర్మమయినవాడు. నల్లజింకచర్మాన్ని ధరించిఉన్నాడు.

వ్యాసుడిట్లారాగా పరమభక్తి కలిగిన పాండవులు, ఆయనను పూజించినారు. అటుతరువాత వ్యాసుడు ధర్మరాజుతో, "వీరులైన భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ, కర్ణుడూ, మితిలేని బలం కలిగినవారు. వారిని యుద్ధంలో చంపడం ఎంతో బరువైనపని" అని నీవనుకుంటూఉన్నావు. నీ చింతాభారాన్ని నేను మనసులో గుర్తించినాను. ఆ చింతను తొలగించడానికే నేనిప్పుడిక్కడకు వచ్చినాను. 'ప్రతిస్మృతి' అనే విద్య అధికమైనయోగంచేతనే వస్తుంది. ఇది అతిరహస్యమైనది. ఈ విశేష విద్యను నేర్చుకోవడానికి అర్జునుణ్ణిపంపు. అర్జునుడు దానితో సిద్ధిపొందుతాడు." అని చెప్పి ధర్మరాజును ఏకాంతస్థలానికి తోడుకొనిపోయినాడు. అక్కడ శాస్త్రాలలో చెప్పబడిన విధంగా ఆ విద్యను ధర్మరాజుకు ఉపదేశించినాడు. ఆ తరువాత ఇట్లా చెప్పినాడు. "ఈ 'ప్రతిస్మృతి' అనే విద్యతో అర్జునుడు తపస్సు చేస్తే తేజస్సును పొందుతాడు. ఇంద్రుడూ, యముడూ, వరుణుడూ, కుబేరుడూ మొదలైన దేవతలనూ ఈశ్వరుణ్ణి ప్రత్యక్షం చేసుకొంటాడు. వారి నుండి దివ్యాస్త్రాలను సంపాదిస్తాడు. శత్రువులను జయిస్తాడు." అని చెప్పి, ఇంకా "ఈ అడవిలో మీరు చాలకాలంనుండి ఉండడంవల్ల, చెట్లకు పూలూ పండ్లూ ఉండడంలేదు. జంతువులకుకూడా ఇబ్బందిగా ఉంది. ఒకేచోట ఎక్కువకాలం ఉండడం ఎవరికీ ప్రీతికలిగించదు. కాబట్టి మీరు ఇంకొకఅడవికి పొండి" అని చెప్పి ఆ వేదవ్యాస మునీంద్రుడు అదృశ్యమైనాడు.

ఆయన చెప్పిన మాటలు విని ఆనందించి, పాండవులు ద్వైతవనాన్ని విడిచి, తిరిగి కామ్యకవనానికి పోయినారు. అక్కడ సరస్వతీ నదీతీరంలో పర్ణశాలలు ఏర్పాటు చేసుకొని, అందులో నివసించినారు. అక్కడ కొంతకాలమున్న తరువాత ధర్మరాజు అర్జునుణ్ణి చూచి, ఇట్లాఅన్నాడు. "వేదం బ్రాహ్మణులలో స్థిరపడిన విధంగా, ధనుర్వేదం భీష్మాదులలో స్థిరపడింది. వారు శత్రువులపై విజయం సాధించినవారు. దుర్యోధనుడు వారి కిష్టమయిన సత్కారాలు చేస్తూఉన్నాడు. వారిని పూజిస్తూఉన్నాడు. కాబట్టి మనం దుర్యోధనునితో యుద్ధం ఆరంభిస్తే తప్పకుండా ఆ భీష్మాదులు మనలనెదిరిస్తారు. దివ్యాస్త్రాలు బాగా తెలిసిన వారినిజయించే ఉపాయం వేదవ్యాసులవారు నాకు చెప్పినారు. ఆయన నాకు ప్రసాదించిన 'ప్రతిస్మృతి'అనే విద్యను, నీవు నానుండి గ్రహించు. ఇతరులెవ్వరూ నిన్ను జయించలేకుండా కవచము,

కార్ముకము, ప్రాసము, ధరించు. ఉత్తర దిక్కునకు పో. తపోయోగబలంతో ఇంద్రుణ్ణి ప్రత్యక్షం చేసుకో. పూర్వం వృత్రాసురుడికి భయపడి దేవతలంతా తమ తమ ఆయుధాలను ఇంద్రునికి సమర్పించినారు. అవన్నీ ఆ ఇంద్రుని దయవల్ల నీకు లభిస్తాయి. ఆ ఇంద్రునివద్ద ఉపదేశంపొంది ఈశ్వరుణ్ణి ఆరాధించు. ఆయనదయతో కోరినదిపొందు. ఇది వేదవ్యాసులవారి ఉపదేశము."

ఇట్లా చెప్పిన ధర్మరాజు ప్రీతితో శత్రువులను జయించాలనే కోరికతో, అర్జునునికి 'ప్రతిస్మృతి' అనే విద్యను ఉపదేశించినాడు. ఆ అర్జునుడు ధైర్యంగా నియమాలను పాటించేవాడు. దీక్షపూనిన వాడు. పాపాలు లేనివాడు. అట్లాంటి ఆ అర్జునుడు 'ప్రతిస్మృతి' అనే యోగవిద్యను గ్రహించగానే మిక్కిలి తేజోమూర్తిగా ప్రకాశించినాడు. దివ్యాస్త్రాలను సంపాదించడం కోసం అన్నలచేత అనుమతి పొందినాడు. శాస్త్రాలకు అనుగుణంగా అగ్నిహోత్రుణ్ణి తృప్తి పరచినాడు. బ్రాహ్మణులు ఆయనకు స్వస్తివాచకాలు పలికినారు. ధౌమ్యుడు మొదలైన బ్రాహ్మణులనుండీ సోదరులనుండీ వీడ్కోలు పొందినాడు. తపస్సు కొరకు పోవడానికి పూనుకొన్నాడు.

అర్జునుడు గాండీవాన్ని చేతపట్టుకొన్నాడు. అక్షయబాణతూణీరాలు రెండింటినీ ధరించినాడు. అతడు ఎత్తైన భుజాలతో బంగారుకవచం తొడిగిన గొప్పశరీరం కలిగిఉన్నాడు. అట్లాంటి అర్జునుణ్ణి చూచి, అంతర్హితభూతాలు, బ్రాహ్మణులు కూడా పొంగిపోయినారు. "ఆలస్యం లేకుండా అర్జునుడు మనసులో కోరుకొన్నకోరిక ఈడేరుతుంది. విఘ్నాలేవీ లేకుండాపోతాయి" అన్నారు. అప్పుడు ద్రౌపది అర్జునుని దగ్గరకు వచ్చింది. శత్రువులనుజయించడానికి పోయే అతని ఉత్సాహాన్ని తెలుసుకొని, "అవమానాన్ని భరించలేని ఈ పాడుక్షత్రియకులంలో ఇకమీదట నాకు జన్మలభించుకుండు గాక! క్షమాగుణం కలిగిన బ్రాహ్మణ కులమునందే నాకు ఇకమీదట పుట్టువు కలుగుగాక! శత్రువులు చేసిన 'చెడ్డ అవమానం' అనే మహాసముద్రంలో మునిగిపోయిన మమ్మందరినీ ఇప్పుడు దయతో గట్టుకుచేర్చు. లోకాలన్నింటిచేత పొగడబడే అర్జునా! ఇతరులెవ్వరూ పూనుకోలేని ఈ భారాన్ని భరించడానికి సిద్ధపడినావు. నీవు మితిలేని మంచిగుణాలతో గొప్పవాడవు. నిన్ను దిక్కులూ, సూర్యుడూ, చంద్రుడూ, ఆకాశమూ, భూమీ, గాలీ, రక్షిస్తూ ఉండుగాక!" అని దీవించింది.

ఆ తరువాత ద్రౌపది ప్రేమతో అర్జునుణ్ణి, చలించిన క్రీగంటి చూపులతో చూచింది. ఆ చూపు అర్జునునికి దారిభత్యము అయింది. ఆమె అతని ఎడబాటుచేత చలించే హృదయాన్ని ఎట్టకేలకు కుదుటపరచుకొన్నది. అర్జునునకు వీడ్కోలు పలికింది.

అటుపైన అర్జునుడు ఈ శాన్యందిక్కుగా, ఒంటరిగా పోయినాడు. ఇంద్రునికి సంబంధించిన 'ప్రతిస్మృతి' అనే యోగశక్తితో అర్జునుడు వెలిగిపోతూఉన్నాడు. సకల ప్రాణకోటికూడ అతణ్ణి తేరిచూడలేకపోయింది. అట్లా వెలిగిపోతూ, అర్జునుడు హిమత్పర్వతమును దాటినాడు. ఆ మీదట గంధమాదన పర్వతాన్నికూడా దాటినాడు. వీరుడైన అర్జునుడు ఒంటరిగా ముందుకుపోతూనే ఉన్నాడు. ఆయనకు ఆ యోగవిద్య, గాండీవము, మాత్రమే తోడుగా ఉన్నాయి. అట్లా పోయిపోయి ఆయన ఇంద్రకీలాద్రిపై నడుస్తూ ఉండినాడు. అప్పుడు "భయంకరమైన శత్రువులను చంపేవాడా! అర్జునా! నీవు ముందుకు పోవద్దు." అనే మహామధురమైన శబ్దం అర్జునునికి వినిపించింది. అప్పుడు ఆకాశం నుండి వేగంగా ఎడతెగని పూలవానకురిసింది. దాని అర్జునుడు ఆశ్చర్యపడినాడు. అయినా ఆ మాటలను లెక్కచెయ్యకుండా ముందుకే పోయినాడు. అప్పుడు తనకెదురుగా ఒక చెట్టు మొదట్లో ఒక ముసలిబ్రాహ్మణుడు కూర్చుని కనిపించినాడు. ఆ బ్రాహ్మణుడు బ్రహ్మజ్ఞానంతో కూడిన గొప్ప తేజస్సు కలిగి ఉన్నాడు. అతణ్ణి చూచి అర్జునుడు నమస్కరించినాడు. ఆ తరువాత అతనికి దగ్గరలో తాను కూడ విశ్రాంతి తీసుకోవడానికి కూర్చున్నాడు. అప్పుడా బ్రాహ్మణుడు అర్జునుణ్ణి చూచి ఇట్లా అన్నాడు.

"ఎక్కడ నుండి వచ్చినావయ్యా? పుణ్యాత్మా! నీవు మచ్చలేని తేజస్సుతో ప్రకాశిస్తున్నావు. ధర్మనియమాలు కలిగినవాడవుగాఉన్నావు. నీ విక్కడ ఉండడమెందుకు? నీ విప్పటికే సిద్ధిని పొంది ఉన్నావు. నీ కిష్టమైన పుణ్యఫలితాలను గ్రహించు. ఇది శాంతంగా తపస్సు చేసుకొనేవారికి నెలవు, ఇటువంటి చోట కత్తి, కవచం, విల్లు, ఇవన్నీ ధరించి ఉండడమెందుకు? పవిత్రమైన క్షత్రియకులంలో పుట్టినవాడవా? సంతోషాన్నీ, కోపాన్నీ, వదలివేసి బ్రాహ్మణులుండే ఈ పుణ్యస్థలంలో ఆయుధాలు ధరించి ఉండవద్దు. ఈ ఆయుధాలను వదలు."

ఇట్లాఅని ఆ బ్రాహ్మణుడు అర్జునుణ్ణి ఆజ్ఞాపించినాడు. కానీ అర్జునుడా అడ్డుమాటలను లెక్కచెయలేదు. ధైర్యంతో ఏ మాత్రమూ చలించలేదు. ఆ బ్రాహ్మణుడు అతని ధైర్యానికి మెచ్చుకొన్నాడు. బ్రాహ్మణ రూపం వదలి, ఇంద్రుడు తననిజరూపం చూపించినాడు. ఆ తరువాత అర్జునునితో, "నీ కిష్టమయిన వరాలిస్తాను, సంతోషంతో కోరుకో."అన్నాడు. అప్పుడు అర్జునుడు ఇంద్రునికి మిక్కిలి భక్తితో మ్రొక్కినాడు. చేతులుజోడించినాడు. "దేవా! నీ దయవల్ల దివ్యాస్త్రాలను పొందడమే నా కిష్టమయినవరం." అన్నాడు. అందుకు ఇంద్రుడు, "అదేమి గొప్ప విషయం? నీకు దివ్యాస్త్రాల నిస్తాను. అంతేకాకుండా పుణ్యలోకాలూ, దేవత్వమూ, ఇంకా ఇతర అన్ని కోరికలు కోరుకో." అన్నాడు. దానికి అర్జునుడిట్లా అన్నాడు. "దేవేంద్రా! నా కవన్నీ ఎందుకు? నాకు మిక్కిలి ఇష్టమైనది గొప్ప అస్త్రాలను పొందడం మాత్రమే. శత్రువులు మాకు పెద్ద అవమానం చేసినారు. మా సోదరులందరూ దట్టమైన అడవుల్లో మిక్కిలి దుఃఖిస్తూఉన్నారు. వారి బాధను తొలగించడానికై అస్త్రాలు సంపాదించడానికి ఇక్కడకు వచ్చినాను. ఇప్పుడు అస్త్రాలను సంపాదించకుండా ఏవేవో వరాలు పొంది తిరిగిపోతే, లోకంలో తగినవారంతా నన్నుతిట్టరా?

ఈ మాటలు విని ఇంద్రుడు కుమారుడిపట్ల దయతో, "గొప్ప అస్త్రాలు పొందడమే నీ కిష్టమయితే, లోకాలన్నీ పొగడేవాడూ, దేవతలందరలోనూ గొప్పవాడూ, అయన ఈశ్వరుణ్ణి ప్రార్థించు. అధికమైన నీయోగశక్తితో ఆయనను ప్రసన్నుణ్ణి చేసుకో. నీవట్లా ఆయనను ప్రసన్నుణ్ణి చేసుకొంటే ఆయన అందరి లోకపాలురతోకలిసి నీ కోరిక తీరుస్తాడు." అనిచెప్పి అంతర్ధానమైనాడు.

అర్జునుడు ఇంద్రునిమాట ప్రకారం శివుని గురించి 'తపస్సు చేయాల'నుకున్నాడు. ఏకాగ్రమైన మనసుతో హిమాలయశిఖరానికి పోయినాడు. ఆ శిఖరంపై రకరకాలైన పూలూ పండ్లూకల చెట్లున్నాయి. తేట నీటితో పారేసెలయేళ్లున్నాయి. కమలాలూ కలువలూ హంసలతో నిండిన సరోవరాలున్నాయి. అట్లాంటి అందమైన తపోవనంలో ఈశ్వరుణ్ణి గురించి అర్జునుడు తపస్సుచేయడం మొదలుపెట్టినాడు. అప్పుడు అర్జునుడి హృదయం సంతోషంతో నిండి పోయేట్లుగా సురదుందుభుల శబ్దాలు వినిపించినాయి. దేవతాపుష్పాలైన పారిజాతసువాసనలతో కూడిన పిల్లగాలులు వీచినాయి.

అక్కడ అర్జునుడు ఈశ్వరుణ్ణి మనస్సులో, మాటలో, శరీరంలో కూడా నియమంగా నిలుపుకొన్నాడు. ఎడతెగకుండా త్రిరాత్రోపవాసంతో ఒకనెల తపస్సులో గడపినాడు. రెండవనెల షడ్రాత్రోపవాసంతో తపస్సు చేసినాడు. మూడోమాసంలో పక్షోపవాసం చేసి తపస్సు చేసినాడు. చేతులు పైకెత్తి, ఒకే కాలిబొటనవ్రేలిపై నిలబడి, గాలినే ఆహారంగా తీసుకొంటూ, నాలుగవనెల తపస్సు చేసినాడు. ఇట్లా మిక్కిలి భయంకరంగా తపస్సు చేస్తున్న అర్జునుణ్ణి అక్కడున్న ఋషులు చూచినారు. ఆశ్చర్యపడినారు. వారందరూ ఈశ్వరుని వద్దకుపోయినారు. ఆయనతో ఇట్లా అన్నారు.

"పరమేశ్వరా! గొప్పబలంకలిగిన అర్జునుడు ఇంతకుముందెవ్వరూ చేయనంతటి తపస్సు చేస్తున్నాడు. అతని గొప్ప తపస్సు ప్రభావంతో మంటలు పుడుతున్నాయి. ఆ మంటలలోని పొగ, మేఘాలలాగ అడవులన్నింటినీ కప్పివేసింది. అతడి తపోభారం సర్వప్రాణులకు అంతులేని ఆశ్చర్యాన్నీ, మితిలేని భయాన్నీ, కలిగిస్తున్నది. అతని కోరికను దయతో వెంటనే తీర్చి. ఆ తపోభారాన్ని తొలగించు."

ఇట్లా అన్న ఆ ఋషులమాటలు విని పరమేశ్వరుడు చిరునవ్వుతో కూడిన ముఖంతో, "వాడికోరిక నాకుతెలుసు. వాడికి ఇష్టమయిన వరాలు దయతో ఇస్తాను. వాడి మనసును సంతోషింపచేస్తాను. మీరు మీ ఆశ్రమాలకు పదండి. సుఖంగా ఉండండి." అని చెప్పినాడు.

ఆ తరువాత పరమేశ్వరుడు బంగారు రంగుగల దేహంకలవాడైనాడు. చాలా పొడవైన విల్లు ధరించినాడు. ఎఱుకురాజుగా మారినాడు. పార్వతీదేవి ఎఱుకుసాని అయింది. భూతగణాలు అరుస్తూ చెంచులయినారు. వారందరూ కురుచచేతులు కలిగినవారయినారు. వారికి మిడిగ్రుడ్లున్నాయి. మొరటురూపాలు ధరించినారు. తడకఱ్ఱలతో చేసిన విల్లులను ధరించినారు. వాళ్లభార్యలందరూ చెంచితులుగా

మారినారు. ఆ పరివారమంతా శివుని ఎదుటా, ఇరు ప్రక్కలా నిలబడినారు. అప్పుడా అడవి అంతా దద్దరిల్లేట్లు శివుడు వేటకు బయలుదేరినాడు. ఆ అడవిలోని జంతువులూ, పక్షులూ, భయంతో ఉన్నచోటునే కదలక మెదలక అణగిఉండినాయి. ఆ విధంగా అగ్నిని కన్నుగాగల శివుడు, ఆటవిక సేనతో కూడి వేగంగా సవ్యసాచిని సమీపించినాడు.

అప్పుడు ఈశ్వరునిచేత ఆజ్ఞాపించబడి, 'మూకుడ'నే రాక్షసుడు పందియైనాడు. భయంకరమైన పందిరూపం దాల్చిన ఆ మూకుడు అర్జునుణ్ణి చంపడానికి పూనుకొని మీదికి పరెగుత్తుకొని వచ్చినాడు. పుణ్యాత్ముడైన ఆ అర్జునుడు ఆ పందిని దూరంనుండే గమనించినాడు. గొప్పవాడై గాండీవంయొక్క అల్లెత్రాటిని మ్రోగించినాడు. దగ్గరకువస్తే కొట్టడానికి పూనుకొని ఉద్వేగంతో నిలబడినాడు.

ఆ పందికూడా ప్రయోగించబడిన బాణంలాగా, ఆ క్షణంలోనే మిక్కిలి వేగంతో అర్జునుణ్ణి సమీపించింది. "దాన్ని కొట్టవద్దు." అని ఎఱుకురాజు అడ్డుచెప్పినాడు. కొట్టకపోతే మీదపడుతుంది. అందుచేత ఆ ఎఱుకురాజు మాటలను లెక్కచెయ్యకుండా, అర్జునుడు బలమైనబాణంతో పందిని కొట్టినాడు. అంతకుముందే పరమశివుడుకూడా ఆ పందిని తనబాణంతో కొట్టినాడు. ఈ విధంగా కొండవాలుపై వేగంగా పడే భయంకరమైన పిడుగులలాగా ఒక్కసారిగా వారిద్దరి భయంకరమైన బాణాలు రెండూ ఆ పందిపై పడినాయి. ఆ రెండుబాణాలు ఒకేసారి పంది కిరువైపులా తాకినాయి. ఆ రెండు బాణాల తాకిడికి, ఆ పంది శక్తి నశించి, గిరగిరా తిరిగింది. ఆ తిరగడం పాల సముద్రాన్ని చిలికినప్పుడు మందరపర్వతం తిరిగినట్లుగా అనిపించింది. దెబ్బతిన్న పంది రూపంలోని మూకాసురుడు, తన నిజరూపం ధరించి అదృశ్యుడైనాడు. అప్పుడు అర్జునుడు ఆశ్చర్యపడినాడు. ఎదురుగా చాలా పొడవైన వింటిని ధరించిన ఒకపురుషుణ్ణి చూచినాడు. ఆతడు మేరుశిఖరంవంటి ఆకారాన్నికలిగిఉన్నాడు. అపారమైన కిరాతభటులతో కూడి ఉన్నాడు. వేలకొలది ఆటవికయువతులు ఆయన చుట్టూఉన్నారు. ఆయనను చూచి అర్జునుడు. "నీవెవరవు? మనుషులు తిరగని ఈ అడవిలో ప్రియమైన స్త్రీలతో కూడి, ఎందుకు తిరుగుతున్నావు? అంతేకాకుండా నేనుకొట్టిన పందిని నీవుకూడాకొట్టి, వేటధర్మాన్ని ఎందుకు అతిక్రమించినావు? నిన్నిప్పుడు నావాడిబాణాల పాలుచేస్తాను."

అందుకు ఎఱుకరాజు నవ్వుతూ "నేను ఆ పందిని కొట్టినాను. అది నా బాణం దెబ్బకు చచ్చింది. నీవు మదించిన నీచునివలె ఉన్నావు. ఆ విషయం తెలిసికూడ, కలతచెందకుండా నీకు లేని పరాక్రమాన్ని ఉన్నట్లుగా చాటుకొంటున్నావు. ఇది తగునా? మాటలనవసరము. శౌర్యముంటే యుద్ధానికి పూనుకో. నీ భుజబలాన్నిప్పుడే లేకుండాచేస్తాను." అంటూ ఈశ్వరుడు ఆగకుండా బాణాలువేసి, అర్జునుణ్ణి ఎదుర్కొన్నాడు.

అప్పుడు శత్రువుల అహంకారాన్ని నిర్మూలించే అర్జునుడు, బాణాలవానజల్లును భయంకరంగా కురిపించినాడు. కానీ పరమశివుడు మహాబలవంతుడు కదా? అతడు వర్షానికి చలించని కొండలాగా, ఆ బాణవర్షానికి ఏమీచలించలేదు. అంతేకాదు తనశరీరంలో ఎక్కడా గాయంకూడ కలుగలేదు. అప్పుడు బాగాగర్వంతో ఉన్న ఆ ఎఱుకతేడును చూచి, అర్జునుడు తనమనస్సులో, "ఇతడు సాటిలేని మహిమతో కూడుకొనిఉన్నాడు. ఈతడు దేవేంద్రుడైనా కావాలి. పరమశివుడైనా కావాలి. లేకపోతే కుబేరుడైనా కావాలి. అట్లాకాక వేరెవరైనా అయితే, నా భుజశక్తితో ప్రయోగించిన బాణాలవేగాన్ని సంహించి, ఈ విధంగా గాయాలుకూడలేకుండా, మూర్ఛపోకుండా, ఇంతసేపుండగలడా? నేను ప్రయోగించిన బాణాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. అవన్నీకూడా ఎదుర్కొనడానికి వీలు కానివి. కానీ అవన్నీ వ్యర్థమవుతున్నాయే? ఇవి చూస్తే మూర్ఖునిపై ప్రయోగింపబడిన సూక్తులలాగా అయిపోయినాయి." అని అనుకున్నాడు. అంతే కాదు. ఇంకా ఇట్లా అనుకున్నాడు.

"ఇతనికి దెబ్బలే తగలడంలేదు. కానీ అదేసమయంలో ఈ ఎఱుకువేసే బాణాలు నా మర్మాలను భేదిస్తున్నాయి. ఇవి సామాన్యమైన బాణాలుకాదు. దివ్యాస్త్రాలను పోలి ఉండవచ్చు? ఈ పర్వతముపైన దేవతలు నివసిస్తుంటారు. కాబట్టి ఈతడు కిరాతునిరూపంలో ఉన్న ఎవరైనా ఒక దివ్యపురుషుడు అయిఉండవలె." అనుకుంటూ పిడుగులవంటి బాణాలు ఆ ఎఱుకపైన ప్రయోగించినాడు. ఖాండవదహనకాలంలో అగ్నిదేవుడు తనకిచ్చిన అక్షయ తూణీరాలు, ప్రళయకాలంలో నీళ్ళులేకుండాపోయిన సముద్రాలలాగా, బాణాలులేకుండా పోయినాయి. "ఇది ఏమి అద్భుతమో?" అనుకున్నా దర్జునుడు. కోపగించుకొన్నాడు. గాండీవాన్నే ఎత్తిపట్టుకొని కిరాతుడిపైకి ఉరికినాడు. అప్పుడు గాండీవంకూడా లేకుండాపోయింది. అర్జునునికి అపరిమితమైన కోపం వచ్చింది. ఆ అర్జునుడు శత్రువులను బాధించేవాడు. పూనికతో ఎఱుకు దగ్గరకుపోయి కత్తితో తలపై కొట్టినాడు. ఆ కత్తికూడా వ్యర్థమైంది. అర్జునుడు వదలకుండా యుద్ధంలో మిక్కిలి గర్వంకలిగిన ఆ ఎఱుకుపై చెట్లూరాళ్ళూ విసరినాడు. అప్పుడవన్నీ ఆశ్చర్యకరంగా అతడిశరీరంలో అణగారిపోయినాయి. వెంటనే భయంకరమైనబలం పరాక్రమం కలిగిన ఆ అర్జునుడు శివుడిపై కలబడి, పిడికిటి గ్రుద్దులతో యుద్ధంచేసినాడు. అతడి గొప్ప పరాక్రమాన్ని ఆ ఎఱుకులందరూ హృదయాలలో ప్రశంసించినారు. శివుడు తనదివ్యదేహంతో అర్జునుడి శరీరాన్ని నొప్పించినాడు. అంతట అర్జునుడు బాధించబడినదేహంతో మూర్ఛపోయి, భూమిపైన పడిపోయినాడు.

ఆ తరువాత వరాలిచ్చే శివుడు అర్జునుడి ధైర్య సాహసాలను మెచ్చుకొన్నాడు. అర్జునుడికి నిజరూపంలో ప్రత్యక్షమయినాడు. శివుడి తలపైన వెంట్రుకలు కిరీటంలాగా జడలుకట్టి ఉండినాయి. ఆ జడలపైన చంద్రవంక ఉంది. చేతిలో త్రిశూలముంది. విషంచేత నల్లనైన గొంతుఉంది. పెద్దఏనుగుతోలును బట్టలాగా

కట్టుకొన్నాడు. మూడవకన్నుకూడాఉంది. దండలాగా పాము ఆయనమెడలోఉంది. ఈ విధంగా శివుడు నిజరూపంతో అర్జునునికి ప్రత్యక్షమై, "అర్జునా! క్షత్రియుల్లో ఇంకెవ్వరూ ఎక్కడా నీ యంతటి శౌర్యధైర్యవంతులు లేరు. నీ తపస్సుకూ నీ క్షాత్రగుణానికీ మెచ్చుకొన్నాను. నీ కోరిక తీరుస్తాను. దేవతలు, రాక్షసులు, మనుష్యులు కలిగిన జగత్తంతటినీ నీవే జయిస్తావు. నా స్వరూపాన్నిచూడు." అని అర్జునునికి దివ్యదృష్టిని ఇచ్చినాడు. అర్జునుడు ఈశ్వరుని విశ్వరూపాన్ని దర్శించి ధన్యుడైనాడు. శివుడికి సాష్టాంగనమస్కారము చేసినాడు. ఆ తరువాత శివుణ్ణి మిక్కిలి భక్తితో స్తుతించినాడు. ఆ తరువాత ఇట్లా అన్నాడు. "నీ వెవరో 'ఒక ఎఱుకవాడవ'నుకొని, 'నీవ'ని తెలియక, మూర్ఖంగా యుద్ధం చేసినాను. ఓ పరమశివా! నా తప్పు సహించు. నీ ప్రవర్తనను ఎవరైనా సంపూర్ణంగా తెలుసుకోగలరా?"

ఇట్లా ప్రార్థించిన అర్జునుడిపై పరమశివుడు దయతోకూడిన చూపులుచూచి, అతడికి తృప్తిని కలిగించినాడు. తరువాత అర్జునుని చేయిపట్టుకొని పరమశివుడిట్లా అన్నాడు. "ఓ ధనంజయా! నీ తప్పును క్షమించినాను. లోకాతీతమైన నీ పరాక్రమాన్ని మెచ్చుకొన్నాను. పూర్వజన్మలో నీవు 'నరుడు' అనే దేవఋషివి. అప్పుడు నారాయణుడు అనే మహాఋషికి ప్రాణమిత్రుడవు. మీ రిద్దరూ బదరీవనంలో ఎన్నోవేలఏండ్లు తపస్సుచేసిన మహానుభావులు. మీ ప్రభావంవల్లనే ఈ లోకాలన్నీ కాపాడబడుతూ ఉన్నాయి. ఈ గాండీవం పూర్వంకూడా నీదే. దేవేంద్రుని పట్టాభిషేకకాలములో జరిగిన దేవదానవయుద్ధంలో నీవీ గాండీవంచేతనే అనేకమంది రాక్షసులను సంహరించినావు. ఇప్పుడు నా మాయచేత నీ గాండీవాన్ని అక్షయతూణీరాలను కనబడకుండా చేసినాను. ఇవిగో వాటిని తిరిగి నీకిస్తున్నాను. ఇక నీకిష్టమైన వరంకోరుకో, ఇస్తాను."

పరమశివు డిట్లా అనగా అర్జునుడు, "ఓ ముక్కంటీ! ఇందుధరా! నీవు నాకు ఇష్టమైనవరం 'ఇవ్వాల'నుకుంటే అస్త్రాలన్నింటికంటె భయంకర దివ్యాస్త్రమైన పాశుపతాస్త్రాన్ని దయతో ప్రసాదించు. ఈ 'పాశుపతాస్త్రమూ మరియు బ్రహ్మశిరమూ' అనే అస్త్రాలు ప్రళయకాలంలో మాత్రమే ప్రయోగించబడి జగత్సంహారాన్ని చేస్తాయి. పాశుపతం మంత్రపూర్వకంగా ప్రయోగిస్తే లక్షలకొద్దీ ఈటెలు గదలు విష సర్పాలవంటి బాణాలు పుట్టుతాయని విన్నాను. నీ దయవల్ల పాశుపతాస్త్రాన్నిపొంది దైత్య, దానవ, యక్ష, రాక్షస, పిశాచగణాలను, వీరాధివీరులైన భీష్మ ద్రోణులను జయించగలను. సహజ కవచకుండాలాలతో పుట్టిన కర్ణుణ్ణికూడా చంపుతాను." అని ప్రార్థించినాడు.

ఈశ్వరుడు దయచూపి విశుద్ధాత్ముడైన అర్జునునికి మంత్రము, ధ్యానము, జపము, హోమములతోపాటు తొడగడం, విడవడం, వెనుకకు మరలించడంతోసహా పాశుపతాస్త్రాన్ని ఇచ్చినాడు. "ఈ పాశుపతాస్త్రానికి అసాధ్యమైందేదీ లేదు. దీనిని అల్పులపై ప్రయోగిస్తే జగత్తును నాశనం చేస్తుంది.

దీని పరిజ్ఞానం ఇంద్రుడూ, కుబేరుడూ, వరుణుడూ, యముడు మున్నగువారికికూడా తెలియదు. అట్లాంటప్పుడు మానవమాత్రులు తెలుసుకోవడం అసాధ్యం కదా? ఈ దివ్యాస్త్రంచేత నీవు లోకాలన్నింటినీ జయిస్తావు." అని ఈశ్వరుడు అర్జునునికి వరమిచ్చి అదృశ్యమైనాడు.

అర్జునుడిచేతిలో వేయిసూర్యమండలాల కాంతితో ఆ పాశుపతాస్త్రం వెలిగిపోయింది. దాన్ని చూచి దైత్యులు, దానవులూ, యక్షులూ, రాక్షసులూ మిక్కిలి భీతిచెందినారు. సముద్రాలతో కొండలతో సహా భూమి అంతా 'దిర్దిరా'తిరిగింది.

ముక్కంటి శరీరాన్ని తాకడంచేత తనశరీరం పావనమై, పాపరహితమై, ప్రకాశవంతమై, బలసంపన్నమైనందుకు అర్జునుడు మిక్కిలి సంతోషించినాడు. "స్థిరకజీవినై బ్రతికినాను. పరమశివుడి దేహాన్ని ముట్టుకొనకలిగినాను. నా జన్మ ధన్యమైంది. ఈ వేళ ధర్మరాజుకు శత్రువులపై విజయం సంప్రీతిగా లభించినట్లైంది. సర్వలాభాలతో ఘనంగా భూమండలరాజ్యమంతా ఆయనకు లభించింది." అనుకుంటూ అర్జునుడు సంతోషపడినాడు.

క. వినవయ్యా! కర్ణుగర్వం బని నాతఁడభేద్యకవచుఁడగుటయు, విలునే
ర్పునతనిబాహువిక్రమమును దలఁచిననాఁడు గన్నుమొగుడదు నాకున్. **1-270**

చ. పటువిశిఖంబునం ద్రిదశపాలతనూజుఁడు పంది నేసె; ము
న్నట పరమేశ్వరుండును రయంబున దానిన యేసె; నిట్టు లో
క్కొటఁబడియెన్ హరార్జునుల ఘోరశరంబులు పందిపైఁ, గుభృ
త్తటముపయిన్ వడింబడు నుదగ్రమహాశనులట్ల మ్రోయుచున్. **1-305**

క. హరుశరమును నరుశరమును, సరి నిరుపక్కియలు దాకి, జవమతి, శరసం
భరమునఁదిరిగె వరాహము, శరనిధి మథనమున ఁదిరుగు శైలమపోలెన్. **1-306**

క. త్రినయనగాత్రస్పర్శనమున, నిజగాత్రము పవిత్రమును, ముక్తాఘం
బును, నతితేజోవీర్యంబును, నైనఁబృథాసుతుండు ముదితుండగుచున్. **1-333**

క. మంటి; హరుదేహమంటంగంటి; నుమాధీశు, నమరకంటకహరు, ము
క్కంటి,ఁగఱకంఠు, జూడంగంటి; ఁగృతార్థుండనైతి,ఁగడుఁబుణ్యమునన్. **1-334**

## 8. అర్జునుడు - బృహన్నల.

**(అరణ్య 1-351 నుండి 368 వరకు.)**

అర్జునుడు ఈశ్వరునిచేత పాశుపతాస్త్రాన్ని పొందినాడు. అందుకు ఇంద్రుడు సంతోషించినాడు. తన రథసారథి మాతలిని తనరథంతోపాటు పంపినాడు. 'అర్జునుణ్ణి ఇంద్రలోకానికి తోడుకొని రమ్మ'న్నాడు. మాతలి అర్జునుని వద్దకు వచ్చినాడు. "దేవేంద్రుడు తనరథాన్ని నిన్ను తేవడానికి పంపినాడు." అని చెప్పినాడు. ఆ రథమెక్కి అర్జునుడు అమరావతి చేరినాడు. ఆయన అట్లా అమరావతికి చేరినప్పుడు, "ఈ అర్జునుడు 'నరుడ'నే 'ఆదిముని' అనీ, 'ఇంద్రుని కుమారుడ'నీ, 'కృష్ణుని సహాయం కలిగినవాడ'నీ, 'పరమశివుడిచేత వరాలు పొందినవాడ'నీ, దేవతలంతా వచ్చి అర్జునుణ్ణి ప్రేమతో చూచినారు.

అర్జునుడువచ్చి ఇంద్రునికి నమస్కారము చేసినాడు. ఇంద్రుడు కుమారుణ్ణి కౌగిలించుకొన్నాడు. ఆనందంగా తనఒడిలో కూర్చోపెట్టుకొన్నాడు. దేవేంద్రునిఆజ్ఞతో అర్జునుణ్ణి దేవతలు, గంధర్వులు, సిద్ధులు, విద్యాధరులు మిక్కిలి ప్రేమతో పూజించినారు. ఆ తరువాత దేవేంద్రుని ఆజ్ఞతో అర్జునుడు ఒక మణిమయమై మహనీయమైన మందిరంలో ఆనందంగా సంగీత గోష్ఠిలో కాలం గడుపుతూ ఉండినాడు.

అప్పటికి పొద్దుక్రుంకేవేళ అయింది. చంద్రుడుదయించినాడు. చిక్కటి వెన్నెలతో చంద్రుడు దిక్కులనే స్త్రీలను అలంకరించినాడు. ఆ సమయంలో 'ఊర్వశి' అనే అప్సరఃకాంత, ఇంద్రుని ఆనతితో, ఆ మందిరానికి వచ్చింది. ఆమె వెన్నెలవంటి తెల్లని చీరకట్టింది. మృగమదం (కస్తూరి), కర్పూరము, కుంకుమపువ్వుతో బాగాకలుపబడిన చందనం పూసుకొన్నది. పలురకాలైన సువాసనలతో కూడిన పూలచెండ్లతో అలంకరించుకొన్నది. మణులతోకూడిన ఆభరణాలను ధరించింది. స్థిరమైన మెరుపు తీగలాగా ప్రకాశించింది. మణులుపొదిగిన కాలిఅందెల 'ఘళంఘళ' శబ్దాలూ, చేతికంకణాల 'ఘణ ఘణత్కా'రాలు, వడ్డాణంలోని చిరుగంటల 'క్రీంకా'రాలు, మన్మథుని ఆజ్ఞనుతెలియజేసే తప్పెటశబ్దాలలాగా మ్రోగుతున్నాయి. ఆమె మెల్లమెల్లగా నడచుకుంటూ ఆ మందిరానికి వచ్చింది. అర్జునునితో సంగమాన్నికోరి వచ్చిందామె.

అట్లావచ్చిన ఊర్వశిని దూరంనుండే చూచినాడు అర్జునుడు. చూచిన వెంటనే భయమూ, భక్తీ, తత్తరపాటులతో ఆసనమునుండి లేచినాడు. ఎదురేగినాడు. సాష్టాంగనమస్కారము చేసినాడు. ఆ తరువాత చేతులు జోడించి, "అమ్మా! నీవు నాపైగల పుత్రప్రేమతో, మనస్సులో నన్నభిమానించినావు. నాకు శుభాన్ని కలిగించడానికి సంతోషంతో ఇక్కడకు వచ్చినావు. నా జన్మధన్యమైంది" అన్నాడు.

ఆ మాటలు విన్న ఊర్వశి, 'తన కన్నుల'నే తుమ్మెదలచేత, 'అతని సౌందర్యమ'నే తేనెను త్రాగింది. వలపుతమకంతో గొప్పగొప్ప ధర్మాలు తెలిసిన అర్జునునితో ప్రేమగా ఇట్లాఅన్నది. "సాటిలేని పరాక్రమవంతుడవైన అర్జునా! నీ గొప్ప గుణాలను మునుపు నారదుడు మున్నగు మహర్షులు చెప్పగా

విన్నాను. ఆనందంగా 'నీ సంగమ మెప్పుడా?' అని కోరుకుంటూ ఉండినాను. అవకాశం దొరకగానే ప్రేమగా కోరికతో వచ్చినాను. ఇట్లా నేను నీ సంగమాన్ని కోరుతూ ఉండగా, నన్ను నీవు 'తల్లినం'టున్నావు. ఏదో ఒక న్యాయాన్ని వంకరమాటలతో పలుకుతున్నావు. నీకు నేనేనాటి తల్లిని? నిజం చెప్పు. దేవలోకంలోని వేశ్యలమైనమాకు, ఇట్లాంటి న్యాయాలుండవు. ఇక్కడ వావివరసలు వెదకకూడదు. ఈలోకంలో స్త్రీలూ, పురుషులూ విచ్చలవిడిగా శృంగారసంభోగాలను అనుభవిస్తారు. ఇక్కడ ఇది తప్పులేని ఆచారము. నీవుకూడ దేవలోకానికి వచ్చినప్పుడే దేవతా పురుషుడవయినావు. కాబట్టి అనుమానాలేమీలేకుండా, నా కోరిక తీర్చు. ఇక్కడ మనోహరమైన ప్రదేశాలున్నాయి. మందారవృక్షాల సుకుమారమైన పువ్వులున్నాయి. వాటిలోని తేనెలను త్రాగి మదించిన తుమ్మెదలున్నాయి. ఈ మదించిన తుమ్మెదల పాటలతో ఈ మనోహర ప్రదేశాలు ఇంకా మనోహరంగాఉంటాయి. ఇవికాక మేరుపర్వత సానువులలో గుహలున్నాయి. పిల్లతెమ్మెరలు వీచే నందనం, మొదలైన ఉద్యానవనాలున్నాయి. మందాకినీతీరంలో మణులతో నిర్మించిన అరుగులున్నాయి. ఆ అరుగులమీదకు మందాకినిలోని బంగారుతామరలు ఎడతెగకుండా సువాసనలను వెదచిమ్ముతూ ఉంటాయి. ఆ పూలసువాసనలతోకూడిన పిల్లగాలులు నిరంతరం ఆ అరుగుల మీదకు వస్తుంటాయి. వెన్నెలలతో సుందరమైన ఇసుకతిన్నెలున్నాయి. ఈ అందమైన ప్రదేశాలే కాకుండా దేవతలు విహరించే ప్రదేశాలు ఇంకా ఎన్నోఉన్నాయి. ఆ సుందరమైన ప్రదేశాలలో నన్ను ఎడతెగకుండా స భోగించి, 'సౌఖ్యమ'నే సముద్రంలో తేలిఆడించు."

ఊర్వశి ఈ విధంగా ప్రణయపారవశ్యంతో అర్జునుణ్ణి రెచ్చగొట్టి మాట్లాడింది. 'అధర్మమేమి లేద'ని వివరించింది. అయినా అర్జునుడు వికారంచెందలేదు. ధైర్యం విడనాడలేదు. ఆమెతో "ఓహో! ఈ విధమైన ధర్మానికి హానికలిగించే మాటలు మాట్లాడడంతగునా? 'హరిహరీ!' మనసులో న్యాయాన్ని గురించి ఆలోచించకుండా, నన్ను నీవు ఇట్లా మాట్లాడడంతగునా? లోకాలను పుట్టించడం, వర్ధింపచేయడం, సంహరించడం, చేయగలిగిన దేవతలు ఎట్లా నడుచుకొన్నా తప్పులేదు. కానీ నేను కర్మభూమిలో పుట్టినవాడను. మంచి చేసేవాడిని, అట్లాంటి నాకు ఇచటి ఆచారం తగిందికాదు. మా వంశకర్త అయిన పురూరవునకు భార్య వయినందుననూ, ఇంద్రునికి పరిచారికవు (బోగస్త్రీవి) అయినందుననూ, నీవు నాకు తల్లివనడంలో సందేహంలేదు. తల్లీ! నన్ను నీవు పుత్రవాత్సల్యంతో చూడు." అన్నాడు.

మన్మథబాణాలచేత పీడించబడిన ఊర్వశి అర్జునునిపై కోపగించుకొన్నది. కళ్లు ఎర్రబడినాయి. అర్జునుణ్ణి చూచి, "నేను కామించి వస్తే నా కోరికను విఫలం చేసినావు. నీవు భూలోకంలో మానంలేకుండా, స్త్రీల మధ్యలో నపుంసకుడవై ఉండు." అని శపించి, తన ఇంటికి పోయింది.

ఉదయాన్నే ఇంద్రుడు ఈ విషయమంతా తెలుసుకొన్నాడు. అర్జునుణ్ణి ఓదార్చదలచుకొన్నాడు. "కుమారా! నీ వంటి ధైర్యవంతుణ్ణి ఎప్పుడూ ఏ యుగంలోనూ చూడలేదు. నీవు ధర్మానికి మాత్రమే స్వాధీనమైన మనసు కలిగినవాడవు. నీవు ఇంద్రియాలపై సాధించిన విజయం మునులుకూడా కీర్తించదగినది." అని కుమారుణ్ణి పొగడినాడు. ఇంకా, "పుణ్యాత్ముడా! ఊర్వశి ఇచ్చినశాపం భూమిపైన అనుభవించవలసినదే. అయినా నీవు చింతించవద్దు. ఇది నీకు వరంతోసమానమైనది. ఇంక మీ పదమూడవయేడున ప్రతిజ్ఞానుసారం మీరు అజ్ఞాతవాసం చేయవలసిఉన్నదికదా? ఆ అజ్ఞాతవాస సంవత్సరంలో నీ నపుంసకరూప నీవు ఇతరులకెవరికీ తెలియకుండా ఉండడానికి చక్కగా ఉపయోగపడుతుంది. ఆ కాలంలో రాజకన్యలకు నాట్యం నేర్పుతూఉండు. ఆ సంవత్సరకాలం పూర్తికాగానే, శాపంనుండి విముక్తి పొందు." అని అనుగ్రహించినాడు.

ఆ తరువాత చాలా ప్రేమతో చిత్రసేనుడనే గంధర్వరాజు వద్దకు అర్జునుణ్ణి పంపినాడు. అర్జునుడాయనవద్ద గౌరవంగా సంగీతము, వాద్యాలు, నృత్యం నేర్చుకొన్నాడు. ఆయనవద్ద అయిదేండ్లకాలము ఈ విద్యలను నేర్చుకొన్నాడు.

పదంపడి పాండవులు విరాటనగరానికి అజ్ఞాతవాసంకోసం 'పోవాల'నుకున్నప్పుడు అర్జునుడికి నపుంసకరూపం సిద్ధించింది. దాంతో ఆయనను కనుక్కోవడం ఎవరికీ సాధ్యంకాకుండా పోయింది. ఆ కాలంలో తనపేరును అర్జునుడు బృహన్నలగా ఉంచుకొన్నాడు. విరాటరాజు కొలువులో ఆయన కూతురు ఉత్తరకు, సంగీతము, నృత్యమూ, వాద్యాలు నేర్పుతూ, ఆ అజ్ఞాతవాస సంవత్సరం గడపినాడు. చిత్రసేనుడివద్ద నేర్చుకొన్న విద్యను అర్జునుడు ఇక్కడ ఉపయోగించుకొన్నాడు. ఆ సంవత్సరం పూర్తికాగానే తిరిగి పురుషపుంగవుడయినాడు. ఆ తరువాత వెంటనే, భీష్మ ద్రోణ కృప కర్ణ దుర్యోధనాదులందరనూ జయించి విరాటరాజు గోవులను విడిపించినాడు.

**నీతి :** శీలము ఎప్పటికీ మేలే చేస్తుంది.

**క.** **"నీయట్టి ధైర్యవంతుని, నే యుగముల నైనఁ గాన మెన్నందును; ధ**
**ర్మాయత్తమతివి, మునులకు నీ యింద్రియ జయము గీర్తనీయము తండ్రీ!** **1-366**

## 9. నలదమయంతుల కథ.

**(అరణ్య పర్వము - ద్వితీయాశ్వాసము 3 నుండి 230 పద్యాల వరకు.)**

పాండవులు అరణ్యవాసంలో ఉండగా 'బృహదశ్వుడు' అనేముని వారికడకు వచ్చినాడు. ధర్మరాజు ఆయనతో "ఇంటినీ రాజ్యాన్నీ బంధువులనూ వదలి జంతువులతో కలిసిపోయి అడవుల్లో మాలాగా కష్టపడిన రాజులింకెవరైనా ఉన్నారా?" అనగా ఆయన ఇట్లాఅన్నాడు. "దేవతలతో సమానమైన తమ్ములతో భార్యతో బ్రాహ్మణులతోవచ్చి నీవు అరణ్యవాసం చేస్తున్నావు. కానీ పూర్వం 'నలుడ'నేరాజు నీ లాగే జూదమాడి తన వైభవాన్నంతా 'పుష్కరుడ'నే వాడికి ఓడి ఒంటరిగా అడవులలో తిరిగి, కష్టాలనుభవించలేదా?" అంటూ ఈ నైషధకథను (నలదమయంతుల కథను) ధర్మరాజుకు చెప్పినాడు.

పూర్వము ఒకానొకకాలంలో నిషధదేశాన్ని 'వీరసేనుడ'నే రాజు పరిపాలిస్తూ ఉండేవాడు. ఆ వీరసేనుడి కుమారుడే నలుడు. ఈ నలుడికి అనేకాక్షౌహిణులసేన ఉండేది. ఈతడు ఇతరులెవ్వరూ జయించలేని తేజస్సు కలిగినవాడు. రాజులందరనూ జయించినవాడు. బ్రాహ్మణులకు మేలుచేసేవాడు. తన పరిపాలనలో బ్రాహ్మణుల కెప్పుడూ ఆధిక్యం కలిగించేవాడు, ఇన్ని గొప్పగుణాలున్నా అతడు నిరంతరం 'జూదం' అనే వ్యసనంలో ప్రీతికలిగి ఉండేవాడు.

అదే సమయంలో విదర్భదేశానికి రాజు భీమసేనుడు. అతడికి సంతానం కలుగలేదు. అందుకోసం వరుసగా వ్రతాలుచేస్తూ ఉండేవాడు. ఆ క్రమంలో తాను తనభార్యతో కలిసి 'దముడ'నే మునిని ఆరాధించినాడు. అందుకాయన సంతోషించి ఇచ్చిన వరంవల్ల భీముడు ఒక కూతురినీ ముగ్గురు కొడుకులనూ పొందినాడు. ఆ దముడిమీది గౌరవంతోనూ, కృతజ్ఞతతోనూ, తన పిల్లలకు దమయంతి, దముడు, దాంతుడు, దమనుడు' అనే పేర్లు పెట్టుకొన్నాడు. వారిలో కూతురు దమయంతి విశేషరూప లావణ్యాలను సంతరించుకొన్నది. ఆమె మిక్కిలిసద్గుణాలు కలిగిఉండేది. ఆమెకు దేవకాంతలవంటి నూరుగురు చెలికత్తెలుండేవారు. ఆమె ఆ విధంగా మిక్కిలివైభవం కలిగిఉండేది.

ఇట్లా ఉండగా దమయంతికి నలుణ్ణి గురించీ, ఆయన గుణగణాలగురించీ తెలిసింది. నలునికి కూడ దమయంతినిగురించి వివరాలుతెలిసినాయి. ఇదంతా ఇరుదేశాలజనులు ఒకరికొకరు చెప్పుకుంటూండడంవల్ల తెలిసింది. ఇట్లా తెలియడంవల్ల ఒకరి పైనొకరికి ప్రేమభావం అంకురించింది.

ఒకనాడు నలుడు దమయంతి గుణాలే గుర్తుచేసుకొంటూ మదనతాపాన్ని భరించలేకుండా ఉండినాడు. ఆ స్థితిలో నలుడు తనఉద్యానవనంలో తిరుగాడుతూఉండగా, ఆకాశంనుండి ఒకహంసలగుంపు నేలవ్రాలింది. వీరసేనపుత్రుడూ, వీరుడూఅయిన నలుడు ఆ హంసల నడకల సొగసును గమనించినాడు. మురిసిపోయినాడు. వాటిని 'పట్టుకోవాల'నుకొన్నాడు. ఎగిరి ఎగిరి అందులోని ఒక హంసను ఎగిరి

పోనీయకుండా పట్టుకోగలిగినాడు. అప్పుడు మిగిలిన హంసలన్నీ పైకెగిరిపోయినాయి. కానీ నలుడి చేతికి చిక్కిన హంసను వదిలి పోలేకపోయినాయి. ఆకాశంలో మబ్బుతునకలు కదలినట్లు కదలుతూ అక్కడక్కడే తిరుగాడుతూ ఉండినాయి.

నలుడిచేతికిచిక్కిన హంస, 'ఆ నలుడు తనకేమైనా కీడుచేస్తాడేమో?'నని భయపడింది. దుఃఖపడింది. మనుష్యభాషలో నలుడితో ఇట్లా అన్నది. "అయ్యా! నేను నీకు ఇష్టమయిన మేలు చేస్తాను. నీవు ప్రేమించే దమయంతి వద్దకు పోతాను, ఆమెకు నీ గుణాలన్నీ వర్ణించి చెప్తాను." హంస మాటలు విన్నాడు నలుడు. తన హృదయంలో అమృతం కురిసినంతగా ఆనందం కలిగింది. రాజకుమారుడైన నలుడు అనురాగంతో ఆ హంసను వెంటనే వదలిపెట్టినాడు. ఆ హంసకూడ ఎగిరిపోయి తనగుంపులో ఆనందంగా కలిసిపోయింది.

తన గుంపుతోసహా ఆ హంస ఆ నాడే విదర్భనగరానికి ఎగిరి పోయింది. అక్కడ ఉద్యానవనంలో దమయంతి, సఖీజనం తన చుట్టూ ఉండగా కూర్చునిఉంది. ఈ హంసలగుంపు దమయంతి చుట్టూ తిరుగసాగింది. దమయంతీ, ఆమెచెలులూ ఈ హంసలను చూచినారు. 'వాటిని పట్టుకోవా'లని కుతూహలపడినారు. ఒకరినిదాటి ఇంకొకరు పరుగెత్తి తలకొక రాజహంసను పట్టుకొన్నారు. ఇంతకుముందు నలుడు పట్టుకొన్నహంస కావాలనే దమయంతి చేతికి చిక్కింది. ఆ హంసయే నలదమయంతుల సంయోగానికి దూతఅయింది. ఆ హంస మనుష్య భాషలో ఆనందంగా ఆ దమయంతితో, "నేను నీ ప్రియుడైన నలుడి వద్దనుండి వచ్చినాను. ఈ భూమండలంలో నేనుచూడని రాజులులేరు. అందంలోనూ గుణాలలోనూ నలునికిసాటి అయినవారెవరూలేరు. నీవు గౌరవంగా నలునికి భార్యవు కాకపోతే నీకున్న వెలిగిపోయే అందం, లావణ్యం, వైభవం, నిత్యసౌభాగ్యం, అదృష్టము, వంశగౌరవం మొదలైనవన్నీ ఉపయోగం లేకుండాపోతాయి. నీవేమో స్త్రీలలో రత్నానివి. అతడేమో పురుషుల్లో రత్నం. కాబట్టి మీ ఇద్దరి కలయిక ఇరువురికి శోభను కలిగిస్తుంది." అనగావిని దమయంతి మిక్కిలిఆనందంపొందింది. ఆ హంసతో ఇట్లా అన్నది. "ఓ హంసా! ఆ రాజు గుణాలు నీవు నాకు చెప్పినట్లుగానే నా గురించి కూడ, నా యందు దయతో ఆ రాజుకు చెప్పు." ఈ మాటలువిని హంస తిరిగి నిషధదేశానికి పోయి, ఆ నలుడికి దమయంతి గుణగణాలు వర్ణించి చెప్పింది.

ఇట్లా ఉండగా విదర్భలో, దమయంతి మన్మథతాపంతో వెలవెలపోయింది. లోలోపల మగ్గిపోయింది. ఇది చూచి చెలికత్తెలు భయడినారు. తత్తరపాటుతో ఈ సమాచారాన్ని ఆమె తండ్రి భీమరాజుకు చేరవేసినారు. భీమరాజు అడుగగా వారింకా ఇట్లా అన్నారు. "దమయంతి ఆ రాజహంస చెప్పిన మాటలనే వల్లెవేస్తూఉంది. అది వెళ్లినవైపునే చూస్తూఉంది. చెలికత్తెలతో మాట్లాడడంకూడా మానివేసింది. పనేమీచేయకుండానే అలసిపోతూఉంది. అందమైన ఆభరణాలపై ఆసక్తిచూపదు. ఆహారనిద్రలపై అభిలాషపడదు. శయనించడానికి

మంచిపరుపును కోరదు. కూర్చోవడానికి 'మెత్తని పీఠం కావాల'ని అడుగదు. ఎట్టి సౌఖ్యాలు ఆశించదు. అసలు నిద్రలేకుండా ఎన్నో రాత్రింబవళ్లు గడపింది. ఎల్లప్పుడూ 'నలుడ'నే మహారాజును స్మరిస్తూ మన్మథతాపంతో క్రుంగి కృశించిపోతున్నది. ఓ మహారాజా! ఇతర రాజులు ఎంత సంపదపరులైనా ఎంత గొప్పగుణాలు కలవారైనా వారివిషయాలు వినడానికికూడా ఏమాత్రమూ ఇష్టపడదు." ఇట్లా చెలికత్తెలు చెప్పినమాటలు విన్నాడు భీముడు. "ఏమి చేయాలి? ఏ విధంగా నలుణ్ణి ఇక్కడకు పిలిపించవచ్చు?" అని ఆలోచించినాడు. యుక్తవయస్కురాలైన కూతురిని చూచినాడు. భీముడికి పరిష్కారం స్ఫురించింది.

వెంటనే భీమరాజు దమయంతి స్వయంవరం ప్రకటించినాడు. ఆ స్వయంవరానికి భూమిపైకల రాజులందరూ కదలి వచ్చినారు. అదే సమయంలో పర్వతుడు, నారదుడు అనే పురాణమునులు భూలోకం అంతా తిరిగి ఇంద్రలోకం చేరినారు. ఇంద్రుడు వారిని పూజించినాడు. భూలోకం క్షేమసమాచారాలు ప్రశ్నించినాడు. తిరిగి ఇంద్రుడు, "మునీంద్రులారా! భూలోకంనుండి ఇంతకు ముందు ధర్మపరిపాలన చేసినవారూ, యుద్ధంలో వీరమరణం పొందినవారూ, నిత్యం ఇక్కడకు (స్వర్గానికి) వస్తుండేవారు. కానీ ఈ మధ్య వారెవరూ రావడంలేదు. కారణమేమి?" అని అడుగగా, నారదుడు ఇట్లా బదులు చెప్పినాడు. "దమయంతి అనే రాజకన్య జగదేకసుందరి. నరులలోనూ, సిద్ధులలోనూ, సాధ్యులలోనూ, విద్యాధరులలోనూ, దేవతలలోనూ అంతటి సౌందర్యవతి ఇంకొకతె లేదు. ఆమెస్వయవంరం ఇప్పుడు భూలోకంలో అసాధారణ వైభవంతో జరగుతూఉంది. భూమిపైనకల రాజులందరూ ఆనందంగా ఆ స్వయంవరానికిపోయే ఉత్సాహంతో తమలో తాము వైరాన్ని మరచిపోయినారు. యుద్ధాలు మానుకొన్నారు. అందుచేత వీరమరణాలులేవు. అందుకే స్వర్గానికి వచ్చేవారు తగ్గిపోయినారు."

ఈ విషయంవిని ఇంద్రుడూ, కొందరు దిక్పాలకులు ఆ 'స్వయంవరం చూడాల'నే ఉత్సాహంతో బయలుదేరినారు. తమతమ విమానాల నెక్కినారు. ఆ విమానాలు బంగారంతో తయారు చేయబడినాయి. రత్నాలు పొదగబడినాయి. అట్లావారు ఆ విమానాల్లో పోతూఉండగా దారిలో భూమిపై వారికి నలుడు కనిపించినాడు. ఆ మహారాజుకూడ అదే స్వయంవరానికి పోతూఉండినాడు. అతడు సూర్యులలో విష్ణుదేవునివలె వెలిగిపోతూ ఉన్నాడు. 'సౌందర్యంలో అతనికి సాటిలేర'న్నట్లున్నాడు. మన్మథునిలాగా ప్రకాశిస్తూ ఉన్నాడు. ఆ నలుణ్ణి చూచిన దేవతలు తమతమ విమానాలను ఆకాశంలోనే నిలిపివేసినారు. భూమిపైకి దిగివచ్చినారు. నలుణ్ణి చూచి ఇట్లాఅన్నారు. "నిత్య సత్యవ్రతం కలవాడా! నిషధాధీశా! నలా! నీవు మాకు దూతవై మాకోరిక తీర్చు" వారి మాటలు వినగానే నలుడు, "అట్లే చేస్తాను. కానీ మీరెవరో చెప్పండి? నేను మీకు దూతనై ఏపనిచేయవలె?" అన్నాడు. బదులుగా ఇంద్రుడు "నేను దేవేంద్రుణ్ణి. వీరు

కీర్తి ప్రసిద్ధులైన దిక్పాలకులు. భూమిమీద దమయంతీ స్వయంవరం 'జరుగుతూ ఉంద'ని విన్నాము. 'చూడాల'ని ఉత్సాహంతో వచ్చినాము. నీవు మమ్ములను ఆ దమయంతికి పరిచయం చేయవలె. మా పేర్లు మాకీర్తిప్రతిష్ఠలూ ఆమెకుచెప్పవలె. నీ వట్లాచేస్తే ఆమె మాలో తనకిష్టమయిన వాడిని ఒకడిని వరిస్తుంది." అన్నాడు. నలుడు ఇంద్రునికి నమస్కరించి ఇట్లా అన్నాడు.

"తెలిసి తెలిసీ, అదేపనిమీద పోతూఉన్ననన్ను ఇట్లాంటిపనికి పంపడంన్యాయమా?" అందుకు ఇంద్రుడు, "నీకై నీవే ఉత్సాహంగా 'చేస్తాన'ని ఎందుకన్నావు? ఇప్పుడు ఇంక చేయనంటే కుదురుతుందా? నీవు 'సత్యమే పలికేవాడవ'ని నాకు తెలుసు. ఈపని చేయడం 'నీవల్లనే అవుతుంద'నీ తెలుసు. అందుకనే నిన్ను దూతగా పంపవలసివచ్చింది. దేవతలమేలుకై నీవు ఈపని చేసితీరవలె. 'ఆయుధాలు ధరించిన భటులు రక్షించే అంతఃపురంలోకి పోవడమెట్లా?' అని అనుమానించవద్దు. దమయంతి గృహంలోనికి పోయేటప్పుడు నిన్నెవరూ అడ్డగించలేరు." అన్నాడు. ఇంద్రుని ఈ మాటలతో అనుమానం వదలినాడు నలుడు. విదర్భనగరం చేరినాడు. చేరగానే ఒంటరిగా దమయంతీ గృహంలోనికి ప్రవేశించినాడు.

అక్కడ దమయంతిని చూచినాడు. హంసతో తానువిన్నదానికంటే ఎక్కువ వైభవంతో ఉందాదమయంతి. దేవకాంతలవంటి అందమైన నూరుమందిచెలులు ఆమెచుట్టూ ఉన్నారు. అక్కడ ఆ దమయంతి నలుని విషయాలనే అలసిపోకుండా వింటూఉంది. అట్లాంటి దమయంతిని చూడగానే నలుడు మన్మథబాణాల దెబ్బలు తిన్నాడు. అంతలోనే దమయంతి నలుణ్ణి చూచింది. చూచి "ఈత డెవడో? ఎక్కడ నుండి వచ్చినాడో? ఇతణ్ణి ఇంతకు ముందెప్పుడూ చూచి ఉండలేదే?" అనుకొన్నది. అదరిపడి, మనసుల్లో సంతోషం కలుగగా, ఆమె చెలులందరూ ఆసనాలనుండి లేచినారు. దమయంతికి ఆ నలుడు మన్మథుడిలాగానూ, ఇంద్రునిలాగానూ, అశ్వినులలాగానూ కనిపించినాడు. పద్మాలవంటి కన్నులుకలిగిన దమయంతి మన్మథుని ప్రేరేపనవల్ల లజ్జ వదలింది. భయంమానింది. దేవతలలాగాఉండే రాజకుమారుడైన నలుడితో మెల్లమెల్లగా మెత్తనిమాటలతో ఇట్లాఅన్నది. "నీవు మహానుభావుడవు. నీవెవరు? ఇక్కడికి ఏ కారణంగా ఒంటిగా వచ్చినావు? ఈ అంతఃపురం నాతండ్రిచేత రక్షింపబడుతూ ఉంటుంది. ఆయన మహాభయంకరమైనఆజ్ఞలు అమలు జరిపేవాడు. అందువలన ఎవరుకూడా లోపలకురాలేరు. ఎవ్వరికీ తెలియకుండా ఏ విధంగా లోపలికి వచ్చినావు? నాకు మన్మథతాపం కలిగిస్తున్న నీ విషయం ఏమిటో చెప్పు?" అట్లా అడిగిన ఆమెకు నలుడు ఈ విధంగా సమాధానము చెప్పినాడు.

"ఓ దమయంతీ నేను దేవదూతను. 'నలుడు' అనే వాడను. ఇంద్రుడు, అగ్ని, వరుణుడు, యముడు, నీస్వయంవరాన్ని ప్రీతితో చూడడానికి వచ్చి, ముందుగా నన్ను నీవద్దకు పంపినారు. 'వారిలో ఒకరిని వరించమ'ని పద్మముఖివైన నిన్ను 'ప్రార్థించమ'న్నారు. వారికి 'ప్రీతి చేయుమ'న్నారు. ఆ విషయం 'నీకు చెప్పుమ'ని నన్ను పంపినారు. వారి దయవల్లనే ఇతరు లెవ్వరికీ కనిపించకుండా నేనిక్కడకు రాగలిగినాను.

ఈ మాటలువిన్న దమయంతి ముఖం దించుకొన్నది. మునుపు హంసచేత నలునిగురించి విని ఉన్నది. ఆ నలునిపై ప్రేమను పెంచుకొనిఉన్నది. ఆ ప్రేమకొరకై కృశించి పోతూఉన్నది. ఆ నలుని కొరకే ఈ స్వయంవరాన్ని తనతండ్రి ప్రకటించినాడు. ఇప్పుడతణ్ణి తాను నలుడుగా తెలుసుకొన్నది. ఆ నలుడి మాటలకు తనమనసు దుఃఖంతో నిండిపోయింది. అట్లాంటి స్థితిలో దమయంతి ఆ నలుడితో ఇట్లా అన్నది. "నే నెక్కడ? ఇంద్రుడు మొదలైన దేవతలెక్కడ? వారికెప్పుడూ నేను పూజలు చేస్తాను. ఓ నలమహారాజా! నేను నీధనాన్నే, నీగుణాలన్నీ హంసచేత బాగా విన్నాను. నిన్నే మనస్సులో నిలుపుకొని ఉన్నాను. నీకొరకే ఈ విధంగా భూమిమీద రాజులందరనూ పిలిపించవలసి వచ్చింది. లోకమంతటా కీర్తికలిగిననీవు, దయతో 'నా భర్తగా ఉండడానిక'ంగీకరించు. నీవు ఇందుకు అంగీకరించకపోతే త్రాడుతోనో, అగ్నితోనో, లేకపోతే నీటితోనే ప్రాణాలు తీసుకుంటాను."

ఇట్లా అన్న దమయంతినిచూచి నలుడు, "నన్ను పంపినవారు దేవతలు. వారు గొప్పశక్తి కలవారు. సకలలోకపాలకులు. ఐశ్వర్యం సమృద్ధిగా కలవారు. వెలిగిపోయే తేజస్సుకలవారు. అట్లాంటివారు నీపై దయకలిగి నిన్ను వరిస్తూఉన్నారు. నేను వారిపాదధూళికికూడా సమానంకానివాడను. అట్లాంటి ఒక మానవుణ్ణి, సాధారణ సంసారిని, నన్ను, నీవు కోరదగునా? దేవతలకు ఇష్టంలేనిపనిచేసే మనుష్యులు భూమిపైన హీనస్థితిని పొందుతారు. కాబట్టి వారికోరిక తీర్చు. నన్ను దయతోరక్షించు" అన్నాడు.

నలుడట్లాఅనగా దమయంతి కన్నులనుండి కన్నీరు వెలువడింది. ఆ కన్నీటివెల్లువ చెక్కిళ్లపై పారింది. ఆమె చాలాసేపు ఆలోచించింది. అప్పుడు నలుడితో, "నీ అభిప్రాయానికి కీడులేని ఒక ఉపాయం తట్టింది. ఇంద్రుడు మొదలైనవారు నాస్వయంవరానికి వస్తారుకదా? వారి సమక్షంలోనే నిన్ను భర్తగా వరిస్తాను. అట్లాఅయితే నీపై దోషం లేకుండాపోతుంది."

అది విని నలుడు ఇంద్రాదులవద్దకు తిరిగిపోయినాడు. వారికి దమయంతితో తాను మాట్లాడిన పద్ధతిని వివరించినాడు. అందుకు దమయంతి చెప్పిన సమాధానాన్నికూడా తెలియచేసినాడు. ఆ తరువాత శుభముహూర్తంలో, తిథి, నక్షత్రబలం కలిగిన లగ్నంలో, దమయంతి స్వయంవరం జరిగింది.

"దమయంతి నలుణ్ణి తప్పవరించదా? చూద్దాం." అనితలపోసి నలుగురుదేవతలుకూడా అతి వేగంగా ఆ స్వయంవరానికి నలునిరూపంలో వచ్చినారు. దమయంతి తెల్లనిపూలమాల చేతితోపట్టుకొని వచ్చింది. ఆ స్వయంవరానికివచ్చిన రాజకుమారులనందరనూ చూచింది. అప్పుడు నలుడితో పాటుగా నలుగురుదేవతలూ అదేఆకారంలోఉన్నారు. దమయంతి వారిలో అసలునలుడెవ్వరో తెలుసుకోలేక పోయింది. "ఇంద్రుడూ మొదలైనవాళ్లనూ నలుణ్ణీ తెలుసుకొనే ఉపాయమేది?" అనుకుంది, సంశయంతో బాధింపబడింది. తన మనస్సులో ఇట్లా ప్రార్థించింది. "దేవతలారా! నలుణ్ణి తెలుసుకొనే పద్ధతిని నాకు

తెలియచేయండి. మీరు మీ మీ రూపాలు ధరించండి." అని మనసులోనే ఏడుస్తూ దేవతలను ప్రార్థించింది. దేవతలు ఆమెఏడుపునూ ప్రార్థననూవిన్నారు. ఆమెపై దయతలచినారు. వారు తమకన్నులకు రెప్ప పాటులేకుండా కూచ్చున్నారు. వారివంటికి చెమటకూడా పట్టకుండా చేసుకున్నారు. అంతేకాదు వారుకానీ, వారిఆసనం కానీ నేలనుముట్టకుండానే కూర్చున్నారు. దాంతో దమయంతి అసలునలుణ్ణి సులభంగా గుర్తుపట్టింది. వెంటనే ఆ నలుగురు దేవతలూ స్వయంవరానికి వచ్చిన రాజులూ చూస్తూఉండగా దమయంతి నలుణ్ణి ధర్మంగా వరించింది. ఆయనమెడలో పూలదండ వేసింది. దేవతలు శుభాకాంక్షలు తెలిపినారు. బ్రాహ్మణులు ఆశీర్వదించినారు. మంగళవాద్యాలు మ్రోగినాయి. అద్దులేని ఈ శబ్దాలన్నీకలిసి సముద్రఘోషను గుర్తుచేసినాయి.

ఈ విధంగా అపూర్వమైన స్వయంవరంలో లభించిన దమయంతిని నలుడు మహావైభవంగా పెండ్లాడినాడు. దమయంతిని ఒప్పించలేకపోయినా నలుడు శక్తివంచన లేకుండాచేసినదౌత్యానికి దేవతలు సంతోషించినారు. తమతమలోకాలకు పోవడానికి బయలుదేరినారు. కానీ పోయేముందు నలునికి 'వరాలివ్వాల'నుకొన్నారు. నలుడు చేసే యజ్ఞాలన్నింటిలోనూ ఇంద్రుడు 'తానుస్వయంగా పాల్గొంటాన'ని వరమిచ్చినాడు. అగ్నిదేవుడు నలుడు కోరినప్పుడు కోరినచోట నిప్పులభించేట్లు వరమిచ్చినాడు. వరుణుడు నలుడు కోరినప్పుడు కోరినచోట నీరులభించేటట్లుగా వరమిచ్చినాడు. యముడు నలుడి మనస్సెప్పుడూ ధర్మంపైనే ఉండేట్లుగా వరమిచ్చినాడు.

ఇట్లా దేవతలు నలుగురూ నలుడికి నాలుగు వరాలిచ్చి స్వర్గానికి బయలుదేరినారు. వారికి మార్గ మధ్యంలో ద్వాపరపురుషుడితో కలిసివస్తున్న కలిపురుషుడు కనిపించినాడు. వారు కలిపురుషుణ్ణి, "నీ వెక్కడకు పోతున్నావు?" అని అడిగినారు. అందుకు కలిఇట్లాఅన్నాడు. "భూలోకంలో దమయంతి స్వయంవరం 'జరగబోతూఉంద'ని విన్నాను. అందులో నేను 'దమయంతితో వరింపబడదామ'నే కోరికతో పోతున్నాను." ఈ మాటలు వినగానే నలుగురుదేవతలూ నవ్వినారు. "నీ వక్కడికెందుకు పోవడం? స్వయంవరం జరిగిపోయింది. ఆమె నలుణ్ణి వరించింది. ఇతరు లెవ్వరినీ మెచ్చుకోలేదు." అన్నారు.

ఆ మాటలువినగానే కలిపురుషుడికి బాగాకోపంవచ్చింది. "ఆ నలుడికి రాజ్యంలేకుండా చేస్తాను. నలదమయంతులిద్దరూ విడిపోయేట్లు చేస్తాను." అని నిశ్చయించుకొన్నాడు. ఆ నలుడు 'ద్యూత వ్యసనం కలిగినవాడ'ని తెలుసుకొన్నాడు 'పాచికలలో ప్రవేశించుమ'ని ద్వాపరపురుషుణ్ణి ఆజ్ఞాపించినాడు. తానుస్వయంగా నలుడిలో దూరాలనుకొన్నాడు.

నలుడు భార్యతోసహా నిషధదేశం చేరినాడు. అశ్వమేధం మొదలైన యజ్ఞాలను నిరంతరం చేస్తూ ఉన్నాడు. ఆ యజ్ఞాలలో తగినవారికి గొప్పగొప్పదానాలు ఇస్తూనేఉన్నాడు. అంతేకాకుండా నిరంతరం జపాలు చేస్తున్నాడు. హోమాలుజరిపిస్తున్నాడు. దానాలిస్తున్నాడు. ఇంకా చాలచాల పుణ్యకార్యాలు చేస్తూనే ఉన్నాడు. కాలక్రమంలో నలుడు దమయంతియందు 'ఇంద్రసేనుడ'నే కొడుకును 'ఇంద్రసేన' అనే కూతురిని కన్నాడు.

కలిపురుషుడు నలుడిలో ప్రవేశించడానికి ఆ దినంనుండికూడా నిరంతరం ప్రయత్నిస్తూనే ఉన్నాడు. నలుడుచేసే పుణ్యకార్యాలవల్ల కలిఅతడిలో ప్రవేశించలేకపోయినాడు. కానీ కలి తనప్రయత్నం మానుకోలేదు. చాలకాలం తరువాత ఒకనాడు నలుడు మూత్రవిసర్జన చేసినతరువాత కాళ్లుకడుక్కోవడం మరచిపోయినాడు. అట్లా కాళ్లు కడుగుకోకుండానే సంధ్యావందనం చేసినాడు. ఆ అశౌచాన్ని ఆధారంగా చేసికొని కలి నలుడిలోప్రవేశించినాడు.

నలుడికి 'పుష్కరుడు' అనే దాయాదిఒకడుఉండేవాడు. వాడికి నిషధరాజ్యంమీద ఆశఉండేది. నలునిమీద మత్సరంకూడఉండేది. కానీ నలుడిశక్తిసామర్థ్యాలముందు తాను చాలఅల్పుడుకావడంవల్ల ఏమిచేయలేక ఊరకున్నాడు. కలి ఈ పుష్కరుడివద్దకు పోయినాడు. తానెవరో చెప్పినాడు. "నీవు నలుడితో జూదమాడు. వాడి రాజ్యమంతా గెలుచుకో. నేనున్నాను నీకండగా. భయంలేదు." అని పుష్కరుణ్ణి పురికొలిపినాడు. తానుకూడ బ్రాహ్మణవేషం వేసుకున్నాడు. ద్వాపరపురుషుడు ఆవేశించిన పాచికలను తీసుకున్నాడు. పుష్కరుణ్ణి వెంటపెట్టుకొని, నలునివద్దకుపోయినాడు. నలుణ్ణి చూచి పుష్కరుడు "నీవు నాతో జూదమాడు" అన్నాడు.

"జూదంకోసం, జూదగాడు పిలిస్తే, జూదమాడకపోవడం ధర్మంకాదు" అనుకొన్నాడు నలుడు. అంతేకాకుండా స్వయంగా తనకు జూదవ్యసనం ఉండనేఉంది. వెంటనే జూదానికి సిద్ధపడినాడు. ఎదురుగా కూర్చున్నాడు. ఆప్తులు 'జూదము వద్ద'న్నారు. కానీ కలిప్రేరణవల్ల బుద్ధి మందగించి నలుడు వారి మాటలు వినలేదు.

ఎంతసేపు ఆడినా అలసిపోలేదు. పందెంపందేనికి తనకున్న ధనాన్నంతటినీ ఒడ్డుతూనే ఉన్నాడు. ఓడుతూనే ఉన్నాడు. ఈ విధంగా చెడువ్యసనమైనజూదం చాలానెలలపాటుజరిగింది. ఇదంతాచూచి పౌరులూ, బ్రాహ్మణులూ, మంత్రులూ, దమయంతిని ముందుంచుకొని వచ్చినారు. నలుణ్ణి 'జూదం మానమ'ని ప్రార్థించినారు. కలి ఆవహించిఉండడంవల్ల వారిమాటలేవీ నలునికిరుచించలేదు.

అప్పుడు దమయంతికి మనసులో చింతకలిగింది. ఆమె "ఓడిన కొద్దీ జూదంలో ఆసక్తి పెరుగుతుంది. పట్టుదల ఎక్కువవుతుంది. అంతా పోయేదాకా ఈ జూదం ఆగేట్లులేదు. ఇంక నేనేం చేయగలను? ఇది కీడుకు మూలంలాగా కనిపిస్తూ ఉంది." అనుకొని సుకుమారియైన దమయంతి మిక్కిలి దుఃఖించింది.

పాచికలు పుష్కరుడికి స్వాధీనమై ఉండడం, నలుడికి ప్రతికూలంగా ఉండడం, దమయంతి గమనించింది. తన 'భర్తకు ఓటమి తప్పద'ని ఊహించింది. భర్తఅనుమతి తీసుకొన్నది. వార్ష్ణేయుడు అనే సారథిని పిలిపించింది. "ఈ రథం మీద, నా కుమారుడు ఇంద్రసేనుడిని, కుమార్తె ఇంద్రసేననూ వేగంగా తీసుకొని విదర్భకుపో. అక్కడ వీరిని నాబంధువుల కప్పగించి త్వరగా తిరిగి రా" అని చెప్పి, పంపింది. ఆప్తులైన పురోహితులూ, మంత్రులూ, బంధువులూకూడ 'అదేమంచిద'న్నారు.

ఈలోపల నలుడికి ధనధాన్యాలతోపాటు రాజ్యమంతాపోయింది. సమస్తమూ కోల్పోయి అతడు మిక్కిలి దుఃఖించినాడు. దమయంతిని వెంటబెట్టుకొని రాజధానినుండి బయటకు బయలుదేరినాడు. రాజధానికి దగ్గరలో ఒకచోటనిలిచినాడు. నలుడు అందరిచేత సత్కరించ బడవలసినవాడే. కానీ పుష్కరుని భయంతో నలదమయంతుల నెవరూ ఆదరించలేదు. తినడానికి తిండికూడదొరకలేదు. నీళ్లతోనే సరిపెట్టుకొన్నారు. ఆకలి భరించరానిదిగా తోచింది నలుడికి.

అట్లాంటి సమయంలో బంగారురెక్కలతో వారిముందర కొన్నిపక్షులు నేలమీదతిరుగుతూ కనిపించినాయి. ఆ పక్షులు 'తినడానికి పనికొస్తాయ'నుకొన్నాడు నలుడు. 'పట్టుకోవాల'నుకొన్నాడు. పట్టుకొనే సాధనాలగురించి ఆలోచించినాడు. తాను కట్టుకొన్న వస్త్రాన్నివిప్పి వలలాగా ఆ పక్షులపై విసరినాడు. ఆ పక్షులు, వస్త్రంకూడా లేని నలుణ్ణి చూచి, నవ్వుతూ "నీ ధనాన్నీ, రాజ్యాన్నీ మోసంతో గెలుచుకొన్న పాచికలం మేము. నీ వస్త్రాన్నికూడా 'అపహరించాల'ని ఈ రూపంలోవచ్చినాము. నీకు వస్త్రంకూడ లేకుండాచేసినాము." అనిచెప్పి ఆకాశంలో అటునుంచిఅటేపోయినాయి. "ఈ పాచికల మోసంవల్లనే నాకిట్లయినట్లుంది." అనుకుంటూ దమయంతి కట్టుకొన్నచీరచెరగునే తానుకూడ కట్టుకొన్నాడు. ఈ విధంగా ఇద్దరూఒకేచీరధరించినారు. ఒకరిముఖం ఒకరు చూచుకొన్నారు. దుఃఖపడినారు.

ఆ తరువాత నలుడు దమయంతితో ఇట్లాఅన్నాడు. "ఇది దక్షిణానికిదారి. ఇది విదర్భపురానికిదారి. ఇది కోసలదేశానికిదారి. ఇది ఉజ్జయినికి దారి. వీటిలో మనం పోవలసిన దారి ఏదో? చంద్రముఖీ! నీవు నాతో అడవులలో కష్టాలుపడుతూ తిరగలేవు. నీవు నీబంధువుల వద్దకుపో."

నలుడావిధంగా అనగావిని, దమయంతి బొంగరుపోయిన గొంతుతో నలునితో ఇట్లాఅన్నది. "స్వామీ! నీవూ నేనూకూడ విదర్భలో మనఇష్టానుసారం ఉందాం. క్రూరమృగాలచేత భయంకరమైన అడవులకు పోవడమెందుకు? కష్టాలు పడడమెందుకు?" ఆ మాటలువిని నలుడు తలదించుకొని "నీవు చెప్పినట్లు విదర్భకూడా మనరాజ్యమే. కానీ నేను పూర్వం వైభవంగా అక్కడకు పోయేవాడను. నారాక బంధువులకు అప్పుడు ఆనందంగా ఉండేది. ఇప్పుడంతా పోగొట్టుకొని ఈ విధంగా అక్కడకు ఎట్లా పోగలను?" అన్నాడు.

అప్పుడు దమయంతి ఇలాఅన్నది. "అట్లాగైతే ఇద్దరం ఇట్లాగే అడవుల్లోకి పోదాము. 'గొప్ప దుఃఖం' అనే రోగానికి భార్యయే సరియైనమందు. భార్యతో కలిసిఉంటే ఎంతగొప్పఆపదలైనా అంత బాధింపవు. స్వామీ! విసుగు కలిగినప్పుడు, అలసి పోయినప్పుడు, ఆకలి వేసినప్పుడు, దప్పిక కలిగినప్పుడు మగవాడికి భార్యయే దుఃఖాన్ని పోగొట్టకలిగేది. కాబట్టి ఈమె 'నా పైఆధారపడినద'నీ ఎప్పుడూ 'నా వెంటే తిరిగేద'నీ అనుకొని, నన్ను విడవకండి. నేనుకూడ మీ వెంట రావడానికి ఒప్పుకోండి." ఇట్లాఅన్న దమయంతి మాటలనువిన్న నలుడు, "అట్లాగే. నాకు ప్రాణ సమానమైనదానవు. నిన్నెందుకు విడిచిపెడతాను. భయపడవద్దు." అని భార్యను ఓదార్చినాడు.

ఇద్దరూ కలిసి జనంలేని అడవిలోనికి పోయినారు. అక్కడ వారికి ఒకపాడుబడ్డ మంటపం కనిపించింది. ఆ మంటపం బూడిదరంగు దుమ్ముతో నిండిపోయింది. శుభ్రపరచుకొనే ఓపిక కూడాలేక ఆ దుమ్ములోనే విశ్రమించడానికి పూనుకొన్నారు. నలుడు నిద్రపోవడానికి కళ్లు మూసుకొన్నాడు. కానీ నిద్రపట్టలేదు. కొంతసేపటి తరువాత కళ్లుతెరచి చూచేటప్పటికి దమయంతి అతడి పాదాలసమీపంలో గాఢంగా నిద్రపోతూఉంది. అట్లా నిద్రపోయే దమయంతినిచూచి నలుడు "రాజ్యం పోయింది, అప్తులూ, మిత్రులూ, బంధువులూ అందరూ విడచినారు. ఈ మహాటవిలో నేను దమయంతితోపాటు తిరుగుతూఉన్నాను" అని తలచుకొని దుఃఖపడినాడు. "ఈమె మునుపు మెత్తటి పరుపుమీద పండుకొనేది, చెలికత్తెలు శ్రద్ధగా పాదాలు ఒత్తుతూఉండేవారు. ఇప్పుడు ఈ దుమ్ము గొట్టుకొనిపోయిన కటిక నేలపైన నిద్రపోతూఉంది. దైవఘటన వల్లనూ, నా భార్య అయినందుననూ, ఇంత దుఃఖం అనుభవిస్తూఉంది. నే నీమె దుఃఖాన్ని చూడలేను. ఎక్కడకన్నా పోతాను. నేను కనబడకపోతే, ఆమె తన బంధువుల వద్దకుపోయి, బాధలు లేకుండా సుఖపడుతుంది." అని ఆలోచించి పోవడానికి సిద్ధపడినాడు. ఆమె మేలుకొనకుండా మెల్లగా ఆమెచీరలో తనకు కావలసినంతభాగం చించినాడు. చించినముక్కను తానుకట్టుకొన్నాడు. బయలుదేరినాడు. కొంతదూరం పోయినాడు. దమయంతిమీది ప్రేమను త్రెంచుకోలేకపోయినాడు. తిరిగివచ్చినాడు. కలి మాటిమాటికి నలదమయంతులను విడదీయడానికి ప్రయత్నిస్తాడు. నలుడు దమయంతియందలి ప్రేమతో ఆమెనువదలలేకున్నాడు. అట్లానలుడు రెండువిధాలా ముందుకు వెనుకకు ఉయ్యెలలాగా ఊగినాడు. కడకు కలియేజయించినాడు. 'ఈమె నొక్కదాన్నే ఈ అడవి పాలుచేసి దయలేకుండా ఎట్లా పోయేది?' అనుకోకుండా నలుడు దమయంతిని వదలిపోయినాడు.

కొంతసేపటికి దమయంతి మేలుకొన్నది. భర్తకనిపించలేదు. తనచీర కొంతమేర చించి ఉండడం గమనించింది. నాలుగు వైపులా పరికించి చూచింది. భయపడింది. దుఃఖపడింది. వ్యాకులత చెందింది. మనస్సులో, "అయ్యో! మహారాజా! విశాలరాజ్యాన్ని రక్షించినవాడవే. శత్రువులను జయించినవాడవే?

నిషధరాజా! నన్ను ఇట్లాదయలేకుండా వదలిపెట్టిపోవడంతగునా? నీ వెప్పుడూ ధర్మం తప్పేవాడవు కావే? సత్యవ్రతుడవే? 'భయపడవద్ద'ని నన్నూరడించి నావే? ఆ మాట ఈ విధంగా మరవడం న్యాయమా? పొదలమాటున కనబడకుండాఉన్నావా? ఇంతకఠినంగా ఎందుకు మారిపోయినావు? నేనెక్కడికి పోగలను? ఈ భయంకరమైనఅడవిలో ఇంక నిన్నెట్లాచూస్తాను? ఆలోచిస్తే వేదాధ్యయనంకూడ ఒకసత్యంతో సాటిఅవుతుందా? సత్యానికి ఏవీ సరిపోలవుకదా? 'ప్రాణ సమానవయిన నిన్ను ఎన్నడూ విడువను' అన్నావు. ఆ సత్యాన్ని పాటించవద్దా?" అని ఏడుస్తూనే ఉంది.

దమయంతి తానుఒంటరిగా ఉండడానికీ, ఆడది కావడంవల్ల కలిగిన బలహీనతకూ, అడుగడుగుకూఉండే ముండ్లకూ, క్రూరజంతువులకూ, పాములకూ, దాపురించే భయానికీ, చింతించడంలేదు. కానీ తన భర్తకు 'ఎటువంటి తోడూ లేద'ని దుఃఖించింది. అతడు 'అకలి దప్పులతో బాధ పడతాడేమోన'ని తాను బాధపడింది. భర్త పరిసరాల్లో కనిపించలేదు. ఇంక 'అయన్ని వెదకడమే చేయవలసినపని' అనుకొన్నది.

అనుకున్నదే తడవుగా అడవికి అడ్డంపడి పోతూనేఉంది. అట్లా పోవడంవల్ల అలసి పోతూఉంది. పక్షుల అరుపులకు బెదురుతూఉంది. తీవ్రమైనఎండను భరించలేక చెట్లనీడల్లో నిలబడుతూఉంది. ఎలుగుబంట్లనూ, పులులనూ,చూచి భయపడుతూ ఉంది. ముండ్లకు దూరంగా జరుగుతూ పోతూఉంది. దిక్కులుచూస్తూ తొట్రుపడుతూలేస్తూ వణకుతూ పోతూనేఉంది. ఇట్లు పోతూపోతూఉన్న దమయంతి తనదగ్గరకురాగానే, ఆహారంకొరకై ఒకకొండచిలువ ఆమెను పట్టుకొని మ్రింగసాగింది. ఆ స్థితిలో దమయంతి కదలలేకపోయింది. భర్తను తలచుకుంటూ ఇట్లా బిగ్గరగా మొరపెట్టుకొంది. "నేనిట్లా కొండచిలువ కాహారమవుతున్నాను. ఇకనైనా నామాటెందుకు వినవు? నాథా? నన్ను రక్షించు". అట్లా అరిచే ఆమె అరుపులువిని ఒకఎఱుకవాడు ఎక్కడినుండో వేగంగావచ్చినాడు. తనచేతిలోని చురకత్తితో ఆ కొండచిలువ ముఖాన్ని చినిగి పోయేట్లుగాతరిగినాడు. అపుడు దమయంతి రాహువుచేత విడువపడిన చంద్రునిలాగా కొండ చిలువనోట్లోంచి బయటకు వచ్చింది. ఆ ఎఱుకువాడు ఆమెను ఓదార్చినాడు. ఆ దగ్గరలోని కొలనును చూపించి 'స్నానంచేయు'మన్నాడు. అడవిపండ్లు ఆహారంగా ఇచ్చినాడు. అంతటితో దమయంతికి అలసట తీరింది. అప్పుడు ఆ ఎఱుకు "నీవెవ్వరిదానవు? ఇట్లా ఎందుకు ఈ అడవికి ఒంటరిగా వచ్చినావు?" అని అడిగినాడు. ఆమె తనవిషయమంతా సవిస్తరంగా తెలియచేసింది.

అంతా విన్న ఎఱుకుకు ఆమెమీద మదనమోహం కలిగింది. అతడికి ఆమెముఖం చంద్ర బింబంలాగా కనిపించింది. ఆమెపెద్దస్తనాలు తనకు ఆమెమీద ఇష్టాన్నిపెంచినాయి. "ఈమె లావణ్యవతి. రాజకుమారి. ఈమెనడక సుందరమైన ఏనుగునడకలాగా వుంది. ఈమెకు శరీరం చందన పరిమళాన్ని వెదజల్లుతూఉంది. ఈమె వర్చస్సు వెలిగిపోతూవుంది. ఈమెకు పద్మాలలాగా విశాలమైన కన్నులున్నాయి. ఈమెను తప్పక

అనుభవించవలె". అనుకొన్నాడు. అతనికి ఆమెపై కామభావం ఎక్కువైంది. వెంటనే వేడుకగా ఆమెకు తనకోరికను వెల్లడించినాడు.

దమయంతి అగ్నిజ్వాల వంటిది. కామభావంతో తాకడానికిగానీ దగ్గరకు పోవడానికిగానీ వీలులేని శుభమైనచరిత్ర కలిగిఉంది. ఆ మొరటు బోయడికి ఆ సంగతి తెలియదు. అంతేకాదు అతనికి అయుర్దాయంకూడా తక్కువగానే ఉన్నట్లుంది. అందుచేత 'తగద'ని భావించక ఆమెను కామించి కోరుకున్నాడు. దమయంతి వానిమీద అలిగిచూచింది. "నేను పతివ్రతనైతే ఈ దురాత్ముడు ఇప్పుడే చస్తాడు" అని శపించింది. వాడు వెంటనే నిప్పుచేత కాలిపోయే చెట్టులాగా కాలి పోయినాడు. ఆ విధంగా దమయంతి తనపతివ్రతా గుణ ప్రభావంచేత బోయవాడిని చంపివేసింది. తన హృదయంలో భర్తనే తలచుకొంటూ భయంకరారణ్యంలోనికి క్రూర సర్పాలకూ, పులులకూ, క్రూరమృగాలకూ భయపడకుండా పయనంసాగించింది.

దమయంతి కారడవిలో పోతూపోతూ భర్తను వెదకసాగింది. కనిపించిన చెట్టుచెట్టునూ పలకరించి 'నలునిజాడను తెలుపమ'ని కోరింది. అట్లా అడుగుతూ ఆమె ఎండలో అడవిలో అడుగులు బొబ్బలెక్కేట్లు తిరుగుతూనేఉంది. వేడెక్కిన నేలపై నడవలేక సెలయేళ్లలో నిలబడి నలుణ్ణి పిలిచింది. కొండచరియల దాపుల్లో వెతకింది. కొండగుహల్లోకి తొంగితొంగి చూచింది. ఈ విధంగా తిరుగుతూ ఉండగా దమయంతికి అదృష్టం కలిసివచ్చింది. కొంతదూరంలో ఒకమునిపల్లె కనిపించింది.

ఆ మునిపల్లెలో కొందరు నీరుమాత్రమేత్రాగి తపస్సుచేసేవారూ. ఆకుకూరలు ముతక బియ్యపుటన్నమూ తిని తపస్సు చేసుకొనే వారుకొందరూ, ఇట్లాఉన్న మునీంద్రులు కనిపించినారు. అక్కడ కనిపించిన మునులు వసిష్ఠుడు వామదేవుడు వాలఖిల్యుడు, భృగువు, నారదుడు మొదలైన మునుల లాంటివారు. ఆమె వారికినమస్కరించింది. మునులాదమయంతినిచూచి ఆశ్చర్యపడినారు. "అమ్మా ! నీవెవరిదానవు? ఈ వనదేవతవా? దేవభామినివా? దివ్యతేజంతో ఒంటరిగా ఎందుకు తిరుగుతున్నావు?" అని ప్రశ్నించినారు. వారికి దమయంతి వినయంగా ఇట్లా బదులుపలికింది. "వినండి, నేను నలునిభార్యను. అయన పుణ్యచరిత్రుడు. ఎల్లప్పుడూ యజ్ఞాలు చేయడంలో ఆసక్తి కలిగినవాడు. మంచివారి చేతపొగడబడిననేను దమయంతిని. విధి వశంచేత నన్నువదిలి నా భర్త ఎక్కడికో పోయినాడు. అయన్ను వెదకాలనే ఆసక్తితో ఈ అడవిలో తిరుగుతూఉన్నాను. మీతపోవనానికి ఏమైనావచ్చి నలుడు మీ పాదాలకు నమస్కరించి ధన్యుడై ఎటైనా పోయినాడా? అతడు పోయినవైపు మీకుతెలిసిఉంటే దయతో చెప్పండి. ఇంక కొన్ని దినాలలో నేను నా భర్తను చూడకపోతే ప్రాణాలు విడుస్తాను". ఇట్లా అంటూ ఏడుస్తున్న దమయంతినిచూచి దయతో ఆ ఋషులు ఇట్లాఅన్నారు. "ఓ దమయంతీ! కొన్నినాళ్ళలో నీవు నీ భర్తఅయిననలుణ్ణి పూర్వంవలెనే రాజ్యవైభవంతో చూస్తావు. ప్రజానురంజకుడైన ప్రభువుగా నీ భర్తను చూస్తావు. మేము తపోదృష్టితోచూచి

చెప్తున్నాము. దుఃఖించవద్దు". ఇట్లాచెప్పిన తరువాత ఆ ఋషు లందరూ అదృశ్యులైనారు. అగ్నిహోత్రాలు, పూలచెట్లు, పండ్లచెట్లు, ఆశ్రమందగ్గర ఉండిన నదీ, అంతా అదృశ్యమైపోయింది.

ఇదంతా చూచి దమయంతి "ఇదికలా? నిజమా?" అని ఆశ్చర్యపడుతూ ముందుకు పోయింది. ఆమె అట్లాపోతూఉండగా ఆమెకు ఒకచనుప కనిపించింది. ఆమె ఆ చనుపలోనికి ప్రవేశించేటప్పుడు ఆ చనుపలోని జనాలిట్లా అనుకొన్నారు. ' 'ఈమెకు రేగినదుమ్ము నెత్తినపడి ముంగురులు ఎర్రబారినాయి. బాగామాసినచీర అందులోనూ సగంచీరతోనే ఉంది. సన్నటి బెత్తంలాగా పీలగాఉంది. ఆకలి దప్పులతో నిద్రకుదూరమైన పిచ్చిదానిలాగా కనిపిస్తున్నది." అంతలో ఆమె చనుపకు బాగాదగ్గరగావచ్చింది.

అప్పుడా చనుపలోనికొందరు ఆమెను 'దయ్యం'అనుకొని పారిపోయినారు. కొందరు భయపడినారు. కొందరు ఎగతాళి చేసినారు. కొందరు "అవ్వా! ఈ అడవిలోనికి ఎందుకు వచ్చినావు?" అని ప్రశ్నించినారు. కొందరు "దేవీ! నీవు సాక్షాత్తు భూమికిదిగిన దేవతవే". అంటూ నమస్కరించినారు. దమయంతికూడా ఆ చనుప ప్రముఖుణ్ణి చూచింది. ఆయనతో "ఈ మహారణ్యంలో ఇంతమందితోకూడిన చనుపకనపడింది. ఇది నా పుణ్యఫలితం అనుకొంటాను" అని చెప్పిఇట్లా అన్నది.

నేను నలుని భార్యను. దురదృష్టవశాత్తు నేను నా భర్తను ఎడబాసినాను. గాసిచెంది ఉన్నాను. ఒంటరిగా ఈ అడవులలో కష్టాలపాలై తిరుగుతూ ఉన్నాను.దేవతలతో సమానుడూ దయామయుడు అయిన నలుణ్ణి ఎక్కడైనా చూచినారా?" 'శుచి'అనే ఆసార్ధవాహుడు తిరిగి ఆమెతో ఇట్లాఅన్నాడు. "ఈ అడవిలో నలుణ్ణి చూడలేదు. ఇది ఎండకూడ దూరనిఅడవి. ఇంక మనుష్యులెక్కడ కనబడతారు? ఎపుడూ భయంకరమైన ఏనుగులనూ, సింహాలనూ, ఎలుగుబంట్లనూ,చూస్తూఉంటాము". అన్నాడు. అప్పు డామె, "ఈ చనుప ఎక్కడకు పోతూ ఉంది?". అని అడిగింది. "చేదిపతిఅయిన సుబాహునిపురానికి పోతుంద"ని శుచి చెప్పినాడు. "అట్లయితే నేనుకూడా వస్తాన"నిచెప్పి, పతిని దర్శించాలనే కోరికతో మునులమాటలను తలచుకొంటూ దమయంతి ఆ చనుపతోపాటు పోయింది.

ఆ చనుప బాగా పొద్దెక్కేదాక నిలబడకుండా ఆ భయంకరమైన అడవిలో నడచింది. చాల చల్లని నీళ్ళతో అందంగాఉండే ఒక చెరువువద్ద ఆ చనుప విశ్రాంతికై విడిది చేసింది. వంటలు చేసుకొనితిన్నారు. 'రాత్రి అక్కడే గడపాల'నుకున్నారు. రాత్రి అయింది. అందరూ నిద్రకు చేరినారు.

చనుపలో అందరూ గాఢ నిద్రలో ఉండగా. అర్ధరాత్రి ఒక ఏనుగుల గుంపు నీళ్ళు త్రాగడానికి అక్కడకు వచ్చింది. ఏనుగుల భయంకరమైన పాదాల దెబ్బలతో నిద్రలోఉన్న కొందరు చచ్చినారు. ఏనుగుల కొమ్ములచేత చీల్చబడి మరికొందరు చచ్చినారు. కొందరు అరచుకొంటూ ప్రాణ భీతితో పరుగెత్తి చెట్లెక్కినారు. అవినీతునిసంపద నశించినట్లుగా చనుప క్షీణించి చెదరిపోయింది. ఆ అలజడిలో దమయంతి చావుదప్పి తనమనస్సులో ఇట్లా తలపోసింది.

"బ్రహ్మ తెలివితక్కువవాడు కాకపోతే, 'బ్రతకాల'నే కోరిక బలంగాఉండే వాళ్ళ ప్రాణాలు తీయడమెందుకు? 'చావాల'నుకున్న నన్ను చంపడం మరచిపోవడమెందుకు? ఈ చనుపతో పాటుపోయి ఈ అరణ్యంలో ఉండే బాధ 'తప్పించుకుందామ'నుకుంటే ఇట్లా జరిగిందేమిటి? ఈ చనుప సముద్రంలాగా చాలాపెద్దదిగా ఉండేది. ఈ ఏనుగుల గుంపువచ్చి నాశనం చేసింది. ఇది అగస్త్యుడు నీళ్ళను త్రాగేసిన సముద్రమయి నట్లయింది. నేను పూర్వజన్మలో చేసుకొన్న పాపంవల్ల ఇట్లా జరిగిందేమో? లేకపోతే నా స్వయంవరంనాడు దేవతలు నన్ను కోరివస్తే నేను వాళ్ళను వరించలేదు. వాళ్ళ ఎదురుగానే నలుణ్ణి వరించినాను. ఆ తప్పును మనస్సులోపెట్టుకొని ఆ దేవతలే ఈ ఆపదలు కల్పిస్తున్నారేమో? దేవతల కోపంవల్లనే ఈ వియోగ దుఃఖం కలిగిందేమో? ఇంక నేనేం చేయగలను?" ఇట్లా అనుకుంటూ దమయంతి దుఃఖపడింది.

ఈ విధంగా దుఃఖిస్తూ ఉండగా తెల్లవారింది. ఆ చనుపలో అందరూ చావలేదు. దమయంతి లాగా చావుతప్పినవారూ కొందరున్నారు. అట్లా చావకమిగిలిన వారందరూ ఒకచోటకూడినారు. వారిలోవారు చిన్నచిన్నగుంపులు ఏర్పడి ఎవరికితోచినవైపు వారుపోయినారు. కొందరు బ్రాహ్మణులు చేదిపురం బయలుదేరినారు. దమయంతి వారితోకలిసి ప్రయాణం సాగించింది. వారు ఎక్కడాఎక్కువఆగకుండా ప్రయాణము చేసినారు. కొద్దిరోజులకే చేదిపురం చేరినారు. అక్కడ రాజమార్గము చాలాక్రిక్కిరిసిఉంది. ఆ క్రిక్కిరిసిన రాజమార్గంలోనే దమయంతికూడా కలిసి ముందుకుపోతూఉంది. అప్పుడామె ప్రొద్దున్నే కనిపించే చంద్రుడిలాగా కాంతిహీనంగా కనిపిస్తూఉంది. ఆమె బాగాఅలసిపోయిఉండడం ఆమె ముఖంలోనే తెలుస్తూఉంది. అలసిపోయికూడా అందంగానే కనిపిస్తూఉంది. అట్లా రాజమార్గంలో నడచివస్తున్న దమయంతిని అంతఃపురం కిటికీనుండి రాజమాత దూరంగానుండే చూచింది. అట్లాచూచిన రాజమాత తనదాదిని పిలిచి ఇట్లాఅన్నది. "అదిగో చూడు. ఆమెకట్టినచీర చినిగిపోయిఉంది. పైగా చాలా మాసిపోయిఉంది. దుమ్ముచేత ముంగురులు బాగా ఎర్రబారి ఎగురుతూ ఉన్నాయి. పిచ్చిదాని వేషంలోఉన్న లక్ష్మిలాగా వస్తూఉంది. ఆమెమీద నాకు మిక్కిలి ప్రీతికలిగింది. ఆమెను ఇక్కడకు తీసికొనిరా." ఆ రాజమాత ఇట్లాఅనగానే దాదిపోయి దమయంతిని రాజమాతవద్దకు తీసుకొని వచ్చింది. ఆ రాజమాత దమయంతిని చూచి, "నీవెవరి దానవు? ఈ విధంగా దుఃఖంతోవశం తప్పినట్లు కనిపిస్తున్నావెందుకు ? చెప్పు" అన్నది. ఆ మాటలకు దమయంతి ఇట్లాఅన్నది "అమ్మా! నాభర్త శత్రువుల నందరనూ జయించినవాడు. కానీ జూదంలో సర్వస్వం ఓడిపోయినాడు. అందువల్ల పురంవదలి అడవిలో ప్రవేశించినాడు. నేనుకూడా నీడలాగా అతణ్ణి అనుసరించినాను. అడవిలో ఒకచోట ఇద్దరం అదమరచి నిద్రపోయినాము. అట్లానిద్ర పోయేటప్పుడు నా దురదృష్టం కొద్దీ నన్నుమోసంచేసి అయన నన్నువదిలిపెట్టి

పోయినాడు. అప్పటినుండి నేను ఆయనకొరకై వెతుకుతూ ఉన్నాను. ఆ మహానుభావుడు ఒకే వస్త్రంతోఉన్నాడు. నిలువనీడకూడాలేదు. ఆయనను వెతుకుతూ నేనిప్పుడు సైరంధ్రీ వృత్తిని చేపట్టినాను. భర్తయెడబాటుకు బాధపడుతూ ఇంతవరకు దుంపలూ వేళ్ళు మాత్రమే ఆహారంగా తీసుకొంటూ ఉండినాను. ప్రొద్దుఎక్కడ క్రుంకితే అక్కడే నిద్ర పోయినాను. మృగాలే తోడుగా అడవుల్లో తిరిగినాను". అని కన్నీరు చనుకట్టుపై నున్నదుమ్మును బురదగా చేస్తుండగా ఏడ్చింది. ఈ ఏడుపులో ఇంకేమీమాట్లాడలేకపోయిన దమయంతితో రాజమాత ఇట్లాఅన్నది. "నీవు నాదగ్గర ఉండు. నీ భర్తను వెతకడానికి బ్రాహ్మణులను పంపుతాను". రాజమాత అట్లాఅనగా దమయంతి సంతోషంతో ఇట్లాఅన్నది. "నేను సైరంధ్రినే అయినా ఎంగిలితినను. కాళ్ళుకడగడంలాంటి పనులుచేయను. పరపురుషులతో మాట్లాడను. కానీ నాభర్తను వెతకడానికి పోయే బ్రాహ్మణులతో మాత్రం మాట్లాడుతాను. అందుకు నీ వంగీకరిస్తే నీ వద్దఉంటాను. అట్లా కాకపోతే నీవద్దఉండలేను". ఈ మాటలకు రాజమాత ఒప్పుకొని, "నీ కిష్టమైన పద్ధతిలోనే నా వద్దఉండు." అని ఆమెను మిక్కిలి గౌరవంతో ఆదరించింది. ఆ దమయంతిని తన కూతురు సునందకు అప్పగించింది. అప్పటినుండి దమయంతి అలసటలేకుండా పుణ్యవ్రతాలు చేస్తూ చేదిపురంలో సైరంధ్రిగా ఉండిపోయింది. ఎప్పుడూ భర్తనే తలచుకొంటూ వియోగ దుఃఖంతో బాధపడుతూఉండేది.

ఇంక అక్కడ నలుడు దమయంతినివదలి భయంకరమైన అడవిలోపోతూ ఉన్నాడు, ఎదురుగా దావాగ్ని కనబడింది. నిప్పురవ్వలు ఆకాశాన్నిఅంటుతూఉన్నాయి. పెద్దపెద్దచెట్లుకూడా కాలిపోతూ ఉన్నాయి. అట్లాంటి ఆ దావాగ్ని మధ్యలోనుండి "రాజా! నన్నుకాపాడు. త్వరగా ఇక్కడకురా" అనే ఆర్తనాదం వినిపించింది. ఆ ఆర్తనాదంవిని నలుడు ఏ మాత్రం అనుమానించకుండా దావాగ్ని లోనికి పరుగెత్తినాడు. అక్కడ భయపడుతున్న ముఖంతోఉన్న ఒకపామును చూచినాడు. ఆ పాము ఒకనాగకుమారుడు. నలుణ్ణి చూడడంతోనే ఆ నాగకుమారుడు నమస్కరించినాడు. నలునితో ఇట్లాఅన్నాడు. "నేను 'కర్కోటకుడ'నే వాడను. కర్మవశంచేత ఒక మాహర్షిని తిట్టినాను. ఆయన శాపంవల్ల నేనెక్కడికీ కదలలేకుండా ఉన్నాను. ఈ దావాగ్ని అన్నివైపులకు చుట్టుకొన్నది. విజృంభించి జీవులన్నింటినీ కాల్చి వేస్తూంది. నీవు నన్నీఆపాయంనుండి కాపాడు. నీవు దయామయుడవు కాబట్టి నిన్ను ప్రార్థిస్తున్నాను. అన్ని వైపులనుండి అగ్ని చుట్టుముట్టింది. దీంతో మాడిచావలేను. రాజా! దయతో నన్నొకసరసుగట్టుకు ఎత్తుకొనిపో. నన్ను నీవు రక్షిస్తే నేను నీకు మేలు చేయగలుగుతాను". అన్నాడు. తనను ఎత్తుకొని పోవడానికి సులభంగా ఉండేట్లు తన శరీరాన్ని కేవలం బొటనవ్రేలంత చేసుకొన్నాడు. అతన్ని ఎత్తుకొని నలుడు వేగంగా వేడితాకని ఒకకొలను సమీపంలోకి తీసుకొనిపోయినాడు. అక్కడ ఆ పామును విడువబోయినాడు. ఇంకొక పదిఅడుగుల దూరంపో. నీకు మేలుచేస్తాను" అన్నాడు కర్కోటకుడు. నలుడు అడుగులు లెక్కపెట్టు కుంటుపోయి పదోఅడుగువేసేటప్పుడు ఆ పాము నలుణ్ణి కరచింది. దాంతో నలునికి వికృతరూపంవచ్చింది.

అప్పుడు కర్కోటకుడు తనరూపం చూపించి, నలుడితో "అయ్యా! నేను నిన్నుకరచి విషంచేత పీడిస్తున్నానని దుఃఖపడవద్దు. నిన్ను ఎవరన్నా కనుగొంటే నీకు కీడుకలుగుతుంది. కాబట్టి నీకు వికృతరూపం వచ్చేట్లుగా చేసినాను. ఎంతకాలం నీ శరీరంలో నా విషముంటుందో అంతకాలం నీకు విషసర్పాలవల్లకానీ, రాక్షసులవల్లకానీ, పిశాచాలవల్ల కానీ, శత్రువులవల్లకానీ భయముండదు. నీకు అన్నియుద్ధాలలో జయంకలుగుతుంది. తిరిగి నీభార్యను నీవు కలుసుకుంటావు. ఎప్పటిలాగా నీ రాజ్యం నీకు లభిస్తుంది. నీకెప్పుడు నీరూపం కావాలనుకుంటే అప్పుడు నన్నుతలచుకో. అప్పుడే ఈ వస్త్రం నీవద్దకు వస్తుంది. దీన్నిధరిస్తే నీరూపం నీకు వస్తుంది". అని చెప్పి వరమిచ్చి, ఇంకాఇట్లాఅన్నాడు. "భూమిమీద 'ఋతుపర్ణుడ'నే రాజు ప్రసిద్ధి పొందినవాడు. అతడు ఇక్ష్వాకువంశానికి చెందినవాడు. నీవు సేవించదగినవాడు. అతణ్ణి సేవిస్తూ ఈ రూపంలో అక్కడే ఉండు. నిన్ను ఈ రూపంలో ఎవరూ గుర్తించలేరు. నీవు అక్కడనే ఉండి తగినసమయంలో అతడినుండి 'అక్షహృదయం' అనే విద్యనునేర్చుకో. అతడికి నీకు తెలిసిన 'అశ్వహృదయమ'నే విద్యనునేర్పు. పో. అయోధ్యలో ఋతుపర్ణుడి వద్ద 'బాహుకుడు'అనే పేరుతో సూతవృత్తిని చేయి". అని హితోపదేశం చేసి, కర్కోటకుడు అదృశ్యమయినాడు.

ఆ కర్కోటకుడిమాటను పాటించి, నలుడు అయోధ్యచేరినాడు. ఋతుపర్ణుణ్ణి దర్శించినాడు. "నేను బాహుకుణ్ణి. గుర్రాలపెంపకంలో నేర్పరిని. 'అశ్వహృదయమ'నేవిద్య నాకు తెలుసు. నేను బాగా వంటచేయగలను. రకరకాలైన శిల్పాలు తయారుచేయడంకూడావచ్చు. నేను నీసేవ చేయాల'ని వచ్చినాను". అన్నాడు. అందుకు ఋతుపర్ణుడిట్లా అన్నాడు. "నా వద్ద ఉండదలచుకుంటే నా రథాశ్వాలు ఎక్కువ వేగంతో పరుగెత్తేట్లుచేయి". అనగానే నలుడు "అట్లే చేస్తాను" అని చెప్పి ఆ రాజు కొలువులో చేరినాడు.

ఈ విధంగా నలుడు 'బాహుకుడు'అనే పేరుతో ఋతుపర్ణుడి గుర్రాలకు అధిపతి అయినాడు. అతడు మొండిగుర్రాలను లొంగదీసేవాడు. నేర్చుకునే రౌతులకు గుర్రాల నెక్కడం నేర్పేవాడు. రుచికరంగా ఆహారపదార్థాలు వండేవాడు. ఋతుపర్ణుడు తనకు సహాయంగా నియమించిన వార్ష్ణేయునితోనూ జీవలుడితోనూ పనులు చేయించేవాడు. అట్లా అక్కడ తన వికృతరూపంవల్ల ఎవరికీ తెలియకుండా కాలంగడుపుతూఉండినాడు.

ప్రతిదినం రాత్రులలో నలుడు తనభార్యను తలచుకొంటూఉండేవాడు. విరహతాపంచేత రాత్రులంతా నిద్రలేకుండా దుఃఖిస్తూ, నిట్టూర్పులు వదలుతూఉండేవాడు. "మత్తేభంవంటి నడక కలదానా! ఎక్కడకు పోయినావు? పెద్ద కన్నులు కలదానా! ఎక్కడున్నావు? అడవులలో ఎవరిచేతికి చిక్కినావు? తిండికోసం తిరిగే క్రూరమృగాల కడుపులలో ఉన్నావా? లేకపోతే నీ తల్లిదండ్రుల వద్దకు చేరినావా? పరదేశంలో ఉన్నావా?" అంటూ వదరుతూ ఉండేవాడు.

ఒకరోజు ఈ పలవరింతను జీవలుడు విన్నాడు. అతడు తనమనస్సులో "ఇతనికి సగంగూనిఉంది. పొట్టిచేతులున్నాయి. ఎవరూ చూడడానికిష్టపడని రూపంఉంది. అట్లాఉండికూడా స్త్రీలనుప్రేమించి మన్మథతాపం పొందుతున్నాడు. వీడు తలచుకొంటూఉండే వీడిప్రేయసి వీడికంటేకూడా బాగుంటుందేమో?" అనుకొంటూ జీవలుడు బాహుకుడి వద్దకువచ్చి "నీవు తలచుకొనే నీ భార్యకు నీకూ ఎందుకు వియోగం కలిగింది?"అని అడిగితే బాహుకుడిట్లా అన్నాడు. "నన్నూ నా రూపాన్ని చూచి నవ్వరా? నారూపానికి, నాకు కూడా ఒక ప్రేయసియా? ప్రేయసేలేకుండా వియోగమేమిటి? నీవు వినలేదా? పూర్వం ఎందుకు జరిగిందో తెలియదు. కానీ మందప్రజ్ఞుడనే సైనికుడు తనప్రేయసిని ఎడబాసి ఆమెకై వెదకినాడు. ఆమె దొరకనే లేదు. అందుకు దుఃఖించి వాడు అనేకవిధాలప్రలాపించేవాడు. ఆ ప్రలాపాన్ని నేను అనుకరించినాను. అంతే" అని చెప్పి తన విషయం జీవలునికి తెలియకుండా దాచినాడు.

అక్కడ భీముడు నలుదురాజ్యాన్నిపోగొట్టుకొన్నవిషయం విన్నాడు. కూతురూ అల్లుడూ ఎక్కడికి పోయినారో తెలియక దుఃఖించినాడు. వాళ్ళను వెదకడానికి బ్రాహ్మణులను పంపినాడు. అతడుపంపిన బ్రాహ్మణులు తనకిష్టమైనవారు. సదాచారసంపన్నులు. ఇంకా విద్వాంసులు. భీముడు వారినిసత్కరించి, సంతృప్తిపరచి, స్నేహభావంచూపించి, పంపినాడు. ఇంకా నలదమయంతులను తెలుసుకొనివచ్చినవారికి వెయ్యేసినాణాలు బహుమాన మిస్తాన'ని కూడ ప్రకటించినాడు. వారిని తీసుకొనివచ్చిన వారికి 'వేలఆవులను అగ్రహారాలనుకూడా ఇస్తాన'న్నాడు.

బ్రాహ్మణులు నానాదేశాలు వేగంగా తిరిగినారు. చిన్నచిన్న పల్లెలు, పెద్దపెద్ద పల్లెలు, పట్నాలు, నగరాలు, అంతటా వెదకినారు. వాళ్ళలో 'సుదేవుడ'నే బ్రాహ్మణుడు చేదిరాజైన సుబాహుని నగరానికి పోయినాడు. అక్కడ అంతఃపురములో పుణ్యాహం చేయించుతూఉన్నారు. ఆ పుణ్యాహం చేయించే బ్రాహ్మణులతో కలిసి సుదేవుడు అంతఃపురంచేరినాడు. అక్కడ సునందతోపాటు ఉన్న దమయంతిని చూచినాడు. ఆమెపొగచుట్టుకొన్న అగ్ని జ్వాలలాగా ఉంది. నల్లని మబ్బులు కప్పిన చంద్రునిలాగాఉంది. పెద్దబురదలో కూరుకుపోయిన తామరతూడువలె ఉంది. అందువల్ల ఆమె గుర్తించడానికి వీలుకాకుండా ఉండింది. అయినా సుదేవుడు ఆమె కనుబొమల మధ్యగల సన్నని పుట్టుమచ్చను జాగ్రత్తగా గమనించినాడు. ఆమెను దమయంతిగా గుర్తించినాడు. మనసులో "ఈమెను నలుడు వదలిపెట్టినట్టుగా ఉంది. ఈమె మామిడిచెట్టులేని వనంలాగాఉంది. అందుచేత ఆమె శోభించడంలేదు. అయినా పాతివ్రత్య మహిమవల్ల ప్రకాశిస్తూనే ఉంది. స్త్రీలకు పతిభక్తియేకదా గొప్పభూషణము? అది దొంగిలించడానికి వీలుకానిది. ప్రకాశవంతమైనది. గుణాలన్నింటికీ అలంకారంలాంటిది. చాలాగొప్పది. ఇట్లాంటి భూషణం ఇంకెక్కడుంటుంది? రోహిణి చంద్రుణ్ణి కలుసుకొన్నట్లు ఈమె నలుణ్ణెప్పుడు కలుసుకొంటుందో? శీలము, వయస్సు, రూపము,ఆభిజాత్యము సమానంగాఉన్న నలదమయంతులు తిరిగి కలిసిఉండడంచూచి భీముడు

ఎప్పుడు ధన్యుడవుతాడో?" అనుకొంటూ మెల్ల మెల్లగా దగ్గరకువచ్చి, దమయంతితో ఇట్లాఅన్నాడు. "అమ్మా! నీ తల్లిదండ్రులూ నీ పిల్లలూ బంధువులూ క్షేమంగా ఉన్నారు. నీ క్షేమసమాచారం తెలియక దుఃఖంతో వారంతా పరితపిస్తున్నారు. నీ విషయంవింటే వారిపరితాపంపోతుంది. దేవీ! నేను మీ తమ్ముడిస్నేహితుణ్ణి. నన్ను 'సుదేవుడ'ంటారు. మీ తండ్రిభీముడు నీవున్నచోటు తెలుసుకొనిరావడానికి చాలామంది బ్రాహ్మణులను పంపినాడు. ఆ పనిమీదనే నేనిక్కడకు వచ్చినాను. నా అదృష్టంవల్ల నిన్నిక్కడ చూచినాను". ఈ మాటలు వినగానే దమయంతి సుదేవుణ్ణి గుర్తుపట్టింది. తన పిల్లలనుగురించి బంధువులగురించి వేరువేరుగా అడిగింది. కన్నీరుకారుస్తూ ఏడుస్తూ ఉండింది.

అట్లా ఏడుస్తున్న దమయంతిని చూచి సునంద, "సైరంధ్రి ఎందుకో ఏడుస్తున్నది." అని తన తల్లికి చెప్పిపంపింది. రాజమాత ఇతరఅంతఃపురస్త్రీలతోకలిసి దమయంతి దగ్గరకు కుతూహలంతో వచ్చింది. ఇట్లావచ్చి తమలోతాము మాట్లాడుకొంటున్న బ్రాహ్మణుణ్ణీ సైరంధ్రినీ చూచింది. బ్రాహ్మణుణ్ణి "అయ్యా! ఈమె ఎవరికూతురు? ఎవరిభార్య? ఏ కారణంగా భర్తనూబంధువులనూవదలి ఇట్లాపుణ్యవ్రతాలు చేస్తున్నది? ఈమెను నీవెట్లా కనుగొన్నావు? ఈమె పేరేమి?" అని అడిగిన రాజమాతతో సుదేవుడు ఇట్లాఅన్నాడు "అమ్మా! ఈమె విదర్భరాజు భీమునికుమార్తె. పవిత్రచరిత్ర కలిగిన నలునిభార్య. ఈమె దమయంతి సుమా! దైవయోగంచేత నలుడురాజ్యంకోల్పోయి, అడవులకుపోయినాడు. ఈమెకూడా అతడితోపాటు అడవులకు పోయింది. ఆ వార్త విని భీమరాజు వారినివెతకడానికి బ్రాహ్మణులనుపంపినాడు. ఆ బ్రాహ్మణులలో ఒకడనైననేను ఆ పనిమీదనే ఇక్కడకువచ్చినాను. మీరు రక్షిస్తున్న ఈమెను చూచినాను. ఈమె కనుబొమ్మలమధ్య ఒక చిన్న పుట్టుమచ్చఉంది. అదిపద్మంలాంటికాంతితో ఉంటుంది. సంపదసూచకంగా ఉన్న ఈ మచ్చనుచూచి ఈమెను మారాజపుత్రికఅయిన దమయంతిగా గుర్తించినాను". అట్లాసుదేవుడు చెప్పగానే సునంద మంచినీటితో ఆమె కనుబొమ్మల మధ్యప్రదేశాన్ని కడిగించింది. మచ్చ స్పష్టంగా కనిపించింది. అందరూ ఆశ్చర్యపడినారు.

అపుడు రాజమాతఆత్మ ఆనందంతోనిండిపోయింది. దమయంతిని కౌగిలించుకొన్నది. "తల్లీ! నీవుకూడా నాకూతురివే, నేనూ మీ అమ్మా, దశార్ణరాజుకూతుళ్ళం. మీ అమ్మేమో విదర్భ రాజు భార్య అయింది. నేను ఈ చేదిదేశపురాజు వీరబాహుని భార్యనైనాను". అని చెప్పింది. ఈ విషయంవిని దమయంతి రాజమాతకు వినయంతో నమస్కారము చేసింది. అటుతరువాత ఒకనాడు దమయంతి రాజమాతతో, "దేవీ ఈ ఊరూ విదర్భాకూడా నాకు పుట్టినఊళ్ళే. ఇక్కడైనా అక్కడైనా నాకు సుఖంగానే ఉంటుంది. అయినా తల్లిదండ్రులనూ బిడ్డలనూ తమ్ముళ్ళనూ 'చూడాల'నిపిస్తున్నది. విదర్భకుపోతాను. అనుమతించండి". అని నమస్కారము చేసింది. అపుడు రాజమాత కొడుకు సుబాహునికిచెప్పి తగినంత సైన్యాన్ని ఏర్పాటుచేయించింది. బంగారుతోనూ మణులతోనూ విమానంలాగాఉన్న ఒకరథాన్ని సిద్ధం చేయించింది. గౌరవప్రదంగా దమయంతిని ఆ రథం మీద సైన్యంతోపాటు విదర్భకు పంపింది.

ఆ విధంగా దమయంతి విదర్భచేరింది. తనబిడ్డలను చూచింది. ఏడ్చేపిల్లలను తానూ ఏడుస్తూ ఓదార్చింది. తల్లి దండ్రులకు నమస్కరించింది. బంధువులందరనూ పలకరించింది. తమ్ముళ్ళను ఆదరించింది. అయినా తానుమాత్రం దేహసుఖాలకు దూరంగానే ఉండింది. వస్త్రాలేవీ మార్చకుండా అదేసగంచీరతో ఉండింది. శరీరమంతా దుమ్ముతోనిండినా పట్టించుకోలేదు. భర్తనుచూచేరోజుకోసం ఎదురుచూస్తూఉండింది. ఈ విధంగా భర్తయెడబాటువల్ల కలిగిన దుఃఖాన్ని భరించలేక పోయింది. ఒకనాడు తల్లితో ఏకాంతంగా ఇట్లాఅన్నది " నలుణ్ణి వెదకడానికి పంపండి. అతడే నా దుఃఖాన్నిమాన్పగల పుణ్యాత్ముడు. అతణ్ణిచూడలేకపోతే, నేను ఆత్మహత్య చేసుకుంటాను".

ఆ మాటలువిని ఆమె కూతురిఅభిప్రాయాన్ని భీమునికి తెలియచేసింది. వెంటనే భీముడు నలుణ్ణి వెతకడానికి మంచిబ్రాహ్మణులను సిద్ధంచేసినాడు. ఆ బ్రాహ్మణులతో దమయంతి "నిషధరాజైన నలుడు ఇపుడు అసమర్థుడు. కాబట్టి తనను ఇతరులెవరూ తెలుసుకోవడానికి వీలులేకుండాఉంటాడు. కాబట్టి మీరు సభల మధ్యకుపోయి ఇట్లాఅనండి". అని వారనవలసిన మాటలను ఇట్లా చెప్పింది. "నిత్యసత్యవ్రతుడవు నీవు. నీ భార్యను మోసగించి ఆమె సగంచీరెనుచించి కట్టుకొని ఆమెనువిడిచిపెట్టిపోవడం న్యాయమా? 'భరించబడేది భార్య' అనేవిషయం నీపట్ల అసత్యమైందికదా? నీ విట్లాంటి దయలేనిబుద్ధిని అవలంబించదంతగునా? అట్లాంటిసాధ్విపై అనుగ్రహంచూపు". ఆ తరువాత ఇంకాఇట్లాఅన్నది. "అన్నిచోట్ల ఈ మాటలు చెప్పండి. ఆ మాటలకు ఎవడైతే కోపగించుకొని సమాధానంచెప్తాడో అతడే 'నలుడ'ని గుర్తించండి. నా విషయం ఆయనకు చెప్పి, ఆయనను తీసుకొనిరండి. ఆయన రాకపోతే విషయం తెలుసుకొని రండి". ఈ మాటలన్నీ చెప్పి దమయంతి వారిని వీడ్కొలిపింది.

బ్రాహ్మణులు ఈ మాటలను దేశదేశాలలోని అన్ని సభల్లోనూ చాటినారు. కానీ వారికెక్కడా సమాధానం రాలేదు. వారంతా తిరిగివిదర్భచేరినారు. వారిలో 'పర్ణాదుడ'నేబ్రాహ్మణుడు దమయంతితో "అమ్మా! నే నయోధ్యకు పోయినాను. అక్కడ ఋతుపర్ణుడి సభలో నీవు 'చెప్పుమ'న్నమాటలు చెప్పినాను. ఈ విషయాన్నివిన్న గుర్రాల శిక్షకుడొకడు నన్నొంటిగా కలుసుకొన్నాడు. అతడి పేరు బాహుకుడు. గూనివాడు. చేతులు చాలాకురుచగాఉన్నాయి. ఆకారం వికారంగాఉంది. ఋతుపర్ణుడివద్ద నూరుగద్యాణముల జీతానికి పనిచేస్తున్నాడు. అతడు వేగంగా ప్రయాణం చేయటంలో నేర్పరియట. మంచివంటవాడుకూడానట. అతడు నన్ను కలుసుకొని నిట్టూర్పులు వదులుతూ 'మగవాడిలో దోషాలుంటేకూడా హృదయంలో సహించేభార్యయే మగడితో కోరినసౌఖ్యం పొందుతుంది. మరుజన్మలోకూడా ధర్మంగా తనకిష్టమయిన దానిని పొందగలదు'. అని, ఇంకేమీఅనకుండా తననివాసానికి పోయినాడు. ఆ రూపంచూస్తే, అతడు నాకు 'నలుడ'నిపించలేదు". అని చెప్పగా విని, దమయంతి చాలాసేపుఆలోచించింది. "నలుడు కాకపోతే సమాధానమెందుకుచెప్తాడు? ఇంకా ఎవరినైనాపంపి అతణ్ణిగూర్చి పూర్తిగా తెలుసు కోవలె" అనుకొన్నది.

తల్లి అనుమతిని తీసుకొన్నది. సుదేవుడిని పిలిపించింది. ఆయనతో ఇట్లా అన్నది "ఓ సుదేవా! నీవు నన్ను గుర్తించినావు. అట్లే నలుణ్ణి కూడా గుర్తించవలె. ఆలోచిస్తే ఇందుకు నీవే తగినవాడవు. నీవు అయోధ్యకు విదేశపు విప్రుడివలె పో. అక్కడ దేవతలతో సమానుడైన ఋతుపర్ణుణ్ణి దర్శించు. ఆ ఋతుపర్ణుడు ఉత్తరదేశపు రాజు. సూర్యవంశజుడు, సూర్యునివంటి ప్రతాపము కలిగినవాడు. పాపాలకు దూరంగా ఉండేవాడు. ఆయనతో ఇట్లా చెప్పు. "విదర్భరాజు భీముడు నలుణ్ణివెదకించినాడు. కానీ అతనిజాడతెలియలేదు. అందుకని ఆయన దమయంతికి మళ్ళీఇంకొక స్వయంవరం ఏర్పాటుచేసినాడు. భూమిమీద రాజులందరూ అక్కడకు పోతున్నారు. ఆ స్వయంవరం రేపేజరుగుతుంది" అట్లాచెప్పి నీవు త్వరగా తిరిగిరా!" అన్నది.

సుదేవుడు అయోధ్యకు వేగంగా చేరుకొన్నాడు. ఋతుపర్ణుణ్ణి కలుసుకొన్నాడు. ఆయనతో అన్నాడు. "విదర్భనగరంలో దమయంతి ద్వితీయస్వయంవరం రేపే జరుగబోతూ ఉంది". ఆ మాటలువిన్న ఋతుపర్ణుడు బాహుకునితో, "నాకు దమయంతిస్వయంవరం చూడాలనిఉంది. అందుకని ఒక్కరోజులోనే మనం విదర్భచేరవలె. నీకు 'అశ్వహృదయం తెలుసున'న్నావు. నీకు అశ్వశిక్షణలోకల నైపుణ్యాన్ని నాకుచూపించు." అన్నాడు. నలుడు ఋతుపర్ణుడితో 'అట్లాగే చేస్తాన'న్నాడు. కానీ మనస్సులో మిక్కిలి దుఃఖించినాడు."అడవిలో ఆమెనువదలి పోయినందుకుఅలిగి ఈ పనిచేసిందేమో? తామెట్లా ప్రవర్తించినా భార్యలు తమ భర్తలను ప్రేమిస్తూనే 'ఉంటార'నుకొనే వాళ్ళు మూర్ఖులు." అనుకొన్నాడు. తిరిగి, "దమయంతి సాధ్వి. నా మీద ప్రేమ కలిగింది. పిల్లలతల్లి. ఆమె అట్లా ఎందుకు చేస్తుంది? అయినా ఈ విషయం తెలుసుకోవలె. నేనెట్లాగైనా ఋతుపర్ణుని తీసుకొనిపోవలెకదా? అక్కడే తెలుసుకోవచ్చు". అనుకుంటూ మనస్సులో దుఃఖించినాడు.

పూర్వం వార్ష్ణేయుడు నిషధనుండి ఇంద్రసేనుడూ ఇంద్రసేనలను విదర్భచేర్చినాడు. విదర్భనుండి నిషధకు తిరిగి బయలుదేరినాడు. త్రోవలోనే తెలిసింది. నలుడు ఓడిపోయి 'అడవులకు పోయినాడ'నీ పుష్కరుడు 'గెలిచినాడ'నీ, తిరిగి నిషధకు పోయి పుష్కరుణ్ణి సేవించడానికి అతడు ఇష్టపడలేదు. అందుచేత ఆ రథంతోసహా వెళ్ళి అయోధ్యలో ఋతుపర్ణుడి సేవలో నిలిచి పోయినాడు. ఆ వార్ష్ణేయుడే ఇపుడు నలుడికి సహాయకుడిగా ఉంటున్నాడు. బాహుకుడి రూపంలోని నలుడిప్పుడు వార్ష్ణేయుడు తెచ్చిన తనరథానికి తన గుర్రాలనే పూన్చి తీసుకొనివచ్చినాడు.

ఋతుపర్ణుడారథం ఎక్కేటప్పుడు ఆ గుర్రాలు వంగినాయి. అట్లా గుర్రాలు వంగడంచూచి ఋతుపర్ణుడు "ఈ బక్కగుర్రాలు అంతదూరమెట్లాపోతాయి? వేరే గుర్రాలనుపూన్చు." అన్నాడు. అందుకు బాహుకుడిట్లా అన్నాడు. "రాజా! ఈ గుర్రాలు వాయువేగంతో పరుగెత్తుతాయి. ప్రొద్దుక్రుంకకుండానే ఈ రోజే మనలను విదర్భకు చేరుస్తాయి". ఆ మాటలకు రాజు మెచ్చుకొని బాహుకునితో, "అట్లా

అయితే గుర్రాల స్వభావం తెలుసుకోవడంలోని నీ నేర్పును గుర్తించి నీవు కోరిన కోరిక తీరుస్తాను." అంటూ రథమెక్కినాడు. ఆ రథంలో ఋతుపర్ణ బాహుకులతో పాటు వార్ష్ణేయుడుకూడాఉన్నాడు.

ఆ రథం పరుగెత్తడం ప్రారంభించింది. ఎదురుగా దూరంగా చూచిన వస్తువులన్నీ క్షణంలో దగ్గరలో కనిపించేవి. మరుక్షణంలో వెనుకవైపు దూరంగా కనిపించేవి. ఋతుపర్ణుడు ఆ రథ వేగానికి ఆశ్చర్యపడినాడు. "ఇది సూర్యరథమా? లేక మనరథమేనా? ఈ రథసారథి అనూరుడా? లేకపోతే బాహుకుడా?" అనుకొన్నాడు. వార్ష్ణేయుడుకూడా బాహుకుడి రథంనడిపేనేర్పును చూచి ఆశ్చర్యపడి, మనస్సులో, "ఈతడు అశ్వశాస్త్రకర్తయైన శాలిహోత్రుడా? లేక ఇంద్రసారధి మాతలియా? లేకనలుడా? వీళ్ళెవరూకాకపోతే వేరేవాళ్ళెవరైనా ఇంతవేగంగా రథాన్నినడుపగలరా? వయస్సులో విద్యలో బాహుకుడు నలుడిలాగానే ఉన్నాడు. కానీ నలుడేఅయితే ఈ వికృత రూపమేమిటి? దేవునిఆజ్ఞతో కొంతమంది మహాపురుషులు ఒక్కొక్కసారి అజ్ఞాతంలో ఉంటారు. వీళ్ళను తెలుసుకోవడం సాధ్యమా?" అనుకుంటూ ఉండిపోయినాడు.

అప్పుడు ఋతుపర్ణుడి ఉత్తరీయంజారి రథముమీదనుండి నేలమీదపడింది. ఋతుపర్ణుడు వెనుదిరిగి చూచినాడు ఆ ఉత్తరీయం కనిపించలేదు. అప్పుడాయన, "బాహుకా! నా ఉత్తరీయం పడిపోయింది. రథ వేగాన్ని తగ్గించు. రథాన్ని కాస్తనిలుపు. వార్ష్ణేయుడు పోయి, పడిపోయిన నాఉత్తరీయాన్ని తెస్తాడు." అన్నాడు. ఆ మాటలకు బాహుకుడు, "అయ్యా! నీ ఉత్తరీయం పడినచోటు ఇక్కడకు యోజనం దూరంలో ఉంది. దానిని వార్ష్ణేయు డెట్లా తెస్తాడు?" అని తనరథవేగ మాహాత్మ్యాన్ని గురించి చెప్పినాడు. రథాన్ని నిలుపనేలేదు. అట్లా అనేక దేశాలుదాటి ఒకచోట ఒకతాండ్రచెట్టును చూచినారు. ఆ చెట్టుకు లెక్కలేనన్ని కొమ్మలు ఆకులూ పండ్లూ ఉన్నాయి. ఆ తాండ్ర చెట్టును చూచి, ఋతుపర్ణుడు "బాహుకుడు తన 'అశ్వహృదయం'అనే విద్యను ప్రదర్శించి, ఇంతవేగంగా రథాన్నినడపుతున్నాడు. నేనితనికి నా అక్షహృదయవిద్య మాహాత్మ్యం చూపించవలె." అనుకొని బాహుకునితో ఇట్లా అన్నాడు.

"బాహుకా! అందరికీ అన్నివిద్యలూ తెలియవు. ఒక్కొక్కరు ఒక్కొక్కవిద్యలో ప్రవీణులైఉంటారు. నీవు రథాన్నితోలడంలో నేర్పుకలిగినవాడవైతే, నేను అక్షహృదయ విద్యతెలిసినవాడను. చూడు. ఈ తాండ్రచెట్టుకు పండ్లెన్ని? ఆకులెన్ని? అనేది చెప్తాను. విను." అంటూ "ఈ రెండుకొమ్మల్లో కల ఆకులూ పండ్లూ పదివేలుఒకటి. మిగిలిన కొమ్మల్లోటివి రెండువేలతొంభైఅయిదు." అన్నాడు. ఆ మాటలువిని బాహుకుడు "వీటిని లెక్కపెట్టితే కానీ నమ్మను." అంటూ రథాన్ని నిలిపినాడు. వెంటనే ఆ చెట్టును పడత్రోసినాడు. ఆయాకొమ్మల్లోని ఆకులు, పండ్లు, లెక్కపెట్టినాడు. ఆశ్చర్యకరంగా ఋతుపర్ణుడు చెప్పినన్నే ఉన్నాయి. నలుడిప్పుడు కర్కోటకుడు చెప్పిన విషయాన్ని గుర్తుచేసుకున్నాడు. వెంటనే ఆ అక్షహృదయవిద్య 'తనకు కావాల'నుకొన్నాడు. ఋతుపర్ణుడితో "మహారాజా! మనం బయలుదేరేటప్పుడు

ఈ గుర్రాలు ఈరోజే మనలను విదర్భచేరిస్తే, 'నా కోరిక తీరుస్తాన'న్నారు కదా? ఇప్పుడు మనంవిదర్భ దరిదాపులలోనేఉన్నాము. మీ మాటప్రకారం నా కోరికతీర్చండి. నాకీ అక్షహృదయ విద్యను ప్రసాదించండి" అని ప్రార్థించినాడు.

అందుకు ఋతుపర్ణుడు "ఈ 'అక్షహృదయం'అనేవిద్య చాలాగొప్పది. దీనిని శాస్త్రోక్తంగా నేర్చుకొంటే, చూడగానే వస్తువులసంఖ్యలు చెప్పవచ్చు. లెక్కించనవసరంలేదు. అంతేకాదు ఈవిద్య మనుష్యులను పాపాలనుండి, దుర్గుణాలనుండి, విషంనుండికూడా రక్షిస్తుంది. ఇంకా ఈ విద్యకలవాడు అన్ని గుణాల్లోనూ ప్రసిద్ధుడవుతాడు. అందరికీ మేలుచేసేవాడవుతాడు సుమా! ఇది ఇంతటి గొప్ప విద్య. అయినా నీ కోరిక తీరుస్తాను. అన్నమాట ప్రకారము నీకీవిద్యను ఉపదేశిస్తాన"న్నాడు. వెంటనే ఆ విద్యను బాహుకుడికి శాస్త్రోక్తంగా నేర్పించినాడు.

ఈ విధంగా నలుడు ఋతుపర్ణుడివద్దనుండి అక్షహృదయవిద్యనుపొంది సంతోషించినాడు. అందుకు కృతజ్ఞతతో నలుడు ఋతుపర్ణుడితో "మహారాజా! కోరినంతనే నాకు అక్ష హృదయ విద్యను బోధించినావు. నాకు సంతోషం కలిగింది. అందుకు బదులుగా మీకు నేను అశ్వహృదయ విద్యను బోధిస్తాను. తీసుకోండి." అన్నాడు. ఆమాటలు విన్నాడు ఋతుపర్ణుడు. అయన దమయంతి స్వయంవరం చూడాలని కుతూహల పడుతున్నాడు. 'ఇప్పటికే ఆలస్యమైందేమో?' ననుకున్నాడు. అందుకని బాహుకునితో, "అట్లాగే తీసుకొంటాను. తొందరేముంది? ముందు విదర్భకు పోదాంపద. దమయంతి స్వయంవరం జరిగిపోతుందేమో? ఆ అశ్వహృదయాన్ని నీదగ్గరనే ఉండనీ. నాకు కావలసినప్పుడు అడిగి తీసుకుంటాను." అన్నాడు.

అంతలో అక్షహృదయ విద్య మహిమవల్ల, కలి నలుడిలో ఉండలేకపోయినాడు. బయటకు వచ్చినాడు. వచ్చినవాడు కర్కోటకుని విషంకక్కుతూఉన్నాడు. బయటకువచ్చిన కలి నలునికి నమస్కరించినాడు. తానెవ్వరో చెప్పినాడు. తానెందుకు అతణ్ణి ఆవహించింది, ఆపైన అతణ్ణి ఎలా కష్టపెట్టింది చెప్పినాడు. అట్లా అంతాచెప్పి, 'నలుడేం చేస్తాడో? న'ని భయపడి, వణకిపోతూఉన్నాడు. అట్లా వణకిపోయే కలిని చూచి, నలుడు కోపగించుకొన్నాడు. శాపమివ్వబోయినాడు. ఆ విషయం గ్రహించిన కలి, నలుణ్ణి ఈ విధంగా ప్రార్థించినాడు. "మహారాజా! నిన్నావహించడంవల్ల కర్కోటకుడివిషంచేత ఇంతవరకు కాలిపోయినాను. ఆ శిక్ష తక్కువదేమీకాదు. ఇంకా నాపైకోపగించుకోవద్దు. నేను నీ శరణం కోరుతున్నాను. శాపమివ్వవద్దు." ఈ మాటలంటూ ఇంకాఇట్లాఅన్నాడు." నిన్నూ నీభార్యనూ పొగడినవాళ్ళను, నేనేమీ చేయను. నా మీద దయఉంచు." అన్నాడు. ఆ మాటలువిని నలుడు శాంతించినాడు. వెంటనే కలి ఆ తాండ్రచెట్టును ఆవహించినాడు. అప్పటి నుండి తాండ్రచెట్టు చెడ్డదయింది. చెడ్డవారికి ఆశ్రయమిచ్చినవాడు చెడ్డవాడే కదా మరి? ఈ విధంగా నలుడు కలిని వదలించుకొన్నాడు. నలునికి వికారరూపంతప్ప ఇంక ఏ ఇబ్బందీ లేదు. ఆ వికారరూపం కూడా తాననుకొన్నప్పుడు తొలగిపోయేదే. బాహుకుడు, ఋతుపర్ణుడు, వార్ష్ణేయుడు, తిరిగి రథం ఎక్కినారు. సాయంకాలం లోపలనే రథం విదర్భచేరింది.

ఋతుపర్ణుడు భీమరాజు అనుమతి తీసికొని విదర్భనగరంలోనికి ప్రవేశించినాడు. అట్లా ప్రవేశించినప్పటి ఆయనరథఘోష, అన్నిదిక్కులలో ఉరుములు ఉరిమినట్లనిపించింది. దమయంతికూడా ఆ రథఘోషను విన్నది. 'ఆ రథఘోష నలుడిరథందే', అనుకొని అనురాగం పొందింది. అప్పుడు దమయంతి, "నిషధరాజూ, పవిత్రచరిత్రుడూ, లోకాలకు మేలుచేసేవాడూ, అయిన నలుణ్ణి నేడు చూడబోతున్నాను. పరాక్రమ వంతుడైన నలుణ్ణి చూడలేకపోతే, అతని కౌగిలిని అనుభవించలేకపోతే, నేను చచ్చిపోతాను." అనుకుంటూ ఆ రథంమీద వచ్చిన ఋతుపర్ణుణ్ణి చూచింది. వచ్చినవాడు నలుడు కానందుకు దుఃఖించింది.

అంతలో ఋతుపర్ణుడు భీముణ్ణి దర్శించినాడు. భీముడుకూడా ఋతుపర్ణుణ్ణి గౌరవించినాడు, పూజించినాడు. ఒక అందమైనభవనంలో అతనికి విడిదిఏర్పాటుచేసినాడు. ఋతుపర్ణుడికి ఆ నగరంలో స్వయంవరంకాదుకదా 'స్వయంవరమ'నేమాటకూడా వినిపించలేదు. ఇదంతాచూచి ఋతుపర్ణుడు మనస్సులో "భూమిమీద రాజులెవ్వరూ ఇక్కడకు వచ్చినట్లులేదు. దమయంతి కూడా నలుణ్ణికాక ఇంకొకరిని వరిస్తుందా? ఆమెఅంత ధర్మంతెలియనిదా? 'స్వయంవరమ'ంటూనే పరుగెత్తుకొని రావడమేనా? ఆలోచించుకోవద్దా?" అనుకుంటూ పెద్దగా సిగ్గుపడినాడు.

బాహుకుడు రథశాలలో రథాన్నుంచినాడు. అశ్వాలను కట్టివేసినాడు. ఆ సమీపంలోనే విశ్రాంతి తీసుకుంటూ ఉండినాడు, అప్పుడు దమయంతి ఆలోచించింది. 'కేశిని' అనే దాసిని పిలిచింది. ఆమెతో ఇట్లాఅన్నది. "ఋతుపర్ణుడేమో అయోధ్యరాజు. వార్ష్ణేయుడేమో నాకు తెలిసినవాడే. నిషధలో సారథిగా ఉండేవాడు. ఇప్పుడు ఋతుపర్ణుడివద్ద ఉన్నాడేమో? మరి మిగిలిన బాహుకుడెవరై ఉండవచ్చు? అతడిని చూస్తే నామనస్సు సంతోషపడుతూఉంది. పర్ణాదుడికి జవాబుచెప్పినవాడు ఇతడే అయిఉండవచ్చు. పర్ణాదుడుకూడా జవాబుచెప్పినవాడిపేరు బాహుకుడే అన్నాడుకదా? పైపెచ్చు ఆకారంకూడా పర్ణాదుడు వర్ణించినట్లే ఉన్నది. నీవా బాహుకుడి వద్దకుపోయి, అన్ని సంగతులు కనుక్కొనిరా." అని చెప్పి పంపింది.

ఆ కేశినిపోయి బాహుకుణ్ణి చూచింది. "దమయంతి 'నీ క్షేమసమాచారం కనుక్కొని రమ్మ'ని నన్ను పంపింది. నీ వెందుకు వచ్చావో? కూడా 'కనుక్కొనిరమ్మ'న్నది." అని బాహుకునికి చెప్పింది. బాహుకుడిట్లా సమాధానం చెప్పినాడు." దమయంతికి రెండోస్వయంవరం జరుగుతూఉన్నదని అయోధ్యలో తెలిసింది. రాజులందరనూ 'పిలిచినార'నికూడా విన్నాడు ఋతుపర్ణమహారాజు. ఆ స్వయంవరం చూచేందుకు ఒకరోజులోనే అయోధ్యనుండి ఇక్కడకు వచ్చినాడు. ఈ నూరుయోజనాలదూరం ఒకే రోజులో రావడానికి నేనతని సారథినై మనోవేగంతో వచ్చినాను." అన్నాడు. "మరి మూడోవాడెవ్వడు?" అని కేశిని ప్రశ్నించింది. అందుకు బాహుకు డిట్లాఅన్నాడు. "అతడు ఒకప్పుడు నలునిసారథి. పేరు వార్ష్ణేయుడు." "అట్లాఅయితే వాడికి నలుడిజాడ తెలియకుండాఉంటుందా?" అన్నది కేశిని. అప్పుడు బాహుకుడు తిరిగి ఇట్లాబదులుచెప్పినాడు. "వార్ష్ణేయుడు నలుని బిడ్డలను విదర్భలోఉంచి, తిరిగి నిషధకుపోతూ మధ్యలోనే

నలుడు రాజ్యం 'పోగొట్టుకొన్నాడ'ని విన్నాడు. పుష్కరునివద్ద కొలువు చేయడం ఇష్టంలేక ఋతుపర్ణుడి కొలువులోచేరినాడు. వానికి నలునిజాడ తెలియదు. నలునికిగాని నలునితోపాటుపోయిన దమయంతికిగానీ తెలియవలె, కానీ మిగితావారికీ విషయంతెలిసేఅవకాశం లేదుకదా?" ఆ మాటలువిని కేశిని ఇట్లాఅన్నది.

"అడవిలో సగంచీరను దొంగిలించి, దయలేకుండా భర్త తన్నువదలిపోతే, ఆనాటి అర్ధచీరతోనే ఆ దమయంతి ఇప్పుడుకూడాఉంది. దుమ్ముతోమలినమైన శరీరంతో, జడలుకట్టిన ముంగురులతోనే ఉంది. నేలమీదనే పడుకుంటూఉంది. దమయంతి అంతటిధర్మమూర్తి. ఆమె పుణ్యవ్రతాలు చేస్తూ ఉంది." ఇట్లా అనే కేశినిమాటలువింటూ నలుడు ఎడతెరిపిలేకుండాకారే కన్నీటితోనిండినకళ్ళు, తెలియకుండా ముఖంవంచుకొని వేరేదిక్కుకు చూస్తూఉండినాడు.

కేశిని ఈ విషయాన్నంతా గమనించింది. దమయంతివద్దకు తిరిగిపోయింది. బాహుకుని ఆకారము, మాటలు, ప్రవర్తనా, అంతా దమయంతికి వర్ణించి చెప్పింది. "అతడు నలుడేనేమో?" అనే అనుమానం దమయంతికి బలపడింది. తిరిగి కేశినితో "నీ వింకొకతూరి బాహుకుడి దగ్గరకు పో. అతడు ఋతుపర్ణుడికి 'వంటలవాడుకూడాన'ని పర్ణాదుడు చెప్పిఉన్నాడు కదా? అతడు వండేటప్పుడు అతని పద్ధతులను పూర్తిగా తెలుసుకొనిరా. పో." అని చెప్పి పంపించింది.

కేశిని తిరిగి బాహుకునివద్దకు వెళ్ళింది. అతడు వంటచేయడాన్ని గమనించింది. తిరిగివచ్చింది. దమయంతికి వివరంగా ఇట్లాచెప్పింది. "వినవమ్మా ! అతడు గడ్డి పిడికిలితోపట్టుకొని వీచినాడు. అంతే. అగ్ని పుట్టింది. అతనివంటపూర్తిఅయ్యేదాక ఇంకేఇంధనాలు లేకుండానే ఆరిపోకుండా మండుతూనే ఉంది. ఇంకా మాంసాలు కడగడానికి నీరు కావాలనుకోగానే నీరు పుట్టింది. కుండలన్నీ నిండిపోయినాయి. ఇంకా దివ్యమైన నీటివెల్లువ వస్తూనేఉంది. 'వద్ద'నగానే మానుకుంది. అతడు చేతులతో నలిపితే పూలుకందిపోయికూడా తమసువాసనలను వదలలేదు. అతడు చాలాఉన్నతతేజం కలవాడిగా కనిపించినాడు."

కేశిని ఇట్లాఅనగా విని, దమయంతి మళ్ళీ కేశినిని పంపి, బాహుకుడు వండిన మాంసాలు తెప్పించి రుచి చూచింది. అది ఆమెకు నలుని వంటలాగానే అనిపించింది. అందుచేత బాహుకునిలో 'నలుని లక్షణా లున్నాయ'ని దృఢంగా నిశ్చయించుకొన్నది.

అంతటితో తృప్తిచెందలేదు. ఇంకాబాగాపరీక్షించ దలచుకొన్నది. ఈ సారి కేశినితోపాటు తనపిల్లలనుకూడా బాహుకునివద్దకు పంపింది. నలుడా పిల్లలనుచూచి వశంతప్పినాడు. కన్నీరు కార్చినాడు. పిల్లలిద్దరనూ ఎత్తుకొన్నాడు. సంతోషంకలిగింది. ఒళ్ళు గగుర్పొడిచింది. వారిద్దరనూ తనఒడిలో కూర్చోపెట్టుకొని ఆదరించినాడు. ఇదంతా చూస్తున్న కేశినిని చూచి, "ఈ పిల్లలిద్దరూ నాపిల్లలలాగానే

ఉన్నారు. నేను నాపిల్లలకు చాలాకాలంనుండి దూరంగాఉన్నాను. అందుకే వీరి నెత్తుకొన్నప్పుడు ఏడ్పును ఆపుకోలేకపోయినాను." అని కేశిని తనను గుర్తించడానికి వీలులేకుండా మాట్లాడినాడు. ఇంకా "కేశినీ! నీ విక్కడికి మాటిమాటికి వస్తూపోతూ ఉండడం చూస్తే జనుల మనస్సుల్లో నన్ను వేరుగా భావిస్తారు. పనిగట్టుకొని ఇంక నీవు ఇక్కడకు రావద్దు. మేము పరదేశము నుండి వచ్చిన అతిథులము. నీకు మాతో ఏంపని?" ఇట్లా కేశినిని పంపివేసినాడు. కేశిని మళ్ళీ మళ్ళీ వస్తే 'తన సంగతి బయట పడుతుందేమో?'న'ని ఆమెను మళ్ళీ 'రావద్ద'న్నాడు నలుడు.

ఆ మాటలన్నీ విన్న కేశిని తిరిగివచ్చి బాహుకుని విషయమంతా దమయంతికి చెప్పింది. దమయంతి సంతోషించింది. తన సందేహాలన్నీ తీరిపోయినాయి. 'బాహుకుడే నలుడు' అనే నిశ్చయానికి వచ్చింది.

దమయంతి ఇట్లానిశ్చయించుకొని తల్లిదగ్గరకువచ్చి ఇట్లాఅన్నది. "అమ్మా! సందేహంలేదు ఏ గుణం పరిశీలించినా 'బాహుకుడే నలుడ'ని తెలిపోయింది. నా మనసులో గొప్పగా ఆనందం కలుగుతూ ఉంది. అతన్ని ఇక్కడకు పిలిపిస్తావా? లేక నన్నక్కడికి పొమ్మంటావా? వేగంగా నిశ్చయించు".

కూతురిట్లాఅనగానే ఆమె భర్త భీముని అనుమతి తీసికొన్నది. బాహుకుణ్ణి దమయంతివద్దకు పిలిపించింది. నలుడు వచ్చినాడు. దమయంతిని చూచినాడు. అప్పుడు దమయంతిముఖం అతిదీనంగా ఉంది. దేహమంతా దుమ్ముతో మాసిపోయి ఉంది. బాగా చిక్కిపోయిఉంది. ముఖమంతా కన్నీటి చారికలే ఉన్నాయి. తపస్వినిలాగా కనిపిస్తూఉంది.

దమయంతికూడా నలుని వికృతరూపం చూచింది. అయినా అతనిని వేరేవానిగా అనుకోలేదు. బాహుకుణ్ణి నలుడిగానే భావించింది. ప్రేమ కనబరచింది. సిగ్గుపడింది. ఆత్మవశం తప్పింది. తత్తర పాటుతో ఇట్లాఅన్నది.

"జనంలేనిఅడవిలో అలసి నిద్రపోయిన స్త్రీని, అందులోనూ అగ్నిసాక్షిగా పెళ్ళాడినభార్యను, సాధ్వియైన దానిని వదలి, నలునిలాగా దయలేకుండా పోయిన వాళ్ళెవరూలేరు. దేవతలు కోరితేకూడా 'కాద'ని, నేనాయనను వరించి పెళ్ళాడినాను. అట్లాంటి దాననూ సంతానవతినీ అయిన నన్ను ఎందుకనో? వేగంగా వదలినాడు. అతనికంత కాఠిన్యం కలగడానికి నేనేం తప్పుచేసినానో? 'నిన్ను వదలను. భయపడవద్దు.' అన్న తనమాటలను తాను ఎందుకు మరిచిపోయినాడో? ఎట్లా మరిచి పోయినాడో?" ఇట్లా అంటూ దమయంతి ఏడ్చింది. ఆమె ఏడవటంతో కన్నీరు కండ్లనుండిజారి, ముఖం అంతా తడిసి, క్రిందికిదూకి, చనుకట్టుపై వరదకట్టింది. ఆ దృశ్యము, 'ఆ దమయంతి తనమండేగుండెను కన్నీటితో చల్లార్చుకుంటున్నదేమో?' అనిపించింది. ఇదంతాచూచి నలుడు దుఃఖంతో పరితపిస్తూ ఇట్లాఅన్నాడు. "కలి నన్నావహించడంవల్ల, బుద్ధిచెడి, మనమిన్ని కష్టాలను అనుభవించవలసి వచ్చింది. నా తపశ్శక్తి

చేతనూ, నీ దుఃఖమనే నిప్పువల్లనూ, ఆ కష్టాలన్నీ తొలగిపోయినాయి. ఇప్పుడు కలి నన్ను వదలిపోయినాడు. నేనిక్కడకు నీకోసమే వచ్చినాను. అది అట్లుండనీ. నన్ను, నీ మీద ప్రేమ ఉన్నవాడిని, సహధర్మచారిని, మరచిపోయినావా? పరపురుషుణ్ణి వరించడానికి స్వయంవరం ఏర్పాటుచేసినావా? ఇది కులస్త్రీ ధర్మమా? ఈ స్వయంవరానికి రాజుల నందరనూ పిలవడం చేతనేకదా? ఋతుపర్ణుడు వచ్చినాడు".

ఈ మాటలకు భయపడి నమస్కరిస్తూ దమయంతి ఇట్లాఅన్నది. "నిన్ను వెతకడానికి పోయిన బ్రాహ్మణులు అన్నిచోట్ల నేను చెప్పమన్నమాటలు చెప్పినారు. వారిలో అయోధ్యకు వచ్చిన 'పర్ణాదుడ'నే బ్రాహ్మణుడు నీ ప్రత్యుత్తరంవల్ల నిన్ను గుర్తించినాడు. ఆ పర్ణాదునివల్లనే నీ గురించి నేను తెలుసుకొన్నాను. నిన్నిక్కడకు పిలిపించే ఉపాయం ఆలోచించినాను. 'సుదేవుడ'నే బ్రాహ్మణుణ్ణి అయోధ్యకు పంపినాను. అతడిని ఋతుపర్ణుడితో, 'రేపే దమయంతి స్వయంవరమ'ని చెప్పమన్నాను. ఆయన అట్లే చేసినాడు. ఓ రాజా! నలమహారాజు తప్ప ఇంకేమనిషికూడా 'నూరుయోజనాలదూరం ఒక్కరోజులో రాలేర'ని తలచినాను. అందుకని ఆ విధంగా చెప్పించినాను. మహావీరా! నలమహారాజా! నాకెలాంటి పాపపుతలపులేదు. అపచారాన్ని చేయదలచలేదు. ఈ విషయం నీ పాదాల సాక్షిగా చెప్పగలను. నాలో ఏవైనా చెడుతలుపులు ఉన్నట్లైతే ఈ సూర్యుడు, ఈ అగ్ని, ఈ చంద్రుడూ, ఈ దిక్పాలకులూ, కోపగించుకొని నన్నీక్షణంలోనే చంపివేసి ఉండరా?" ఆమె అట్లాఅంటున్నసమయంలోనే సమస్త భూతాలలో ఒకడైనవాయుదేవుడు ఆకాశంనుండి అందరూ వినేటట్లు నలుడికి ఇట్లాచాటి చెప్పినాడు.

"రాజోత్తమా! నలమహారాజా! ఈ దమయంతి స్వచ్ఛమయినది. పతివ్రత. ఆమెనిట్లా అంటావా? ఆమె శీలాన్ని చంద్రుడూ, సూర్యుడు, నేనూ, కలిసి ఈ మూడు సంవత్సరాలు కాపాడినాము. ఈమె నీపై ప్రేమ గలిగినది. ఆనందంగా ఆమెను గ్రహించు".

ఈ విధంగా అందరికీ ఆశ్చర్యం కలిగేట్లు వాయుదేవుడు, తానెవరో చెప్పి, దమయంతి పతివ్రతా లక్షణాలను తెలియచేసినాడు. ఆమెకు తనభర్తపై గల స్వచ్ఛమైన ప్రేమనుకూడా చెప్పినాడు. అదంతా విని నలుడు ఆనందపడినాడు. ఆయన హృదయమంతా ఆనందంతో నిండిపోయింది. తక్షణం కర్కోటకుణ్ణి తలచుకొన్నాడు. కర్కోటకుడు వెంటనే వస్త్రాన్ని పంపినాడు. నలుడా వస్త్రాన్ని ధరించినాడు. బాహుకుడి వికారరూపం పోయింది. నలుని సహజసుందరరూపం వచ్చింది. దమయంతి మిక్కిలి సంతోషించింది. ఆమె చుట్టాలు, మిత్రులు కూడా ఆశ్చర్యపడినారు. ఆనందించినారు.

ఈ విషయాలన్నీ తెలుసుకొని ఋతుపర్ణ మహారాజు నలుడిదగ్గరకు వచ్చినాడు. నలుడితో ఇట్లా అన్నాడు." నలమహారాజా! జగత్పూజ్యుడివి నీవు. బాహుకుడిరూపంలో ఉండడంచేత, నీవెవరో తెలియక నిన్ను అల్పకార్యాలకు వినియోగించినాను. నన్ను క్షమించు". అని ప్రార్థించినాడు.

నలుడు ఋతుపర్ణుణ్ణి సత్కరించి, అతనికి 'అశ్వహృదయవిద్యను' బోధించి, గౌరవంగా అయోధ్యకు పంపివేసినాడు.

నలుడు ఒకనెలపాటు దమయంతితోకూడి ఆనందంగా విదర్భలో సుఖంగాఉండినాడు. తరువాత దమయంతిని విదర్భలోనే ఉంచినాడు. విదర్భేశ్వరుడైన భీమసేనుడిని వేడుకొని ఒకరథం, పదారుఏనుగులు, యాభైగుర్రాలు, ఆరువందలమంది కాల్బలాన్ని తోడుతీసికొని నిషధపురానికి పోయినాడు. అక్కడ పుష్కరుణ్ణి కలుసుకొన్నాడు. అతనితో ఇట్లాఅన్నాడు. "నీకు జూదమాడటం ఇష్టమయితే నేను దమయంతిని పణంగాపెట్టి జూదమాడటానికి సిద్ధంగాఉన్నాను. నీవు ఈ రాజ్యాన్నంతా పణంగాపెట్టి జూదమాడటానికి సిద్ధంకా. అట్లాకాకపోతే 'రాజ్యము వీరభోజ్య'మనే విషయం తెలిసిందేకదా? నీవూ నేనూ శౌర్యంతో రథాలెక్కి పరాక్రమంతో గొప్పగా యుద్ధంచేద్దాం. యుద్ధంలో జయించినవాడే ఈ రాజ్యాన్ని వీరుడుగా ఏలుకుంటాడు. ఈ రెండింటియందు నీకేది ఇష్టమైతే దానికే పూనుకో"

ఆ మాటలు విని పుష్కరుడు "యుద్ధంలో నేను గెలవడం సాధ్యంకాదు. ఇంతకుముందే ఓడిపోయిఉన్నానుకదా? మునుపు జూదంలోగెలుచుకొనిఉన్నాను. కాబట్టి ఇప్పుడు కూడా గెలుచుకొని దమయంతినికూడపొంది కృతార్థుడనవుతాను." అనుకొని పుష్కరుడు సంతోషించినాడు. నలుడుకోరినపందెంతో జూదమాడటానికి సిద్ధమయినాడు. ఇద్దరూ జూదమాడినారు. నలుడు గెలిచినాడు. పుష్కరుడోడినాడు. అందరికీ తెలిసేట్లుగా రాజ్యాన్నంతా రెండోసారి జరిగినజూదంలో పుష్కరుడి నుండి నలుడు గెలుచుకొన్నాడు. ఇట్లా గెలుచుకొన్న తరువాత నలుడు పుష్కరునితో ఇట్లాఅన్నాడు.

"ఇంతకుమునుపు కలి నన్నుఆవహించిఉండినాడు. అందుచేత నాకుబలంనశించిఉండింది. నీవు బలవంతం చేస్తే, జూదంఆడి, కలి మోసంచేత, ఓడిపోయినాను. అది నీ 'బలమ'నుకొని గర్వపడవద్దు. నీవు నాకు పినతండ్రి కుమారుడవు. అందువల్ల నీకు నేను ఎటువంటి కీడునుచేయలేను. పో." ఇట్లా అని నలుడు పుష్కరుణ్ణి వదలిపెట్టి రాజ్యాన్ని ఏలుతూఉండినాడు.

భీమరాజు పంపగా, దమయంతి పిల్లలతో పాటుగా, తాను లక్ష్మిలాగావెలుగుతూ, తనభర్తకడకు వచ్చింది. ఆ తర్వాత నలుడు తనభార్య దమయంతితో కలిసి చాలాయాగాలు చేసినాడు. దేవేంద్రవైభవంతో తనరాజ్యాన్ని పాలించుకున్నాడు.

**నీతి :** (అ) జూదం చాల చెడ్డది. ఇది సప్తవ్యసనాలలో ఒకటి ఆసప్తవ్యసనాలు ఇవి

1. వ్యభిచారము 2. జూదం 3. మత్తుపదార్థాలను సేవించడం 4. ధనాన్ని ప్రయోజనం లేకుండా వృథా చేయడం 5. కరుకుగా మాట్లాడడం 6. కఠినంగా శిక్షించడం (అపరాధాన్ని మించి) 7. వేట.

(ఆ) సచ్ఛీలం ఆలస్యంగా నైనా మేలు చేకూరుస్తుంది.

**విశేషం :** అక్షౌహిణి లేక అక్షోహిణి అంటే 21,870 రథాలు, 21,870 ఏనుగులు, 65,610 గుర్రాలు మరియు 1,09,350 మంది కాల్బలము కలిగిన సేన.

**అనూరుడు :** ఇతడు వినతాసుతుడు. గరుత్మంతుని అన్న. సూర్యరథసారథి.

**మాతలి:** ఇంద్రుడి రథసారథి

**శాలిహోత్రుడు :** అశ్వశాస్త్రాన్ని రచించిన ఒకానొకముని.

**మత్తకోకిలము :**

వారిభక్షులు పర్ణభక్షులు వాయుభక్షులు శాకనీ
వారభక్షులు వృక్షమూల నివాసయుక్తులునై తపం
బారఁజేయు మహామునీంద్రుల యాశ్రమం బెడఁగాంచె నం
భోరుహాక్షి పురాసమార్జితపుణ్యకర్మఫలంబునన్. **2-97**

క. **ఈతండు శాలిహోత్రుఁడొ! మాతలియో! నలుఁడొ! యొరులు మానవులు జవో
పేతముగ నిట్లు రథహయనీతి యెఱుంగుదురె? ధారుణీ వలయమునన్.** **2-172**

ఉ. **ఆయతబాహుఁ, దప్తకనకాంచితవర్ణు, మనోజరూపు, నిం
ద్రాయితు, సూర్యతేజు, నిషధప్రభు, నన్నలుఁజూచి, పద్మప
త్రాయతనేత్ర యప్డు దమయంతి, గరంబు ముదంబు నొంది ల
క్ష్మీయుత యయ్యె, బంధులకు మిత్రులకున్ హృదయప్రియంబుగన్.** **2-220**

క. **దమయంతి రోయిగా జూ దము నీతో నాడఁగడఁగెదను, ధరణీరా
జ్యము నీవు నాకు రోయిడు, మమరఁగ జూదంబు నీకు నభిమతమేనిన్.** **2-222**

**మత్తకోకిల :**

**వీరభోజ్యము సుమ్ము రాజ్యము వింటె? నీవును నేను దు
ర్వారవృత్తి రథంబు లెక్కి యవంధ్యవిక్రమ మేర్పడన్
భూరివీరరణం బొనర్తము; పోర నోర్చినవాఁడ యి
ద్ధారుణీతల రాజ్యసంపదఁ దాల్చు వీరగుణోన్నతిన్.** **2-223**

# 10. అగస్త్యుడు - లోపాముద్రల కథ.

**(అరణ్య 2-319 నుండి 353వరకు.)**

**(పాండవుల అరణ్యవాసకాలంలో రోమశమహర్షితోపాటుగా తీర్థయాత్రలుచేస్తూ గయవద్దగల అగస్త్యాశ్రమాన్ని చూచినారు. అప్పుడు ధర్మరాజు అడుగగా రోమశమహర్షి ఈ కథను చెప్పినాడు.)**

పూర్వమొకప్పుడు 'ఇల్వలుడు వాతాపి' అనే సోదరులిద్దరుండేవారు. వారిద్దరూ గొప్పరాక్షసులు ప్రసిద్ధమైన బలంకలిగినవారు. శత్రుసంహారం చేయగలిగినవారు. 'భయమ'ంటే ఏమిటో తెలియనివారు. వారిద్దరూ మణిమతీపురంలో వైభవోపేతంగా నివసిస్తుండేవారు.

వారిలో అన్నఅయిన ఇల్వలుడు, ఒకనాడు ఒకవిప్రుని భక్తితో పూజించినాడు. "నాకు కోరిన కోరికలన్నీ ఈడేరే మంత్రాన్ని ఉపదేశించండి." అని ప్రార్థించినాడు. ఆ బ్రాహ్మణుడు ఇల్వలుడికి అటువంటి మంత్రమేదీ ఉపదేశించలేదు. అందుచేత ఇల్వలుడు మిక్కిలి కోపగించుకొన్నాడు ఆ బ్రాహ్మణుడిని 'సాధించాల'నుకున్నాడు.

కోరినరూపం ధరించగల తనతమ్ముడు వాతాపిని, 'మేకనుకమ్మ'న్నాడు. ఆ మేకను ఇల్వలుడు చంపినాడు. ఆ మేక మాంసాన్ని బాగావండించినాడు. ఆ వండినమాంసంతో ఆ బ్రాహ్మణునికి విందు చేసినాడు. వాతాపి ఆయనకడుపులో మాంసరూపంలో ఉండినాడు. ఇల్వలుడు, వీరుడూ తనతమ్ముడూ అయిన వాతాపిని, "వాతాపీ! రా." అని ప్రేమగా పిలిచినాడు. ఆ వాతాపి తిరిగిబ్రతికి, వేగంగా బ్రాహ్మణుని కడుపు చీల్చికొని బయటకువచ్చినాడు. బ్రాహ్మణుడు చచ్చినాడు. దాంతో మొదలుపెట్టి ఇల్వలుడు తనదగ్గరకు అతిథులైవచ్చే బ్రాహ్మణులనందరనూ అదేవిధంగా చంపుతూఉండేవాడు.

అదేకాలంలో అగస్త్యుడనే ఒకమహాఋషి ఉండేవాడు. అతడు బ్రహ్మచర్యదీక్షతో చాల భయంకరమైన తపస్సుచేస్తూ అడవుల్లోతిరుగుతూఉండేవాడు. అతడొకరోజు ఒకఅందుగుచెట్టు చిగురించినకొమ్మకు తల్లక్రిందులుగా వేలాడుతూఉండిన కొంతమందినిచూచినాడు. "ఇట్లా మీరుండడానికి కారణమేమి?" అని వారిని అడిగినాడు. అందుకు వారిట్లాఅన్నారు.

"అయ్యా! మేము మీ పితృదేవతలం. నీవు సంతతిని కోరకుండా, బ్రహ్మచారివై, అధికనిష్ఠతో తపస్సు చేస్తున్నావు. ఆ కారణంగానే మాకు ఉత్తమలోకాల ప్రాప్తికలుగలేదు. ఇంకనైన నీవు పెళ్ళి చేసుకొని, సంతానాన్ని పొందితే, మేము పుణ్యగతిని పొందగలము." అందుకు అగస్త్యుడు " అట్లే చేస్తాను." అన్నాడు.

ఆ తరువాత అగస్త్యుడు తన తపశ్శక్తితో 'పుత్రులుకావాల'ని కోరుకొనే విదర్భరాజుకు ఒక కూతురును పుట్టించినాడు. ఆమె 'లోపాముద్ర'అనే పేరుతో విదర్భరాజుఇంట పెరిగింది. ఆమె నీళ్ళలో పద్మంలాగా ప్రకాశించింది. నీతివంతుడిపట్ల లక్ష్మిదేవిలాగా ఉండింది. ప్రయత్నంచేసేవాడిపట్ల విద్యలా పెరిగింది. యౌవ్వనవతీ, రూపవతీ, అయింది. తనతో జోడుకుదిరిన నూరుగురు చెలికత్తెలతో శోభిల్లుతూ ఉండింది.

కూతురికి తగినభర్తకొరకై విదర్భరాజు వెతుకుతూ ఉండినాడు. రాజశ్రేష్ఠులంతా ఆమెను పెళ్ళాడాలని ఉబలాట పడేవారే. వారందరూ మన్మథతాపంతో బాధపడుతూ ఉండేవారే. కానీ అగస్త్యునికి 'కోపం వస్తుందేమోన'అని ఆమెను వరించడానికి ఎవరూ ముందుకురాలేదు.

ఆ సమయంలో అగస్త్యుడు విదర్భరాజువద్దకు వచ్చినాడు. "నాకు లోపాముద్ర నివ్వండి." అని అడిగినాడు. విదర్భరాజు తనకూతురును ఆ అగస్త్యమునికి ఇవ్వడానికి ఇష్టపడలేదు. మనస్సులో దుఃఖించినాడు. లోపాముద్రను చూచి తనలో, "నార చీరలు కట్టుకొని, ఆకులు అలుములుతిని, అడవుల్లో ఉంటాడీ అగస్త్యుడు. భయంకరమైన తపోభారంతో బక్కచిక్కిఉంటాడు. ఈ తీగలాంటి శరీరంకలిగిన లోపాముద్రను పెండ్లిచేసుకొంటే ఆమెనుకూడా 'తనలాగే ఉండమ'ని నియోగించకుండా ఉంటాడా? ఈ విషయం తెలిసి తెలిసీ, భోగ భాగ్యాలతో తులతూగిన నా కూతురును ఎట్లా ఇవ్వగలను? ఇవ్వకపోతే ఈ ముని శపిస్తాడు కానీ ఎందుకు సహిస్తాడు? ఇంక ఎట్లా చేసేది?" అనుకొని ఆ విదర్భరాజు తనభార్యతో పాటుగా దుఃఖిస్తూ ఉండినాడు.

అప్పుడు లోపాముద్ర తల్లిదండ్రులవద్దకువచ్చింది. "మీరేం దుఃఖపడకండి. ఈ మునిశ్రేష్ఠుడికి సంతోషంగా నన్నివ్వండి" అన్నది. లోపాముద్ర చెప్పిన ఈ మాటలువిని తల్లిదండ్రులిద్దరూ సంతోషించినారు. మహావైభవంగా, శాస్త్రాలలో చెప్పిన పద్ధతిలో, ఆ లోపాముద్రను అగస్త్యునికి ఇచ్చి పెండ్లిచేసినారు.

తరువాత అగస్త్యుడు, లోపాముద్ర ధరించిన మేలైన వస్త్రాలు, నగలు తీసివేయించినాడు. నార చీరలు జింకచర్మాలు కట్టించినాడు. ఆమెను తీసికొనిపోయి, గంగాద్వారంలో తపస్సుచేస్తూఉండి పోయినాడు. అట్లాఉండి ఒకనాడు లోపాముద్రను శృంగారభావంతో చూచినాడు. ఆ లోపాముద్రకు లోతైనబొడ్డు ఉన్నది. కన్నులు ఎప్పుడూ కదులుతూనే ఉన్నాయి. పెద్దగుండ్రని పిరుదులు ఉన్నాయి. అట్లాఉన్న ఆమెను చూచి, సంభోగించడానికి పూనుకున్నాడు. ఆమెకూడా ఆమునిశ్రేష్ఠుని అభిప్రాయాన్ని తెలుసుకొన్నది. సిగ్గు పడింది. పద్మాలవంటి తనచేతులను జోడించి ఇట్లాఅన్నది.

"భర్త, పిల్లలకొరకై, భార్యను ధైర్యంగాపొందడం ఎక్కడైనా ఉన్నదే. అయినా నన్ను మిక్కిలి కాంతిగలవస్త్రాలతో, ఆభరణాలతో అలంకరించి నా మనస్సుకు సంతోషంకలిగించు. ఓమునిశ్రేష్ఠా! నీవుకూడా పరిమళంతో కూడిన మైపూతలు పూసుకో. పూలమాలలు, భూషణాలు ధరించు. ఆ తరువాత ఈ ఋతుకాలం తప్పకుండా దయతో నన్నుసంభోగించు. నాకు గర్భాధానంచేయి."

అందుకు అగస్త్యుడు, "నాకు తపోధనమేకాని, ఇతరధనాలేవీలేవు. నీవు కోరినట్లు నేనెట్లా చేయగలను? 'తపశ్శక్తివల్ల దేన్నైనా పొందవచ్చున'ంటావేమో? నేను తపశ్శక్తిని వ్యయంచేయలేను." అని చెప్పినాడు.

కాని లోపాముద్రను అమె కోరిక మేరకే సంభోగించదలచుకొన్నాడు. తన తపశ్శక్తిని మాత్రము 'వ్యయం చేయకూడద'ను కొన్నాడు. ఇంక మిగిలింది యాచన మాత్రమే. వెంటనే ధనాన్ని యాచించడానికి శ్రుతర్వుడు అనే రాజుదగ్గరకు పోయినాడు. ఆ రాజు అగస్త్యుణ్ణి గౌరవించినాడు. పూజించినాడు.

అగస్త్యుడు శ్రుతర్వునితో, "నేను ధనం యాచించడానికి వచ్చినాను. నీవు పోషించవలసిన వారి పోషణకు భంగంకలుగకుండా, మిగులు ధనమేదైనాఉంటే నాకివ్వు." అన్నాడు. ఆ రాజు తనకు 'ఆదాయ వ్యయాలు సమానంగా ఉన్నాయ'నీ, 'మిగులేమీలేద'నీ విన్నవించుకొన్నాడు.

వెంటనే అగస్త్యుడు ఆ రాజునుకూడా తీసికొని, బ్రధ్నశ్వుడుఅనే ఇంకొకరాజు దగ్గరకు పోయినాడు. ఆ రాజు కూడా వీరిద్దరినీ భక్తితో పూజించినాడు. వారు వచ్చిన కార్యం అడిగి తెలుసుకొన్నాడు. తనవద్దకూడా ఆదాయవ్యయాలు సమానంగాఉన్న విషయాన్ని విన్నవించినాడు.

అగస్త్యుడు ఆ ఇద్దరనూ తీసుకొని త్రసదస్యుడు అనే వేరొక రాజు దగ్గరకు పోయినాడు. పురుకుత్సుని కుమారుడైన త్రసదస్యుడు, చాలా ఇష్టంగా వారినందరనూ పూజించినాడు. ఆతరువాత ఆ త్రసదస్యుడు కూడా మునుపటిరాజులు చెప్పినట్లే తనకునూ 'ఆదాయవ్యయాలు సమానమ'నిచెప్పి, ఇంకాఇట్లా చెప్పినాడు.

"ఈ దగ్గరలోని మణిమతీపురంలో 'ఇల్వలుడ'నేవాడు తనతమ్ముడు వాతాపితో పాటుగా ఏ కొదువా లేకుండా మిక్కిలి సంతోషంగా ఉన్నాడు. ఈ భూలోకంలో అందరకంటే వాడే ధనవంతుడు. అతడు మనకోరిక తప్పక తీర్చగలడు."

ఇట్లా చెప్పి త్రసదస్యుడు ఆ ఇద్దరు రాజులనూ అగస్త్యుణ్ణి తీసుకొని ఇల్వలుని వద్దకు పోయినాడు. ఇల్వలుడు వీరు నలుగురిని అతిథి సత్కారాలతో పూజించినాడు. వాతాపిని ఎప్పటి లాగానే వధించి అగస్త్యునికి ఆహారంగా సమర్పించినాడు. ఆ విషయం తెలుసుకొని, ఆ ముగ్గురురాజులూ అగస్త్యునికి మ్రొక్కి ఇట్లా అన్నారు. "బ్రాహ్మణ శ్రేష్ఠులకు వీని తమ్ముడైన వాతాపి ఆహారమై, తరువాత వారి పొట్టలను చీల్చుకొని బయటకు వచ్చి, వారిని చంపుతాడు. అందువల్ల వీని ఇంట్లో భోజనం చేయకూడదు. మనకు వీడు ధనమిస్తే సంతోషంగా తీసికొనిపోదాము."

గొప్పవాడైన అగస్త్యమునిశ్రేష్ఠుడు వారిమాటలు విన్నాడు. భయపడలేదు. భయపడకపోగా సంతోషించినాడు. మొక్కవోని బలంకలవాడై, గొంతుదాకా ఎక్కువగా భోజనము చేసినాడు. ఆ తరువాత ఇల్వలుడు ఎప్పటిలాగా వాతాపిని పిలువబోయినాడు. ఆ విషయం తెలుసుకొని అగస్త్యుడు కడుపు నిమురుకుంటూ 'గఱ్ఱ'ని తేనిచినాడు. వాతాపి ఆ క్షణంలోనే జీర్ణమయినాడు.

ఇల్వలుడికి 'వాతాపి జీర్ణమైపోయినాడ'ని అర్థమైపోయింది. భయపడినాడు. తమ్ముడు చని పోయినందుకు దుఃఖించినాడు. తానుచేసిన మోసం బయటపడకుండా ఉండేందుకు సంతోషంగా ఉండినట్లు నటించినాడు.

అగస్త్యునికి నమస్కారము చేసినాడు ఇల్వలుడు. ఆయనరాకకు 'కారణంతెలుపమ'ని ప్రార్థించినాడు. అగస్త్యుడు అతడికి ఇట్లాబదులుపలికినాడు.

"నీదగ్గర ధనంఉండడం తెలుసుకొన్నాను. ఈ రాజశ్రేష్ఠులతోకూడి నేను ధనంకోసం నీ వద్దకు వచ్చినాను." అందుకు ఇల్వలుడు వెంటనే, "అట్లయితే మీ కోరికఎంతో చెప్పండి. మీ కోరిక ఎంతైతే అంత ధనమిస్తాను." అన్నాడు.

అందుకు సమాధానంగా అగస్త్యుడు "పదివేలపాడి ఆవులను, పదివేల గద్దియల బంగారాన్నీ, ఈ రాజులకు ఒకొక్కరికి ఇవ్వు. ఇంక నాకు ఇరవై వేల పాడి ఆవులు, ఇరవై వేల గద్దియల బంగారము, ఒక బంగారు తేరునూ, ఇవ్వు." అన్నాడు.

ఇల్వలుడు తక్షణం అగస్త్యుడు చెప్పినంతధనం ఆ ముగ్గురు రాజులకుఇచ్చినాడు. ఇంకా 'విరావము సురావము' అనే పేర్లుగల గుర్రాలను పూన్చిన బంగారు రథాన్ని ఇరవైవేల పాడిఆవులనూ ఇరవైవేల గద్దియల బంగారాన్నీ అగస్త్యుని కిచ్చినాడు.

ఆ రథంలో అగస్త్యుడూ ఆ ముగ్గురు రాజులూ కూర్చున్నారు. వారందరి బంగారాన్నీ అందులో ఉంచినారు. పాడిఆవులు వెంటరాగా ఆ రథం అగస్త్యాశ్రమాన్ని చేరింది. ముగ్గురురాజులు అగస్త్యుని వద్ద వీడ్కోలుపొందినారు. వారివారి పాడిఆవులను, బంగారాన్నీ, తీసుకొని తమ తమ నగరాలకు చేరుకున్నారు.

తరువాత అగస్త్యుడు లోపాముద్ర కోరిన కోరికను తీర్చి ఇట్లాఅన్నాడు."ఓ కమలాక్షీ! నీకు సాధారణమైన కుమారులు నూరుమంది కావాలా? లేక నూరుమందితో సమానమైన పదిమంది కొడుకులు కావాలా? లేక వేయి మంది పుత్రులు కావాలా? వేయిమందితో సమానమైన ఉత్తముడైన సంతానం ఒకడు కావాలా?"

ఆ మాటల కానందించిన హృదయంతో లోపాముద్ర అగస్త్యునితో ఇట్లాఅన్నది. " వేయి మందితో సమానమైన, మహాబలం, గుణం, కలిగిన ఒకకొడుకునే పొందాలనుకుంటున్నాను. గుణవంతులు కానివారువేయిమంది సుతులైనా లాభమేముంది?".

ఆ మాటలకు అగస్త్యుడు సంతోషించి, "నీవు కోరినట్లుగా, నీకు గుణవంతుడైన కొడుకు పుడతాడు." అనిచెప్పి, ఆమెకు గర్భాధానం చేసినాడు.

లోపాముద్ర ఏడేండ్లు గర్భందాల్చింది. ఆమెకు 'దృఢస్యుడు'అనే పేరుగల పుత్రుడు పుట్టినాడు. వాడు పుట్టుకతోనే లోకాలన్నీ వెలిగిస్తూ సూర్యతేజస్సును కలిగిఉండినాడు. అతనికి ఎటువంటి లోపాలు లేవు. అతడు వేదాలను అంతరార్థంతో సహా జపంచేసేవాడు.

ఆ తరువాత అగస్త్యుడు, లోపాముద్రతోనూ, కొడుకుతోనూకూడి సుఖంగా ఉండినారు.

**నీతి :** సంతాన విచ్ఛేదనం పాపం
హింసా ప్రవృత్తి ఎవరికీ మేలు చేయదు.

**ఉ.** నారలు గట్టి కూర లశనంబుగ నుగ్రవనంబులోఁదపో
భారమునం గృశుం డయిన బ్రాహ్మణుఁ డీ లలితాంగిఁ బెండ్లియై
నారలు గట్టి కూర లశనంబుగ నుగ్రవనంబులోఁ'దపో
భారము దాల్చియుండు మ'ని పంపక మిన్నక యుండ నేర్చునే? **2-327**

**క.** 'ఇమ్మునివరునకు నన్నుఁబ్రియమ్మున నిచ్చునది: మీకు నతిచింతాభా
రమ్మేల?' యనిన నిరువురు । నమ్ముదితకు సంతసిల్లి యధికవిభూతిన్. **2-330**

# 11. అగస్త్యుని కథ.

**(అరణ్య పర్వము తృతీయాశ్వాసము 21 నుండి 46వ పద్యం వరకు.)**
**(పాండవులు అరణ్యవాసం చేసే సమయంలో ధర్మరాజుడుగగా 'రోమశుడు'అనేముని ఈ కథను చెప్పినాడు.)**

సూర్యుడు ప్రీతిగా ప్రతిదినం మేరుపర్వతానికి ప్రదక్షిణంగా తిరుగుతూ ఉండేవాడు. అట్లాసూర్యుడు మేరుపర్వతంచుట్టూ తిరగడం వింధ్యపర్వతం గమనించింది. "సూర్యుడు ఎప్పుడూ మేరుపర్వతంచుట్టే ఎందుకు తిరుగుతాడు? నాచుట్టూ ఎందుకు తిరుగడు?" అనుకుంటూ బాగాకోపించి సూర్యుడితో, "సూర్యా! కొండలరాజునైన నాకుప్రదక్షిణ చేయకుండా, తెలివి తక్కువతనంతో మేరువుచుట్టూ తిరుగుతావెందుకు?" అని గర్వంగాఅన్నాడు. ఆ గర్వపుమాటలకు సూర్యుడిట్లా బదులుచెప్పినాడు. "బ్రహ్మదేవుని ఆదేశంప్రకారం, నిత్యం నేను మేరువుకు ప్రదక్షిణంగా తిరుగుతూఉన్నాను. అంతేకాని నేను నాయిష్టంవచ్చినట్లుగా తిరగడానికి వీలులేదు." ఆ మాటలువినగానే వింధ్యకు కోపం పెచ్చుపెరిగింది. మేరుపర్వతంపైకల అసూయ అనేకరెట్లయింది. సూర్యుడు చంద్రుడు నక్షత్రాలు మొదలైనవి తిరగడానికి వీలులేకుండాతను సాటిలేనిఎత్తుకు పెరిగింది. మేఘమార్గమంతా కప్పివేసింది. సూర్యచంద్రులు పెరిగిన వింధ్య అడ్డుపడడంవల్లన, తిరుగలేకపోయినారు. సూర్యుడున్నవైపు పగలు చంద్రుడున్నవైపు రాత్రి అయి. రాత్రింబవళ్ళు మారడం మానుకొన్నాయి. భూమిమీద ప్రజలకు స్వర్గంలోని దేవతలకు దేవర్షులకు ఇబ్బంది కలిగింది. దేవతలంతా ఇట్లాపెరిగిపోయిన వింధ్యపర్వతంవద్దకు చేరినారు. వారు ఎంత ప్రయత్నించినా వింధ్య పెరగడాన్ని ఆపలేకపోయినారు.

దేవతలంతా వింధ్య పెరగడాన్ని ఆపలేక అగస్త్యుని వద్దకు వెళ్ళి వింధ్యపర్వతం పెరగడాన్ని చెప్పి ఇట్లా ప్రార్థించినారు. "దేవర్షీ! అగస్త్యా!లోకంలో జరగాల్సిన పనులన్నీ వింధ్య పెరగడంవల్ల ఆగిపోయినాయి. సూర్యచంద్రులు ఎప్పటిలాగా తిరిగేట్లు చేయండి." ఈ విధంగా దేవతలు ప్రార్థించగా అగస్త్యుడు తన భార్య లోపాముద్రను తీసుకొని వింధ్య పర్వతమువద్దకు వచ్చినాడు. అగస్త్యుణ్ణి చూచి వింధ్యపర్వతం ఆయనను చక్కగా పూజించింది. అట్లాపూజించిన వింధ్యతో అగస్త్యుడిట్లాఅన్నాడు. "ఓ గిరిరాజా! నేను దక్షిణానికి పోవలె. నేను సుఖంగా నిన్ను దాటడానికి దారిఇమ్ము." ఈ మాటలు వినగానే వింధ్య, అతి వినయంగా పెరగడం మానుకొని "అట్లే చేస్తాననిచెప్పి, భూమికి సమానంగా దిగిపోయి "పూజ్యుడా! నన్ను దాటుకొనివెళ్ళండి" అన్నది. అందుకు అగస్త్యుడు సంతోషించి "గిరిరాజా! నీవు నాతో స్నేహంగా ఉండు. నేను తిరిగివచ్చేంతవరకు ఇట్లే అణగిఉండు" అనిచెప్పి, అందుకు ఒప్పించి, ఆ వింధ్యను దాటుకొని తాను దక్షిణదిశకు పోయినాడు. తాను తిరిగి ఉత్తరదేశంపోతే వింధ్య మళ్ళీ పెరిగిపోయే 'ప్రమాదం ఉంద'ని

భావించి, అగస్త్యుడు దక్షిణంలోనే ఉండిపోయినాడు. అగస్త్యుడు తిరిగివచ్చేదాకా పెరగడానికి భయపడి వింధ్యపర్వతం అట్లాగే ఉండిపోయింది. సూర్యచంద్రుల గమనానికి అడ్డుతొలగింది. జరగవలసిన పనులన్నీ జరిగిపోయినాయి.

అగస్త్యుడు ఆ విధంగా దక్షిణదేశంలోనే నిలిచిపోయిఉండగా ఒకనాడు దేవతలంతా మళ్లీ ఆయన చుట్టూ చేరినారు. ఆయన దయతో "మళ్ళీ వచ్చినారెందుకు?" అని అడిగినాడు. వారుఇట్లా చెప్పినారు. "కాలకేయులుఅనే రాక్షసులు సముద్రాన్ని దుర్గంగా చేసుకొని లోకాలకంతా కీడుకలిగిస్తున్నారు. సముద్రగర్భంలో ఉండే వాళ్ళను మేమేమీ చేయలేకపోతున్నాము. వాళ్ళనుచంపి లోకాలకు మేలు చేయడంకోసం సముద్రంలో నీళ్ళు లేకుండా చేయవలె. ఆకాశాన్నిఅంటే కెరటాలుకల్గిన నీళ్ళన్నింటినీ మా కానందం కలిగేట్లు మీరు త్రాగండి. ఆ సముద్రపు నీళ్ళను మీరు త్రాగేస్తే మేము మా దివ్యాస్త్రాలతో ఆ భయంకర రాక్షసులను తక్షణం పడగొడతాము". ఈ మాటలు విన్న అగస్త్యుడు దేవతలకు సంతోషం కలిగిస్తూ "సరే సముద్రజలాన్నంతటినీ తాగేస్తాన" న్నాడు.

అగస్త్యుడు సముద్రమువద్దకు చేరినాడు. దేవతలుకూడా ఆయనవెంట వచ్చినారు. మహా మునీంద్రులు, గరుడలు, ఖచరులు, సిద్ధులు, గంధర్వులు, పన్నగులు, యక్షులుకూడా వచ్చినారు. ఆ సముద్రము ఎత్తైన ఎగిరి పడే కెరటాలతో నాట్యంచేస్తున్నట్లుగాఉంది. పెద్దగాలితో త్రోయబడేదానిలాగా ఉంది. పర్వతగుహలమధ్య ఉరికే దానివలెఉంది. తెల్లనినురుగుతో నవ్వుతూఉందేమోననిపించేట్లుగా ఉంది. జలచరాలైన పాములు, చేపలు, మొసళ్ళు మొదలైనవి కుదుపుతూ ఉంటే తట్టుకోలేక అరుస్తున్నదేమో? అన్నట్లుగా సముద్రం శబ్దంచేస్తూఉంది.

లోకాలకు ఆనందం కలిగించేవాడూ, పాపాలను పోగొట్టేవాడూ అయిన అగస్త్యుడు, అందరూ చూస్తుండగానే ఆ సముద్రపు నీళ్ళన్నీ త్రాగి వేసినాడు. ఆ విధంగా సముద్రంలో నీళ్ళులేక, తిమింగలాలూ, తాబేళ్ళూ, మొసళ్ళు, పాములూ బయటపడినాయి. వాటితోపాటు కాలకేయరాక్షసులుకూడా బయట పడినారు. వెంటనే ఇంద్రుడు మొదలైన దేవతలు, కాలకేయులపై పరాక్రమంతో విజృంభించి గర్వంగా యుద్ధంచేసినారు. దేవతలఅస్త్రాలతో కొందరు చచ్చినారు. మరికొందరు పారిపోయి,పాతాళం చేరినారు. ఈవిధంగా కాలకేయులనుచంపి,లోకాలకీడును తొలగించి, దేవతలు అగస్త్యున్ని పొగడి, ఇలా అన్నారు. "ఈ సముద్రాన్ని ఇంక తిరిగినీటితోనింపండి. ఈ పని మీరు తప్ప ఇతరులు ఎవరూచేయలేరు. ఇందులో అనేక జంతువులు జీవిస్తూఉంటాయి. కాబట్టి నీళ్ళు లేకుండా చేయడం న్యాయంకాదు".

ఆ మాటలువిన్న అగస్త్యుడిట్లా అన్నాడు." ఇంకెక్కడి నీళ్ళు? ఆ నీళ్ళన్నీ నా కడుపులో ఎప్పుడో జీర్ణమయినాయి. ఇంక సముద్రాన్ని నింపడానికి నీళ్ళెక్కడున్నాయి?" అగస్త్యుడిట్లా అనగానే ఆ దేవత లందరూ బ్రహ్మదేవుని దగ్గరకు పోయి, " దేవా! సముద్రము ఎట్లా నిండుతుంది? మాకు చెప్పు" అని ప్రార్థించినారు. బ్రహ్మదేవుడు చాలసేపు ఆలోచించి ఇట్లాఅన్నాడు "చాలాకాలం తరువాత ఈ సముద్రాన్ని 'భగీరథుడ'నేరాజు నింపుతాడు. వేరెవరికీ సాధ్యంకాదు." ఆ మాటలువిని వారందరూ ఎవరిదారినవారు పోయినారు.

**నీతి :** గర్వం పనికిరాదు. తపశ్శక్తితో పెద్ద పెద్ద పనులు చేయవచ్చును.

**ఉ.** **అందఱుఁజూచుచుండఁగ మహోబ్ధిజలంబులఁద్రావె విష్టపా**
**నందకరుం డగస్త్యుఁడఘనాశనుఁ; డట్లు పయోధి రిక్త మై**
**నం దిమి కూర్మ కర్కటక నక్ర భుజంగచయంబుతో భయం**
**బందుచుఁ గాలకేయులు బయల్పడి తోఁచిరి దానిలోపలన్.** **3-39**

# 12. భగీరథుని కథ.

**(అరణ్య పర్వము తృతీయాశ్వాసము 48 నుండి 84 పద్యాల వరకు.)**

**(పాండవులు అరణ్యవాసం చేసే సమయంలో ధర్మరాజు అడుగగా 'రోమశుడ'నేముని ఈ కథను చెప్పినాడు.)**

పూర్వం ఇక్ష్వాకువంశంలో 'సగరుడు'అనే రాజుండేవాడు. అతడు హైహయులను జయించి భూమినంతా పరిపాలిస్తూ ఉండేవాడు. అతనికి ఇద్దరుభార్యలుండేవారు. వారు 'వైదర్భి, శైబ్య' అనేవారు. ఈ ఇద్దరి భార్యల యందునూ సగరునికి సంతానం కలుగలేదు. సంతానంకోసం ఆయన తన ఇద్దరుభార్యలను వెంటతీసికొని కైలాసానికి పోయినాడు. అక్కడ నిష్ఠతో తపస్సుచేసి శివుణ్ణి ప్రత్యక్షం చేసుకొన్నాడు. ప్రత్యక్షమయిన శివుడు, 'వరం కోరుకొమ్మ'న్నాడు. సగరుడు ఆనందంతో "ముల్లోకాధిపతీ! నాకు సంతానదానం చేయి" అంటూ వేడుకొన్నాడు. ఈశ్వరుడు ఆ సగరుడికి 'వైదర్భియందు అరవై వేలమందీ, శైబ్యయందు ఒకడూ పుట్టుతార'ని వరమిచ్చి, వైదర్భికి పుట్టే ఆ అరవైవేలమందీ పొగరుతో 'ఒకేసారి చస్తార'నీ, శైబ్యకు పుట్టే కొడుకు 'వంశకర్త అవుతాడ'నీ, చెప్పి, అదృశ్యమయినాడు.

శివుడు పుత్రులను ప్రసాదించి కూడా అరవైవేలమంది 'ఒకేసారి చస్తార'ని చెప్పడంవల్ల ఇంతమంది పుత్రులుకలిగే వరంపొందికూడా పొందనివిధంగా అయిపోయింది సగరునిస్థితి. సగరుడు భార్యలతో తన పట్టణానికి అసంతృప్తితోనే తిరిగివచ్చినాడు. ఆ తర్వాత కొంతకాలానికి ఆ ఇద్దరు రాణులు గర్భాలు ధరించినారు. శైబ్యకు 'అసమంజసుడు' అనే కొడుకు పుట్టినాడు. వైదర్భికి ఒక సొరకాయ పుట్టింది. వైదర్భికిపుట్టిన సొరకాయను చూచి, "వరాలిచ్చే ఈశ్వరునివరంతో ఈ సొరకాయ పుట్టింది. ఇది ఏమి వరమో?" అనుకుంటూ, "సొరకాయనేంచేసుకొంటాం"? అంటూ సగరుడు దాన్ని పారవేయపూనుకొన్నాడు. అప్పుడు ఆకాశవాణి ఇట్లాఅన్నది. "ఇట్లా సాహసంచేసి పారవేయవచ్చునా? ఈ సొరకాయ విత్తనాలను నేతికుండలోపెట్టి రక్షించు. ఇందులోంచి నీకు ఈశ్వరునివరంవల్ల అరవైవేలమంది బలమైనపుత్రులు పుట్టుతారు."

ఆకాశవాణి చెప్పినట్లుగా చేయగా రెండు నెలలకు సగరునికి అరవై వేల మంది పుత్రులు పుట్టినారు. వారు పెరిగి పెద్దవారై ఆకాశంలో తిరగడం మొదలు పెట్టినారు. ఆ అరవైవేలమందీ గర్వంతో, స్వర్గంతోపాటు, అన్ని లోకాలనూ బాధించ సాగినారు. ఈ విధంగా సగరునికొడుకులు వరుసగా లోకాలను బాధిస్తూ ఉండగా భయపడి దేవతలు, పన్నగులు మునులతో కలిసి బ్రహ్మదేవునివద్దకు పోయినారు. వారు వచ్చిన విషయం తెలుసుకొని బ్రహ్మదేవుడు "మీరు భయపడడం ఎందుకు? గర్వించిన సగరుని పుత్రుల గొప్పతనం శాశ్వతమైనది కాదు. వారు త్వరలో కాలిపోతారు." అనిచెప్పగావిని దేవతలు, ఋషులు, పన్నగులూ తిరిగిపోయినారు. "సగరుని పుత్రులు ఎప్పుడు కాలిపోతారా?" అని ఎదురుచూస్తూఉండినారు.

ఇది ఇలాఉండగా, సగరుడు అశ్వమేధయాగం చేయడానికి దీక్ష వహించినాడు. యాగాశ్వాన్ని వదలినారు. సగరుని పుత్రులు అరవైవేలమందీ ఆ గుర్రాన్నిరక్షిస్తూ దానివెంటనేపోయినారు. అది భూమిఅంతా తిరుగుతూఉంది. అట్లా తిరుగుతూ తిరుగుతూ అగస్త్యుడు త్రాగివేసినందున నీళ్ళులేని సముద్రంలో ఒకచోట మాయమయింది. ఈ విషయం వాళ్ళు తండ్రికి చెప్పినారు. సగరుడేమో, "ఆ గుర్రాన్ని ఎట్లాగైనా వెదకి తీసికొనిరండి" అన్నాడు. వాళ్ళు భూమిఅంతా వేగంగా వెదకినారు. కానీ గుర్రం దొరకలేదు. 'గుర్రం పాతాళంలో ఉంటుందేమో? వెదకాల'నుకొని అరవైవేలమంది ఒక్కసారిగా సముద్రాన్ని తవ్వడం మొదలుపెట్టినారు. ఆ సముద్రపు బురదలోని జంతువులన్నీ ముక్కలైపోయినాయి. ఈ విధంగా త్రవ్వి, సగరపుత్రులు సముద్రానికి ఆవలి వైపునగల పాతాళంచేరినారు. అక్కడ ఈశాన్య దిశన 'కపిలుడ'నే మహర్షి ఆశ్రమం ఉంది. ఆ ఆశ్రమం దగ్గరలో సగరపుత్రులు తమ యాగాశ్వాన్ని చూచినారు. సంతోషించినారు.

"అశ్వమేధయాగానికి పూజించిన గుర్రాన్ని ఈ విధంగా దొంగిలించిన ఈ దొంగ దున్నపోతు ఈ సముద్రందగ్గర భయంలేకుండా ఉన్నాడు." అంటూ కపిల మహర్షిని అవమానించినారు. అందుకు ఆ ముని కోపగించుకొని భయంకరంగాచూచినాడు. అతడికన్నుల్లోనుండి అగ్నిజ్వాలలుచెలరేగి సగరపుత్రులందరనూ కాల్చిబూడిదచేసినాయి.

వీరులైన సగరునికుమారులు దారుణంగా కాలిపోవడంచూచిన నారదుడు, వెంటనేపోయి విషయమంతా సగరునికి చెప్పినాడు. ఆ విషయంవిని సగరుడు దుఃఖంతో మలమల మాడిపోయినాడు. కానీ ఈశ్వరుడు ఆనాడే చెప్పిన విషయాన్ని గుర్తుచేసుకొని, దుఃఖపడడం మానుకొన్నాడు. అట్లా దుఃఖం నుండి బయటపడి తన ఇంకొక భార్య శైబ్యకు పుట్టిన అసమంజసుని కొడుకూ, తనకు మనమడూ అయిన అంశుమంతుణ్ణి చూచి, "నాయనా! అంశుమంతా! నీపినతండ్రులు అరవైవేలమందీ ఒకేసారి కపిలమహాముని కోపాగ్నికి మాడి పోయినారు. ఇకపోతే నీతండ్రి అసమంజసుడు క్రూరుడై నగరంలోనిబాలకులను అనవసరంగాచంపి మహానదిలో వేస్తూఉండేవాడు. ఆ విషయం తెలుసుకొని నగరంలోని ప్రజలు నాతో మొరపెట్టుకొన్నారు. వారిమీదదయతో మీ తండ్రి అసమంజసుణ్ణి వదలి వేసినాను. అయినా నే నిప్పుడు కొడుకులకోసం దుఃఖించడంలేదు. కాని అశ్వమేధయాగం పూర్తి కాకపోవడానికి ఎక్కువగా దుఃఖిస్తూ ఉన్నాను. నీ విప్పుడు పూనుకొని ఆలస్యంలేకుండా నా దుఃఖాన్ని పోగొట్టు." అన్నాడు.

ఆ మాటలువిని అంశుమంతు డాక్షణమే బయలుదేరి సగరసుతులుత్రవ్విన ద్వారంద్వారా సముద్రంలోనుండి పాతాళానికి పోయినాడు. అక్కడ వేయిసూర్యులకాంతితో వెలుగుతూఉన్న కపిల మహర్షిని దర్శించినాడు. ఆయనకు నమస్కారము చేసినాడు. తానెవరోచెప్పి, తాను వచ్చినపనిని కూడా చెప్పినాడు.

కపిలమహర్షి అంశుమంతునిపై దయతలచి యాగాశ్వాన్నిచ్చి ఇట్లాఅన్నాడు. "వీరుడా! నీవల్ల సగరుని కొడుకులకు సద్గతులు లభిస్తాయి. సగరుడికి కూడా మంచిపుత్రులు కలిగిన ఉత్తములుపొందే పుణ్యలోకాలు లభిస్తాయి. ఇంకా నీవు తీసికొనిపోయే ఈ గుర్రంతో అశ్వమేధయాగం పూర్తిచేసి సగరుడు ధన్యుడవుతాడు. నీ మనుమడైన భగీరథుడు, గంగాజలాన్ని ఈ సముద్రంలోనికి తెస్తాడు. సగరసుతుల బూడిద ఆ గంగాజలంతో తడిసి, వారు స్వర్గానికి పోతారు. సముద్రం కూడా నీటితో నిండిపోతుంది". ఈ మాటలువిని అంశుమంతుడు సంతృప్తిచెందినాడు. కపిలమహర్షి దయతో యాగాశ్వాన్ని తెచ్చి, అంశుమంతుడు సగరునికి సమర్పించినాడు. కపిలమహర్షి చెప్పిన మాటలన్నీ తన తాత సగరునికి చెప్పినాడు. ఆ మాటలువిని సగరుడు 'తన కొడుకులు పోయినార'నే దుఃఖాని వదలి వేసినాడు. అశ్వమేధయాగం పూర్తిచేసినాడు. సముద్రాన్ని తనపుత్రుడుగా భావించినాడు. అది మొదలు సముద్రానికి 'సాగరము' అనే పేరు వచ్చింది. ఆ తరువాత సగరుడు చాలాకాలము రాజ్యంచేసి అంశుమంతునికి రాజ్యాన్ని అప్పగించి తపస్సుకై అడవులకు పోయినాడు.

అంశుమంతుడు తనతాతలాగానే రాజ్యాన్ని పాలించినాడు. ఆ తరువాత తనకుమారుడైన దిలీపునికి రాజ్యాన్ని అప్పగించి పోయి అడవుల్లో తపస్సు చేసుకొన్నాడు. దిలీపుడుకూడా తనతాత తండ్రుల రాజ్యాన్ని చక్కగా పాలించినాడు. అందుకుతోడు తనతాతలు సాగరులను 'పుణ్యలోకాలకు పంపాల'నుకున్నాడు. గంగాభవానిని భూలోకానికి తెప్పించడానికి శాయశక్తులా ప్రయత్నించినాడు. కానీ తనశక్తి చాలలేదు. అందుచేత ఆ పనిని విరమించినాడు.

దిలీపుని కుమారుడు భగీరథుడు. అతడు మిక్కిలి కీర్తిమంతుడు. ఎంత కష్టమైనా భరించ గలిగినవాడు. మహారథుడు. పరాజయంఅంటే ఏమిటో తెలియని తేజశ్శాలి. తనవంశాన్ని దుర్గతినుండి కాపాడగలిగిన శక్తిశాలి. రాజులందరనూ జయించిన పరాక్రమవంతుడు. గర్వంకలిగిన శత్రువుల శక్తిని అణగద్రొక్కగలిగినవాడు. అన్నింటినీమించి ఆకాశగంగను భూమిపైకి తీసికొని రాగలిగినంత తపస్సు చేయగలిగినవాడు. అంతటివాడైన భగీరథుడికి, రాజ్యభారాన్ని అప్పగించి, తపోవనాలకు పోయినాడు దిలీపుడు.

భగీరథుడు సక్రమంగా రాజ్యాన్నీ పాలిస్తూఉన్నాడు. ఆ క్రమంలో కపిలమహర్షి కోపాగ్నికి 'సాగరులు కాలి బూడిదఅయిపోయినార'నీ, 'ఉత్తమలోకాలను అందుకోలేకుండా ఉన్నార'నీ, తెలుసుకొన్నాడు. 'తన వంశంలోని పెద్దలకు మేలుచేయడం' తన ధర్మంగా భావించినాడు. 'వారికి ఉత్తమలోకాలు కలగాల'ంటే, 'ఆకాశగంగతో వారిబూడిదను తడపాల'ని తెలుసుకొన్నాడు. వెంటనే ఆకాశగంగను భూమిమీదకు తేవడానికి ప్రయత్నాలు ప్రారంభించినాడు.

ఈ విధంగా భగీరథుడు ఆకాశగంగను భూలోకంలోనికి తీసికొనిరావడానికి దృఢంగా నిశ్చయించుకొని, హిమాలయపర్వతాలకు తపస్సు చేయడానికి పోయినాడు. ఆ హిమాలయాలు ఎత్తైన శిఖరాలతో విరాజిల్లుతున్నాయి. పెద్ద పెద్ద మేఘాలు ఎప్పుడూ కొండలను ఆవరించుకొనిఉన్నాయి. ఆ మేఘాలక్రింద మంచుప్రదేశాలలో సిద్ధులూ, సాధ్యులూ, విద్యాధరులూ, గంధర్వులూ, గీర్వాణులూ, మొదలైనవారంతా జంటలు జంటలుగా తిరిగే రత్నాలగుహలతో నిండిఉన్నాయి. చిలుకలు, కోకిలలు, పావురాలు, జింకలు, కొదమనెమళ్ళు, వానకోకిలలు చేసే శబ్దాలకు ప్రతిధ్వనించే చెట్లవరసలున్నాయి. సింహాలూ, శరభాలూ, పులులూ, ఏనుగులూ, కోతులూచేసే శబ్దాలతో కూడుకొని ఉన్నది. వీటన్నింటితో ఆ హిమాలయాలు అందంగాఉన్నాయి. భయంకరంగానూఉన్నాయి. అట్లాంటి హిమాలయాలలో భగీరథుడు ఆకాశగంగను భూమిమీదకు తేవడానికి దేవమానంలో వెయ్యేండ్లు భయంకరంగా తపస్సు చేసినాడు. ఆ తపస్సుచేసే కాలంలో కటికఉపవాసాలు చేసేవాడు. ఉపవాసానంతరం పారణగా ఆకుకూరలూ, పండ్లూ, దుంపలూ, నీళ్ళు మాత్రమే స్వీకరించేవాడు. అంతఘోరంగాచేసినభగీరథుని తపస్సుకు మెచ్చుకొని గంగాదేవి ప్రత్యక్షమయింది. "నీ కోరిక ఏదో చెప్పు?" అన్నది. భగీరథుడు గంగాదేవికి వినయంగా నమస్కరిస్తూ ఇట్లాఅన్నాడు."సూర్యుడివంటితేజస్సుకలిగిన కపిలమహర్షి కోపంవల్ల కాలిపోయి పుణ్యలోకాలులేకుండా మాతాతలు సాగరులున్నారు. నీపుణ్యజలాలతో సగరసుతుల బూడిద తడిస్తే వాళ్ళు స్వర్గంపొందుతారు. కాబట్టి దేవీ! నీవు ఈ దేవతల మార్గంనుండి భూమిమీదకు రావలె." భగీరథుడిట్లా అనగానే గంగాదేవి "భూమి మీదకు నేను వచ్చేటప్పుడు నా నీటివెల్లువను శివుడుతప్ప ఇతరులెవరూ భరించలేరు. అందువల్ల నన్ను ధరించడానికీ భరించడానికీ ఆ ఈశ్వరుడి దయను సంపాదించు" అన్నది.

గంగాదేవిచెప్పిన ఈ మాటలు విని భగీరథుడు కైలాసానికి పోయినాడు. అక్కడ చాలాకాలం ఈశ్వరుణ్ణి గురించి తపస్సు చేసినాడు. ఈశ్వరుడు భగీరథునికి ప్రత్యక్షమయి, "నీవు గంగను భూలోకానికి దింపు. నేను ఆమెను ధరిస్తాను. భరిస్తాను." అన్నాడు. శివుడిలా అనతివ్వగానే భగీరథుడు తిరిగిగంగను ఆరాధించినాడు. ఆ భగీరథునిమీద దయతో గంగ నేలకుదిగింది. దిగేటప్పుడు గంగ తనఅలల ఊపులతో అన్ని దిక్కులనూ ఆకాశాన్నీకూడా క్రమ్ముకొన్నది. జలజంతువులన్నీ ఆ గంగవెంట నేలకుదిగినాయి. శివుడు తనగోరోజనపురంగు జటాజూటంపైన తామరరేకులాగా గంగనుధరించినాడు.

శివుడి జటాజూటంనుండి ప్రజలందరూ ఆరాధించే గంగానది భూమిమీదకు చేరింది. సురలు, మునులు, సిద్ధులు, ఖేచరులు వచ్చి గంగ నేలమీదకు దిగడాన్ని ఆశ్చర్యంగా చూచినారు. అట్లా భూమి మీదకు వచ్చినగంగ, కలహంస నడకలతోముందుకుసాగింది. గంగలోని నురుగు, గంగాదేవి చిరునవ్వుకు

గుర్తేమో? అనిపించింది. చేపలు కదులుతూ ముందుకుపోతున్నాయి. కెరటాలసవ్వడులు గంగాదేవి గుసగుసలాడుతున్నదేమో అనిపిస్తున్నాయి. ఈ విధంగా భగీరథునివెంట గంగనడచింది. గంగ అట్లా పోయిపోయి సముద్రాన్నిచేరింది. అక్కడ సగరపుత్రుల భస్మాన్ని తడిపి సాగరులను పుణ్యలోకాలకు చేర్చింది. అగస్త్యునిచేత త్రాగబడి శూన్యమైఉన్న సముద్రాన్ని తననీటితో నింపింది. ఈ విధంగా భగీరథునివెంట రావడంవల్ల గంగకు 'భాగీరథి' అనే పేరుకూడా వచ్చింది.

**నీతి :** అనవసరంగా ఎవరినీ నొప్పించరాదు.
పట్టుదలతో ప్రయత్నిస్తే దేన్నయినా సాధించవచ్చు.

చ. **సతతకృతోపవాసముల, శాకఫలోదకమూలపారణ**
**వ్రతముల, దేవపూజల, నపారజపంబులఁజేసి నిష్ఠతో**
**నతులతపంబు సేసె, నమరాపగ నుర్వికిఁదెచ్చు వేడ్కతో**
**ధృతియుతుఁడై దిలీపకులదీపుఁడు దివ్యసహస్రవర్షముల్.** 3-78

# 13. ఋష్యశృంగుని కథ.

**(అరణ్య 3-87 నుండి 118 వరకు.)**

**(పాండవులు అరణ్యవాసంలోఉండి రోమశమహర్షితోపాటు తీర్థయాత్రలుచేస్తూ ఋష్యశృంగహ్రదాన్ని చూచినప్పుడు ధర్మరాజుడుగగా రోమశుడీ కథచెప్పినాడు.)**

బ్రహ్మమానసపుత్రులనేకులలో కశ్యపుడొకడు. ఆ కశ్యపుని పెక్కుమంది పుత్రులలో విభాండకుడొకడు. ఆ మునిశ్రేష్ఠుడు మొక్కవోని బ్రహ్మచర్యంతో ఎల్లప్పుడూ తపస్సుచేస్తూ ఉండేవాడు. అతడొకనాడు ఒకమడుగులో స్నానంచేస్తూఉండినాడు. ఆ సమయంలో అప్సరసఊర్వశి అతనికి కనిపించింది. ఆమె మిక్కిలి ప్రకాశించే సౌందర్యలక్షణాలు కలిగిఉంది. ఆమెనుచూచీచూడగానే ఆ మహర్షి మదనవికారానికి గురిఅయినాడు. అతడి వీర్యంజారిపడింది.

ఒక ఆడుజింక ఆ అమోఘమైన వీర్యాన్ని త్రాగింది. వెంటనే ఆ ఆడుజింక గర్భంధరించింది దానికి ఒక మానవబాలుడు జన్మించినాడు. ఆ బాలుడికి తల్లిలక్షణంగా తలమీద జింకకొమ్ము (శృంగం) లాంటి ఒక కొమ్ము పుట్టింది. అందుకని అతడికి 'ఋష్యశృంగుడు'అనే పేరుపెట్టి ఆ మహర్షియే పెంచినాడు. ఆ ఋష్యశృంగుడు తన తండ్రినీ, ఆ ఆశ్రమాన్నీతప్ప ఇంకేమీఎరుగడు. అట్లా అమాయకుడైన ఋష్యశృంగుడు తండ్రితోపాటు కఠోరమైనతపస్సు చేస్తూఉండినాడు.

అదే కాలంలో అంగదేశాన్ని మహాబలపరాక్రమాలు కలిగిన 'రోమపాదుడు'అనే ఒకరాజు పరిపాలిస్తూ ఉండేవాడు. ఆ మహారాజు విధికృతంచేత తనపురోహితునికి అవమానంచేసినాడు. అందుచేత బ్రాహ్మణులందరూ ఆ పురోహితునితోపాటుగా ఆ రాజును విడచిపోయినారు. ఆ కారణంగా అంగదేశంలో వానలుకురవడం మానివేసినాయి. అట్లా వానలు కురవకపోవడంచూచి రాజు భయపడినాడు. 'తన ప్రజలు కష్టపడుతున్నార'ని చింతించినాడు. వెంటనే ఆ మహారాజు బ్రాహ్మణులెందరనో ఎక్కడెక్కడి నుండో పిలిపించినాడు. వారందరనూ మిక్కిలి భక్తితో పూజించినాడు. "ఈ దేశంలో వానలు కురవడం లేదెందుకు? వానలు కురవడానికి నేనేం చేయవలె?" అని అడిగినాడు. అతనిపైన బ్రాహ్మణులు దయతలచి ఇట్లా చెప్పినారు.

"రాజా! 'నీవు చాలా గర్వశాలివ'ని బ్రాహ్మణులు నిన్ను విడచివేసినారు. వారు విడవడంచేత దేవతలు కూడా నిన్ను విడచినారు. అందుకే నీ రాజ్యంలో వానలుకురవడంలేదు. శాంతంకలిగిన మహర్షి ఋష్యశృంగుడుండేచోట వర్షాలు అధికంగాకురుస్తాయి. పూర్వం ఇంద్రుడివల్ల ఆ ముని ఆ వరంపొంది ఉన్నాడు. కాబట్టి నీవు నేర్పుతో వేదాంతవేది అయిన ఋష్యశృంగుణ్ణి ఇక్కడకురప్పించు."

ఈ మాటలువిని రోమపాదుడు తాను మునుపు పురోహితుడికిచేసిన అవమానానికి ప్రాయశ్చిత్తం చేసుకొన్నాడు. ఆ తరువాత బ్రాహ్మణులు చెప్పినట్లు చేయడానికి బుద్ధిమంతులతో ఆలోచించినాడు. ప్రౌఢలైన వేశ్యస్త్రీలను పిలువబంపినాడు. "మీనేర్పు నుపయోగించి ఋష్యశృంగుణ్ణి ఇక్కడకు తోడ్కొని రండు" అని ఆజ్ఞాపించినాడు. ఆ వేశ్యలప్పుడు మంచిమంచిభక్ష్యాలూ ప్రకాశించే అనులేపనాలూ పూలదండలూ తీసుకొని అప్సరసలవలె ఋష్యశృంగుని ఆశ్రమానికి పోయినారు.

అక్కడ విభాండకుడు తగినసమయంలో అగ్నినిమండించడానికి తనపుత్రుడు ఋష్యశృంగుణ్ణి ఆజ్ఞాపించి, తాను పండ్లు తేవడానికి అడవిలోనికిపోయినాడు. ఆ సమయంలో అక్కడకుచేరిన వేశ్యలలోని ఒకముసలిది అప్పుడేయౌవ్వనంలోనికి అడుగిడిన తనకూతురిని ఋష్యశృంగునివద్దకు పంపింది.

ఆమెను చూచిన ఋష్యశృంగుడు తత్తరపాటుతో "ఓ ఋషికుమారా! నీవెక్కడనుండి వచ్చినావు? నేనెప్పుడూ ఇంతసుందరమైన ఆకారంకల మునికుమారుని ఇంతకుముందు చూచిఉండలేదు. రా. ఇక్కడ కూర్చో." అని నల్లజింకచర్మంతోనూ దర్భలతోనూ చేసినఆసనాన్ని సంతోషంగా చూపినాడు. ఋష్యశృంగుడా యువతిని ఒకఋషిగానే భావించినాడు. ఆ తరువాత ఋష్యశృంగుడామెకు అర్ఘ్యం పాద్యం సమర్పించబోయినాడు. రుచికరమైన అడవిపండ్లనుకూడ సమర్పించ దలచుకొన్నాడు. అట్లా అతిథి పూజలు చేయదలచుకొన్న ఋష్యశృంగునితో ఆ యువతి ఇట్లాఅన్నది. "ఓ న్యాయనిధీ! మా ఆశ్రమం ఇక్కడకు మూడుయోజనాల దూరంలోఉన్నది. నేనక్కడకు పోతున్నాను. నీవుకూడా రా. నాతో చెలిమిచేయి. అట్లా అయితే నీసత్కారాలు స్వీకరిస్తాను."

ఈ మాటల కంగీకరించి ఋష్యశృంగుడు ఆమెను అతిథిగాపూజించినాడు. ఆమెఇచ్చిన దివ్యమైనపూతలూ, పూలమాలలూ, రుచికరాలైనభక్ష్యాలూ, పానీయాలూ, విచిత్రములైన వస్త్రాలూ, స్వీకరించినాడు. ఆ తరువాత ఆ యువతి ఆ మునిముందర బంతిఆటలోనూ, నాట్యంలోనూ, మనోహరమైనగానంలోనూ, తనకుగల కౌశలమంతాచూపింది. ఋష్యశృంగుణ్ణి ఆలింగనం చేసుకొన్నది. ఆ విధంగా ఆయన మనసుకు ఆనందం కలిగించింది. ఇట్లా ఋష్యశృంగుణ్ణి ప్రేరేపించి ఆ వేశ్య యువతి అక్కడనుండి పోయింది. ఆమెపోయినవైపే చూస్తూ ఋష్యశృంగుడు అగ్నినిమండించడం మరచి పోయినాడు. తారుమారైనమనసు కలిగిఉండినాడు.

అంతలో అడవినుండి పండ్లుతెచ్చిన విభాండకుడు కొడుకునుచూచినాడు. "ఇట్లాఎందుకు చింతలో ఉన్నావు? అగ్నిని మండించకుండా ఆలస్యంచేసినావెందుకు?" అని అడిగినాడు. ఆ మాటలకు ఋష్యశృంగుడు తండ్రితో ఇట్లాచెప్పినాడు.

"తండ్రీ! నావద్ద కిప్పుడు ఒక బ్రహ్మచారి వచ్చిపోయినాడు. అతడు బంగారురంగు దేహంకలిగి ఉన్నాడు. చాలాఅందంగాఉన్నాడు. సొగసైనజడలు కలిగిఉన్నాడు. అతని వక్షస్థలంమీద గుండ్రంగా రెండు పెద్ద ఉండలున్నాయి. మెడలో వెలిగిపోయే జపమాలఉంది. సన్నటి వణకే నడుము కలిగిఉన్నాడు. అతడు నడిచేటప్పుడు కలహంసల కూజితములశబ్దం వస్తూఉంది. వాని ముఖంనుండి బయటకువచ్చే మాటలు తీయగా సువాసన కలిగిఉన్నాయి. మదించిన గండుకోయిలల ఆలాపనలలాగా ఉన్నాయి. ఆ మాటలు హృదయానికి ఆనందాన్ని కలిగిస్తూ ఉన్నాయి." అనిచెప్పి ఋష్యశృంగుడు ఇంకాఇట్లా చెప్పినాడు.

"ఆ ఋషికుమారుడు కట్టినచీరలు చాలసుకుమారంగా, మెత్తగా, ఉన్నాయి. విచిత్రంగా ఉన్నాయి. అతడి నడుము మనోహరంగాఉంది. ఆ నడుంపైన బంగారు ఒడ్డాణం ప్రకాశిస్తూఉంది. ఆ మునిశ్రేష్ఠుని శరీరంనుండి సువాసనలు పుట్టుతూఉన్నాయి. ఆ సువాసనలు ఆమనిలో వికసించే వేర్వేరు పూలపై నుండి వీచేగాలియందలి సువాసనలలాగాఉన్నాయి. అంతేకాదు. మునికుమారుడు ఒకఎర్రని పందును తనకుడిచేత్తో అక్కడక్కడా నేలకేసి కొడుతూఉండినాడు. అది నేలనుండి ఎగిరిన వైపుకు ఆ బ్రహ్మచారి వంగుతూ, వంగే చెట్టులాగా అనిపించినాడు. ఆ ముని కుమారునిపై నా మనసు పెద్దగా ఆకర్షించబడింది". ఇట్లాచెప్పి ఋష్యశృంగుడు ఇంకాఇట్లాఅన్నాడు.

"ఆ మునికుమారుడు నన్నుకౌగిలించుకొన్నాడు. నా ముఖానికి తనముఖంఆనించి మనోహరంగా ఒక మృదువైనశబ్దం చేసినాడు. అంతటిమృదువైనశబ్దాన్ని నేనింతకు ముందెప్పుడూ వినిఉండలేదు. ఆ లేత బ్రహ్మచారిముఖం చూడడానికి పద్మంతో సమానంగాఉంది. నేనిచ్చిన రుచికరమైన అడవిపండ్లను అతడు స్వీకరించలేదు. ఆ మునికుమారుడు అమృతంతో సమానమైనపండ్లూ, చాలాతీయనిపానకాలూ, ఇచ్చినాడు. నేను వాటిని ఉపయోగించినాను. తన చేతిలోనిపూలు అతడువెదజల్లినాడు. ఆ పూలన్నింటిని తుమ్మెదలు సేవించినాయి. ఆ పూలు ఈ అడవి పూలవంటివికావు. అవి చాల శ్రేష్ఠమయిన సువాసనలు కలిగిఉన్నాయి. నాకు ఆ మునికుమారుని ఆశ్రమంలో అతనితోపాటే తపస్సు చేసుకోవడం ఇష్టమయింది."

ఇట్లాఅన్న కొడుకుమాటలువిని విభాండకుడు ఆశ్చర్యపడినాడు. కుమారుడితో "తపస్సులకు ఆటంకాలు చేయడానికి రాక్షసులు రకరకాలయిన రూపాలతో అడవిలో తిరుగుతూఉంటారు. వారిచ్చే పానకాలు త్రాగకూడనివి. ఎక్కువ పరిమళంగలపూలు మునులు వదిలిపెట్టదగినవి". అని కొడుకును హెచ్చరించినాడు. మరుదినం విభాండకుడు ఎప్పటిలాగానే పండ్లకొరకు అడవికిపోయినాడు.

అప్పుడు వేశ్యయువతి తిరిగివచ్చి, ఋష్యశృంగుని మనసుకు వికారంకలిగించింది. విలాస వతులతో మాట్లాడడం, వారిదగ్గర కూర్చోవడం, వారితో కలిసితిరగడం, చెరతో సమానమేకదా? ఈ విధంగా ఋష్యశృంగుడు వేశ్యయువతిచేత ఆకర్షించబడినాడు. తండ్రికి చెప్పకుండానే తనఆశ్రమాన్ని వదలినాడు. సాధారణమైన యువకుడిలాగా ఆమెవెంటపోయినాడు. అట్లాపోయి అంగదేశం ప్రవేశించినాడు. రాజైన రోమపాదునిఆదేశంప్రకారం అంగదేశంలో 'రాజాశ్రమం'అనే తోటలో ఉంచబడినాడు.

ఆ ఋష్యశృంగుడు నివసించడంవల్లన ఆ అంగదేశంలో మేఘాలన్నీ అన్నిదిక్కులాక్రమ్ముకొని జనులందరికీ ఆనందంకలిగించేటట్లుగా పెద్దగావర్షంకురిసింది. మహానదులు, మహాసరస్సులూ, అన్నీ పొంగిపొరలినాయి. ఈ విధంగా ఋష్యశృంగుడు రావడంవల్ల అంగదేశంలో అనావృష్టిబాధ తొలగిపోయింది. రోమపాద మహారాజు చాలసంతోషించినాడు.

మిక్కిలి లావణ్యవతిఅయిన 'శాంత'అనే తనకూతురికి ఆ మహామునితో వివాహం జరిపించినాడు. అంతేకాకుండా ధనరాసులూ, ఆభరణాలు, దాసీజనాలు, బంగారుశయ్యలూ, బంగారుఆసనాలు, ముని హృదయానికి ఆనందంకలిగించేట్లుగా సమర్పించినాడు. ఇంకాలెక్కలేనన్ని ఆవులనుఇచ్చినాడు. దేశమంతా ఆవులగుంపులతో కూడిన గొల్లపల్లెలను ఆ మునిపేరుమీద ఏర్పాటుచేసినాడు. ఇవన్నీ కాకుండా తానుస్వయంగా నిత్యం ఆయననుసత్కరిస్తూ ఆనందంకలిగిస్తూ ఉండినాడు.

అక్కడ విభాండకుడు తనఆశ్రమంలో కొడుకు కనబడక వెతుకుతూ దేశాలన్నీ తిరిగినాడు. ఆ క్రమంలో అంగ దేశానికి వచ్చినాడు. అక్కడ ఆవులతో క్రిక్కిరిసిన ఒక గొల్లపల్లెలో గొల్లవారితో సత్కారాలు పొందినాడు. అక్కడే ఒక రోజు ఉండినాడు. "ఇది ఎవరి ఘోషము?" అని అడిగినాడు. వారు "మునిశ్రేష్ఠా! ఇది నీ కుమారుని ఘోషమే. ఇదే కాదు. గొప్పవాడైన ఋష్యశృంగునికి ఎన్నో అయుతాలఘోషాలున్నాయి" (అయుతం=పదివేలు) అన్నారు.

ఇదివిని విభాండకుడు సంతోషించినాడు. ఆ తరువాత ఋష్యశృంగుని ఘోషాలలో విశ్రాంతి తీసుకొంటూ రోమపాదుని నగరంచేరినాడు. అక్కడ శాంతతోకూడిఉన్న పుత్రుడుఋష్యశృంగుణ్ణి చూచినాడు. సంతోషించినాడు. కొడుకును కోడలిని తీసుకొని తనఆశ్రమానికి పోయినాడు. ఆ ఆశ్రమంలో ఋష్యశృంగుడు తనభార్యతోసహా సుఖంగా ఉండినాడు.

**నీతి:** ఎవరినీ అవమానించరాదు. చేసిన తప్పును తెలిసికొని సరిదిద్దుకోవలెను.

**క.** **పవనసమీరిత మధుసం । భవ వివిధప్రసవసౌరభముఁబోలి ముని**
**ప్రవరుని తనువునయం దు । ధ్రువమై రమ్యమయి సౌరభము విలసిల్లున్.** **3-105**

**ఉ.** **నన్నును గౌఁగిలించుకొని, నా వదనంబునకున్ నిజాస్య మా**
**సన్నముఁ జేసి, యొక్క మృదుశబ్దముసేసె మనోహరంబుగా;**
**నెన్నఁడు నట్టి శబ్దము మునీశ్వర! మున్ విని యే నెఱుంగ; న**
**య్యన్నువ బ్రహ్మచారిముఖ మంబురుహంబు సమంబు సూడఁగన్.** **3-107**

# 14. పరశురాముడి కథ.

**(అరణ్య 3-131 నుండి 155 వరకు.)**

**(పాండవుల అరణ్యవాసకాలంలో రోమశమహర్షితోపాటు తీర్థయాత్రలు చేస్తూ మహేంద్రగిరికి పోయినప్పుడు ధర్మరాజు అడుగగా పరశురాముడి శిష్యుడైన అకృతవ్రణుడు చెప్పిన కథ.)**

పూర్వము ఒకప్పుడు కన్యాకుబ్జాన్ని 'గాధి'అనేరాజు పరిపాలిస్తూ ఉండేవాడు. ఆయనకు 'సత్యవతి' అనే ఒకకూతురుండేది. అదేకాలంలో భృగుమహర్షి కుమారుడు 'ఋచీకుడ'నే వాడుండేవాడు. ఆ ఋచీకుడు సత్యవతిని 'వివాహమాడాల'నుకొన్నాడు. గాధి మహారాజువద్దకు వచ్చి తనకు కన్యాదానము 'చేయు'మని కోరినాడు. ఆ మునిశ్రేష్ఠునితో గాధి, "ఒకచెవినల్లకలువవలె నల్లగా, మిగతాదేహమంతా చంద్రునిలాగా, హంసలాగా, తెల్లగాఉండే వేయిగుర్రాలు ఈ కన్యకుశుల్కం. అట్లా నీవిచ్చి మునీంద్రా! ఈమెను పెండ్లాడు. ఇది మా కులధర్మము." అన్నాడు.

ఆ మాటలువిని ఋచీకుడు సత్యవతిని 'పెండ్లాడవలె'ననే కోరికతో వెంటనే వరుణుడి దగ్గరకు పోయి, అటువంటి గుర్రాలను సంపాదించి తెచ్చినాడు. స్వచ్ఛంగా అటువంటిగుర్రాలు కన్యాకుబ్జము వద్ద గంగానదిలోనుండి పుట్టినాయి. అందువల్ల ఆనాటినుండి ఆ ప్రదేశము అశ్వతీర్థము అయింది. ఋచీకుడు గాధికి, ఆయన కోరిన విధంగా, గుర్రాలను ఇచ్చి, ఆ గాధిరాజు కూతురు సత్యవతిని వివాహంచేసుకొని సుఖంగాఉండినాడు.

భృగువొకనాడు కన్యాకుబ్జమునకు వచ్చినాడు. వారందరూ ఆయనను పూజించినారు. కొడుకును కోడలినిచూచి ఆయనసంతోషించినాడు. అట్లాఉండగా ఒకనాడు భృగువు కోడలితో ఇట్లాఅన్నాడు "సుకుమారీ! నేను నీగుణాలకు మిక్కిలి సంతోషపడినాను. నీకు సంతోషంకలిగేట్లు నేను సంతోషంతో వరమిస్తాను. నీ కిష్టమయినదాన్ని కోరుకో." ఆ భృగువు మాటలువిని కోడలు సత్యవతి ఇట్లాఅన్నది.

"దేవా! నీ దయవల్ల నాకొకకొడుకు, నా తల్లికొకకొడుకు, పుట్టవలె." అంటూ అమె మామకు మ్రొక్కింది. భృగువు దయతో, "నీవు కోరినట్లే అవుతుంది. శుచిగా స్నానంచేసి, నీవు మేడి మానును కౌగిలించుకో. మీ అమ్మను 'అశ్వత్థ వృక్షాన్ని కౌగిలించుకొమ్మ'ను." అన్నాడు. "అట్లే"నని ఆ తల్లీకూతుళ్ళిద్దరూ చక్కగా స్నానంచేసినారు. కాని పొరపాటుగా భృగుడు చెప్పినట్లుగా కాకుండా తల్లి మేడిచెట్టునూ, కూతురు అశ్వత్థవృక్షాన్నీ కౌగిలించుకొన్నారు.

ఈ పొరపాటును గుర్తించిన భృగువు, కోడలితో "బ్రాహ్మణులందరికీ పూజ్యుడైన కొడుకు నీకు పుడతాడు. కానీ అతడు దారుణమైన క్షత్రియప్రవృత్తి కలవాడై గర్వంతో ప్రవర్తిస్తాడు. మరి నీ తల్లికి క్షత్రియుడుగా పుట్టినప్పటికీ ఆ పుత్రుడు గొప్పతపస్వి అవుతాడు. బ్రాహ్మణభావాన్నీ విజ్ఞానాన్ని గొప్ప తేజస్సులనూ నిష్ఠతో పొందగలడు." అని చెప్పగా సత్యవతి ఆ మహర్షికి నమస్కరించి క్షత్రియభావం తనకొడుకుకుకాక మనుమడికి కలిగేట్లు మామగారివల్ల వరాన్నిపొందింది.

సత్యవతి కొంతకాలానికి గర్భవతియై ఒకకుమారుణ్ణికన్నది. ఆ పుత్రునిపేరు జమదగ్ని. ఆ జమదగ్ని ప్రసన్నగుణంకలవాడు. నాలుగువేదాలలోనూ ధనుర్వేదంలోనూకూడా మిక్కిలినేర్పు కలవాడు. తొల్లింటి ఋషులనుపోలినమహాత్ముడు.

ఆ జమదగ్ని మహాముని 'ప్రసేనజితుడు'అనే రాజుకూతురు రేణుకను వివాహమాడినాడు. ఆమె యందు 'రమన్వంతుడు, సుషేనుడు, వసుడు, విశ్వావసుడు, రాముడు' అనే అయిదుగురు కొడుకులను కన్నాడు. జమదగ్ని ఒకరోజు అరణ్యంలో తీవ్రమైనతపస్సులో నిమగ్నమైఉన్నాడు. పుత్రులందరూ అడవిలోనికి పండ్లుతెచ్చేందుకు పోయినారు. వారివెంట రేణుకకూడా అడవికిపోయింది. అక్కడ ఒక సరోవరంలో 'చిత్రరథుడు'అనే రాజు తనభార్యలతో జలక్రీడలాడుతూఉండగా చూచింది. అతను మార్తికావత దేశాధిపతి. ఆ జలక్రీడలు చూచిన రేణుక మనస్సు చలించింది. ఆమె అట్లామానసికంగా వ్యభిచరించడం జమదగ్ని తెలుసుకొన్నాడు. కోపంవల్ల ఏర్పడిన వెర్రిచేత ఆయనకు వశంతప్పింది. వెంటనే తనకొడుకులను ఒకరొకరిని, తనభార్యను చంపేందుకు నియోగించినాడు. పెద్దవారు నలుగురూ 'తల్లినిచంపడం పాపమ'ని ఆ ప్రయత్నం చేయలేదు. మారుమాట్లాడలేదు. జమదగ్ని కోపగించుకొని, "భయంకరమైన అడవిలో మందబుద్ధితో జంతువులవలె పక్షులవలె ఉండండి." అని వారిని శపించినాడు. ఆ తరువాత వాడిఅయిన గండ్రగొడ్డలి చేతిలోకల రాముణ్ణిచూచి "ఈ రేణుకను వధించు." అని ఆజ్ఞాపించినాడు. పరశువును (గండ్ర గొడ్డలి) చేతిలో ఎప్పుడూ ఉంచుకొనడం వల్ల 'పరశురాము'డనే పేరు పొందిన రాముడు తక్షణమే తండ్రిమాటప్రకారం తల్లినిసంహరించినాడు.

జమదగ్నికి కోపం తగ్గిపోయింది. తన కొడుకు పరశురాముడు చూపిన తెగువకూ తనమాటను దాటకపోవడానికీ మనస్సులో చాలాసంతోషించినాడు. కుమారుణ్ణిచూచి ఇట్లాఅన్నాడు. "నా మాట మేరకు నీవు మిక్కిలి కష్టతరమైన పనినిచేసినావు. నీకు ఇష్టమైనవరాలన్నీ కోరుకో ఇస్తాను." ఈ మాటలువినగానే పరశురాముడు సంతోషించిన హృదయంతో, "నాతల్లి తిరిగిబ్రతుకువలె. ఆమెను సంహరించినపాపంనుండి

నాకువిముక్తికలుగవలె. నా అన్నలందరూ శాపంనుండివిముక్తిపొంది ఎప్పటిలాగా ఉండవలె. యుద్ధాలలో నాకు ఎదురులేని బలంకలుగవలె. నేను చాలాకాలం జీవించవలె." అని అర్థించి తనతండ్రివద్దనుండి ఆ వరాలన్నింటినీ పొందినాడు.

ఆ తరువాత కొంతకాలానికి జమదగ్ని ఆశ్రమానికి 'కార్తవీర్యార్జునుడు' అనేరాజువచ్చినాడు. ఆ కార్తవీర్యుడు అపారమైనబలంకలిగినవాడు. హైహయవంశంలో పుట్టినవాడు. సూర్యునివంటి వర్చస్సుకలవాడు. 'సహస్ర బాహుడ'నే పేరుతో ప్రసిద్ధిపొందినవాడు. ఆ అరణ్యాలలో వేటాడుతూ బడలినవాడై ఆ ఆశ్రమానికి వచ్చినాడు. తనవెంట గొప్పసైన్యంకూడాఉంది.

ఆ ఆశ్రమంలో జమదగ్నిచేత పూజించబడినాడు. అయినా కార్తవీర్యుడు రాజ్యమదంతో ఈ ఋషిని లక్ష్యపెట్టలేదు. ఆశ్రమ వాసులందరనూ అవమానించినాడు. ఆశ్రమంలోని చెట్లను విరచి వేసినాడు. హోమధేనువును దానిలేగదూడతోసహా తీసుకొనిపోయినాడు. ఆ తరువాత పరశురాముడు దర్భలు మొదలైన యజ్ఞపరికరాలను తీసుకొని అడవినుండి ఆశ్రమానికి చేరినాడు. అప్పుడు జమదగ్ని రాముడితో ఇట్లా అన్నాడు.

"వినవయ్యా! మనఆవును కార్తవీర్యుడు బలవంతంగా గర్వంతోపట్టుకొనిపోయినాడు. వాడు సామర్థ్యంకలవాడు మనమేంచేయగలము?" ఈ జమదగ్ని మాటలు విని పరశురాముడు మిక్కిలికోపంతో వేగంగా కార్తవీర్యుడిని వెంటాడిపోయినాడు. ప్రళయకాలంలోని మేఘాలగుంపులు వర్షాన్ని కురిపించినట్లు బాణాలవర్షం కురిపించి, ఆ కార్తవీర్యుడి సైన్యాన్ని చంపినాడు. ఇంకా కార్తవీర్యునివేయిచేతులనునరకి వాడిని చంపినాడు. ఆ చచ్చిన కార్తవీర్యుడు బలంతో సమస్తజగత్తును అవమానించినవాడు. ఆశ్చర్య పరచేగొప్పపరాక్రమంతో, ప్రాభవంతో, ప్రకాశించినవాడు. పరశురాముడు వీరాధివీరుడై వజ్రాయుధాని కంటే మిక్కిలివాడిఅయిన అమ్ముల వరుసలు ప్రయోగించి ఆ వేయిచేతులనూ నరకినాడు. శత్రువులందరూ భయపడిపోయినారు.

ఆ తరువాత కార్తవీర్యుని కుమారులు ఆ వైరాన్ని మనసులో ఉంచుకొని, పరశురాముడు లేని సమయంలో జమదగ్ని ఆశ్రమము చేరినారు. అక్కడి ఋషులను తిట్టినారు. పువ్వులతో కలకలలాడుతున్న చెట్లను కూకటి వేళ్ళతో పెకలించి వేసినారు. గొప్పవాడైన జమదగ్ని మహర్షిని బలవంతంగా పట్టుకొన్నారు. "ఓరామా! ఓరామా!" అని జమదగ్ని తనకుమారుణ్ణి బిగ్గరగా పిలుస్తూ ఉండగా, ఇతర ఋషులు శోకిస్తూ ఉండగా, ఆ ధర్మాత్ముడైన అతణ్ణి కోపంతో అజ్ఞానంతోకూడినఆవేశంతో చంపివేసినారు.

ఆ తరువాత పరశురాముడు ఆశ్రమానికి చేరుకొన్నాడు. అక్కడ తల్లి పెద్దగా కేకలుపెడుతూ ఏడుస్తూ ఉంది. అక్కడ జరిగిందంతా తెలుసుకొన్నాడు. మిక్కిలి గాఢమైన 'దుఃఖమ'నే దెబ్బతగిలింది. ఒక్క క్షణమైనా ఆగలేక కోపంతో మండిపోయినాడు.

"నీచులైన హైహయులు మాతండ్రి జమదగ్నిమహర్షిని చూచిచూచి చంపినారు. ఆయన పుణ్యాత్ముడు. ఇంద్రియాలను జయించినవాడు. దయాపరుడు. ప్రశాంతమైనవాడు. దాంతుడు. అలాంటి వాడిని 'కావాల'ని చంపినారు. అందువల్ల చెడ్డవారుగా మారుతున్న క్షత్రియుల నందరనూ చంపుతాను." అంటూ ప్రతిజ్ఞ చేసినాడు. అట్లా ప్రతిజ్ఞ చేసిన పరశురాముడు భూమిమీద అందరిచేత పొగడబడినవాడు. వీరాధివీరుడు.

ఆ పరశురాముడు ప్రతిజ్ఞ చేసి, లోకాలన్నింటికీ భయంకరమైన ఆకారాన్నిదాల్చి, క్షత్రియుల నందర్నీ చంపినాడు. భూమండలాన్నంతటినీ జయించినాడు. శాస్త్రోక్తంగా యజ్ఞం చేసినాడు. ఆ యజ్ఞంలో ఋత్విజుడైన కశ్యపప్రజాపతికి భూమండలాన్నంతా దానంచేసినాడు. అందుచేతనే భూమికి 'కాశ్యపి' అనే పేరుకూడాకలిగింది. ఆ తరువాత ఆయనపూర్తిగా సన్యసించి 'మహేంద్రగిరి' అనే ఈ కొండపైన తపస్సు చేసుకుంటూ ఉన్నాడు.

**నీతి :** పొగరు-మంచిది కాదు.

**విశేషం :** ఇదేకథ శాంతిపర్వం ద్వితీయాశ్వాసము 68 నుండి 88 పద్యాలవరకు కొద్ది మార్పులతో ఉంది.

ఉ. **వఱలఁగ రాముఁడంత ననవద్యుఁడు వచ్చి, బహుప్రలాపి యై**
**యఱచుచునున్న తల్లిని గృతాంతవశస్థితుఁడైన తండ్రి ను**
**క్కఱఁగని తీవ్రశోకపరిఘాతహతుం డయి తత్ప్రకార మం**
**దెఱిఁగి ముహూర్తమేనియు సహింపఁగ నోపక కోపదీప్తుఁడై.** **3-153**

చ. **అనఘుని వీతరాగుఁ గరుణాత్ము బ్రశాంతుని దాంతు నిమ్మహా**
**మునివరుఁజూచి చూచి యధముల్ వధియించిరి; దీనఁ జేసి దు**
**ర్జను లగుచున్న క్షత్రియులఁ జంపుదు నంచుఁబ్రతిజ్ఞ సేసె భూ**
**వినుతుఁడు, జామదగ్న్యుఁడతివీరుఁడు లోకభయంకరాకృతిన్.** **3-154**

# 15. ప్రభాసతీర్థము - పాండవయాదవసమాగమం.

(అరణ్య 3-158 నుండి 171 వరకు.)

పాండవులు అరణ్యవాసం చేస్తూఉండగా అర్జునుడు పాశుపతాస్త్రాన్ని సంపాదించడానికి హిమాలయాలకు పోయినాడు. అక్కడ ఈశ్వరుని ప్రసాదంతో పాశుపతాస్త్రాన్ని పొందినాడు. ఆ తరువాత స్వర్గంలో ఇంద్రునికి అతిథిగా ఉండినాడు. అప్పుడక్కడ ఊర్వశి ఇంద్రునిఅజ్ఞచొప్పున అర్జునుని వద్దకు వెళ్ళి సంగమాన్ని కోరింది. అర్జునుడు, "ఆమె తనకు తల్లి" అని చెప్పి, సంగమానికి అంగీకరించలేదు. అందుకు ఊర్వశి కోపగించుకొని అర్జునుణ్ణి, నపుంసకుడవు కమ్మ"ని శపించింది. అప్పుడు ఇంద్రుడు ఆ శాపావధిని అజ్ఞాతవాస సంవత్సరానికి మాత్రమే ఉండేట్లు అనుగ్రహించినాడు. "అజ్ఞాతవాస కాలంలో పేడిరూపంలో స్త్రీలకు నృత్యగానాలు నేర్పుతూఉండు"అని నిర్దేశించినాడు. వారికి నేర్పడానికిగాను అర్జునుడు స్వయంగా ఆ విద్యలు నేర్చుకునే ఏర్పాటు చేసినాడింద్రుడు. ఇంతలో నివాతకవచ పౌలోమ కాలకేయాది రాక్షసులను అర్జునునిచేత చంపించినాడు. అట్లా అర్జునుడు స్వర్గంలోనే ఆటపాటలు నేర్చుకుంటూఉండగా ఇంద్రుడు, 'రోమశుడ'నే మహర్షిని ఇట్లాకోరినాడు. "మీరు భూలోకానికి వెళ్ళి ధర్మరాజును కలవండి. అర్జునుని దివ్యాస్త్రలాభాన్ని గురించి ఆయన సోదరులకు తెలపండి. దేవకార్యార్థము అర్జునుడిక్కడే 'ఇంకా కొంతకాలం ఉంటాడ'ని చెప్పండి. ఈ లోగా భూలోకంలో వారితో మీరు తీర్థయాత్రలు చేయించండి. తీర్థయాత్రల మహిమచేత వారికి 'యుద్ధవిజయం సులభమ'వుతుంది అని చెప్పండి." ఇంద్రుని పంపున రోమశుడు ధర్మరాజువద్దకు వచ్చినాడు. అర్జునుని దివ్యాస్త్రలాభాన్ని వివరించినాడు. "అర్జునుడు ఇంకా కొంతకాలం దేవకార్యంకొరకు స్వర్గంలోనే ఉంటాడ'ని చెప్పినాడు. ఆ తరువాత వారిని తీసుకొని ఆయాక్షేత్రాల మహిమలు వాటికి సంబంధించినవారి కథలూ చెప్తూ తీర్థయాత్రలు చేయిస్తూఉండినాడు.

ఆ క్రమంలో ఒకనాడు వారందరూ ప్రభాసతీర్థం చేరినారు. అక్కడ ధర్మరాజు పండ్రెండు దినాలు గాలి నీరు మాత్రమే ఆహారంగా తీసుకుంటూ అయిదు అగ్నులమధ్యలో తపస్సుచేసినాడు.

ఈ విషయాన్ని తెలుసుకొని బలరామకృష్ణులు, ఇంకా ఇతరవృష్ణివంశనాయకులతో కలిసి ప్రేమగావచ్చి కీర్తిశాలురైన పాండవులను కలుసుకున్నారు. వారు అప్పటికే చాలాతీర్థాలు చూస్తూ ఎక్కువ ప్రయాణాలు చేసినందున కృశించిఉన్నారు. వారంతా నారబట్టలు జింకచర్మాలు ధరించిఉన్నారు. వారు చెరగనినిష్ఠతో తపస్సుచేసినవారు. అట్లాఉన్న పాండవులనుచూచి బలరామకృష్ణులు దుఃఖించినారు. పద్మాక్షియైన ద్రౌపదిని, ధైర్యాన్నిచ్చే మేలుకోరే మెత్తనిమాటలతో ఊరడించినారు.

బలరామకృష్ణులకు ఇతర వృష్ణివీరులకు ధర్మరాజు తమకు అరణ్యవాసంవల్లనూ తీర్థయాత్రల వల్లనూ కలిగిన శ్రమగురించి వివరించినాడు. అర్జునుడు 'దివ్యాస్త్రాలను సంపాదించినాడ'నీ చెప్పినాడు. ఆ తరువాత 'అర్జునుడింకా ఇంద్రునివద్దనే దేవకార్యంకొరకు ఉన్నాడ'నీ తెలియచేసినాడు.

ఇదంతావిని బలరాముడు, కృష్ణుడు మొదలైన వృష్ణివంశశ్రేష్ఠులతో ఇట్లాఅన్నాడు. "తెలివి లేనివాడై తనకుమారునిమాటలువిని ధృతరాష్ట్రుడు ఈ పాపాలకు భయపడే పాండవులకు భూరాజ్యం లేకుండాచేసినాడు. భయంకరమైనఅడవుల్లో ఉండేట్లుచేసినాడు. ఇది ధర్మమా? ఆలోచనలేని వాడయినాడు. భీష్ముడు మొదలైన పెద్దలు మైత్రితో జూదాన్ని నివారించలేకపోయినారు. సత్యంమీద గట్టిఇష్టంకలిగి, దైవాంశలతో పుట్టిన పాండవులకు కీడుచేస్తున్న దుర్యోధనుడు మొదలైన నీచులకు అభివృద్ధి కలుగుతూఉంది. పాండవులకు అభివృద్ధి లేకుండాఉంది. ఈ విధంగా చేయడం బ్రహ్మదేవుడికి తగునా? ఈ భూమిపైన ధృతరాష్ట్రుని కొడుకులను లేకుండాచేసి పుణ్యాత్ముడూ, ధర్మాన్ని మాత్రమే ధరించినవాడూ, అయిన ధర్మరాజును భూమికి అధిపతిని చేయకుండాఉండడం మనకుతగునా?"

ఈ మాటలువిని సాత్యకి బలరామునితో ఇట్లాఅన్నాడు. "సాటిలేని శౌర్యశీలురు, అంతులేని బలం కలిగినవారు అయిన నీవూ, కృష్ణుడూ, సాంబుడూ, సారణుడు, ప్రద్యుమ్నుడూ ఉండగా పాండవులు దుర్యోధనుడు మొదలైనవారిచేతలవల్ల ఈ విధంగా అనాథలుగా అడవి పండ్లే ఆహారంగా ఈ అడవిలో ఇట్లా హీనంగాఉండడంతగునా? భయంకరమైనయాదవసేన యుద్ధసన్నాహాన్ని సూచించే భేరీనినాదాలు శత్రువులమనసులను చీల్చడంలో సామర్థ్యంకలిగినవియై మారుమ్రోగి ఆకాశమూ దిక్కులూ నిండిపోతూఉంటే, ధృతరాష్ట్రునిపుత్రుల సైన్యంలోని వీరభటులకు భరించశక్యంకానివి కాగలవు. గొప్పదైన నీగొప్ప చేతులలోని నాగలిమొనదెబ్బలూ, కృష్ణుడిశార్జ్గంనుండి వదలబడిన బాణాల గుంపులూ, ప్రద్యుమ్నునిఅమ్ముల గుంపులూ, ఈ అనిరుద్ధుని భయంకరమైన బాణాల వరసలు, నా అస్త్రాల వెల్లువా, యుద్ధంలో ధృతరాష్ట్రుని కుమారులనునరకడానికి సమర్థతకలిగిఉంటాయి. కేకయులు సృంజయులు పాంచాలురు వృష్ణులు భోజులు అంధకులు మొదలైనవీరులు శ్రీ కృష్ణుని అనుమతితో యుద్ధంలో ధృతరాష్ట్రునికొడుకులనూ, భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు మొదలైన వారినీ చంపుతారు. ధర్మరాజు, తమ్ములుతానూ ఒప్పందంప్రకారం పదమూడేండ్లుగడపి రాజ్యాభిషేకంచేసుకుంటాడు. అంతదాకా అతిరథుడైన అభిమన్యుణ్ణి రాజ్యాన్నంతా రక్షించేవాడుగాచేసిఉందాము."

ఈ విధంగా పలికిన సాత్యకి మాటలకు అనుకూలం చూపి, కృష్ణుడు ధర్మరాజుతో ఇట్లాఅన్నాడు. "ధర్మరాజా! ఈ సాత్యకి చెప్పినట్లు మహాబలవంతులైనవీరు నీ శత్రువులను యుద్ధంలోచంపుతారు. వీరు జయించశక్యం కానివారు. సమస్త ప్రాణికోటితో కూడిన రాజ్యమంతా నీదవుతుంది. ఇది స్పష్టము."

ఈ మాటలకు గొప్పగాకీర్తి కలిగిన ధర్మరాజు బలరామకృష్ణులతో " మీ దయ మాకుంటే శత్రువులను జయించడం ఏమంత పెద్దపని? ఎల్లప్పుడు ధర్మంతోకూడిన బుద్ధులతో ఉత్తమకీర్తిమంతులయిన ద్రోణుడు, భీష్ముడు మొదలైనవారి సమక్షంలో ఆ విధంగా ఒప్పుకున్నమాట తప్పకూడదు కదా?" అని చెప్పి ధర్మరాజు యదువీరుల కోపాన్ని మరలించినాడు.

అంతట యాదవులందరూ పాండవులకు వీడ్కొని ద్వారకకుపోయినారు. పాండవులు రోమశ మహర్షితోపాటు తీర్థయాత్రలు కొనసాగించినారు.

**నీతి :** ఆడిన మాట తప్పరాదు.

చ. **అనుపమశౌర్య వంతుల రనంతబలాఢ్యుల రీవునీజనా**
**ర్దనుఁడును సాంబసారణులు దర్పకవీరుఁడు నుండఁ బాండునం**
**దనులు సుయోధనాదుల కృతంబున, నిట్టులనాథులట్లయి**
**వ్వనమున నుండఁగా దగునెవన్యఫలాశనహీనవృత్తి తోన్.** **3-165**

# 16. సుకన్య - చ్యవనుల కథ.

**(అరణ్య 3-174 నుండి 197 వరకు.)**
**(పాండవుల అరణ్యవాస కాలంలో రోమశమహర్షితోపాటూ తీర్థయాత్రలు చేస్తూఉండగా రోమశుడు ధర్మరాజుకు చెప్పిన కథలలో ఇదిఒకటి.)**

పూర్వమొకప్పుడు 'చ్యవనుడ'నే మహర్షిఉండేవాడు. ఆయన భృగుమహర్షికుమారుడు. ఆయన నర్మదానదీతీరంలో ఒకానొకసరోవరంవద్ద తపస్సుచేసినాడు. ఆ తపస్సు ఎన్నోవేలసంవత్సరాల పాటుగా సాగింది. ఆయన ఆశ్చర్యకరమైననిష్ఠతో తపస్సుచేసేవాడు. ఇంతకాలమూకూడా ఆయన వీరాసనంలోఉండియే తపస్సుచేసినాడు. అట్లాఆయన చలనంలేకుండా తపస్సుచేసుకుంటూఉండగా ఆయనచుట్టూ ఒకపుట్టఏర్పడింది. సమీపంలోని తీగలూ పొదలూ పుట్టపైకిపాకినాయి అందువల్ల ఆయన ఆ అడవిలో ఎవరికీ కనబడకుండాఉండినాడు.

తర్వాత చాలాకాలానికి 'శర్యాతి' అనేరాజు, తనపద్నాలుగువేలమందిభార్యలతో ఆ సరోవర తీరంలో విహరించడానికి వచ్చినాడు. అప్పుడు వారివెంటవచ్చిన ఆ రాజు కూతురుసుకన్య తన స్నేహితురాళ్ళతో ఆ సరోవరంఒడ్డున విహరిస్తూఉండింది. అప్పుడు మెరుపుతీగవంటి శరీరంకల సుకన్య పుట్టలోమెరుస్తున్న చ్యవనునికన్నులను చూచింది. 'అవి ప్రకాశించే మిణుగురు పురుగులేమో?'ననే ఊహచేత వేగిరిపాటుచెందింది. అప్పటికప్పుడే పుట్టనుత్రవ్వించింది. కానీ ఆ పుట్టలో ఏమీ కనిపించలేదు. కడకు అందులోఉన్న చ్యవనుడుకూడా కనిపించలేదు.

కానీ పుట్టను త్రవ్వించినందుకు చ్యవనుడు కోపగించుకున్నాడు. శర్యాతి సైన్యానికంతటికీ మూత్ర పురీషాలను నిరోధించినాడు. అది తనసైన్యం చేసిన 'ఏదో తప్పుచేత అలా జరిగిందేమో? ననుకున్నాడు శర్యాతి. అందరనూ అడిగినాడు. కాని కారణంమాత్రము తెలియలేదు. చింతలో కూరుకుపోయినాడు.

అట్లా చింతలోఉన్న తండ్రిదగ్గరకువచ్చింది సుకన్య. తండ్రితో "తండ్రీ! గొప్ప మిణుగురు పురుగులలాగా పుట్టలో రెండుమెరుగులు మెరసినాయి. తెలియక నేను ఆ పుట్టను త్రవ్వించినాను. కానీ ఆ రెండు కాంతులూ నాకుకనిపించలేదు. అందువల్ల మనస్సులో ఆశ్చర్యపడుతూ తిరిగివచ్చినాను. ఈ సేనకు కలిగిన ఈ బాధకు ఇదేమైనా కారణమేమో? చూడండి." అన్నది.

ఈ మాటలు విన్న శర్యాతి ఆ పుట్టదగ్గరకు పోయినాడు. అపుట్టలో తపస్సుచేస్తున్న చ్యవనుడు కన్పించినాడు. శర్యాతికి. ఆ చ్యవనుడు తపస్సువల్ల కలిగిన కష్టంతో చిక్కిపోయిఉన్నాడు. చాలా ముసలివాడుగా ఉన్నాడు. శర్యాతి ఆ భార్గవునికి నమస్కరించినాడు "మితిలేని మీ తపస్సు మహిమ తెలియక నా కుమార్తె ఇట్లాచేసింది. ఈ తప్పు సహించు. దయతో నా సైన్యానికి కలిగిన నిరోధాన్ని మాన్చు భూమిపైన ఆడపిల్లలు అంతజ్ఞానం కలిగినవారుకాదుకదా?" అన్నాడు.

ఈ ప్రార్థననువిని భార్గవుడు దయతలచినాడు. "మిక్కిలి అందం యౌవనం 'ఉన్నాయ'ని గర్వించిన ఈ కన్యను పరిగ్రహించి కానీ క్షమించను" అన్నాడు. శర్యాతి తనకూతురు సుకన్యను ఆ మునిశ్రేష్ఠుడికి సమర్పించినాడు. తన సైన్యానికి నిరోధం తొలగిపోయింది. తాను తననగరానికి తిరిగిపోయినాడు.

సుకన్య తనభర్త చ్యవనునికి మిక్కిలిభక్తితో సేవచేస్తూఉండింది. అట్లా కొంతకాలముండగా ఒకనాడు అశ్వినులిద్దరు ఆమెదగ్గరకు వచ్చినారు. తామెవరో ఆమెకు చెప్పినారు. ఆమెను, "అమ్మా! నీవెవరికూతురవు? ఎవరి భార్యవు?" అని అడిగినారు. ఆమె "నేను శర్యాతి కూతురను. భార్గవుడైన చ్యవనుని భార్యను." అనిచెప్పింది. ఆ మాటలువిని వారునవ్వినారు. "అయ్యో! ఇట్లాంటిరూపము, యౌవనమూ పొందికూడా కామభోగాలకుదూరంగాఉండే ముసలివాడైన భార్గవుని పెండ్లాడినావు. నీ యౌవనాన్ని వృథా చేసుకున్నావు. పోనీ ఇకమీదటనైనా, నీ వయస్సుకూ రూపానికీ తగినవాడిని పెళ్ళాడు. అట్లాంటివాడిని మేము తెస్తాము." అన్నారు. ఆ మాటలు సహించలేక సుకన్య అశ్వినులతో ఇట్లా అన్నది. "చ్యవనునిపై నాకెప్పుడూ ఎడతెగని ప్రేమ ఉండగా, ఇట్లా మాట్లాడడం తగునా?" అని సుకన్య, తనభర్త చ్యవనునితో వారుమాట్లాడిన మాటలూ తానుచెప్పిన సమాధానముకూడా వివరంగా చెప్పింది. చ్యవనుడు ఆమెపతివ్రతాత్వానికి సంతోషించినాడు. నిజానికి ఆమెమనసులోని భావాన్ని తెలిసికోవడానికి చ్యవనుడే ఆ అశ్వినులను నియోగించినాడు. అందుచేతనే చ్యవనుడికి అశ్వినుల పైకోపం కలుగలేదు.

చ్యవనుడు తనభార్యతో "ఆ అశ్వినులు చెప్పినట్లుచేయి." అని ఆజ్ఞాపించినాడు. ఆమె ఆవిధంగా భర్త ఆజ్ఞమేరకు అశ్వినులవద్దకు పోయింది. "నాకు అప్పుడేపొందిన యౌవ్వనంకల వరుణ్ణి సమకూర్చండి." అనిఅడిగింది. అప్పుడు ఆ అశ్వినులు భార్గవునితోపాటు సరస్సులోనికిదిగినారు. ఆ ముగ్గురూ నవయౌవనులై సరస్సునుండి బయటకువచ్చినారు. వారుముగ్గురూవచ్చి సుకన్యకు ఎదుటగా నిలబడినారు. "మాలో నీవు కోరినవాడిని వరించు." అన్నారు. ఆమె వెంటనే తన భర్త అయిన భార్గవుణ్ణే వరించింది. అప్పుడు చ్యవనుడు అశ్వినులపై మిక్కిలిప్రేమతో ఇట్లాఅన్నాడు.

"నేను మీవల్ల ఇప్పుడు యౌవనవంతుడనయినాను. ధన్యుడనయినాను. ఇంద్రుడు చూస్తూ ఉండగానే శర్యాతిచేసే యాగంలో మీకు సోమరసంఅందేట్లు చూస్తాను". ఈ మాటలు విని అశ్వినులు మిక్కిలిసంతోషించి అక్కడనుండిపోయినారు.

ఇక్కడ శర్యాతి, చ్యవనుడు తిరిగి యౌవనవంతుడవడం విని, ఆశ్చర్యపడినాడు. ఆనందించినాడు. కూతురినీ అల్లుణ్ణీ చూడడానికి వచ్చినాడు. భార్గవుడు శర్యాతిని సత్కరించి ఇట్లా అన్నాడు. "ఓ మహారాజా! నీకు గొప్పకీర్తి కలిగేట్లుగా నీ చేత యజ్ఞాన్ని చేయిస్తాను. యజ్ఞంచేస్తే నీకు మేలుకలుగుతుంది. యజ్ఞ సామాగ్రిని సమకూర్చుకో". అన్నాడు.

చ్యవనునిమాటపై పుణ్యాత్ముడైన శర్యాతి, శాస్త్రాలలో చెప్ప బడినట్లుగా యజ్ఞాన్ని నిర్వహించినాడు. ఆ యజ్ఞాంతంలో చ్యవనుడు అశ్వినులకు సోమంఇవ్వబోయినాడు. అందుకు ఇంద్రుడు చ్యవనునిపై

**కోపగించుకొన్నాడు.** "అశ్వినులు దేవతలకు వైద్యంచేసేవారే కానీ స్వయంగా వారు దేవతలుకారు. అందువల్ల అశ్వినులు **సోమపానానికి** అర్హులుకారు. ఇది చేయకూడనిపని. దేవతలు కానివారికి అడ్డంలేకుండా సోమరసాన్నిచ్చే **వారున్నారా**? అన్నాడు. అట్లాఅన్న ఇంద్రునిమాటలను లెక్కచెయకుండా చ్యవనుడు అశ్వినులకు సోమరసమిచ్చి త్రాగించినాడు.

దానిని సహింపక ఇంద్రుడు కోపగించుకొని విజృంభించి వజ్రాయుధంఎత్తినాడు. చ్యవనుడు ఇంద్రుణ్ణి వజ్రాయుధంతోసహా స్తంభింపచేసినాడు. రౌద్రాకృతితో మిక్కిలి వేగంగా ఇంద్రుణ్ణి చంపడానికి పూనుకొన్నాడు. హోమంవేల్చినాడు. అందులోనుంచి 'మదుడ'నే రాక్షసుడు పుట్టినాడు. ఆ మదుడు అపారమైన భయంకరమైన బలంకలవాడు. మహావేగం కలిగినవాడు. అతడు భూమిపైనా, ఆకాశంలోనూ, తిరిగే వారందరకూ భీతిని గొలిపే ఆకారాన్ని కలిగిఉన్నాడు. ఈ విధంగా పుట్టిన మదుడికి పదివేలయోజనాల పొడవున్న చేతులున్నాయి. నూరుయోజనాల పొడవైననాలుగు కోరలున్నాయి, పదియోజనాలపొడవైన పండ్లున్నాయి, సూర్యచంద్రులలాంటి కళ్ళున్నాయి, కాలాగ్నిసమానమైన నోరుంది, దిక్కులూ భూమీ ఆకాశంకూడానిండిన శరీరంఉంది. అతడుభూమిని ఒకదవడగా ఆకాశాన్నింకొకదవడగా 'నోరు' అనే గుహను తెరచినాడు. ఆ నోట్లోని నాలుక లోకంలోని జనులందరనూ భయపెట్టింది. తత్తరపాటు కలిగించింది. ఆ నాలుక అతివేగంగా కదలుతూఉంది. పెదవులను నాకుతూఉంది. అట్లాంటి రూపంతో అతిభయంకరంగా దిక్కులు పగిలిస్తూవచ్చే ఆ మహారాక్షసుడు మదుణ్ణిచూచి, దేవేంద్రుడు భయపడినాడు. భార్గవునిచేత తనభుజం స్తంభింపబడిఉండడంచేత, ఏమీ చేయలేకపోయినాడు. చ్యవనునిదగ్గరకు నడిచినాడు. నమస్కరించినాడు. "మునీంద్రా! నీ తపశ్శక్తి చేత చేసిన గొప్పప్రయత్నం వ్యర్థమవుతుందా? అశ్వినులు ఈనాటినుండి సోమపానానికిఅర్హులవుతారు. నీవు నా మీద దయతలచి నన్ను క్షమించు." అని ప్రార్థించినాడు.

అంతటితో చ్యవనమహర్షికి కోపం పోయింది. వెంటనే ఇంద్రునిభుజం స్తంభించడంమానుకొన్నది. ఇంద్రుడు భృగునందనుడినుండి వీడ్కోలుపొంది తననగరానికిపోయినాడు. ఆ మదుడు ఆ క్షణంలోనే చ్యవనుని ఉపదేశంతో మద్యాన్నీ, స్త్రీనీ, వేటనూ, ఆశ్రయించినాడు. అశ్వినులు సోమపానంచేసి, చ్యవనునికి కృతజ్ఞతలు తెలియచేసి, వీడ్కోలుపొంది, దేవలోకానికి పోయినారు. చ్యవనుడు సుకన్యతోపాటు నర్మదానదీతీరాన ఒకఆశ్రమంలో సుఖంగాఉండినాడు.

**నీతి :** ఎంతటి వారైన గర్విస్తే భంగపాటుతప్పదు.

క. **జృంభించి వజ్ర మెత్తిన । జంభాంతకు వజ్రయుత భుజాస్తంభము సం**
**స్తంభించి యతనిఁ బటుసం । రంభంబునఁ జంపఁగడఁగి రౌద్రాకృతితోన్.** 3-193

క. **చ్యవనుఁడు వేల్చిన నం దుఁ। ద్భవ మయ్యె నపారఘోరబలయుతుఁడు మహా**
**జవుఁడు మదుం డను రాక్షసుఁ । డవని చరద్యుచర భీకరాకారుండై.** 3-194

# 17. మాంధాతృని చరిత్ర.

**(అరణ్య 3-200 నుండి 206 వరకు.)**

**(పాండవులు తమ అరణ్యవాస కాలంలో రోమశమహామునితోపాటుగా తీర్థయాత్రలుచేస్తూ యమునానది వద్దకు చేరుకున్నారు. అక్కడ మాంధాతృడు 'పెక్కుయాగాలు చేసినాడ'ని చెప్పినాడు. అప్పుడు ధర్మరాజు అడుగగా రోమశుడు మాంధాతృని చరిత్రను చెప్పినాడు.)**

పూర్వమొకప్పుడు ఇక్ష్వాకువంశంలో 'యువనాశ్వుడనే'రాజు ఉండేవాడు. అతడు పరాక్రమంతో వేయిఅశ్వమేధాలుచేసిన ధర్మపరుడు. మిక్కిలిబలంకలిగినవాడు. మితిలేని కీర్తికలవాడు. వారించడానికి వీలుకాని పరాక్రమానికి నిలయమైనవాడు. చాలమంచివాడు. అట్లాంటి యువనాశ్వునికి సంతానము కలుగలేదు. అందువల్ల అతడు దుఃఖముచేత పరితపించినాడు. రాజ్యభారం మంత్రులమీద ఉంచినాడు. తాను రాజధానిని వదలి భృగుమహర్షి ఆశ్రమానికి పోయినాడు. అక్కడ చాలాకాలం పుత్రులకొరకై ఆ మునిని సేవించినాడు. అప్పటికి భృగుమహర్షి యువనాశ్వునిపై దయతలచినాడు. అతనిచేత పుత్రకామేష్టియాగాన్ని చేయించినాడు. ఆ యజ్ఞంలో భృగువు, పుత్రుడు పుట్టడానికి కావలసిన మంత్రాలు వల్లించినాడు. అట్లామంత్రాలతో పవిత్రీకరించిన నీటినికలిగిన ఒకకలశాన్నిపొందినాడు. ఆ కలశాన్ని 'భద్రంగా కాపాడుమ'ని ఋత్విజులను ఆజ్ఞాపించినాడు.

కానీ ఋత్విజులందరూ ఇంతకాలం యజ్ఞంకొరకై జాగరణాలుచేసి అలసిఉండినారు. యజ్ఞం ముగిసిననాటిరాత్రి ఋత్విజులందరూ ఆదమరచిన నిద్రపోయినారు. అందుచేత కలశాన్ని పూర్తిగా కాపాడలేకపోయినారు. రాజైనయువనాశ్వుడుకూడా ఆ యాగశాలలోనే నిద్రించినాడు. ఆయనకు నిద్రలోఉండగా దాహంవేసింది. నిద్రలేచి నీటి కొరకై వెదకినాడు. కలశంలో నీరుకనిపించింది. అది 'ప్రత్యేకమైన మంత్రజలమ'ని ఆయనకు తెలియదు. అది 'భృగువు భద్రపరచమన్ననీర'నీ తెలియదు. తెలిసిన ఋత్విజులందరూ గాఢనిద్రలో ఉన్నారు. రాజువెంటనే కలశంలో నీటినంతాత్రాగినాడు. తిరిగి నిద్రించినాడు.

తెల్లవారి చూస్తే ఋత్విజులకు కలశంలో నీరుకనిపించలేదు. ఆ నీరేమైందో వాళ్ళకు తెలియలేదు. భృగుమహర్షికి మాత్రము విషయము తెలిసిపోయింది. "నీకు పుత్రులు పుట్టడంకొరకై నాతపోబలం వలన మంత్రజలాన్ని పొందినాను. దాన్ని 'నీభార్య కివ్వాల'నుకొన్నాను. రాత్రికి ఋత్విజులను 'ఆ నీటిని జాగ్రత్తగా రక్షించమ'న్నాను. వారు నిద్రపోయినారు. నీవు దాహంతో తెలియక ఆ నీటిని త్రాగినావు, జరుగ కూడనిపని జరిగిపోయింది. దేవుడు చేయాలనుకొన్న పనిని తప్పించడానికి ఎవరికీ సాధ్యంకాదు. ఇందువల్ల నీకేగర్భంకలుగుతుంది. ఇంద్రునితో సమానుడైన కొడుకుపుడతాడు." అని యువనాశ్వునితో అన్నాడు.

ఆ మాటలు విని యువనాశ్వుడు చేసేదేంలేక తన నగరానికి తిరిగిపోయినాడు. ఎప్పటిలాగే తన రాజ్యాన్ని పాలిస్తూఉండినాడు. ఆ తరువాత నూరేండ్లకు యువనాశ్వుని శరీరంలోని ఎడమభాగాన్ని చీల్చుకొని ఒక బాలుడుదయించినాడు. వాడు ఉదయించే సూర్యునికాంతివంటికాంతి కలిగిఉన్నాడు. ఆ బాలుని చూడడానికి ఇంద్రుడు స్వయముగా వచ్చినాడు. వచ్చి ఆ బాలుని నోట్లో తనచూపుడు వేలు నుంచినాడు. "అమృతమయమైందీ వ్రేలు. దీన్ని త్రాగు" అన్నాడు. నిజానికి ఇంద్రుడు దేవభాష (సంస్కృతం) లో "మాంధాస్యతీ". అన్నాడు. అంటే, "నన్ను త్రాగు". అని అర్థం. దేవతలంతా ఇంద్రుడన్న ఈ మాటను బట్టి ఆ బాలుడికి "మాంధాతృడు". అనే పేరుపెట్టినారు. ఆ విధంగా ఆ బాలుడు దేవేంద్రుని చేతపెంచబడినవాడు అయినాడు.

అట్లా ఇంద్రునిచేత పెంచబడిన మాంధాతృడికి ధ్యానం చేయడం మాత్రంచేతనే, నాలుగు వేదాలూ, అన్నిశాస్త్రాలూ, ధనుర్వేదమూ, అన్నిదివ్యాస్త్రాలూ వచ్చిచేరినాయి.

ఆ తరువాత ఆ మాంధాతృడు మహేంద్రునిచేత భూలోకానికంతటికీ చక్రవర్తిగా అభిషేకించ బడినాడు. ఇంద్రుని అర్ధసింహాసనముకూడా ఎక్కినాడు. అజగవము అనే విల్లునూ, దివ్యాస్త్రాలనూ, భేదించడానికి వీలుకానీ కవచాన్నీ ధరించి, లోకాలన్నింటినీ జయించినాడు. సంపూర్ణమైన దక్షిణలతో చాలాయజ్ఞాలు చేసినాడు. కోటానుకోట్లఅవులను దానంచేసి, బ్రాహ్మణులను తృప్తిపరచినాడు. ప్రజలందరూ తనఅజ్ఞనుపాటించే వారినిగా చేసుకొన్నాడు.

ఇట్లామాంధాతృడు రాజ్యపరిపాలనచేస్తుండగా, ఒకసారి భూమిమీద వర్షాలుకురవలేదు. అప్పుడు మాంధాతృడు మిక్కిలికోపగించుకొన్నాడు. ఇంద్రునితో భయంకరంగా యుద్ధంచేసినాడు. తనదివ్యాస్త్రాలతో ఏనుగులను కొట్టినట్లుగా మేఘాలనుకొట్టినాడు. అప్పుడు మేఘాలు భూమిమీద వర్షించక తప్పలేదు. పంటలు పండినాయి. ప్రజలు సంతోషించినారు.

**నీతి :** రాజులకు ప్రజారక్షణం తప్పక చేయవలసినపని

**విశేషం :** కృత్రిమవర్షాన్ని గురించిన పూర్తి అవగాహన ఆ నాడుండిందో లేదోకానీ, అట్లాంటి 'ఊహ మాత్రం తప్పక ఉండేదనే విషయాన్ని ఈ కథ తెలియచేస్తుంది.

**మధ్యాక్కర**

**భూమికనావృష్టియైనఁగడునల్గి పురుహూతుతోడ**
**భీమసంగ్రామంబు c జేసె; cదనదివ్యపృథు సాయకముల**
**సామజావలి నేయునట్లు మేఘ సంచయములనేసి,**
**భూమికిఁగురియించె వర్షములు సస్యముల్ వృద్ధిబొంద.** **3-206**

## 18. సోమకరాజర్షి కథ.

**(అరణ్య 3-208 నుండి 221 వరకు.)**

**(పాండవులు అరణ్యవాసకాలంలో రోమశమహామునితోపాటుగా తీర్థయాత్రలుచేసినారు. ఆ యాత్రలలో కురుక్షేత్రందగ్గరలోని సరస్వతినదీతీరంలో సోమకరాజర్షి యజ్ఞంచేసినచోటును చూచినారు. అప్పుడు ధర్మరాజడుగగా రోమశుడు ఈ సోమకరాజర్షి కథను చెప్పినాడు.)**

పూర్వమొకప్పుడు 'సోమకుడ'నే రాజఋషి ఉండేవాడు. ఆయనకు నూరుగురు భార్యలుండేవారు. నూరుగురుభార్యలున్నా సోమకుడికి సంతానం కలుగలేదు. ఆయన సంతానంకొరకై గొప్పయజ్ఞం చేసినాడు. ఆ యజ్ఞఫలితంగా ఒక కుమారుడు జన్మించినాడు. వాడిపేరు జంతుడు. అతని భార్యలు నూరుమందీకూడా ఆ జంతుణ్ణి మిక్కిలిప్రేమగా చూచుకొనేవారు. అట్లావారందరూ వేరుభావం లేకుండా ఆ జంతుడిని చక్కగాపెంచినారు. లోకంలోని ప్రజలంతా ఈ విషయాన్ని చూచి ఆశ్చర్యపడేవారు.

ఒకనాడు బాలుడైన జంతుణ్ణి ఒకచీమ కుట్టింది. ఆ నొప్పిభరించలేక ఆ బాలుడేడ్చినాడు అప్పుడు ఆ నూరుగురు తల్లులు అక్కడకు పరుగెత్తికొని వచ్చినారు. అందరూ బాలుడితో పాటుగా పెద్దగాఏడ్చినారు. సోమకుడు ఆ ఏడుపులశబ్దం విన్నాడు. తొట్రుపాటుతో అంతఃపురముచేరినాడు. కొడుకును బుజ్జగించినాడు. వాడు ఏడుపును ఆపినాడు. అప్పుడు ఆ తల్లులు నూరుగురుకూడా ఏడుపాపినారు. ఇటువంటి 'ఇబ్బందులు రాకూడద'నుకొన్నాడు సోమకుడు. ఆ విషయం తేల్చడానికి కొలువుతీర్చినాడు.

కొలువులో సోమకుడు మంత్రులతో ఇట్లాఅన్నాడు. "ఒక్కకొడుకును కొడుకుగానమ్మి ఉండవచ్చునా? నాకిందరు భార్యలుండికూడా పుత్రుడొక్కడే ఉన్నాడు. ఇది చూడడానికి మీకు న్యాయంగా అనిపిస్తున్నదా? చూడండి ఏదైనా ఉపాయమాలోచించండి".

ఈ మాటలువిన్న కొలువులోని ఒకఋత్విజుడు, "రాజా! నీ నూరుగురుభార్యలకూ 'నూరుగురు కొడుకులు కావాల'నుకుంటే నేను చేయించే యజ్ఞాన్ని పూనికతోచేయి. 'ఇదితగును, ఇదితగదు', అని ఆలోచించవద్దు. నీకుమారుడైన జంతుణ్ణి బలిపశువుగాచేయి. అతణ్ణిచంపి, అతని బొడ్డుక్రిందగల "వప" అనే క్రొవ్వును ఆహుతిచేసి అగ్నిదేవుణ్ణి సంతృప్తిపరచు. అప్పుడు నీనూరుగురు భార్యలకు నూరుగురు కుమారులు పుడతారు. ఆ నూరుమందిలో పెద్దవాడుగా ఈ జంతుడు తిరిగిజన్మిస్తాడు. అప్పుడు అతడిఎడమపక్కదేహమంతా బంగారులక్షణాలతో శోభిస్తుంది." అన్నాడు. ఆ తరువాత సోమకుడు ఋత్విజుడు చెప్పినట్లుగా యజ్ఞం చేసినాడు.

కుమారుణ్ణి చంపి బొడ్డుకింద కొవ్వును (వప) తీసుకొని హోమంచేసినాడు. అది చూచి సోమకుని భార్యలు నూరుమందీ కూడా, పుత్రునిమీదప్రేమతో మిక్కిలిదుఃఖించినారు. బాధతో అరచి గొర్రెలలాగా* ఏడ్చినారు.

ఆ వపాహోమం పొగను పీల్చడంచేత ఆ నూరుమందిభార్యలూ గర్భాలుదాల్చినారు. తొమ్మిది నెలలు నిండగానే, జంతుడు మొదలగునూరుమంది కొడుకులను కన్నారు. ఆ నూరుమందిలో జంతునిపై మాత్రము వారందరూ ఎప్పటిలాగానే సమానమైన ప్రేమచూపేవారు. అట్లానూరుమందికొడుకులు కూడా పెరిగి సమర్థులైఉండినారు.

ఆ తర్వాత చాలాకాలానికి ఋత్విజుడు మరణించినాడు. నరకంలో భయంకరమైన అగ్నిలో వేగుతూ ఉండినాడు. ఇంకా కొంతకాలానికి సోమకుడుకూడా మరణించినాడు. ఆతడు స్వర్గానికిపోతూ దారిలో నరకంలో వేపబడుతున్న ఋత్విజుణ్ణి చూచినాడు. "ఇట్లా ఎందుకు దుఃఖంఅనుభవిస్తున్నావు?" అని అడిగినాడు. అందుకా ఋత్విజుడు "రాజా! నీకు యజ్ఞంలో ఋత్విజుడిగా పనిచేయడంవల్లనే ఈ నరకాగ్నిలో పడినాను సుమా! నీకు ఎన్నోపుణ్యగతులున్నాయి. నన్నుదయతో రక్షించు" అన్నాడు. అప్పుడు సోమకుడు యమధర్మరాజువద్దకుపోయినాడు. అక్కడ యముడు సోమకుణ్ణి "పుణ్యలోకాలకు పొమ్మ"న్నాడు. సోమకుడట్లా పుణ్యలోకాలకుపోతూ తనతపస్సు ఫలితాన్ని సమర్పించి ఋత్విజుణ్ణి నరకంనుండి కాపాడినాడు.

**నీతి :** ఎంత మంచిపనికైనా హింసపనికిరాదు. ఉపకారికి ఉపకారంచేయడం న్యాయం.

**తే.** **ధరణి నాథ! నీ భార్యాశతంబు నందుఁబరఁగ నూర్వురు పుత్రులఁబడయనీకు**
**నభిమతం బేని, ఁదగుఁదగదనక, నీవు కడఁగి మాచేయఁబంచినక్రతువు సేయు. 3-213**

---

* మూలంలో 'కురరి' లాగా ఏడ్చినట్లు చెప్పినారు. కురరి అనగా 'క్రౌంచపక్షి' అని చాల నిఘంటువులలో ఉంది. శబ్దరత్నాకరం 'క్రౌంచ పక్షి, ఆడలకుముకిపిట్ట, ఇంకా పెన్నడపక్షి', అని చెప్తూ 'గొఱ్ఱె' అని కూడా చెప్పింది. ఇక్కడ గొఱ్ఱె అనే అర్థం వాడబడింది. సూర్యరాయాంధ్ర నిఘంటువులో కూడా ఈ అన్ని అర్థాలు ఇవ్వబడినాయి.

## 19. శిబి చరిత్ర.

**(అరణ్య 3-227 నుండి 237 వరకు.)**

**(పాండవులు అరణ్యవాసకాలంలో రోమశమహామునితోపాటుగా తీర్థయాత్రలుచేస్తూ మానససరోవరం చేరుకొన్నారు. అక్కడకు దగ్గరలో 'భృగుతుంగమ'నే పర్వతాన్ని చూచినారు. అక్కడ 'శిబి చక్రవర్తి యజ్ఞం చేసినాడ'ని చెప్పి, రోమశ మహర్షి ధర్మరాజుకు ఈ కథను చెప్పినాడు.)**

మానససరోవరతీరంలో 'భృగుతుంగమ'నే పర్వతంఉంది. పూర్వమొకప్పుడు ఈ పర్వతంవద్ద ఆ సరోవర తీరంలో 'శిబి' అనే రాజు యజ్ఞం చేస్తూఉండినాడు. ఆ సరోవరం హిమాలయపర్వతాలలో ఉంది. ఆ శిబి ఉశీనర దేశపురాజు. ఆయన చాలాధర్మపరుడు, చాలాగొప్పవాడు.

ఇంద్రుడూ అగ్నిదేవుడూ ఆ శిబి గుణగణాలను పరీక్షించదలచుకొన్నారు. ఇంద్రుడు డేగరూపం ధరించినాడు. అగ్ని పావురమైనాడు. డేగ పావురాన్ని తరుముతూ ఉంది. పావురం భయపడి పోయింది. పరిగెత్తుకొని పోయి శిబిని శరణుచొచ్చింది. శిబి ఆ పావురానికి 'భయంలేద'ని చెప్పి, ఓదార్చినాడు. అంతలో పావురాన్ని వేటాడుతూఉన్న డేగ అక్కడకువచ్చింది. పావురమేమో శిబి రక్షణలోఉంది. అదిచూచి డేగ శిబితో ఇట్లాఅన్నది.

"నీవు సత్యాన్ని ఆచరించేవాడవు. ధర్మాన్ని అనుసరించేవాడవు. మలినంలేని నడవడిక కలిగినవాడవు. కానీ ఇప్పుడు ఆకలితోఉన్న నాకు నా ఆహారాన్ని లేకుండాచేసినావు. ఇట్లా నన్నన్యాయముచేసి పావురాన్ని కాపాడడం న్యాయమా? ప్రాణులన్నీ ఆహారంతోనే కదా బ్రతుకుతాయి? ఈ పావురాన్ని ఇప్పుడు తినకపోతే నేనాకలి బాధతోచస్తాను. నేనట్లా చస్తే, నాభార్యా పుత్రులుకూడా చస్తారు. ఒక్క పావురాన్ని రక్షించడంకోసం ఇన్నిప్రాణాలు తీయడం ధర్మవిరోధంకాదా? ధర్మంతెలిసినజ్ఞానులు, ధర్మానికి కీడుకలిగించే ఏ ధర్మాన్నయినా, 'ధర్మమ'ని మనసులో భావించరు. 'ధర్మం' అంటే అందరికీ మేలుచేసేది అయిఉండాలి. అంతేకానీ 'ఏకొందరికో మేలుచేసి, ఇంకొందరికి కీడుచేసేది' అయి ఉండకూడదు. ఈ పావురం నాకు వేదాలలో చెప్పబడిన ఆహారం. వేదాలలో "శ్యేనాః కపోతాన్ ఖాదయంతి." (డేగలు పావురాన్ని భక్షిస్తాయి) అనే వాక్యం ఉందికదా? కాబట్టి పావురాన్ని వదలి నా ఆహారాన్ని నాకివ్వు?"

శిబి డేగకు ఇట్లా సమాధానము చెప్పినాడు. "ప్రాణభయంతోవచ్చి ఈ పావురం నన్నాశ్రయించింది. ఎట్లాంటినీచుడైనా ఆశ్రయించినవాడిని వదలడుకదా? అట్లాంటప్పుడు నేను ఈ పావురాన్ని ఎట్లావిడుస్తాను? ఆశ్రయించినవాడిని విడువడం ధర్మమవుతుందా? చెప్పు. నీవు పక్షివైకూడాధర్మం తెలిసినట్లేమాట్లాడుతున్నావు. ఆశ్రయించినవారిని వదలడంకంటె పెద్దఅధర్మం ఇంకేముంటుంది? నీఆకలి పావురాన్ని తినడంతోతప్ప,

ఇంకొకవిధంగాతీరదా? నీ ప్రయత్నమంతా ఆహారంకోసమేఅయితే, ఇప్పుడీ అడవిలో జింకలు, దున్నలు, పందులు, పక్షుల మాంసాలను దానికంటె ఎక్కువగా పెడతాను. ఈ పావురంమీద కోపాన్నిమానుకో. నేనెట్లాగైనా ఈ పావురాన్ని వదలను." ఈ మాటలువిని డేగ ఇట్లాఅన్నది.

"ఓరాజా! పావురం నాకు సహజమైనఆహారం. ఈ పావురాన్ని రక్షించితీరాలనుకొంటే ఒక పనిచేయి. నీశరీరంనుండి దీనిఅంతమాంసం తూచి నాకుపెట్టు".

ఈ మాటలు వినగానే శిబి, "పక్షిశ్రేష్ఠా! నాపై దయచూపినావు. నన్ను ధర్మసంకటమునుండి రక్షించినావు" అన్నాడు. పుణ్యాత్ముడైన శిబి తక్షణమే సంతోషంగా చిన్నకత్తి తీసుకున్నాడు. తన శరీరంలోని మాంసాన్ని కోసి త్రాసులో పెట్టినాడు ఇంకొకవైపు పావురాన్ని ఉంచినాడు. ఎంతమాంసాన్నికోసి పెట్టినా త్రాసు పావురంఉండే వైపుననే క్రిందికిఉంటూవచ్చింది. అందుకు శిబి ఆశ్చర్యపడినాడు. శరీరంఅంతా నెత్తురుకారుతూఉంది. దాదాపు మాంసంఅంతా అయిపోయింది. అయినా పావురం తూగలేదు. ఇక 'ఇది పనికాద'నుకొని తానేత్రాసు పైకెక్కినాడు.

అప్పుడు ఆ శిబి త్యాగానికి ఇంద్రాగ్నులు మెచ్చుకున్నారు. డేగ పావురాల రూపాలు వదలి తమ నిజరూపాలు చూపించినారు. "నీ శౌర్యము, త్యాగము మొదలైనగుణాలు ఎవరికీ లేవు. కాబట్టి నీకీర్తి కలకాల ముంటుంది" అని శిబికి వరమిచ్చినారు. ఆ తరువాత వారిద్దరూ అదృశ్యమయినారు.

**నీతి :** ఆశ్రితులను రక్షించవలె. త్యాగము గొప్పది.

**తే:** **ప్రాణభయమున వచ్చి యిప్పక్షి నన్ను । నాశ్రయించె; నాశ్రితు నెట్టి యధముఁడయిన**
**విడువఁడనినను, నే నెట్లు విడుతు దీని । నాశ్రితత్యాగ మిది ధర్మ వగునె? చెపుమ. 3-232**

# 20. అష్టావక్రుని కథ.

**(అరణ్య 3-237 నుండి 250 వరకు.)**

**(పాండవులు అరణ్యవాసకాలంలో రోమశమహామునితోపాటుగా తీర్థయాత్రలుచేస్తూ శ్వేతకేతుతపోవనాన్ని చూచినారు. ఇక్కడే 'అష్టావక్రుడు శ్వేతకేతువు తపస్సుచేసినార'ని రోమశుడు చెప్పగావిని, ధర్మరాజు అడుగగా రోమశుడు ఈ కథచెప్పినాడు.)**

పూర్వకాలంలో 'ఏకపాదుడు'అనే మునిశ్రేష్ఠు డొకడుండేవాడు. అతడు తనవిద్య యొక్క వైభవంతో 'సుజాత' అనేఆమెను పెండ్లిచేసుకున్నాడు. ఆ తరువాత భార్యతోసహా అడవిలోఉంటూ భయంకరమైన తపస్సు చేస్తూఉండేవాడు. అంతేకాదు ఎల్లప్పుడూ శిష్యులతో వేదాలుచదివిస్తూ ఉండేవాడు.

ఇట్లాచాలాకాలం గడచింది. సుజాత గర్భంధరించింది. ఆ గర్భంలోఉండేబాలుడు ఒకనాడు తల్లిగర్భంలో ఉండగానే తండ్రితో, "నీ శిష్యులను పగలనకా రాత్రనకా ఎడతెరపి లేకుండా బాధపెట్టి చదివిస్తూఉన్నావు. వాళ్ళు నిద్రలేక మందబుద్ధికలవారై పోయినారు. వేదపాఠాలను వారుతప్పుగా చదువుతున్నారు. ఇంతబాధించి నిద్రలేకుండా చదివించవలసిన అవసరముందా? తగినంత విశ్రాంతి నివ్వవలసిన అవసరంలేదా?" అని తిట్టినట్లు మాట్లాడినాడు.

ఈ మాటలువిన్నతండ్రి ఏకపాదుడు కోపగించుకొన్నాడు. "నీవు వేదాధ్యయనాన్ని వంకరగా విమర్శించినావు. కాబట్టి ఎనిమిది వంకరలుగలశరీరంతో జన్మించు." అని కొడుకును శపించినాడు. అయినా ఆ శిశువు నిప్పుతో సమానమైన మహాత్ముడు. ఆ శాపాన్ని ఏమాత్రం లెక్క చేయకుండా సుజాత కడుపులో పెరుగుతూ ఉండినాడు.

కొంతకాలానికి సుజాతకు ప్రసవకాలం సమీపించింది. ఒకనాడు సుజాత భర్తతో ఇట్లాఅన్నది "భూమిమీద నిరుపేదలుకూడా ప్రసవసమయానికి నెయ్యి, నూనె, ధాన్యాలను ముందుగానే సమకూర్చి పెట్టుకుంటారు. మనదగ్గర ధనమేమీలేదు. అందువల్ల వాటినిసంపాదించడం ఆలోచిస్తే మిక్కిలి కష్టమయినపని. ఏమి చేయగలను? ఏవిధంగా ఈపురిటి బాధలుపోతాయి?"

ఈ మాటలువిన్నాడు ఏకపాదుడు. అందులోని నిజాన్ని గుర్తించినాడు. ధనం సంపాదించా లనుకున్నాడు. జనకమహారాజు దగ్గరకు పోయినాడు. అప్పుడు జనకుడు యజ్ఞం చేస్తూఉండినాడు. ఆ యజ్ఞశాలలో వరుణుడికుమారుడు 'నంది'అనేపండితుడు ఉండినాడు. ఆ నందితో శాస్త్రచర్చచేసి అందులో ఏకపాదుడు ఓడిపోయినాడు. ఆ నంది ఏకపాదుణ్ణి నీటిలో ముంచిఉంచినాడు. ఈ విధంగా అనేక బ్రాహ్మణోత్తములు నందిచేతఓడినారు. వారందరూకూడా ఏకపాదునిలాగానే సముద్రం అడుగున ఉండినారు. నంది వరుణుడి కుమారుడు కదా? వరుణుని అనుగ్రహంచేత సముద్రపు నీటిఅడుగున ఒక నివాసయోగ్యమయిన భవనాన్ని ఏర్పాటుచేసి, అందులో ఓడిన బ్రాహ్మణులనందరనూ బంధించి ఉంచినాడు.

ఇక్కడ ప్రసవకాలం రాగానే సుజాత పుత్రుణ్ణి కన్నది. ఆ పుత్రుడు ఎనిమిది వంకరలతో పుట్టినాడు. అదేకదా తండ్రి ఏకపాదుడి శాపం? ఆ వంకరలకు తగినట్లు ఆయన 'అష్టావక్రుడ'నే పేరుతో పిలువబడుతూ ఉండినాడు.

సుజాతతండ్రి ఉద్దాలక మహర్షి, అష్టావక్రుడుపుట్టిన సమయంలోనే ఉద్దాలకమహర్షిభార్య అయిన సుజాతతల్లికూడా ఒకమగపిల్లవాణ్ణి కన్నది. వాడిపేరు శ్వేతకేతువు. ఇట్లావారు మేనమామ మేనళ్ళుళ్ళు అయినా, సమాన వయస్కులుగా ఉండేవారు. ఏకపాదుడు సముద్రపు అడుగులో బంధించబడి ఉండడంచేత సుజాత తనకొడుకుతోకూడా తనతండ్రి ఆశ్రమంలోనే కాలం గడపుతూ ఉండింది.

అష్టావక్రుడు శ్వేతకేతువుకూడా ఉద్దాలకునివద్దనే వేదాధ్యయనంచేసినారు. వారి విద్యాభ్యాసం పండ్రెండేండ్ల పాటు సాగింది. వారిద్దరూ వేదాధ్యయనంలో మేటి శూరులైనారు. అష్టావక్రుడు ఉద్దాలకుడే 'తనతండ్రి' అనీ, శ్వేతకేతుడు తన 'సోదరుడ'నీ, భావిస్తూ ఉండేవాడు. వేరేఆలోచన ఏదీలేకుండా సుఖంగా బ్రతుకుతూ ఉండినాడు. ఒకనాడు అష్టావక్రుడు ఉద్దాలకుని తొడపై కూర్చొనిఉండినాడు. అదిచూచి శ్వేతకేతుడు సహించలేకపోయినాడు. వాడికి ఈ విషయంలో కొంతఅవగాహనఉంది. ఉద్దాలకుడు 'తనకు మాత్రమే తండ్రి' అనీ, 'అష్టావక్రుడికి కాదు.' అనీ వాడికి తెలుసు. "నీవు నా తండ్రి తొడపైన ఎందుకు కూర్చున్నావు? నీవు పోయి నీతండ్రితొడపైకూర్చో." అని చెప్పి శ్వేతకేతుడు అష్టావక్రుణ్ణి చేయిపట్టి క్రిందకు ఈడ్చినాడు.

అష్టావక్రుడు ఏడ్చుకుంటూ తల్లిదగ్గరకు పోయినాడు. "నా తండ్రి ఎవరు? ఎక్కడకు పోయినాడు? చెప్పు." అని స్పష్టంగా అడిగినాడు. 'నందితో తన తండ్రి ఓడడం' మొదలైన విషయాలన్నీ తనతల్లిద్వారా తెలుసుకొన్నాడు. విద్యయే సంపదగాకల అష్టావక్రుడు వెంటనే జనకమహారాజు సభకు ప్రయాణమైనాడు. శ్వేతకేతుణ్ణికూడా తోడుతీసుకొనిపోయినాడు.

ఇట్లాఅష్టావక్రుడు శ్వేతకేతుడితోపాటు జనకుడివద్దకు పోయినాడు. ఇంతకాలమైనా ఇంకా జనకుడు యజ్ఞం చేస్తూనే ఉండినాడు. వీరిద్దరూకూడా యజ్ఞశాలలోనికి ప్రవేశించబోయినారు. అక్కడ ద్వారపాలకులు వీరిని అడ్డగించినారు. వీరిద్దరూ ద్వారపాలకులతో ఇట్లా అన్నారు. "ఈ ద్వారం నుండి మూగ, గ్రుడ్డి, చెవిటివాళ్ళూ, ఆడవాళ్ళూకూడా సులభంగా లోపలికిపోతూఉన్నారు. విద్వాంసులమూ, బ్రాహ్మణులమూ అయిన మమ్మల్నెందుకు అడ్డగిస్తున్నారు?"

ఆ మాటలకు ద్వారపాలకులు ఇట్లా అన్నారు. "మహానుభావులైన వృద్ధవిద్వాంసులూ, గొప్ప ఋత్విజులూ మాత్రమే, ఈ యజ్ఞశాలలోనికి పోగలరు. మీరు పసివారు. లోపలకు పోకూడదు. పొండి."

అందుకు అష్టావక్రశ్వేతకేతులు ఇట్లాఅన్నారు. "అలసిపోకుండా చాలాసంవత్సరాలు బ్రతకడం, వెంట్రుకలు తెల్లబడడం, మాత్రమే పెద్దల లక్షణమా? ఈ భూమిమీద జ్ఞానముండేవాడెవడైనా పెద్దవాడే. చక్కగాచదువుకొని ఆచారపరుడైనవాడు వయసులో చిన్నవాడైనా పెద్దవాడే. ప్రజలందరూ మన్నించదగినవాడే. 'పిల్లలమ'ని మమ్మవమానించవద్దు. జనకరాజు సభలో గర్వించి ఉన్న వేదవాదులతో 'వాదం చేయాల'ని పూనుకొని వచ్చినాము."

ఈ మాటలు విన్న ద్వారపాలకులు, "వీరెవరో మహానుభావులుగా కనిపిస్తూ ఉన్నారు. రాజుగారితో ఒకమాటచెప్పి, ఆయన ఆజ్ఞ ప్రకారం చేస్తే మనకేబాధఉండదు" అనుకొన్నారు. వెంటనే రాజుగారికి విషయం విన్నవించినారు. ఆయన అనుమతితో వారిని యజ్ఞశాలలోనికి అనుమతించినారు.

లోపలికి చేరిన అష్టావక్ర, శ్వేతకేతులను జనకుడు అనేక ప్రశ్నలు వేసినాడు. ఆ ప్రశ్నలన్నింటికి అష్టావక్రుడు సరియైన సమాధానాలనిచ్చినాడు. ఆ తరువాత అష్టావక్రుని కోరికపై నందితో వాదనకు అవకాశము కల్పించినాడు జనకమహారాజు.

బ్రాహ్మణులమధ్యలో ఆసీనుడైఉండిన నందితో అష్టావక్రుడు వాదించినాడు. వాదనలో ఆ నందిని ఓడించినాడు. మునుపు నందిచేతిలోఓడి సముద్రంలో నీటిఅడుగున బంధించి ఉంచబడిన బ్రాహ్మణులందరనూ తనతండ్రితోపాటుగా విడిపించినాడు.

మిక్కిలితేజస్సుకలిగిన అష్టావక్రుడు సర్వలోకాలచేతపూజింపబడే జనకమహారాజుచేత సన్మానించబడినాడు. పండితులందరూ అతడిని ప్రశంసించినారు. తండ్రి ఏకపాదుని తీసికొని శోభాయ మానంగా తనఆశ్రమానికి చేరినాడు అష్టావక్రుడు.

**నీతి :** నిద్రలేకుండా ఎప్పుడూ చదివితే బుద్ధిమందగిస్తుంది.
కోపం మంచిది కాదు.
పసివాడైనా జ్ఞానం కలిగి ఉంటే అతన్ని పెద్దవాడుగానే పరిగణించవలె.

**విశేషం :** అష్టావక్రుడు చాలా గొప్పపండితుడు గదా? గర్భంలో ఉండగానే అన్ని విషయాలు గ్రహించగలిగినవాడు కదా? తండ్రికీ తాతకూ తేడా తెలిసికోలేక పోయినాడా? అది కూడా తల్లి, తాత తన కెదురుగానే ఒకే ఆశ్రమంలో జీవిస్తూ ఉండగా. అది ఎట్లో? విచారించవలసి ఉంది.

**క.** **అలఘులగు వృద్ధవిద్వాం । సులకు మహాయాజ్ఞికులకుఁజొర నర్హంబై**
**విలసిల్లు యజ్ఞసభ సొరఁ। వలవదు చనుఁ;డీరు చిఱుతవారల రనినన్.** **3-247**

**క.** **అలయక యేండ్లు గడుం బె క్కులు జీవించుట నరగలుగుటయుం దగు వృ**
**ద్ధుల లక్షణమే? జ్ఞానము గలఁ డేనిన్ బాలుఁ డయినఁ గడు వృద్ధు మహిన్.** **3-248**

# 21. యవక్రీతుని కథ.

(అరణ్య 3-252 నుండి 283 వరకు.)

**(పాండవులు అరణ్యవాసకాలంలో రోమశమహర్షితోకూడి తీర్థయాత్రలుచేస్తూ భరద్వాజాశ్రమం చేరుకొన్నారు. అప్పుడు భరద్వాజుడి కుమారుడు యవక్రీతునికథను ధర్మరాజుడుగగా రోమశుడు చెప్పినాడు.)**

ఒకానొకకాలంలో గొప్పవారైన 'రైభ్యుడు, భరద్వాజుడు' అనే ఋషులుఉండేవారు. వారు తమలో తాము మంచిమిత్రులుగా ఉండేవారు. వారు ఎల్లప్పుడూ నిర్మలంగా తపస్సు చేసుకుంటూ ఉండేవారు. అందుచేత వారికిసుస్థిరమైనబుద్ధి ఉండేది. వారు నిత్యం సంతోషంతోఉండేవారు.

అందులో రైభ్యునికి ఇద్దరు కుమారులుండేవారు. ఆయన పెద్దకొడుకు అర్ధావసువు, చిన్నవాడు పరావసువు. వారిద్దరూకూడా వేదాలనధ్యయనం చేయడంలోదిట్టలైనారు. రైభ్యుడు ఆ ఇద్దరు కుమారుల పాండిత్యంవల్ల విద్వాంసులచేత తానుపూజింపబడుతూ ఉండేవాడు.

భరద్వాజునికి మాత్రము ఒకడే కుమారుడు. పేరు యవక్రీతుడు. అతడు వేదాధ్యయనంజోలికి పోలేదు. అందుచేత అతనిని ఎవరు మర్యాదచేసే వారుకాదు. తనవల్ల తనతండ్రికి కూడా గౌరవం ఏమీ లేకుండాపోయింది.

ఇదంతా గమనించి యవక్రీతుడు, రైభ్యునిపై ఆయన కుమారులపై అసూయపడినాడు. ఎట్లాగైనా వేదశాస్త్రాలు సంపాదించాలనుకొన్నాడు. అధ్యయనం ప్రారంభించడానికి 'తన వయస్సు దాటిపోయింద'ని గుర్తించినాడు. 'తపోబలంతోనే వేదశాస్త్రాలను పొందుదామ'నుకున్నాడు. అగ్నిని రగిలించినాడు. అందులో హోమద్రవ్యాలను వేల్చుతూ, భయంకరంగా తపస్సుచేస్తూ ఉండినాడు.

ఇంద్రుడు ఆ తపస్సును ఇష్టపడలేదు. అతడు యవక్రీతునివద్దకు వచ్చినాడు. "నీవెందుకింత భయంకరమైన తపస్సుచేస్తున్నావు?" అని అడిగినాడు. అందుకు యవక్రీతుడు ఇంద్రునితో ఇట్లాచెప్పినాడు. "ఏగురువువద్దా చదవకుండానే నాకు 'అన్నిశాస్త్రాలూ ప్రాప్తించాల'ని కోరుకొని వదలకుండా నిష్ఠతో భయంకరమైనతపస్సు చేస్తూఉన్నాను." అందుకు ఇంద్రుడు ఇట్లాఅన్నాడు. "గురువు ముఖంద్వారా పొందకుండా కష్టమైనతపస్సుద్వారా పొందేవిద్యలు ఎంతసాధువులకైనా గర్వాన్నీ, అసూయనూ కలిగిస్తాయి. ఇది విద్యలు సంపాదించడానికి తగిన మార్గంకాదు" అని అడ్డుచెప్పి, అక్కడనుండి పోయినాడు.

కానీ యవక్రీతుడు తనపట్టువదలకుండా, ఎప్పటిలాగే తపస్సు చేస్తూనేఉండినాడు. అతడి తీవ్రమైనతపస్సు ఇంద్రుడి హృదయాన్ని తపింపచేసింది. వెంటనే ఇంద్రుడు ఒకబక్కచిక్కిన శక్తిలేని

ముసలిబ్రాహ్మణునిఆకారంధరించినాడు. యవక్రీతునిఆశ్రమంసమీపంలో మితిలేనిలోతైన గంగా ప్రవాహంలో పిడికిళ్ళతో ఇసుకపోస్తూ ఆనకట్టకట్టేప్రయత్నం చేస్తూఉండినట్లు నటిస్తూఉండినాడు. అట్లానటించే ఇంద్రుణ్ణిచూచి యవక్రీతుడునవ్వుతూ, "నీకు నూరేళ్ళునిండినాయి. ముసలివాడవై పోయినావు. మిక్కిలి బక్కచిక్కి ఉన్నావు. సాధ్యంకాని దానిలో ఎందుకుఆసక్తి చూపిస్తున్నావు? ఎందుకు మందబుద్ధి కలిగిన వాడవైనావు? ఇంకెప్పుడిది పూర్తి అవుతుంది?" అన్నాడు.

ఆ మాటలు విని ఇంద్రుడు యవక్రీతుణ్ణీచూచి, "నేనుకూడా నీలాగే వీలుకానిదానికై ప్రయత్నిస్తున్నాను." అని చెప్పి, తననిజరూపం చూపించినాడు. ఇంకా ఇట్లాచెప్పినాడు. "ఈ వ్యర్థమైన శ్రమ ఎందుకుపడతావు? మానుకో." అందుకు యవక్రీతుడు, "నేను ఎట్లాగూ మానుకోను. నాకోరికతీర్చు" అన్నాడు. 'ఇంక తప్పద'నుకొని ఇంద్రుడు యవక్రీతుని కోరికతీర్చినాడు.

దీనికి యవక్రీతుడు మిక్కిలిసంతోషించినాడు. వెంటనేఅతడు తనతండ్రిభరద్వాజునికి తన వరలాభంగురించి తెలియచేసినాడు. భరద్వాజుడు ఈ విషయంవిని కొడుకుగర్వాన్నిసహించలేక పోయినాడు. కొడుకు గర్వాన్ని తగ్గించకపోతే 'చెడిపోతాడ'ని భావించినాడు. అందుకని అతనితో ఇట్లా చెప్పినాడు. "కుమారా! పూర్వం 'బాలధి'అనే మునిశ్రేష్ఠుడుండేవాడు. అతని పుత్రుడు మరణించినాడు. ఆ పుత్రశోకాన్ని భరించలేక పోయినాడు. భయంకరమైన తపస్సు చేసినాడు. దేవతలను మెప్పించినాడు. చిరంజీవి అయిన ఇంకొక పుత్రుణ్ణి పొందినాడు. ఆ పుత్రుడి పేరు మేధావి. ఆ మేధావి తాను 'చిరంజీవి'ని అనే గర్వంతో మునిశ్రేష్ఠులనుకూడా లెక్కచేయకుండా విచ్చలవిడిగా తిరిగేవాడు. ఒకనాడు ధనుషాక్షుడు అనే తపస్విని లెక్కపెట్టకుండా పొగరుగామాట్లాడినాడు. ఆ తపస్వి కోపగించుకొన్నాడు ఆ మేధావిని యమలోకానికి పంపినాడు. చూచినావా? ఎంతటివారికైనా గర్వముమంచిదికాదు. కాబట్టి నీవుకూడా గర్వంవదిలిపెట్టు . రైభ్యుడు మిక్కిలికోపధారి. నీవు ఆయనఆశ్రమంవైపు పోనుకూడాపోవద్దు. రైభ్యుని కొడుకులు పరమశాంతులు. వారిపై అసూయ లేకుండాఉండు."

ఇందుకు యవక్రీతుడు "అట్లేచేస్తాను. నాకు రైభ్యుడుకూడా నీతోసమానుడే." అన్నాడు. ఆ తరువాత తన విద్యావైభవాన్ని మునిసభలలో చూపిస్తూ ఉండినాడు. అట్లాఉండి ఒకనాడు తండ్రిపోవద్దన్న రైభ్యుని ఆశ్రమానికేపోయినాడు.

ఆ ఆశ్రమం చిలుకలు, కోయిలలు, తుమ్మెదల సుకుమారమైన శబ్దాలతో మనోహరంగా ఉంది. ఆమనిపూలతో నిండిన చెట్లగుంపులతో కూడిన పూదోటలున్నాయి. అక్కడ రైభ్యుడికోడలు పరావసుడిభార్యఅయిన 'కృష్ణ' అనేపేరుగల సుందరిఉండింది. ఆమె పద్మాలవంటి కన్నులుకలిగి ఉంది.

ఆ ఆశ్రమానికి పోయిన యవక్రీతుడు ఆ కృష్ణను అనురాగంతో చూచినాడు. మదనతప్తుడైనాడు ఆమెకు తనఅభిప్రాయం చెప్పినాడు. ఆమె యవక్రీతుని మాటలువిని 'శాపమిస్తాడేమో?'న'నే భయంతో అప్పటికి ఒప్పుకున్నట్లుగా మాట్లాడింది. వేగంగాపోయి మామకు ఈ విషయమంతా చెప్పింది. కన్నులలో నీరు స్రవిస్తుండగా కోపంతో తలవంచి, మామదగ్గర నిలబడింది.

రైభ్యుడు యవక్రీతునిపై కోపగించుకొన్నాడు. తన 'కోపమ'నే అగ్నిజ్వాలతో సమానమైన ఒక జడను తనజుట్టునుండిలాగి అగ్నిహోత్రంలో వేల్చినాడు. అప్పుడు అగ్నిగుండంనుండి తన కోడలికంటే చాలా సౌందర్యలావణ్యంకలిగిన సుందరాంగి ఒకటిపుట్టింది. ఇంకొకజడను తీసుకొని వేల్చినాడు. అప్పుడు వంకరకోరలతో భయంకరమైన ఒక రాక్షసుడు పుట్టినాడు. ఆ ఇద్దరు చేతులు జోడించి "మాకు పని ఏమి?" అని అడిగినారు. రైభ్యుడు, "అవినీతిపరుడైన యవక్రీతుణ్ణి చంపండి" అని ఆజ్ఞాపించినాడు.

ఆ స్త్రీ ముందుగాపోయి మదనఉద్వేగంతో వికారమైన మనస్సుతోఉన్న యవక్రీతునిదగ్గరకు చేరి ప్రేమకలిగేట్లుచేసి, అతని చేతిలోని కమండలాన్ని విలాసంగా తీసుకొన్నది. అట్లా కమండలం లేక పోవడంవల్ల యవక్రీతుడు అపవిత్రుడయినాడు. అతని గొప్పతపశ్శక్తి నశించింది. అప్పుడు రాక్షసుడు వేగంగా యవక్రీతుణ్ణి ఎదుర్కొన్నాడు. ఆ రాక్షసుణ్ణి చూచి భయపడి, యవక్రీతుడు పరుగెత్తినాడు. దాక్కోవడానికి మహానదులలోనూ కొలంకులలోనూ దూరినాడు. కాని అవన్నీ ఎండిపోయినాయి. ఇక 'లాభంలేద'ని తన తండ్రియైన భరద్వాజుడి అగ్నిహోత్రశాలలో ప్రవేశించపోయినాడు. అతడు ఆ అగ్నిహోత్రశాల ప్రవేశించకమునుపే ఆ రాక్షసుడు యవక్రీతుణ్ణివెంటాడి వాడియైనఈటెపోటుతో క్రూరంగా చంపినాడు. ఆ తరువాత ఆ సుందరీ, ఆ రాక్షసుడూ రైభ్యుడి దగ్గరకు పోయినారు. రైభ్యుడు కూడా వానికి భార్యగా ఆసుందరి కృత్తినిఇచ్చినాడు.

అప్పుడు భరద్వాజుడు అడవినుండి ఆశ్రమానికి తిరిగివచ్చినాడు. ఎప్పుడొచ్చినా లేచిస్వాగతం పలికేఅగ్నులు, ఆనాడు అణిగిపోయి నివురుగప్పిఉన్నాయి. భరద్వాజుడికి ఆశ్చర్యంకలిగింది. గృహ పాలకుడైన శూద్రునివల్ల విషయమంతా తెలుసుకున్నాడు. చనిపోయినకుమారుణ్ణి చూచినాడు. దుఃఖించినాడు. "రైభ్యుడు మిక్కిలి 'కోపకాడ'ని ముందేచెప్పినాను. ఆ ఆశ్రమం వైపు'పోవద్ద'నీ హెచ్చరించినాను. నీవు నా మాటలు వినలేదు. గర్వం కలవాడికి మంచిబుద్ధి కలుగుతుందా? " అని ఏడుస్తూ భరద్వాజుడు పుత్రునిశవానికి అగ్ని సంస్కారము చేసినాడు. 'పుత్రశోకమ'నే అగ్నికి తాళలేక తానుకూడా ఆ చితిలోనేపడి మరణించినాడు.

ఆ తరువాత కొంతకాలానికి 'బృహద్ద్యుమ్నుడు' అనేరాజు 'సత్రయాగం చేయాల'నుకొన్నాడు. రైభ్యుని కొడుకులైన అర్థావసు, పరావసులను ఋత్విజులుగా ఎన్నుకొన్నాడు. ఆ ఇద్దరూకూడా తండ్రి అనుమతిపొంది,

అ బృహద్యుమ్నుడియజ్ఞం జరుపుతూఉండినారు. అట్లాయజ్ఞం జరుగుతూ ఉన్నకాలంలోఒకరోజు పరావసుడు యజ్ఞశాలనుండి తనఆశ్రమానికివస్తూఉండినాడు. అప్పుడు సమయం తెల్లవారుజాము. ఆ చీకటిలో అడవిలో ఒంటరిగా తనకెదురుగా తనతండ్రి రైభ్యుడు వస్తూ ఉండినాడు. 'తండ్రి' అని తెలియక 'ఏదో ఒక జంతువు తనను చంపడానికి వస్తున్నదేమో?' ననుకున్నాడు. 'తన ప్రాణాన్ని రక్షించుకోవడాని'కని, 'జంతువ'నుకొని, తండ్రిని చంపినాడు. ఆ తరువాత చూచి 'తండ్రి'యని తెలుసుకొన్నాడు. మిక్కిలి దుఃఖించినాడు. తండ్రి శవానికి దహనకర్మలు చేసినాడు. అక్కడనుండి తిరిగి బృహద్యుమ్నుడి సత్రయాగం జరిగేచోటుకు వచ్చినాడు. తానుతండ్రినివధించినవిషయం అన్నకు చెప్పినాడు. ఆ తరువాత ఇంకాఇట్లాఅన్నాడు.

"అన్నా ! ఈ యాగాన్ని నీవొక్కడవే నిర్వహించలేవు. నేనొక్కడనే అయినా దీనిని నిర్వహించగలను. కాబట్టి నీవు నా కొరకు బ్రహ్మహత్యా పాపాన్ని పోగొట్టే వ్రతాన్నిచేయి. నే నీ సత్రయాగాన్ని పూర్తిచేస్తాను." ఈ మాటలకు అర్థావసువు, "అట్లేచేస్తాను." అని చెప్పి, బ్రహ్మహత్య పాపాన్ని పోగొట్టేవ్రతాలు చేస్తూ ఉండినాడు. పరావసుడొకడే సత్రయాగం జరుపుతూఉండినాడు.

కొంతకాలానికి అర్థావసువు బ్రహ్మహత్య ప్రాయశ్చిత్త వ్రతాలు పూర్తిచేసి, సత్రయాగశాలకు తిరిగి వచ్చినాడు. ఆ అర్థావసువును చూచి పరావసువు బృహద్యుమ్నునితో ఇట్లాఅన్నాడు. "ఓరాజా! ఈ అర్థావసువు నీ యజ్ఞశాల ప్రవేశించకూడదు. ఇతడు శుభకార్యాలనువిడిచిపెట్టినాడు. బ్రహ్మహత్యా పాతకాలను తొలగించే తీవ్రమైనవ్రతాలు చేస్తున్నాడు."

ఈ మాటలువిని, బృహద్యుమ్న మహారాజు ఆజ్ఞాపించగా రాజు అనుచరులు ఆయనను యజ్ఞశాలలోనికి రానీయలేదు. అప్పుడు అర్థావసువు ఇట్లాఅన్నాడు. "బ్రహ్మహత్య చేసింది పరావసుడే కాని నేనుకాదు. అతని పాపాలు తొలగడానికే నేను ఆ వ్రతాలు చేసినాను. అతన్ని పాపాలనుండి విముక్తుణ్ణి చేసినాను".

అర్థావసువు చెప్పిన సత్యానికి అగ్ని మొదలైన దేవతలు మెచ్చుకొన్నారు. ఆ దేవతలు ఇట్లాఅన్నారు. "నీ తమ్ముడుచేసిన పాపాలను తొలగించడానికిపూని ధర్మాత్ముడవై నీవు వ్రతాలుచేసినావు. మాకు మెప్పుకలిగింది. నీకు మిక్కిలి ఇష్టాలైన వరాలు కోరుకో ఇస్తాం. మాకు కలిగిన మెప్పుఊరకే పోతుందా?"

అప్పుడు అర్థావసువు తనతండ్రీ, భరద్వాజుడూ, యవక్రీతుడూ, ఎప్పటిలాగా 'బ్రతికి ఉండాల'నీ తనతండ్రి పరావసువుచేత చంపబడిన దోషం పరావసువుకు 'లేకుండా పోవాల'నీ ప్రార్థించినాడు. దేవతలు దయతలచి రైభ్యుణ్ణీ, భరద్వాజుణ్ణీ, యవక్రీతుణ్ణీ, తిరిగి బ్రతికించినారు. పరావసువుకు బ్రహ్మహత్యాపాతకం లేకుండా అనుగ్రహించినారు.

అప్పుడా దేవతలతో యవక్రీతుడిట్లా అన్నాడు. "నేను అన్నివేదాలూ శాస్త్రాలూ తెలిసినవాడను. అన్ని వ్రతాలను చేసినవాడను. రైభ్యునిచేత ఇట్లాచంపబడినాను. నాకంటె రైభ్యునికి ఎక్కువ శక్తి ఎట్లా కలిగింది?"

అందుకు దేవతలిట్లాఅన్నారు. "గురువుకు పరిచర్యచేస్తూ, ఎక్కువ ప్రయాసనుఓర్చుకొని అభ్యసించిన విద్యలు శోభిస్తాయి కానీ, గురువు ముఖంనుండి వినకుండా పొందినవిద్యలు శోభిస్తాయా? నీవు గురువుముఖంనుండి పొందకుండా వేరువిధంగా విద్యలను పొందడంవల్ల, అవి శక్తిలేని వైనాయి. గురువు సంతోషించేట్లు, రైభ్యుడు వేదాలూ శాస్త్రాలూ ఆర్జించడంచేత, అతడికి అటువంటి మహిమ ఏర్పడింది" అనిచెప్పి అంతర్ధానమైనారు.

**నీతి :** గురుశుశ్రూష అతిపవిత్రమైనది. గర్వము పనికిరాదు. మోసము మంచిదికాదు.

**సీ.** **బాలధియను ముని ప్రవరుండు పుత్రశోకాపన్ను ండై ఘోరమగుతపంబుఁ**
**జేసి, వేల్పుల దయఁజిరజీవిగా ఁబుత్రుఁబడసె మేధావినా ఁబరఁగు వాని;**
**వాఁడు నాయుష్యగర్వంబున మునీంద్రుల నెవ్వరి మెచ్చక యేఁగి, యొక్క**
**ధనుషాక్షుఁడను తపోధనునొద్ద గర్వించి పలికిన, నలిగి తపస్వివాని**

**ఆ.** **నంతకాంతికమున కరుగంగ ఁజేసె; గర్వంబు చెట్ట;యెట్టి వారినైనఁ**
**గ్రాఁచుఁతత్క్షణంబు గర్వంబు; గర్వంబు నొడిచియున్నవాఁడయుత్తముండు.** **3-260**

## 22. సౌగంధిక పుష్పాపహరణం.

**(అరణ్య 3-302 నుండి 377 వరకు.)**

**(పాండవులు అరణ్యవాసంచేస్తూ ఉండి తీర్థయాత్రలు చేస్తూ హిమాలయాలలో తిరుగుతున్నప్పుడు జరిగినకథ.)**

పాండవులు రోమశమహర్షితో పాటుగా తీర్థయాత్రలు చేసినారు. ఆ వరుసలో హిమాలయాలకు చేరినారు. ఆ కొండలలో నడువలేక ద్రౌపది మూర్ఛిల్లింది. ఆమెను పాండవులందరూ మూర్ఛనుండి తేరుకొనేట్లు చేసినారు. అప్పుడు ధర్మరాజు భీముడితో "భీమా! ఈ రాజకుమారి ద్రౌపదిని తోడుకొని భయంకరమైన శిలలతోనిండి నడవడానికి వీలుకాని ఈ దారుల్లో పోలేము, ఈమె నడవలేదు, ఎట్లాగా?" అన్నాడు.

అప్పుడు భీముడు ఘటోత్కచుణ్ణి పిలిపించి సహాయం తీసుకుందామనుకొన్నాడు. అన్నకీ విషయం చెప్పినాడు. ఆయన అనుమతించినాడు. భీముడు వేగంగా తనపెద్దకొడుకు ఘటోత్కచుణ్ణి తలచుకొన్నాడు. నిజానికి ఘటోత్కచుడు భీముడికే కాదు పాండవులందరికీ పెద్దకొడుకే. వాడు వీరులెల్లరలోనూ గొప్పవాడు. మిక్కిలిభయంకరమైన రాక్షసులతోకూడినవాడు. నక్షత్రమార్గంలో సంచరించగలిగిన గొప్పధీరుడు. తండ్రి తన్నుతలవగానే ఘటోత్కచుడు రాక్షససేనతోకలిసి తక్షణమే ప్రత్యక్షమయినాడు. దేవతాశ్రేష్ఠులతో సమానులైనతండ్రులకు బ్రాహ్మణులకు మిక్కిలి భక్తితో నమస్కరించినాడు.

ఇట్లామ్రొక్కి "పని ఏమిటి?" అంటూ చేతులుజోడించి, భీమునిముందర నిలబడినాడు. భీముడు కొడుకును కౌగిలించుకొన్నాడు. "కుమారా! నీతల్లిఅయిన ఈమె బలంలేకుండాఉంది. రోజూ ప్రయాణంచేసి అలసిపోయిఉంది. ఈమె నెత్తుకొని మాతోపాటురా" అని కొడుకును ఆదేశించినాడు.

ఘటోత్కచుడు తండ్రి మాటలు విని "ఈ దారి చాలకఠినమైన రాళ్ళతోకూడి మిట్టపల్లాలుగా ఉంది. పాదచారులకు నడవడానికి సాధ్యంకాదు. కాబట్టి మిమ్మల్నందరనూ ఎత్తుకొని శ్రమలేకుండాపోతాను." అనిచెప్పి, తాను ధౌమ్యుణ్ణీ, పాండవులనూ, ద్రౌపదినీ ఎత్తుకున్నాడు. మిగిలిన బ్రాహ్మణులను 'ఎత్తుకొమ్మ'ని తనపరివారాన్ని ఆజ్ఞాపించినాడు. రోమశమహర్షిమాత్రం సిద్ధులుపోయేవిధంగా ఆకాశంలోనే పోయినాడు. ఇట్లా అందరూ ఆకాశమార్గంలోపోయి గంగాతీరంలో బదరీవనాన్నిచూచి, రాక్షసులమూపుల నుండి క్రిందకుదిగినారు.

అక్కడ మనోహరాలైన తేనెలూరేపళ్ళూ, మెత్తనిఆకులూ, గుండ్రటిబోదెలూ, కదలకుండాఉండే నీడలూ, కలిగిన రేగుచెట్లనుచూచి మిక్కిలి ఆశ్చర్యపడినారు. దేవతలూ సిద్ధులూ మునులూ సేవించే భాగీరథీనదిని కూడాచూచినారు. అందులో అందరూ స్నానాలు చేసినారు. నియమంతో వ్రతాలు చేసినారు. సమాధియోగంచేత దూరంనుండే 'మైనాకపర్వతం, హిరణ్యశృంగం, బిందుసరం' అనే పుణ్యక్షేత్రాలను చూచినారు ఆ బదరీవనంలో ఆరుదినాలుండినారు.

ఆ ఆరుదినాలలో ఒకనాడు గొప్పవాడైన భీముడు ద్రౌపదితోపాటుగా గంధమాదన పర్వతపు సానువులలోని రత్నాలఅరుగులమీద విహరిస్తూఉండినాడు. అప్పుడు మిక్కిలి మనోహరమైన వేయి రేకులుకల తామరపువ్వొకటి గాలికి కొట్టుకొనివచ్చి నేలమీద పడింది. ద్రౌపది ఆ సుగంధంతో కూడిన తామరపూవును చూచింది. అంతఅందమైనపువ్వును ఆమె ఇదివరకెప్పుడు చూచిఉండలేదు. మరి ఏ ఇతరపువ్వులలోనూలేని దానిసుగంధానికి ఆమె ఆకర్షించబడింది. ఆమె ఆనందంతో, "అయ్యో! ఇది ఒకపువ్వే అయినా ఇంతకు ముందెప్పుడూలేని ఆనందాన్ని మనసుకూ కళ్ళకూ కలిగిస్తూఉంది. ఇట్లాంటిపూలు ఇంకా కావలెకదా?" అనుకొన్నది. "దగ్గరలో ఉంటే తెచ్చి నా మనసుకు సంతోషం కలిగించు" అని భీమసేనునితో అన్నది. వెంటనే ఆ పువ్వును తీసుకొని ధర్మరాజుదగ్గరకుపోయింది.

ఇక్కడ భీముడు ద్రౌపది కోరికతీర్చదలచుకొన్నాడు. బంగారుతొడుగుగల వింటినీ, విషసర్పాలతో సమానమైన బాణాలను తీసుకున్నాడు. ఆ తామరపూవును తెచ్చినగాలి కెదురుగా బయలుదేరినాడు. దారిలో గంధమాదనపర్వతంపైన రకరకాలైన రత్నాలతోకూడిన గుహలను చూచినాడు. అరటిచెట్లు కూడా చాలాకనిపించినాయి. మందారపుచెట్లనుండి సుగంధాలను మోసుకొనివచ్చే చిరుగాలి ఒంటికి సోకింది. తుమ్మెదల కోకిలల శబ్దాలు చెవులకానందాన్ని కలిగించినాయి. సర్వఋతువులలోని పూలవాసనలను పీల్చినాడు. మిక్కిలితియ్యనిపండ్లను ఆరగించినాడు. వీటన్నిటితో తనహృదయం ఆనందంతో నిండిపోయింది.

తనకెదురుగావచ్చే జంతువులను ఎదుర్కొని ఒక ఏనుగునుఎత్తి ఇంకొక ఏనుగుపైవేసినాడు. ఒక సింహాన్నెత్తి ఇంకొక సింహంమీదవేసినాడు. చిన్న జంతువులను అరచేతితో చరచినాడు. ఆ భీముడు నడచే వేగానికి చెట్లూ తీగలూ కదలిపోయినాయి. ఇట్లా విజృంభణతో పోతూఉన్న భీముణ్ణి ఖేచరులు సిద్ధ, సుర, భుజగ, గరుడ, గంధర్వ, కిన్నర కాంతలు కొండగుహల్లో కనబడకుండా దాక్కొని చూస్తూ ఉండినారు.

భీముడు మానులను విరగకొడుతున్నాడు. పరాక్రమంతో తీగలు పెరుకుతున్నాడు. కాళ్ళ దెబ్బకు పెద్దకొండలు కదులుతున్నాయి. ఎత్తుగాఉన్నచోట్లకు ఎక్కుతున్నాడు. ఆ విధంగా భీముడు వాయు దేవునిలాగా గరుత్మంతుడిలాగా వేగంగాపోయి గంధమాదనపర్వతం మధ్యభాగంలోనికిచేరినాడు. ఇట్లా పోతూపోతూ గట్టిగా సింహనాదంచేసినాడు. ఆ సింహనాదశబ్దానికి భయపడి పక్షులుఎగిరి పోతూవున్నాయి. ఆ ఎగిరే పక్షుల రెక్కలు తడిగా ఉండడం, భీముడు గమనించినాడు. ముందు దగ్గరలోనే కొలను ఉండవచ్చు'. అనుకొన్నాడు.

అతి వేగంగా ముందుకుపోయినాడు. సరోవరాన్ని చూచినాడు. ఆ సరోవరపుటొడ్డులలో రకరకాలైన అడవి చెట్లున్నాయి. ఆ చెట్లన్నీ గాలికి కదులుతూ ఉన్నాయి. ఆ చెట్లన్నీ అట్లాకదిలేట్లు గాలి వీచడంవల్ల ఆ సరోవరంలో నీరెప్పుడూ చల్లగాఉంటుంది.

ఆ సరోవరంలోని చల్లనినీటిలో భీముడు స్నానంచేసినాడు. ఆ సరోవరంలో అప్పుడేవికసించిన తామరపూలనూ, తామరతూళ్ళనూ, గుండ్రనిహారాలుగా చేసుకొని అలంకరించుకొన్నాడు. అక్కడనుండి బయటకువచ్చినాడు. ఎన్నోయోజనాలపొడవున్న అందమైన అరటితోటలోనికి ప్రవేశించినాడు.

ఆ అరటితోటలో తనశంఖాన్నిపూరించినాడు. ఆ శంఖారావం, మహేంద్రుని పిడుగుధ్వని లాగా భయంకరమై, దిక్కులూ ఆకాశమూ నిండిపోయింది. అప్పుడా శబ్దంవిని అక్కడి గుహలోఉండిన 'హనుమంతుడు' అనే వానరుడుఉలిక్కిపడినాడు. వేగంగా తేరుకొన్నాడు. "ఇది చాలాగొప్పశబ్దం. నా మనస్సుకు సంతోషం కలిగిస్తూఉంది. ఇది నాతమ్ముని శంఖపుశబ్దమే అయిఉంటుంది." అనుకొన్నాడు. సంతోషంతో హనుమంతునిదేహం పులకించింది. వెంటనే హనుమంతుడు భీమునిమార్గానికడ్డంగా పెద్దచెట్లను ఉరలత్రోచినాడు. చిన్నకాలిదారిమాత్రము ఉండేట్లుచేసినాడు. ఆ కాలిబాటకు అడ్డంగా పండుకొన్నాడు. అట్లాపండుకొని తనతోకను విలాసంగా అటూఇటూ కదిలిస్తూ ఉండినాడు. హనుమంతుడు తనతోకను కదలించేశబ్దం భయంకరమై ఆ ప్రదేశమంతా ప్రతిధ్వనించింది. కొండగుహలమధ్య భాగాలు కదలిపోయినాయి. సమస్తజంతువులు భయపడిపోయినాయి. ఎప్పుడూ విననిశబ్దం విని భీముడుకూడా ఆశ్చర్యపడినాడు.

అట్లాగే ముందుకుపోయి, భీముడు అరటిచెట్లమధ్య విశాలమైన రాతిపైన పండుకొనిఉన్న హనుమంతుణ్ణి చూచినాడు. ఆ హనుమంతునికి మెడ తక్కువపొడవుతో బాగాలావుగాఉంది. కదలకుండా ఉండే పొడవైన దవడఉంది. నిలకడలేని స్వభావంతో ముచ్చటగాఉన్నాడు. సన్నటి నడుముతోకూడిన గుండ్రని మొలకలిగిఉన్నాడు. అగ్నికణాలలాగా ఎర్రగాఉండే పెదవులున్నాయి. దంతాలూ గోళ్ళు చాలా సన్నంగాఉన్నాయి. మెరుపుతీగలవంటి గోరోజనపురంగుగలకన్నులున్నాయి. ఎత్తయిన బలమైన రొమ్ముఉంది. మోకాళ్ళదాకాసాగిన చేతులున్నాయి. ఎత్తుగాపైకినిలబడినతోక, ఎత్తైనజెండలాగా ప్రకాశిస్తూఉంది. ఆయన తదేకధ్యానంగా యోగనిద్రలో ఉన్నాడు. ఆ హనుమంతుడు ధర్మంచేత స్వచ్ఛమైనవాడు.

అట్లాంటి హనుమంతుని 'నిద్ర చెడగొట్టాల'నుకొని పూనుకొని దగ్గరకుపోయి భీముడు సింహనాదం చేసినాడు. ఆ సింహనాదంవిని హనుమంతుడు మెల్లమెల్లగా మేలుకొన్నాడు. ఆవులించినాడు. ఆ భీముడిని నిర్లక్ష్యంగాచూచి ఇట్లాఅన్నాడు.

"అయ్యా! మిక్కిలి ముసలితనంతోనూ, జబ్బులతోనూ అలిసిపోయి, చిక్కిపోయి, ఒదిగి సుఖంగా నిద్రపోతూ ఉండినాను. అట్లాఉండేనన్నుమిక్కిలిగర్వంతో కొంచెంకూడా దయలేకుండా తెలిసితెలిసీ ఎందుకు మేలుకొలిపినావు? పశుపక్ష్యాదులకు ధర్మాలుతెలియవు. కానీ మనుష్యులు అన్నిజీవులందూ దయతోకూడిన ధర్మంతెలిసినవారు కదా? ఇట్లాంటి మనుష్య జన్మపొందికూడా ఇట్లాఎందుకు చేసినావు? నీవు పెద్దలసేవచేసి

ఉండలేదాఏమి? ధర్మం తెలుసుకోకుండా, దయలేకుండా, మాబోటి అల్ప జంతువులకు భయంకలిగేట్లుగా గర్జించినావు. సిద్ధులు పోయేట్లు ఆకాశంలో పోలేనివారికి ఇక్కడ సంచరించడం సాధ్యంకాదు. అమృతంతో సమానమైన ఈ పండ్లను తిని, వెనుతిరిగిపో. నీ మీద ఎక్కువ ప్రేమకలగడంచేత ఇట్లాబుద్ధిచెప్పినాను. నామాటవిను."

ఈ మాటలు విని భీముడిట్లా అన్నాడు. "కోతులరేడా! నేను శ్రేష్ఠమైన క్షత్రియుణ్ణి. బలం కలవాడనుగా ప్రసిద్ధి పొందినవాడను. పాండురాజు కుమరుణ్ణి. వాయుదేవుడివరంవల్ల కుంతి కడుపున జన్మించినవాడను. అందరూ నన్ను 'భీముడు' అంటారు. నేనొకపని మీదపోతున్నాను. నాకు దారివ్వు. అట్లాదారి ఇవ్వకపోతే, పూర్వం నూరుయోజనాలవెడల్పైన సముద్రాన్నిదుమికి లంకకుపోయిన హనుమంతుని మాదిరిగా, నిన్నూ ఈ పర్వతాన్నీకూడా దుమికిదాటిపోతాను". భీముని ఈ మాటలువిని హనుమంతుడిట్లా అన్నాడు. "ఆ హనుమంతుడు ఎందుకు సముద్రాన్నిదుమికిదాటినాడు? తెలిస్తే చెప్పు."

అందుకు భీముడిట్లా సమాధానం చెప్పినాడు. " కపీంద్రా! ఇక్ష్వాకు మహావంశంలో పుట్టిన 'రాముడ'నే గొప్ప వీరుడు ఉండేవాడు. ఆయన తనతండ్రి మాటనిలపడానికి అడవికిపోయినాడు. ఆ అడవిలో ఆ రాముడు లంకేశ్వరుడివల్ల భార్యనుపోగోట్టుకొన్నాడు. అయనభార్యను వెదకడానికి కోతులనాయకులు పోయినారు. దక్షిణ సముద్రతీరంలో 'సంపాతి'అనేపక్షి వారికికనిపించింది. ఆ సంపాతి వారికి, సీత సముద్రం అవతల లంకలో రావణుడి చెరలో ఉన్నట్లు చెప్పినాడు. సముద్రాన్ని దాటడానికి ఎవరూ ముందుకురాలేదు. 'హనుమంతుడు తనతండ్రి వాయుదేవుని శక్తితో మహావీరుడై సముద్రాన్ని దుమికిదాటినాడు,' అనివిన్నాను. నేనుకూడా హనుమంతునంతటి బలపరాక్రమములుకలవాడను. నాపౌరుషంచూపమంటావా?"

హనుమంతుడా మాటలు విని, చిరునవ్వును ముఖంలో కనబడకుండా దాచుకొని, "అన్నా! నేను ముసలివాడను. లేవలేకుండా ఉన్నాను. నీవు పోదలచుకొంటే నాతోకను అవతలకు త్రోసి, పో." అన్నాడు.

ఆ మాటలు లెక్కచెయ్యకుండా భీముడు ఆ తోకను ఎడమచేతితో త్రోయడానికి ప్రయత్నం చేసినాడు. శక్యంకాలేదు. పరాక్రమంతో రెండుచేతులతో బాగాపట్టుకొనికూడా ఎత్తలేకపోయినాడు. వెల్లకిలపడినాడు. వెలువడిన చెమటతో శరీరమంతా తడిసిపోయింది. అల్పమానవుడిలాగా తనగర్వాన్ని వదలివేసినాడు. చింతతో పెద్దగా సిగ్గుపడి, తలవంచుకున్నాడు. ఇట్లా ఆ కపివరుని తోకను కదలించలేని భీముడు ఆ కోతికి నమస్కరించినాడు. అయనతో ఇట్లా అన్నాడు.

"నీవెవరో తెలుసుకోలేక నేనుమాట్లాడిన పొగరుమాటలను సహించవలె. నీవు కోతిరూపం ధరించినసిద్ధుడవో? గంధర్వుడవో? దేవతాశ్రేష్ఠుడవో? చెప్పు".

ఈ మాటలువిని, హనుమంతుడు భీముణ్ణిచూచి నవ్వుతూ, "నేను కేసరిభార్య అంజనా దేవికీ, పూజ్యుడైన వాయుదేవుడికీ పుట్టినవాడను. నీవు చెప్పిన హనుమంతుణ్ణి నేనే. నీవు నా తమ్ముడవు. పూర్వము రఘుకులేశ్వరుడైన రామదేవుడు, రావణుడిచేత భార్యను పోగొట్టుకున్నాడు. సుగ్రీవుడు మొదలైన వానరులను లెక్కలేనంత మందిని సహాయులుగా చేసుకొన్నాడు. సేతువును కట్టి సముద్రాన్ని దాటినాడు. యుద్ధంచేసి రావణుణ్ణి చంపినాడు. ఆ సమయంలో ఆయనకు నేను చేసినసేవకు మెచ్చుకున్నాడు. "నరులచేత దేవతల చేతపొగడబడుతూ నాకీర్తి ఎంతకాలం భూమిమీదనిలుస్తుందో, అంతకాలం నీవు నిత్యుడవైఉండు" అని దయతో నాకు వరాన్నిచ్చినాడు. ఆ తరువాత అయన భూమినంతా పదకొండు వేలఏండ్లు ఏలి, తాను స్వర్గానికి పోయినాడు." అన్నాడు.

ఆ మాటలువిని భీముడాకపిని 'హనుమంతుడ'ని తెలుసుకొని, సంతోషించినాడు. తిరిగి నమస్కరించినాడు. "నీ దర్శనం చేత ధన్యుడనయినాను" అనిచెప్పి, "ఆంజనేయా! నీకు దయకలిగితే 'పూర్వం నీవు సముద్రాన్నిదాటిపోయిననాటి రూపం చూడాల'నుకుంటున్నాను. నాకుచూపించు." అన్నాడు. అందుకు హనుమంతుడు భీముడితో ఇట్లాఅన్నాడు.

"ఆ కాలపురూపం ఈ కాలంలోచూపడం ఎట్లాసాధ్యం? కాలమొకవిధంగా ఉండకుండా పలురకాలమార్పుచెందుతూ ఉంటుంది." అని చెప్పి ఇంకా కృత, త్రేతా, ద్వాపర, కలియుగాలలోని పరిమాణాలూ వేరువేరు చరాచర భూతాలూ మొదలైన విషయాలన్నింటినీ భీము దదుగగా వివరించినాడు. ఆ తరువాత హనుమంతుడు భీముడితో నీకోరిక తీరుతుంది. పొమ్మ'న్నాడు.

అప్పుడు భీముడు హనుమంతునితో, "నీ ఆనాటి శరీరాన్ని చూచికానీపోను. కాబట్టి కపినాథా! నాకుచూపు" అని మొండికేసినాడు. హనుమంతుడు అట్లామొండికేసిన తమ్మునిపైదయతో తన ఆ కాలపురూపు చూపినాడు. 'సాటిలేని మేటిరెండవమేరుపర్వతమా?' అనిపించేటట్లు తనశరీరాన్ని పెద్దగా పెంచినాడు. తనతోక దిశలకొసలుతాకుతూఉంది. అట్లాఉన్న హనుమంతుణ్ణిచూచి భీముడుచూడలేక కళ్ళుమూసుకున్నాడు. మనసులో మిక్కిలి ఆశ్చర్యపడినాడు. భయంతో హనుమంతునితో ఇట్లాఅన్నాడు. "ఓహో! మిక్కిలి భయంకరంగాఉంది. మిక్కిలి అద్భుతంగాకూడా ఉంది. చాలు. భూమి ఆకాశాలమధ్యనంతా నీ దేహ మాక్రమించింది. ఈ నీరూపాన్ని విరమించు."

అప్పుడు హనుమంతుడు తానుఎప్పుడూఉండేఆకారాన్ని తిరిగిపొందినాడు. "శత్రువులను చూస్తే నా రూపం ఇంతకురెండింతలవుతుంది. ఆ ఆకారానికి పోలిక చెప్పడానికే వీలుకాదు" అన్న హనుమంతుడితో భీముడు, "నీవు గొప్పవాడవు. నీవు పూనుకొనిఉంటే బలవంతుడైన రావణుడిని సులభంగా చంపిఉండేవాడవు. అట్టి గొప్పపరాక్రమంకలిగిన నిన్నుసహాయుడుగాపొంది, రాముడు రాక్షసులను చంపడం ఏ మంతపెద్దవింత?" అన్నాడు.

ఆ మాటలు విని, హనుమంతుడు భీముడిపై మిక్కిలి అభిమానంతో "అయ్యా! నీవు సౌగంధిక సరోవరానికిపోతే అక్కడ సాహసంచేయవద్దు" అని చెప్పి ఇంకాచాలబుద్ధులుచెప్పినాడు. ఆ తరువాత ఇట్లాఅన్నాడు. "నిన్ను చూడడంచేత నా కన్నులు ధన్యమైనాయి. నీ కేది ఇష్టమో చెప్పు. దానిని చేస్తాను. **భీమా!** మీకు కీడుచేసిన బుద్ధిలేని గ్రుడ్డిరాజుకుమారులైన కౌరవులను ఒక్క క్షణంలో చంపుతాను. **హస్తినాపురాన్ని** రాళ్ళూ రప్పలతోకప్పి, అడవిగా మారుస్తాను. నీకు సంతోషం కలిగిస్తాను".

ఇందుకు భీముడిట్లాఅన్నాడు. "కపినాథా! ఇదంతా నీకేమంత పెద్దవిషయం? గొప్ప యుద్ధంలో గర్వించిన శత్రుశూరులను నేను జయింపగలను. నీ దయవల్ల ఈ భూలోకంలో ఈనాడు మేముజయించ లేని గొప్పవారెవరూ లేరు".

అప్పుడు హనుమంతుడు భీమునితో, "యుద్ధంలో నన్ను స్మరించు. నీ మీద నెయ్యంతో నేను మహావీరుడైన అర్జునుని రథంపైఉండేజెండాలోఉండి, మీబలపరాక్రమాలు చూస్తాను." అని చెప్పి, భీముణ్ణి కౌగిలించుకొన్నాడు. సౌగంధిక సరోవరానికి దారిచూపినాడు. ఆ తరువాత అంతర్ధానమైనాడు. భీముడు హనుమంతుని కౌగిలివల్ల శ్రమంతాపోయి బలంకలిగినవాడయినాడు. ఆనందంగా హనుమ చూపినదారిలో ముందుకు కదలినాడు.

దారిలో వెండికొండకు చేరువలోఉన్న సొగసైనప్రదేశాలను చూచినాడు. కొండశిఖరాలను ఆశ్చర్యంతో గమనించినాడు. ఆ కొండల ఎత్తైనశిఖరాలపై మేఘాలు తిరుగుతున్నాయి. ఏనుగులు కూడా తిరుగుతున్నాయి. మేఘాలనుండి మెరుపుతీగలు కనిపిస్తున్నాయి ఏనుగులనుండి వాటిదంతాలు మెరుస్తున్నాయి. మేఘాలనుండి పిడుగులశబ్దాలు వినిపిస్తున్నాయి. ఏనుగులనుండి ఘీంకారశబ్దాలు వినిపిస్తున్నాయి. అందుచేత ఏవి మేఘాలో, ఏవి ఏనుగులో, గుర్తించలేనట్లుగా అవి కలిసిపోయి ఉన్నాయి. అట్లా ఆ కొండలనూ మేఘాలను ఏనుగులను చూస్తూపోయి, మహాపరాక్రమవంతుడైన భీముడు ఆ కుబేరుని ఉద్యానవనంలోని సౌగంధికకమలాలుఉండేసరోవరాన్ని చూచినాడు.

ఆ సరోవనంలోకల బంగారు తామరపూలలోఉండే తేనెలోతడిసిన పిల్లగాలి తనప్రియమైన కుమారుడు భీముడికి ఎదురుగా వెళ్ళింది. ఆ భీముడికి ఆనందాన్ని కలుగచేసింది. అప్పుడు గొప్ప పరాక్రమంకల భీముడు పెద్దగద చేతిలో పట్టుకొని, సౌగంధిక పుష్పాలు తీసికొని పోవడానికి సిద్ధపడినాడు. ఈ విధంగాఉన్న ఆ భీముణ్ణి ఆ సరోవరరక్షకులు పదివేలమంది రాక్షసులు చూచినారు. వీరందరూ కూడా గర్వంతో ఆ క్షణంలోనే విచిత్రమైన ఆయుధాలతో పరుగెత్తుకుంటూవచ్చినారు. "వీడెవడో దివ్య పురుషునిలాగా ఉన్నాడు. గొప్ప తేజస్సు కలిగిఉన్నాడు. తపస్విషేషంలో ఇక్కడకు వచ్చినాడు." అని ఆశ్చర్యపడినారు. వారు భీమసేనుని దగ్గరకు వచ్చి ఇట్లాఅన్నారు. "ఇది కుబేరునితోట. దీనిలోనికి పోవడానికి ఇతరులెవరైనా భయపడతారు.

నీవిక్కడకువచ్చి ఎందుకు గొప్ప ప్రమాదం తెచ్చుకొన్నావు? ఈ తోటలోని శోభాయమానంగా ప్రకాశించే ఈ కొలనులో, దేదీప్యమానంగా వెలిగిపోయే కుబేరుడు తనభార్యలతో కూడా సంతోషంగా జలకమాడుతూఉంటాడు. ఈ కొలనుగట్టున దేవఋషులు దేవతార్చనలు చేస్తారు. అమృతంతో సమానమైనవి ఇంకావైడూర్యపుకాడలతో ఎప్పుడూ ఎక్కడాలేని సువాసనకల బంగారు కమలాలీసరోవరంలోఉన్నాయి. అందువల్ల ఇదియక్షరాక్షససైన్యంతో, ఎల్లప్పుడూ రక్షించబడుతూ ఉంటుంది. దీని మహిమతెలియక, ఇంతదూరంవచ్చిన వీరుడవు నీవెవ్వడవు? ఎందుకు వచ్చినావు?"

ఈ మాటలువిని, భీముడు వారితో ఇట్లాఅన్నాడు. "నేను పాండురాజు కొడుకును. నా పేరు భీముడు. గొప్ప తేజస్సు కలవాడను. ధర్మరాజు తమ్ముణ్ణి. ద్రౌపదిదేవికి సంతోషం కలిగించడానికి పూనుకొని ఈ కొలనులోని పువ్వులు తీసుకొని పోవడానికి వచ్చినాను. దేవతావీరులు అడ్డువచ్చినా ఈ కమలాలను తప్పక తీసుకొనిపోతాను".

అందుకువారు, "అయ్యా! నీవు దివ్య పురుషుడవు. 'ఈ సౌగంధిక పుష్పాలు తీసుకొని పోవాల'ంటే కుబేరునికి చెప్పి, ఆయన అనుమతితో తీసుకొనిపో. నీవు ధర్మరాజు తమ్ముడవు కాబట్టి ధర్మమార్గము తప్పకూడదు." అన్నారు.

'సాహసం చేయవద్ద'ని ఇంతకుముందే హనుమంతుడు బోధించినాడు. ధర్మరాజుకూడా తనకు ఎప్పుడూ ఇదేమాట చెప్తూఉంటాడు. ఇప్పుడు ఆ రాక్షసులుకూడా మిక్కిలిసౌమ్యంగా, సామంగా పని జరిగేఉపాయమే చెప్పినారు. కానీ భీముడినైజం సాహసం చేయకుండాఉండలేదు. అందుచేత ఆ రాక్షసులు చెప్పినమాటలు భీమునికేమాత్రం రుచించలేదు. వాళ్ళను కోపంగాచూచి, "ఈ కొలను కొండలలోని సెలయేళ్ళవల్ల పుట్టింది. ఇది అందరిదీ కాకుండా, ఏ ఒక్కరిదో అవుతుందా? ఈ కొలను కుబేరుడు మొదట్లో సంపాదించినాడా? అతడుకూడా ఆక్రమించుకొన్నదే కదా? ఉత్తమక్షత్రియుడు ఎందుకు 'ఇతరులను దానంచేయుమ'ని కోరుతాడు? తన భుజబలంతో ఇతరులధనాన్ని సంపాదించి తన్ను ప్రార్థించే జనాలకు దానంచేసి తనకీర్తి అన్ని దిక్కుల్లో ప్రకాశించేట్లు చేసుకొంటాడు. మిమ్ములనూ మీ కుబేరుణ్ణీ ప్రార్థించి కానీ, ఈ పువ్వులను తీసుకోలేనా?" అని భీముడు ఆ రాక్షసులను లెక్క చేయలేదు.

సాహసంతో సౌగంధిక సరోవరంలోనికి ప్రవేశించినాడు. పువ్వులను కోసుకున్నాడు. ఆ కొలనులోని గొప్పశక్తికల నీళ్ళను త్రాగినాడు. మితిలేని బలాన్ని పొందినాడు. అట్లాఉన్న భీముణ్ణిచూచి రాక్షసులు కోపగించుకొన్నారు. ఆయుధాలెత్తుకొని భీముణ్ణి ఎదిరించినారు. భీముడుకూడా భయంకరమైన ఆకారంతో తనగదఎత్తినాడు. మహావీరుడై ఆ రాక్షసుల ఆయుధాల నన్నింటినీ విరచివేసినాడు. వారినందరనూ అలసిపోయేట్లు కొట్టినాడు. గొప్పభుజాలతాకిడిచేత వారినితపింపచేసినాడు. వారిబలంతగ్గింది. ఆగ్రహించిన

భీముడి భయంకరచర్యలను గురించి, కుబేరుడికిచెప్పడానికి వారు పరుగెత్తినారు. కుబేరుడు కూడా ఆ విషయమంతావిని, ద్రౌపదిని సంతోషపెట్టడానికి భీముడు ప్రదర్శించిన శౌర్యాన్ని విజృంభణాన్నీ మెచ్చుకొన్నాడు. అంతటితో వదలివేసినాడు. భీముడిపై దాడికి ప్రయత్నించనేలేదు. ఆ విధంగా భీముడు రాక్షససైన్యాన్ని ఓడించి, సౌగంధిక పుష్పాలు తీసుకొని, ఆ కొలను గట్టులో విహరిస్తూ ఉండినాడు.

అప్పుడు అక్కడ ధర్మరాజువద్ద, వేగంగా ఎడతెగకుండా పిడుగులుపడినాయి. భూమి వణకింది. దుమ్మువాన కురిసింది. దిక్కులన్నీ చాలాఎర్రబడినాయి. చీకట్లు ఆవరించి సూర్యుడుకనిపించకుండా పోయినాడు. ఈ విధమైన అపశకునాలను చూచి, ధర్మరాజు ఆశ్చర్యపోయినాడు. "ఇవి భయంకరమైన యుద్ధాన్ని సూచించే శకునాలుగా కనబడుతున్నాయి. జాగ్రత్తగా ఉండవలె" అనుకుంటూ నాలుగు దిక్కులూ చూచి నాడు. భీమసేనుడు కనపడలేదు. అప్పుడు ధర్మరాజు దగ్గరలోఉన్న ద్రౌపదితో ఇట్లాఅన్నాడు. "భీముడు సాహసం చేయడాని కిష్టపడేవాడు. భయంలేనివాడు. ఎక్కడకు పోయినాడు? ఈ కొండపైన యక్షులూ రాక్షసులూ తిరుగుతూఉంటారు. ఈ భీముడేమో ఎక్కడైనా ఎప్పుడైనా ఒంటరిగాతిరిగే స్వభావం కలిగినవాడు. పరాక్రమవంతుడైన భీముడు తానేపోయినాడా? లేకపోతే నీవేదైనాకోరి అతణ్ణి పంపించినావా?" ఇట్లాఅడిగిన ధర్మరాజుతో ద్రౌపది తొట్రుపడుతూ ఇట్లాఅన్నది.

"రాజా! నేనింతకుముందు నీకిచ్చిన బంగారుతామరపువ్వు, గొప్పగాలికి కొట్టుకొనివచ్చింది. దానిని తీసుకొని ఇట్లాంటి పువ్వులు సాధారణంగాదొరకవు కాబట్టి, దగ్గరలోఉంటే నాకు సంతోషం కలిగేట్లు తెమ్మన్నాను. నీ తమ్ముడు మిక్కిలివేగంగా ఈశాన్యంవైపు పోయినాడు."

ఈ మాటలు వినగానే ధర్మరాజు, "అట్లయితే అందరము ఆ భీముడు పోయినవైపు పోదాము." అనిచెప్పి, ఎప్పటిలాగానే రాక్షసులభుజాలెక్కి ఆకాశమార్గానపోయి, సౌగంధికపుష్పాల సరోవర తీరంలో భీముణ్ణి చూచినాడు.

ఆ భీముడు అప్పుడు సాటిలేని బలంతో గదఎత్తి పట్టుకొనిఉన్నాడు. ఆయన భయంకరమైన గదదెబ్బలతో చీల్చబడిన యక్షరాక్షసుల గొప్పదేహాల గుట్టలను చూచినారు. ధర్మరాజు మొదలైనవారూ బ్రాహ్మణులూ అందరూ ఆశ్చర్యంతోకూడిన చిరునవ్వుముఖాలుకలిగినవారైనారు.

భీముడుకూడా ధౌమ్యుడికీ ధర్మరాజుకూ రోమశుడికీ మ్రొక్కినాడు. తనకుమ్రొక్కిన నకుల, సహదేవులను కౌగిలించుకొన్నాడు. వైడూర్యపుకాడలుకలిగిన బంగారుకమలాలను ద్రౌపది కిచ్చినాడు.

సీ. ప్రాస్వపీనగ్రీవు, నచలితాయతహను, । నతిచపలస్వభావాభిరాముఁ,
దనుమధ్య కటిచక్రు, దహనకణాకార । తామ్రోష్ఠు, నతికృశదశనకరజుఁ,
బృథులవిద్యుత్పుంజపింగాక్షు, నుత్తుంగ । దృఢవక్షు, నాజానుదీర్ఘబాహు,
నూర్ధ్వలాంగూల మత్యున్నతధ్వజలీలఁ । గ్రాలుచు నుండ నేకాంతయోగ.

అ. నిద్రనున్న ధర్మనిర్మలు, హనుమంతుఁ, జూచి పాండురాజసుతుఁడు వాని
నిద్ర జెఱుపఁగడఁగి, నిజసత్త్వ మేర్పడ । సింహనాద మొప్ప ఁ జేసి, దాసి. 3-319

మత్తకోకిల :

"మీకు నెగ్గొనరించి యున్న యమిత్రులన్, హతబుద్ధులం,
జీకురాజు తనూజులం, గురుసింహ! నీకు బ్రియంబుగా
నేకమాత్రన పోరిలో వధియించి, నాగపురంబు నా
నా కులాద్రి శిలావళీ గహనంబు సేయుదు నావుడున్. 3-352

# 23. జటాసురవధ.

**(అరణ్య 3-380 నుండి 397 వరకు.)**

**(భీముడు సౌగంధికపుష్పాపహరణంచేసినతరువాత జటాసురుడు వారిని మోసంచేయగా వాడిని భీముడుచంపినకథ.)**

భీముడు యక్షులను జయించి సౌగంధిక పుష్పాలు తెస్తూఉండగా ఎదురుగా వచ్చిన ధౌమ్యుడికీ రోమశుడికీ ధర్మరాజుకూ మ్రొక్కినాడు. తనకు మ్రొక్కిన నకులసహదేవులను కౌగిలించుకొన్నాడు. వైడూర్యపుకాడలు కలిగిన బంగారుకమలాలను ద్రౌపది కిచ్చినాడు.

అప్పుడు ధర్మరాజు భీముడితో "పెద్ద భుజాలు కలిగిన పుణ్యాత్ముడా! నీవిట్లాంటి సాహసకార్యాలు చేయడంతగునా? నీవు అందరికంటె ఎక్కువ తెలిసినవాడవు. నీకు నామీదప్రేమ ఉంటే, ఇంకమీదట ఇట్లాంటి పనులు చేయవద్దు." అని బోధించినాడు. ఆ తరువాత అందరూ ఆ కుబేరుని ఉద్యానవనంలో విహరిస్తూఉండినారు. అప్పుడు ఆ ఉద్యానవనాన్ని కాపాడేయక్షులు వారి దగ్గరకు వచ్చినారు. దేవర్షి అయిన రోమశుణ్ణీ దేవేంద్రునితో సమానుడైన ధర్మరాజునూ, బ్రాహ్మణోత్తములనూచూచి, వినయంతో వంగినమస్కరించినారు. వారితో భక్తితో, "మీరు ఇక్కడ తిరగవద్దు. ఇది యక్షులు, రాక్షసులూతిరిగే భయంకరమైనప్రదేశము" అన్నారు.

పాండవులా మాటలువిని అక్కడుండడానికి ఇష్టపడలేదు. అక్కడకు దగ్గరలో తమవసతిని ఏర్పాటు చేసుకున్నారు. రాక్షస బలాన్నంతా 'తీసుకొని పొమ్మ'ని ఘటోత్కచుణ్ణి ఆజ్ఞాపించినారు. అక్కడనే కొంతకాలము ఉండినారు.

అప్పుడు 'జటాసురుడ'నే రాక్షసుడు బ్రాహ్మణరూపం ధరించినాడు. పాండవులనుదర్శించి "నేను వేదాలు తెలిసినవాడను. ధనుర్వేదం బాగాతెలిసిన పరశురాముడి శిష్యుడను." అని చెప్పుకొన్నాడు. పాండవులను సేవిస్తూఉండినాడు. అట్లాఉండగా ఒకనాడు భీముడు వేటకుపోయినాడు.

ఆ సమయంగమనించి జటాసురుడు బ్రాహ్మణఆకారం వదలివేసి తన రాక్షసాకారంధరించి వచ్చి ద్రౌపదిని, ధర్మరాజును, నకులుణ్ణి, వారివారి ఆయుధాలతోసహా ఎత్తుకొని మహావేగంతో ఆకాశంలో పరుగెత్తినాడు. బ్రాహ్మణోత్తములంతా భయపడినారు. అప్పుడు సహదేవుడు భీముణ్ణి పిలుస్తూ అడవిలోనికి పోయినాడు.

ఇక్కడ ధర్మరాజు అధర్మపరుడైన రాక్షసునితో ఇట్లాఅన్నాడు. "దేవతలు రాక్షసులు మొదలైన వారంతా భూలోకంలో ఉంటారు. వారందరూ ఇక్కడ మానవులకు సౌఖ్యాలు ప్రసాదిస్తూ ఉంటారు. ఆ మానవులను కాపాడేది మేమేకదా?" ఇట్లాంటిమాకు అపకారంచేయడం మంచిదికాదు. నీకు ధర్మం తెలియదు. నమ్మినవారికీ అన్నంపెట్టినవారికీ చెడుచేయడం చాలాపాపము. కాబట్టి మాఆయుధాలు మాకిచ్చి మాతోయుద్ధంచేయి. నీవు ఈ విధంగా పరుగెత్తిపోవడం భావ్యంకాదు." ఇట్లాఅంటూ ఆ మాయావి అయిన రాక్షసునివేగాన్ని తగ్గించినాడు.

ఈ విధంగా ధర్మరాజు గట్టిగా అదిమిపట్టడంచేత కలిగినబాధవల్ల గమనవేగం తగ్గి, రాక్షసుడు మెల్లగాపోతూ ఉన్నాడు. సహదేవుడు ఆ రాక్షసుడికి అడ్డంవచ్చి ఇట్లాఅన్నాడు. "నీవు నన్ను ఎరుగవా? నేను పాండురాజు కొడుకును. సహదేవుడను. నిర్మలమైనకీర్తినీ పరాక్రమాన్నీ కలిగినవాడను. నా గొప్పతనం తేటతెల్లమయ్యేట్లుగా నిన్నిప్పుడు ఓడించగలను. ఎదురుగానిలిచి నాతోయుద్ధంచేయి".

సహదేవుడు ఇట్లాఅంటున్న సమయంలోనే భీముడు వాయువేగంతో వచ్చినాడు. జటాసురుడు పట్టుకోగా, ఆకాశంలో మెల్లగాపోతూ ఉన్న ధర్మరాజును నకులుణ్ణి ద్రౌపదినీ నేలమీదఉన్నసహదేవుణ్ణి చూచినాడు. ఆ రాక్షసునితో ఇట్లాఅన్నాడు. "అతిథివై వచ్చి నీవు మాతోపాటుతిని రాక్షసుడవై అపకారం చేయవచ్చునా? ఎక్కడైనా ఎంతదుర్మార్గుడైనా తిండిపెట్టినవారికి కీడుచేయడు. నీకు తెలివిఉంటే వారినందరనూవిడచి ప్రాణాలు దక్కించుకో. అట్లాకాకపోతే బకుణ్ణీ, హిడింబుణ్ణీ, కిమ్మీరుణ్ణీ, చంపినట్లుగా నిన్ను అవలీలగాచంపుతాను." ఈ మాటలు విని జటాసురుడు వారిని విడిచి భీమసేనుడి వైపుతిరిగి, "నీచేత యుద్ధంలోచచ్చిన రాక్షసులైన బకుడికీ, హిడింబుడికీ, కిమ్మీరుడికీ, యుద్ధంలో నీనెత్తుటితో తర్పణం చేస్తాను." అంటూ మిక్కిలి కోపగించుకొన్నాడు. అట్లాఅంటూ ఆ జటాసురుడు భీముడిని మార్కొన్నాడు. తక్షణమే భీమునికి తోడుగా నకులసహదేవులు కూడా ఆ రాక్షసుణ్ణి ఎదుర్కొన్నారు.

భీముడు నకుల, సహదేవులిద్దరనూఆపి, పరాక్రమంతో జటాసురుణ్ణి తాను ఒక్కడే మార్కొన్నాడు. భీముడికీ జటాసురుడికీ భయంకరమైనయుద్ధంజరిగింది. వారితొడల తాకిడిచేత చెట్లునాశనమైనాయి. వారి పాదాల తాకిడిచేత భూమికంపించింది. వారిద్దరూ చెట్లనుచేతుల్లోధరించి పోరాడినారు. దగ్గరలోని చెట్లన్నీ నశించడంచేత భయంకరమైనగండశిలలతో కొంచెంసేపు యుద్ధంకొనసాగించినారు. అట్లా దేదీప్యమానమైన బలంకలిగిన ఆ ఉభయులూ భయంకరులై వాలి సుగ్రీవులలాగా యుద్ధం చేసినారు.

అంతట భీమసేనుడు యమునివంటి ఆకారంకలవాడై ఆ జటాసురుణ్ణి బలంతగ్గిపోయినవానిగా గుర్తించి, ఆలస్యం చేయకుండా వాడిమెడ క్రుంగివాలి పోయేటట్లు తనపిడికిలితో గట్టిగాగ్రుద్దినాడు. అంతటితో ఆ రాక్షసుడు దేహము ముడుచుకొని నేలపైపడినాడు.

ఈ విధంగా జటాసురుడిదేహం పిడుగుపడి బద్దలైన నీలగిరి శిఖరంవలె నేలపైపడగా భీమసేనుడు, ఆ రాక్షసదేహాన్ని ఒక బండరాతిపైకి విసరివేసినాడు. ఆ శరీరం ముక్కలైపోయింది. ఆ విధంగా ఆరాక్షసుడు చచ్చిపోయినాడు. అప్పుడు ధౌమ్యుడు రోమశుడు మొదలైన బ్రాహ్మణశ్రేష్ఠులు భీముడి శౌర్యాన్ని గొప్పగా పొగడినారు.

**నీతి :** తిన్న ఇంటివాసాలు లెక్కపెట్టరాదు.

**తే.** **అతిథివై వచ్చి నీవు మాయందుఁ గుడిచి, యసురవై యిట్ల యెగ్గు సేయంగ నగునె?**
**యెందుఁగుడిచినచోటికి నెగ్గు సేయ, రెట్టి దుర్జను లైనను నెఱుక విడిచి.** **3-390**

# 24. పంచవర్ణ సురభి కుసుమాపహరణం.

(అరణ్య 4-5 నుండి 31 వరకు.)

పాండవులు అరణ్యవాసంలోఉండగా వేదవ్యాసునిసూచనమేరకు అర్జునుడు హిమాలయాలకు పోయి, తపస్సుచేసి, ఈశ్వరుణ్ణి మెప్పించి, పాశుపతాస్త్రాన్ని పొందినాడు. అటుతరువాత ఇంద్రుని ఆహ్వానంమేరకు స్వర్గానికిపోయి అక్కడేఉండినాడు.

ఆ సమయంలో మిగిలిన పాండవులు ఇంద్రుడుపంపిన రోమశమహర్షితోపాటుగా తీర్థయాత్రలు చేస్తూపోయి గంధమాదనపర్వతము చేరినారు. ఆ పర్వతంమీద పయనిస్తూ పదిహేడవరోజున 'వృషపర్వుడు'అనే రాజర్షిఆశ్రమం చేరుకున్నారు. ఆ వృషపర్వుడు వారిని సంతోషంగా ఆహ్వానించి సత్కరించి పూజించినాడు. ఆయన ఆశ్రమంలోనే ఏడుదినాలు విశ్రాంతి తీసుకున్నారు. ఆ తరువాత తమతోపాటు ఉన్న బ్రాహ్మణులనందరనూ అక్కడే 'ఉండమ'న్నారు. ధౌమ్యుడు రోమశుడు మొదలైనకొద్ది మంది బ్రాహ్మణులతో ఎనిమిదోరోజున వృషపర్వుడు చూపినమార్గంలో పయనించినారు. అట్లా ఉత్తమ చరిత్రగల పాండవులు నిర్మలమైన పటికరాళ్ళతోనూ, బంగారంతోనూ, కూడిన అందమైన గుహలతోనూ మంచుతోనూ కప్పబడి ఎల్లప్పుడూ తెల్లగాఉండే 'మాల్యవంతమ'నే పర్వతాన్నిచూస్తూ ముందుకు పోయినారు. ఆ అడవిఅంతా కదలాడే తుమ్మెదల గండుకోకిలల శబ్దాలతో మ్రోగిపోతూఉంది. ఎక్కడచూచినా రుచికరమైనపండ్లూ మృదువైనచెట్లూఉండినాయి. అట్లాంటిఅడవిలో ఎత్తైనప్రదేశాలలో విశ్రాంతి తీసుకుంటూ వినోదంగా, వారు అక్కడ విహరిస్తూఉండినారు.

పాండవులంతాఅట్లా ఆ అడవిలోవిహరిస్తూ కాలంగడుపుతూఉండి, ఒకనాడు ఆ అడవిలో 'శ్వేతకి'అనే పుణ్యనదిఒడ్డున విహరిస్తూ ఉండినారు. అప్పుడు ఆ నదిలో కొట్టుకొనివస్తూ గాలికి వారిముందరకు ఒకపంచవర్ణసురభికుసుమం వచ్చిపడింది. దానినిచూచి వారందరూ ఆశ్చర్యపడినారు. ఆ తరువాత ఒకచంద్రకాంతశిలావేదికపైన ఒంటరిగాఉన్న భీమసేనునితో ద్రౌపది ఇట్లాఅన్నది. "ఈ పువ్వులు స్పష్టంగా వెనకటి సౌగంధికకనకపద్మాలకంటె దివ్యమైనసువాసనకలిగి ఉన్నాయి. ఇవి వాటికంటె సుకుమారమైనవి. ఇట్లాంటివాటిని నేనింతకు ముందెన్నడు చూడలేదు. ఈ పువ్వులు తీసికొనివచ్చి నాకిచ్చి నా మనస్సుకు ఆనందంకలిగించు."

ఈ మాటలు విన్నంతనే భీముడు బయలుదేరి, 'చక్రవాళ పర్వతం'లాగా ఎత్తుగాఉన్న ఆ కొండ నెక్కినాడు. అక్కడ రకరకాలయినరత్నాలతో నిర్మించబడిన ప్రాకారంలోపల కుబేరుని నివాసాన్ని చూచినాడు. వెంటనే తనశంఖాన్ని పూరించినాడు ఆ శంఖధ్వనినివిని. రకరకాలయిన ఆయుధాలు ధరించి యక్షరాక్షససేనలు పరుగుపరుగునవచ్చి కుమారస్వామివంటి భీమసేనుణ్ణి భయంకరమైన శబ్దాలతో ఎదిరించినారు.

భీముడు వాడిఅయిన బాణాలు ప్రయోగించి రాక్షసుల పెద్దపెద్ద శరీరాలనుచీల్చి వేసినాడు. ఆ 'రాక్షసదేహాలు'అనే మేఘాలనుండి 'రక్తమ'నేనీళ్ళుకారి కొండవాగులన్నీ పూర్తిగానిండిప్రవహించినాయి. ఈ విధంగా భీముడి భయంకరమైన బాణాల దెబ్బలకు ఓర్చుకోలేక బలంతగ్గి ఆ రాక్షసులంతా యుద్ధభూమి నుండి వెనుతిరిగినారు.

అప్పుడు 'మణిమంతుడు' అనే రాక్షసుడు ఒంటరిగా భీమసేనుడితో పూనుకొన్నాడు. వాడు బాగా కోపగించుకొన్నాడు. ఓర్చుకోలేకదిగ్గజం సింహాన్నెదిరించినట్లు మణిమంతుడు భీముణ్ణెదిరించినాడు. అజేయుడైన భీముడు తన అడ్డగించడానికివీలుకాని 'వాడిబాణాలవరసలు'అనే వానతో భయంకరంగా ఆ రాక్షసుణ్ణి కప్పి వేసినాడు. వాడు కుబేరునిమిత్రుడైనగొప్పవీరుడు. భీముని బాణాలకు భయపడలేదు. కోపగించుకొన్నాడు. గదనుత్రిప్పి భీముని మీద ప్రయోగించినాడు. ఆ గద మెరుపులాంటికాంతితో పదిదిక్కులనూ వెలిగిస్తూ భీముని మీదకు వేగంగావచ్చింది. భీముడు కోపంతో ఆ గదను తనవాడిబాణాల గుంపులతో పొడిగా చేసినాడు. యక్షులూ రాక్షసులూ భయపడినారు. కానీ గొప్పవాడైన మణిమంతుడు బంగారు పిడితోప్రకాశించే 'శక్తి' అనే ఆయుధాన్ని భీమునిమీదకు విసరినాడు. అది భీముని భూజాన్ని ఒకప్రక్క తాకి నేలమీదపడింది. అప్పుడు భీముడు గదతీసుకుని ప్రళయకాలంలోని యముడిలాగా భూమిఅదరేట్లు మణిమంతుణ్ణి అదలించి నిలబడినాడు. యుద్ధంలో గొప్పగర్వం కలిగిన మణిమంతుడు భయపడకుండా త్రిశూల మెత్తుకొని భీమునిపైన వేసినాడు. అగ్నికణాలు అన్నివైపులా వ్యాపించినాయి. గొప్పవాడైన భీముడుకూడా తనగదచేత ఆ త్రిశూలాన్ని నాశనంచేసినాడు. ఈ విధంగా తన శక్తీ, శూలాలు బలాన్ని కోల్పోయి నాశనంకాగా, గర్వాన్ని వదలి మణిమంతుడు పారిపోవడానికి ఆకాశానికెగిరినాడు. "పోవద్దు. పోవద్దు." అంటూ మహావీరుడైన భీముడు గదనుపూన్చి ఆ మణిమంతుణ్ణి బలంక్రుంగిపోయేట్లు కొట్టినాడు. వాడు ఆ గదదెబ్బకు నేలకూలినాడు. యుద్ధంలో ఈ విధంగా మణిమంతుడు భీమునిచేత చచ్చిపడిపోగా, భయంతో యక్షులూ రాక్షసులూ ఆర్తనాదాలుచేస్తూ నిలబడకుండా తూరుపు వైపునకు పారిపోయినారు.

అక్కడ ధర్మరాజు, భీముడుపోయినవైపును ద్రౌపదినడిగి తెలుసుకున్నాడు. ధౌమ్యుణ్ణీ ద్రౌపదినీ 'ఆర్ష్టిషేణుడు' అనే మునిశ్రేష్ఠుని ఆశ్రమంలో ఉంచినాడు. రోమశుణ్ణి నకుల, సహదేవులను తీసుకొని ఆ కొండశిఖరానికి ఎక్కినాడు. అక్కడ కుబేరునినివాసందగ్గర భీముణ్ణి చూచినాడు. ఆ భీముడు తన గదదెబ్బతో పడిపోయిన మణిమంతుడు మొదలైన యక్షరాక్షసుల శవాలతో భయంకరంగాఉన్న యుద్ధ భూమిమధ్యలో కనిపించినాడు. ధర్మరాజు అలాకనిపించిన భీమునివద్దకు పోయినాడు.

అప్పుడు చావకుండా మిగిలిన యక్షరాక్షసులు చాలావేగంగా పరుగెత్తుకొనిపోయి కుబేరుణ్ణి కలుసుకున్నారు. భీముని పరాక్రమాన్నీ ఆతడు మణిమంతుణ్ణిచంపడాన్నీ వివరంగాచెప్పినారు. ఈ విషయంవిని కుబేరుడు ఆశ్చర్యపడినాడు. మనసులో ఇట్లాఅనుకున్నాడు "జంకులేకుండా ఇంతకు మునుపు

సౌగంధిక పుష్పాలు తీసుకొన్నాడు. మళ్ళీ ఇప్పుడుకూడా గర్వంతో ఇక్కడిపంచవర్ణ సురభికుసుమాలు తీసుకున్నాడు, మణిమంతుడు మొదలైన నాసేవకులను చాలామందిని చంపినాడు. ఎంతటి బలవంతుడో?"

ఇట్లాఅనుకొని కుబేరుడు, దేవతలు, యక్షులు, రాక్షసులు గరుడలతో కలిసివచ్చి పాండవులను దర్శించినాడు. వాళ్ళలో గద,ఖడ్గం,బాణాలు, విల్లు ధరించి యుద్ధం చేయాలనే కోరికతో ఉన్న మహావీరుడైన భీముణ్ణి చూచి, మనసులో చాలాసంతోషించినాడు. ఆ కుబేరునికి బుద్ధిమంతులైన పాండవులు నమస్కరించినారు. అప్పుడు కుబేరుడు ధర్మమూర్తిఅయిన ధర్మరాజునుచూచి మిక్కిలిదయతో ఇట్లా అన్నాడు "అయ్యా! నీతమ్ముడు నాఇష్టసఖుడైన మణిమంతుణ్ణిచంపి 'నాకపకారము చేసినాడ'ని సిగ్గు పడనవసరము లేదు. అది అగస్త్యుని శాపంవల్ల జరిగింది" కుబేరుడు ఇట్లా చెప్పి, భీముణ్ణి 'దగ్గరకురమ్మ'ని పిలిచి, "నీవు చేసిన సాహసం నాకుమేలే చేసింది. కాబట్టి నిన్ను మెచ్చుకుంటున్నాను." అన్నాడు. అప్పుడు ధర్మరాజు కుబేరునికి చేతులు జోడించి, "ఇట్లాంటి శాపం ఆ అగస్త్యమునీంద్రుడెందుకిచ్చినాడు? దానిని తెలియచెప్పు' అన్నాడు. అప్పుడు ఆ ధర్మరాజుకు కుబేరుడు ఇట్లా వివరించినాడు.

పూర్వం 'కుశావతి'అనే పుణ్యనదీతీరంలో దేవతలంతా సత్రయాగం చేస్తూఉండినారు. వారాయాగానికి నన్నుకూడా ఆహ్వానించినారు. నేనుకూడా పుష్పకవిమానమెక్కి మూడువందల మహాపద్మాల యక్షరాక్షససైన్యంతో ఆకాశమార్గాన అక్కడకు పోతూఉండినాను. మార్గమధ్యంలో నాస్నేహితుడైన మణిమంతుడు క్రింద 'అగస్త్యుడున్నాడ'నే విషయం తెలియక ఉమ్మి వేసినాడు. ఆ ఉమ్మి చేతులెత్తుకొని యమునాతీరంలో భయంకరంగా తపస్సుచేస్తూ ఉండిన అగస్త్యుని మీద పడింది. ఆ మునిశ్రేష్ఠుడు కోపగించుకొని నాతోఇట్లాఅన్నాడు "నీవు చూస్తూఉండగానే నీకు ఇష్టసఖుడైన ఈ మణిమంతుడు ఇప్పుడు ఎక్కువమదంతో నన్నులెక్కచేయకుండా నామీదఉమిసినాడు. ఇతరులను కష్టపెట్టే చెడుగర్వంకలిగిన ఈ మణిమంతుడు ఒకమనిషిచేతిలో చస్తాడు. అంతేకాదు నీ యక్ష రాక్షససైన్యంకూడా వాడి చేతిలో చస్తుంది. నీకు కలిగిన ఈ పాపమంతా వాడిని చూస్తేపోతుంది" అన్నాడు. కాబట్టి ఇట్లాంటి శాపం ఫలించడానికి నీ తమ్ముడు కారణమైనాడు." అని చెప్పినాడు.

తరువాత కుబేరుడు తన నివాసానికి పోయినాడు. పాండవులు ఆ పువ్వులు తీసుకొని ఆర్ష్టిషేణుడి ఆశ్రమాన్నిచేరి, ద్రౌపదికి ఆ పువ్వులిచ్చినారు. ఆ పువ్వులనుచూచి ఆమె మిక్కిలి ఆనందించింది. ఆ తరువాత వారందరూ అదేఆశ్రమంలో స్వర్గంనుండి అర్జునుడి రాకకు ఎదురు చూస్తూ ఉండినారు.

**ఉ.** **ఉక్కటియిట్లు మధ్యముమహోగ్ర శరంబుల కోర్వనోపకా**
**రక్కసు లెల్ల నాహవపరాఙ్ముఖులైనఁగడంగి భీముఁడా**
**నెక్కటి దాఁకె దిక్కరిసహింపక సింహము దాఁకునట్టు లం**
**దక్కజుఁడుద్యతాయతగదాయుధుఁ డై మణిమంతుఁడల్కతోన్.**

## 25. నివాతకవచ పౌలోమ కాలకేయుల వధ.

**(అరణ్య 4-51 నుండి 86 వరకు.)**

**(పాండవుల అరణ్యవాసకాలంలో అర్జునుడు తపస్సు చేసి ఈశ్వరుణ్ణి మెప్పించి, పాశుపతాస్త్రాన్ని సంపాదించిన పిదప ఇంద్రునికోరికపై స్వర్గానికిపోయినాడు. అక్కడ దేవతలు జయించలేని నివాతకవచపౌలోమ కాలకేయులను ఇంద్రుని కోరికపై అర్జునుడు వధించినాడు ఈ కథనంతా ఆ తరువాత స్వర్గంనుండి తిరిగివచ్చి, అర్జునుడు తన సోదరులకు ఇట్లా చెప్పినాడు.)**

"ఇంద్రుడు నన్ను ఆహ్వానించితెచ్చి స్వర్గంలో తన అర్ధాసనం ఇచ్చి గౌరవించినాడు. తరువాత ఒకరోజు ఇంద్రుడు నాతో ఇట్లాఅన్నాడు. "నీవు అన్ని అస్త్రాలు తెలిసినవాడవు. కాబట్టి ఇతరులెవరూ నిన్ను యుద్ధంలో జయించలేరు. నీవు దేవతలకు బ్రాహ్మణులకు మేలుచేయి. దానితో నీకోరికలు తీరుతాయి. నేను అనేకాస్త్రాలుఇచ్చి నీకుగురువునైనాను. అందుకని నాకుగురుదక్షిణగా దేవతలకు మేలు కలిగేట్లుగా కడలికడుపులో దాగిన 'నివాతకవచులు' అనే రాక్షసులనుచంపు. వారు మూడుకోట్ల మంది రాక్షసులు. బలగర్వంతో వేల్పులకు బాధలు కల్పించేవారు." అని చెప్పి, తాను ధరించిన భూషణాలను నాకుతొడిగినాడు. తాకితేకానితెలియని ఛేదించడానికి వీలుకాని, కవచాన్నిచ్చినాడు. కొండచిలువలాంటి అల్లెత్రాటిని గాండీవానికి తానే తగిలించినాడు. పదివేలగుర్రాలను పూన్చిన 'తనరథాన్ని ఎక్కుమ'ని ఆజ్ఞాపించినాడు. ఆ గుర్రాలు హంసల, నెమళ్ళ, రంగులతో శోభిల్లుతున్నాయి. ఆ రథాన్ని మాతలి నడుపబోతున్నాడు. అట్లా ఆజ్ఞాపించి ఇంద్రుడు, "నివాతకవచులను చంపి రాపో." అన్నాడు. అప్పుడు ఇంద్రునివద్ద వీడ్కోలు పొంది, బయలుదేరిననాతో దేవతలు ఇట్లాఅన్నారు.

"ఈ రథమెక్కి పూర్వముఇంద్రుడు పెక్కువేలమంది రాక్షసులనుజయించినాడు. వృత్రుడు, శంబరుడు, బలుడు మొదలైన గర్వించిన రాక్షసులనుకూడా జయించినాడు. నీవుకూడా బలాఢ్యుడవై యుద్ధంలో నివాతకవచరాక్షసులను సంహరించు. నీవు వీరులైనశత్రువులను జయించేవాడవు. నివాతకవచులు భయంకరమైన మాయలతో వినోదించేవారు." దేవతలు ఇట్లాచెప్పి నాకు 'దేవదత్తం' అనే శంఖాన్ని బహూకరించినారు.

ఆపైన నేను మాతలితోకూడి మిక్కిలి వేగంగాపోయి ఆ మహాసముద్రాన్ని దర్శించినాను. ఆ సముద్రంలోపల పెద్దపెద్ద బురుజులతో పెద్దపెద్ద వీధులతో అలంకరించబడిన నగరాన్ని చూచినాను. ఆ నగర ముఖద్వారంవద్ద నిలిచి శంఖాన్నిపూరించినాను. ఆ శంఖధ్వని అన్ని దిక్కులలోని కొండగుహలలో మారుమ్రోగింది. దానిని విన్న రాక్షసులు కోపగించుకొన్నారు. వివిధ విధాలైన ఆయుధాలను తీసుకొన్నారు. నా రథాన్ని చుట్టుముట్టినారు. వారి నల్లటిదేహాలనుండి వెలువడే నలుపుదనంయొక్క చీకట్లు లోకాన్ని ముసురు కొన్నట్లనిపించింది.

ఆ రాక్షసులు నాపై గొప్పఆయుధాలను వర్షించినారు. తక్షణమే నేనుకూడా ఒక్కొకనిపై ఏడేసి బాణాలు భయంకరంగా, అసాధారణమైనపద్ధతిలో ప్రయోగించినాను. రాక్షసులు నాతేరు పోయేదారి కడ్డంగా భూమికి ఆకాశానికిమధ్య ప్రదేశమంతా అమ్ములతో కప్పివేసినారు. దేవతలు మునులు ఆశ్చర్యపడినారు. మిక్కుటమైన భయంతో మాతలి స్పృహతప్పి తేరునడిపే సామర్థ్యాన్ని కోల్పోయినాడు. నేనే తేరును నడుపుకుంటూ, రాక్షసులమీద ఆలస్యం చేయకుండా అమ్ములు వేసినాను. మూర్ఛతేరిన మాతలి నన్నుచూచి సంతోషపడినాడు.

ఆ సాటిలేనియుద్ధంలో ఎడతెగకుండా ప్రయోగించే నాబలమైన బాణాలదెబ్బలకు రాక్షసుల దేహాలు ముక్కలై ఆకాశానికెగిరిపోయినాయి. ఆ దేహాల ముక్కలనుండి రక్తం, వర్షంగా కురిసింది. అది చూడడానికి మేఘాలు కొండశిఖరాలకుతగిలి ముక్కలైపోయి వానకురిసినట్టుగా ఉండింది.

అప్పుడారాక్షసులు మాయయుద్ధం చేయడానికి పూనుకొని నాపైన వర్షాస్త్రాలు ప్రయోగించినారు. అప్పుడు ఇంద్రుడు నాకుఇచ్చిన గొప్పవాడియైన శోషణాస్త్రాన్ని ప్రయోగించినాను. అది ఎడతెగకుండా కురిసే వాననీటి వెల్లువను తత్క్షణమే ఎండిపోయేట్లుచేసింది.

ఆ రాక్షసులు భయంకరమైన రాళ్ళవానలు కురిపించి, నన్ను కప్పివేసినారు. నేను వజ్రాస్త్రాన్ని ప్రయోగించి, ఆ రాళ్ళన్నీ నుగ్గునుగ్గు అయ్యేట్లు చేసినాను. మరలా ఆ రాక్షసులు నా మీద ఆగ్నేయాస్త్రం ప్రయోగించినారు. నేను వారుణాస్త్రంతో దాన్ని వమ్ముచేసినాను. ఆ పైన దానవులు చీకట్లుకమ్మే అస్త్రాన్ని ప్రయోగించినారు. చీకట్లు ఎల్లెడలా క్రమ్ముకున్నాయి. ఆ చీకట్లో మాతలి కంపించిపోయినాడు. తన చేతిలోని ములుకోల జారవిడిచి భూమిపైన పడిపోయినాడు. గుర్రాలు పరుగెత్తలేక పోయినాయి.మాతలి "అర్జునా? ఎక్కడున్నావయ్యా! " అని అరచినాడు. "పూర్వము రాక్షసులకూ దేవతలకు అమృతంకొరకు గొప్పయుద్ధం జరిగింది. కానీ అది ఇప్పటియుద్ధమంతటి భయంకరమైందికాదు. ఈ పోరాటంలో రాక్షసులు వారించవీలులేని పరాక్రమం కలిగినవారైనందున, ఈ యుద్ధం మిక్కిలి భయంకరంగా ఉంది. ఇది బ్రహ్మచేత నిర్ణయించబడిన ప్రపంచప్రళయంలాగాఉంది" అన్నాడు. ఆ మాతలి అట్లాఅనగా నీవు యుద్ధంలో భయపడకుండా నాపరాక్రమాన్ని చూస్తూఉండు" అన్నాను. అందుకు మాతలి ఆశ్చర్యపడినాడు.

సూర్యుణ్ణిప్రార్థించి దేవేంద్రుడు దయతోనాకుప్రసాదించిన సూర్యాస్త్రాన్ని ప్రయోగించినాను దేవేంద్రుడుమొదలైనదేవతలంతా సంతోషించినారు. ప్రపంచానికి భయంకలిగించిన చీకట్లన్నీ పటాపంచలయినాయి. దిక్కులన్నీ తేటతెల్లమై కనిపించినాయి. మిక్కిలి భయంకరులైన రాక్షసులు భయ పడినారు. మాతలి నన్నుఅభినందిస్తూ ఆనందంతో పెద్దగా కేకవేసినాడు.

నాగాండీవంనుండి వెలువడిన భయంకరమైన బాణాలతో కాళ్ళూ చేతులూతెగి రాక్షసులు యుద్ధంలో కొండలు కూలినట్లుకూలినారు. భూభాగం కంపించిపోయింది. ఈ విధంగా నివాతకవచులు నా దివ్యాస్త్రాలవల్ల మరణించగా రాక్షసస్త్రీల ఏడుపులూ పెడబొబ్బలు ఆకాశాన్ని దద్దరిల్లచేసినాయి.

అప్పుడు దేవేంద్రుని ముఖ్యపట్టణమైన అమరావతికంటె అందంగా ఉన్న ఆ రాక్షసుల పట్టణాన్ని చూచి, నేను మాతలిని ఇట్లా అడిగినాను. “సాటిలేని రత్నాలతో దట్టంగా పొదుగబడిన ఇండ్లతో శోభించే ఈ నగరంలో సుఖంగాఉండకుండా, వేరొకపట్టణంలో ఇంద్రుడెందుకుండవలసి వచ్చింది?” అందుకు మాతలి ఇట్లాఅన్నాడు “అర్జునా! రాక్షసులవల్ల భయంకలిగినప్పుడు దేవతలు తలదాచుకోవడానికి దేవేంద్రుడు సముద్రంలో ఈ పట్టణాన్నినిర్మింపచేసినాడు. తరువాత రాక్షసులు తపస్సుచేసి బ్రహ్మ దేవుడివద్ద వరంగా ఈ నగరాన్నిపొందినారు. వీరు దేవతలచే జయించబడకుండా ఉండడానికికూడా వరంపొందినారు. అందుచేత వారిని దేవతలుజయించలేరు. అందుకే ఇంద్రుడు వారిని జయించడానికి నిన్ను నియోగించినాడు. దేవతలు జయించలేని నివాతకవచులను నీవు జయించినావు” అని ప్రశంసించి మాతలి రథాన్ని మరలించినాడు.

ఈవిధంగా నివాతకవచులను చంపి తిరిగివస్తున్నాను. అప్పుడు నాకెదురుగా ఒకతపోవనమూ మిక్కిలి విచిత్రమైన ఒకనగరమూ కనిపించినాయి. “ఇది ఎవ్వరి నగరము?” అని నేనడిగినాను. అందుకు మాతలి ఇట్లా అన్నాడు. “పులోమ, కాలక, అనబడే ఇద్దరు రాక్షసయువతులు వేయిదేవతాసంవత్సరాలు మిక్కిలినిష్ఠతో తీవ్రమైన తపస్సుతో బ్రహ్మదేవుడిని ఆరాధించినారు. ఆ విషయం నీవు వినలేదా? బంగారంతో నిర్మించబడిన ఈ నగరంలో ఉండేటట్లుగా ఆ బ్రహ్మదేవుడిచేత వరాలనుపొందినారు. ఇది హిరణ్యపురం. ఇందులో పౌలోములు, కాలకేయులు, అనే రాక్షసులు అరవైవేలమంది ఉంటారు. వారు దేవతలు చేత చచ్చేవారు కారు”.

“అట్లైతే ఆ హిరణ్యపురం మీదకు పోదాము రథాన్ని నడుపు” అని నేను మాతలిని నియోగించి నాను. ఆ మాతలి వాయువేగంతో దేవతారథాన్ని ఆ హిరణ్యపురం కోటకొమ్ములపైకి నడపించినాడు. అంతట అందలిరాక్షసులు విజృంభించినారు. నగరంబయటకువచ్చినారు. నన్ను ‘దేవేంద్రుడు’ అనుకొన్నారు. కోపగించుకొన్నారు. అరవైవేలమంది రాక్షసులూకూడా అరవైవేలరథాలతో నన్ను చుట్టు ముట్టినారు.

నేనుకూడా ఆ రాక్షసుల అరవైవేలరథాలు కదలడానికి వీలులేకుండా పెక్కుచెట్లనూ బండరాళ్ళనూ దారికడ్డంగా పడేట్లుగా దివ్యాస్త్రాన్ని ప్రయోగించినాను. ఆ రాక్షసులు ‘మాయయుద్ధం చేయాల’ను కొన్నారు. తమ నగరంతోపాటుగా ఆకాశానికిఎగిరినారు. కాని నేను బాణాలు ప్రయోగించి వారిని పట్టణంతోసహా నేలమీదికి దించినాను.

వారి పరాక్రమాన్ని గ్రహించినాను. 'పాశుపతాస్త్రాన్ని ప్రయోగిస్తేకానీ లాభంలేద'నుకొన్నాను. ఎద్దుజెండా కలవాడున్నూ, చంద్రవంకను జుట్టులో ఆభరణంగా ధరించినవాడున్నూ, అయిన పరమేశ్వరుణ్ణి నామనసులో పాదుకొల్పుకొని, పాశుపతాస్త్రాన్ని ప్రయోగించినాను. మాతలిచూచి ఆనందించినాడు.

ఆ దివ్యాస్త్రప్రభావంవల్ల సింహాలూ, శరభాలూ, శార్దూలాలూ, శుండాలాలూ, మహిషాలూ, మహోక్షాలూ, యక్షులూ, రాక్షసులూ, పిశాచాలు, పన్నగాలూ, గంధర్వులూ, పుట్టి, రాక్షసులందరూ చంపబడినారు.

మోసాన్నీ దుర్గమను తొలగింపచేసి మిక్కిలి పరాక్రమంతో విజృంభించి పాశుపత్రాస్త్రాన్ని ప్రయోగించి ఈ విధంగా పౌలోములను కాలకేయులనూ సంహరించి యమపురికి పంపినాను.

అట్లా వాళ్ళందరినూ చంపి. వచ్చి ఇంద్రునికి మ్రొక్కినాను. ఇంద్రుడుకూడా నివాతకవచులు పౌలోములు కాలకేయులు నాచేత చంపబడడమంతా మాతలి చేతవిని, సంతోషించినాడు."

చ. **ఉరగఫణాగ్రరత్నకిరణోల్ల సదుగ్రభుజున్, వృషాంకు, శం**
**కరు, శశిఖండమండిత శిఖుండు శివున్, హృదయాంబుజంబునం**
**దిరముగ నిల్పి పాశుపతదివ్యశరం బరివోసి, యేసితిన్,**
**సురరిపుకోటిమీఁద, సురసూతుఁడు మాతలి చూచి మెచ్చఁగన్.** **4-83**

# 26. నహుషుని కథ.

**(అరణ్య 4-103 నుండి 132 వరకు.) (అజగరోపాఖ్యానం.)**
**(పాండవులు అరణ్యవాసం చేసేకాలంలో జరిగినకథ.)**

పాండవులందరూ అరణ్యావాసంచేసేకాలంలో ఒకనాడు భీముడొక్కడే వేటకుపోయినాడు. హిమాలయ శిఖరప్రాంతాలలోని అడవుల్లో వేటాడినాడు. వేటాడిఆడి, తిరిగితిరిగి, బాగా అలసిపోయినాడు. అప్పుడక్కడ ఒకపెద్దభయంకరమైన కొండచిలువను చూచినాడు. ఆ కొండచిలువ ఆహారంమీద కోరికతో బాగాతెరచిన గుహలాంటినోరు కలిగిఉంది. దాని ఆకారం యమునిలాగా భయంకరంగా ఉంది. ఆ కొండచిలువ తననిట్టూర్పులతో వదలినపొగ ఆ అడవిలోని చెట్లనూ, దట్టమైన పొదలనూ, భయంకరంగా బూడిదరంగులోనికి మార్చివేసింది. ఆ కొండచిలువ పసుపురంగులోఉంది. దానిచూపులు మిక్కిలి భయంకరంగాఉన్నాయి. అది గొప్ప పాపతేడు. అది ప్రపంచానికంతటికీ భయంకలిగిస్తూ ఉంది. దానికి చంద్రవంకకాంతులనుమించిన నాలుగువంకరకోరలున్నాయి.

ఆ పెద్దకొండచిలువ మాంసాహారంకోరి, అలసిపోయి తననుచూస్తున్న భీముణ్ణి పట్టుకొన్నది. భీముని రెండుచేతులను తననోటితోనూ, మిగతా శరీరాన్నంతా తనశరీరంతోనూ, బంధించింది. పది వేల ఏనుగుల బలంకలవాడైన భీముడిని ఆ పాము చుట్టుకోగా భీముడికి బలంలేకుండా పోయింది. కదలలేకుండా పోయినాడు భీముడు. ఆ పాము బలపరాక్రమాలకు ఆశ్చర్యపడినాడు. "ఇది సహజమైన పాముకాదు ఏదో ఒక అద్భుతరూపంగా ఉంది" అనుకొన్నాడు. దానితో ఇట్లా అన్నాడు.

"నేను భీముడను. పాండురాజు కుమారుణ్ణి. నిర్మలమైన ప్రకాశంకలిగిన ధర్మరాజుతమ్ముణ్ణి. వీరులైన పిశాచాలను, పాములను, యక్షులను, రాక్షసులను, యుద్ధాలలో పూనుకొని జయించిన గొప్ప వీరుణ్ణి. ఏనుగులను, సింహాలనూ, పట్టుకొని చీల్చిచంపే అంతులేనిభుజబలంకలిగినవాణ్ణి. ఇంతటి నన్ను పట్టుకొని ఈ విధంగా బంధించగలిగిన శక్తి నీకెట్లా వచ్చింది? ఇది నీ సహజమైన శక్తియేనా?లేక ఏదైనా వరంవల్ల వచ్చిందా? చెప్పు." ఇట్లా భీముడడుగగా ఆ కొండ చిలువ విన్నది. అది పశు పక్ష్యాదులకు చెందినదే అయినా, తన పూర్వజన్మజ్ఞానం చెడిపోకుండా వరంపొంది ఉండడంవల్ల అది మనుష్య భాషలో భీమునితో ఇట్లా అన్నది.

"ఇది నా సహజశక్తికాదు. ఈ శక్తి నాకు వరంవల్ల వచ్చింది. ఎంతటి బలసంపద కలిగిన వారైనా, ఈ అడవిలో నన్నెదిరిస్తే బలహీనులవుతారు.ఎదుటపడినదాన్ని దేన్నీ నేను వదలను. పులులు, శరభాలూ, ఏనుగులు, మొదలైన అన్నిరకాల జంతువులనూపట్టుకొని తింటూఉండేనాకు, పాండుపుత్రా! నీవు ఈనాడు

ఆహారమైనావు. నేనొకప్పుడు ఇంద్ర పదవిని పొందినవాడను. అప్పుడు మంచిబ్రాహ్మణులకు అవమానం చేసినాను. ఎక్కువైన గర్వంతో ఇట్లాఅయినాను. నేను అవమానించిన బ్రాహ్మణులలో ఒకమునిశాపశక్తి, నామునుపటిశక్తినంతా నశింపచేసింది." ఇట్లా అంటూ ఆ పాము దుఃఖపడింది.

అప్పుడు భీముడు ఆ పాముతో ఇట్లాఅన్నాడు. "దుఃఖం కలిగినప్పుడు తన్ను తానునిందించుకోవడం భావ్యమా? ఎప్పుడైనా, ఎక్కడైనా, సుఖమైనా, దుఃఖమైనా, మనసును ఒకేరీతిలో ఉంచుకోవడంమాత్రమే సుమా! పురుషార్థము. మనుష్యప్రయత్నంచేత విధివిలాసాన్ని ఎవరైనా తప్పించగలరా? నేను మహాబల వంతుడనై ఉండికూడా నీవుపట్టుకుంటే ఇట్లాఅయిపోయినానుకదా? అయినా నేనుచావడానికి చింతపడడంలేదు. రాజ్యాన్ని పోగొట్టుకొని సులభంగా నడవడానికి వీలులేని ఈ కొండచరియల్లో తిరుగుతూఉన్న నాసోదరులు నన్నుకానక 'ఎంతచింతిస్తారో' అని దుఃఖిస్తున్నాను".

భీముడిట్లాఅంటున్న సమయంలోనే అక్కడ ధర్మరాజు తీవ్రమైన నక్కకూత విని, మిక్కిలి సందేహించి నాడు. అంతలోనే తన కుడిభుజ మదరడం చూచి, 'కీడుకలిగినా తుదకు మేలేకలుగుతుంద'ని భావించినాడు. వెంటనే తమ్ములందరూ 'ఉన్నారోలేరో న'నికలయచూచినాడు. తమ్ములమధ్యలో భీముడుకనిపించలేదు అర్జునుణ్ణి నకులసహదేవులనూ ద్రౌపదిని రక్షించడానికి ఉంచి, ధౌమ్యుడు మొదలైన బ్రాహ్మణులతో భీముణ్ణి వెతుకుతూ ధర్మరాజు బయలుదేరినాడు. అందమైననాగలి. వజ్రాయుధం, కలశం, పద్మం మొదలైనలక్షణాలుకలిగిన భీముని కాలిగుర్తులు దారిలోని దుమ్ములో కనిపించినాయి. వాటిని భీముని పాదముద్రలుగా గుర్తించి, వాటి వెంటనే వెతుకుతూ వేగంగా పోయినారు. ఎదురుగా కొండలాగా ఉండే పాము చుట్టుకొని కదలలేకుండా బాగాఅలసిపోయిఉన్న భీముణ్ణి చూచినాడు. అట్లాచూచి ధర్మరాజు మనసులో, "ఈ భీముడు ఒకపాము చేతకదలకుండా బలంతగ్గిపోయి సాధారణ మానవుడిలాగా శక్తిలేకుండా ఇట్లాఉన్నాడు. ఇదేమి ఆశ్చర్యమో!" అనుకొన్నాడు. ఆ స్థితిలో "అయ్యా! నీవు పామురూపం ధరించిన రాక్షసుడివా? లేక దేవతవా? చెప్పు. నేను ధర్మరాజును. నిన్నడుగుతూ ఉన్నాను. ఈ మహాభుజబలం కలిగిన నా తమ్ముణ్ణి మాంసంకోసం పట్టుకొనిఉంటే, నీ ఆకలితీరడానికి సరిపోయేంత జంతుమాంసాన్ని ఇస్తాను. ఈ భీముణ్ణి వదులు" అన్నాడు.

అందుకు సమాధానంగా ఆ పాము ధర్మరాజుతో ఇట్లాఅన్నది. "పుణ్యాత్మా! వినవయ్యా! నేను 'నహుషుడ'నే రాజును. మీవంశంలో మీకు ముందు పుట్టినవారి కంటే ముందుపుట్టినవాడను. ఇంద్రునికి సమానమైనవాడను. ఐశ్వర్యగర్వంతో ఉత్తమమార్గాన్నివిడిచి వివేకంచెడిపోయి వేయిమందిఉత్తమ బ్రాహ్మణులు పూన్చబడిన బ్రహ్మరథాన్ని ఎక్కినాను. బ్రాహ్మణులకు ఆశ్చర్యకరమైన అవమానంచేసినాను. నా మీద

అగస్త్యుడుకోపగించుకొన్నాడు. 'మిక్కిలి భయంకరమైనపాముపు కమ్మ'ని శపించినాడు. ఆ ముని శ్రేష్ఠుని శాపంవల్ల ఆ నాటినుండి ఈ విధంగా కష్టపడుతూఉన్నాను. విధివిలాస మహిమను నీకు ఏ విధంగా వర్ణించిచెప్పగలను? వేదాలన్నీ చదివినాను. నూరు యజ్ఞాలు చక్కగాచేసినాను. దేవేంద్ర పదవినికూడా పొందినాను. చెడుగర్వంతో తుదకు పెద్దపామునై మిక్కిలి దుఃఖపడుతూఉన్నాను. సుఖాన్ని కలిగించడానికి కానీ, దుఃఖాన్ని కలిగించడానికి కానీ, బలం కలిగిన దైవానికి ఏం బరువు? చెప్పు. ఆ అగస్త్యునిచేత శాపంపొంది ఇంద్రత్వం పోగొట్టుకొని ఇక్కడకు వస్తూఉండి, 'మునీంద్రా! నేను పామునైన తరువాత ఇప్పటి విషయాలు గుర్తుండేంట్లున్నూ, బలమైన జంతువులు నన్ను తాకగానే బలం కోల్పోయి నాకు ఆహారమయ్యేట్లున్నూ, నాకు శాపంనుండి విడుదలకు ఉపాయాన్నీ ప్రసాదించు.' అని చేతులు జోడించిఉన్న నామీద దయతలచి, ఆ మునిశ్రేష్ఠుడు నేను కోరినవరాలిచ్చి ఇంకా, 'అయ్యా! నీవు వరసగా వేసే ప్రశ్నలకు సరియైనసమాధానాలు ఎవడుగొప్ప బుద్ధితో చెప్పుతాడో వాడివల్ల నీ శాపంతీరుతుంది. అయితే అది చాలకాలానికి కానికాదు.' అన్నాడు. నేనుకూడ ఆయనమాటల ననుసరించి చాలాకాలం నుండి ఈ అడవిలో ఉన్నాను. ఈనాడు నీ తమ్ముడు నాకాహారంగా దొరకినాడు. చేతనైతే నా ప్రశ్నలకు సమాధానాలుచెప్పి నీ తమ్ముణ్ణి విడిపించుకో."

ఇట్లాఅన్న నహుషునితో ధర్మరాజు "బుద్ధిమంతుడా! నీవడిగే ప్రశ్నలకు తగినసమాధానాలు చెప్పడానికి బ్రాహ్మణులకు సాధ్యమౌవుతుంది కానీ, ఎంత తెలివికలవారైనా ఇతరులకు సాధ్యమౌతుందా? అయినా నాకు చేతనైనంతలోచెప్తాను. అడుగు." అన్నాడు. అప్పుడు ఆ అజగరము ఇట్లాఅడిగింది.

"గొప్పవాడా! ఏగుణాలు కలవాడు బ్రాహ్మణుడు? ఆ బ్రాహ్మణుడు తెలుసు కోవలసినదేది? దాన్ని నాకుచెప్పు."

ధర్మరాజు అందుకు సమాధానము ఈ విధముగా చెప్పినాడు. "సత్యమూ, క్షమా, శౌచము, దయ, తపస్సు, దానం, శీలం, ఇవన్నీ ఎవరిలోకనిపిస్తాయో వాడేబ్రాహ్మణుడు. సుఖంకలిగినా దుఃఖం కలిగినా సమంగాఅనుభవించగలగడమే ఈ బ్రాహ్మణుడు తెలుసుకోదగినగొప్పవిద్య".

ఈ సమాధానం విని అజగరము తిరిగి ఇట్లా ప్రశ్నించింది. "నీవు చెప్పిన గుణాలూ సత్ప్రవర్తనా శూద్రునియందుఉంటే అతడు ఉత్తమబ్రాహ్మణుడుకాగలడా? అట్లాగైతే ఇంక ఎవరినైనా 'బ్రాహ్మణులు క్షత్రియులూ, వైశ్యూలూ, శూద్రులూ,' అని ఏవిధంగా నిర్ణయించడానికి వీలవుతుంది? 'హీనులు గొప్ప వారు అనే విచక్షణ అర్థంలేనిదవుతుందికదా?"

అందుకు ధర్మరాజుతిరిగి ఇట్లాసమాధానం చెప్పినాడు "ప్రమాదాలు సంభవించినప్పుడు వర్ణసంకరంజరిగితే వర్ణాలను నిర్ణయించడానికి వేరువేరు ప్రవర్తనలనూ, గుణాలనూ స్వాయంభువు నిర్ణయించినాడు. అంతేకాని సాధారణపరిస్థితులలో సత్యంమొదలైన మంచిగుణాలున్నప్పటికీ శూద్రకులంలో జన్మించినవాడు మంచిశూద్రుడవుతాడేకానీ, బ్రాహ్మణుడుకాలేడు. కానీ ఆ మంచి గుణాలు లేకపోతే బ్రాహ్మణకులంలో పుట్టినవాడుకూడా శూద్రుడే. అందువల్ల నడవడిక చాలాగొప్పది. 'మంచి నడవడికకలవాడు ఇంకా అనేక సుగుణాలు కలిగినవాడ'వుతాడు. 'చెడు నడవడిక కలిగినవాడు ఎప్పటికీ హీనుడే అవుతాడు' అంటారు. కాబట్టి ధర్మాన్నికాపాడడంకంటె మనిషికి తననడవడికను కాపాడుకోవడం ముఖ్యం".

ఆ సమాధానం విన్నవెంటనే అజగరం తిరిగిఇట్లాఅన్నది. "పుణ్యాత్మా! 'హింసచేయని మహాత్ముడు ఇతరులకపకారం చేసినా, అబద్ధం చెప్పినాకూడా పుణ్యాలోకాలకు పోతాడు' అంటారు. అహింస ఇంత మహిమకలది ఎట్లాఅయింది? చెప్పు".

అందుకు ధర్మరాజు ఇట్లా సమాధాన మిచ్చినాడు. "దానంచేయడం, ఒకరి కిష్టమైనపనిచేయడం, సత్యము మాట్లాడడం, అహింస అనే ఈ నాలుగు ధర్మాలు సమానమైనవే అయినా అందులో అహింస విశేషమైనది. అది ఎట్లాఅంటే, మనిషి దానముమొదలైన మంచిగుణాలుకలిగి అహింసాపరుడైతే మరుజన్మలో దేవతఅయి పుడతాడు. అదే మనిషి దానంమొదలైన మంచి గుణాలు ఉండికూడా, హింసా పరుడైతే, పశుపక్ష్యాది జన్మను పొందుతాడు".

ఈవిధంగా అజగరము తాను అడిగిన ప్రశ్న లన్నింటికీ సరియైన సమాధానాలు చెప్పిన ధర్మరాజు పైన మిక్కిలిప్రేమతో భీముణ్ణివదలివేసింది. నహుషునిశాపంకూడా తీరిపోయింది. పాము దివ్యపురుషుడుగా మారినాడు. ధర్మరాజు భీముణ్ణి తీసికొని తమ ఆశ్రమానికిపోయినాడు.

**నీతి :** గర్వము మంచిదికాదు.

**మధ్యాక్కర :**

**పదివేల గజముల బలము గలవాఁడు పౌలస్త్యుతోడఁ**
**గదనంబు సేసి, యనేక యక్షరాక్షసుల నిర్జించి,**
**యుదితశౌర్యోన్నతుం డైనవాఁడు, వృకోదరుఁడేల**
**పదపడి నిగృహీతుఁడయ్యెఁదా నొక్కపన్న గుచేత?** **4-102**

# 27. సత్యాద్రౌపదీసంవాదం.

**(అరణ్య 4-147 నుండి 167 మరియు 5-290 నుండి 324 వరకు.)**

**(పాండవులు అరణ్యవాసంలోఉండగా ఒకసారి పాండవులనుచూడదానికి శ్రీకృష్ణుడు సత్యభామతోకూడా వచ్చినాడు. అప్పుడక్కడ ద్రౌపదీ సత్యభామలమధ్య జరిగిన సంవాదమిది.)**

పాండవులు అరణ్యవాసంలో ఉండగా ఒకశరత్కాలంలో వారు సరస్వతీ నదీతీరంలో స్నానాలుచేస్తూ, ఆ నదీ జలాలుత్రాగుతూ, సంతోషంతో ఆ మరుదేశంలో కొన్నాళ్ళుగడపినారు. ఆ తరువాత తిరిగి కామ్యకవనంచేరుకొన్నారు.

ఆ కామ్యకవనంలో ఒకనాడు ధర్మరాజు విప్రసభలో కూర్చొని ఉండినాడు. అప్పుడక్కడకు అర్జునుని మిత్రుడైన ఒక బ్రాహ్మణుడు వచ్చినాడు. విప్రసభలో కూర్చునిఉన్న ధర్మరాజును ప్రీతితో చూచి ఇట్లాఅన్నాడు.

"రాజశ్రేష్ఠా! నీవు, నీతమ్ములు ప్రీతిగా ఈ అడవిలో ఉండడం శ్రీకృష్ణుడు తెలుసుకొన్నాడు. గొప్ప తేజస్సుతో వెలిగిపోయే పుణ్యాత్ముడైనఆయన, మిమ్మల్ని చూడడానికి ఇదిగో వస్తున్నాడు. అతడు మీకు స్నేహితుడై ఎప్పుడూ మీ హితమే కోరుతూఉంటాడు. అంతేకాదు పెక్కువేలయుగాలుజీవించినవాడూ, గొప్పతపస్సుచేత ప్రకాశించేవాడూఅయిన మార్కండేయమహర్షి కూడా, మిమ్మల్ని చూడడానికి ఈ క్షణమే వస్తున్నాడు".

ఆ బ్రాహ్మణుడు ఇట్లాచెప్పిన, తరువాత ఒకముహూర్త కాలంలోనే శ్రీకృష్ణుడు సత్యభామతో పాటుగా అక్కడకు వచ్చినాడు. శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి వరలాభాన్నిగురించి అభినందించినాడు. వా రట్లా మాట్లాడుకుంటూఉండగానే, మార్కండేయమహర్షి అక్కడకువచ్చినాడు. శ్రీకృష్ణుడూ పాండవులూ కూడా ఆయననుఆహ్వానించినారు. ఆతరువాత శ్రీకృష్ణుడు మార్కండేయుణ్ణి, "దేవతల, రాజుల, బ్రాహ్మణుల వృత్తాంతాలనూ, పతివ్రతల కథలనూ చెప్పండి". అని అడిగినాడు. శ్రీకృష్ణుడు అట్లా అడుగుతూ ఉండగానే నారదు డక్కడకువచ్చినాడు. అందరూలేచి ఎదురుగాపోయి ఆయనకు నమస్కరించినారు. ఆయనను సత్కరించినారు. అప్పు డానారదుడు మార్కండేయుణ్ణి చూచి, "కృష్ణునికి పాండవులకు సంతోషంకలిగేవిధంగా గొప్పపుణ్యకథలు చెప్పు". అని చెప్పి, అందరికీ వీడ్కోలుచెప్పి, తనఇష్టం వచ్చిన విధంగా పోయినాడు.

ఆ తరువాత మార్కండేయుడు ధర్మరాజుకు 1. బ్రాహ్మణప్రభావం 2. అత్రీ గౌతముల సంవాదం 3. వైవస్వతునికథ 4. ప్రళయ ప్రకారం 5. తపస్సు యొక్క ప్రభావం 6. కలియుగధర్మాలు 7. కల్కి అవతారం 8. పరీక్షిత్తు సుశోభనలకథ 9. వామదేవునికథ 10. ఇంద్రద్యుమ్నుని కథ 11. కువలాశ్వచరిత్ర 12. మధుకైటభుల చరిత్ర 13. పుత్రలక్షణాలు 14. ధర్మవ్యాధుని కథ 15. అంగిరసుడు అగ్నికావడం

16. కుమారస్వామి కథ మొదలైన కథలన్నీ చెప్పినాడు. పాండవులు శ్రీకృష్ణునితోసహా ఆ కథలను విన్నారు. మిక్కిలి సంతోషించినారు. మార్కండేయ మహర్షిని పొగడినారు వారీవిధంగా కోరినకథలువింటూ కాలక్షేపంచేస్తూఉండినారు.

ఆ సమయంలో శ్రీకృష్ణునిభార్య సత్యభామాదేవీ ద్రౌపదీదేవీ కలసి వనవిహారంచేస్తూ ఉండినారు. మాటల సందర్భములో సత్యభామ ద్రౌపదితో ఇట్లాఅన్నది. "ఓ పద్మాక్షీ! నీ భర్తలు అయిదుగురూ నీయందు మిక్కిలిఅనురాగం కలిగిఉన్నారు. వారు ఒకరినిమించిఒకరు నీ మీద ప్రేమకురిపిస్తూ ఉంటారు. వారందరిపైన నీవుకూడా సమానమైన అసక్తికలిగిఉంటావు. వారందరూ వెలిగిపోయే తేజస్సు కలిగినవారు. పరిశుద్ధమైన శీలంకలవారు. దిక్పాలకులతో సమానులైనవారు. అట్లాంటి వారందరూ నీమీద ప్రేమతో నవ్వుతూఉంటారేకాని ఎప్పుడూ కోపగించుకోరు. ఇదంతా గొప్పవింత. ఇట్లాంటి అద్భుతమైనమహిమ నీకెట్లాచేకూరింది? ఏవైనాగొప్పనోములు నోచినావా? మంత్రతంత్రాలు నేర్చుకొన్నావా? మందులుమాకులూ ఉపయోగించినావా? వస్త్రాది అలంకరణలలో నేర్పరితనం వల్లనా? గొప్పతెలివితేటలవల్లనా? ఇటువంటి నీవిశేషసౌభాగ్యానికి కారణం నాకుచెప్పు. నేనుకూడా నిజంగా ఈ విషయమంతా తెలుసుకొని శ్రీకృష్ణుణ్ణి లోబరచుకొని మిక్కుటమైన సౌఖ్యానుభవాన్ని పొందుతాను".

ఇట్లా అడిగిన సత్యభామపై ద్రౌపదికి కొద్దిగా కోపంకలిగింది. అయినా దాన్ని ఆమె అణచివేసు కొన్నది. మెత్తనిచిరునవ్వు ముఖంతో, సత్యభామను చూచింది. తన కోపాన్ని ముఖంలో కనిపించనీయలేదు. ఆమెతో ఇట్లాఅన్నది. "నన్ను ఈ విధంగా చెడ్డస్త్రీలలాగా అనుకోవడంతగునా? ఓ పద్మాక్షీ! నామనసుకు ఒప్పుదల కావడంలేదు. శ్రీకృష్ణునిభార్యగా ఉండడానికి నీవుతగవు". అనిఎగతాలిగా మాట్లాడినట్లు మాట్లాడింది. ఆమె తెలివితక్కువతనాన్ని తెలిసేట్లుచేసింది. ఇంకాఇట్లాఅన్నది.

"ఓ సత్యభామా! మంత్రతంత్రాలతో, మందులుమాకులతో 'భర్తవశుడవుతాడ'నుకోవడం తెలివి తక్కువతనమే. దానివల్ల భార్యపై భర్తకు అంతకుముందున్నప్రేమకూడానశిస్తుంది. ఎటువంటి ఉపయోగమూఉండదు. భర్త ఈ విషయం తెలుసుకుంటే అట్లాంటి భార్యతోకాపురం 'పాముతోచెలిమిచేయడం వంటిది.' అనుకుంటాడు. స్త్రీలు భర్తను వశంచేసికొనేందుకు ఉపయోగించే మందులూ, మాకులూ, వికటించి మగనికి రోగాలను కలిగిస్తాయి. మూగతనం, బుద్ధిమందగించడం, మొదలైనవి కలుగుతాయి. ఆ పాపాలు తనచేసిన చేతలై జగత్తుకంతా తెలిసిపోతుంది. నిందలూ, నరకయాతన ఆమెకుకలుగుతాయి. కాబట్టి భర్తలకెప్పుడూ మోసపుపనులు చేయకూడదు. భర్త అభిప్రాయాన్ని తెలుసుకొని, అనుకూలంగా ప్రవర్తిస్తే, దానివల్ల అన్నీ జరుగుతాయి". అనిచెప్పి ఇంకాఇట్లాఅన్నది.

"పాండవులపట్ల నేను ఎట్లావ్యవహరించి ఇటువంటి సౌభాగ్యాన్ని పొందినానో చెప్తాను. స్పష్టంగా విను. భర్తలు అన్యకాంతలపై అనురక్తులై వారినికూడినప్పటికీ, వారిపై నేనుఅలగను. ఎప్పుడూ అహంకారాన్ని చూపను. గర్వాన్నీ పొరపాటునూ లేకుండాఉంటాను. భర్తలనే మనస్సులో ఏకాగ్రంగా నిలుపుకుంటాను. ఎల్లవేళలా భక్తితో వారికిపరిచర్యలు చేస్తాను. ఎప్పుడుకూడా వింతచూపులుచూడను. వింతపనులుచేయను. వింతమాటలుమాట్లాడను. వింతకోర్కెలుకోరను. పరపురుషులు, దేవతలైనా సరే, యక్షులైనా సరే, వారిని గడ్డిపోచతో సమానంగా చూస్తాను. స్నానం, భోజనం, శయనం, మున్నగు సౌకర్యాలను భర్తలకంటె ముందుగా అనుభవించను. భర్తలువస్తే ఆసనాన్ని కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళను ఇవ్వడంలాంటి పనులను భక్తితో నేనే చేస్తాను. ఇతరు లెవ్వరినీ ఆ పనులకై నియోగించను. తగిన వేళలకు పద్ధతిప్రకారం స్నానం భోజనం తగినట్లుగా ఏర్పాటుచేస్తాను. ధనధాన్యాలను ఊరకే వృథాకావడానికి ఎప్పుడూఓర్చుకొనను. ఇంటినీ పాత్రలనూ చక్కగా శుభ్రంచేయడం, ఎప్పుడూ ఏమారను. బంధువులందరికీ ఆనందంకలిగిస్తాను". ఇట్లాచెప్పి అంతటితో మానకుండా ఇంకాఇట్లాచెప్పింది.

"సత్యా ! మాటిమాటికి తలవాకిలి వద్దతిరగడం, చెడుస్త్రీలతో స్నేహంచేయడం, వాదులాడడానికి పూనుకోవడం, నవ్వుమాటలతో పెద్దగానవ్వడం నాకుఇష్టంలేని పనులు. భర్తలు తమ ఇష్ట ప్రకారమః వేరే గ్రామాలకుపోతే, నేను పువ్వులుముడువను. పరిమళపు మైపూతలు పూసుకొనను. ప్రకాశించే ఆభరణాలను ధరించను. భర్తలపట్లనే మనసునులగ్నం చేసికొని ఉంటాను. 'వారెప్పుడు వస్తారా?' అని వారి రాకకై ఎదురుచూస్తూఉంటాను".

"ఇంక అత్తగారిపై పూజ్యభావంకలిగిఉంటాను. ఆమె చెప్పినరీతిగానే నాదినచర్యను నడుపుతాను. పెద్దలు, బ్రాహ్మణులు, అతిథులు, వచ్చినప్పుడు వారిసేవలకు అనుచరులను నియోగించను. 'పూజ్యభావం, మంచితనం,' అనే శుభలక్షణాలను ఎప్పుడూవిడువను. పాండవులు బహుమెత్తనివారు. అయినా వారిపట్ల భయంలేకుండా ఎప్పుడూప్రవర్తించను. వారికే కోపంవస్తే 'సాములలాగా క్రూరంగా ప్రవర్తిస్తార'నుకొని భయాన్నివదిలిపెట్టకుండా వారికి సేవలుచేస్తూ ఉంటాను. మా అత్త కుంతీదేవి భూదేవి లాంటిది. ఆమెకు స్నానం, భోజనం మొదలైన సదుపాయాలను స్వయంగా నేనే చేసి ఆమెను సంతోషపెడతాను". అనిచెప్పి, ఇంకా ఈవిధంగా చెప్పింది.

"ప్రజలచేత ఆరాధింపబడేధర్మరాజు ప్రతిదినం భోజనసమయాన తనసహపంక్తిని ఎనిమిది వేలమంది మిక్కిలి పుణ్యాత్ములైన బ్రాహ్మణులకూ, ఇంకా గొప్పగాప్రకాశించే పదివేలమందియతులకూ అన్నసంతర్పణం చేస్తాడు. వారందరికీ ప్రతిదినం అన్నమూ, నీళ్ళూ, అర్ఘ్యల సహాయంతో నేనే స్వయంగా సమకూరుస్తాను. వారందరికీ బట్టలూ, నగలూ, సంతోషంగా నేనే ఏర్పాటుచేస్తాను. ఇంకా ధర్మరాజు నగరంలో, బంగారునగలతో కూడిన లక్షమంది సేవకులు రాత్రీ పగలూ పాత్రలను పట్టుకొని అభ్యాగతులకు భోజనాలు

ఏర్పాటు చేస్తూఉంటారు. వీరంతా ఎట్లా జాగ్రత్తగా ఉన్నారో, ఏ ఉపచారాలు చేస్తున్నారో? ఏఅపచారాలు చేస్తున్నారో? నేనే స్వయంగా తెలుసుకుంటూఉంటాను. ఎల్లప్పుడు మదజలంస్రవించే పట్టపుటేనుగులు లక్షఉండేవి. గొప్పబలం వేగంగల మేలైనగుర్రాలుకూడా లక్షఉండేవి. వాటన్నింటికీ నిత్యం తగినతిండి పెట్టడానికీ సాకడానికీ తగినవారిని నేనే నియమిస్తాను. బొక్కసంలోఉండే రత్నరాసులు బంగారువస్తువులు నిత్యంజరిగే ఆదాయవ్యయాలుఅన్నీ నాకుతెలుసు. చివరిశ్రేణికిచెందిన గొల్ల వారివరకూ కల అందరుసేవకులజీతభత్యాలను నేను గమనించినడుపుతాను. గొప్పకీర్తిమంతులైన పాండవులు తమసంసార భారాన్నంతా నామీదపెట్టి హాయిగా తమకిష్టమైనచోట్ల తిరుగుతూఉంటారు. నేను అన్నివిషయాల్లోను జాగ్రత్తగా ఉంటాను. పద్మాక్షీ! పరిపాలనయొక్క పనులతో నాకు తిండితినడానికి, నిద్రపోవడానికి ఎల్లప్పుడూ వీలుకావడం లేదుసుమా! అందుకని తెల్లవారుజామున మాత్రమే నిద్రపోతాను. ఈ ప్రవర్తనవల్ల ఎప్పుడూ పాండవులు నన్నభిమానంతో చూస్తున్నారు. కానీ నీవుచెప్పే మందులూ మాకులూ ఇంద్రజాలాలూ నాకుతెలియవు".

ద్రౌపది ఇట్లావివరించిచెప్పగావిన్న సత్యభామ, సిగ్గు పడింది. ఆమెతో ఇట్లాఅన్నది "ఓ ద్రౌపదీ! నేను తెలియక అట్లాఅడిగినాను. నా అజ్ఞానాన్ని క్షమించు. దీన్ని పరిహాసంగానే స్వీకరించు. నీప్రవర్తనలోని గొప్పతనం భూమిపై మంచివారిచేత పొగడబడుతుంది".

ఆ మాటలువిన్న ద్రౌపది, ముఖంలోనికి చిరునవ్వు తెచ్చుకొని, "నిజంగా అదిఅంతేలే". అని చెప్పి, ఇంకా ఇట్లాఅన్నది. "భర్త మనస్సును ఆకర్షించే చతురమైనఉపాయాన్ని నీకుసందేహంలేకుండా ఉండేలాగున చెప్తాను. విను. ఆ ఉపాయం చాలగొప్పది. ధర్మంతో కూడినది. మంచి నడవడికతో కూడినది. భర్తభార్యపై దయతలిస్తే ప్రకాశించే ఆభరణాలు, వస్త్రాలు, ధనము, ధాన్యము, గౌరవం, మంచిసంతానం, కీర్తి, పుణ్యం, కలుగుతాయి. ఎన్నివిధాల ఆలోచించినా భార్యకు వేరేవిధంగా అవి కలుగుతాయా? ఎంతో కష్టపడితేకానీ కొంచెం సుఖంకలుగదు. ధర్మంవల్ల కలిగేపదవికూడా సులభంగా లభించదు. కానీ భర్తకు సేవచేస్తే, ఎల్లప్పుడూ శుభమేకలుగుతుంది. ధర్మంకూడా లభిస్తుంది. కాబట్టి ఎప్పుడూ సరియైనబుద్ధి, ప్రేమ, ఉపాయం, భక్తి, ప్రీతి, భర్తపైకనబరచు. నీ భర్తమదినీ భావాన్నీ తెలిసికొని నీవు ప్రవర్తిస్తే, నీ భర్త నిన్నుమరుగుతాడు. శ్రీ కృష్ణుడు నీఇంటి వాకిటిదగ్గరకు వచ్చినాడని వినగానే లేచి తొట్రుపాటుతో ఎదురేగు. అతడే నీఅంతః పురంలోనికి ప్రవేశిస్తే ఆసనము ఏర్పాటుచేయడము మొదలైనపనులు చేయడానికి 'తగినవారిని నియమించినాను కదా?' అని ఊరకుండకుండా, నీవే తగినట్లుగా అన్నీచేసి ఆయనను సంతోషపెట్టు. శ్రీకృష్ణుడు మిక్కిలిప్రేమతో చెప్పిన మాటలేవైనాఉంటే, నీ మనస్సుకు నచ్చినవారికికూడా ఎప్పుడూచెప్పవద్దు. నీ సవతులకు ఈ విషయంతెలిస్తే, వానిని ఇంకొకవిధంగా మారుస్తారు. అందువల్ల కృష్ణునిబుద్ధి నీపైన

ప్రేమలేనిదవుతుంది. భర్తకు ఇష్టులైన బంధువులకు మిత్రులకు భోజనం మొదలైన సత్కారాలుచేస్తూ స్వచ్ఛమైనభక్తితో ఎప్పుడూజాగ్రత్తగాప్రవర్తించు. నీభర్తమేలుకు వ్యతిరేకమైన ప్రవర్తనకలవారు, నీకు మంచిమిత్రులైనా, ఎప్పుడూ వారినిఆదరించవద్దు. విను. 'ప్రద్యుమ్నుడు మొదలైన కుమారులతోనైనా ఒంటరిగా ఒకేఆసనంపైఉండడం 'నీకుమంచిది కాద'ని తెలుసుకో. ఆడువారి నడవడికలు చాలా కష్టపడి అవలంబించ వలసినవి. మంచికులంలో పుట్టినస్త్రీలతో, స్వచ్ఛమైన బుద్ధికలస్త్రీలతో, పతివ్రతలతో, స్నేహంచేయి. చెడ్డప్రవర్తనకల స్త్రీలతో కలిసిమెలసిఉండడంమానుకో. ఇది నీకు గొప్పసౌభాగ్యం కలిగించేఉపాయం".

ఇదంతావిని సత్యభామ సంతృప్తిచెందిన మనస్సుతో ఇట్లాఅన్నది. "పద్మాక్షీ! ద్రౌపదీ! నీవు ధర్మం తెలిసినదానవు. నీ భర్తలు దేవతలతో సమానమైనవారు. 'గొప్పకీర్తి' అనేధనం ఉన్నవారు. ధైర్యం, తేజస్సు, బలం, శౌర్యం, అధికంగాకలవారు. కాబట్టి వారికెట్లాగైనా ఆలస్యంలేకుండా రాజ్యంవస్తుంది. మీకు లోకాలన్నీ నిందించే దుర్యోధనుడు కీడుచేసినాడు. అతనిభార్యలు దిక్కులేక కష్టాలతో పొక్కిపోతూ ఉండడంచూచి, నీవు ఆనందిస్తావు. మిక్కిలినిర్మలమైన మనస్సులుకలిగిన శౌర్యవంతులయిన కొడుకులనుకన్న మంచిగుణాలుకలదానవు నీవు. మనస్సులో దుఃఖంవద్దు. ప్రతివింధ్యుడు మొదలైన నీఅయిదుగురు కొడుకులూ ఇప్పుడేవచ్చి ద్వారకలో ఉన్నారు. వారి కెందులోనూకొరతలేదు. రుక్మిణి, సుభద్ర, ఇంకా ఇతరులు ఆ కుమారులను తమ కొడుకులకంటే మిక్కిలి ముద్దుచేస్తూఉన్నారు. వారి విషయంలో నీవు నిశ్చింతగాఉండు".

ఆ సమయంలో శ్రీకృష్ణుడు పాండవులవద్ద వీడ్కోలుపొంది ద్వారకకు పోవడానికి సిద్ధమయి నాడు. సత్యభామ ద్రౌపదిని కౌగిలించుకొని, గౌరవంగా వీడ్కోలుపొందింది. ఆతరువాత శ్రీకృష్ణుడు సత్యభామను తీసుకొని రథమెక్కి ద్వారకకు పోయినాడు.

**నీతి :** సత్ప్రవర్తనా పాతివ్రత్యమూ స్త్రీకి శోభనిస్తాయి.

**క.** **నను నిట్లు దుష్టవనితా । జనమునటులుగాఁ దలంపఁ జనునే నీకున్?**
**మన సొప్పదు; పురుషోత్తము వనితవుగాఁ దగవు నీవు వనరుహనయనా!** **4-294**

**చ.** **'అలయక మంత్ర తంత్ర వివిధౌషధ భంగులఁజేసి యెంతయున్**
**వలతురు నాథులంట మగువా । కడుబేలతనంబు; దాన మున్**
**గలిగిన ప్రేమయుం బొలియుఁగాని యొకండును సిద్ధిఁబొంద; ద**
**ప్పొలఁతుక తోడిమన్కి యహిపొత్తుగఁ జూచు విభుం డెఱింగినన్.** **4-296**

# 28. ధుంధుమారుడి కథ.

**(అరణ్య పర్వము చతుర్థాశ్వాసము 181నుండి 191 పద్యాలు.)**
**(పాండవులు అరణ్యవాసముచేసే సమయంలో మార్కండేయుడు ధర్మరాజుకు చెప్పినకథలలో ఇదిఒకటి.)**

పూర్వమొకప్పుడు 'ధుంధుమారుడ'నే రాజకుమారు దుండేవాడు. అతడు హైహయవంశానికి చెందినవాడు. ఒకనాడతడు అడవికి వేటకుపోయినాడు. అతడు వేటాడుతూఉండగా పొదలమాటున అతనికి ఒకజింక కనిపించింది. కనిపించడమే ఆలస్యమన్నట్లుగా బాణంప్రయోగించినాడు. "జింక చచ్చి ఉంటుంది. చూద్దాము" అనుకొని దగ్గరకు పోయినాడు. కానీ అక్కడ కనిపించింది జింకశవంకాదు. జింకచర్మం కట్టుకొనిఉండిన ఒకబ్రాహ్మణుడిశవం. ధుంధుమారుడు బ్రాహ్మణుని శవాన్నిచూచి చాలా దుఃఖించినాడు. 'పాపం చేసినాన'ని బాధపడినాడు. రాజధానికి పరుగెత్తినాడు. అక్కడ పెద్దలందరకూ విషయం చెప్పినాడు. వారిని తోడుతీసుకొనివచ్చి, అడవిలోని బ్రాహ్మణునిశవాన్ని చూపినాడు. వాళ్ళంతా బ్రాహ్మణుని శవాన్నిచూచి దుఃఖపడినారు. తరువాత దగ్గరలోని మునిఆశ్రమానికి పోయినారు. అక్కడఉండే 'తార్క్ష్యుడు' అనే మునిని దర్శించినారు. భక్తితో నమస్కరించినారు.

ఆ నమస్కారాలనందుకొన్న ఆ పుణ్యాత్ముడు వారినిఆశీర్వదించినాడు. తగినట్లుగా వారిని 'సత్కరించుమ'ని శిష్యులను ఆజ్ఞాపించినాడు. కానీ వారాసత్కారాలను అందుకోలేదు. వారంతా ఆ మునీశ్వరునికి సాష్టాంగ నమస్కారములు చేసి, "మహాత్మా! ఈ మాపిల్లవాడు వేటమీద ఆసక్తితో ఈ అడవికి ఇంతకుముందు వచ్చినాడు. ఇక్కడ జింకచర్మం ధరించిన ఒకబ్రాహ్మణుణ్ణి పొదలమాటున ఉండగా చూచినాడు. 'జింక' అనుకొని భ్రమపడి బాణప్రయోగం చేసినాడు. ఆ బ్రాహ్మణుడు మరణించినాడు. కాబట్టి మేము చాలపాపం పొందినాము. మీసత్కారాలకు అర్హులంకాదు. ఈ పాపానికి పరిహార మేదైనాఉంటే దయచేసితెలపండి". అన్నారు. ఆమాటలువిన్న తార్క్ష్యుడు నవ్వుతూ ఇట్లాఅన్నాడు.

"వినండి. మా ఆశ్రమంలోనివారికి ఎవరికైనా, ఎప్పుడైనా, భయంకానీ, రోగంకానీ, చావుకానీ, కలుగవు. ఈ విషయం మూడులోకాలలోనూ ఆశ్చర్యకరమైనది. చూడండి ఇతడేనా మీ పిల్లవాడు చంపినవాడు?చెప్పండి". అన్నాడు. తాము ఇంతకుముందు చూచినశవం ఇతనిదే అయినందుకు వారందరూ మిక్కిలి ఆశ్చర్యపడినారు. "చచ్చిన ఈ బ్రాహ్మణుడు తిరిగి బ్రతికినాడు. చాలా ఆశ్చర్యంగా ఉన్నది. ఇంతటి మాహాత్మ్యానికి కారణమేమిటి? దయచేసి చెప్పండి". అని అడిగినారు.

అందుకు తార్క్ష్యుడు ఇట్లాఅన్నాడు. "ఈ ఆశ్రమంలో మేమంతా ఎప్పుడూ కాలాన్ని వృథాచేయము. ఆహారాన్ని పరిశుభ్రంగా ఉంచుతాం. ఎల్లప్పుడూ అతిథులను గౌరవిస్తాము. ఎప్పుడూ నిజమే చెప్తాము. ఎప్పుడు శాంతంగాఉంటాం. బ్రహ్మచర్యాన్ని పాటిస్తాం. అందువలన మాకెప్పుడైనా రోగాలురావు. చావులు

కలుగవు. భయాలుండవు. ఇదంతా మా ప్రభావమే. మీకు పాపమేమీలేదు. భయపడకండి. పోయిరండి". ఆ మాటలువిన్న హైహయుల ఆనందంగా తార్క్ష్యునివద్ద వీడ్కోలుపొంది తమనగరంచేరుకొన్నారు.

**నీతి :** బ్రాహ్మణుడు అంటే ఇందులోని కడపటిపారాలో చెప్పబడిన సుగుణాలు కలిగినవాడు. అట్లాంటి సుగుణాల ప్రభావం చాలాగొప్పగా ఉంటుంది. అందువల్ల అందరూ సుగుణాలను అలవరచు కోవలెను.

క. **ఈతఁడగునె మీబాలకు । చేత నిహతుఁడైన వాఁడు సెప్పు ఁడనుడు వా**
**రాతఁడ తమ మును చూచిన । యాతం దగుటకు మహాద్భుతాత్మకు లగుచున్.** **4-187**

శా. **ఆలస్యం బొక యింత లేదు; శుచి యాహారంబు; నిత్యక్రియా**
**జాలం బేమఱ; మర్చనీయు లతిథుల్; సత్యంబ పల్కంబడున్;**
**మేలై శాంతియు బ్రహ్మచర్యమును నెమ్మిం దాల్తు ; మట్లౌట నె**
**క్కాలంబుం బటురోగమృత్యుభయశంకం బొంద మే మెన్నఁడున్.** **4-190**

# 29. బ్రాహ్మణులు - క్షత్రియులు.

**(అరణ్య పర్వము చతుర్థాశ్వాసము 192 నుండి 206వ పద్యం వరకు.)**
**(పాండవుల అరణ్యవాసకాలంలో ధర్మరాజుకు మార్కండేయుడు చెప్పిన కథలలో ఇది ఒకటి.)**

పూర్వమొకదేశంలో అత్రిఅనే బ్రాహ్మణశ్రేష్ఠుడుండేవాడు. అతడు తపస్సు చేసుకోవడానికి అడవులకు పోదలచుకొన్నాడు. ఆ విషయం భార్యకు 'చెప్పాల'నుకొన్నాడు. ఆమెను దగ్గరకు పిలిచికొని ఇట్లాఅన్నాడు. "ఇంతీ! ఇదిగో నేను తపస్సు చేసుకోవడానికి అడవులకు పోతున్నాను. నీవుకూడా నాతోపాటువస్తావా? లేకపోతే కొడుకులవద్దనే ఉంటావా?"

ఆ మాటలువిని ఆమె, "అయ్యో! కుమారులకు జీవనాధారమేమీ కల్పించకుండా సన్యసించడం ధర్మంకాదు, ఈ దేశపురాజు వైన్యుడు, కోరినవారికి కోరినంతధనం దానంచేస్తున్నాడట. ఆ రాజును కలుసుకొని వేడుకొని ధనముతే. అప్పుడు నీవుసన్యసించవచ్చు. తపస్సు చేసుకోవచ్చు. నేను నాపుత్రుల వద్దనే ఉంటాను". అన్నది. ఈ మాటలు విన్న అత్రి కొద్దిసేపు ఆలోచించినాడు. భార్య చెప్పిన మాటలు 'ధర్మంగానే ఉన్నాయ'నిపించింది. "అట్లాగే చేస్తాన"ని సంతోషంగా చెప్పినాడు.

వెంటనే అత్రి వైన్యుణ్ణిచూడదానికి బయలుదేరినాడు. అత్రి అక్కడకుచేరేటప్పటికి వైన్యుడు అశ్వమేధయాగం చేయడానికి దీక్షపూనిఉండినాడు. బ్రాహ్మణులకు అంతులేనిధనాలను దానంచేస్తూ కనిపించినాడు. అత్రి ఆ వైన్యుణ్ణి సమీపించి ఆశీర్వదించినాడు. తరువాత ఆయనతో ఇట్లాఅన్నాడు "నీవేబ్రహ్మవు. ఇంద్రుడుకూడా నీవే. సమస్తజనులకు నీవే ఈశ్వరుడవు. సమస్తధర్మాలు నీకేతెలుసు. నిన్నుపోలిన రాజులెవరూ ఈ భూమిమీదలేరు. మంచిమంచి మునులంతా నిన్నెప్పుడూ తియ్యతియ్యని మాటలతో పొగడుతూఉంటారు".

అత్రి ఈ మాటలుఅనేసమయంలో అక్కడ 'గౌతముడ'నే ఒక మునిఉండినాడు. ఆయన ఈ మాటలకు చాలా కోపగించుకొన్నాడు. "ఎందుకిట్లా పట్టుదలగా నోరు అరిగిపోయేటట్లు ప్రేలుతున్నావు? ఈ రాజేబ్రహ్మయా? ఇంద్రుడా? ఈశ్వరుడు కూడానా? ధనంకోసమై జంకులేకుండా ఒక మానవమాత్రుణ్ణి ఈ విధంగా పొగడుతున్నావెందుకు?" అన్నాడు. ఆ మాటలు విన్న అత్రికి చాల కోపంవచ్చింది. గౌతముడితో ఇట్లాఅన్నాడు.

"ఊరికే అతిగా మాట్లాడుతున్నావు. నీకు తగినదేదో? తగనిదేదో? తెలియడం లేదు. లోకంలోని ధర్మా లన్నింటికీ రాజే ఆధారము. రాజే లోకాలన్నీంటినీ తన శౌర్యంతో పాలించేవాడు. ఆయనే ధర్మరక్షకుడు. ఆయనే పరిపాలనకుఆధారం. ఇట్లాంటి రాజు గొప్పతనం నీవు గుర్తించలేకపోయినావు. నేను చక్కగా గుర్తించ గలిగినాను. అందుచేతనే ఇట్లా పొగడినాను. పెద్దలు, జ్ఞానవృద్ధుల మాటలనే గౌరవిస్తారు. అంతేకానీ నీ మాటలనెవరు గౌరవిస్తారు?" ఈ విధంగా ప్రారంభించి ఇద్దరూ వాదించుకుంటూఉన్నారు.

ఆ వివాదశబ్దంతో సభరొదగామారింది. అప్పుడు అక్కడేఉన్న 'కాశ్యపుడ'నేముని సభలోని ఇతర మునులను చూచి, "వీరివాదానికి మనంసరియైన తీర్పుచెప్పలేము. అన్ని ధర్మాలూ తెలిసిన సనత్కుమారుణ్ణి అడుగుదాం." అన్నాడు. ఆయన మాటలకు వారందరూ సమ్మతించినారు. కాశ్యపుడు మొదలైన వారంతా వెంటనే సనత్కుమారుని వద్దకు పోయినారు. అత్రి గౌతముల వివాదం గురించి ఆయనకు వివరించినారు. వారివాద ప్రతివాద వివరాలువిన్న సనత్కుమారుడు వారితో ఇట్లాఅన్నాడు.

"అత్రి సరిగానే చెప్పినాడు. అతని మాటలు 'ధర్మం'గానే ఉన్నాయి. రాజే ఈ భూమినంతా తన భుజబలంతో మోసేవాడు. అతడే అందరనూ కాపాడేవాడు. శత్రువులను జయించేవాడుకూడా. కాబట్టి అతడే ఇంద్రుడు, ఈశ్వరుడు, మరి బ్రహ్మకూడా. వేదాలు రాజును గొప్పగొప్ప పేర్లతో పొగడుతున్నాయి. పూర్వం అధర్మం పెరగకుండా ఉండడానికి బ్రాహ్మణులు వారితేజాన్ని క్షత్రియులయందు ప్రవేశపెట్టినారు. కాబట్టి క్షత్రియుడే అందరికంటెఅధికుడు".

ఆ మునులంతా తిరిగిపోయి, వైన్యునికి సనత్కుమారుని తీర్పువిషయం వివరించినారు. అప్పుడా రాజు అత్రినిచూచి, "మహాత్మా! నన్ను అందరికంటె 'గొప్పవాడన'ని నిజంగా పొగడినావు. సనత్కుమారుడి వంటిజ్ఞానికూడా దీన్నిఅంగీకరించినాడు. అందుకు నేనుచాలాసంతోషంగా ఉన్నాను. కాబట్టి నీవు కోరినంత ధనాన్నిస్తాను. తీసుకో." అనిచెప్పి కోరినంతధనాన్ని అత్రికి సమర్పించినాడు.

అత్రి ఆ ధనాన్ని తీసుకొని సంతోషంగా ఇల్లుచేరినాడు. ప్రేమతో కొడుకులకు పంచినాడు. తన భార్యను కొడుకుల కప్పగించినాడు. జాగ్రత్తగాచూచుకోమని కొడుకులను హెచ్చరించినాడు. ఆమె అనుమతి పొందినాడు. ఆనందంగా తపస్సు చేసుకోవడానికి అడవులకుపోయినాడు.

**నీతి :** న్యాయంగా పరిపాలించే రాజు అందరికన్న అధికుడు. నేటి కాలంలో పరిపాలించే ప్రజాప్రతినిధులు రాజుస్థానాన్ని ఆక్రమించి ఉన్నారు. వారుకూడా న్యాయంగా పరిపాలించవలసి ఉంటుంది.

**ఉ.** **నీవ విధాత; వింద్రుఁడవు నీవ; సమస్తజనేశ్వరుండవున్**
**నీవ; యశేషధర్మములు నీవ యెఱుంగుదు; నిన్నుఁ బోలఁగా**
**నీవసుధాతలంబున మహీశ్వరు లెవ్వరు లేరు; సన్మునీం**
**ద్రావలి యెప్డు నిన్ను గొనియాడుఁబరిస్ఫుటవాక్య భంగులన్.** **4-195**

**చ.** **అని పలుకంగ గౌతమమహాముని యచ్చట నుండి యంతయున్**
**విని, కలుషించి, "యేల యిటు వీఁకున నో రఱుగంగఁబ్రేలె; దీ**
**జనపతియే విధాతయును శక్రుఁడు నీశుఁ డు; నర్థకాంక్షి వై**
**మనమున శంక లేక యొకమానవు నింత నుతింప నేటికిన్?"** **4-196**

# 30. సరస్వతీ గీత.

**(అరణ్య 4-207 నుండి 215 వరకు.)**

**(పాండవులు అరణ్యవాస కాలంలో మార్కండేయుడు ధర్మరాజుకు చెప్పిన కథలలో ఇది ఒకటి.)**

పూర్వము 'తార్క్ష్యుడు' అనే మునిశ్రేష్ఠుడొకడుండేవాడు. ఆయన సరస్వతీదేవిని మిక్కిలిభక్తితో చాలాకాలము ఆరాధించినాడు. ఆ దేవి ఆయనకు ప్రత్యక్షమైంది. అప్పుడాముని ఆ దేవిని ఇట్లాఅడిగినాడు.

"అమ్మా! పురుషునికి ఏది ధర్మం? పురుషుడు దేంతో మిక్కిలి పుణ్యాత్ముడై స్థిరమైన పుణ్యగతులు పొందుతాడు? దాన్ని నాకు దయతో తెలియచేయి".

అప్పుడా సరస్వతీదేవి ఆ ఋషితో ఇట్లాఅన్నది. "బ్రాహ్మణుడు దీక్షతో నాలుగువేదాలూచదివి, పెక్కుయజ్ఞాలుచేసే వ్రతంకలిగిన పుణ్యపురుషుడు స్వర్గంలోఉంటాడు. అతడక్కడ పెక్కువేలఏండ్లు ఎత్తైనగుండ్రని గబ్బిగుబ్బలతో తిరుగాడే దేవలోకపు స్త్రీల కౌగిలింతలతో ఏర్పడిన గగుర్పాటులతో కూడినశరీరంకలవాడవుతూ మిక్కిలిసంతోషంగా కాలంగడపుతాడు. మంచిదూడతో పాలుచాలా ఉండే తొలిచూలుఆవును, యోగ్యుడయిన శ్రోత్రియునికిఇచ్చే మంచినిర్మలప్రవర్తనకలిగినవాడు, ఆ ఆవు శరీరంమీద ఎన్నివెంట్రుకలుంటాయో అన్నివేలఏండ్లు స్వర్గంలోఉండేసౌఖ్యాలను పొందుతాడు. బరువు మోయగలిగి, చాలాబలంకలిగి, మెచ్చదగిన ఎద్దును బ్రాహ్మణునికి దానమిచ్చిన పురుషుడు, పదిఆవులను దానమిచ్చిన ఫలితాన్నిపొందుతాడు. ఇంక వస్త్రాలు దానమిచ్చి చంద్రలోకానికి సంతోషంగా పోతాడు. బంగారు దానమిచ్చి స్వర్గానికిపోతాడు. దీక్షతో అయిదుసంవత్సరాలు అగ్నిదేవుడిని నెయ్యితో తృప్తిపొందించి, మంచివ్రతంచేసినవాడు, పద్నాలుగుతరాలపితృ దేవతలను తీసుకొని గొప్పగా స్వర్గానికి పోతాడు. ఎప్పుడూ శుచిగాఉంటూ అగ్నిలో నిరంతరాయంగా హవిస్సులువేల్చి దేవతలను తృప్తిపొందించినవాడు చాలాకాలం నాకలోకంలోనివసించి, సౌఖ్యాలననుభవిస్తాడు. 'అగ్నిహోత్రం నాస్వరూపమే' అనితెలుసుకో. అన్నియజ్ఞాలలో వాడబడే విశేషపదార్థాలన్నీనావే. నేను మహనీయమైన అగ్నిహోత్రం ముఖంనుండిపుడతాను. ఆత్మజ్ఞానంతెలిసిన మహాత్ములకు అన్నిసందేహాలను తీరుస్తాను. ఎల్లప్పుడూ వేదాధ్యయనంచేయడంలో ఆసక్తులైనతపోధనులు ఎక్కడైతే దుఃఖంలేకుండాఉంటారో? అదే నా విశిష్టస్థానము. విను. అధికంగా తేనె, పాలు, చక్కెర,మాంసం ఉపయోగించి తయారు చేయించే పిండివంటలతో ఇంద్రుడు, అగ్ని ,మొదలైన దేవతలను తృప్తిపరచి, యజ్ఞాలు చేసేవారు నా స్థానాన్ని పొందుతారు".

సరస్వతీదేవి, ఈ విధంగా సమాధానాలు చెప్పగా, తార్క్ష్యుడు చేతులుజోడించి "అమ్మా! సరస్వతీ దేవీ! కొత్తపద్మాలవలె ధగధగలాడే చేతులుకలదానా! శరత్కాలంలోని వెన్నెలవెలుగువలె మిలమిలలాడే మనోహరాకారంకలదానా! దిగంతాలవరకు కాంతులు వెల్లివిరియచేసే రత్నభూషణాలు ధరించినదానా! వేదసూక్తులలో వర్ణించబడిన ప్రభావం నిజంగాకలదానా! ఆలోచనల ఆకాశపుదారుల్లో విహరించే దానా! నన్ను దయతోచూడు". అని ప్రార్థించి ధన్యుడయినాడు.

ఉ. **అంబ! నవాంబు జోజ్జ్వలకరాంబుజ! శారద చంద్ర చంద్రికా**
**డంబరచారుమూర్తి! ప్రకటస్ఫుట భూషణ రత్నారోచిరా**
**చుంబిత దిగ్విభాగ! శ్రుతిసూక్త వివిక్తనిజప్రభావ! భా**
**వాంబర వీధి విశ్రుత విహారి! ననుం గృపఁజూడు భారతీ!** **5-215**



# 31. వైవస్వత మనుచరిత్ర .

**(అరణ్యపర్వము చతుర్థాశ్వాసము. 217 నుండి 232 పద్యాలవరకు.)**
**(పాండవులు అరణ్యవాసకాలంలో ధర్మరాజుకు మార్కండేయుడు చెప్పిన కథలలో ఇదిఒకటి.)**

చాక్షుషమన్వంతరకాలంలో 'వైవస్వతుడ'నే మనువు ఉండేవాడు. ఆయన మిక్కిలి పుణ్యాత్ముడు. చాల ధైర్యశాలి. ఆతడు తిండితినకుండా పదివేలసంవత్సరాలు తపస్సుచేసినాడు. అంతేకాదు. బదరికాశ్రమంలో ఒంటికాలిమీద నిలబడి రెండుచేతులూ పైకెత్తి చాలసంవత్సరాలు తపస్సుచేసినాడు. ఆయనను పొగడని జనంలేరు. అట్లాంటి వైవస్వతుడొకనాడు స్నానంచేసిన తరువాత ఒకచెరువు గట్టున విహరిస్తూ ఉండినాడు. అప్పుడొక చిన్నచేప ఒడ్డువద్దకు వచ్చి వైవస్వతునితో, "అయ్యా! నేను చాలాచిన్నచేపను. పెద్దచేపలనుచూస్తే 'అవి నన్నుతింటాయేమో?' నని భయం భయంగాఉంది. ఈ మడుగులో పెద్దచేపలు చాలాఉన్నాయి. కాబట్టి నాకుఅపాయం కలుగకుండా నన్నురక్షించు. నన్నిక్కడనుండి తీసుకొనిపోయి ఇంకొకచోటఉంచు. నీవు నాకుచేసే ఈ మేలుకు బదులుగా నేను కూడా నీకు మేలుచేయగలను. " అన్నది. ఆ చేప అట్లామాట్లాడగా వైవస్వతుడు ఆశ్చర్యపడినాడు. ఆ చేపను ఎత్తుకొనిపోయి ఒకనూతిలో విడచినాడు. ఆ తరువాత అప్పుడప్పుడూ ఆ నూతిదగ్గరకుపోయి ఆ చేపయొక్క యోగక్షేమాలు విచారిస్తుండేవాడు. ఆ చేప క్రమంగా పెరిగింది. ఒక రోజున వైవస్వతుడు ఆ నూతిదగ్గరకురాగా ఆ చేప వైవస్వతునితో ఇట్లాఅన్నది.

"పుణ్యాత్ముడా ! నీ ప్రయత్నంవల్ల నాశరీరం బాగాపెరిగింది. నాకు తిరగడానికి ఈ నుయ్యి చాలడం లేదు. అందువల్ల ఇంతకంటే మేలైన చోటుకు నన్నుతీసుకొనిపో". ఈ మాటలువిని వైవస్వతుడు ఆ చేపను ఒకపెద్దబావిలోవదలినాడు. ఆ చేప ఎప్పటిలాగా ఆశ్చర్యకరంగా పెరిగింది. తనకు తిరగడానికి ఆ బావికూడా సరిపోవడంలేదని వైవస్వతునికిచెప్పింది. ఆ మనువు దానిని గంగ మడుగులో వదలినాడు. కాలక్రమంలో ఆ మడుగుకూడా దానికి చాలకుండాపోయింది. మనువు దానిని సముద్రంలో వదలినాడు. అప్పుడాచేప ఆ వైవస్వతమనువుతో ఇట్లాఅన్నది.

"నా మీదదయతో నాకుఎంతోమేలుచేసినావు. అందుకు బదులుగా నీకుకూడ నే నొకమేలు చేస్తాను. నా మాటలు జాగ్రత్తగావిను. ప్రళయం త్వరలోరాబోతూఉంది. జీవులన్నీ నశించబోతు న్నాయి. సముద్రాలన్నీ పొంగి పొరలి కలిసిపోయి పారుతాయి. దీనినే పెద్దలు 'మన్వంతరసంధి' అంటారు. నీ విప్పుడు ఒకపెద్దఓడనునిర్మించు. చాల పొడవైన గట్టిత్రాడును కూడా ఆ ఓడలో ఉంచు. నీవు సప్తఋషులతో పాటుగా ఆ ఓడనుఎక్కు. సముద్ర తీరంలో నన్నుతలచుకో. నే నప్పుడు పెద్దకొమ్ముతో నీకు కనిపిస్తాను. అట్లా కనిపించి మీకు మేలుచేస్తాను".

వైవస్వతుడు చేప చెప్పినట్లుగానే ఒకపెద్దఓడను నిర్మించినాడు. అందులోనికి సప్తఋషులను ఎక్కించుకొన్నాడు. సముద్రము దగ్గరకు పోయినాడు. చేపను తలచుకొన్నాడు. ఆ చేపపెద్దకొమ్ముతో వచ్చింది. చేపచెప్పగా తానుతెచ్చిన పొడవైనత్రాటిని ఆ చేపకొమ్ముకు తగిలించినాడు. ఆ చేప అద్భుతమైన వేగంతో ఆ ఓడను సముద్రమధ్యంలోనికి లాగుకొని పోయింది. ఆ తరువాత చేప చెప్పినట్లుగానే సముద్రాలన్నీ పొంగి, నేలనంతా ముంచివేసినాయి. ఆ చేప ఆ నీటిలో ఆ ఓడను కొన్నివేలసంవత్సరాలు లాగుతూనే ఉండింది. ఆ తరువాత కొంతకాలానికి ఆ వరద తగ్గుముఖంపట్టింది. అప్పుడా చేప ఆ ఓడను అప్పుడే బయటపడిన హిమాలయ శిఖరానికి చేర్చింది. ఓడలోని వారితో ఇట్లా అన్నది. “ఈ కొండశిఖరానికి ఈ ఓడనుకట్టండి.” వెంటనే వారాపనిని చేసినారు. అట్లా నౌకను (ఓడను) బంధించడంవల్ల ఆ కొండ శిఖరానికి 'నౌబంధమ'నేపేరు వచ్చింది.

ఆ చేప వైవస్వత మనువుతోపాటుఉండిన మునులను చూచి, మిక్కిలి గౌరవంతో ఇట్లాఅన్నది. “మీ మీది దయతో ప్రళయంలో మీరు నాశనం కాకుండా కాపాడినాను. నేనే ఈ విశ్వానికంతటికీ ప్రభువును. మీ మీది వాత్సల్యంవల్ల చేపరూపంలో ఇన్నివిధాలుగా తిరగవలసివచ్చింది. మీ కింకేం భయంలేదు. ఈ మనువు, దేవతలు, రాక్షసులు, మానవులు, ఉండే లోకాలన్నింటిని తిరిగి సృష్టిస్తాడు.” అనిచెప్పి ఆ చేప మాయమయింది. వైవస్వతమనువు ఆ తరువాతకూడా పెద్దగాతపస్సుచేసినాడు. చరాచరభూతాల నన్నింటిని తిరిగి సృష్టించినాడు.

**నీతి :** ఇతరులకు మేలుచేసిన వారికి తప్పక తిరిగి మేలుకలుగుతుంది.

**విశేషం :** నుయ్యి అనగా చిన్న చేదుడు బావిలాంటిది. బావి అనగా నూతి కంటే చాలపెద్దదైనదిగుడుబావి.

**మ.** **మఱివైవస్వతుచేఁదలంపఁబడి యమ్మత్స్యంబుదోఁతెంచెనా**
**యతశృంగోన్నత మూర్తి; నాతఁడుఁదదాజ్ఞాయత్తుఁడైతచ్ఛిరో**
**గత శృంగాగ్రమునందగిల్చె నలిదీర్ఘంబైనపాశంబు; న**
**ద్భుత వేగంబుననోడనీడ్చెనది యంభోరాశి మధ్యంబునన్.** **4-225**

# 32. పరీక్షిత్తు - సుశోభనల కథ.

**(అరణ్య పర్వము 4వ ఆశ్వాసం 318 నుండి 334 పద్యాలు.)**
**(పాండవుల అరణ్యవాసకాలంలో మార్కండేయుడు ధర్మరాజుకు చెప్పిన కథలలో ఇది ఒకటి.)**

పూర్వమొకప్పుడు 'పరీక్షితుడు'అనే రాజు అయోధ్యను ఏలుతూఉండేవాడు. అతడు చాలగొప్ప రాజు. సూర్యవంశానికి చెందినవాడు. సూర్యునితో సమానమైన తేజస్సు కలిగినవాడు. సాటిలేనివాడు. అతడొకరోజున వేటకొరకై అడవికిపోయినాడు. గొప్ప వేగంగల గుఱ్ఱాన్నెక్కి అడవిఅంతా తిరుగాడుతూ ఉండినాడు. ఈ విధంగా తిరుగుతూ చాలాజంతువులను చంపుతూఉండినాడు. అప్పుడొకచోట ఆ మహారాజు ఒకస్త్రీని చూచినాడు. ఆమె ఏనుగువంటి నడకకలిగిఉంది. మంచి అందకత్తె. ఆమె తీగల పొదల మధ్యలోదూరి అందమైన పూలనుకోస్తూ కనిపించింది. ఆ రాజు ఆమెదగ్గరకు పోయినాడు. కనురెప్పలు మూయకుండా ఆమెనే చూస్తూఉండినాడు.అతనికి ఆమెపై మోహముఅతిశయించింది. ఆమెకూడా ఆ రాజు అందమైనరూపాన్నిచూచింది. మెచ్చుకొన్నది. ఆ రాజువైపు ఓరచూపులు చూచింది. అప్పు డారాజు ఆమెతోఇట్లాఅన్నాడు.

"ఓ ఇంతీ ! నీ కళ్ళు పద్మాల్లాగాఉన్నాయి. నీవెవ్వరిదానవు? ఈ అడవిలో ఒంటరిగా ఎందుకు తిరుగుతూఉన్నావు ?" అందుకామె, "నేను నాతండ్రి పంపగా ఈ అడవిలో మంచిభర్తకొరకై తిరుగుతూ ఉన్నాను. నేను కన్యను. నేనెవరిని పెళ్ళాడితే బాగుంటుందో ఆలోచించి చెప్పు". అన్నది. అట్లా అన్న ఆమె మాటకారితనం రాజుకు బాగా నచ్చింది. అది ఆ రాజు మోహాన్ని మరింత పెంచింది. ఆ రాజు తన కోరికను ఆమెకు తెలియచేసినాడు. అందుకామె వెంటనే, "నన్నెప్పుడూ 'జలవిహారానికి రమ్మ'ని కోర వద్దు. అట్లాగైతే నేను నీభార్యనవుతాను." అన్నది. పరీక్షిత్తుకూడా వెంటనే అందుకంగీరించినాడు. ఆమెను తీసుకొని నగరంచేరుకొన్నాడు. అక్కడ ఆమెతో ఇష్టమయినట్లుగా సుఖంగాఉండినాడు.

అంతలోశరదృతువు వచ్చింది. రాజు ఉద్యానవనాన్ని తయారుచేయించినాడు. అందులో తగిన విశ్రాంతి గృహాన్ని నిర్మింపచేసినాడు. ఆ ఉద్యానవనం మిక్కిలిసుందరంగాఉంది. అందులో మంచి మంచిపూలు, చిగురుటాకులు, కలిగినగొప్ప చెట్లు, తీగలు ఉన్నాయి. పెద్దపెద్ద సరస్సులు కూడా అందులో నిర్మించబడినాయి. ఆ సరస్సులో రకరకాలైన కలువలూ పద్మాలూ మనోహరంగా వికసించిఉన్నాయి. అట్లాంటి ఉద్యానవనంలో రాజు తనభార్యతోసహా ప్రతిదినం విహరించేవాడు. పద్మాల, కలువల సువాసనలతోకూడినగాలిని పీలుస్తూ ఆనందించేవారాదంపతులు.

ఒకనాడు ఆ దంపతులు ఉద్యానవనంలోని విశ్రాంతిగృహంలో ఉండినారు. వారికి మిక్కుటంగా ఉక్కపోసింది. ఇరువురికి వళ్ళంతాచెమటతోతడిసిపోయింది. భార్యతోసహా రాజు విశ్రాంతిగృహం నుండిబయటకు వచ్చినాడు. అక్కడకు దగ్గరలో చాలఅందమైన సరోవరంఉంది. దాని ఒడ్డుపై 'భార్యను కూర్చుండమ'న్నాడు. తానొక్కడే సరోవరంలోనికి దిగిస్నానము చేసినాడు. ఆ తరువాత భార్యతో "ఓసఖీ! నీళ్ళుచల్లగా చాలహాయిగాఉన్నాయి. చెమటపోయేట్లు ఒళ్ళుకడుక్కోకూడదా?" అన్నాడు.

ఆమె ఇంతకుమునుపు చాలమందిరాజులను ఇట్లే వివాహంచేసుకొనేది. వారిమీదిమోహం తీరగానేవారిని విడిచిపోయేది. ఇప్పుడుకూడ ఆమెకు ఈ రాజుపైన మోజుతీరింది. 'ఈతణ్ణి వదలిపోవడానికిమార్గం తెలిసిందను'కొని సంతోషించింది. తన పద్మంవంటి ముఖంలో చిరునవ్వు చిందించింది. మడుగులోనికి దిగింది. వెంటనే మాయమయింది.

ఆమె అట్లా మాయంకావడం చూచి ఆ రాజు చాలాఆశ్చర్యపడినాడు. మడుగంతా పూర్తిగా వెతకినాడు. భార్య మాత్రంకనిపించలేదు. కొలనులో నీళ్లన్నీతానే స్వయంగా బయటకు చిమ్మివేసినాడు. ఇట్లానీటిని చల్లివేయగా కొలనిఅడుగులో చాలాకప్పలు కనిపించినాయి. వాటినిచూచి ఆ రాజు, "ఈ కప్పలే నాభార్యను మ్రింగి ఉంటాయ"ను కొన్నాడు. కోపగించుకొన్నాడు. తనభృత్యులనందరనూ పిలిచినాడు. "మీరంతా నాకిష్టమైనపని 'చేయాల'నుకుంటే భూమిమీది కప్పలన్నింటినీ చంపండి." అని ఆజ్ఞాపించినాడు.

ఆయన సేవకులందరూ అన్నివైపులకు పోయినారు. చెరువులు, మడుగులు, సెలయేళ్ళు, వాగులు, వంకలు, నదులు ఇట్లాఅన్నిచోట్లా వెదకి వెదకి కప్పలను చంపడం మొదలుపెట్టినారు. ఇదంతా కప్పల నాయకుడు చూచినాడు. "ఇంతవరకు చావకమిగిలిన కప్పలనైనా చావునుండి తప్పించవలె కదా" అనుకొన్నాడు.

వెంటనే ఆ కప్పల నాయకుడు గొప్పతపస్వి రూపంలో రాజువద్దకు వచ్చినాడు. " అయ్యో! లోకమంతా నవ్వుతూఉంది కదయ్యా! అనవసరంగా కప్పలనెందుకు చంపుతున్నావు? దీనితో నీ కేమిగొప్ప తనము వస్తుంది? కోపంమానుకో. కప్పలను చల్లగాచూడు. ఇట్లా కప్పలను చంపడం చాలఅధర్మం." అన్నాడు.

అందుకు రాజు ఇట్లాసమాధానము చెప్పినాడు. "మునీంద్రా! ఇది ఎక్కడిమాట? కప్పలు నా భార్యకు కీడుచేసినాయి. ఇవి నాప్రియమైన భార్యనుమ్రింగిన దొంగపురుగులు. వీటిని చంపించే తీరుతాను". అందుకు ఆ కప్పల నాయకుడిట్లాఅన్నాడు.

"నేను ఋషినికాను. కప్పల నాయకుడను. నా పేరు ఆయువు. నీ భార్య నా కూతురే. ఆమెపేరు సుశోభన. దానితో చాలమంది రాజులు మోసపోయినారు. నీవొకలెక్కా ?"

ఆ మాటలు విని పరీక్షిత్తు, "అట్లా అయితే నీవు నాకు ఆమెనుతెచ్చి అప్పగించు. కప్పలను చంపించడం ఆపివేస్తాను". అని ప్రార్థించినాడు. ఆ అయువు ఆమెను తలచుకొన్నాడు. తలచుకొన్నంతనే ఆమెఅక్కడ ప్రత్యక్షమైంది. ఆమెను ఆ రాజుకు అప్పగించినాడు. అంతటితో రాజు కప్పలను చంపించడం మానివేసినాడు.

అంతాబాగానేఉంది. కానీ, కప్పలనాయకుడైనఅయువుకు తనకూతురుసుశోభనపైన చాలా కోపంవచ్చింది. "నీవు చాలచెడ్డదానవు. నీ మూలంగా మనజాతికప్పలు అనవసరంగా చాలచచ్చి పోయినాయి. నీవు చాలమందిరాజులను ఇదివరలోచిక్కులుపెట్టినావు. కాబట్టి నీకుపుట్టేకొడుకులు మోసగాళ్ళవుతారు" అనికూతురికి శాపమిచ్చినాడు.

పరీక్షిత్తుకోరికతీరింది. తనకు తనభార్య తిరిగిలభించింది. ఆ పరీక్షిత్తు సుశోభనయందు 'శలుడు, నలుడు, వలుడు' అనేముగ్గురు కొడుకులను పొందినాడు. కానీ వాళ్ళుముగ్గురూ తాతగారి శాపకారణంగా మోసగాళ్ళయిపోయినారు.

**నీతి :** మోసకారి తనం మంచిది కాదు. అతి మోహము మంచిది కాదు. నాయకుడు ప్రజలను రక్షించియే తీరవలెను.

**ఉ.** ఎవ్వరి దాన వంబుజదళేక్షణ! యేకత మిట్లు లేల నీ
వివ్వనభూమియందుఁజరియించెదు?'వావుడుఁదండ్రిపంపునం
దివ్వన భూమి యందు ఁజరియించెద సద్వరు ఁగోరి; కన్య నే
నెవ్వరిదాన ఁగావలయు? నేర్పడఁజెప్పుము రాజనందనా ! 4-323

# 33. బ్రాహ్మణత్వ ప్రభావము.

**(అరణ్య పర్వము చతుర్థాశ్వాసము 334 నుండి 358 పద్యాల వరకు.)**

**(పాండవుల అరణ్యవాసకాలంలో మార్కండేయుడు ధర్మరాజుకు చెప్పినకథలలో ఇదిఒకటి.)**

పూర్వమొకప్పుడు 'పరీక్షిత్తుడ'నేరాజు అయోధ్యను పాలిస్తుండేవాడు. అతనిభార్య సుశోభన. ఆమె కప్పలరాజు 'ఆయువు' అనేవాడికూతురు. పరీక్షిత్తుకు సుశోభనయందు '**శలుడు, నలుడు,** వలుడు' అనే ముగ్గురు కొడుకులు పుట్టినారు. వారు పెరిగిపెద్ద వారైనారు. **పరీక్షిత్తు** తన పెద్దకొడుకు శలుడికి రాజ్యాన్ని అప్పగించి తపస్సు చేసుకోవడంకోసం అడవికిపోయినాడు.

శలుడు అయోధ్యను పరిపాలిస్తూ ఉండినాడు. అతడు ఒకనాడు వేటకుపోయినాడు. అతడు ఎక్కినరథం బంగారంలాగా వెలిగిపోతూ ఉంది. ఆ రథంమీదపోతూ చాలమృగాలను చంపినాడు. ఇట్లా చంపుతూపోతూ ఒకమృగంపై బాణంప్రయోగించినాడు. ఆ బాణం ఆ మృగానికి గుచ్చుకున్నది. అట్లా గుచ్చుకొన్న బాణాన్ని లెక్కచేయకుండా ఆ మృగం వేగంగాపారిపోయింది. శలుడుకూడా రథంమీద దానిని వెంబడించినాడు. కానీ దానిని అందుకోలేకపోయినాడు. దాంతో రాజుకు కోపంవచ్చింది. సారథిని తిట్టినాడు. "తొందరగా రథాన్ని పరిగెత్తించు" అన్నాడు.

రాజుగారి ఈ ఆజ్ఞనువిని సూతుడు ఇట్లాఅన్నాడు. "దేవా మనమెంతవేగంగా గుర్రాలను తరిమినా ఆ మృగాన్ని అందుకోలేము. ఆ మృగానికి చాలావేగం ఉంది. గుర్రాలు అంతవేగంగా పరుగెత్త లేవు. సాధ్యంకానిదానికి దుఃఖించడం వృథాకదా? మనతేరిగుర్రాలు వామ్యజాతివిఅయివుంటే ఆ మృగం మనకు దొరకిఉండేది. మనగుర్రాలు వామ్యజాతివికావు. కాబట్టి ఆ మృగాన్ని అందుకోవడం మనకు అలవికాదు." సూతుడన్న ఈ మాటలువిని శలుడు, "వామ్యజాతిగుర్రాలు ఎవరిదగ్గర ఉన్నాయి." అని అడిగినాడు. "వామదేవమహామునివద్ద ఉన్నాయి." అని సారథి చెప్పినాడు. ఆమాట విన్నంతనే శలుడు "ఆ ఆశ్రమం ఎక్కడఉంది? అక్కడికి మనరథం ఇప్పుడేపోనిమ్మ" న్నాడు.

రాజు చెప్పినట్లుగానే సారథి వేగంగా వామదేవమహాముని ఆశ్రమానికి రథాన్ని తోలుకొని పోయినాడు. శలుడు రథందిగి ఆ వామదేవుణ్ణి దర్శించినాడు. నమస్కరించినాడు. "మునీంద్రా నా బాణం దెబ్బతిని ఒకమృగం వేగంగా పారిపోయింది. దానిని చంపియేతీరవలె. నా గుర్రాలు ఆ మృగంవేగం అందుకోలేకపోతున్నాయి. నీ గుర్రాలనిస్తే ఆ మృగాన్ని వెంటాడి వధించగలుగుతాను." అని ప్రార్థించినాడు. "నీవు నీపని పూర్తికాగానే నాగుర్రాలను నాకప్పగించేటట్లయితే తీసుకొని పో." అన్నాడు. రాజందుకు అంగీకరించినాడు. వామదేవుని వామ్యాశ్వాలను తనరథానికి పూనిపించినాడు. రథం కదలింది. శలుడు ఆ గుర్రాలవేగాన్ని మెచ్చుకొన్నాడు. ఒక్క ముహూర్తకాలంలో ఆ మృగాన్ని చేరుకున్నాడు. దాన్ని చంపినాడు. ఆ తరువాత ఆ గుర్రాలను వామదేవుడికి అప్పగించకుండా వాటితో తననగరం చేరినాడు.

నగరానికి చేరిన శలుడు, "ఈ గుర్రాలు చాల గొప్పవి. చాలా శక్తి వేగం కలిగిఉన్నాయి. ఇట్లాంటి గుర్రాలు రాజులవద్ద ఉండదగినవి. ఇవి బాపనికెందుకు?" అనుకొన్నాడు. అహంకారంతో ఆ గుర్రాలను 'రాచనగరులోనే ఉంచ'మని ఆజ్ఞాపించినాడు. పరుల సొమ్ములపై కాంక్ష కలిగినవాడు అందులోని దోషాన్ని గమనిస్తాడా?

అక్కడ వామదేవమహర్షి మనసులో, "శలుడు నా గుర్రాలను తీసుకొని పోయినాడు. తిరిగి ఇంకా నాకప్పగించలేదు. ఇప్పటికే ఆలస్యమైంది. ఈ రాజేమోమహాబలశాలి. అహంకారి. చిన్న వయసులో ఉన్నాడు. యుక్తాయుక్తాలు సరిగాతెలిసినవాడుకాదు. సంబరంగా గుర్రాలను తీసికొనిపోయినాడు. తిరుగా అప్పచెప్పాలనేబుద్ధి అతనికికలిగినట్లులేదు." అని అనుమానపడినాడు. 'ఆత్రేయుడ'నే తన శిష్యుణ్ణి పిలిచి, ఇట్లాచెప్పినాడు. "శలుడు మనవామ్యాలను తీసుకొనిపోయినాడు. ఒక నెలఅయింది. వాటిని తెచ్చిఇచ్చేట్లు కనిపించడంలేదు. నీవుపోయి ఆ గుర్రాలను తీసుకొని రా."

ఆ శిష్యుడు, ఆత్రేయుడు, వెంటనే బయలుదేరి అయోధ్యచేరినాడు. రాజు శలుడిని దర్శించినాడు. "రాజా ! వామదేవమహాముని పంపగావచ్చినాను. మా గుర్రాలను మాకుసంతోషంగా ఇవ్వు". అని అడిగినాడు. ఆత్రేయుడిట్లా అడుగగానే రాజుకు కోపం వచ్చింది. "అతడు నిన్ను పంపడమూ సరిపోయింది. నీవు గుర్రాలను తీసుకొని పోవడానికి రావడమూ సరిపోయింది. పోవయ్యా ! నీ పనికి మాలినమాటలు నాదగ్గరచెప్పవద్దు". అని గద్దించిపంపినాడు.

ఆ మునికుమారుడు వెనుదిరిగిపోయినాడు. గురువుగారికి జరిగినవిషయమంతా వివరించినాడు. శిష్యుడిమాటలువిన్న వామదేవుడి మనసంతాకోపంతోనిండిపోయింది. వెంటనే బయలుదేరి తానేశలుడివద్దకు పోయినాడు. అక్కడ శలుడితో "రాజా! మా గుర్రాలను మాకిమ్ము. నీపని జరిగిందికదా? దురాశతో ఇతరుల సొమ్ములుకోరితే వస్తాయా? ఇతరుల ధనాన్ని దొంగిలించడం పాపం. ఆలోచించు. నరకంలో పడిపోతావు జాగ్రత్త". అన్నాడు.

ఈ మాటలువిన్న శలుడిట్లాఅన్నాడు. "బ్రాహ్మణులకు గుర్రాలు అనవసరం కదా? బలమైన రెండెడ్లనిస్తాను. తీసుకో. అంతేకాని వామ్యజాతి గుర్రాలను మాత్రము అడుగవద్దు. అత్యాశ నీకెందుకు?" ఇందుకు వామదేవుడు, "ఇవేమి మాటలు? అయ్యో! వినేవాళ్ళు నవ్వుతారు. బ్రాహ్మణుల ధనాలు తీసుకొని, దానికి బదులు 'ఇంకేవేవో ఇస్తాన'నడం ఏకాలపు న్యాయము" అన్నాడు.

వామదేవు డిట్లా అనగానే శలుడికి విపరీతమైనకోపంవచ్చింది. భయంకరమైన బలంకలిగిన తన సేవకులను ఇట్లాఆజ్ఞాపించినాడు. "ఈ దుష్టమునినికట్టివేసి శూలంతోపొడిచిచంపండి." ఈ ఆజ్ఞనువినగానే వామదేవుడిముఖము కోపంతోనిండిపోయింది. భయంకరంగా అట్టహాసముచేసినాడు. అతని

ముఖంచూడడానికి ఎవరికీ సాధ్యపడలేదు. ఆ క్షణంలోనే భయంకరాకారాలు కలిగిన రాక్షసులనేకులు పుట్టినారు. వారు వాడియైనతమశూలాలతో ఆ రాజును పొడిచిచంపినారు. వామదేవుడు తనదారినతానుపోయినాడు.

ఆ తరువాత శలుని తమ్ముడు నలుడు రాజైనాడు. నలుడు కూడా సుఖంగా రాజ్యాన్ని పాలిస్తూ ఉండినాడు. కానీ ఆ గుర్రాలను తిరిగివామదేవుడి పంపాలనేఆలోచన అతడికికూడ రాలేదు. కానీ కొంతకాలం తరువాత వామదేవుడేవచ్చి ఆ నలుణ్ణి దర్శించినాడు. "మహాత్మా ! నీవు ధర్మపరుడవు. 'ధర్మంతప్పకుండా ఉండాల'ంటే మా గుర్రాలను మాకివ్వు". అన్నాడు. ఆ మాటలు వినగానే నలుడికికూడ కోపంవచ్చింది. తనఅన్న శలుడిగతి యేమైందోకూడా గుర్తించలేదు. తన దగ్గరలోఉన్న సారథినిచూచి ఇట్లాఅన్నాడు.

"బాగాక్రొవ్వుపట్టిన ఈ బాపనికి భయంలేకుండా పోయింది. శౌర్యంతో ఈతనిరొమ్మును చీలుస్తాను. విషంపూసిన బాణం విల్లు తీసుకొనిరా." రాజు సారథితోఅన్న ఆ మాటలువిని వామదేవుడు నవ్వుతూ, "రాజా ! నీవు నన్నుచంపడానికి తెమ్మన్నబాణం నన్నుచంపదు. సరికదా అంతఃపురంలో సంతోషంగాఉన్న నీకొడుకునే చంపుతుంది". అన్నాడు.

వామదేవుడిట్లా అన్నాడో లేదో, బాణందెబ్బతో చచ్చిన రాజకుమారుణ్ణి తీసికొని అంతఃపురము లోనివారంతా ఏడుస్తూ అక్కడకు వచ్చినారు. ఇంతాచూచికూడా, ఆ రాజు కోపంతో వణకిపోయినాడు. తన దురాగ్రహాన్ని వదలలేకపోయినాడు. సమీపంలో ఉండేవారినిచూచి, "అందరూవినండి. ఈ బాపడు చెడుమాటలు మాట్లాడుతున్నాడు. ఇతడుదుర్మార్గుడు. క్షణంలో నావింటినుండి బాణం వెలువడుతుంది. ఈతని శరీరాన్ని చీల్చివేస్తుంది. ఈతడు రక్తంకారుతూ నేలమీద పొర్లాడుతాడు. చూడండి". అంటూ అతివేగంగా విల్లందుకొన్నాడు. కానీ బాణము, విల్లూ, రెండుచేతులూ కదలకుండాపోయినాయి.

ఇందుకు రాజు చాలఆశ్చర్యపడినాడు. భయపడినాడు. తన అసూయారోషాలు వ్యర్థాలైనాయి. కొంతసేపు తెల్లముఖంవేసుకొన్నాడు. ఆ తరువాత జనులంతా వింటూండగా ఇట్లాఅన్నాడు. "నేను చాలామాటలు మాట్లాడినాను. ఆ మాటలన్నీ వ్యర్థమయినాయి. నాఅస్త్రశక్తినాశన మయింది. 'బ్రాహ్మణ శక్తి క్షత్రశక్తికి మించిందనడం నిజమ'ని నాకిప్పుడుతెలిసింది. ఈ మునిని మంచివారు ఎప్పుడూ పొగడుతూఉంటారు. ఈతడు శత్రువులను సులభంగా జయించగలిగినవాడు. అట్లాంటి ఆయనను నేని ప్పుడు ఆశ్రయిస్తున్నాను". ఇట్లాచెప్పి గర్వాన్ని వదలి, వామదేవునికి నమస్కరించినాడు. ఆ రాజు బంధువులూ మిత్రులూకూడా భయంతోనూ సంభ్రమంతోనూ ఆ మునిని ఆశ్రయించినారు. బ్రతిమలాడినారు. అప్పుడు వామదేవుడు శాంతించినాడు. దయతో నలుడిరెండుచేతులు కదిలేటట్లుచేసినాడు. చచ్చిన అతని కొడుకునుకూడా బ్రతికించినాడు.

అప్పుడా నలుడు భార్యాబిడ్డలతోసహా వామదేవుణ్ణి సమీపించి నమస్కరించినాడు. గుర్రాలను తెప్పించి ఆ ఋషికి అప్పగించినాడు. వామదేవుడు తనగుర్రాలను తీసుకొని తనఆశ్రమానికి పోయి నాడు.

**నీతి :** పరుల సొమ్మును ఆశించరాదు. న్యాయ పరులకు అపజయమెప్పుడూ కలుగదు. ఇంద్రియనిగ్రహము మొదలైన సుగుణాలు కలవారినే బ్రాహ్మణులంటారు. అట్టి వారి కెప్పుడూ అపజయముండదు. వారు గొప్పప్రభావం కలిగిఉంటారు. అందుచేత మానవులకు ఇంద్రియనిగ్రహం అవసరం

**విశేషం :** కప్పలరాజైన ఆయువు తనకూతురు సుశోభనను, "నీపుత్రులు మోసకారులవుతార"ని శపించినాడు. అందువల్లనే శలుడు నలుడు కూడా ఈ విధంగా వామదేవ మహామునిని మోసగించినారు. ఈ శాప వృత్తాంతం "పరిక్షిత్తు– సుశోభనల కథ"లో చూడవచ్చు

**ఉ.** **'అదిలి ఁబెక్కుమాట; లవి యెల్లను వమ్మయి పోయె; నస్త్రసం**
**తాడన శక్తి గీడ్పడియెఁ; దథ్యము బ్రాహ్మణ శక్తి యెక్కు ; దే**
**నోడితి వామ దేవునకు; నో జనసంఘములార ! సజ్జనా**
**మ్రేడిత కీర్తి నిమ్ముని నమిత్రనిషూదను నా శ్రయించెదన్.** **4-357**

# 34. ఇంద్రద్యుమ్నుని కథ.

**(అరణ్యపర్వము - చతుర్థాశ్వాసము 360 నుండి 370 పద్యం వరకు.)**
**(పాండవుల అరణ్యవాసకాలంలో మార్కండేయుడు ధర్మరాజుకు చెప్పిన కథలలో ఇది ఒకటి.)**

పూర్వం 'ఇంద్రద్యుమ్నుడ'నే ఒకమహారాజు ఉండేవాడు. అతడు చాలపుణ్యకార్యాలు చేసినాడు.మరణించిన తరువాత స్వర్గాన్ని చేరినాడు. తాను భూలోకంలో చేసిన పుణ్యఫలితంగా చాలా కాలం స్వర్గంలో సుఖంగాఉండినాడు. అతనికీర్తి చాలాకాలం తరువాత భూమిపైన మాసిపోయింది.అతడిని గురించి అనుకునేవాళ్లెవరూ లేకుండాపోయినారు. అందుచేత దేవతలు, "నీ కీర్తి భూమిమీద మాసి పోయింది.కాబట్టి నీవు స్వర్గంలోఉండడానికివీలులేదు." అంటూ ఆయనను భూమిమీదకు త్రోసి వేసినారు. అట్లా భూమిమీదకు చేరిన ఇంద్రద్యుమ్నుడు, మార్కండేయమహర్షి దగ్గరకు వచ్చినాడు. వచ్చి ఆ మార్కండేయుడితో ఇట్లాఅన్నాడు. "అయ్యా! మార్కండేయా! ఇప్పుడు భూమిపైన బ్రతికి ఉన్న ాళ్ళలో ఎక్కువ కాలంనుండి ఉండేవాడవు, నీవే కదా? గొప్ప పుణ్యాత్ముడైన ఇంద్రద్యుమ్నుడు నీకు తెలుసా?" అని అడిగినాడు. అందుకు సమాధానంగా మార్కండేయుడు "అయ్యా ! గుర్తురావడంలేదు. కానీ హిమాలయాలలో ఒకకొండశిఖరంమీద ఒకగుడ్లగూబఉంది. దానిపేరు 'ప్రావారకర్ణుడు.' అది వయసులో నాకంటె చాలాపెద్దది. అది నిన్నుగురించి నాకంటె బాగాచెప్పవచ్చును. పో." అన్నాడు. అప్పుడు ఇంద్రద్యుమ్నుడు మార్కండేయుడిని ప్రావారకర్ణుడివద్దకు పోవడానికి 'తనకు తోడురమ్మ'న్నాడు. అందుకు మార్కండేయుడు "అయ్యా! ముసలితనంవల్ల బలంలేకుండాపోయింది. బలంకోసం గొప్ప రసౌషధమాత్రను సేవించిఉన్నాను. అందువల్ల నాకిప్పుడు జ్వరంఎక్కువగాఉంది.కాబట్టి నేనిప్పుడు రాలేకపోతున్నాను. నన్ను క్షమించు." అన్నాడు.

అప్పుడు ఇంద్రద్యుమ్నుడు గుర్రంరూపంధరించి మార్కండేయుడిని ఎత్తుకొని ఆ గుడ్లగూబ దగ్గరకు పోయినాడు. అక్కడ ఇంద్రద్యుమ్నుడు గుడ్లగూబను మార్కండేయుని అడిగినట్లే అడిగినాడు. అందుకు గుడ్లగూబ చాలాసేపుఆలోచించి, "నిజంగా నీవు నాకుతెలియదు. ఇంద్రద్యుమ్నము అనే కొలనులో ఒకకొంగఉంది. దానిపేరు నాళీకజంఘుడు. ఆ కొంగ వయస్సులో నా కంటే పెద్దది. దానికి నీవు తెలిసి ఉండవచ్చు. పో." అన్నది.

ఇంద్రద్యుమ్నుడు గుర్రంరూపంలోనే మార్కండేయుడితోపాటు గుడ్లగూబనుకూడా మోసుకొని ఇంద్రద్యుమ్నము చేరినాడు. ఇంద్రద్యుమ్నుడు ఆ కొంగకు తనపేరుచెప్పి "నేను నీకు తెలుసా?" అని అడిగినాడు. ఆ కొంగకూడా "నేను నిన్నుతెలుసుకోలేకుండా ఉన్నాను. నాకంటె వయస్సులో పెద్దదైన తాబేలుఉంది. దానిపేరుఅకూపారుడు. అదికూడ ఈ కొలనులోనే ఉంది. ఆ తాబేలుకేమైనా నీవు తెలిసిఉండవచ్చు. అడిగి చూద్దాము". అనిచెప్పి ఆ తాబేలునుపిలిచి ఇట్లాఅన్నది. "నీ కొరకు పెద్దలు వచ్చిఉన్నారు. వారిసందేహం తీర్చడానికి రా." ఆ మాటలువిని తాబేలు కొలనినుండి బయటకు వచ్చింది.

అప్పుడు వారంతా (ఇంద్రద్యుమ్నుడు, మార్కండేయుడు, ప్రావారకర్ణుడు, నాళీకజంఘుడు) "ఇంద్రద్యుమ్నమహారాజు నీకు తెలుసా?" అని అకూపారుడిని అడిగినారు. వారట్లాఅడుగగా తాబేలు కొంతసేపు ఆలోచించింది. దానికి ఇంద్రద్యుమ్నమహారాజువిషయం గుర్తుకొచ్చింది. అప్పుడది కన్నీరు కారుస్తూ దు:ఖంతో గొంతుబొంగురుపోగా ఇట్లాఅన్నది." అయ్యో! ఇంద్రద్యుమ్నమహారాజు నాకు తెలియదా? ఆ మహాత్ముడు గొప్పగుణాలే అలంకారాలుగాకలవాడు. చాలసార్లు నన్నిక్కడ ఆపదల నుండి దయతోరక్షించినాడు. అంతటిగొప్పవాడైన ఆ మహారాజును మరచిపోవచ్చునా? ఈ కొలను ఎట్లా ఏర్పడిందనుకున్నారు. ఆ మహాత్ముడు ఎన్నోయజ్ఞాలుచేసి బ్రాహ్మణులకు ఆవులనుదానమిచ్చి నాడు. ఆ ఆవులగిట్టలరాపిడిచేతనే ఈ కొలను ఏర్పడింది. అందుచేతనే కదా దీన్ని ఇంద్రద్యుమ్నము అని పిలుస్తారు?"

అకుపారుడు ఇట్లాఅన్నాడో లేదో, దేవతలు విమానాల్లో అక్కడకు వచ్చినారు. ఇంద్రద్యుమ్నుణ్ణి చూచి ఇట్లాఅన్నారు. "మహాత్మా! నీ కీర్తి భూమిమీద ఇంకామాసిపోలేదు. శాశ్వతంగా నిలచిఉంది. నీకు స్వర్గము శాశ్వతమైంది. రా. విమాన మెక్కు". ఈ 'మాటల'ని దేవతలు ఇంకాఇట్లాఅన్నారు. "పుణ్యాత్ముడా! తనకీర్తి ఎంతకాలము ఈలోకంలో వినబడుతూ ఉంటుందో, అంతదాకా స్వర్గంలో మానవుడు సంతోషంగా ఉంటాడు."

ఆ మాటలకు ఇంద్రద్యుమ్నుడు దేవతలతో ఇట్లాఅన్నాడు." ఈ ముసలిముని, మార్కండేయు డిని ఈ ముసలి గుడ్లగూబనూ, నాపని మీద ఇక్కడకు తీసికొని వచ్చినాను. వాళ్ళను వాళ్ళవాళ్ళ నివాసాలకు చేర్చివస్తాను. కొంచెంసేపుండండి". అందుకు దేవతలంగీకరించినారు. ఇంద్రద్యుమ్నుడు గుడ్లగూబనూ మార్కండేయుడినీ, వారివారినివాసస్థలాలలో వదలిపెట్టి తిరిగివచ్చినాడు. అక్కడనుండి దేవతలతో పాటు తిరిగిస్వర్గంచేరినాడు.

**నీతి :** తాను చేసిన మంచిపని లోకంలోఎంతకాలం పొగడబడుతుందో? అంతకాలం అతడు స్వర్గ సుఖాలనుభవించ వచ్చు. అందుచేత అందరూ చేతనయినంతమేరకు వారికి కీర్తిని కలిగించే మంచిపనులుచేసే ప్రయత్నం చేస్తూఉండాలి.

**ఉ.** **'అక్కట! నే నెఱుంగనె మహాగుణభూషణు నమ్మహాత్ము? న**
**న్ని క్కడఁ బెక్కుమాఱులు ననేకభయంబులఁ బొందకుండఁగా**
**నక్కటికంబుతోడ దగ నాతఁడు గైకొని కాచెఁ గాదె? పెం**
**పెక్కిన యన్నరోత్తముని నెన్నఁటికిన్ మఱవంగవచ్చునే?** **4-366**

# 35. కువలాశ్వుని కథ (ధుంధుమారుని కథ.)

**(అరణ్యపర్వము చతుర్థాశ్వాసము 379 నుండి 390 మరియు 401 నుండి 413 పద్యాలు.)**
**(పాండవుల అరణ్యవాసకాలంలో మార్కండేయుడు ధర్మరాజుకు చెప్పిన కథలలో ఇదిఒకటి.)**

ఇక్ష్వాకువంశంలో బృహదశ్వుడురాజై అయోధ్యనుపరిపాలించేవాడు. అతనికుమారుడు కువలాశ్వుడు. అతడు చాలాభయంకరమైన తేజస్సుకలవాడు. ఆ కువలాశ్వునికి ఇరవైఒక్కవేలమంది పుత్రులు పుట్టినారు. వారంతా మిక్కిలిబలశాలురు. శస్త్రాస్త్ర విద్యలలో ఆరితేరినవారు.

ఇట్లాఉండగా బృహదశ్వుడు తపస్సుచేసుకోవడంకోసం అడవులకు పోవడానికి నిశ్చయించు కొన్నాడు. తనకుమారుడు కువలాశ్వుణ్ణి రాజునుచేసినాడు.

అయోధ్యనుండి అడవులకు బయలుదేరబోతున్నాడు. ఈ విషయమంతా 'ఉదంకుడ'నే ముని విన్నాడు. ఆయన వేగంగా అయోధ్యచేరినాడు. అడవులకు బయలుదేరుతున్నబృహదశ్వుణ్ణి కలుసుకొన్నాడు. ఆయనతో ఇట్లాఅన్నాడు.

"రాజా! నీవు ప్రీతితో ప్రజలను రక్షించు.అడవులకు పోవడమెందుకు ? అడవికి పోయిఉంటే కానీ సరిపోదా ? పూర్వపు రాజులందరూ ప్రజలనురక్షించుకోలేదా ? దానివల్ల వారుసద్గతులు పొందలేదా? నీవు ఇంతకాలం ప్రజలను రక్షిస్తూఉన్నావు. మాబోటి మునులందరూ అడ్డంలేకుండా ధర్మకార్యాలను చేయగలుగుతున్నారు. అట్లా ప్రజలను రక్షించడం నీవు చేయవలసిన కార్యమేకదా?"

ఇట్లాచెప్పి ఇంకాఇట్లాఅన్నాడు. "రాజా! విను. ఒక అద్భుతంచెప్తాను. పూర్వము 'మధు కైటభు' లనే రాక్షసులుండేవారు. వారి కుమారుడే 'ధుంధుడ'నేవాడు. అతడు చాలా బలశాలి. పరాక్రమవంతుడు. అతడు తపస్సుచేసి బ్రహ్మదేవుడినుండి వరాలుపొందిఉన్నాడు. ఆ వరాల ప్రభావంవల్ల అతణ్ణి దేవతలు, రాక్షసులు, గంధర్వులుకూడా ఏమీ చేయలేకపోయినారు. అట్లాంటి ఆ రాక్షసుడు నా ఆశ్రమానికి దగ్గరలో సముద్రతీరంలోని విశాలమైనఇసుకతిన్నెలలో ఒకసొరంగం చేసుకొన్నాడు. అందులోదూరి నిద్రపోతున్నాడు. అతడు వదిలేగాలి మంటలతోకూడి భయంకరంగా ఉంటుంది. అతడు సంవత్సరానికి ఒకసారి ఆ సొరంగంలోనుండి బయటికివస్తాడు. అతడు సొరంగంనుండి బయటపడేవేగానికి ఆకాశమంతా ఇసుకతోనిండిపోతుంది. దగ్గరలోఉన్నకొండలు అడవులు ఏడురోజులపాటు కంపిస్తూనే ఉంటాయి. ఇట్లాంటి దారుణత్వంవల్ల మాకు ఆశ్రమంలోఉండడానికి కష్టంగాఉంది. కాబట్టి నీవాదురాత్ముణ్ణి చంపవలె. ఆ దురాత్ముడు చస్తే మాకు చాలమేలుకలుగుతుంది. లోకాలకుకూడ మేలుచేసినట్లే . నీవు ధన్యుడవు అవుతావు. ఆ తరువాత తపస్సుచేసుకో. ఎవరైతే ఆ భయంకరమైన రాక్షసుణ్ణి చంపడానికి పూనుకొంటారో, వారికి తన 'శక్తి సామర్థ్యాలనిస్తాన'నీ, 'జయం కలిగిస్తాన'నీ, విష్ణుదేవుడు ఎప్పుడో చెప్పినాడు. నీవారాక్షసుని

చంపటడానికి పూనుకో. సాటిలేని విష్ణువుశక్తి నిన్నావహిస్తుంది. తప్పక జయంకలుగుతుంది. నీవు గొప్పభుజశక్తి కలిగినవాడవు. ఈ లోకంలో నీవుతప్ప అంతటివారెవరూలేరు. నీకు గొప్పకీర్తి కలుగుతుంది. పుణ్యంవస్తుంది. లే. ధుంధుణ్ణిచంపు. నన్నూ లోకాన్నీ కాపాడు". ఈ ఉదంకునిమాటలు విని బృహదశ్వుడు చేతులుజోడించి ఇట్లాఅన్నాడు.

"నిర్మలమైన మనసుతో అస్త్రసన్యాసం చేసినాను. తపస్సుకు పూనుకొన్నాను. ఇంక నేను అడవులకు పోవడంతప్పదు. నావిన్నపము విను. మహర్షీ! వీడే నా కుమారుడు కువలాశ్వుడు. వీడు కదు పుణ్యాత్ముడు. గొప్పబలవంతుడు. సజ్జనులకు ఎప్పుడూ మేలుచేసేవాడు. మిక్కిలి ధైర్యవంతుడు. నిండైన కీర్తి కలిగినవాడు. నీకు ప్రీతి కలిగించకలిగినవాడు. తన భుజబలంతో ఆ రాక్షసుణ్ణి చంపగలిగినవాడు. అంతేకాదు అతనికి ఇరవైఒక్కవేలమంది పుత్రులున్నారు. వారందరూకూడా అడ్డంలేనిశౌర్యంకలవారు. బాగా వృద్ధిపొందినవారు. వారందరూ తండ్రి కువలాశ్వుడికి తోడ్పడుతారు. నేను అడవికి పోవడానికి అనుమతించండి". ఇట్లాచెప్పి ఆ కార్యానికి మునికి తనకుమారుడు కువలాశ్వుడిని అప్పగించినాడు. ఆ ముని బృహదశ్వుణ్ణి అభినందించినాడు. ఆయనను అడవికిపోవడానికి అనుమతించినాడు. బృహదశ్వుడు ఆనందంగా తపస్సుకై అడవికిపోయినాడు.

ఆ విధంగా తండ్రిచేత ఆజ్ఞాపించబడిన కువలాశ్వుడు ఒకశుభదినాన ఉదంకమునిని ముందుంచుకొని బయలుదేరినాడు. తనవెంట అమిత ధైర్యసాహసాలు కలిగిన తనకుమారులు నడచినారు. విష్ణువు తనసాటిలేనిశక్తిలో కొంతభాగాన్ని కువలాశ్వునిలో ఆవహింపచేసినాడు. ఇంద్రుడు మొదలైన దేవతలు మిక్కిలిసంతోషించినారు. గొప్పగొప్ప ఋషులందరూకూడా సంతోషించినారు. వారందరి ఆశీస్సులతో కువలాశ్వుడు వెలిగిపోయినాడు. దివ్యమైనమంగళవాద్యాలు మ్రోగినాయి. నందనవృక్షాల సువాసనలుకల పూలవాన కురిసింది. అనుకూలమైన పిల్లగాలులు వీచినాయి. ఆ పిల్లగాలులు కువలాశ్వునికి ఇంపుకలిగించినాయి. ఆకాశంలో లెక్కకేనన్ని దేవతావిమానాలు గుమిగూడినాయి. శుభశకునాలెన్నో కనిపించినాయి.

ఈ విధంగా పోయి కువలాశ్వుడు సముద్రతీరంలో విడిది చేసినాడు. తన కుమారులందరనూ 'ఆ ఇసుకతిన్నెలన్నీ త్రవ్వమ'ని ఆజ్ఞాపించినాడు. ఆ కుమారులందరూ రకరకాలైన శస్త్రాస్త్రాల నుపయోగించడంలో ఆరితేరినవారు. మహాబలాఢ్యులు. అడ్డులేని వేగంకలిగినవారు. అట్లాంటి రాజ కుమారులంతా పూనుకొని ఇసుకతిన్నెలను త్రవ్వడంప్రారంభించినారు. ఏడుదినాలావిధంగా త్రవ్వగా ఆ ఇసుకలో బాగానిద్రపోతూఉన్న రాక్షసుడు వారికికనిపించినాడు. ఆ రాక్షసుడు పీల్చివదిలే గాలి మండుతూ ఆ ప్రాంతమంతా నిండిపోయింది.

రాక్షసుడావిధంగా కనిపించగానే రకరకాలైన ఆయుధాలతో కువలాశ్వుని పుత్రులు పరాక్రమంతో వాడిని కొట్టినారు. అట్లా చాలాసేపు కొట్టగా రాక్షసుడు నిద్రనుండి మేల్కొన్నాడు . ఒళ్ళు విరచుకొన్నాడు. నీలిగినాడు. నోరు పూర్తిగాతెరచి ఆవులించినాడు. ఆ రాక్షసుడి నోటినుండి, కళ్ళనుండి, ముక్కునుండి, భయంకరమైన అగ్ని జ్వాలలు బయటకు వస్తూఉన్నాయి. ఆ మంటలలో పడి రాజకుమారులందరూ చచ్చినారు. చావకుండా మిగిలిన రాజకుమారులు ముగ్గురే. వారు దృఢాశ్వుడు, కపిలాశ్వుడు భద్రాశ్వుడు. ఇట్లా ఈ ముగ్గురుతప్ప మిగిలినకొడుకులందరూ చావగా కువలాశ్వుడికి చాలాకోపం వచ్చింది. ప్రళయ కాలంలోని సూర్యుడిలా మండిపోతూ రాక్షసుని దగ్గరకు చేరినాడు.

ఆ రాక్షసుడుకూడా కోపంతో వేగంగాలేచినాడు. ఒకశూల మెత్తుకొన్నాడు. కువలాశ్వుణ్ణి ఎదుర్కొన్నాడు. అప్పుడు కువలాశ్వుడు తనయోగవిద్యాప్రభావంతో నీటిని పుట్టించినాడు. ఆ నీటితో రాక్షసుడినుండి వెలువడేమంటలను ఆర్పివేసినాడు. వెంటనే బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించినాడు. దివ్యమైన ఆ బ్రహ్మాస్త్రము భూమినీ, ఆకాశాన్నీ, అన్ని దిక్కులనూ వెలిగించింది. అట్లావెలిగిపోతూ మహాభయంకరంగా ఆ రాక్షసుణ్ణి కాల్చిబూడిదచేసింది. ఇదంతా ఒక్కక్షణంలోనే మహాద్భుతంగా జరిగిపోయింది. దేవతలూ మునులూ కువలాశ్వునితో ఇట్లాఅన్నారు. " రాజా! దేవతల శత్రువైన ధుంధుణ్ణి చంపినావు. లోకాన్నంతటినీ రక్షించినావు. ఇప్పటినుండి నీవు 'ధుంధుమారుడు' అనేపేరుతోప్రకాశించు."

**నీతి :** తాను ఎంత నష్ట పోయినా ప్రజారక్షణమే రాజుకర్తవ్యము. నేటి రాజకీయనాయకులకు కూడా అదే కర్తవ్యము కావలె.

**విశేషము :** ఈ ధుంధుమారుడు 28వ కథలోనివాడు కాదు.

**చ.** **అనఘుఁడు మత్సుతుండు గువలాశ్వుఁడు వీఁడె మహాబలుండు; స**
**జ్జనహితకారి; ధైర్యనిధి; సంభృత కీర్తి; భవత్ప్రియార్థమై**
**జనసుత! యమ్మహాసురుని ఁజంపుట కోపు, నవార్య శౌర్యవ**
**ర్ధ నులగు చున్న పుత్రులునుదాను, నభేద్య భుజావిభూతితోన్.** **4-389**

# 36. మధుకైటభుల కథ

**(అరణ్య పర్వము 4-391 నుండి 399వరకు.)**
**(పాండవులు అరణ్యవాసంలో ఉండగా మార్కండేయుడు ధర్మరాజుకు చెప్పినకథ.)**

పూర్వం చాలకాలంకిందట లోకాలన్నీ ఒకేసముద్రంగా ఉండేవి. నీళ్ళులేనిచోటే ఉండేదికాదు. అప్పుడు హరి ప్రకాశించే 'ఆదిశేషుడు' అనే పాము పాన్పుపైన శుభమైనయోగనిద్రలో సుఖంగాఉండినాడు. అట్లా చాలకాలం జరిగినతరువాత మహాబలంకలిగి శత్రువులందరనూ జయించిన 'మధు కైటభుల'నే ఇద్దరు రాక్షసులు అక్కడకువచ్చినారు. ఆ పరమాత్ముని దివ్యమైన బొడ్డుతామరలో ప్రకాశించే బ్రహ్మదేవుణ్ణి చూచినారు. దర్పంతో ఆ బ్రహ్మను కొట్టినారు. ఆ బ్రహ్మ భయపడి, "పరమాత్మా! నన్నుచూడు". అంటూ పెద్దగాఅరుస్తూ ఏడిచినాడు.

ఆ విషయాన్ని గ్రహించిన విష్ణుదేవుడు యోగనిద్రనుండి మేల్కొన్నాడు. భయంకరమైన పరాక్రమంకలిగిన, భయంలేని, సింహాలవంటి రాక్షసులను చూచినాడు. " మీరితణ్ణి శౌర్యంతో బాధించడం ఎందుకు? మీకు కలబలశౌర్యాలకు సంతోషపడినాను. వెంటనే మీకిష్టమైనవరాలుకోరండి. ఇస్తాను" అన్నాడు. అందుకు ఆ రాక్షసశ్రేష్ఠులు "కలకల" నవ్వినారు. "నీవు మాకేమిస్తావు.? నీకు మేమే వరాలిస్తాము. కావాలంటే అడుగు." అన్నారు. అప్పుడు ఆ విష్ణువు వారితో ఇట్లాఅన్నాడు. "సత్యవ్రతం కలిగిన వారలారా! మిక్కిలివేడుకతో మిమల్ని 'వరమ'డుగుతున్నాను. లోకాలన్నింటికీ ఆనందం కలిగించడం కొరకు ఇప్పుడు మీరిద్దరూ నాతోచావండి". అన్నాడు.

ఆ మాటలువిని వారు ఒకరిముఖం ఒకరుచూచుకొన్నారు. ఆ విష్ణువుతో ఇట్లాఅన్నారు. "జనార్ధనా! విను. నవ్వుతూనవ్వుతూకూడా మేమెప్పుడూ అబద్ధాలుచెప్పము. మిక్కిలి లెక్కలేనంత బలంలో పరాక్రమంలో ధైర్యంలో మేముసమగ్రులము. అయినా కాలపురీతిని మార్చడం సాధ్యమౌతుందా? నీ కోరిక ప్రకారమేకానీ గాక! నీకు మెప్పుకలిగేట్లు ఇదిగో మాప్రాణాలిస్తున్నాము. చావుకు మనస్సులో ఏమీ బాధపడము. అయితే కమలనాభా! నీవు మమ్మల్ని చంపేట్లయితే నీళ్ళులేని ప్రదేశంలోచంపు. ఇంతవరకు నిజం. నీచేతచావడానికి మేముతగినవారము." వారి ఉద్దేశ్యంలో 'నీళ్ళులేని ప్రదేశమే లేద'నీ అందుచేత విష్ణువు 'వారినిచంపలేడ'నీ.

ఆ మాటలువిన్నాడు విష్ణువు. మూడులోకాలూ నీటితో నిండిఉండడంగుర్తించినాడు. వారి యుక్తిని గమనించి నవ్వినాడు. తనతొడలనే శయ్యగా చేసినాడు. తొడలపైన నీరు లేదుకదా? ఆ తొడల మీద

వారిద్దరి తలలను సుదర్శనచక్రపు దెబ్బతో వేగంగా నరకివేసినాడు. ఆ సుదర్శనచక్రం కఠినమైన వాడిఅయిన కరకుటంచులు కలిగిఉంది. అందుచేత వారితలలు అనాయాసంగా తెగిపోయినాయి. ఆ విధంగా మధుకైటభులు అంతమైనారు.

**నీతి :** అహంకారము పనికిరాదు.

**ఉ.** **ఆతెఱఁగాత్మఁగాంచి, కమలాక్షుఁడు మేల్కని, ఘోరవిక్రమో**
**పేతుల, దైత్యసింహుల,న పేతభయాత్ముల ఁజూచి ,మీరలి**
**ట్లీతని నుక్కునంబరపనేల? భవద్భుల శౌర్యయుక్తి కిం**
**బ్రీతుఁడనైతిఁ; జెచ్చెర నభీష్ట వరంబులు వేఁడుఁడిచ్చెదన్.** **4-392**

**తే.** **అనిన ఁగలకల నవ్వియయ్యసురవరులు నీవు మాకేమియిచ్చెదు? నీకునేము**
**వరములిచ్చెద, మదుగుము వలచి తేని; ననిన వారలకిట్లను నవ్విభుండు.** **4-393**

# 37. ధర్మవ్యాధునికథ.

**(అరణ్యపర్వము-పంచమాశ్వాసం 7 నుండి 145 పద్యాలవరకు.)**

**(పాండవుల అరణ్యవాసకాలంలో మార్కండేయుడు ధర్మరాజుకుచెప్పినకథలలో ఇదిఒకటి.)**

పూర్వమొకప్పుడు 'కౌశికుడ'నే బ్రాహ్మణుడుండేవాడు. అతడు ధర్మాన్ని ఆచరించేవాడు. తపస్సు చేసేవాడు. ఎల్లప్పుడు వేదాలనువల్లెవేయడంలోనే కాలంగడపేవాడు. అతడు ఒకానొక పల్లెటూరికి సమీపంలో నివసించేవాడు. అతడొకరోజున ఒకచెట్టుమొదట్లో కూర్చున్నాడు. అలవాటుచొప్పున వేదాలువల్లెవేస్తూఉన్నాడు. ఆ చెట్టుపైనఉన్న ఒకకొంగ రెట్టవేసింది. ఆ రెట్ట కౌశికునిపై పడింది. అదిచూచిన కౌశికుడికి కోపంవచ్చింది. కోపంతో ఎర్రబడ్డకళ్ళతో కొంగను చూచినాడు. వెంటనే ఆ కొంగ చచ్చినేలపైపడింది. ఆ కొంగ అట్లాచావడంచూచి కౌశికుడు, "అయ్యో! నా మనస్సు దయలేనిది. అనవసరంగా కొంగనుచంపినాను. నాకు శాంతిఎక్కడుంటుంది?" అని కలతచెందినాడు. చాలవిధాలుగా విచారించినాడు. మధ్యాహ్నమైంది. ఆ దుఃఖాన్ని ప్రక్కకుపెట్టి మధ్యాహ్నము చేయవలసినపనులను పూర్తిచేసినాడు. తరువాత భిక్షకొరకై గ్రామంలోనికి బయలుదేరినాడు. శుచికలిగిన బ్రాహ్మణులఇళ్ళకు భిక్షమెత్తుకుంటూతిరిగినాడు. ఆ క్రమంలో ఆ గ్రామంలోని ఒక పుణ్యాత్ముల ఇంటివాకిటనిలిచినాడు. "భిక్షాందేహి"అన్నాడు. ఆ ఇంటి ఇల్లాలుకూడా 'భిక్ష పెడదామ'నుకొన్నది. మిక్కిలితత్తరపాటుతో పాత్రకోసం వెతుకుతూఉంది.

అదేసమయానికి ఆమెభర్త మిక్కిలిఆకలితో తూలుతూ ఇంటికివచ్చినాడు. అట్లాతూలుతూ భర్తరాగా ఆమెతత్తరపడింది. భిక్షవిషయం మరచిపోయింది. భర్తకు తగినపీఠంపెట్టింది. కాళ్ళు కడుక్కోవడానికి నీళ్ళిచ్చింది. భక్తితో స్నానం చేయించింది. ప్రియమైనమాటలు చెప్తూతూ కమ్మనిఅన్నం, కూరలూ, పానీయాలు, సమర్పించింది. ఈ విధంగా తనభర్తను ఆకలినుండి ఆయాసంనుండి తేరుకొనేట్లు చేసింది. సంతోషపెట్టింది. భర్త భోజనంచేసినతరువాత విశాలమైన మెత్తనిశయ్యను ఏర్పాటుచేసింది. భర్త ఆ శయ్యపై శయనించగా ఆయనకు తాంబూలమిచ్చింది. పాదాలు ఒత్తింది. భర్తకు కునుకుపట్టింది.

అప్పుడు భిక్షకోసం వాకిటనిలచిన బ్రాహ్మణుడు ఆమెకుగుర్తుకువచ్చినాడు. ఆయనకు సమర్పించడానికి భిక్షతీసికొని వెనువెంటనే బయటకువచ్చింది. కౌశికుడామెను చూచినాడు. ఆమెను చూడగానే ఆయనకు కోపంవచ్చింది. కళ్ళు ఎర్రబడినాయి. "ఇంతటి ఆలస్యమా? నీవుచాల దుర్బుద్ధివిగా కనిపిస్తున్నావు. నన్నిట్లానిలబెట్టినావు. బిక్షమో వేయలేదు. 'పొమ్మ'నీ చెప్పలేదు. నన్ను మిక్కిలి అవమానించినావు. నీ కంతమదమెందుకు?" అన్నాడు. ఆ మాటలనువిని, ఆ పతివ్రత ఇట్లాఅన్నది. "అయ్యా నాభర్త మిక్కిలిఆకలితో ఇంటికివచ్చినాడు. నేను భక్తితో ఆ మహాత్మునికి సేవలుచేస్తూఉండినాను. అందువల్ల నీగురించి కాస్తసమయము మరచిపోయినాను. దీన్ని తప్పుగా బావించవద్దు. ఈ ఆలస్యాన్ని దయతో సహించండి."

ఆ మాటలు విని, కౌశికుడికి కోపంఇంకాపెరిగింది. ఆమెతో ఇట్లాఅన్నాడు. "అమ్మా! నీ మగడంత ఎక్కువనా? మేధావులైన బ్రాహ్మణులింతతక్కువనా? బ్రాహ్మణులను లోకమంతా గౌరవిస్తుంది కదా? నీవు వాళ్లనెందుకు గమనించవు? ఎందుకు మరచిపోయినావు? గర్వమా? దేవేంద్రుడు మొదలుకొని అందరూ బ్రాహ్మణులను భక్తితోపూజిస్తున్నారు. కానీ ఎందుకు ఈ విధంగా ఇక్కడ నేను నీకింతచులకనైనాను? అవమానింపబడితే 'బ్రాహ్మణులకోపం' అనేఅగ్ని, జ్వాలలతో మండుతుంది. వారు కొండలూ, అడవులూ, దీవులతోపాటు భూమినంతా తిరుగులేకుండా నాశనంచేయగలరు. నీకీవిషయం తెలిసినట్లులేదు.

కౌశికుని ఈ గర్వపు మాటలువిని, ఆ పతివ్రత ఇట్లాఅన్నది. "అయ్యా! బ్రాహ్మణులు దేవతలతో సమానమైనవారు. వారిమాహాత్మ్యం నాకు తెలియదా? ఒక బ్రాహ్మణుడు (దుర్వాసుడు) కోపగించుకొని 'సముద్రజలాలను త్రాగడానికి పనికిరాకుండా' శపించలేదా? ఇంకొక బ్రాహ్మణుడు (శుక్రుడు) కోపంతో 'దండకారణ్యాన్ని కాల్చి వేయలేదా?' వేరొక బ్రాహ్మణుడు (అగ్రస్త్యుడు) 'వాతాపి' అనే రాక్షసుణ్ణి 'మ్రింగి అరగించుకోలేదా?' ఇంకా భూమిమీద చాలమంది బ్రాహ్మణుల మహిమలను వినలేదా? విప్రోత్తమా! తెలిసితెలిసీ కొరివితో తలగోక్కుంటానా ? నేనంత పిచ్చిదాననా?నా విషయం చెప్తాను. విను. నాపాలిటికి నాభర్తయేదైవం. నేను మనసుతో, మాటలతో, పనులతో, నా భర్తహితాన్నే కోరేదానను. ఎంతఆలోచించినా ఇంతకుమించినధర్మం నాకు కనబడడంలేదు. 'నీవు చాలకోపిష్ఠివాడవ'ని నాకు తెలుసు. నీకోపానికి ఒకకొంగ చిన్నతప్పుకే చచ్చిందికదా? నాపాతివ్రత్య మహిమవల్ల నాకావిషయం తెలిసింది. కోపాన్ని కలిగిఉండడం మంచిదికాదు."

పతివ్రత కౌశికునితో ఇంకాఇట్లా అన్నది. "మానవుల హృదయాలను 'క్రోధం, మోహం' అనే ఇద్దరు భయంకరమైన శత్రువులు సదాకాలుస్తూఉంటారు. ఆ ఇద్దరనూ అణచలేనినాడు బ్రాహ్మణునకేం గౌరవముంటుంది? 'బ్రాహ్మణుడ'ంటే ఎప్పుడూసత్యంమాట్లాడేవాడూ, హింసకుదూరంగాఉండేవాడూ, తల్లిదండ్రులకు పెద్దలకు మేలుకోరేవాడూ, మేలుచేసేవాడూ, ఇంద్రియాలను జయించినవాడూ, అందరనూ తనలాగా అనుకొనేవాడూ, ధర్మంమీద ఇష్టంకలిగినవాడూ, కోరికలలో చిక్కుకొననివాడూ, షట్కర్మలనూ చక్కగా ఆచరించేవాడూనూ. (షట్కర్మలు అంటే ఆరుకర్మలు. ఈ ఆరుకర్మలు 'బ్రాహ్మణులు చేయదగినవ'ని పెద్దలు చెప్తారు. అవి (1) 'యజనం' అంటే యజ్ఞం చేయడం (2) 'యాజనం' అంటే యజ్ఞంచేయించడం (3) 'అధ్యయనం' అంటే వేదాలను అధ్యయనంచేయడం (4) 'అధ్యాపనం' అంటే వేదాలను ఇతరులతో అధ్యయనంచేయించడం (5) 'దానం' అంటే యోగ్యులకు దానంచేయడం (6) 'ప్రతిగ్రహం' అంటే యోగ్యులవద్దనుండి దానాన్నితీసుకోవడం.) అట్లాంటి పుణ్యాత్ముడైన వాడినీ పాపాలు చేయని వాడినీ 'బ్రాహ్మణుడ'ని దేవతలెపుడూ పొగడుతూఉంటారు. బ్రాహ్మణునికి 'ఆర్జవము (సరియైన ప్రవర్తన), శమము (ఇంద్రియ నిగ్రాహం) అధ్యయనం' అనేవే గొప్పధనాలు. ధర్మమార్గానికి ఇవేతగినసాధనాలు. వేదాలుచేప్పే ముఖ్యకర్తవ్యాలుకూడాఇవే. ధర్మం

రకరకాలుగాఉంటుంది . అందులో సూక్ష్మాలు ఉంటాయి. నీకు వేదాలను వల్లెవేయడం మాత్రమే తెలుసు. కానీ ధర్మసూక్ష్మాలు తెలియవు. కాబట్టి ఆలస్యం చేయకుండా మిథిలానగరానికి పో. అక్కడ 'ధర్మవ్యాధుడ'నే వాడుంటాడు. అతడు ఇంద్రియాలను జయించినవాడు. సత్యసంధుడు. మాతాపితృభక్తుడు. అతడొకబోయవాడు. నీకు అన్ని ధర్మాలనూ తెలియచేస్తాడు. నీ అనుమానాలన్నింటినీ తీరుస్తాడు. నామీద కోపంతగ్గించుకొని, అనుగ్రంహంచూపించు. స్త్రీలకు జ్ఞానముండదు. కాబట్టి వారెట్లాంటి తప్పులుచేసినా దయతోఓర్చుకోవలెకదా?"

ఈ మాటలు వినగానే కౌశికుడు తనతప్పును తాను తెలుసుకొన్నాడు. తాను బ్రాహ్మణుడైనప్పటికీ, అమె పేర్కొన్న గుణాలన్నీ తనలో లేనట్లుబాగాగుర్తించినాడు. ఆమెతో వినయంగా ఇట్లాఅన్నాడు. "అమ్మా! ఇల్లాంద్రతో పొగడబడిననిన్ను నేనునిందించి తప్పుచేసినాను. నీవల్ల నామనసు శాంతించింది. నేను పోయివస్తాను. నీకు సాటిలేని శోభనాలు కలుగుతాయి."

ఇట్లా ఆ పతివ్రతను దీవించి అక్కడనుండి బయలు దేరినాడు కౌశికుడు. ధర్మవ్యాధుణ్ణి చూడాలనే కోరిక ఎక్కువగాకలిగింది. ఆ క్షణమే మిథిలవైపుకు కదలినాడు. దారిలో పతివ్రత తానుకొంగను చంపిన విషయం తెలుసుకొన్నందుకు ఆశ్చర్యపడినాడు. "తప్పు చేసినాను కదా?" అని బాధపడినాడు. నిలబడకుండా ప్రయాణంచేసినాడు. అనేక గ్రామాలు పట్టణాలూ దాటినాడు. ఎట్టకేలకు మహావైభవం కలిగిన మిథిలానగరంచేరినాడు. నగరంలోనికి ప్రశించినాడు. రాజమార్గము సమీపించినాడు. అక్కడిజనులను "ధర్మవ్యాధు" డెక్కడుంటాడో అడిగి తెలిసికొన్నాడు. కౌశికు డక్కడకు చేరుకున్నాడు. ఎదురుగా ధర్మవ్యాధుడు కనిపించినాడు. అప్పుడాతడు చిన్నచిన్న ముక్కలుగా చేసిన మాంసాన్నిపరచి అమ్ముతున్నాడు. ఎడతెగకుండా కొనడానికి వచ్చినవాళ్ళు అతని చుట్టూమూగిఉన్నారు. ఇదంతా దూరంనుండే చూచినాడు కౌశికుడు. రోతఅయిన మాంసపుటంగడి దగ్గరకు చేరడానికి మనసొప్పక దూరంగా ఒకచోట నిలబడిఉండినాడు.

కొంతసేపటికి దుకాణంలోని మాంసమంతా అమ్ముడయింది. సందడితగ్గింది. ధర్మవ్యాధుడు కౌశికుడక్కడ ఉన్నవిషయం ఎప్పుడో గమనించినాడు. అంగడి మూసివేసి కౌశకునివద్దకు వచ్చినాడు. ఆతని పై మిక్కిలిఅనురాగంచూపిస్తూ ఇట్లాఅన్నాడు. "పుణ్యాత్ముడా! ఉత్తమురాలైన ఆ పతివ్రత నీకు నా విషయంచెప్పింది. నీవుకూడా ఆమెమాటలువిని నన్నుప్రేమతో చూడాలనుకొన్నావు. ఇక్కడకు వచ్చినావు. నీ కోరిక నాకుతెలుసు. నీవురావడం నాకు చాలసంతోషంగాఉంది. మా ఇంటికి పోదాం రా." అని, ఆ కౌశికుణ్ణి తన ఇంటికి తోడుకొనిపోయినాడు.

కౌశికుడు ధర్మవ్యాధుడి జ్ఞానానికి ఆశ్చర్యపడినాడు." ఎక్కడో పల్లెలోని పతివ్రతమాటలు ఈ నగరంలోని ఈయన కెట్లాతెలిసినాయి". అని ఆశ్చర్యపడినాడు. "మొదటిఆశ్చర్యము నేను కొంగను చంపడాన్ని పతివ్రత తెలుసుకోవడం. రెండవఆశ్చర్యం ధర్మవ్యాధుడు పతివ్రతనుగురించి తెలుసు కోవడం" అనుకుంటూ ధర్మవ్యాధుడివెంట ఆయనఇంటికి పోయినాడు. అక్కడ ధర్మవ్యాధుడు కౌశికుణ్ణి పూజించినాడు. కొంతసేపు సరససల్లాపాలు చేసినారు. ఇరువురు నచ్చిన కథలను ఒకరికొకరు చెప్పుకొన్నారు.

ఆ తరువాత కౌశికుడు ధర్మవ్యాధుడితో ఇట్లాఅన్నాడు. "నీవు ధర్మాలు బాగాతెలిసినవాడవు. జీవ హింసచేసి బ్రతకడం మంచిమార్గమా? జీవించడానికి వేరేమార్గమేది దొరకలేదా? అయ్యో!నీవు చేస్తున్న ఈ భయంకరమైనపనినిచూచి నామనసుదు:ఖించింది". ఈ మాటలువిన్న ధర్మవ్యాధుడు ఇట్లా సమాధానము చెప్పినాడు. "బ్రాహ్మణులకు తపస్సు, వేదాధ్యయనం, సత్యం, శౌచం, బ్రహ్మచర్యం, ధర్మాలు. అట్లాగే క్షత్రియులకు దండనీతి కర్తవ్యం. వైశ్యులకు వ్యవసాయం, పశుపాలన, వ్యాపారంచేయదగిన పనులు. శూద్రులకు శుశ్రూషయే గొప్పధర్మం. అదేవిధంగా బోయలమైనమాకు జంతువులమాంసంపై ఆధారపడి బ్రతకడం గొప్పధర్మం. ఇంకా చెప్పాలంటే ఇది వంశపారంపర్యంగా చేస్తున్నపని. అంతేకాదు. ఈ దేశానికిరాజు జనకుడు. అతడు రాజధర్మతత్పరుడు ఎవరుచేయవలసినపనిని వారిచేత వదలకుండా చేయిస్తాడు. తాను చేయవలసినపనిని వదలినవాడినెవరినైనా కఠినంగాదండిస్తాడు. తన పుత్రుడినికూడ ఈ విషయంలో వదలడు. కాబట్టి నేను నాకువంశపార్యంగావచ్చిన ఈ పనిని వదలడానికి భయపడతాను." అనిచెప్పి ఇంకాఇట్లాఅన్నాడు. "పుణ్యాత్ముడా! నేను ఈ విధంగా జీవహింసతో బ్రతికేవాడిలాగా కనిపిస్తున్నప్పట్టికీ నేనుస్వయంగా ఏజీవినీచంపను. ఇతరులు చంపితెచ్చిన మాంసాన్ని కొంటాను. తగిన వెలకమ్ముతాను. ఆ విధంగా బ్రతుకుతున్నాను. ఇందులో నాకు మనశ్శాంతిఉంది. అణకువగా గురువులనూ ముసలివాళ్లను, అతిథులను, బ్రాహ్మణులను, దేవతలను, పూజిస్తాను. సత్యం పలకడాన్ని కానీ, పరిశుభ్రతను పాటించడాన్ని కానీ, ఏమారను. నా సేవకులకు దానాలిస్తాను. బంధువులకు మర్యాదలు చేసిగౌరవిస్తాను. ఓర్పుగాఉంటాను. ఎవరిపైనా అసూయపడను. దేనిమీదా కోరికలుపెంచుకోను. ఇతరుల తప్పులను గురించిన మాటలెప్పుడూ వినను. ఉపవాసనియమం పాటిస్తాను. ఏకపత్నీవ్రతం పాటిస్తాను. ఇతరులెవరైనా నన్నుపొగడినా, తిట్టినా సమానంగానే తీసుకొంటాను.అందువల్లనే నేను తక్కువ కులంలో పుట్టినప్పటికిన్నీ 'స్వచ్ఛమైన వాడన'యినాను.మాటల సందర్భములో ఇదంతాచెప్పవలసి వచ్చిందికానీ, నేను 'గొప్పవాడన'ని చెప్పుకోవడంకోసంకాదు. అయినా నీవు ధర్మం తెలుసుకోవడానికి నాదగ్గరకు వచ్చినావు. కాబట్టి ధర్మసూక్ష్మాలుచెప్తాను. జాగ్రత్తగావిను". అని చెప్పి ఈ విధంగా ధర్మసూక్ష్మాలను వివరించిచెప్పినాడు.

"తనకులధర్మాన్ని విడువకుండాబ్రతకడం 'గొప్పధర్మమ'ంటారు పెద్దలు. మనసులో దయ ఉండడంముఖ్యము. ఎవరి అభిప్రాయాన్నైనా ఓర్పుగా వినవలె. ఇంద్రియసుఖాలపై కోరికను వదలుకోవలె. 'త్యాగంతోసమానమైనగుణం ఎక్కడవెదకినాకనిపించద'ని పెద్దలంటారు.త్యాగశీలునికి 'అసాధ్యమ'ంటూ ఏదీఉండదు. ఎప్పుడూ సత్యమే పలుకవలె.ఎవరికైనా మేలుకలిగించేమాటలే మాట్లాడడం మంచిది. కీడుకలిగించేమాటలు మాట్లాడకూడదు. మంచివారిని ఎప్పుడూగౌరవిస్తూఉండవలె. కోరికలవల్ల, పగవల్ల, మనస్సు కలతబారుతుంది. అట్లాంటిసందర్భాలలో ధర్మంతప్పకుండాఉండడం చాలమంచిది. ఇష్టమయినపని జరిగితే సంతోషించడం, అనిష్టమయినపనిజరిగితే దీనుడుకావడంతగదు. చెడుచేసినవాడికికూడమంచిచేస్తే పెద్దలుపొగడుతారు. ఇతరులకుచెడుచేసేవాడు తనపాపంవల్ల తానేకాలిపోతాడు. అట్లాంటప్పుడు మనకు కీడుచేసినవాడికి ఇంకావేరేకీడు మనంచేయడమెందుకు? ధర్మాత్ములుచేసే మంచిపనులను, నాస్తికులు నిందిస్తారు. దుర్మార్గులపద్ధతి నంగీకరించి, సన్మార్గుల ధర్మాలపైన అభిమానాన్నివదలుకోకూడదు. అనాలోచితంగా తనకు పాపంకలిగితే పశ్చాత్తాపపడితే సగంపాపం పోతుంది. 'ఇంక ఇట్లాంటిపాడుపనిచేయను' అనేబుద్ధికలిగితే మిగితాసగంపాపం కూడాపోతుంది. పాపగుణాలన్నింటి కంటెపెద్దవి 'కోపం, లోభం (పిసినారితనం)'. ఈ రెంటిని జయిస్తే కాని అతణ్ణి, 'గొప్పధార్మికు'డనరు. సజ్జనులుపాటించని కొన్నిమార్గాలు ధర్మాలుగాకనిపించవచ్చును. కానీ అవినిజంగా ధర్మాలైఉండవు. అవి గడ్డిచేతమూసివేయబడిన నూతులలాగా తప్పుడుధర్మాలై ఉంటాయి. అందుకేసజ్జనులు వాటినిపాటించరు. అట్లాంటివాటిని దూరంనుండే వదలివేసి, మంచి ఆచారలనుపాటించడం మంచిధర్మలక్షణం". ఈ విధంగా ధర్మవ్యాధుడుచేసిన ధర్మబోధనను జాగ్రత్తగా విని కౌశికుడు, "శిష్టాచారాలు (సజ్జనులు పాటించే ఆచారాలు) ఏవి? తెలియచేయండి" అన్నాడు. దానికి సమాధానంగా ధర్మవ్యాధుడు తిరిగిబోధను ఇలాకొనసాగించినాడు.

"మహాత్మా! దానంచేయడం, సత్యమేమాట్లాడడం, తపస్సుచేయడం, ఆర్జవము (న్యాయమైన నడవడిక) కలిగిఉండడం, పెద్దలనుసేవించడం, దమము (ఇంద్రియ నిగ్రహము) కలిగిఉండడము, ఎల్లప్పుడూ సంతోషంగాఉండడం, వేదాధ్యయనంపై ప్రేమకలిగిఉండడం, ధర్మాన్నే ఆచరించడం, శీలాన్ని రక్షించుకోవడం, పుణ్యక్షేత్రాలను దర్శించడం, శుభ్రతను పాటించడం, జీవరాశులన్నింటి మీదదయ కలిగిఉండడం, మితంగా మాట్లాడడం, ఎవరికైనామేలు కలిగేట్లు మాట్లాడడం, ఆశ్రయించిన హితులను కాపాడడం, ఇంతేకాకుండా కామాన్నీ లోభాన్నీ కోపాన్నీ పటాటోపాన్నీ దీనత్వాన్నీ అసూయనూ అహంకారాన్నీ వదలుకోవడం, ఎవరికైనా కీడుకలిగేట్లు మాట్లాడకుండాఉండటం, నాస్తికుల చర్చలలోనికి పోకుండాఉండడం, ఇవన్నీ శిష్టుల (మంచివారి ) ఆచారాలు. ఇట్లాంటి శిష్టప్రవర్తనతో మనసుకు కలిగే సంతోషం ఇంకేవిధంగానూలభించదు. కాబట్టి దీక్షతో శిష్టాచారాలునడపు. పెద్దలనుసేవించు. వేదాధ్యయనంచేయి. జ్ఞానంచేత పరిపక్వమైన మనస్సును కలిగిఉండు. 'భ్రాంతి' అనేది 'సముద్రం'లాంటిది. దానిని దాటియేతీరవలెను. ఆ సముద్రంలోనినీళ్లు ఇంద్రియార్థాలు. ఆ నీటిలో 'కామక్రోధాల'నే మొసళ్ళుంటాయి. 'ధైర్యము' అనే తెప్పపైన ఆ 'భ్రాంతి'అనే సముద్రాన్ని దాటు. ఆ విధంగా నడచుకొని ధన్యుడవు కా." అనిచెప్పి ఇంకాఇట్లాచెప్పినాడు.

"శిష్టాచారాలు తెలిస్తే, ధర్మానికి చాలాఅనుకూలంగాఉంటుంది. నిర్మలమైనమనస్సు సత్యము, అహింసలకు స్థానమవుతుంది. అహింస అన్నిధర్మాలలోనూ మేటియైనది. దానికి సత్యంతోడైతే అది ఇంకా ప్రకాశిస్తుంది. శిష్టాచారాలలో 'సత్యమేగొప్పద'ని పెద్దలంటారు. ధర్మాలు మూడువిధాలు. ఇవి (1) వేదాలలో చెప్పబడినవి (2) శాస్త్రాలలో చెప్పబడినవి (3) శిష్టాచారాలు. ఈ మూడు విధాలైన ధర్మాలుకూడా మోక్షాన్ని కలిగించగలిగినవే". అనిచెప్తూ ఇంకాఇట్లాఅన్నాడు. " ఎల్లప్పుడూ వేదవిజ్ఞానాన్ని తెలుసుకుంటూ, పొగడదగిన శిష్టాచారమార్గాలలోపోయే పుణ్యాత్ముడు, నడవడానికి వీలు లేనిచోట్లనుకూడా దాటగలుగుతాడు". అట్టివాడు 'ప్రజ్ఞ (సామర్థ్యం)' అనుమేడనెక్కగలుగుతాడు. ఆ మేడపైనుండి క్రిందఉండే 'మోహమ'నేబురదలో కూరుకొనిపోయి దీనంగాదుఃఖించే లోకాన్ని నవ్వుకుంటూ చూడగలుగుతాడు".

ఈ విధంగా చెప్పిన ధర్మవ్యాధుడు తనబోధను ఇంకా ఈ విధంగా కొనసాగించినాడు. "అయ్యా! తొలుత నాప్రవర్తననుచూచి, 'ఇదిహింసకదా?' అన్నావు. దానికి నేను అప్పుడు నాకుతోచిన సమాధానమేదో చెప్పినాను. అది అట్లాఉండనీ. ఇది 'హింస'. ఇది 'అహింస'. అని విభజించడం ఎవరిచేత నవుతుంది.? పూర్వజన్మలో చేసుకొన్న కర్మలవల్లనే జీవులీజన్మలోనశిస్తాయి. 'చంపేవాడు నిమిత్త మాత్రుడు(ఉపకరణం లాంటివాడు) ఇంతే.' అనిపెద్దలు చెప్పగా వినడంలేదా? అంతేకాకుండా పండ్లూ, వేళ్ళూ, ధాన్యాలూ, కూరగాయలూ, పశువులూ, మృగాలూ తినదగినవిగా బ్రహ్మదేవుడు ప్రాణులకు ఏర్పాటుచేయడం స్పష్టంగాచాటే వేదాలను కాదనగలమా? పుణ్యాత్ముడా! ఉశీనరుడికుమారుడైన శిబి తనశరీరాన్ని హింసించి, మాంసాన్ని ఇంద్రునికీ అగ్నికీ పెట్టలేదా? అందువల్ల శిబికి పుణ్యంలభించకుండా పోయిందా? 'రంతిదేవుడ'నేరాజు ప్రతిదినం రెండువేలఆవులను వేయిఏండ్లపాటు వధించలేదా? ఆ మహాత్మునికి పాపంకలిగిందా? వేదార్థాలు బాగాతెలిసి బాగానియమాలుపాటించే బ్రాహ్మణులు యాగాలలో పశువులను చంపడంలేదా? వారికి మంచిపుణ్యాలు కలగడంలేదా? 'అగ్నులు మాంసాన్ని ఎక్కువగాకోరేవి అని వేదాలు చెప్పడంలేదా? పితృదేవతలకు శ్రాద్ధాలుపెట్టేటప్పుడు 'మిక్కిలిభక్తితో మాంసంపెట్టడమ'నేది 'మంచిద'ని మునులు అభిప్రాయపడడంలేదా? వ్యవసాయదారుడు మిక్కిలి ఉత్సాహంతో పొలాన్ని దున్నితే నాగలికర్రు తగులుకొని ఎన్నోప్రాణులు చస్తాయి. అది హింస ఔనా?కాదా? ఇన్నిమాటలెందుకు మనుష్యులు నేలమీద నడుస్తూఉంటే కాళ్ళక్రిందపడి చాలాజంతువులు చస్తాయి. దోషాలుతెలిసిన కౌశికా! ఇది హింసకాదనగలమా? ఆలోచించు. నీళ్ళూ, భూమి, ఆకాశం వీటన్నింటిలోనూ ప్రాణులు జీవిస్తూఉంటాయి. కాబట్టి మనంచేసేపనులన్నింటిలోనూ తప్పకహింసకలుగుతుంది. హింసలేకుండాబ్రతకడంకూడా కష్టమే. ఇదంతా ఆలోచించకుండా 'తాముహింసచేయడంలేద'ని కొంద రనుకుంటారు. అదేపనిగా అహింసావ్రతాన్నిస్వీకరించి అడవిలోఉండే మునులుకూడా, హింస చేయకుండా బ్రతకగలరా? బాగా ఆలోచిస్తే చెట్లూ, వేళ్ళూ, పండ్లూ, ఆకులూ కోయడంఅనేదికూడా హింసేకాదా? ఈ లోకంలో హింస చేయనివాడొకడైనా ఉంటాడా? తనకు చేతనైనంతగా హింసామార్గానికి దూరంగా పోతూఉండాలి. అదే అహింసగాశోభిస్తుంది. ధర్మం

చాలారకాలుగాఉంటుంది. కానీ దానిలోని సూక్ష్మత (ధర్మ సూక్ష్మం) తెలుసుకోవడం చాలాకష్టం. కాబట్టి వేదాలు చెప్పేవిషయాలవల్ల పెద్దల ఆచారాలవల్ల, ఆ సూక్ష్మాలను తెలుసుకోవలె. ప్రాణికోటికి మేలుచేయడానికిచెప్పేఅబద్ధము నిజమిచ్చే ఫలితాన్నిస్తుంది. అదేప్రాణి కోటికి భయంకలిగించే సత్యం, అసత్యం లాంటిది. ప్రాణంపోయేటప్పుడూ పెళ్ళిళ్ళ సమయంలోనూ చెప్పేఅసత్యం, 'సత్యంకంటే గొప్పద'ంటారు. మహాత్మా! ధర్మసూక్ష్మాలు ఇట్లాఉంటాయి."

ఈ విధంగా ధర్మసూక్ష్మాలగురించి వివరిస్తూ ఇంకా కొన్నిధర్మాలను ఇలాబోధించినాడు. "నచ్చినా, నచ్చకపోయినా, 'తనకులధర్మాన్ని తప్పకూడద'ంటారు ధార్మికులు. ఆ పనినిదైవనిర్ణయంగా భావించుకోవాలి. విను. పూర్వజన్మలో చేసినపనుల ఫలితంవల్ల తనకుఆపదకలిగితే, ఆ విషయం తెలుసుకోలేక అవివేకి దైవాన్ని దూషిస్తాడు. 'తనకుకలిగే శుభాలన్నింటికీతానే కారకుడన'నుకోవడం అజ్ఞానం. నిజంగా తానే కారణంఅయితే తానుచేసే పనులన్నీ సఫలంకావలెకదా? 'అదిఎట్లా' అంటే నీతిమంతులు, ధర్మ దీక్షకలవారు, సమర్థులూ, చేసేపనులుకూడ కొన్నిజయప్రదంకావు. చెడుబుద్ధికలవారూ, క్రూరులూ, చేసేపనులుకూడా కొన్ని గొప్పవిజయాన్ని పొందుతాయి. ఊరకఉండేవారికి కొందరికి గొప్పగా ధనాలులభిస్తాయి. కొందరు ఎంతఆయాసపడినా ఫలితముండదు. కొందరుపేదవారికి పిల్లలెక్కువగా పుడతారు. ధనంకలిగినవారుకొందరు కోరికతో దానాలు, ధర్మాలు, వ్రతాలు చేస్తేకూడ పిల్లలుపుట్టరు. ఇట్లాంటివే తాననుకొన్నట్లుకాక, తమ పూర్వజన్మకర్మల ఫలితంగా జరుగుతాయి. పూర్వజన్మకర్మ ఫలితంగానే దేహం కలుగుతుంది. దేహప్రవర్తనకూడ ఉంటుంది. చనిపోయినతరువాత జీవుడు తిరిగి ఈ జన్మలో చేసినకర్మఫలం నిర్దేశించినచోటికే పోతాడు."

అప్పుడు కౌశికుడు. "జీవుడు ఎటువంటివాడు?" అనిఅడుగగా ధర్మవ్యాధుడుతిరిగి తన బోధను ఇలాకొనసాగించినాడు. "విను. జీవుడు శాశ్వతంగాఉండేవాడు. పాపాలులేనివాడు. అతడు తాను చేసుకొన్న కర్మలఫలితంగా అశాశ్వతమైన దేహాన్నిధరిస్తాడు. దేహంనశించినా (మరణించినా) జీవుడునశించడు. ఈ దేహంవదలి వేరొకదేహంధరించి, జీవుడు తానుచేసిన కర్మకుతగినట్లు ఇంకొకజన్మను పొందుతాడు. ఆ క్రొత్తజన్మలో సుఖదు:ఖాలుకూడా అంతకుమునుపుజన్మలో చేసిన కర్మల కనుగుణంగానేఉంటాయి". ఈ మాటలు విని కౌశికుడు ధర్మవ్యాధునితో, "పుణ్యకర్మలవల్ల ఎట్లాంటిపునర్జన్మ కలుగుతుంది? అట్లాగే పాపకర్మలవల్ల ఎట్లాంటి పునర్జన్మ కలుగుతుంది?" అని అడిగినాడు.

ఆ ప్రశ్నకు ధర్మవ్యాధుడు ఈవిధంగా సమాధానముచెప్పినాడు. "ఈ జన్మలో పుణ్యకార్యాలు మాత్రమేచేస్తే, మరుజన్మ దేవలోకంలోజరుగుతుంది. ఈ జన్మలో పుణ్యాలూపాపాలూకూడాచేస్తే, పునర్జన్మ మానవజన్మ అవుతుంది. ఈ జన్మలో కేవలం పాపకార్యాలే చేస్తే, మరుజన్మలో జంతువులుగానూ పురుగులుగానూ పుట్టుతారు. జీవుడీవిధంగా పుట్టుతూచస్తూ సంసారమనే భ్రాంతిసాగరంలో

తిరుగుతూనేఉంటాడు. కానీ ఒడ్డుచేరుకొనలేడు. చిరకాలము ధర్మాలను ఆచరిస్తూఉంటే మనసు నిర్మల మవుతుంది. చిత్తం ప్రశాంతిపొందడంచేత ఇంద్రియసుఖాలు వ్యర్థాలనితెలుస్తుంది. అట్లాతెలియగానే వాటినివదలివేస్తాడు. ఆ తరువాత తపస్సు సత్యవ్రతాలచేత పరిణతిపొందుతాడు. ఆ పిదప ముక్తిని పొందుతాడు."

ఆ మాటలువిన్న కౌశికుడు ధర్మవ్యాధుడిని ఇలాప్రశ్నించినాడు. "ఇంద్రియాలుఅంటే ఏవి? వాటిని నిగ్రహించకుండాఉంటే ఏమిపాపంవస్తుంది?. వాటిని నిగ్రహించినవాడికి ఎలాంటిఫలితం వస్తుంది?" దానికి సమాధానంగా ధర్మవ్యాధు డిట్లాఅన్నాడు. "ఇంద్రియాలు అయిదు. అవి (1) చెవి (2) చర్మం (3) కళ్ళు (4) నాలుక (5) ముక్కు. ఆయా ఇంద్రియాలు గ్రహించే గుణాలను ఇంద్రియార్థాలంటారు. అవి వరుసగా (1) శబ్దం (2) స్పర్శం (3) రూపం (4) రుచి (5) వాసన. ఈ ఇంద్రియాలు ఇంద్రియార్థాలను తాము స్వయంగాగ్రహించలేవు. అవి మనసుద్వారామాత్రమే గ్రహించగలవు. (ఇంద్రియాల సహాయంలేకుండా మనస్సుకూడా ఇంద్రియార్థాలను గ్రహించలేదు. అనేదికూడ సత్యమే) ఆ మనస్సుకు కోరికలు ఎక్కువగా కలుగుతాయి. అట్లాకోరికలు కలిగితే ఇంద్రియాలతో అనుభవించదగిన భోగాలవైపే మనస్సు మనిషిని తీసుకొనిపోతుంది. ఇంద్రియ సుఖాలకు చిక్కినమనిషి మిక్కుటమైన కామప్రవృత్తికిలోనౌతాడు. దానివల్ల లోభము (పిసినారి తనం) ఏర్పడుతుంది. దానివల్ల దయకుదూరమవుతాడు. పాపాలకు పాల్పడతాడు. యోగ్యుల బోధనలను వినడు, చెడుస్నేహాలు చేస్తాడు. మాట, మనస్సు, చేత, ఒకటిగా ఉండదు. ఆ విధంగా ఈ లోకంలో పుణ్యంలేక చెడిపోతాడు. పరలోకంలోకూడా దుఖాలపాలవుతాడు. కాబట్టి ఇంద్రియభోగాలలో మనస్సును చిక్క నీయకూడదు. సాధుజనుల సహవాసంచేసి సుగతికి పోవడంమంచిది. 'ఇంద్రియాలుఅనగా ఏవి ? ఇంద్రియనిగ్రహం ఎలాలభిస్తుంది?' అనినీవు నన్నడిగినావు. అది బ్రహ్మవిద్యకు సంబంధించిన విషయము. నాబోటివారు చెప్పకూడనిది. అయినా నీవుబ్రాహ్మణోత్తముడవు. మంచిబ్రాహ్మణులకోరిక ఈడేర్చడం నాధర్మం. అందువల్ల మహానుభావులు ఆధ్యాత్మికతత్వకోవిదులుఅయిన బ్రాహ్మణోత్తములను ధ్యానం చేసి, వారికి వినయంగా నమస్కరించి, బ్రహ్మవిద్యను నీకు సవిస్తరంగా తెలుపుతాను. జాగ్రత్తగావిను. 'నింగి, గాలి, నిప్పు, నీరు, నేల' అనేవి పంచభూతాలు. అందులో నింగిగుణం శబ్దం. గాలిగుణం స్పర్శం. అగ్నిగుణం రూపం. నీటిగుణం రసం. నేలగుణం గంధం. వరుసగా, నింగినుండిగాలి, గాలినుండి నిప్పు, నిప్పునుండి నీరు, నీటినుండి నేలాపుట్టుతాయి. అవి లయం పొందేటప్పుడు నేలనీటిలో, నీరునిప్పులో, నిప్పు గాలిలో, గాలి నింగిలో లయమవుతాయి. 'చెవి, చర్మం, కన్ను, నాలుక, ముక్కు' అనేవి ఇంద్రియాలు. వరుసగా శబ్దం, స్పర్శ, రూపం, రసం, గంధం అనేవి ఇంద్రియార్థాలు. అయిదు ఇంద్రియాలకు తోడు ఆరవది మనస్సు. ఏడవది బుద్ధి. ఎనిమిదవది అహంకారం. ఈ ఎనిమిదీకాక 'సత్వం, రజస్సు, తమస్సు', అనేమూడుగుణాలూ కలసి 'అవ్యక్త'మనేతత్వంలోపుట్టి దానిలోనే లయమవుతాయి. 'అవ్యక్తమ'నేది కనిపించనిదేఅయినా మానవులు

భావించినరూపంలో (లింగాలు, విగ్రహాలు) లౌకికమానవులకు వ్యక్తమవుతూ ఉంటుంది". అని ఇంకాఇట్లాచెప్పినాడు. "ఓ పుణ్యాత్ముడా! ఇంద్రియాలు శబ్దంమొదలైన ఇంద్రియ భోగాలలో చిక్కుకొని ఇష్టానుసారంగా నడుస్తూఉంటాయి. బుద్ధిమంతుడు వాటిస్వభావాన్ని తనతెలివితో తెలిసికొనవలె. ఏమరుపాటులేకుండా ఇంద్రియాలను తగినట్లుగా నిగ్రహించవలె. ఇంద్రియాలను నిగ్రహించినధీరుడు తపస్సుచేయడంలో చలించడు. అతడు పూర్ణమైనవికాసాన్ని పొందుతాడు. సర్వభూతాలలో తననుతాను స్పష్టంగాతెలుసుకొంటాడు. తనయందుకూడా సమస్తభూతాలను తెలుసుకొంటాడు. 'తపస్సు' అంటే అన్నివిషయాలనువదలివేసినజ్ఞానం గొప్పతనమేసుమా! తపస్సులో నిలుకడకలిగిన యోగికి, చేయవలసినపని లింకేవీఉండవు. ఇంద్రియాలను నిగ్రహించడంవల్ల స్వర్గం లభిస్తుంది. నిగ్రహించలేకపోతే నరకంప్రాప్తిస్తుంది. ఈ దేహమే ఒకరథం. ఇంద్రియాలు ఆ రథానికి కూర్చినగుర్రాలు. ఆత్మయే సారథి. చలించనిచిత్తమే పగ్గాలు. 'ఆ చలించని చిత్తమ'నే పగ్గాలను చేతబూని ఎవడు గుర్రాలను అదుపులోఉంచుకుని రథాన్నినడపగలడో, వాడే ధీరుడు. అట్టివాడే (దేహాన్ని) రథాన్ని క్షేమమార్గంలో నడుపగలిగినవాడు. ఇంద్రియాలు (గుర్రాలు) లాగినచోటుకే మనస్సు ఎల్లప్పుడూ పరుగెడుతూ ఉంటుంది. ఆ పరుగును అదుపులో పెట్టకపోతే సముద్రంలో తుఫానుకు పగిలినశించే పడవలాగా బుద్ధి పాడవుతుంది. ఐదుఇంద్రియాలనూ, మనస్సునూ, తనవశంచేసికోనేవాడేకదా ధ్యాన యోగి? అట్టివాడినేకదా దేవతలు ఋషులు పొగడుతారు? ఇదంతా విన్న కౌశికుడు, "సత్వం, రజస్సు, తమస్సుఅనే గుణాల విధానం తెలియచేయి." అని ధర్మవ్యాధుణ్ణి అడిగినాడు. ధర్మవ్యాధుడు ఇందుకు సమాధాన మిట్లాఇచ్చినాడు.

"కౌశికా! తమోగుణం మిక్కిలి నీచమైనది. సత్వగుణంజ్ఞానంతోకూడి వెలుగొందేది. సత్వ రజోగుణాల కలయిక రజోగుణం. 'అసహ్యామైనరూపం, ఎప్పుడూ నిద్దురమత్తులోఉండడం, దురవస్థ, ఎక్కువ భ్రమలోఉండటం, ఓర్పులేకపోవడం' అనేవి తమోగుణాలు. 'కోరిక, పిసినారితనమూ, జడత్వమూ, దురహంకారము' రజోగుణ లక్షణాలు. 'ధైర్యము, శాంతి, దయ, సంతోషము, విద్య మొదలైనవి' సత్వ గుణాలు. ఇది నిజం. ఇదంతా నీమనస్సులో గ్రహించు. పాపంలేనివాడూ, సత్వగుణంకలిగినవాడూ, అయిన మహానుభావుడు జ్ఞానాన్నిఆర్జిస్తాడు. ఈ లోకంలోని సుఖాలు 'తగినవి కావ'ని తెలుసుకొంటాడు. వైరాగ్యాన్ని పెంచుకుంటాడు. సంగాన్ని త్యజిస్తాడు. మమకారాన్ని వదలించుకొంటాడు. వీటన్నింటివల్ల ఇంద్రియనిగ్రహం ఏర్పడుతుంది. అట్లా ఇంద్రియనిగ్రహం పొందినవాడు, యోగీశ్వరుడవుతాడు. అతడు గొప్పశాంతిని అనుభవిస్తాడు. సత్వగుణంకలవాడు, ఈ జన్మలో శూద్రుడేఅయినా మరుజన్మలో వైశ్యుడైపుడతాడు. అట్లే వరుసగా తదుపరిజన్మలలో క్షత్రియుడుగానూ, బ్రాహ్మణుడుగానూ పుడతాడు. అప్పుడు మోక్షాన్ని పొందుతాడు." ఈ మాటలువిని కౌశికుడు ధర్మవ్యాధుణ్ణి సంతోషంతోపొగడినాడు. ఆ తరువాత ఈ విధంగా అడిగినాడు.

"మానవ శరీరంలో ధాతువుల ఆశ్రయంచేత అగ్ని ఎట్లా ప్రజ్వలిస్తుంది? శరీరంలోని వాయువుల స్థానాలేవి? దయచేసి నాకుతెలుపు". ఈ మాటలకు ధర్మవ్యాధుడిట్లా సమాధానము చెప్పినాడు. "ఆత్మాగ్నికి నాభిఆశ్రయం. అది నాభినుండి శిరస్సువరకు వ్యాపించి వర్ధిల్లుతుంది. 'ప్రాణమ'నే వాయువు శిరస్సులోని అగ్ని మధ్యలో తిరుగుతూఉంటుంది. ఆ వాయువే జీవులన్నింటికి ప్రాణాన్నిచ్చేది. ప్రాణ వాయువుకుతోడు అపానవాయువుకూడా అగ్నిని ప్రజ్వరిల్లచేస్తూ ఉంటుంది. ఈ అపానవాయువు ముడ్డి, పొత్తికడుపు, మధ్య అగ్నిచేత చుట్టబడిఉంటుంది. అపానవాయువే మలమూత్రవిసర్జనలకు కారణం. 'ఉదానం' అనేవాయువు కంఠంలోఉంటుంది. ఆ ఉదానమే కర్మతంత్రాన్ని నడుపుతుంది. 'వ్యానము' అనేవాయువు ఒకదానితో ఇంకొక అవయవము కలిసేచోట్లఉంటుంది. 'సమానము'అనే వాయువు నాభివద్దఉండి, ఆహార పానీయాలను జీర్ణింపచేస్తుంది. శరీరంలోని ధాతువులను పెంచుతుంది. ఈ అగ్ని ఆత్మాగ్నికి, ప్రాణవాయువునకు, అపానవాయువులకు తోడై సహకరిస్తాడు. ఈ పంచప్రాణాల జ్ఞానం, ఆత్మాగ్ని జ్ఞానం యోగులకుమాత్రమే కలుగుతుంది. గొప్పఋషులు ఆత్మను తలలోధరిస్తారు. ప్రాణవాయు, అపానవాయువులతో తిరిగే అగ్నియే జీవాత్మ. నీటిలో ఉండినా తామరపాకు తడవకుండా ఉంటుందికదా? అలాగే జీవాత్మ దేహంలో ఉండికూడా దేహానికి దూరంగానేఉంటాడు. ఆ జీవాత్మయే పరమాత్మ కదా? శరీరం స్వయంగా కదలలేనిది. దేహంలోని జీవాత్మయే శరీరానికి కదలికలను ఇవ్వగలదు. ఆ జీవాత్మ (పరమాత్మ) ప్రసిద్ధుడు. అతడే మూడులోకాలను సృష్టించగలవాడు. సాధారణంగాచూస్తే ఆ జీవులకి (పరమాత్ముడికి) చాలా రూపాలుంటాయి. చాలపేర్లుంటాయి. కానీవారందరిలోనూకలజీవాత్మ (పరమాత్మ) ఒక్కడే. ఈ విషయాన్ని జ్ఞానులుమాత్రమే గుర్తించగలుగుతారు." అనిచెప్పి, అంతటిలో ఆగకుండా ధర్మవ్యాధుడు వేదాంతజ్ఞానం మహిమ ఆచరణలో ఎట్లా తెలుస్తుందో కౌశికుడికి ఈ విధంగా వివరించి చెప్పినాడు.

"జ్ఞాని మంచిపనులుకానీ చెడుపనులుకానీచేయడు. అట్టివాడు సుఖదు:ఖాలలాంటి ద్వంద్వాలకు అతీతుడు. అన్నింటిపై సమభావం కలిగిఉంటాడు.అట్టి పుణ్యాత్ముడు చేయవలసిన పనులేవోచెప్తా. విను. నిత్యం యోగసాధన చేస్తూ మితాహారియై ఇంద్రియాలను నిగ్రహించవలె. అతడు ఆత్మలో పరమాత్మను దర్శించి ప్రకాశిస్తాడు. ఎప్పుడూ కామక్రోధాలను అణచిపెట్టియేఉండవలె. మనసు పరిక్వమైనవారికి ఇదిఒకటే ఉత్తమమార్గము. నిత్యం కర్మలుచేస్తూ, ఆ కర్మఫలాలను విడువడంమంచిది. కోరికలను వదలడమే అన్నింటికంటే గొప్పయోగం. ఈ లక్షణాలు కలవాడే బ్రాహ్మణుడు. ఆలోచిస్తే బ్రతుకులు చాలా అశాశ్వతాలు. ఈ విషయాన్ని గుర్తించి, ఎవరిపైనకూడా మనసులో చెడు తలపోయక, నిజమైనమైత్రి నెరపవలె. ఇట్లు గొప్పగాదయకలిగి ఎవ్వరిదగ్గరనుండి ఏమీదానంతీసికోనివాడూ, ఎప్పుడూ తపస్సు చేసేవాడూ, ఎప్పుడూ తృప్తిగాఉండేవాడూ, ఎపుడూ శాంతంగాఉండేవాడూ అయిన బ్రాహ్మణుడు ముక్తిని పొందుతాడు".

"నీవడిగిన ధర్మాలన్నింటినీ సంగ్రహంగా చెప్పినాను. ఇంకా ఏంవినాలనుకుంటున్నావు?" అని ధర్మవ్యాధు డడుగగా కౌశికు డిట్లాఅన్నాడు. "మహాత్మా! వినవలసిన వాటినన్నింటినీ విన్నాను. జ్ఞానం పొందినాను. 'నీకు తెలియని విషయమే లేద'నే విషయం స్పష్టమయింది". ఆ మాటలకు ధర్మవ్యాధుడు

"ఓ కౌశికా ! నాకు ఇంతటివిజ్ఞానం కలగడానికి ఒకకారణముంది. దాన్ని నీకు చూపించుతాను". అని చెప్పి తనఇంటిలోనికి తీసుకొనిపోయినాడు. ఆ గది మిక్కిలి అందమయినది. దానికి నాలుగు వైపులా చావడులున్నాయి. గాలీ వెలుతురూ ధారాళంగా వస్తూఉంది. మంచి వాసనలు గుబాళిస్తూ ఉన్నాయి. ఆ గదిలో గొప్ప ఆసనాలపై ధర్మవ్యాధుడి తల్లిదండ్రులు కూర్చొనిఉన్నారు. కోరిన ఆహారాన్ని భుజించి సంతృప్తిగా సేదదీరుతున్నారాయిద్దరూ. వారి దేహాలపై కొత్తకొత్తపూలు ధగధగలాడేనగలూ ఉన్నాయి. ధర్మావ్యాధుడు తనతల్లిదండ్రులను కుశలముఅడిగినాడు. వెంటనే తల్లిదండ్రులు తమకుమారుడు ధర్మవ్యాధుడితో ఇట్లాఅన్నారు.

"ప్రియమైన కుమారా! నీవంటి మంచికొడుకు ఉండగా మాకేమి లోటుంటుంది చెప్పు. నీవు చేసేధర్మమే నీకుతోడవుతుంది. నీవు చిరకాలం జీవించి ధనధాన్య సంపదలనుపొందు. నీ ప్రవర్తన వల్ల మనవంశము పావనమైంది. నీవు దేవతలలో దేవతవే, కానీ మనుష్యుడవుకావు. అసలు భూలోకంలో నీవు ఎందుకు ఈ మానవదేహంధరించిపుట్టినావో మాకుతెలియదు. మనసులో సందేహమేమీలేదు. నీ దీక్ష నిరుపమానం. తల్లిదండ్రులను ఆరాధించడంలో నిన్నుచెప్పిన తరువాత పరశురాముని చెప్పవచ్చునేమో? కాని మరింకెవరూలేరు". అనిచెప్పినారు.

అప్పుడు ధర్మవ్యాధుడు తన తల్లిందడ్రులకు కౌశికుడినిచూపించి, "ఈ మహానుభావుడు మనలను చూడాలనే కోరికతో ఇక్కడకువచ్చినాడు". అనిచెప్పినాడు. ఆ వృద్ధులు కౌశికుడికి స్వాగత మర్యాదలు చేసినారు. ఆయన ఆ మర్యాదలను వినయంగా స్వీకరించినాడు. కౌశికుడితో వారియోగక్షేమాలు అడిగి తెలుసుకున్నాడు.అంతట ధర్మవ్యాధుడు కౌశికుడితో ఇట్లాచెప్పినాడు. "అయ్యా! కౌశికా! వీరే నా తల్లిదండ్రులు. వీరికి శుశ్రూష చేయడం వల్లనే నాకీ జ్ఞానము కలిగింది. అందరూ తమకోరికలు తీరడానికి దేవతలను పూజిస్తారు. నాకు తల్లిదండ్రులే ప్రత్యక్షదైవాలు. నాకు వేరేదేవతలుఎవరూ తెలియదు. వీరలను చందనచర్చతో పండ్లతో పూలతో కోరిన ఆహారాలతోఅర్చిస్తాను. నా భార్యా బిడ్డలతో కలిసి వీరికి సేవచేస్తాను. వీరిని సేవించడమే నేనుచేసేయజ్ఞం. అదియే 'వేదాలు, నోములు' అనే భావం నాలోలోతుగానాటుకొనిఉంది. పుణ్యం కావలసినవాడు. 'తల్లి, తండ్రి, గరువు, అగ్ని, ఆత్మ' అనే ఈ అయిదుగురినీ పూజించవలె. సంతోషపరచవలె. అట్టివాడే ధర్మాత్ముడు". అనిచెప్పి ధర్మవ్యాధుడు "ఆ పతివ్రత నిన్ను నాదగ్గరకు పంపింది. కాబట్టి నీవు ధర్మజ్ఞానం కొరకు నావద్దకు వచ్చినావు. నాకు ఆమెపైకల గౌరవంవల్ల నీకంతా చెప్పినాను. అంతేకాని నీ మీద నాకు ప్రీతిఏర్పడలేదు. దానికి మూలకారణం ఒకటిఉంది. నీ తల్లిదండ్రులు కడుముదుసలులు. వారికి. నీవొకడవే ఆధారం. వారిని వదలి నీవు సన్యాసివైనావు. నీ ప్రవర్తన చాలాక్రూరమైనది. నీ కొరకే తపించి తపించి వారుగ్రుడ్డివారైనారు. వినలేదా? ఇప్పుడైనా వారివద్దకు పోయి వారి దుఃఖాన్ని పోగొట్టవయ్యా ! నీ చదువు, నీ శ్రమ, నీ పుణ్యం మొదలైనవన్నీ తల్లిదండ్రుల పరిచర్యలేకపోతే వృథా అవుతాయి. నేను చెప్పినట్లుచేస్తే నీకు మేలు కలుగుతుంది". ఈ మాటలు విన్న కౌశికుడిట్లాఅన్నాడు.

"ధర్మాత్మా! నీవు చెప్పినమాటలు మంచివి. నిర్మలమైనవి. నాకు మేలు కలిగించేవి. నీవు చెప్పినట్లే నడచుకొంటాను. నా తల్లిదండ్రులకు శుశ్రూషచేసి తరిస్తాను. నీతో స్నేహంకలగడం నా అదృష్టము. చాలా సంతోషంగా ఉంది. నాకు కలుగబోయే శుభాలన్నింటికీ నేను యోగ్యుడనైనాను. నన్ను పాపమార్గమునుండి మరలించినావు. నన్నుద్ధరించినావు. జ్ఞానం కలిగించినావు. నన్ను గొప్పవాడినిగా చేసినావు. ధర్మమార్గము చాలాసూక్ష్మమైనది. సాటిలేనిది . అందరికి అందనిది. పదివేలమందికి ఒకడైనా ధర్మాన్ని ఆచరిస్తున్నాడా? ఏమో? నీవు దేవుడవు. నీలాగా ధర్మాన్ని ఆచరించే వాడింకొకడు లేడు. నిన్నొక శూద్రునిగా భావించలేకుండా ఉన్నాను. నీవే కారణంగా ఈ శూద్రజన్మను పొందినావు. దయచేసి చెప్పు. నీ కన్నీ తెలుసు".

అందుకు ధర్మవ్యాధుడిట్లా అన్నాడు. "కౌశికా! నీ వేమడిగినా సమాధానం చెప్పడం. నా బాధ్యత. గతజన్మలో నే నొక బ్రాహ్మణుడను. పుణ్యచరిత్ర కలిగినవాడనే. వేదవేదాంగాలు క్షుణ్ణంగా చదివిన వాడనే. కానీ నాకు ఒక రాజకుమారుడితో స్నేహం కలిగింది. అతడితో పాటు విలువిద్య నేర్చుకొన్నాను.

ఒక రోజున అతడితోపాటు నేనుకూడ అడవికి వేటకుపోయినాను. అక్కడ అడవిలో ఎన్నో జంతువులపై బాణాలు వేస్తూఉండినాను. అందులో ఒక్క బాణం గడ్డిమధ్యలోఉండి తపస్సు చేసుకొనే ఒకమునికి తగిలింది. వెంటనే 'హాహా' కారాలుచేస్తూ ఆ మునిపడిపోయినాడు. ఆ 'హాహా' కారాలువిని నేను ఆమునిని సమీపించినాను. ఆతడు బాధతో నేలపైదొరలుతున్నాడు. నేను ఆయనను ఓదార్చ బోయినాను. అప్పుడాముని, "బ్రాహ్మణుడవైకూడ హింస చేస్తూఉన్నావు. ఇది శూద్రులు చేయవలసినపని. కాబట్టి మరుజన్మలో నీవు నిజంగా బోయవాడవుకా." అని శపించినాడు. అందుకు నేను, "తెలియక ఈ తప్పుచేసినాను నన్నుక్షమించకూడదా"? అని ప్రార్థించినాను. అప్పుడాముని, "నా శాపానికి తిరుగు లేదు. అయితే నీవు బోయవాడవైపుట్టినా ధర్మాన్ని బాగాతెలుసుకొంటావు. అంతేకాక నీతల్లిదండ్రులను భక్తితోసేవించి వారికితృప్తినికలిగిస్తావు. అందువల్ల నీకుమేలు కలుగుతుంది. అప్పుడు నీకు ఈజన్మ జ్ఞానంకూడా ఉంటుంది. తదుపరిజన్మలో తిరిగి బ్రాహ్మణుడవై జన్మించగలవు". అని దయతో సెలవిచ్చినాడు. అంతట నేను ఆయనశరీరంలో గుచ్చుకొన్న బాణాన్ని మెల్లగా బయటకులాగినాను. నా అదృష్టంవల్ల ఆయన చావలేదు. కానీ ఈ శూద్రజన్మమాత్రం నాకుతప్పలేదు." అనిచెప్పిన ధర్మవ్యాధునితో కౌశికుడిట్లా అన్నాడు.

"జన్మేమో శూద్రజన్మ. ప్రవర్తనేమో బ్రాహ్మణ ప్రవర్తన. ఇట్లాంటివింత ఎక్కడాచూడలేదు. ఇంకొక జన్మఎందుకు ? నీవిప్పుడే బ్రాహ్మణుడవుకావా? పాపాలు చేసేవాడు బ్రాహ్మణకులంతోపుట్టినా అతడు శూద్రుడికంటెహీనుడే. పరిశుద్ధతనుపాటించి సత్యాన్నిపలికే ధర్మాత్ముడు శూద్రకులంలో జన్మించినప్పటికీ అతడుసదాబ్రాహ్మణుడే. ఈ విషయం మునులేచెప్పినారుకదా? మహానుభావా! 'ఈ నీచమైన జన్మ లభించిందే?' అని నీవు మనస్సులో విచారించవద్దు. తమ కర్మఫలాలను జ్ఞానులు సమబుద్ధితో అనుభవిస్తారు.

ధర్మకర్మలు చేయడంవల్ల శారీరక మానసిక బాధలు తొలగించుకొంటారు. ఇష్టమయినవి దూరమయినందుకు ఇష్టంలేనివి అనుభవించవలసి వచ్చినందుకు మూర్ఖుడు ఎక్కువగాదు:ఖపడతాడు. అట్లా దుఃఖపడడంవల్ల బాధతగ్గదు. అంతేకాదు. హృదయమెప్పుడూ బాధపడుతూనేఉంటుంది. దు:ఖంవల్ల తనకాంతి తరిగిపోతుంది. మేలుకలిగించేపనులు చేసుకోలేకపోతాడు. కాబట్టి దు:ఖాన్నివదలి సరియైన ప్రయత్నంచేస్తే శుభాలుకలుగుతాయి. కాబట్టి ధైర్యంగా బ్రతుకు".

ఆమాటలు విన్న ధర్మవ్యాధుడు, "మహానుభావా ! నీవు చెప్పిన ఆదర్శాలకు ఉదాహరణ ప్రాయంగానే నేను బ్రతుకుతూఉన్నాను. నేను నిత్యసంతృప్తుడను. భవిష్యత్తులో నాకు మేలుకలుగు తుందనే నానమ్మకం". అని అన్నాడు. అంతట కౌశికుడు తిరిగి ఇట్లా అన్నాడు.

" ధర్మవ్యాధా! నీవుపుణ్యాలరాశివి. నీజీవితం ధన్యమైనది. సదా ధర్మాన్నాచరిస్తూ బ్రతుకు. నీచరిత్రవల్ల ధర్మం ప్రకాశించగలదు. నీకెల్లప్పుడూ మేలుకలుగుగాక! నిన్ను కలుసుకొనడం చేత నాజన్మ ధన్యమైనదిగా భావిస్తున్నాను. నీవలన నేనెన్నో ధర్మసూక్ష్మాలు తెలిసికోగలిగినాను. నాకు జ్ఞానం కలిగింది. ఇంక దయచేసి నాకుసెలవిమ్ము. పోయివస్తాను."

ఆ విధంగా కౌశికుడు ధర్మవ్యాధుడికి వీడ్కోలు పలికినాడు. ధర్మవ్యాధుడికి ప్రదక్షిణ చేసినాడు. నమస్కరించినాడు. తరువాత ఆయనను వదలి తన స్వస్థానానికి పోయినాడు. అక్కడ తన తల్లిదండ్రులకు సేవచేసి తరించినాడు.

**నీతి :** 1) కోపం మంచిది కాదు.

2) పాతివ్రత్యము చాల మహిమకలిగినది.

3) తల్లిదండ్రులను దేవతలలాగా భావించవలెను.

4) మేలుకు పొంగకూడదు. కీడుకు క్రుంగకూడదు.

5) ఇంద్రియనిగ్రహం మోక్షానికి తొలిమెట్టు.

6) గుణం ప్రధానంకానీ, జన్మ ప్రధానం కాదు.

**ఉ.** **'నీ మగఁ డంత యెక్కుడె? మనీషులు భూసురు లింత తక్కువే?**
**కోమలి! యేల యిట్లు గదుఁగ్రొవ్వునఁ గానవు లోకవంద్యులన్?**
**భూమిసురేంద్రులన్ దివిజపుంగవుఁ డాదిగ భక్తిఁ గొల్చుచో**
**నేమిట నొక్కొ వారు గదు నెల్లిద మై రిటు నీకు నిచ్చటన్? 5-16**

**క.** **మది మఱపునఁబాపముదన కొదవుటయును, బిదప వగచి యొక సగమును,నే**
**నిది సేయ నింక ననియెదు మదిఁ బెఱసగమును, నరుండు మఱుఁగు నఘంబున్. 5-41**

తే. పాపముల కెల్ల నెక్కుడు పాతకములుసువ్వె! క్రోధలోభంబులు; సువ్రతాత్మ !
వాని రెంటి జయించినవాఁడు గాని యెందుఁబరమధార్మికుఁడని యెన్నఁబడఁడు. 5-42

క. పితృదైవత కార్యములం దతిభక్తిని మాంసమిడుట యర్హమనియు, ఁద
త్పితృదైవశేషములు సమ్మతిభోజ్యము లనియు, మునులమతములు గావే? 5-56

మ. హలికుం డెంతయు నోజతో దునఁగ, సీరాగ్రంబునంజోఁకి ప్రా
ణు లనేకంబులు సచ్చు; హింస యది యౌనో? కాదో? వేయేల?మ
ర్త్యులు నేలం జరియించుచోఁ బదములం ద్రొక్కంబడుం బెక్కు జం
తులు; హింసావిధి గాదనంగ వశమే? దోషజ్ఞ! యూహింపుమా! 5-57

చ. సలిలము,లుర్వి, యాకసము, సర్వము జంతుమయంబు; గావునం
గలుగు నవశ్యమున్ సకలకర్మములందును హింస; హింసకుం
దొలఁగిన దేహయాత్రయును దుర్ఘటమైనటులుండు; నింతయుం
దలఁపరు; హింస 'సేయమ'ని తారు తలంతురు గొంద తిమ్మహిన్. 5-58

క. పనివడి యహింస వ్రతముగఁ గొని వనముననున్నమునులకుం దొడరదె హిం
సనము; తరుమూల ఫలశాకనిపీడన మదియు హింస గాదొకొ తలఁపన్? 5-59

తే. హింస సేయనివాఁడు లేఁ డిజ్జగమున నొక్కఁడైనను; దమతమ యోపినట్లు
హింసతెరువున కెడఁగల్గి యేఁగవలయు; నదియ చూవె! యహింసనా నతిశయిల్లు. 5-60

ఉ. భూతహితంబుగాఁ బలుకు బొంకును సత్యఫలంబు నిచ్చుఁ; ద
ద్భూతభయాస్పదం బగు ప్రభూతపుసత్యము బొంకు నట్లు; ప్రా
ణాతురుఁ డైనచోఁ, బరిణయంబునయందును బల్కు బొంకు, 'స
త్యాతిశయంబ' యంద్రు; మహితాత్మక ! యిట్టివి ధర్మసూక్ష్మముల్. 5-62

ఉ. ఎంతయు వృద్ధులై తమకు నీ వొకరుండవ తెప్ప గాఁగ న
త్యంతముదంబునన్ బ్రదుకు తల్లిని దండ్రిని నుజ్ఝగించి, ని
శ్చింతుఁడ వై సదాధ్యయనశీలత వారియనుజ్ఞ లేక, యే
కాంతమ యెమ్మెయిన్ వెడలి తక్కట ! నీవు గరంబు క్రూరతన్. 5-120

ఆ. పాపవర్తనుండు బ్రాహ్మణుం డయ్యును, నిజము శూద్రుకంటె నీచతము
దు;సత్యశౌచధర్మశాలి శూద్రుం డయ్యు, నతఁడు సద్విజుండ యనిరి మునులు. 5-137

# 38. అగ్ని - అంగిరసుడు.

**(అరణ్య 5.147 నుండి 174 వరకు.)**

**(పాండవుల అరణ్యవాసకాలంలో మార్కండేయుడు వారికిచెప్పిన కథలలో ఇదిఒకటి.)**

బ్రహ్మదేవుడు, తొలుతగా ఒకదేవతను అగ్నిదేవుడుగా నియమించినాడు. ఆ అగ్నిదేవుడు తనవిధులనుతాను సక్రమంగానెరవేర్చుతూ వచ్చినాడు. కానీ ఒకనాడు ఆ అగ్నిదేవుడికి మిగతా దేవతలమీద కోపంవచ్చింది. యజ్ఞాలలో వేల్చబడే హోమద్రవ్యాలను మోయడానికి అతడుఇష్టపడలేదు. వెంటనే అడవులకుపోయినాడు. చాలాకాలం భయంకరమైన తపస్సుచేసినాడు. తపస్సుచేస్తూ చాలా చిక్కిపోయినాడు. అట్లాఉండగా ఒకనాడు అయన ఇట్లా ఆలోచించినాడు. "నేను కోపంతో ఇక్కడకు వచ్చినాను. నేను అక్కడవెలుగకపోతే లోకవ్యవహారమంతా నిలిచిపోతుంది. అట్లానిలిచిపోతే బ్రహ్మదేవుడు ఇంకొకణ్ణి వెంటనే ఆ అగ్ని పదవిలో నిలపకుండాఉంటాడా? కాబట్టి నేనిక్కడే ఉండడం మంచిదికాదు. నాపదవి పోయేటట్లున్నది. నేను వెంటనేపోతాను." ఇట్లా ఆలోచించి అగ్నిదేవుడు తపస్సు చాలించినాడు. తనపదవిమీదిఆశతో పోయిపోయి, అంతకుముందే బ్రహ్మదేవుని ఆనతిచొప్పున అంగిరసుడు ఆ పదవిలో వెలుగుతూఉండగా, చూచినాడు. ఆ అంగిరసుడు ఎక్కువతపస్సుచేత అతిశయించిఉన్నాడు. అంతేకాకుండా బ్రహ్మఆనతితో అగ్నిపదవిలోఉన్నాడు. అందుచేత అగ్ని అంగిరసుణ్ణిచూచి భయపడినాడు. ఏమీ మాట్లాడకుండా వెనుతిరిగిపోతూఉండినాడు.

అగ్నిదేవు డట్లారావడం, ఏమీ మాట్లాడకుండా వెనుదిరగడం, అంగిరసుడు గమనించినాడు. వెంటనే అంగిరసుడు అగ్నివద్దకుపోయి ఇట్లాఅన్నాడు. "పుణ్యాత్మా! మూడులోకాలలో పూజింపబడుతూ ఉంటావు. చీకటిని పారద్రోలుతావు. తగినట్లుగా బ్రహ్మదేవునితో మొదటగా అగ్నిపదవిలో నియమింప బడి ప్రకాశిస్తూఉండేవాడవు. కాబట్టిరా. నీపదవి నీవుచేపట్టు. నీపదవిలోఉండడానికి నేను జంకుతున్నాను."

అంగిరసుడు ఇట్లాఅనగానే అగ్నిదేవుడు ఇట్లాఅన్నాడు. "విను. నేను కొంతకాలం పదవినుండి తప్పుకొనిఉండినందున నాకీర్తి మరుగునపడిపోయింది. నీవులోకాలన్నీ పూజించేవిధంగా బలపడినావు. కాబట్టి ఈ అగ్నిపదవి నీకే తగిఉంది. నాకింకఒప్పదు. అంతగాఅయితే నీవు ప్రథమాగ్నిగా ఉండు. నేను రెండవదిఅయిన ప్రాజాపత్యాగ్నినై వెలుగుతాను."

ఈ మాటలువిని అంగిరసుడు తిరిగిఇట్లాఅన్నాడు. "ఈ విధంగా ఆజ్ఞాపించవద్దు. ప్రథమాగ్ని పదవి నీవేతీసుకో. నన్ను నీమొదటి కుమారుడిగా ఆదరించు." అందుకు అగ్నిదేవుడు అంగీకరించినాడు. ఈ విధంగా అగ్నికి అంగిరసుడు మొదటికుమారుడై, అగ్నికి సమానమైనరూపంతో ప్రకాశించినాడు.

ఆ తరువాత అంగిరసుడికి ఏడుగురు కొడుకులూ ఏడుగురు కుమార్తెలూ జన్మించినారు. వారిలో 'బృహస్పతి' అనేకొడుకు ముఖ్యుడు. అతని సంతతి తామరతంపరగా పెరిగింది. అట్లాపెరిగిన వారివంశంలో కొందరు అగ్నులైనారు.

ఆ తరువాత తిరిగి 'అంగిరసుడు, కశ్యపుడు,వసిష్ఠుడు, ప్రాణుడు, చ్యవనుడు' అనే మహర్షులతో కలసి గొప్పగాతపస్సుచేసి 'పంచజనకుడు' అనే అగ్నిని పుట్టించినారు. ఇంకా 'తపుడ'నే ఒక అగ్ని కూడా ఉండింది. ఆ తపుడి సంతానంలో 'వైశ్వానరుడు' అనేఅగ్నిఒకడు. అతనినుండి అనేక మందిఅగ్నులు జన్మించినారు.

ఇట్లా అగ్నులు ఎంతమంది ఉన్నా, వారి తేజస్సు మాత్రము ఒకటే. అంటే ఒక్కొక్కకార్యం చేసేటప్పుడు ఆ అగ్నికి ఒక్కొక్కపేరు పెట్టబడినా, ఆ అగ్ని ఏకార్యంచేస్తూఉండినా ఆతడికి వేడిమి కాంతులే' ప్రధానలక్షణాలు అని అర్థం.

**చ. అలుక మెయిం దొలంగి, విపినాంతర భూమికి వచ్చి యిట్లునే**
**వెలcగ క యున్నచో భువన వృత్తము సర్వము నిల్చు; నిల్చినన్**
**జలరుహసూతి వేళొకని cజయ్య న నగ్ని పదంబునందు cదా**
**నిలుపకయున్నె ? నేనిచట నిల్చుట పోలదు; పోయెదన్ వెసన్. 5 -148**

# 39. కుమారస్వామి కథ.

**(అరణ్య 5-176 నుండి 289 వరకు.)**

**(పాండవులు అరణ్యవాసంచేస్తుండగా ధర్మరాజుడుగగా మార్కండేయుడీ కథను చెప్పినాడు.)**

పూర్వము ఒకప్పుడు ఇంద్రుడు రాక్షసులతో యుద్ధంచేసి ఓడిపోయినాడు. దేవతలతో సహా తప్పించుకొని పారిపోయినాడు. "రాక్షసులను జయించగలిగిన గొప్పసేనాపతి ఎక్కడదొరుకుతాడా?" అనుకుంటూ ఉండినాడు.

అట్లాఉంటూ ఇంద్రుడు, ఒకనాడు 'మానసము' అనేకొండకుపోయినాడు. అక్కడ ఒకచోట ఒక్కడే కూర్చుని, "ఏంచేయాలా ?" అనిఆలోచిస్తూ ఉండిపోయినాడు. ఆయన అట్లాఆలోచిస్తూ ఉండగా అతడికి ఒక స్త్రీ ఏడుపు వినిపించింది.

"ఒకనీచ రాక్షసుడు నేను 'మొర్రో' అంటూఉండగా నన్ను చెరపట్టి తీసికొని పోతూఉన్నాడు. అన్నలారా ! ఎవరైనా నన్ను విడిపించరా? దయతో పుణ్యమార్గాన పోరా?" అంటూ స్పష్టంగా స్త్రీ ఏడుపు వినిపించింది. ఇంద్రుడు మనసులో జాలిపడినాడు. వెంటనే, "భయపడవద్దు. ఇదిగోనేనువస్తున్నాను." అంటూ ఆదిక్కునకు నడచినాడు. ఎదురుగా మిక్కిలిభయంకరమైన ఆకారంతో గొప్పగదపూనిఉన్న రాక్షసుణ్ణి చూచినాడు. వాడప్పుడు కదలకుండా నిలబడిన మెరుపు తీగలాగా మెరిసిపోయే ఒకకన్యను తీసికొని ఆకాశంలో పరుగెత్తుతూ ఉండినాడు.

ఆ రాక్షసుడు నల్లనిమబ్బువంటి దేహంకలవాడు. వాడి పేరు కేశి. వాడినిచూచి ఇంద్రుడు వేగంగా, "ఓరీ! దురాత్మా! ఈమెను జంకులేకుండా ఎందుకుపట్టుకున్నావు? ఈ పద్మాక్షిని విడువు. విడువకుండా, నీవెక్కడకు పోయినా నీ ప్రాణం తీస్తాను. ఇది మునుపు పెద్దపెద్ద కొండల గుంపులను ముక్కలుచేసింది. భయంకరమైన రాక్షసుల నెందరినోచంపి, వారిరక్తంతో తడిసిఎర్రగా మారింది." అంటూ వజ్రాయుధం పైకెత్తుకొని వాడిదగ్గరగాపోయినాడు.

భయంకరమైన పరాక్రమంకలిగిన కేశికూడా కోపగించుకొన్నమనసుతో ధైర్యంగా బలంగా ఇంద్రుని ఎదుటనిల్చినాడు. తనచేతిలోని గదనుత్రిప్పి ఇంద్రుణ్ణికొట్టినాడు. ఇంద్రుడుకూడా రాక్షసుడి మాదిరిగానే పొంగిపోయినాడు. గొప్పభుజాలుకలిగిన ఇంద్రుడు, భయంకరమైన వజ్రాయుధంతో కొట్టి ఆ రాక్షసుడి గదను పొడిపొడిగాచేసినాడు. కేశివెంటనే పరాక్రమంతో ఒకపెద్దకొండశిఖరాన్ని విరచి ఇంద్రునిమీద వేసినాడు. ఇంద్రుడుతిరిగి తనభయంకరమైన వజ్రాయుధంతోకొట్టి ఆ కొండను ముక్కలు చేసినాడు. ఆకాశంలో నిప్పుకణాలురాలినాయి. ఈ విధంగా తనఆయుధాలు వ్యర్థంకావడం చూచి దానవుడు భయపడినాడు. ఆ కన్యను అక్కడనేవదలి పారిపోయినాడు.

దగ్గరకుపోయి ఇంద్రుడుఆమెతో, "నీ వెవ్వరి దానవు? ఈ రాక్షసునికి ఎట్లా దొరకినావు?" అన్నాడు. అందుకామె ఇంద్రునితో ఇట్లాఅన్నది. "అయ్యా! నేను 'అరిష్టనేమి' అనే ప్రజాపతి కూతురును. నా పేరు దేవసేన. నేను 'దైత్యసేన' అనేదాని చెల్లెలిని. నేనూ మా అక్కా ఆటలమీద ప్రేమతో మాతండ్రి అనుమతిపొంది బయలుదేరినాము. చెలికత్తెలతోకూడి ఈ మానస పర్వతపు సానుప్రదేశాలలో తిరుగుతూ ఉండినాము. అప్పుడక్కడకు 'కేశి'అనేపేరుకల ఈ రాక్షసుడు చాలాసార్లువచ్చినాడు. తనకుతూహాలం బయటపడేట్లు తనచెడుపోయలు మాకుచూపేవాడు. మాట్లాడేవాడు. పరిహాసంచేసేవాడు. మన్మథక్రీడకు సంబంధించిన కోర్కెలు చూపుతూదగ్గరకు వచ్చేవాడు. వాడి ఈ చేష్టలన్నీ దైత్యసేనకు ఇష్టంగాఉండేవి. కానీ నాకు ఎంతో సహించలేనివిగాఉండేవి. ఈరీతిగా ఆ కేశి మా అక్క దైత్యసేననుకోరి తనవశం చేసుకొనిపోయినాడు. అంతటితో పోకుండా తిరిగివచ్చి ఆ దురాత్ముడు నన్ను ఇదంతా చేసినాడు. నీ దయవల్ల నాకు దుః ఖసముద్రంలో పడడంతప్పింది."

ఈ మాటలన్నీ విన్నఇంద్రుడు, దేవసేనతో ఇట్లాఅన్నాడు. "విను. మా తల్లీ మీ తల్లీ కూడా దక్షుని కూతుళ్ళే. కాబట్టి నిజంగా నీవు నాకు చెల్లెలివిఅయినావు. పద్మముఖీ ! నీ కొకవర మిస్తాను కోరుకో."

ఇదివిని దేవసేన దేవేంద్రునితో ఇట్లాఅన్నది. "పుణ్యాత్మా! ఒకనాడు మాతండ్రి మిక్కిలి ఆనందంతో నన్ను బుజ్జగించి 'అమ్మా! నీవు గొప్ప పేరుకెక్కిన పరాక్రమశాలిని భర్తగా పొందుతావు' అన్నాడు. అట్టివానిని నీవు నాకొరకువెదకవలె."

ఈ మాటలువిని ఇంద్రుడు ఇట్లాఆలోచించినాడు. "ఈమెకు భర్త ఎవడవుతాడు?" అని ఆలోచించే ముహూర్తము 'రౌద్రము' అనేపేరు కలిగింది. అది సూర్యుడూ చంద్రుడూ కలవడానికి కారణమైన అమావాస్య ప్రారంభసమయం. ఉదయసంధ్యలోని ఎర్రని వెలుగులతో మబ్బులన్నీ ఎర్రబడినాయి ఆ ఎర్రమబ్బులు సముద్రజలాలలో ప్రతిబింబించి నీరంతా ఎర్రబడినట్లుకనిపిస్తూఉంది. అట్లాంటిస్థితిలో ఆ సముద్రం దేవదానవుల యుద్ధసంక్షోభంగా అనిపించింది. అట్లాంటప్పుడు సూర్యుడుదయించినాడు. అదేసమయంలో భృగువు అంగిరసుడు మొదలైన మునులు అగ్నిలో హవ్యములు పేల్చినారు. ఆ హవ్యాలను మోసుకొని అగ్నిదేవుడు సూర్యగోళంలోనికి ప్రవేశిస్తూ ఉండినాడు. ఇదంతా ఇంద్రుడు గమనించినాడు". ఈ సమయం సూర్యుడు చంద్రుడూ అగ్ని కలిసే 'రౌద్రము' అనేపేరుగల ముహూర్తము. కాబట్టి సూర్యుడు చంద్రుడూ అగ్నులకాంతితో పుట్టినవాడు. ఈమెకు భర్తఅవుతాడు అని మనసులో ఇంద్రుడు నిశ్చయించినాడు.

ఆ క్షణంలోనే ఆ దేవసేనను తీసికొని బ్రహ్మవద్దకు పోయినాడు. అక్కడ బ్రహ్మకు మ్రొక్కినాడు. "దేవా! ఈమెకు తగినవరుణ్ణి దయతోఇవ్వు". అన్నాడు. అందుకు బ్రహ్మ ఇట్లాఅన్నాడు. "మందే పరాక్రమం కలిగినవాడు, మూడులోకాలను రక్షించగలిగినవాడు, గొప్ప కీర్తికలిగినవాడు, ఒకడు ఈమెకు భర్తఅవుతాడు.

ఇంద్రా! వాడే మీ ఆపదలన్నీ పోగొట్టడానికి, ధైర్యంగా సమస్త దేవసైన్యానికి నాయకుడు కావడానికి, పూనుకుంటాడు. ఇదంతా శీఘ్రంగానే జరుగుతుంది."

ఈ మాటలకు సంతోషించిన ఇంద్రుడు బ్రహ్మవద్ద వీడ్కోలు పొంది. అక్కడ నుండిపోయినాడు. ఆ తరువాత వసిష్ఠుడు మొదలైన సప్తమహామునులు అమావాస్యాహోమం చేయడానికి పూనుకొన్నారు. దేవతలందరూ తమతమ హవిర్భాగాలను తీసుకోవడానికి దగ్గరకు వచ్చినారు. మునులు అగ్నిని 'ఆహవనీయ మ'నే పేరుతో ఆహ్వానించినారు. అగ్నిదేవుడు ఆ మునులు సమర్పించిన ఆహుతులను వరుసగా దేవతలకు ఆనందంగా పంచడంప్రారంభించినాడు.

ఆ సమయంలో ఆ మునీంద్రుల భార్యలందరూ బాగాస్నానంచేసి అందమైనమాలలు, వస్త్రాలు ఆభరణాలు మొదలైన అలంకారాలను చేసుకొన్నారు. గౌరవంగావచ్చి, మంచిబుద్ధితో తమతమ భర్తలకు సేవలుచేస్తూ తిరుగుతూఉండినారు. అప్పుడు ఆ అగ్నిదేవుడు ఆ మునిపత్నులందరనూ చూచినాడు. వారందరికీ అందంగామెరిసే పెద్దకన్నులున్నాయి. ముఖాలలో తేటనవ్వుల కాంతులున్నాయి. నిక్కిన పెద్దచన్నులున్నాయి. ఇవన్నీ స్పష్టంగాచూచి, అగ్నిదేవుడు ద్రవించినాడు. అతని హృదయం మన్మథుని బాణాల దెబ్బలుతిన్నది. ఈ విధంగా అగ్నిదేవుడి ఇంద్రియాలు వశంతప్పినాయి. ఆ మునిపత్నులపై మనసు తగులుకొన్నది. ఆ మనసును ఆయన మరలించలేకపోయినాడు. అందుచేత వారికి 'దగ్గరలో ఉండాల'ను కొన్నాడు. ఆహవనీయాగ్ని (యజ్ఞాలలో హవిస్సులు పేల్చేఅగ్ని) కాస్తా, గార్హపత్య అగ్ని (గృహాలలో వంటలు చేసేఅగ్ని) గామారివారి వంటఇళ్ళలోని కుంపట్లలోనికి చేరినాడు.

ఆ కుంపట్లలోఉంటూ ఆ మునిపత్నులు తనను చేరడానికిఆశపడతాడు. వారు చేరేచోట తన పొడవైన జ్వాలలతో మెల్లగా వారినితాకుతాడు. ఉత్సాహం ఎక్కువై వారితీగలవంటి శరీరాలను ఆసక్తితో కౌగిట్లో చేర్చాలని కోరుకొంటాడు. వలపుప్రభావం ఎక్కువ కాగా, ధైర్యంనశించి, బాధపడతాడు. అంతలో ఆ మునీంద్రులయజ్ఞం పూర్తిఅయింది. అగ్నిదేవుడు మన్మథబాధను సహించలేక పోయినాడు. జనంలేని అడవిలోనికి ప్రవేశించినాడు. 'మునిపత్నులతోసంభోగము అసంభవమ'ని గ్రహించినాడు. దిగులుచెందినాడు. శరీరం త్యజించడానికిపూనుకొన్నాడు.

అగ్నిదేవునిభార్య స్వాహాదేవి, ఇదంతాగమనించింది. ఆమె ఇట్లాఆలోచించింది. "నాకూ నా భర్తకూ సయోధ్యలేదు. అందుకే ఈయనకు ఇట్లాంటిబుద్ధి పుట్టినట్లుంది. ఈ బుద్ధి ఏవిధంగా చూచినా ఇతన్ని నాశనంచేసేదే. కాబట్టి నాకోరికా ఈతనికోరికా తీరేట్లు ఆయనకూ మునిపత్నులకూ కూడా ఏ అపకారం కలుగకుండాఉండేట్లుగా, నేనే ఆయామునిపత్నుల రూపాలలో నాభర్తను తృప్తిపరుస్తాను." అని నిశ్చయించింది.

వెంటనే ఆమె సప్తమునులలో ఒకరైన 'అంగిరసునిభార్య శివ'అనేఆమె రూపంధరించింది. ఒంటరిగా ఉన్న అగ్ని దగ్గరకుచేరి, ఇట్లాఅన్నది."పావకా! నేను అంగిరసుని భార్యశివను. పుణ్యాత్మా ! నాకూ, నాతోడి మునిపత్నులకు, ప్రతిదినం మిక్కిలిమనోహరములైన హొయలుకలిగిన నీఆకారంపై కోరిక కలిగింది. 'నీమనసులోని భావమిది' అని నిజంతెలుసుకోలేక మేముమాఆత్మలలో ఎల్లప్పుడూ మన్మథబాణాలదెబ్బలకు అలజడితో బాధపడుతూఉంటాము. నీకు మామీద కోరికఉన్న విషయం నీ కుతూహలచేష్టలతో ఇప్పుడేతెలుసుకున్నాము. మాకందరికీ కోరిక చేతమనసుచలించింది. వరుసగా నిన్ను మేమందరమూ పొందకోరినాము. ఇష్టంగా చెలులందరూ తొలుత 'నన్ను పొమ్మ'ని నియోగించినారు. అందువల్ల ముందుగా నేను వచ్చినాను. మనస్సు ఎల్లప్పుడూ ప్రేమగా ఉండేట్లు సంభోగించి అనుభవించు. ఇంక వేరేమాటలుచెప్పి, దూరంచేస్తే నన్ను మన్మథుడుసహించడు".

ఈ మాటలకు సంతోషించి అగ్నిదేవుడు, ఆమెను స్వీకరించినాడు. ఆమెకూడా అతణ్ణి కోరిన భోగాలతో సంతోషింపచేసింది. అతణ్ణి శుక్లాన్నిధరించింది.

ఆ క్షణంలోనే ఆ స్థలంవదలి గరుడపక్షియై ఆకాశానికెగిరింది. వేగంకలప్రయాణంతో శ్వేత పర్వతానికిపోయింది. అక్కడ ఒకచోట రెల్లుగడ్డిచేతచుట్టుకొనబడిన బంగారుకుండలో తనభర్త శుక్లాన్ని నిక్షేపించింది.

ఆ తరువాత ఇంకాఇట్లే వరుసగా, మునిపత్నులరూపాలు ధరించి స్వాహాదేవి, భర్తను సంతోషింప చేసింది. ఎప్పటిలాగానే భర్తశుక్లాన్ని, అదే కలశంలో నిక్షేపిస్తూఉండింది.

ఈ విధంగా ఆరుగురు మునిపత్నులరూపాలు ధరించి, అగ్నికి సంభోగ సౌఖ్యాన్ని అందించింది. తానందుకొన్నది. కానీ పతివ్రతాశ్రేష్ఠయై ప్రకాశించే అరుంధతీదేవిరూపం ధరించడానికి ఎంత ప్రయత్నించినా ఆమెకుసాధ్యంకాలేదు.

ఈ విధంగా ఆరుసారులుజారిన అగ్నిశుక్లం, ఒకే బంగారుకలశంలో నిక్షిప్తంచేసింది. ఆ శుక్లంనుండి సూర్యునివంటివాడూ, పెద్దపెద్దవైన పన్నెండుచేతులు కలిగినవాడు, ఆరుముఖాలు కలిగినవాడు, అయిన కుమారస్వామి జన్మించినాడు. ఆయన జన్మించినప్పుడు అన్ని దిక్కులూ ఆకాశమూ ప్రకాశించినాయి.

ఈ విధంగా శుక్లపక్షంలో పాడ్యమినాడు శుక్లాన్ని ఉంచగా, విదియనాడు కడుపుకనిపించింది. తదియనాడు శరీరంమాత్రంఉదయించగా, చవితినాడు అన్నిఅవయవాలు సంపూర్ణంగాఉదయించి, పంచమినాడు బాగాలేచినిలబడే ఆకారంకలిగి అతిశయించినాడు. ఆ కొండలలో ఉంచబడిన మూడునగరాలను కాల్చిన శివునివిల్లును తీసుకొని, ఆ కుమారస్వామి అల్లె త్రాటిని మ్రోగించినాడు. ఆ మహాధ్వనిని విన్న 'ఐరావతం, సుప్రతీకం' అనే దిగ్గజాలు కోపగించుకొని కుమారస్వామిపై దాడిచేసినాయి.

ఆ మహాభుజాలుకలిగిన కుమారస్వామి ఆ రెండుఏనుగులను కదలకుండా పట్టుకొని రెండుచేతుల్లో ఉంచుకొన్నాడు. తనసహజమైన 'శక్తి'అనే ఆయుధాన్ని ఒకచేత్తో పట్టుకొన్నాడు. ఒక చేతితో వినోదంగా ఒక కోడిని పట్టుకొన్నాడు. బాగా పూరించబడి నినదించే శంఖువును రెండు చేతులతో పట్టుకొన్నాడు. రెండుచేతులతో ఆకాశాన్ని చరుస్తూఉండినాడు. రెండుచేతులు ముఖాలపైనఉంచుకొన్నాడు. మిగిలిన రెండుచేతులవేళ్ళను శిశువుసహజంగా నోట్లోఉంచుకొని చప్పరించడం మాటిమాటికీ చేసినాడు.

ఆ కుమారస్వామి ఆ నాడే (పంచమినాడే) వాడిఅయిన బాణంతో క్రౌంచ పర్వతాన్ని చీల్చినాడు. గొప్పదైన 'శక్తి' అనే ఆయుధంతో కొట్టి శ్వేతశైల శృంగాన్ని విరుగగొట్టినాడు. విజృంభించి ఆరుముఖాలతో ఒక్కసారిగా గొప్పకేకవేసినాడు. ప్రళయకాలంలో భైరవుడుచేసేశబ్దంలాగా భయంకరమైన ఆపెను కేకవలన, కులపర్వతాలు వేగంగాకదలినాయి. దిక్కులు పగిలినాయి. భూమండలమంతా 'గిరగిరా' తిరిగింది. వేల్పులందరూ భయంతోకూడిన సంచలనానికిలోనైనారు. సముద్రాలన్నీ అల్లకల్లోలమైనాయి. సూర్యునిగుర్రాలు మిక్కిలిభయపడి, భ్రాంతిచెంది, రథాన్ని నాలుగువైపులకుఈడ్చినాయి. ఇట్లాంటి భయంకరమైన ఉత్పాతాలుపుట్టగాచూచి, మునులు లోకాలకుమేలు జరిగేట్లు శాంతిక విధులుచేసినారు. అయినా ఉత్పాతాలుఆగలేదు.

ఆ సమయంలో 'చైత్రరథం' అనే పేరుగల అడవిలో నివసించే జనులందరూ కూడుకొని, "అంగిరసుడుమొదలైన మునీంద్రులభార్యలకు అగ్నిదేవునివల్ల పుట్టిన ఈ బాలుడు లోకాలకు ఇట్లాంటి చెడు చేయడం ప్రారంభించినాడు." అంటూ ఏడ్చినారు. ఆ అపవాదుకు బాధపడి ఆ సప్తమునులలో వసిష్ఠుడుతప్ప మిగిలినఆరుగురు, తమతమ భార్యలను వదలివేసినారు. ఇంకకొంతమంది ప్రజలు "వీళ్ళేం చేస్తారు పాపం. ఇన్ని విధాలుగా చేసింది అగ్నిభార్యయే కదా?" అనడం మొదలు పెట్టినారు.

అప్పుడు ఆ మహామునులవద్దకు అగ్నిభార్య స్వాహాదేవివచ్చి, ఇట్లా చెప్పింది. "వినండి. నేను అగ్నివలన కన్నకుమారుడు వాడు. చాల నిజమిది. ఇదిమీ భార్యలకు సంబంధించిన విషయమెంతమాత్రం కాదు. సత్పురుషులు ఈవిధంగా కులసతులను విడవడం న్యాయమా?" ఇట్లా ఆమె ఎంతచెప్పినా ఆ మునులు అంగీకరించలేదు.

ఆ తరువాత ఈ ఉత్పాతాలను ●ణచడంకోసం, విశ్వామిత్రుడు కుమారస్వామివద్దకు పోయినాడు. ఆ దేవుణ్ణి శరణువేడుకొన్నాడు. రకరకాలైనమాటలతో పొగడినాడు. అతని ఆదేశంపొంది అతనికి జాతకర్మలుచేసినాడు. ఇట్లా కుమారస్వామిని శాంతపరచినాడు. ఉత్పాతాలు ఆగిపోయినాయి.

ఇదంతాతెలిసి దేవతలంతా దేవేంద్రుని చూడడానికిపోయి, ఆతనితో ఇట్లాఅన్నారు. "అగ్ని కుమారుడు భయంకరమైన పరాక్రమం కలవాడు. మిక్కిలి గర్వంతోకూడిన మనస్సుకలవాడు. నిన్ను లెక్కచెయ్యకుండా

అడ్డులేనిపరాక్రమంతో నీ పదవిని తీసుకొనే కోరికతో తప్పకుండా ఇప్పుడు ఇక్కడకువస్తాడు. కాబట్టి ఇంతలో పట్టుదలతో అధికమైన పరాక్రమంచూపి వేగంగా వాణ్ణిచంపు. నీ వట్లాచేస్తే నీకు ఇంద్రపదవి శాశ్వతమవుతుంది. మేముకూడా బ్రతుకుతాము. లోకాలు అలజడిచెందవు."

ఈ మాటలు వినగానే ఇంద్రుడు సప్తమాతృకలనుపిలిచి, "మీరు పోయి ఆ అగ్నికుమారుణ్ణి చంపి నాకు సంతోషం కలిగించండి". అని ఆజ్ఞాపించినాడు. వారు ఆ పనికై పూనుకొని భయంకరంగా అతని పైకి విజృంభించినారు. కానీఅతని దేదీప్యమానమైనతేజస్సునుచూచి భయపడినారు. అతన్ని శరణు చొచ్చినారు. "మేము లోకాలకుతల్లులం. మమ్మల్ని నీవుకూడా తల్లులలాగానేచూడు" అని ప్రార్థించినారు. కుమారుడు వారిప్రార్థనను మన్నించినాడు. వారినిగౌరవించినాడు. ఆదరించినాడు.

ఆ తరువాత అగ్నికూడ తన కుమారుని దగ్గరకు వచ్చినాడు. కుమారస్వామి తండ్రిని పూజించినాడు. అగ్ని తనకుమారుణ్ణి రక్షించడంకొరకై అక్కడనేఉండిపోయినాడు. సప్తమాతృకలకోపంనుండి పుట్టిన'లోహితాస్య' (ఎర్రని ముఖంకలిగినది) అనే స్త్రీ కుమారస్వామికి దాదియై అతణ్ణి గారాబంగా పెంచుతూఉండింది. ఇదంతావిని కోపగించుకొని ఇంద్రుడు స్వయంగా కుమారస్వామిపైకి దండెత్తి వచ్చినాడు.

అట్లా దండెత్తివచ్చినవాడు బలంతోగర్వించినఇంద్రుడు. చలించని పరాక్రమంతో భయంకరంగా నిప్పుకణాలను వెదజల్లే వజ్రాయుధాన్ని చేతిలోధరించివచ్చినాడు. అప్పుడు దేవేంద్రునివెంట ఉన్న దేవతలుకూడా ప్రకాశించేకాంతులతో భయంకరమైనఆయుధాలు ధరించివచ్చినారు. అట్లావచ్చి, వారందరూ ఉప్పొంగి కేకలు పెడుతూ, ఆ కుమారుణ్ణి ఎదుర్కొన్నారు. ఆ కుమారస్వామికూడ తగినట్లుగా వేగిరపాటుతో, కోపంతో, భయంకరంగా నవ్వినాడు. వేగంగా అతని నోళ్ళనుండి అద్భుతంగా భయంకరమైన అగ్నిజ్వాలల గుంపులుపుట్టినాయి. అవి దేవతలసైన్యాన్ని ముందుకురాకుండా నిలిపి, వారిని కాల్చివేయడం మొదలుపెట్టినాయి. అప్పుడు దేవతలంతా భ్రాంతి చెందినారు. "నీ సేవకులం. మమ్ములను స్వీకరించి దయతోరక్షించు." అంటూ పొగడదగిన బలంకలిగిన కుమారస్వామిని శరణుకోరినారు. అతడు వారినిస్వీకరించి వారికి అగ్నిభయంలేకుండాచేసినాడు.

ఈ విధంగా దేవతలంతా కుమారస్వామిని ఆశ్రయించడంచూచిన ఇంద్రుడికి మిక్కిలికోపం వచ్చింది. ఎర్రబడిన కనుగ్రుడ్లు త్రిప్పుతూ కుమారస్వామిపైన తనవజ్రాయుధాన్ని ప్రయోగించినాడు. ఆ వజ్రాయుధం కుమారస్వామిశరీరాన్ని కుడివైపునతాకింది. అందులోనుండి 'విశాఖుడు' అనేవాడు పుట్టినాడు. పుట్టినవిశాఖుడు బంగారురంగుకలిగినవాడు. అతడుకూడ కుమారస్వామిలాగా శక్తిఅనే ఆయుధం ధరించిఉన్నాడు. అతనికి మేకముఖంఉంది. ఆ విశాఖునితో పాటుగా ఇంకాచాలబాలబాలికల గుంపులు పుట్టినాయి. అదంతాచూచిన ఇంద్రునికి కూడా భయంపుట్టింది. తానుకూడ కుమారస్వామిని శరణుకోరి ప్రార్థించినాడు. అప్పుడు దేవతలంతా సంతోషంతో సింహనాదాలుచేస్తూ వారిద్దరిచుట్టూ చేరినారు.

అప్పుడు లోకంలోనిసంపదఅంతా స్త్రీ ఆకారాన్నిధరించివచ్చి కుమారస్వామినిచేరింది. అట్లా పుట్టిననాడే అగ్నికుమారుడైన కుమారస్వామి, సంపూర్ణమైన యౌవనవంతుడయినాడు. అతడికి ఎత్తైన భుజాలున్నాయి. కవచంధరించిఉన్నాడు. గొప్పతేజస్సుతో ప్రకాశిస్తూఉన్నాడు. మిక్కిలిఎర్రని వస్త్రాలు ధరించిఉన్నాడు. అతడి చెవులకు అందమైనకుండలాలున్నాయి. బంగారం రత్నాలతో వెలిగిపోయే గొప్పకిరీటం ధరించిఉన్నాడు. అతడు అన్నిమంచిగుణాలతో కూడినవాడు. అట్టికుమారస్వామిపై అనురాగంతో అందరూ చూస్తూ ఉండగానే స్త్రీ ఆకారందాల్చిన సంపదంతా కుమారస్వామినిచేరింది. సంపదతోకూడి, గొప్పకాంతితో ప్రకాశించి, నిండుచంద్రునిలాగాఉన్న కుమారస్వామిని మునులూ దేవతలూ బాగా వికసించిన తెల్లకలువలవంటి తమకండ్లతో చూచినారు.

ఇదంతా కుమారస్వామి పుట్టిననాడే జరిగిపోయింది. ఆ మరుసటిదినాన మహామునులందరూ కుమారస్వామిని మిక్కిలిభక్తితో పూజించినారు. వారంతా చేతులుజోడించి ఇట్లాఅన్నారు. "కుమారా! పుట్టినవెంటనే అతిశయించి లోకాలన్నింటినీ ధీరుడవై సంతోషంగాజయించినావు. నీ మాహాత్మ్యం ఎంతోవింతకదా? ఇటువంటి జయింపరానివాడవు. ఇంద్రపదవికి పట్టముకట్టుకొని దయతో మమ్మ ల్నందరనీ పరిపాలించు"

ఆ మాటలు విన్న కుమారస్వామి "ఇంద్ర పదవిలోఉండేవాడు చేయవలసినపని ఏమి?" అని అడిగినాడు. వారు "షణ్ముఖా! 'బలాన్నీ తేజస్నీ, నింపిలోకాన్ని దయతో పాలించడం, సూర్యుడికీ, చంద్రుడికీ, భూమికీ, అగ్నికీ గాలికీ ఆకాశానికీ చలనంలేకుండా స్థిరమైన శక్తినివ్వడం, మంచివారినిరక్షించడం, చెడ్డవారిని శిక్షించడం,' ఇవి ఇంద్రపదవిలో ఉండేవాడు చేయవలసిన పనులు." అనేటప్పుడు ఇంద్రుడు కూడా, "నీవు ఇంద్రపదవిని స్వీకరిస్తే చాలబాగుంటుంది. దేవా!నీవు దేవతలనాయకుడవుగా అభిషిక్తుడవై ఆనందంగా నాతో పనులుచేయించుకో. నీ దయవల్ల నేను దోషాలేమీ లేకుండాఉంటాను. నీవు చాలగొప్పశౌర్యంకలవాడవు. కాబట్టి ఇంద్రపదవి యొక్క ఐశ్వర్యానికి నీవే యోగ్యుడవు. నేను దేవేంద్రపదవిలో ఉండడానికి జంకుతున్నాను. ఎందుకంటే నీతేజో విశేషాలుచూచి ఆశ్చర్యపడి కొందరు నీకు ఇంద్రపదవిపై కోరికకలిగేట్లు ఏమైనాచెప్పి, నాలోటుపాట్లు ఏవైనాకల్పించి, నీకూ నాకూ శత్రుత్వం ఏర్పడేట్లుచేస్తారు. అందువల్ల నీవు కోపగించుకొని, దయతప్పితే ఎవరూ నిన్నుఅడ్డగించలేరు. లోకభయంకరమైనయుద్ధం జరుగుతుంది. కాబట్టి దేవతలరాజ్యాన్ని నీకేసమర్పించినాను. మమ్మల్నందరినీ ఏలుకో". అని విన్నవించినాడు.

అప్పుడు కుమారస్వామినవ్వుతూ ఇట్లాఅన్నాడు. "దేవేంద్రా! అట్లాంటివి ఎందుకుపుడతాయి? నీవే లోకాలకంతారాజువై హెచ్చైనతేజంతో సుఖంగాఉండు. నేను నీకుచుట్టాన్నై నాభుజబలంతో నీ పనిని నెరవేరుస్తూ వుంటాను. వెంటనే నన్నుపంపు. ఈ సమయంలో నేను చేయవలసినపని ఏమిటి?"

అందుకు సంతోషించి ఇంద్రుడు ఇట్లాఅన్నాడు. "అట్లైతే నీ అనుమతితో, నేను ఇంద్రపదవిలో నిలిచిఉంటాను. గొప్ప భుజాలుకలవాడా ! దేవతల సైన్యానికంతానాయకుడవై నీవు మంచిదయతో జగత్తుకంతా భయంలేకుండాచేయి."

ఇంద్రుడట్లా అనగానే కుమారస్వామి ఇట్లాఅన్నాడు. "నీకానందం కలిగేట్లుగా నేను దేవసేనా పతినిఅవుతాను. భుజబలం అజేయంకాగా, అతిశయించి, విజృంభించి, భయంకరాకారులైన నీ శత్రువులందరినీ చంపుతాను. 'సమస్తలోకాలను కాపాడే కార్యంలో మాత్రమే దీక్షకలవాడ'నడంలో 'సందేహం లేనివాడ'నవుతాను. దేవసేనాపతిగా నాకు పట్టముకట్టు."

కుమారస్వామి ఇట్లాఅనగా ఇంద్రుడు సంతోషించి, మునులూ దేవతలూ అందరతోకూడి ఆ క్షణంలోనే కుమారస్వామిని సమస్తదేవసేనకూ అధిపతిగా అభిషేకించినాడు. మునీశ్వరులు 'జయజయ' శబ్దాలు చేసినారు. దేవతలుసింహనాదాలు చేసినారు. గంధర్వులు మంగళతూర్యనాదాలుచేసినారు. అప్సరసలు నాట్యంచేసినారు. కల్పవృక్షపు పుష్పాలవర్షాలుకురిసినాయి. ఇవన్నీ ఒకేసమయంలోజరిగినాయి. కుమారస్వామి తలపైన బాగాప్రకాశించే తెల్లనిగొడుగు వేలుపుకొండ పైభాగానఉండే శరదృతువులోని చంద్రబింబంలాగా ఉండింది.

ఆ సమయంలో శంకరుడు పార్వతితోపాటుగా దేవసేనానిఅయిన 'షణ్ముఖునిచూడాల'ని మిక్కిలి ప్రీతితో వచ్చినాడు. ఆ సమయంలో పలువురుసిద్ధులు ఆ శివుణ్ణి కొలుస్తూఉన్నారు. ఆయన పరమానందంగా ఉండినాడు. తలమీద చంద్రవంకను కలిగిఉన్నాడు. గొప్పపాములతో అలంకరించబడి ప్రకాశించేఆకారంకలిగిఉన్నాడు. ఆ ఈశ్వరుడు వినయంతో మ్రొక్కేవారికి శుభంకలిగించేవాడు. ఈశ్వరుడు ఈ విధంగావచ్చి మహాసేనాధిపతియైన కుమారస్వామిని కౌగిలించుకున్నాడు. విశ్వకర్మనిర్మించిన బంగారుతోనిండిన పూలమాలను కుమారస్వామికి బహూకరించినాడు.

పూర్వం ఈశ్వరుడు తనశుక్లాన్ని అగ్నిలో నిక్షేపించినాడు. ఆ శుక్లాన్నే స్వాహాదేవి ఋషిపత్నుల రూపంలో అగ్నితో ఆరుసార్లు సంభోగించి వెలువడచేసింది. ఆ శుక్లాన్నే ఆమె బంగారు పాత్రలో ఆరుసార్లు నిక్షేపించింది. అట్లాకుమారస్వామి ఆ శివపుత్రుడు, అగ్నికుమారుడుకూడా అయినాడు. అగ్ని భార్య స్వాహాదేవి, 'కృత్తికలు' అనే పేరుగల మునిపత్నుల రూపంగైకొని అగ్నితో సంభోగించగా వెలువడిన శుక్లంతో జన్మించడంవల్ల ఆయనకు 'కార్తికేయుడ'నే పేరుకూడా వచ్చింది. స్వాహాదేవి అగ్నినుండి రేతస్కందం (శుక్లాన్ని స్రవించడం) చేయించడంవల్ల పుట్టినందున కుమారస్వామికి 'స్కందుడు' అనేపేరుకూడా వచ్చింది. ఇది కుమారస్వామికి సంబంధించినవిశేషం.

అప్పుడు ఇంద్రుడు, మునుపు తాను బ్రహ్మ ఆజ్ఞప్రకారం సురక్షితంగా ఉంచిన 'దేవసేన' అనే కన్యను అందంగా అలంకరించనాజ్ఞాపించి, తగినవిధంగా అచ్చటికి రప్పించినాడు. ఆ తరువాత కుమార స్వామిని చూచి "ఈ కన్య నీ కోసమే బ్రహ్మచేత సృష్టించబడింది. కాబట్టి ఈమెను స్వీకరించు" అన్నాడు. అప్పుడు కుమారస్వామి చిరునవ్వుతో సుందరమైన పద్మంవంటి ముఖంకలవాడైనాడు. ఆ ముహూర్తంలోనే దేవసేనను వివాహమాడినాడు. బృహస్పతి మంత్రాలు పలుకుతుండగా దేవసేనను కుమారస్వామి వరించినాడు.

కుమారస్వామి దేవసేనను కోరిపెండ్లి చేసికొన్న ఆ దినం షష్ఠి కావడంవల్ల ఆ రోజు లోకాలన్నింటిలో పూజింపదగినరోజు అయింది. ఏదినం శ్రీదేవి (సకలసంపదలు) కమలపుగుర్తులుకలచేతులతో షణ్ముఖుణ్ణి వరించిందో, ఆ పంచమిరోజుకూడా లోకాలన్నీ ఆదరించే దినమైంది. ఆ రోజు సంపదలకు నెలవైంది.

ఈ విధంగా ఆనందంగాఉండే కుమారస్వామి వద్దకువచ్చి, తమభర్తలువిడిచిన మునుల భార్యలు ఆరుమంది, మిక్కిలిదీనంగా, పాలిపోయిన ముఖాలతో, ఇట్లాఅన్నారు. "దుర్జనులు మంచిచెడ్డలు ఆలోచించకుండా 'అగ్నిదేవునివల్ల నిన్ను కన్నామ'ని మాపై అపవాదు వేసినారు. ఆ అపవాదుకు భయపడి మమ్మువేగంగా మా భర్తలు వదలివేసినారు. సంతోషంగా ఇకమీదట నిన్ను మా కుమారుడిగా స్వీకరిస్తున్నాము. కుమారా! మమ్ము రక్షించడం నీవు నెరవేర్చవలసినధర్మం. పుణ్యలోకాలు పోగొట్టుకొని బాధపడుతున్న మమ్మల్ని స్వీకరించి దయనిండినమనస్సుతో పుణ్యమార్గంలో మమ్మల్నినిలుపు. కొడుకుకుఉండదగిన ఆలోచించేచూపుచూచి, మాదైన్యం తీర్చవయ్యా!"

అందుకు కుమారస్వామి వినయంగా ఇట్లాఅన్నాడు."నేను మీకుమారుణ్ణే. మీరునన్ను కన్నతల్లులే. వినండి అనుమానమెందుకు? మీకు సంతోషంకలిగిస్తాను". ఇట్లాఅంటూ దగ్గరలోఉన్న దేవేంద్రుణ్ణి చూచి, "వారికి తగినపదవులుచూడు". అన్నాడు. అప్పుడు ఇంద్రుడిట్లాఅన్నాడు. "చంద్రుని భార్యలైన ఆ దక్షుని పుత్రికలలో రోహిణి ప్రక్కన కాంతితో ప్రకాశించే 'అభిజిత్తు'అనే ఒకనక్షత్రం ఇప్పుడు తపస్సు చేయడానికి పోయింది. చంద్రునికి అందరికంటే మిక్కిలి ప్రియమైనభార్య తానే కావాలని ఆలోచించి ఆమె (నక్షత్రం) కోరికతో తపస్సు చేయడానికి పోయింది. ఆ పదవిలో ఇప్పుడు ఎవరూ లేరు. వీరిని ఆ పదవిలోఉంచు".

ఇంద్రుడిట్లా అనగానే, కుమారస్వామి, వారికి (ఆ కృత్తికలనబడే ఆరుగురు మునిపత్నులకు) ఆ పదవినిచ్చి సంతోషంగా వీడ్కొలిపినాడు. పూనుకొనివారుకూడా ఆకాశానికిపోయినారు. ఆ నాటినుండి ఆ కృత్తికలు ఆరుమందీ నక్షత్ర కూటమిగా ఏర్పడి, ఆకాశంలో వెలుగొందినారు. ఈ నక్షత్రకూటమికి, అగ్ని అధిదేవతఅయింది.

ఆ తరువాత స్వాహాదేవివచ్చి కుమారుణ్ణి చూచి, "నీవు నాకుమారుడవు. ఎల్లప్పుడూ నేను నీ వద్దనే 'ఉండాల'నుకుంటున్నాను". అనగా కుమారస్వామి సంతోషించినాడు. "అట్లేకానీ. నీవు నాకు దగ్గరగాఉండి నేనూ నీకోడలూ సేవిస్తూఉండగా సంతోషంగాఉండు." అన్నాడు.

అటు తరువాత 'హావిశ, కాళి, కౌశిక, ఉద్ధత, శారిక, ఆర్య, వైధాత్రి' అనే ఏడుగురు కుమార మాతృకలు కుమారస్వామిముందునిలిచి ఇట్లాఅన్నారు. "మమ్ములను మూడులోకాలకు తల్లులుగా చేయి. ముందు సంతోషంగాఉండే మాతృకలను దేవతలుగా పరిగణించబడకుండా ఉండవలె. సంతోషంగా అందరూ మమ్మల్నెప్పుడూ కొలుస్తూఉండవలె. షణ్ముఖా! ఇదంతా మాకువరంగాఇమ్ము." ఆమాటలు విని కుమారస్వామినవ్వుతూ, "అట్లెందుకు? వారిగొప్పతనం తగ్గించడంతగునా? సంతోషంగా ఇంకొక వరంకోరుకోండి. తప్పకఇస్తాను" అన్నాడు. అందుకా స్కందమాతలు గౌరవంగా ఇట్లాఅన్నారు. "మేము కోరినవరాన్నే ఇమ్ము. మేము లోకంలోకల శిశువులకు ఎల్లప్పుడూ పీడలు కల్పిస్తూ నీ దయవల్ల వర్ధిల్లుతాము. ఈ వరం మాకివ్వతగును". ఈమాటలకు కార్తికేయుడిట్లాఅన్నాడు." అయ్యో! కీడు చేసేఆలోచనచేసినారు. ఈ పని న్యాయమా? అయినాఈ వరం మీకిచ్చినాను. మీకు మ్రొక్కినా, మిమ్మల్ని ప్రార్థించినా, ఆరాధించినా, దయతో శిశువులను కాపాడండి. వదలిపెట్టకుండా పదారేండ్లప్రాయం దాకా నరులను బాధించండి. నా అంశంలో పుట్టిన ఆజానుబాహుణ్ణి జయించరానివాణ్ణి మిమ్మల్ని రక్షించ దానికి నియమిస్తాను." ఇట్లాచెప్పి ఆ కుమారస్వామి తనశరీరంనుండి బంగారురంగుతో ఒకపురుషుణ్ణి పుట్టించినాడు. వాడు పుట్టినప్పుడే ఆకలికలిగి నేలపైపడిమూర్ఛపోయినాడు. కుమారస్వామివానికి చైతన్యం కల్పించినాడు. అతడు 'స్కందాపస్మారము' అనే పేరుతో ఒకగ్రహమై మాతృకాగణ రక్షకుడయినాడు.

ఇక పక్షులతల్లి వినత, దైత్యులతల్లి దితి, గోవులతల్లి సురభి, కుక్కల తల్లి సరమ, చెట్లతల్లి కరంజ, పాములతల్లి కద్రువ, కుమారస్వామి దాది లోహితాస్య, మాతృకాగణాలతోకూడి గర్భాలకు పీడను కలిగిస్తూ, శిశువులనుపీడిస్తూ, మనుష్యులవల్ల బలులు, జపాలు, కానుకలు, దానాలు, తర్పణాలతో తృప్తిపడి, బాలురకు ఆయుస్సును ఆరోగ్యాన్నిఇస్తారు. పదహారేళ్ళతరువాత డెబ్బైఏండ్లవయస్సువరకుకూడా దేవ, పితృ, గంధర్వ యక్ష మొదలైన గ్రహాలు బాధిస్తూనేఉంటాయి. డెబ్బైఏండ్లతరువాత గ్రహాలేవీ బాధించవు. కానీ వారిని బాధించేందుకు అప్పుడు ముసలితనమే చాలు.

నియమాలతో ఇంద్రియాలనుజయించి, శుచులై శాంతిసంపదకలవారికి, ఏగ్రహాలు భయం కలిగించలేవు. ఆదిదేవుడైన ఈశ్వరునిమీద ఎవనిమనసు భక్తిభావంతో ప్రకాశిస్తుందో అట్టివాడిపనులు వేటిలోనూకూడా గ్రహబాధఉండదు.

ఆ విధంగా కుమారస్వామి గ్రహాలను నియోగించేటప్పుడు అగ్నిదేవుడిభార్య స్వాహాదేవి మెల్లగా తిరిగి కుమారస్వామివద్దకు వచ్చింది. వచ్చి"కుమారా ! విను. నేను దక్షుడికుమార్తెను. నన్ను బాల్యంలోనే మాతండ్రి అగ్ని కిచ్చినారు. అతడు నన్నేమాత్రం ప్రేమించలేదు. నాకు నాభర్తకు ఎడబాటులేని సంబంధాన్ని ఏర్పాటుచేయి". అన్నది. అప్పుడు కుమారస్వామి "బ్రాహ్మణోత్తములందరూ అగ్నిలో హోమద్రవ్యాలను వేల్చేటప్పుడు, 'స్వాహా'అనేపేరు ముందుచెప్పి ఆ తరువాత మంత్రాలు చెప్తారు. దానివల్ల నీభర్తతో నీవు ఎల్లప్పుడూ సన్నిహితంగా ఉంటావు". అన్నాడు.

ఆ తరువాత బ్రహ్మదేవుడు మునులందరితో కలసివచ్చి కుమారస్వామిని మెచ్చుకొన్నాడు. అంతకుముందే అక్కడకువచ్చిఉన్న పరమేశ్వరుణ్ణిచూచి కుమారస్వామితో "పుణ్యాత్మా! ఇతడే మూడు నగరాలను నాశనంచేసిన మూడుకన్నులదేవుడు. ఈమె మూడులోకాలకుతల్లిఅయిన హిమశైల పుత్రిక. వీరు నీకు తండ్రీతల్లీ సుమా! వీరిని స్థిరమైన భక్తితో పూజించు. అగ్నిదేవునిలోనూ, ఆయన భార్యలోనూ, తమయోగబలంచేత వారుఆవేశించి నిన్నుపుత్రునిగా కన్నారు." అని చెప్పినాడు.

పార్వతీపుత్రుడైన కుమారస్వామి ఆనందంతోకూడిన హృదయంకలవాడై సకలలోకాలకు గురువులైన పార్వతీపరమేశ్వరులనుపూజించినాడు. కొనియాడినాడు.

అప్పుడు దేవేంద్రుడు కుమారస్వామికి ఐరావతానికి అలంకరించిన రెండుగంటలను బహూకరించి నాడు. అందులో ఒకటితానుతీసుకొని రెండవదానిని కుమారుడు విశాఖునకుఇచ్చినాడు.

ఆ తరువాత పార్వతీదేవితోకూడి ఈశ్వరుడు కుమారుణ్ణి కౌగిట్లో చేర్చుకొంటూ అతని తలను వాసనచూచి, రథాన్నిఎక్కించినాడు. ఆ రథానికి వేయిసింహాలుపూన్చబడి ఉన్నాయి. అడ్డులేని వైభవంతో 'భద్రవటం' అనే స్థలానికి పోవడంప్రారంభించినారు.

శివుడట్లా భద్రవటానికి పోయేటప్పుడు, ఆయన ముందువైపు పెక్కుమంది యక్షపరివారంతో పుష్పక విమానంపైన కుబేరుడునడచినాడు. కుడివైపు బలవంతులైన యక్షరాక్షసులతో రక్షింపబడుతూ 'అమోఘుడ'నే యక్షశ్రేష్ఠుడునడచినాడు. ఆయనవెంట ఆయుధాలతోకూడిన వసువులు రుద్రులు ఆదిత్యులుకూడా ఉండినారు. ఎడమవైపున మిక్కిలి భయంకరమైన వ్యాధులూ, మృత్యువుతో కలిసి యముడు, ఇంకా రకరకాలైన క్రూరజలజంతువులతో కూడిన వరుణుడు నడచినారు. ఇంకా శూలం, పట్టిస, గద, ముసలం మొదలైన పరమేశ్వరుడి ఆయుధాలు కమండలము మొదలైన పరికరాలుకూడా ప్రకాశిస్తూ వెంటనడచినాయి. ఆ అదిదేవునిదగ్గరగాఉండి చంద్రుడు తెల్లటిగొడుగు పట్టినాడు. గాలి అగ్నులు చామరాలుధరించి పరమేశ్వరునిసేవించినాయి. 'విద్య, సావిత్రి, గాంధారి, కేశిని' అనే దేవతా స్త్రీలు పార్వతిని సేవిస్తూ నడచినారు. ఈశ్వరుని స్నేహితుడైన 'పింగళుడ'నే యక్షుడు వృషభకేతనాన్ని పట్టుకొన్నాడు. ఈ విధంగా

అందమైన వైభవంతో కుమారస్వామితండ్రి ఈశ్వరుడు, కుమారస్వామి, ఇంద్రుడుమొదలైన దేవతలతోకూడా భద్రవటంచేరినాడు. అక్కడ ఈశ్వరుడు కుమారుణ్ణిచూచి, ఇట్లాఅన్నాడు. "కుమారా ఏడవదిఅయిన మరుత్తులకు సంబంధించినసేనకు నీవు నాయకుడవుకమ్ము. దేవతలకెప్పుడు పనిపడినా, వారిని స్వీకరించి పూనుకొనివారి పనిని నేరవేర్చు. ఎల్లప్పుడూ నాపాదధ్యానంతో గొప్పవాడివి కా. పో. శుభాలను పొందు." ఈశ్వరుడిట్లాచెప్పి కౌగిలించికొని ఎంతోప్రేమతో అతణ్ణి వీడుకొలిపినాడు.

అదేసమయంలో వేగంగా గొప్పఉత్పాతాలు కనిపించినాయి. దిక్కులుమండినాయి. భూమి 'గిరగిరా' తిరిగింది. ఆకాశం ధ్వనించింది. పర్వతాలు వణికినాయి. లోకమంతా భయంకరమైనచీకట్లు ఆవరించి నాయి. దేవతల మనస్సులన్నీ సంభ్రమంచెందినాయి. ఆ తరువాత శివుడున్నగు నాయకులతో కూడిన దేవతలపైకి, రాక్షసులసైన్యం మహాపరాక్రమంతో దండెత్తివచ్చింది. ఆ రాక్షససైన్యం గొప్ప అస్త్రాలతో దేదీప్యమానంగా వెలుగొందింది. ఆ సైన్యం భూమండలాన్ని అంతటిని ఆక్రమించగల చతురంగబలం కలిగిఉన్నది. దిగ్దిగంతాలు మారుమ్రోగుతూ వినేవారిచెవులుచిల్లులుపడేట్లు శబ్దంచేసే ఆపలేనివేగంకలదాసేన.

ఈ విధంగా మహిషాసురునిరక్షణలోఉన్న ఆ గొప్పరాక్షససైన్యం పరుగెత్తుకుంటూవచ్చి చుట్టుముట్టింది. లెక్కకుమించినబాణాలు, గదలు, ఖడ్గాలు, ముసలాలు, పరిఘలు, శతఘ్నులు, మొదలైన ఆయుధాలు ప్రయోగించి నిముషమాత్రంలో ఎక్కువగా ఉన్న ఏనుగుల, గుర్రాల, రథికుల, పదాతిదళాల, గుంపులను చంపినారు. కార్చిచ్చు చుట్టుముట్టినపుడు చెదరి పరుగెత్తే జంతువులలాగా దేవతలు యుద్ధ రంగంనుండి చెదిరి దూరంగాపారిపోయినారు. ఇదిచూచి ఇంద్రుడు సింహనాదంచేస్తూ గొంతెత్తి దేవ గణాలతో ఇట్లాఅన్నాడు."భయంతోకూడిన తొట్రుపాటువద్దు. ఈ సమయంలో అందరూ గర్వంతో నేర్పుతో వాహనాలు మహాస్త్రాలు ఆయత్తంచేసుకొని మరలిరండి. శక్తితో, చెడ్డవారైన రాక్షసులను సంహరించండి. నేనుండగా మీరుభయపడడమెందుకు? ధైర్యం వహించండి. నిలబడండి. అందరినీ గెలవండి." ఇంద్రుడు ఇట్లాఅనగా వసువులు, రుద్రులు, సాధ్యులు మొదలైన దేవతాశ్రేష్ఠులు పారిపోకుండా నిలబడినారు. యుద్ధోత్సాహంతో అన్నివాహనాలు అస్త్రాలు ఆయత్తంచేసికొని అతిశయించినారు. సింహనాదాలుచేసినారు. రాక్షసులతో తలపడినారు. దేవతలు ప్రయోగించిన పెక్కుశస్త్రాల దెబ్బలతో భయంకరములైన మదగజశరీరాలు చీల్చబడినాయి. ఎక్కువ నెత్తురుతోకూడిన అవయవాలతో శత్రుసైన్యాలు అదుపుతప్పి నేలకూలినాయి. ఆ కూలిన దేహాలు గాలిదెబ్బకు చెల్లాచెదరైన సాయంత్రపు 'ఎర్రని మబ్బులేమో?' అనిపించేట్లుండింది. దేవేంద్రుడు ముందుండగా దేవతలసేననుండి ప్రయోగింప బడిన శస్త్రాలతో అవన్నీ అట్లా చెదరగొట్టబడినాయి. అతిశయంనశించి రాక్షససైన్యంలోని గర్వించిన అశ్వసేన ఉవ్వెత్తుగాఎగసి వీచే ఎదురుగాలికి చెదరి, విరిగిపడే భయంకరమైన సముద్రపు కెరటాలలాగా వెనుతిరిగినాయి. అతిశయిస్తూ దేవసైన్యం ప్రయోగించిన మంటలు చుట్టుముట్టగా రాక్షస సైన్యంలోని రథాలన్నీ పొడిపొడి అయిపోయినాయి.

ఆ మంటలు అన్ని వైపులా దావానలంలాగా ఆక్రమిస్తే, వంట కట్టెల గుట్టలు నశించే విధంగా కనబడింది. దేవతలచేత ప్రయోగించబడిన అమ్ముల గుంపులతో గర్వించిన రాక్షసులతలలు, రాలిక్రిందపడినాయి. ఆ పడడం ఊహిస్తే ప్రళయకాలంలో మేఘాలనుండివచ్చిన పిడుగులదెబ్బలతో కొండలనుండిఎగిరిపడే రాళ్లమాదిరిగాకనిపించినాయి. ఇట్లాచంపబడుతూ, దైత్యసైన్యాలు దీనత్వంపొంది, నిలువలేక నాలుగువైపులకుచెదరినాయి.

అప్పుడు మహిషుడు పూనుకొని రాక్షససైన్యాన్ని పారిపోకుండానిలబెట్టినాడు. ఒకపెద్దకొండను పెరికి రెండుచేతులతో పట్టుకొని దేవతలమీదకు విజృంభించినాడు. అదిచూచి ఉత్సాహంపుట్టి దైత్యసేన, అతన్ని కలుసుకొన్నది. భేరులూ నిస్సాణాలుమొదలైనతూర్యనాదాలు, సింహనాదాలు, అతిశయించగా పూనుకొన్నారు.

ఇంద్రుడు మొదలైన దేవతలుకూడా, ఆటోపంతో యుద్ధానికి పూనుకొని నిలిచినారు. మహిషుడు శక్తితో ఆ కొండను దేవతల సైన్యంమీదకు విసరినాడు. ఆ దెబ్బకు భూమి కంపించింది. దాని క్రిందపడి పదివేలమంది దేవతాయోధశ్రేష్ఠులు చచ్చినారు.

ఇదంతాచూచి, ఎంతోభయంతో ఇంద్రుడు మొదలుగా దేవతలంతా మనసుల్లో భ్రాంతిచెంది పారిపోయినారు. భయంకరాకారంకలిగి యమునివంటిపరాక్రమంకలిగిన ఆ రాక్షసుడు గర్వంతో అప్పుడు దిక్కులుచలించగా దేవసైన్యాన్నిసమీపించినాడు. యముణ్ణిచంపినశివుని తేరుకొసను కోపంతో వేగంగాపట్టుకొన్నాడు. "అదిగో ఈశ్వరుడు చిక్కినాడు. ఇంక రాక్షసునిచేతిలోచస్తాడు". అంటూ రాక్షసులు పొంగిపోయి, భయంకరంగా కేకలుపెట్టినారు. మూడులోకాలూ వణకిపోయినాయి. మునీశ్వరులందరూ మిక్కిలిదీనులయినారు.

చిరునవ్వుప్రకాశించేముఖంతో ఈశ్వరుడు తనకుమారుడైన కుమారస్వామినిచూచి ఇట్లా అన్నాడు. "కుమారా! రణకోవిదా! చూచినావా వీనిసాహసం ? శూరత్వంతో సాహసించి నా రథాన్నే అడ్డగించినాడు. వీడు నీచుడు. తప్పు చేసినవాడు. అవినీతిపరుడు. ఆయుస్సు తీరినవాడు. అట్టి వీడిని మృత్యువు వాతపడవేయి."

ఈశ్వరుడిట్లా ఆనతిఈయగానే కులపర్వతంతోసమానుడైన కుమారస్వామి ఉత్సాహంతో రథ మెక్కినాడు. ఆ సమయంలో అయనఎర్రనిపూలమాలలుధరించిఉన్నాడు. కొత్తఎర్రనిరత్నాలు పొదిగినఆభరణాలు ధరించిఉన్నాడు. కొత్తఎర్రనివస్త్రాలుకూడా ధరించిఉన్నాడు. కోపంతో కళ్ళు ఎర్రగా మెరిసిపోతూఉన్నాయి. ముఖమంతా పూర్తిగాఎర్రబారింది. యుద్ధంచేయడానికి పూనుకొన్నాడు. అప్పుడు అతడు చూడడానికి ప్రళయకాలంలో లోకాలనుకాల్చివేసే బాలసూర్యుడిగా కనిపించినాడు. భయంకరమైన తేజస్సుకలిగిన శివుని కుమారుణ్ణి చూచిదేవతల గుంపు, భయంవదలి, పారిపోకుండా, ధైర్యంగా నిలబడినారు.

అప్పుడు కుమారస్వామి శత్రువులను సంహరించే ఉత్సాహంతో భయంకరమైన 'పిడుగుసోదరి' అనదగిన 'మండిపోయేశక్తి' అనే ఆయుధాన్ని మహిషాసురునిపై ప్రయోగించినాడు. ప్రళయకాలంలోని అగ్ని ఆటోపఆరంభాన్ని గుర్తుచేస్తూ, ఆ 'మహాశక్తి' అనే ఆయుధము వేగంగా విజృంభించి మహిషాసురుణ్ణిచేరి అతనిశరీరాన్ని బూడిదచేసింది. కుమారస్వామి ఈ విధంగా మహిసాసురుణ్ణి చంపినాడు. ఇంకా ఆ మహాశక్తిని తిరిగితిరిగి ప్రయోగిస్తూ లక్షలకొలదీ దైత్యులనూ, దానవులనూ చంపినాడు. ఆ దేవునివెంటఉండే అనుచరులుకూడ ముట్టడించి రాక్షసులను తునిమితూటాడి, వారి రక్తాన్ని త్రాగి, మాంసాన్ని తిని, మత్తుతో ఆడుతూ పాడుతూ కుమారస్వామిని పొగడుతూ స్వేచ్ఛగా తిరిగినారు.

ఈ విధంగా శత్రువులను చంపి, చీకట్లను పారద్రోలిన సూర్యుడిలాగా వెలిగిపోతూఉండిన అజేయుడైన కుమారస్వామివద్దకు వచ్చి దేవేంద్రుడు కౌగిలించుకున్నాడు. ఈ రాక్షసరాజు బ్రహ్మ దేవుడు ఇచ్చినవరంచేత గర్వించి, మమ్మల్ని లెక్కచెయ్యలేదు. వీడు అపరిమితమైన పరాక్రమం కలిగినవాడు. 'నీభయంకరమైన కోపమ'నేఅగ్నిలో మిడతలాగా కాలి బూడిదఅయిపోయినాడు. యుద్ధంలో ఇంకా వీడికి సమానమైన నూరుగురురాక్షసులుకూడా చచ్చినారు. మూడులోకాల్లోనూ, నీ కీర్తిప్రకాశించింది. దేవతాగణాలు, నేనూ, కూడా నీసేవకులం. దయతోఎల్లప్పుడూ మమ్మల్నిరక్షించు". అన్నాడు.

అప్పుడు ఈశ్వరుడు తనకుమారుడైన కుమారస్వామిని కౌగిలించుకొన్నాడు. మెచ్చుకొన్నాడు. ఇంద్రుడు మొదలైనవారినిచూచి, "నా మీదలాగానే, ఈ కుమారస్వామిమీదకూడా భక్తికలిగిన మనసులతో ప్రవర్తించండి." అని ఆజ్ఞాపించినాడు. దేవతలు ఆనందంగా తమతమ నివాసాలకు పోయినారు. ఈ విధంగా ఒకదినంలోనే బలం కలిగిన కుమారస్వామి రాక్షసులనందరనూ చంపి అతిశయించినాడు. దయతోలోకాలన్నింటికీ అభయమిచ్చినాడు.

**నీతి :** దైవమే అన్నింటినికంటే బలవత్తరమైనది.

**విశేషం :** (1) అగ్నులు మూడు విధములు. అవి

(అ) ఆహవనీయము (ఇది యజ్ఞ శాలలో హవిస్సులు పేల్చడానికి పనికి వచ్చే అగ్ని.)

(ఆ) గార్హపత్యం (ఇది గృహాలలో వంటలకు పనికి వచ్చే అగ్ని.)

(ఇ) దక్షిణం (ఇది శ్రోత్రియ బ్రాహ్మణులకు అనువుగా ఉండే అగ్ని.)

(2) ఈ కథంతా ఆరు రోజులముచ్చటే. వివరాలివి.

(అ) అమావాస్య సూర్యోదయ సమయం ---- ఇంద్రుడు, దేవసేన కలుసుకున్నారు.

(ఆ) అమావాస్య సాయంకాలము ---- అగ్ని గార్హపత్యాగ్నిగా, కుంపట్లలో చేరింది.

(ఈ) పాడ్యమి నాడు ---- అగ్నిభార్య స్వాహాదేవి, మునిపత్నుల రూపంలో అగ్నిని తృప్తిపరచింది. ఆరుసార్లు జారిన శుక్లాన్ని నిక్షిప్తంచేసింది.

(ఉ) విదియనాడు ---- కడుపు కనిపించింది.

(ఊ) తదియనాడు ---- కుమార స్వామి శరీరం ఏర్పడింది.

(ఋ) చవితినాడు ---- అన్ని అవయవాలు సంపూర్ణంగా ఏర్పడినాయి.

(ౠ) పంచమినాడు (1) లేచి నిలబడే ఆకారం కలిగింది.

(2) ఇంద్రుని జయించినాడు.

(3) సంపద చేరింది.

(ఐ) షష్ఠి నాడు ---- (1) దేవసేనాపతిగా అభిషేకం జరిగింది.

(2) దేవసేనతో వివాహం జరిగింది.

(3) మహిషాసుర సంహారం కూడా జరిగింది.

ఉ. దీపితవిక్రమాస్పదుఁడు దీనికి వల్లభుఁడయ్యెడుం ద్రిలో
కీపరిరక్షణక్షముఁడు గీర్తితమూర్తి యొకండు; వాఁడ మీ
యాపదలెల్ల బాపుటకునై ధృతిఁ బూను నశేష దేవసే
నాపతి భావమున్ విబుధనాయక ! శీఘ్రమ భావ్య మింతయున్. 5-192

మ. కులశైలంబులు గ్రక్కునం గదలె; దిక్కుల్ వ్రయ్య లయ్యెన్; మహీ
వలయం బంతయు దిర్ధిరం దిరిగె; దేవవ్రాతముల్ సాధ్వసా
కులతం బొందెఁ; బయోధు లన్నియును సంక్షోభించె; సప్తాశ్వస
ప్తులు బిట్టుల్కి రథంబు నల్దెసలకుం బో నీడ్చె సంభ్రాంతమై. 5-208

# 40. ధృతరాష్ట్రుని దుఃఖం.

**(అరణ్య 5-326 నుండి 343 వరకు.)**

**(ద్వైతవనంలోఉండిన పాండవులనుచూచి వెనకకుపోయి, హస్తినాపురంలో ధృతరాష్ట్రుణ్ణిచూచిన బ్రాహ్మణుడితో ధృతరాష్ట్రుడు దుఃఖించుట.)**

పాండవులు కామ్యకవనంలో అరణ్యవాసం చేస్తూఉండగా, కృష్ణుడు సత్యభామతోకూడిపోయి పాండవులను పరామర్శించినాడు. అదేకాలంలో మార్కండేయ మహర్షికూడా అక్కడకువచ్చినాడు. ఆయన శ్రీ కృష్ణుడికి పాండవులకు ఎన్నో పుణ్యకథలు చెప్పినాడు. ఆ తరువాత కృష్ణుడు పాండవులవద్ద వీడ్కోలుపొంది ద్వారకకుపోయినాడు. అటుపిమ్మట పాండవులు కామ్యకవనాన్నివదలి అనేకమైన అడవులనూ కొండలనూ నదీ నదాముల విశేషాలనూ చూస్తూ ద్వైతవనంచేరినారు. వారు ఆ ద్వైతవనంలో ఉండగా హస్తినాపురంనుండి చక్కనికథలుచెప్పడంలో నేర్పరిఅయిన ఒక బ్రాహ్మణుడువచ్చి పాండవులను దర్శించినాడు. తరువాత అతడు తిరిగి హస్తినకుచేరుకొన్నాడు. హస్తినలో ధృతరాష్ట్రుణ్ణి దర్శించినాడు. అపుడు ధృతరాష్ట్రుడు ఆ బ్రాహ్మణుడిని 'పాండవుల యోగక్షేమాల' గురించి అడిగినాడు. ఆ విప్రుడు ధృతరాష్ట్రునితో ఇట్లాచెప్పినాడు.

పాండవులయిదుగురూ ఎప్పుడూ చలిగాలికీ, ఎండకూ, తిరగడంవల్ల శరీరాలుకృశించి గొప్ప 'దుఃఖం' అనేసముద్రంలో మునిగిఉన్నారు. మరియు వీరులైనఅయిదుగురుభర్తలున్నప్పటికీ ద్రౌపది అనాథలాగున మిక్కిలిదుఃఖంతో బాధపడుతూఉంది".

ఆ బ్రాహ్మణుడిట్లా చెప్పగావిని, ధృతరాష్ట్రుడు హృదయంలో విషాదంపొందినాడు. కన్నీరు కార్చినాడు. కొంచెంసేపు ఏమీ మాట్లాడకుండా ఉండిపోయినాడు. నిట్టూర్పు వదలినాడు. గద్గదకంఠంతో ఇట్లాఅన్నాడు.

"అయ్యో ! నేనుచేసిన కీడువల్లా మిక్కిలి నీచుడైన నాకొడుకు అజ్ఞానంవల్లా ఈ విధంగా పుణ్యాత్ములైన పాండవులకు ఎక్కడలేనిఆపదలుదాపురించినాయి. బ్రహ్మదేవుడు దయలేనివాడై దుష్టులకుదూరంగా ఉండేవాడూ, ధీరుడూ, కౌరవంశాన్ని ప్రకాశింపచేసేవాడూ, అయిన నాపెద్దకొడుకు ధర్మరాజును ఎక్కువగా కష్టపెట్టినాడు. ధర్మరాజు ఈదురుగాలులులేని నిర్మలమైనసౌధాలలో మనోహరములైన హంసతూలికాతల్పాలపైన పండుకొనేవాడు. ఉదయాన్నే మాగధులూ, పౌరాణికులూపాడేపాటలతో మేల్కొనేవాడు. నేడు కటికనేలమీద పడుకుంటున్నాడు". ఇట్లాఅని, ఇంకా,

"పదివేలఏనుగులబలంకలిగినవాడూ, దిగ్గజాలతొండాలవంటి పొడవైనచేతులుకలవాడూ అయిన భీముడు, గొప్పఆవేశంకలిగినఆత్మతో అడవిలో చిక్కిపోయి అలసినఏనుగువలెఉండడా?" అన్నాడు. ఆ తరువాత, "అన్నలూ, తమ్ములూ, భార్య, ఆర్తితో పెద్దదుఃఖంలో మునిగిఉండడంచూచి, ఆలోచిస్తే అర్జునుడు

ధర్మరాజు ఆజ్ఞకు కట్టుబడి ఏమీచేయలేని భయంకరమైన పాములాగా, బుసలు కొడుతూ, దుఃఖం ఎక్కువకాగా, నా కుమారుని తప్పులులెక్కిస్తూ, మనసులో 'ఏ మ'నుకుంటూఉంటాడో?" అనిచెప్పి, చింతించినాడు.

"అయ్యో! మృదువైనశరీరాలు, మిక్కిలిచక్కనిమనసులూకలిగిన నకులసహదేవులు కుమారులలో సింహాలవంటివారు. వారు ఇష్టములైనసుఖాలు పొందడానికిఅర్హులు. ఆలోచిస్తే వారు బాధపడి చిక్కిపోయి ఉండడాన్ని ఓర్చుకోవడం ఆశ్చర్యకరము". అనిచెప్తూ ఇంకాఇలాఅన్నాడు.

"భీముడు సాటిలేనితేజస్సు కలిగినవాడు. ఎత్తైన భుజాలుకలిగినవాడు, భయంకరమైనవాడు. శత్రువులను నిగ్రహించినవాడు. పుణ్యాత్ముడు. అట్టిభీముడు తనఅన్నచేసిన 'సత్యం' అనే త్రాళ్లబంధనాలలో చిక్కి పోయి, ఆ అన్న ఒడంబడికకు కట్టుపడి, ఈ విధంగా భయంకరమైన దుఃఖాలబాధలను సహించినాడు. కానీ అతనిమనస్సు ఎక్కువకోపంతో నిండిఉంటుంది. శకునిమోసమూ, దుశ్శాసనుడు చేసినచెడ్డపనీ, కర్ణుని తులువతనమూ, దుర్యోధనుని చెడునీతీ, భీముడిమనసులో ముండ్లపందిముళ్ళలాగా పీడించగా, దావాగ్ని లాగామండి, 'కోపం అరణ్యవాసం' అనేగాలులు వీచడంవల్ల అంతకంతకూఎక్కువై, ఒడలంతామండి పోతూఉంటే, ఎప్పుడూ ముఖం ఎర్రబడగా ముడివడిన కనుబొమలతో పెదవులుకొరుకుతూ భయంకరంగా ఉండేరూపం నామనసులో ఎప్పుడూ విడవక నిలిచిఉంటుంది. నా పుత్రులమిత్రులసమూహానికంతా వాడే మృత్యుదేవత. ధర్మరాజుహృదయంలో కోపమంతఉండదు. అర్జునునిమనస్సులోకూడా అంత ఉండదు. ఆ భీముడుమాత్రం యమునివంటివాడు. ఎల్లప్పుడూ ఎక్కువకోపం కలిగిఉంటాడు. 'అర్జునుడు'అనే గాలిచేత ప్రేరేపించబడి పెరిగి 'భీముడ'నే దావాన్ని అడ్డగించలేనివిధంగా 'కర్ణుడు, శకునితోకూడా నానూరుమందికొడుకులు' అనేఅడవిని వేగంగా చుట్టుముట్టకుండాఉంటుందా? చేసిన కర్మలకు తగినఫలితాలు తప్పకకలుగుతాయి కదా? సరిపడేట్లు అనుభవించకపోవడం సాధ్యమా? విధికృతాలు తప్పిపోతాయా? కౌరవులకందరికీ చచ్చేకాలం వచ్చింది. ఇంకెందుకు విచారించడం? అని చెప్పిఇంకా "నేను వద్దంటే జూదంమానలేదు. కొడుకు చెడునీతిని మరలించకుండా నాఅహంకారం వల్లా దేవునిచేతవల్లా కులక్షయమయ్యే పనికిపూనుకున్నాను. రాత్రిపూర్తికాగానే పగలురాకుండా ఎందుకుంటుంది? పగలు పూర్తికాగానే రాత్రిరాకుండాఉంటుందా? 'శుభాలు కలిగినాయ'ని సంతోషించేటప్పుడే ఆపదలుకూడా కూడుకుంటాయి. ఆపదలు తొలగగానే గొప్పసౌఖ్యాలు కలుగుతాయి. జ్ఞానులు 'దుఃఖం, సంతోషం' అనేవాటితో ధైర్యాన్నిపోగొట్టుకోరు. ఎప్పుడూ సుఖంగాఉంటారు.

అడవుల్లోఉండి కృశించినఅర్జునుడు దేవతలవరంతో మిక్కిలిసంతోషంగా ఆటలాగా మహాస్త్రాలుపొంది ప్రకాశించినాడు. ఆ స్వర్గానికిపోయి శరీరంతోనే తిరిగి భూమికివచ్చినాడు. ఇట్లాంటివే కదా ఆశ్చర్యంకలిగించే రకరకాలకర్మలఫలితాలు.

గాండీవం విల్లట. ఇంద్రునికొడుకుఅర్జునుడు వింటిని ధరించినవాడట. అతని బాణాలు దేవతా మహిమకలిగినవట. వేరే మాటలెందుకు? భూమీ, సంపదాఅంతా వారిసొత్తే." అని ధృతరాష్ట్రుడు పలువిధాలుగా దుఃఖించినాడు.

సీ. శకుని కైతవము, దుశ్శాసను చేసిన దుష్కర్మమును, గర్ణు తులువతనము,
దుర్యోధనుని దైన దుర్ణయంబును, జిత్తమున 'గిరి శల్యముల్ వోలెనల ఁప
దావాగ్ని తెఱఁగున దరికొని క్రోధంబు వనవాస మని యెదువాయుగతుల
నంతకంతకుఁబేర్చి,యవయవంబుల నెల్ల మండంగనెప్పుడు మధ్యముండు

ఆ. మొగము జేవురింప, ముడివడు బొమలతో నవుడుగఱ చుచు భయంకరముగ
నున్నరూపు వాయకుండునామది; వాఁడమిత్తినాదు పుత్ర మిత్ర తతికి. **5-335**

క. గాండీవము విల్లటె; యాఖండలనందనుఁడు విల్లు గలవాఁడటె; త
త్కాండంబులు దివ్యములటె; యొందేటికి వారిధనమ యుర్వియు సిరియున్. **5-343**

# 41. ఘోష యాత్ర.

**(అరణ్య పర్వము - పంచమాశ్వాసము 347 నుండి 435 వ పద్యం వరకు.)**
**(పాండవులు అరణ్యవాసకాలంలో ద్వైతవనం ప్రాంతంలోఉండగా వారిని అవమానించాలని ఘోషయాత్రనెపంతో దుర్యోధనుడు అక్కడకుపోయి గంధర్వులచేత బంధించబడినాడు. పాండవులచేత విడిపించబడినాడు.)**

మాయజూదంలోఓడిపోయినపాండవులు అరణ్యాలపాలైనారు. అరణ్యాలన్నీ తిరుగుతూ ద్వైతవనంలో ఒకసరోవరం సమీపంలో నివసిస్తూఉండినారు. వారిని ఇంకా 'పరాభవించాల'నుకున్నారు దుర్యోధనాదులు. ఒక రోజురాత్రి దుర్యోధనుడు శకుని, కర్ణులతో మంతనాలాడినాడు. వారు ముగ్గురు కలసి పాండవులను అవమానించడానికి ఏం చేయాలో ఆలోచిస్తూ ఉన్నారు.కర్ణు డిట్లా అన్నాడు. "పాండవు లిప్పుడు దు:ఖంతో 'చాలాదీనులై ఉన్నార'ని విన్నాను. వారిప్పుడు ద్వైతవనంలోని సరోవరం 'దగ్గరలో ఉన్నార'నికూడా విన్నాను.నీవు సామ్రాజ్యవైభవంతో ద్వైతవనానికిపోతావు. నీ తేజస్సు వేసవిలోని సూర్యుని తేజస్సులాగా వెలిగిపోతూఉంటుంది. ఆ తేజస్సునుచూచి పాండవుల కన్నులుమాడిపోతాయి. భరించరానంత బాధపడతారు.నీవేమో మీవంశకర్తఅయిన యయాతిలాగా వెలిగిపోతూఉంటావు.అట్లాంటి నిన్నుచూచి, వారు మిక్కిలి దుఃఖిస్తారు. మిత్రులను సంతోషపెట్టడం, శత్రువులను దుఃఖపెట్టడమే కదా? మనకు సంపదలున్నందుకు ఫలము. 'తాను సుఖంగాఉండగా, శత్రువులుగొప్పగా కీడును పొందడాన్ని చూడగలగడ'మనేది గొప్పఆనందకరమైన విషయము.నిజానికి ఆ ఆనందాన్నిమించినఆనందము ఇంకేమీ ఉండదు. ధనము, ధాన్యము, పుత్రులు, బంధువులు ఇవన్నీకూడా ఆ ఆనందాన్ని మించిన ఆనందాన్ని కలిగించలేవు. దుర్యోధనా! అర్జునుడు ఇప్పుడు నారచీరలు ధరించిఉంటాడు.కందమూలాలే అతని ఆహారం. భయంకరమైన అడవిలో దుఃఖభారాన్నిమోస్తూ బాధపడుతూఉంటాడు. మనమేమో వెలిగిపోయే రాజ్యవైభవం కలిగిఉంటాము. ఈ విధంగా మనమువెలిగిపోతూ ఆ విధంగా నలిగి దీనంగాఉండే అర్జునుణ్ణిచూచి ఆనందించడంకంటె మించినఆనందమింకేముంటుంది? సాటిలేని భోగభాగ్యాలతోఒప్పారే నీ భార్యలనుచూచి, ద్రౌపది ధైర్యం పోగొట్టుకోవద్దా? ఆమె గుండెమండి కుమిలిపోవాద్దా?"

ఈ మాటలు విన్న దుర్యోధనుడు కర్ణుడితో, "ఇది బాగుంది " అన్నాడు. ఈ ఆలోచనకే ఆనందించి నాడు. కొంతసేపు ఆలోచించినాడు. ఆ తరువాత కర్ణుణ్ణి చూచి ఇట్లాఅన్నాడు. "నా ఉద్దేశ్యంకూడా ఇదే. నీవుచెప్పినపద్ధతి నాకుబాగానచ్చింది. కానీ మనము ఆ ద్వైతవనానికి పోవడానికి ధృతరాష్ట్ర మహారాజు 'అనుమతించడేమో?' అని నా అనుమానం. అక్కడ 'పాండవులున్నా'రని ఆయనకుతెలుసు. 'మనమావనానికి పోవాలనుకోవ'డం అర్జునునిపై 'పోట్లాటకే' అనుకుంటాడు. ఎట్టిపరిస్థితులలోను మనలనక్కడకు పోనీయడు. అదీకాక ఆయనకు పాండవులుఅంటే చాలాభయముఏర్పడింది.వారు చాలా 'గొప్పశౌర్యశాలుర'ని ఆయన ఉద్దేశ్యం. వారు గొప్పతపస్సుచేసి 'స్థిరత్వముపొందిఉన్నార'ని ఆయన భావిస్తూఉంటాడు. ఇంతసేపు ఆయన

వారి శౌర్య ధైర్యాలను చెప్పిదుఃఖించడం విన్నావుకదా? ఎల్లప్పుడూ ఆయన వద్దనేఉండే విదురుడు, మనఉప్పుతింటూకూడా వారినే పొగడుతూఉంటాడు. జూదంనాటి నుండి ఈ విదురుడు 'పాండవుల పక్షపాతి' అనే విషయం తెలిసిపోయింది. మనమనుకున్న ఈ పనిని గురించి ఏ మాత్రంతెలిసినా అతడు దాన్నిఎట్లాగైనా చెడగొడతాడు. కాబట్టి ఈ పనిని రహస్యంగా చేయవలసి ఉంటుంది. విదురునికి తెలియకుండా ధృతరాష్ట్రుడు ఇందుకనుమతించే మార్గమేమిటి? అట్లాంటి ఉపాయమేదో నీవూ, శకునీ ఆలోచించండి. మనము పొద్దున్నేవచ్చి కురుపితామహుడైన భీష్ముణ్ణి, మహారాజుధృతరాష్ట్రుణ్ణి, ఒప్పించి బయలుదేరుదాము". ఇట్లా చెప్పివారిని, వారివారి ఇండ్లకుపంపి, తానుకూడా తనఅంతఃపురానికి పోయినాడు. ఆ రాత్రిని తగువిధంగా గడపినాడు.

తెల్లవారగానే కర్ణుడు దుర్యోధనుని వద్దకువచ్చి, ఇట్లా అన్నాడు. " రాజా! నేనొకసరియైన ఉపాయాన్ని కనుగొన్నాను. ఇప్పుడు ఆ ద్వైతవనంలో మనఘోషాలు (ఆవుల మందలు) ఉన్నాయి. ఈ విషయం అందరికీ తెలుసు. తృప్తిగా 'వాటినిచూడడం'అనే పేరుతో మనమక్కడకు పోవచ్చును. ఇట్లైతే ధృతరాష్ట్రుడుకూడా 'పొమ్మ'ంటాడు. అన్నివిధాల మనకోరిక తీరుతుంది". ఈ మాటలు వినీవినకముందే శకుని, "దుర్యోధనా! నీ మీదఒట్టు. నేనుకూడా రాత్రంతా ఇదేఅనుకున్నాను." అన్నాడు. అంతట ఆ ముగ్గురూ చిరునవ్వులు చిందించుకొన్నారు. ఒకరికొకరు కరచాలనం చేసుకొన్నారు. వెంటనే 'సమంగుడ'నే ఒక గోపాలుడిని పిలిపించు కొన్నారు. వాడికి ధృతరాష్ట్రుడి దగ్గర ఏమి మాట్లాడాలో? ఎట్లా మాట్లాడాలో? నేర్పించుకొన్నారు. వాడిని ధృతరాష్ట్రునికడకు తీసుకొనిపోయినారు. అక్కడ ధృతరాష్ట్రునితో తగిన విధంగా మాట్లాడినారు. రాచమర్యాదలను పాటించినారు. అట్లా ఆయనను తమకుఅనుకూలంగా మార్చుకున్నారు. ఆ తరువాత "దేవా! ద్వైతవనంలోని ఆలమందనుండి ఇదిగో ఈ గోపాలుడు వచ్చినాడు" అన్నారు. ఆ మాటలువినగానే ధృతరాష్ట్రుడు ఆ గోపాలుడికి ఎదురుగా ముఖాన్నిత్రిప్పి పశువుల క్షేమంగురించి అడిగినాడు. గోపాలుడిట్లా సమాధానంచెప్పినాడు.

"మహారాజా! ద్వైతవనంలాంటి సుఖమైనచోటు ఆవుల కింకెక్కడాలేదు. కానీ ఇప్పుడు క్రూర మృగాలు ఎప్పుడూ ఎక్కువగా విజృంభించి, తిరుగుతూఉన్నాయి. అవి ఆవులకు భయంకలిగిస్తూ ఉన్నాయి. ఆ విషయం విన్నవించడానికే నేను అక్కడనుండి వేగంగా వచ్చినాను". వాడిట్లా అన్నతరువాత కర్ణుడు, శకునికలిసి ధృతరాష్ట్రుడితో, "దేవా! అట్లయితే క్రూరమృగాలనుచంపి, గోవులను రక్షించడానికి నీ కొడుకు దుర్యోధనుణ్ణి వెంటనే నియమించండి". అన్నారు. ధృతరాష్ట్రుడు కొంచెంసేపు ఆలోచించి ఇట్లాఅన్నాడు.

"గోరక్షణ తగిన పనియే. దుష్టమృగాలనుచంపడం మంచిదే. అయినా ఆ అడవిలో గొప్పవారైన పాండవులున్నారు. వారు ప్రసిద్ధికెక్కిన ప్రతాపవంతులు. అందువల్ల మీరక్కడకు పోవడం ఎన్నిరకాలుగా చూచినా నా కిష్టంలేదు. 'అడవులకు పోయి దీనులైనార'ని మీరు తప్పక వారికి'కీడు చేయాల'నుకుంటారు.

ఆ పురుషసింహాలు గొప్పగా తపస్సు చేసినవారు. కోపగించుకుంటే వాళ్ళు తమతపోమహిమతో మిమ్ములను కాల్చివేస్తారు. లేకపోతే యుద్ధంచేసి వారిసాటిలేని శస్త్రాస్త్రాలతో మిమ్ములను చంపివేస్తారు. ఇంతకుముందు మీచేత అవమానింపబడి, పాండవులు నొచ్చుకొనిఉన్నారు. మిమ్ములను చూడగానే భీముడు కోపగించు కోకుండా ఉంటాడా? అతడు గరుత్మంతుని అంతటి పరాక్రమం కలిగినవాడు. అంతేకాదు. ఇంకా దివ్యాస్త్రాలు సంపాదించకముందే అర్జునుడొకడే భూమిపైనగల రాజులందరనూ జయించినాడు. ఇప్పుడు మహేంద్రునివద్ద ఈశ్వరునివద్ద దివ్యఅస్త్రాలు పొంది ఆనందంగా వచ్చిఉన్నాడు. అట్టివాడిని యుద్ధంలోఎదుర్కొనడం ఎవరికైనా సాధ్యమవుతుందా? మీరు వారికి కీడుచేయడం, వాళ్ళు తిరిగి మీకపకారంచేయడం, ఆలోచిస్తే మంచిదికాదు. ఆలమందలను కాపాడడానికి ఇంకెవరినైనా పంపుదాం." ఇట్లాఅంటూ దుర్యోధనుడు ద్వైతవనానికి పోవడానికి ఒప్పుకోని ధృతరాష్ట్రునితో శకుని ఇట్లాఅన్నాడు.

"దేవా! పాండవులు క్రమశిక్షణ కలిగినవారు. పరాక్రమంలో గొప్పవారు. వారి జోలికి మేమెందుకు పోతాము? కీడెందుకు చేస్తాము? ఒకవేళ మేమట్లా చేసినా మాటకుకట్టుబడే ధర్మరాజు సత్యంతప్పుతాడా? ఆయన తమ్ములుకూడా ఆయనను ఎందుకతిక్రమిస్తారు? ఇదినిజం. నీమనస్సులోనమ్ము. మాకు కూడా మనసుల్లో వేటమీదఆసక్తి కలిగిఉంది. గోవులను సంరక్షించడం మంచిపనే కదా? ఏకీడైనా ఎందుకు జరుగుతుంది?"

ఈ మాటలువిన్న ధృతరాష్ట్రుడు కొంతసేపు మనస్సులోఆలోచించినాడు. "బుద్ధిగా గోవులను రక్షించి వెంటనే తిరిగిరండి." అని ఎట్టకేలకు వారిని అనుమతించినాడు. దుర్యోధనునికి మిక్కిలిసంతోషం కలిగింది. హృదయం తొందరపడింది. ఆ క్షణంలోనే 'ఘోషయాత్రవార్త హస్తినాపురంఅంతటా ప్రకటించ మ'ని ఆజ్ఞాపించినాడు. చాటింపు జరిగిపోయింది.

దుర్యోధనుడు మంచిబట్టలుకట్టినాడు. విలువైన భూషణాలుధరించినాడు. పైపూతలు పూసు కొన్నాడు. ఘోషయాత్రకు బయలుదేరినాడు. తమ్ములు, కర్ణుడు, శకుని ఇంకాదగ్గరిచుట్టాలు తగిన వాహనాలతో ఆయనను అనుసరించినారు. అతని రాణులు ఇతరఅంతఃపురస్త్రీలు కొన్నివేలమంది పల్లకీలు మొదలైన వాహనాలెక్కి బయలుదేరినారు. హస్తినాపురంలోని ప్రముఖపౌరులు తమతమ భార్యలతో పాటు ఆనందంగా ముందుకునడచినారు. అలంకరించిన బండ్లలో వర్తకులు, వేశ్యలుకూడా బయలు దేరినారు. ఈ విధంగాసాగిన ఆ ఘోషయాత్ర కోలాహలంగా సాగింది.

అంతేకాదు. ఆ దుర్యోధనుని ప్రయాణానికి తగినట్లుగా ఎనిమిదివేలరథాలు, ముప్పైవేల ఏనుగులు, తొంభైవేల గుర్రాలు, లక్షమంది కాల్బలంఉన్న పెద్దసేన ఆయనవెంటనడచింది. ఇంకా వారివెంట గొప్పగొప్ప వేటకారులు, విటులు, విదూషకులు, వైతాళికులుమొదలైన వారనేకులు బయలుదేరినారు. కొందరు

సామంతులుకూడా ఆయనతో పాటు కదలినారు. అందరూకలిసి గవ్యూతి దూరంపోయి నారు. (గవ్యూతి అంటే రెండు క్రోసుల దూరం. క్రోసు అంటే 2000 గజాలు, ఆ విధంగా గవ్యూతి అంటే 4000 గజాలు ఇంచు మించు 3.5 కిలో మీటర్లు) అక్కడ విడిది చేసినారు. ఆ రాత్రి గడచింది. మరుసటి దినం ఉదయాన్నే బయలుదేరి కొండలు, గుట్టలుదాటి ఆవుల మందలున్న ద్వైతవనంలోనికి ప్రవేశించి నారు. అక్కడ అందమైన అనువైనచోట శిబిరాలను ఏర్పాటుచేసుకొన్నారు.

ఆ ద్వైతవనంలో చాలపెద్దసంఖ్యలో ఆవులున్నాయి. అవి ఆనందంగా భయంలేకుండా తిరుగుతూ ఉన్నాయి. అడవిలో ఏదిక్కు చూచినా ఆవులే కనిపిస్తున్నాయి. ఆ ఆవులు రకరకాలరంగులలో ఉన్నాయి. తెల్లటివికొన్ని. నల్లటివికొన్ని. ఎర్రటివికొన్ని. తెల్లటి ఆవులలోకూడా మల్లెపూల లాంటివి కొన్ని. శంఖాల రంగుగలవి కొన్ని. చంద్రహారాల రంగు వంటివి కొన్ని. మంచుగడ్డ రంగులాంటివి కొన్ని. నీటి నురుగు రంగులాంటివి కొన్ని. చందనపు రంగులాంటివి కొన్ని. ముత్యపు రంగులాంటివి కొన్ని. వజ్రాల రంగులాంటివి కొన్ని. అలాగే నల్లటివాటిలో నీలమణుల రంగులలాంటివి కొన్ని. నల్లటి హంసల రంగువంటివి కొన్ని. వర్షాకాలపు మేఘాల రంగువంటివి కొన్ని. నల్లని తమలపాకుల రంగువంటివి కొన్ని. అదే రీతిగా ఎర్రటివాటిలో ముదిరినమంకెనచెట్ల చిగురుటాకుల రంగువంటివికొన్ని. వికసించిన బంగారు సంపంగిపూలరంగు కలిగినవికొన్ని.

ఇలాంటి రంగురంగుల ఆవులను దుర్యోధనుడు కన్నులపండువుగా చూచినాడు. దుర్యోధనుడు ఆవులు సమృద్ధిగా కన్నులపండువుగా ఉండడానికి సంతోషించినాడు. గోపాలులందరు ఆయనను సవినయంగా దర్శించినారు. వారిని దుర్యోధనుడు ఆదరించినాడు. ఆ గోపాలురాయనకు గోవులను చూపుతూ వేరువేరుగా వాటి వాటి పేర్లూ లక్షణాలు వివరించిచెప్పినారు. దుర్యోధనుడు దూడలు, కోడెలు, ఆబోతులు, పాడిఆవులు, లేగదూడలు (అప్పుడే పుట్టిన దూడలు) మొదలైనవాటినన్నింటిని చూచినాడు. వాటి రక్షణకు తగినఏర్పాట్లుచేసినాడు. గోపాలురుఇచ్చిన పాలను, తాను తనమిత్రులు తృప్తిగాత్రాగినారు. సంతోషపడినారు. ఆ తరువాత గాయకులు, నర్తకులు, వందులు, మాగధులు ఆయనను దర్శించినారు. ఆయన వారందరనూ ఆదరించినాడు. వారు కోరినధనాలనువారికి దానంచేసినాడు.

అటుతరువాత దుర్యోధనుడు వేటకుపక్రమించినాడు. వేటలో లేళ్ళగుంపులు కలతచెందినాయి. మదపుటేనుగులు బంధించబడినాయి. భయంకరమైనసింహాలు చచ్చినాయి. దున్నలు, పులులు, అడవి పందులు నేలకూలినాయి. ఈవిధంగా దుర్యోధనుడు వేటను నిరాఘాటంగాజరిపినాడు.

దుర్యోధనుడింకా ఎప్పుడూ పద్మాల సువాసనతోకూడిన సరోవరాలను చూచినాడు. చాలా అందమైన పూలు, పండ్లు గల చెట్లతోకూడిన వనాలలో తిరిగినాడు. మనోహరమైన నెమళ్ళు, తేనెటీగలు, చిలుకలు, కోకిలల 'కలకల'నాదాలు విన్నాడు. ఈ క్రమంలో పరిజనాలతోకలసి దుర్యోధనుడు ద్వైతవనంలోని సరోవరంవద్దకు చేరినాడు. ఆ సమయంలో ఆ సరోవరం సమీపంలో ధర్మరాజు 'సద్యస్కందమ'నే యజ్ఞం చేస్తూఉండినాడు. అందుకు అతనికి మునిజనులు సహాయంచేస్తూఉండినారు. ఆ యజ్ఞానికి ఉపయోగించే వస్తువులన్నీ అడవిలో దొరికే వేళ్ళు, పండ్లు మాత్రమే.

దుర్యోధనుడు ఈ విధంగా యజ్ఞంచేస్తూఉండే ధర్మరాజును చూచినాడు. తనసేవకులను ఆ కొలనుఒడ్డున 'క్రీడాగృహాలు నిర్మించు'మని ఆజ్ఞాపించినాడు. వారుకూడా ఆ సరోవరంవద్ద క్రీడా గృహాలను నిర్మించడం ప్రారంభించినారు. అదిచూచి, కొందరు గంధర్వులు అతివేగంగా అక్కడకు వచ్చినారు. 'క్రీడాగృహాలు కట్టవద్ద'ని వారినిఆదేశించినారు. ఇంకాఇట్లాఅన్నారు. "ఈ సరోవరం 'చిత్రసేనుడ'నే గంధర్వుని కొరకై నిర్మించబడింది. ఇది ఆయనవిహరించేప్రదేశము. కాబట్టి మీరు ఇక్కడనుండి దూరంగా పొండి." ఈ మాటలు విని ఆ సేవకులు దుర్యోధనుడివద్దకు తిరిగివచ్చినారు. ఆయన యుద్ధ వీరులైన కొందరుసైనికులనుపంపినాడు. వారుపోయి గంధర్వులతో ఇట్లాఅన్నారు.

"ధృతరాష్ట్రపుత్రుడైన దుర్యోధనుడు చాలబలవంతుడు. మహాపరాక్రమవంతుడు. చాలగొప్ప వాడు. వినోదంకోసం కుతూహలంగా ఈ కొలనుకు భార్యలతోకూడా వస్తున్నాడు. మీరిక్కడ ఉండవద్దు. ఇక్కడనుండి దూరంగాపొండి."

ఈ మాటలువినగానే గంధర్వులకు అమితంగా కోపంవచ్చింది. ఒకరిముఖం ఒకరు చూచుకొన్నారు. పెద్దగానవ్వినారు. తరువాత దుర్యోధనుని సైనికులతో ఇట్లాఅన్నారు. "ఎదుటివారి శక్తి ఎంతో? తనశక్తి ఎంతో మీరాజుకు తెలియదు. క్రొవ్వుతో మానం ప్రాణంపోగొట్టుకోదలచు కొన్నాడు. ఈ చెడ్డ పనులన్నీ ఇక్కడ ఎందుకు? 'బుద్ధిగలిగి ఊరక తిరిగి పోవడం మంచిద'ని ఆయనకు చెప్పండి".

సైనికులుకూడా తిరిగిపోయి దుర్యోధనునికి గంధర్వుల మాటలన్నీ చెప్పినారు. దుర్యోధనునిలో కోపంఆవేశించింది. వశంతప్పినాడు. తమ్ములను సామంతులను చూచినాడు. "మీరందరూ మీమీ సైన్యాలతోకలిసి పూనుకోండి. పొగరుపట్టిన గంధర్వులగర్వాన్ని అణచండి. సరోవరాన్ని ఆక్రమించండి. వారికిసహాయంగా దేవతలనుతీసికొని దేవేంద్రుడేవచ్చినా సరే, సులువుగా జయించండి". అని ఆజ్ఞాపించినాడు.

వెంటనే ధృతరాష్ట్రుని కొడుకులందరూ సాటిలేని చతురంగబలాలను కూర్చుకొన్నారు. మిక్కిలి వేగంగా గర్వంగా బయలుదేరినారు. సింహనాదాలుచేసినారు. ఆ శబ్దాలకు దిక్కులన్నీ పిక్కటిల్లినాయి. వారు మిక్కిలికోపంతో సరోవరాన్ని సమీపించినారు. ఈ విధంగా దండెత్తివస్తున్న కౌరవవీరులకు గంధర్వులు కొందరు అడ్డువచ్చినారు. వచ్చిమంచి మాటలతో ఇట్లాఅన్నారు. "ఇక్కడికెందుకు వస్తున్నారు? మీకు మాతో యుద్ధమెందుకు? ఆగండి". సైన్యంవారి మాటలను లెక్కపెట్టనే లేదు. పెద్దగా కేకలు పెట్టినారు. ముందున్న సైనికులు ఆ గంధర్వులపై శస్త్రాస్త్రాలను ప్రయోగించడం మొదలుపెట్టినారు. అప్పుడు ఆ గంధర్వులు దర్యోధనుని సేనకు అడ్డుతొలగిపోయి, తమరాజు చిత్రసేనుడికి విషయమంతా వివరంగా చెప్పినారు.

చిత్రసేనుడికి కోపంతో ముఖమంతా ఎర్ర బడింది. "వేగంగాపొండి. ఆ దుర్జనులైన కౌరవులను చుట్టుముట్టి చంపండి" అంటూ కొన్నివేలమంది బలవంతులైన గంధర్వులను పంపినాడు.ఆ గంధర్వులు రకరకాలైన ఆయుధాలు అందుకొన్నారు. వారు చాలాభయంకరమైన చేతులు కలిగిఉన్నారు. వారందరూ కులపర్వతాలలాగా చాలఎత్తుగాఉన్నారు. వారికి వెలిగిపోయే వర్చస్సుఉంది. వాళ్ళు ఆకాశంలో తిరుగగలిగినశక్తి కలవారు, భయంకరమైనయుద్ధంచేయడంలో నేర్పరులు. వారంతా ఒక్కసారి 'కో' అని అరుస్తూ కౌరవసైన్యాన్ని ఢీకొన్నారు.

ఈ విధంగా గంధర్వులు సమీపించి గట్టిగానొప్పించడం మొదలుపెట్టినారు.. దుశ్శాసనుడు మొదలైన కౌరవులందరూ సైన్యంతోకూడా దుర్యోధనునివద్దకు పారిపోయినారు. అప్పుడు కర్ణుడొక్కడే పారిపోకుండానిలబడి గంధర్వులను ముందుకురాకుండా ఆపినాడు. రకరకాలయిన బాణాలతో గంధర్వుల దేహాలనుఖండిస్తూ ఒక్క నిమిషంలోనే కొన్నివందలమంది గంధర్వులను చంపినాడు. ఎంత మందిచచ్చినా, గంధర్వులింకా లక్షలకొద్దీ మీదపడుతూనేఉన్నారు. భూమిఅంతా గంధర్వులేనా? అన్నట్లు అనిపించింది కర్ణుడికి. అప్పుడు శకుని దుర్యోధనుడికి తోడైనాడు. పారిపోయివచ్చిన తమ్ములందరూ తోడువచ్చినారు. దుర్యోధనుడు యుద్ధోత్సాహంతో కర్ణుడున్నచోటుకు చేరినాడు. పరాక్రమమూ ఆటోపమూ ప్రదర్శించినాడు. ఆ సమయంలో లోకాలన్నీ భయపడేటట్లుగా గంధర్వులకూ, కౌరవులకూ యుద్ధంజరిగింది. కొంతసేపటికి గంధర్వులు చాలామందిచచ్చినారు. వారికి ధైర్యం నశించింది. భయపడి పారిపోయినారు. గంధర్వులు పారిపోవడం చూచి చిత్రసేనుడు కోపగించుకున్నాడు. మదపుటేనుగులాగా కౌరవులపైకి దూకినాడు.

మాయాయుద్ధంలో నేర్పుకలిగిన చిత్రసేనుడు మాయాస్త్రాలను ప్రయోగించినాడు. దాంతో గాలి ఆడడం నిలిచిపోయింది. రథాలు విరిగిపోయినాయి. ఏనుగులు ముక్కలైనాయి. గుర్రాలు తుత్తునియలైనాయి.కౌరవ సైన్యంలోని భటులు నేలకూలినారు. గంధర్వులు విజృంభించి ఒక్కొక్కకౌరవ భటుడిని పదిమంది చుట్టిముట్టినారు. అడ్డంలేకుండా చంపడంప్రారంభించినారు. ఆ గంధర్వుల పరాక్రమాన్ని

సహించలేక కౌరవులసైన్యం బెదరింది. ధర్మరాజుఉన్నచోటుకు పారిపోవడం ప్రారంభించింది. అప్పుడు కర్ణుడుమాత్రం కులపర్వతంలాగా కదలకుండానిలబడినాడు. గంధర్వులు కురిపించే బాణవర్షంలో మునిగిపోతూకూడా తనశక్తిమేరకు పోరాడుతూనేఉన్నాడు. తమ్ములూ శకునీ తోడుండగా దుర్యోధనుడు కూడా కర్ణుని వదలకుండా సహాయంచేస్తూనే ఉండినాడు. కానీ మహాబలవంతులైన చాలామంది గంధర్వులు కర్ణుణ్ణి చుట్టుముట్టినారు. కొందరు సూతుణ్ణి చంపినారు. కొందరు గుర్రాలను నరకినారు. కొందరు వింటినారిని త్రెంచినారు. మరికొందరు రథచక్రాలను విరచినారు. కొందరు గొడుగును కూలద్రోసినారు. కొందరు నొగలను నాశనంచేసినారు. ఇంకొందరు జెండాను పడగొట్టినారు. కొందరు రథపు ఇరుసును ముక్కలుచేసినారు. ఈ విధంగా గంధర్వులు కర్ణునికి రథంలేకుండాచేసినారు.

రథంపోగొట్టుకొన్నకర్ణుడు వికర్ణునిరథమెక్కి యుద్ధభూమినుండి దూరంగా తొలగిపోయినాడు. కర్ణు డట్లాపారిపోయినా, దుర్యోధనుడు మాత్రం వెనుదిరుగలేదు. శత్రుబలాన్ని ఎదిరించి యుద్ధంచేస్తూనే ఉండినాడు. ఇదిచూచి చిత్రసేనుడికి కోపంవచ్చింది. చిత్రసేనుడు స్వయంగా దుర్యోధనునితో తలపడినాడు. దుర్యోధనుడిరథాన్ని కర్ణుడిరథంలాగానే ధ్వంసంచేయించినాడు. రథంలేనిదుర్యోధనుణ్ణి జుట్టు పట్టుకొనిలాగి, నేలమీద పడద్రోసినాడు. చేతులను వెనుకకువిరిచికట్టి వేసినాడు. సింహనాదం చేసినాడు. మిగిలిన గంధర్వులుకూడా వెనువెంటనే విజృంభించినారు. దుర్యోధనుని అంత:పురస్త్రీలను బంధించినారు. దుర్యోధనునిసోదరులైన దుశ్శాసన, దుర్విషహ, దుర్ముఖ, వివింశతి, చిత్రసేన, వింద, అనువిందులనూ వారిపుత్రులనూ వారిమంత్రులనూకూడా బంధించినారు. వారందరనూ చిత్రసేనున కప్పగించినారు. అప్పుడు మిగిలిన కౌరవులు, పౌరులు, మంత్రులు, బెదరి ఏడుస్తూ పరుగెత్తిపోయి ధర్మరాజును శరణుచొచ్చి ఇట్లాఅన్నారు.

"ధర్మరాజా! గంధర్వయోధులు శౌర్యంచూపించి దుర్యోధనుణ్ణి, అతని భార్యలనూ, తమ్ములనూ, బంధించి అదిగో తీసుకొని పోతున్నారు. పరిపూర్ణమైనదయతో శత్రువులను జయించవా? నీ తమ్ములను కాపాడవా?" ఇట్లా అని చేతులు జోడించినారు. ఇట్లాప్రార్థించే కౌరవులనుచూచి భీమసేనుడు నవ్వు ముఖంతో ఇట్లాఅన్నాడు. "మనపని సుఖమయింది. మనం చేయవలసిన పనిని గంధర్వులు చేసినారు. కాగల కార్యం గంధర్వులే తీర్చినారు. ఎంతమంచిపని జరిగింది.? ఏ బరువులేకుండా ఊరకుండినాకూడా మనకు జయం కలిగింది. దుర్యోధనుడు పుట్టినప్పటి నుండికూడా అబద్ధాలే చెప్పేవాడు. పాపాలు చేయడంలో దిట్ట. లోకులందరిచేత తిట్లుతినేదుర్మార్గుడు. అట్లాంటి వాడికి ఇట్లాంటి కష్టాన్ని తెచ్చిపెట్టి బ్రహ్మదేవు డీనాడు 'తెలివిగలవాడ'నిపించుకున్నాడు. మనం స్థితిగతులు తారుమారై మహాభయంకరమైన అడవుల్లో ఉన్నాము. నిత్యం దు:ఖంలోపడి బాధపడుతున్నాము. అట్లా అనుకొని క్రొవ్వెక్కి మనలను అవమానించడానికి పూనుకున్నాడీ దుర్యోధనుడు. వీడు కడుదుర్మార్గుడు. తమ్ములు, మంత్రులు, భార్యలు అందరితో కలిసి ఆ దోషాల ఫలితాలను అనుభవించినాడు. నీవువాడిమీద దయతలచవద్దు."

ఈ మాటలన్న తమ్ముడితో ధర్మరాజు ఇట్లాఅన్నాడు. "అయ్యో! ఇది కఠినంగామాట్లాడేసమయమా? శరణు చొచ్చినారు. అభిమానాన్ని కోల్పోయినారు. కలతచెందిఉన్నారు. అట్లాంటి కౌరవులపై దయచూపడం నీకుతగదా? ఒకే వంశంలో పుట్టినవారికి ఆస్తి పంపకంలో తగాదాలు ఒక్కొక్కసారి కలుగుతూ ఉంటాయి. అంతమాత్రంచేతనే సహజంగాఉండే ప్రేమలు చెడిపోతాయా? చెడిపోవచ్చునా? దాయాదులు తమలో తాము ఎట్లా పోట్లాడుకున్నా సరిపోతుంది. కానీ ఇతరులవల్ల అవమానం కలిగినప్పుడు వారు ఒకరికొకరు తోడుపడకపోవడం నిందించదగినపని. దుర్యోధనుడు చెడ్డవాడేఅయినా భార్యలతోకూడా బంధించబడినాడు. దీనినిచూస్తూఊరకుంటే కులానికే అవమానంఅవుతుంది. అదీకాక, కేవలం క్షత్రియుడయినంత మాత్రాననే వారికిశరణాగతరక్షణం కర్తవ్యమవుతుంది. ఇంక నీ వంటి బాహుబలపరాక్రమాలు కలిగినవాడికి ఇటువంటిమంచిపని చేసియేతీరవలెనని చెప్పడమెందుకు ? నీవు, నీ తమ్ములు ప్రీతిగా రథాలెక్కి, ఆయుధాలు ధరించి, పోయి దుర్యోధనుణ్ణి చెరవిడిపించండి." ఈ మాటలు విని భీముడు ధర్మరాజుతో ఇట్లాఅన్నాడు.

అన్నా! ఆ దుర్యోధనుడు ఏ మాత్రం సందేహం లేకుండా కోపంతో నన్ను నీటిలోనికి త్రోయించి నాడు. విషంపెట్టించినాడు. మనందరనూ లక్కఇంటిలోఉంచి కాల్పించినాడు. జూదాన్ని ఏర్పాటుచేసి మోసగాడై రాజ్యాన్ని దొంగిలించినాడు. జనులందరూ చూస్తూఉండగా ద్రౌపదిని తలపట్టిఈడిపించి నాడు. 'చీరలు ఒలువ'మని ఆజ్ఞాపించినాడు. అయ్యో! పుట్టినప్పటినుండి మనకు దుర్యోధనుడు కీడు చెయ్యని దినముందా? వాడుచేసిన ఆ చేష్టలేవీ నీకు గుర్తుండవు, కేవలం దయమాత్రమే ఎప్పుడూ కలిగి ఉంటావు. ఇట్లైతే మనకూ మన పనులకూ కీడుకలుగదా? ఇట్లా పూర్వవైరాన్ని తలచుకొని కోపగించు కొని మాట్లాడిన భీముడిని బుజ్జగించి ధర్మరాజు ఇట్లాఅన్నాడు.

"రక్షించండయ్యా!' అని అంటే బలంలేనివాడైనా పూనుకొని చేతనైనంతచేస్తాడు. అట్లాంటప్పుడు ఉత్తమశూరుడు దీనజనులున్నవిధాన్ని చూచి ఊరుకుంటాడా? 'శరణ'ని వస్తే భయంకరమైన విరోధి నైనా ప్రేమతో రక్షించవలె. ఇది దయాపరుల పద్ధతి. దీనికి సమానమైన ధర్మాలింకేవీ లేవు. దుర్యోధనునికి నీ బలశౌర్యాలనుగురించి తెలుసు. అందువల్ల మనము అతన్ని తప్పక విడిపిస్తామని మనపై పెద్దగా ఆశపెట్టుకొని ఉంటాడు. ఇది మనం పుణ్యాన్నీ, కీర్తినీ అందుకొనే సమయం. నిన్నింత నిర్బంధించ కుండా నేనేపోయి ఉండేవాడిని. నేనిప్పుడు యజ్ఞదీక్షలో ఉండడంవల్ల పోవడానికి వీలుకలుగడం లేదు. కాబట్టి మీరిప్పుడు వేగంగాపోయి గంధర్వులతో ప్రేమగా మంచిమాటలుమాట్లాడి, వారిని ఓదార్చిదుర్యోధనుణ్ణి విడపించండి. మంచిమాటలు వినకపోతే పరాక్రమంచూపిఅయినా శత్రువులను జయించిపని పూర్తిచేయండి. నేనుచేసే ఈ యజ్ఞానికి విఘ్నంకలుగకుండా చూడండి".

ఈ మాటలు విన్న భీముడు ఎట్టకేలకు అంగీకరించినాడు. అర్జునుడుకూడా ధర్మరాజు ఆజ్ఞను అందుకొని 'దుర్యోధనుడి చెరవిడిపిస్తాన'ని ప్రతిజ్ఞచేసినాడు. నకుల సహదేవులుకూడా యుద్ధంపై ఉత్సాహం చూపినారు.

ఆ నలుగురూ కవచాలు తొడిగినారు. అమ్ములపొదులు ధరించినారు. విల్లులందుకొన్నారు. రథాలనెక్కినారు. అన్నవద్ద వీడ్కోలు పొందినారు. వేగంగా బయలుదేరినారు. చావకమిగిలినకౌరవ సైన్యమంతా వారివెంట సింహనాదాలుచేస్తూ పోయింది. ఇట్లాపోయి గంధమాదన పర్వతానికి దుర్యోధనాదులను తీసుకొని ఎగిరిపోబోతున్న గంధర్వులను ముట్టడించినారు.

వారినిచూచి గంధర్వులు వెనుతిరిగినారు. తమశక్తిసామర్థ్యాలు అందరికీ తెలిసేటట్లుగా పాండవుల నెదుర్కొన్నారు. పాండవులేమో చాలాగొప్పవారు. అగ్నితో సమానమైనవారు. 'తేజస్సు'అనే సంపద కలిగినవారు. ఇంద్రునితో సమానమైనవారు. పుణ్యాత్ములు. అట్లావెనుదిగిరిన గంధర్వులనుచూచి అర్జునుడు, అన్న ధర్మరాజు మాటలను గుర్తుచేసుకొని, వారితో తీక్షతలేకుండా మిక్కిలి ప్రీతికరమైన మాటలతో ఇట్లాఅన్నాడు. "మీకు మాతో విరోధమెందుకు? స్నేహంతో దుర్యోధనుణ్ణి విడువండి. ఇది ధర్మరాజు ఆజ్ఞ. ఈ సమయంలో మీరు దాన్నిదాటడానికి వీలులేదు".

ఆ మాటలకు గంధర్వులు, "ధర్మరాజు మాకేమైనా రాజా? ఆ ధర్మరాజు ఆజ్ఞను మేమెందుకు పాటిస్తాము? మా రాజుకాక మమ్మల్ని ఆజ్ఞాపించగలిగిన ఏలిక దేవేంద్రుడొక్కడు మాత్రమే. ఇతరులు ఎవరైనా ఎక్కడైనా మాకేంభయం?" అన్నారు.

అందుకు అర్జునుడు ఆ గంధర్వులనుచూచి, "మునుముందే సాహసానికి పూనుకోవడం ఎందుకు? అని ప్రేమగా, ధర్మంగా మాట్లాడినాను. మీరు మంచిమాటలు వినేవారిలా కనిపించడం లేదు. కాబట్టి భయంకరమైన యుద్ధంలోనే దుర్యోధనుణ్ణి విడిపిస్తాను" అన్నాడు. వెంటనే వారిమీద వాడియైన బాణాలు గుంపులు,గుంపులుగా ప్రయోగించినాడు. ఆ గంధర్వులుకూడా అర్జుననిమీద బలమైన బాణాలవర్షం కురిపించినారు. ఈ విధంగా ఆ నలుగురికిన్నీ (భీమార్జున నకుల సహదేవులు) అనేకలక్షలమంది గంధర్వులకున్నూ చాలాభయంకరమైనయుద్ధం జరిగింది.

ఆ యుద్ధంలో గంధర్వులు అర్జుననితేరును 'ఎగురగొట్టాల'నుకొన్నారు. వారందరూ ఎక్కువ సంఖ్యలో అర్జుననిరథాన్ని చుట్టుముట్టినారు. అప్పుడు అర్జునుడు క్రూరుడై దివ్యమైనఅస్త్రాలను ప్రయోగించి పదిలక్షలమందిగంధర్వులను చంపివేసినాడు. చచ్చినగంధర్వులు సామాన్యులుకారు. ప్రళయాగ్నిలాంటివారు. దివ్యులు. యుద్ధశూరులు.

భీముడు, నకులుడు, సహదేవుడుకూడాఉత్సాహంతో విజృంభించినారు. తీవ్రబాణాలు ప్రయోగించినారు. విరోధిసమూహాలను నరకినారు. ఆ చచ్చిన వీరులశరీరలనుండి కారినరక్తం ఏరులై పారింది.

ఈ విధంగా కుంతీ పుత్రులచేత గంధర్వులు మిక్కిలి బాధింపబడినారు. అయినా దుర్యోధనాదులను ఏమరకుండా బంధనాలలోనే ఉంచినారు. వారిని తీసికొని ఆకాశానికిఎగసి తప్పించుకొనిపోవడానికి ప్రయత్నించినారు.

అది తెలుసుకొన్న అర్జునుడు వేగంగాబాణాలుప్రయోగించినాడు. ఆకాశమూ మిగిలినఅన్ని దిక్కులనూ బాణాలతో దట్టంగానింపి సందులేకుండాకప్పినాడు. అప్పుడు గంధర్వులు వలలోచిక్కిన పక్షులలాగా బాణాల పంజరములో చిక్కిపోయి, ఎగిరిపోలేకపోయినారు. అయినా వారుబలంచెడకుండా ఆ నలుగురిమీద రకరకాలయిన ఆయుధాలను ప్రయోగించినారు. అర్జునుడు ఆ ఆయుధాల నన్నింటినీ తునకలుచేసి గొప్పగా కోపగించుకున్నాడు. భయంకరాకారము తాల్చినాడు. వాడియైన భల్లాల గుంపులను ప్రయోగించినాడు. తలలు దొర్లిపడినాయి. శరీరాలు నేలకూలినాయి. రక్తవర్షంతో కాలువలు పారినాయి. ఆకాశంలో గంధర్వుల సందడి అణగిపోయింది. జగత్తంతా వ్యాకులతచెందింది. అప్పుడు అర్జునుడు ఆగ్నేయాస్త్రం ప్రయోగించినాడు. ఆ అస్త్రం ఎండినఅడవిని కాల్చే దావాగ్నిలాగా గంధర్వుల గుంపును కాల్చి బూడిదచేయడం ప్రారంభించింది. అప్పుడు చిత్రసేనుడు మాయమైపోయినాడు. అట్లా మాయమైన చిత్రసేనుడు ఆ నలుగురినీ బాగా ప్రకాశించే బాణాలవర్షంతో ముంచినాడు. మేఘంలాగా గర్జించినాడు. మిడిసిపడుతూ తన పట్టుదలనూ, పరాక్రమాన్నీ ప్రదర్శించినాడు.

దాన్ని ఏ మాత్రం లెక్కపెట్టకుండా అర్జునుడు శబ్దభేదిబాణాలను ప్రయోగించి చిత్రసేనుని శరీరాన్నంతా ఒక్క క్షణంలో చీల్చి చిత్రసేనుని పూనికను నాశనము చేసినాడు. అట్లా గంధర్వనాయకుడు చిత్రసేనుడు దెబ్బలుతిని యుద్ధసన్నాహాన్ని వదలివేసినాడు. అర్జునుడి దగ్గరకు వచ్చినాడు. ఇంతవరకూ కనిపించకుండాతిరిగినవాడు, ఇప్పుడు అందరికీకనిపించి ఎదురుగా నిలబడినాడు. అర్జునుడతణ్ణి తనస్నేహితుడైన చిత్రసేనుడిగా గుర్తించినాడు. యుద్ధాన్ని విరమించినాడు. భీముడూ, నకులుడు, సహదేవుడుకూడా యుద్ధాన్ని విరమించినారు. వారందరూ తమతమ రథాల మీదనేఉండి, ఒకరి నొకరు యోగక్షేమాలను విచారించుకొన్నారు. అప్పుడు అర్జునుడు చిత్రసేనుడితో ఇట్లాఅన్నాడు.

"వీరోత్తమా! నీ కిట్లావైరము తగునేమయ్యా? కౌరవులను దుర్యోధనుణ్ణి ఆయనభార్యలను తమ్ములను అందరినీ ప్రీతితో వదలు." అన్నాడు. అప్పుడు చిత్రసేనుడు అర్జునుడితో ఇట్లాఅన్నాడు. "ఈ అడవిలో ఎడతెగనిఆయాసంతో మీరుబాధపడుతూఉన్నారు. మీరు పరమధర్మాత్ములు. భార్యతోకూడా కలసిఉన్నారు. అట్టి మిమ్ములను ఎగతాలి చేయాలనుకొని ఈ దురాత్ముడు ఇక్కడకు వచ్చినాడు. ఇదంతా తెలిసి దేవేంద్రుడు కోపగించుకొనినన్ను పంపించినాడు. పాపి అయినదుర్యోధనుణ్ణి అతని 'భార్యలతోసహాపట్టితెమ్మ'న్నాడు. అందుకే నేను వచ్చినాను. ఇదిగో ఇప్పుడే వీరిని నేను ఇంద్రునివద్దకు తీసికొనిపోతూ ఉన్నాను. నీ వింకేమీ అనవద్దు. పుణ్యాత్మా! నీవు నాస్నేహితుడవు కాబట్టి నీ మీద నాకు అసూయకానీ, రోషం కానీలేవు."

ఈ మాటలువిన్న అర్జునుడు చిత్రసేనునితో ఇట్లాఅన్నాడు. "ఈ దుర్యోధనుడు మాకు సోదరుడు.కాబట్టి ఇతణ్ణి విడవడంమంచిది. ఇదిచేయడమే ధర్మరాజుకు ఆనందంకలిగిస్తుంది. ఇంద్రునిఆజ్ఞ అయినాసరే, ఇంకేదైనాసరే, ఇప్పుడు ధర్మాత్ముడైన ధర్మరాజుకు చెప్పవలె. ఆయన ఏవిధంగా చెప్పితే ఆ విధంగా చేయవలె. నా ప్రీతి కొరకు ధర్మరాజు దగ్గరకురా." అందుకు చిత్రసేనుడు అంగీకరించినాడు.

చిత్రసేనుడు భీమార్జుననకులసహదేవులతోపాటు ధర్మరాజువద్దకు పోయినాడు. ధర్మరాజు చిత్రసేనుణ్ణి చాలాఇష్టంగాపూజించినాడు. "మహాత్మా! ఈ దుర్యోధనుడు తమ్ములతో మంత్రులతో సహాసంహరించబడకుండాఉండటం మేలైంది. నీవల్ల మా వంశానికి కీడుకలుగలేదు. వీడుఎట్లాంటి తప్పుచేసిఉన్నా దాన్నంతా సహించి మమ్ములనుచూచి వీడినివదలివేయి" అని ప్రార్థించినాడు.

చిత్రసేనుడు, "సరే"నని దుర్యోధనుడు మొదలైన వారినందరనూ వదలి పాండవులకు వీడ్కోలు పలికి స్వర్గానికి పోయినాడు. విషయమంతా ఇంద్రుడికి నివేదించినాడు. ఇంద్రుడు యుద్ధంలో మరణించిన గంధర్వులందరనూ అమృతవర్షంతో బ్రతికించినాడు.

అంతట ధర్మరాజు దుర్యోధనుణ్ణి బంధనాలనుండి విడిపించినాడు. అతని భార్యలను, సోదరులను ఇతర ఆప్తులనుకూడా విడిపించినాడు. అట్లా విడిపించి దుర్యోధనునితో, "తమ్ముడూ! ఇట్లాంటి సాహసాలు ఇంకెప్పుడూ చేయవద్దు. దుర్జనుడు ఒళ్ళుతెలియక సాహసాలకు పూనుకొని నశించిపోతాడు. కాబట్టి వెంటనే తమ్ములనూ, సామంతులనూ తీసుకొని ఆనందంగా ఇంటికి పో. ఇప్పుడు జరిగినదానికి మనసులో కొంచెంకూడా చింతించవద్దు". అని బుద్ధిచెప్పిపంపినాడు.

**నీతి :** 1. అసూయా ద్వేషాలు మంచివి కావు.

2. ఒకరిని అవమానించాలనుకుంటే తానే అవమానాల పాలవుతాడు.
3. ఒకరితో పోట్లాటకుముందే ఎదుటివాడి శక్తిని సరిగా తెలుసుకొని జయించగలననుకుంటేనే పోట్లాడాలి.
4. కీడుచేసినవారికికూడా మేలుచేయడం మంచివారిలక్షణం.

చ. **అమరవరేణ్యు పన్పయిన, నావల యెయ్యది యైన, నిష్టధ**
**ర్మమహితుఁడైన ధర్మజుసమక్షమునం దెఱిఁగించి, యాతఁడే**
**క్రమమున నెద్ది సెప్పె, నది గైకొని చేయుము; నీవు మత్ప్రియా**
**ర్థము చనుదెమ్ము; నావుడును దాని కొడంబడిచిత్రసేనుఁడున్.** **5 -432**

# 42. దుర్యోధనుని ప్రాయోపవేశం.

**(అరణ్య6-5 నుండి 55 వరకు.)**

**(ఘోషయాత్రలో గంధర్వులచేత బంధింపబడగా పాండవులు తనను విడిపించడం తనకుదుఃఖాన్నికలిగించగా దుర్యోధనుడు ప్రాయోపవేశానికి పూనుకొనుట.)**

ఘోషయాత్రకుపోయిన కౌరవులను గంధర్వులుబంధించి ఇంద్రునివద్దకుతీసికొనిపోవడం ప్రారంభించినారు. అప్పుడు కౌరవసేన చెదరి, పారిపోయి, అక్కడకు దగ్గరలోఉన్న పాండవులను శరణు కోరింది. పాండవులుపోయి 'చిత్రసేనుడ'నేవారి నాయకునితోపాటుగా గంధర్వులనందరనూ జయించినారు. బందీలుగాఉన్న కౌరవులను, వారిభార్యలను, చిత్రసేనుడితోపాటు ధర్మరాజు వద్దకుచేర్చినారు. ధర్మరాజు చిత్రసేనుడినికోరి దుర్యోధనుణ్ణీ ఆయన తమ్ములనూ వారిభార్యలనూ చెరవిడిపించినాడు.

తాను బందీకావడమే కాకుండా, పాండవులు తనను చెరవిడిపిండంతో దుర్యోధనుడు మిక్కిలి సిగ్గుపడినాడు. అవమానంతో మిక్కిలిదుఃఖించినాడు. చావగామిగిలి చెదరినసేనలను కూర్చుకొన్నాడు. హస్తినాపురంవైపుగా కొంతదూరం ప్రయాణంచేసినాడు. అక్కడ ఒకచదరమైనచోట గుడారాలను ఎత్తించినాడు. తనగుడారంలోని లోపలిగదిలో ఒక్కడే ఒంటరిగా మంచంపై పడుకున్నాడు. అప్పుడక్కడకు కర్ణుడు చేరినాడు. తగినవిధంగా దుర్యోధనుణ్ణి దర్శించినాడు. తరువాత దుర్యోధనునితో ఇట్లాఅన్నాడు.

"దుర్యోధనా! మహారాజా! చూస్తే నీవు చేసినపని మానవులకు అసాధ్యమైనది. అటువంటియుద్ధం ఎక్కడా కానరాదు. ఆ గంధర్వులు మిక్కుటమైన శౌర్యంకలవారు. కోపంతోకూడినవారు. కోరినరూపం ధరించగలిగినవారు. ఆకాశంలో తిరుగగలిగిన జాతులలో సింహాలవంటివారు. అట్టివారిని ఎదుర్కొనడం ఎవరికైనా సాధ్యమా? అట్లాంటివారిని నీవూ, నీ తమ్ములూ పరాక్రమంతో వైభవంగాప్రకాశించి, చంపి, జయించినావు. అప్పుడు నీవు చూస్తూఉండగా అంతులేని గంధర్వసేనలు పెక్కుబాణాల సమూహాలతో నన్ను వేగంగా ముంచినాయి. నేనుకూడా శత్రువులు గుంపులుగుంపులుగా కూలి పోయేట్లు బాణాలువేసి చంపినాను. అయితే మనసైన్యం నాకుతోడ్పడలేకపోయింది. నేను యుద్ధభూమిలో ఒంటరినైపోయి దెబ్బతిన్నాను. అంతలో నారథం యుద్ధానికి దూరంగా పరుగెత్తింది. దేవా! నీవు ఎక్కువైన బలవిక్రమాలతో శత్రువులనుజయించి గాయాలుకూడా లేకుండాఉండడం చూచి, ధన్యుడనయినాను. ఇంతటిపరాక్రమం చూపినవారు ఈ లోకంలో ఎవరున్నారు? ఇది చాలాఅద్భుతమైన విషయం."

ఈ మాటలువిన్న దుర్యోధనుడు మనసులో, "ఈ కర్ణుడు నావిషయం తెలియక ఇట్లామాట్లాడు తున్నాడు" అనుకుంటూ సిగ్గుపడుతూ కర్ణుడితో ఇట్లాఅన్నాడు. " పుణ్యాత్ముడా! తమ్ములూ నేనూ గంధర్వులతో తలపడినాము. రెండుసేనలలోనూ చాలామంది చచ్చినారు. అయినా పట్టుదలతో పోరాడినారు. ఆ సమయంలో శౌర్యం బయటపడేట్లు గంధర్వపతికీ నాకూ ద్వంద్వయుద్ధంజరిగింది. అతడు వేసిన

చాలాబాణాలతో నొప్పించబడినాను. ఇన్ని మాటలు ఎందుకు? నన్నూ నా తమ్ముళ్లను మాభార్యలనూ ఆ గంధర్వుడు బంధించినాడు. మమ్మల్ని తీసుకొని గంధర్వులు ఆకాశానికిఎగిరినారు. అప్పుడు మన వాళ్లందరూ భయపడినారు. నలువైపులకు చెదరిపోయినారు. పరుగెత్తుకొని పోయి దీనత్వంతో పాండవులను శరణు కోరినారు. జనులచే పూజింపబడే గొప్పపుణ్యాత్ముడైన ధర్మరాజు మనసేనల ఆవేదనను గమనించినాడు. గొప్ప బలవంతులైన తనతమ్ములను నన్నువిడిపించడానికి నియోగించినాడు. ఆ వీరులు బలంతో పరాక్రమంతో గంధర్వులను ఎదుర్కొన్నారు. మొదటఇష్టంగా మంచిమాటలతో ప్రార్థించినారు. ఎన్ని రకాలుగా ప్రార్థించినా పనినెరవేరలేదు. అంతటితో భయంకరమైనశక్తికలిగిన భీముడు అర్జునుడు. నకులుడు, సహదేవుడు, యముడివంటిరూపాలతో సాహసించినారు. యుద్ధంచేసి భయంకరంగా పెక్కుఅమ్ములసమూహాలను కురిపించినారు. వాళ్లఅమ్ములతాకిడితో గంధర్వులు దెబ్బతిన్నారు. గంధర్వులు వీరిని ఎదుర్కొనలేకపోయినారు. 'ఇదిపనికాద'నుకొన్నారు. మమ్మల్ని తీసుకొని ఆకాశంలోనికి పారిపోబోయినారు. అప్పుడు అర్జునుడు వారుపారిపోవడానికివీలులేకుండా ఆకాశమార్గాన్ని అమ్ముల సముదాయంతో మిక్కిలిదట్టంగా అడ్డగించినాడు. అప్పుడు చిత్రసేనుడు పారిపోవడంకూడా సాధ్యంకాక తనప్రియస్నేహితుడుఅయిన అర్జునుణ్ణి సమీపించినాడు. యోగక్షేమాలు విచారించినాడు. అందుకు అర్జునుడు సంతోషించినాడు. చిత్రసేనుణ్ణి ఓదార్చినాడు. 'ఈ దుర్యోధనుడు మా తోబుట్టువు కాబట్టి ఇతన్ని విడువవలె.' అన్నాడు. అప్పుడు గంధర్వ నాయకుడు మనచెడు ఆలోచననంతా గొప్పవాడైన అర్జునునికి వివరించిచెప్పినాడు. ఇంకాఇట్లాఅన్నాడు. 'గొప్ప బలంకలవాడా! ఇది ఇంద్రునిఆజ్ఞ కావడంవల్ల ఇతనిని వదలడంకుదరదు.' అని పరాక్రమంతోఅన్నాడు. అప్పుడు మిక్కిలిదీనత్వము, సిగ్గు, విజృంభించి నన్ను కప్పివేసినాయి. కర్ణా! నాకు మనస్సులో 'నేను దాచిపెట్టుకోవడానికి భూమిలో సొరంగమేదీలేదే?' అనిపించింది. ఆ తరువాత పాండవులు గంధర్వులనూ మమ్ములనూ తోడుకొని ధర్మరాజువద్దకు పోయినారు. మన చెడుపన్నాగంచేత చెరపట్టబడిన నన్ను ఆ అజాత శత్రువు (శత్రువులు పుట్టనివాడు అనగా ఎవరినీ తనకుశత్రువుగా భావించనివాడు. ధర్మరాజు) ముందర నిలిపినారు. ఆ ధర్మరాజు వెంటనే నన్ను విడిపించినాడు. ఇది నాకథ.

నేను శత్రువుల ఎదురుగానే ఈ విధంగా అవమానింపబడినాను. ఇంక ప్రజలంతానవ్వుతూ ఉంటే ఎట్లా బ్రతుకుతూ ఈ భూమిని పాలించగలను? ఎట్లా తిరుగగలను? అయ్యో! ఆ గొప్ప యుద్ధంలో గంధర్వులతో గొప్పబలంతో యుద్ధంచేసి నేను చావకుండాపోయినాను. అట్లా చచ్చిఉంటే ఈ అవమానంలేకుండా ఆనందంతో స్వర్గలోకాన్ని పొందిఉండేవాడిని. గొప్పకీర్తికూడా భూమిమీద శాశ్వతంగా

వెలిగిపోయేది. ఆ విధంగా జరుగలేదు. కాబట్టి ఇట్లాంటి దురవస్థను పొందినాను. నేను ప్రాయోపవేశం (అమరణ నిరాహార దీక్ష, అనగా చచ్చేదాక ఆహారంతీసుకోకపోవడం. )తో ప్రాణాలు వదలుతాను. మీరందరూ దుశ్శాసనుణ్ణి ముందుంచుకొని నగరానికిపొండి. మిత్రులకు సంతోషాన్ని శత్రువులకు దీనత్వాన్నీ కలిగిస్తూ బ్రతికిన నేను, ఈనాడు గౌరవం పోగొట్టుకున్నాను. శత్రువులచేత తలతన్నించుకొని సిగ్గుపడకుండా బంధువులలోనికి 'ఏమ'నిపోగలను ? మా తండ్రి ధృతరాష్ట్రుణ్ణిచూచి ఏమిమాట్లాడగలను? కురువంశంలో పెద్దలైన భీష్ముడూ, బాహ్లికుడూ, కులగురువులైన కృపుడూ ద్రోణులకు ఎదురుపడి ఎట్లానిలబడగలను? సేవకులు పౌరులు పురోహితులు నన్నుచూస్తే వారితో ఏవిధంగా మాట్లాడగలను? ఇది నేను చేసిన తప్పువల్ల కలిగినకీడు. నేను అనుభవింపక తప్పనిది. విను. చెడు అహంకారంకలిగిన మనిషి ప్రకాశించేసంపదా, మంచివిద్యా ఉన్నప్పటికీ వాటిని సవ్యంగాఉపయోగించుకోలేడు. మూర్ఖుడు పోయే దారిలోపోయి చివరకుచెడిపోతాడు. అయ్యయ్యో ! నేను ఇంతటిదీనస్థితికివచ్చినాను. నా అంతటివానిని శత్రువులు యుద్ధంలో పట్టుకున్నారు. నా మీద దయచూపి ఒకడు విడిపించినాడు. దైవం ఎట్లైనాచేయగలదు. మానం చెదరిపోయి ఈ విధంగా ఒప్పుకొని ఒంట్లో ప్రాణాలను ఏవిధంగా ఉంచుకోగలను? కాబట్టి ప్రాయోపవేశానికి నిశ్చయంగా పూనుకొన్నాను. ఈ నాతెగువను ఇతరులెవ్వరూ మాన్పలేరు."

దుర్యోధనుడు కర్ణుడితో ఇదంతా ఇట్లాచెప్పి, దగ్గరకు వచ్చిన దుశ్శాసనుణ్ణిచూచినాడు. అతనితో ఇట్లాఅన్నాడు. "అన్నా ! దుశ్శాసనా ! నిన్ను రాజ్యానికి పట్టంకట్టుతాను. నీవు రాజువు కా. శకుని, కర్ణులు నీకు సహాయపడతారు. ఈ భూమండలాన్నంతా గొప్పకాంతితో ఏలు. నీ తమ్ముళ్లందరికీ సంతోషంకలిగించు. బంధువులనందరినీ పోషించు. మంచిబ్రాహ్మణులకు బాగాతగినఅగ్రహారాలు దానంచేయి. ఎప్పుడూ పెద్దలను భక్తితోపూజించు. ఇంద్రుడు దేవతలనేలినట్లు రాజులను చక్రవర్తివై పాలించు. భుజపరాక్రమం ప్రకాశించగా శత్రువులను నాశనంచేయి. మిక్కిలి హితులైన శూరులను తగినట్లు గౌరవించు."

ఆ మాటలు దుశ్శాసనుని హృదయానికి వాడియైనశూలాలలాగా గుచ్చుకొన్నాయి. అతడు నిలువలేక పోయినాడు. అన్న పాదాలపై పడినాడు. " దేవా! ఈ విధంగా ఆజ్ఞాపించడంతగదు. నాపైన దయచూపు." అని తన కన్నీటితో అన్న రెండుపాదాలనూ అభిషేకిస్తూ ఇట్లాఅన్నాడు. "దుర్యోధన సార్వభౌమా! భూమిబద్దలైనా, హిమాలయాలు వణకినా, మహాసముద్రం ఇంకిపోయినా, సూర్యచంద్రులు వెలుగు కోల్పోయినా, నీకు ఇట్లాంటి నికృష్టమైన ఆలోచనరావచ్చునా ? నీవు అనుభవించదగిన రాజ్యభారాన్ని మోయడం నాకుశక్యమా? మిత్రులను కాపాడుతూ ఎల్లప్పుడూ శత్రువులనందరినీ కాలరాస్తూ ఈ భూమండలమంతా జయశీలుడవై నూరుసంవత్సరాలు నీవే పరిపాలించు". అంటూ ఆ యువరాజైన దుశ్శాసనుడు దుఃఖంచేత వశంతప్పి గొంతెత్తి ఏడ్చినాడు. ఆ అన్న దుర్యోధనుడు కూడా కన్నీరుకారుస్తూ ఊరకున్నాడు.

అప్పుడు కర్ణుడు వారినిచూచి, "ఇట్లా ఎందుకు బాలురవలె ఏడుస్తారు? ధైర్యం వహించండి. దుఃఖాన్నీ బాధనూ వదలండి. ఏడ్చేవాళ్లనుచూస్తే శత్రువులు సంతోషిస్తారు. అంతేకాక దుఃఖించేవారికి ఇంకాఇంకా దుఃఖాలు కలుగుతూ ఉంటాయి." అని చెప్పి దుర్యోధనుణ్ణి సంబోధించి ఇట్లాఅన్నాడు. "చంద్రవంశంలోని శ్రేష్ఠుడవైన దుర్యోధనా! అయ్యో! నీచమానవుడిలాగా నీవు గొప్పసుఖాలు అనుభవించదగిన నీశరీరాన్ని ఈ విధంగా విడిచిపెట్టే ఆలోచనచేయవచ్చునా? రాజా! దుఃఖంలో మునిగిపోయిఉన్న నిన్నుచూచి, భయపడి నీ తమ్ముళ్ళు నేనూ 'గొప్పదుఃఖమనే అగ్నిలోపడిపోమా? రాజా! మా మీదదయకలిగి ఇంతమందికీ సంతోషం కలిగించవా? 'పాండవులవల్ల విడిపించబడినాన'ని దుఃఖిస్తూ ఉన్నావు. అంతేకానీ నీకు వివేకంచాలాలేదు. 'అది ఎట్లా' అంటే ఏ రాజ్యంలో జనులు చింతలు లేకుండా బ్రతుకుతారో ఆ రాజ్యపు రాజుకు ఆ జనులంతా సేవకులే. కాబట్టి వారు నీకు సేవకులే. నీకు కలిగిన అక్కరను తీర్చడం వారు చేయదగినపని. వారు ఆ పనిచేసినారు. అంతేకదా? దీనికంత దుఃఖించడ మెందుకు? అంతేకాకుండా పాండవులు జూదంనాడే నీకు దాసులైనారు. వాళ్ళ దగ్గరుండే మణులు బంగారం మొదలైన వస్తువులన్నీ నీ అధీనంలో ఉన్నట్లే. వారు నీకు సేవలుచేయకపోయినా ఇట్లాంటి పనినైనాచేయవద్దా ? ఇదంతా ఆలోచించి అనవరసరమైన దుఃఖంతో బాధపడకుండాఉండు. హస్తినాపురం పోదాంపద. నా మాటవినకుండా బంధంలో చిక్కుకొన్న వాడవైతే ఇంకనీకేవిధంగా నచ్చచెప్పవలె? నీవుపోయినమార్గంలోనే మేమంతాకూడాపోతాము. నీవు నగుబాటు పొందుతావు. అంతే".

కర్ణుడు చెప్పిన ఈ మాటలువినికూడా దుర్యోధనుడింకా ప్రాయోపవేశం విషయంలో నిశ్చయం వదలలేదు. అప్పుడు శకుని దుర్యోధనుణ్ణిచూచి ఇట్లాఅన్నాడు. "రాజా! కర్ణుడుచెప్పినమాటలు నిర్ణయించుకోవడానికి చాలాబాగున్నాయి. ఈ మాటలను చెవుల్లో వేసుకో. 'దుఃఖమనే సముద్రాన్ని దాటు. పూనుకొని బుద్ధిబలంతోనే శత్రువులను లేకుండాచేసి, నేను ఈ భూసామ్రాజ్యాన్నంతా నీకిచ్చినాను. సంతోషంతోఅనుభవించకుండా ఈ రాజ్యాన్ని ఇక్కడకూలదన్ని 'శరీరాన్ని విడుస్తాన'ని నిశ్చయిస్తున్నావు. వెర్రివాడవైనావా? 'నీవుపెద్దలను సేవించి ఏమీ తెలుసుకోలేద'ని నా కిప్పుడు స్పష్టంగా తెలిసిపోయింది. ధీరుడైనవాడు కోపాన్నీ, మనస్తాపాన్నీ, అవికలిగినవెంటనే అణచివేయవద్దా? 'పిరికితనం, ఏమరుపాటు, వికారత్వము, మరీమెత్తదనము, పనిచేసేపద్ధతి తెలియకపోవడం, ఇంద్రియ సుఖాలలో కూరుకుపోవడం' మొదలైన లక్షణాలుకల రాజుకు లక్ష్మిఉండదు. లక్ష్మి అతనినుండిదూరంగా తొలగిపోతుంది. కాబట్టి చేయవలసినపనిఏదోతెలుసుకో. చేయవలసినపనినిగురించినజ్ఞానం 'ఎట్లాంటిద'ంటే, ఓ దుర్యోధనమహారాజా! పాండవులు నీకుఉపకారంచేసినారు. ఆ వీరులమీద స్నేహంతోనూ, సంతోషంతోనూ, మిక్కిలి ఇష్టమైనసన్మానం చేయడం తగినట్లుంది. ఇష్టపడడానికి తగినచోట 'భయంకరమైన దుఃఖం'అనే అగ్నిలోపడి ఆవేదన పొందడం ఈ సమయంలో ధర్మమా? పాండవులు చేసినమేలు తలచుకొని, మనసులోని చెడునుఅంతా తొలగించుకో. మంచిబుద్ధికలవారూ, మనుష్యుల కతీతమైన తేజస్సు కలిగినవారూ, అయిన పాండవులను పిలువపంపు. వారి తండ్రిధనమైన వారిరాజ్యాన్ని సంప్రీతితో తగినట్లుగా వారికివ్వు. నీకు

ఈ భూమండలమంతా గొప్పకీర్తి కలుగుతుంది. పుణ్యం కూడావస్తుంది. వారు నీకు తోబుట్టువులు. ఈ రాజ్యాన్ని మీరూవారూకలసి ఒకటిగా అభ్యుదయకరంగా ఏలండి. దీనివల్ల నీకు అధికమైనసుఖంకలుగుతుంది."

ఈ విధంగా శకుని చెప్తూనే ఉన్నాడు. అప్పుడు దుర్యోధనుడు తనకాళ్ల వద్దపడి ఉండిన దుశ్శాసుణ్ణి కౌగిలించుకొని, లేవదీసి, శిరస్సును వాసనచూచి, " మీ రెందుకు నన్నుబాధిస్తారు ? ధర్మంమీదకానీ, సంపద మీద కానీ, ధనంచేత పొందగల భోగాలపైన కానీ నాకు కోరికలేదు. ప్రాయోపవేశం చేయడానికి దృఢమైన నిశ్చయం చేసుకొనిఉన్నాను. మీరు ఇంక ఏ అడ్డంకులూ పెట్టకుండా ఊరకుండండి. మీరు కావలసిన చోటుకుపొండి." అన్నాడు.

అప్పుడు వారందరూ "దేవా! నీ పద్ధతి ఇదేఅయితే, మేమెక్కడకు పోతాము? మేమూ, నీ తోడి వారమేకానీ." అన్నారు. అప్పటికి ప్రొద్దుక్రుంకింది. ఆ దుర్యోధనుడు స్వర్గానికిపోయే ఉత్సాహంతో శుచిగా స్నానంచేసినాడు. నారబట్టలు ధరించినాడు. సంజవేళలో చేయదగినపనులన్నీ చేసినాడు. ఒకఏకాంత ప్రదేశంలో దర్భలచాపమీద కూర్చున్నాడు. మౌనవ్రతంపూనినాడు. క్రమంగా కళ్ళూ, ముక్కూ, నాలుకా, చెవులు, చర్మం, చేసే పనులన్నీ వదలివేసినాడు. గొప్ప సమాధిస్థితిలోనికి చేరినాడు. గాలిలేనిచోట కదలకుండాఉండే దీపంలాగా, దుర్యోధనుడు నిశ్చలంగాకూర్చుండిఉండినాడు.

ఆ సమయంలో అంతకుమునుపు ఇంద్రునిచేత ఓడించబడిన కొందరు రాక్షసశ్రేష్ఠులు పాతాళంలో ఉండినారు. వారు ఈ దుర్యోధనుని ప్రాయోపవేశాన్ని గురించి తెలుసుకొన్నారు. "తమ పక్షం క్షీణించి పోయేస్థితి కలుగుతున్నదే?" అని దుఃఖించినారు. "వెంటనే దుర్యోధనుణ్ణి అక్కడకు పిలిపించవలె" అనుకున్నారు. అందరూకూడి శుక్రుడుమొదలైన బ్రాహ్మణులతో హోమంచేయించినారు. వేగంగా ఆ హోమగుండంనుండి భయంకరమైన వికారరూపంలో 'కృత్య'అనే ఒక రాక్షసి బయటకు వచ్చింది. "ఏంపనులున్నాయో చెప్పండి?" అన్నది. వారు "ప్రాయోపవేశంలో ఉన్న దుర్యోధనుణ్ణి ఇక్కడకు తీసుకొని రా. వాడు పుణ్యాత్ముడు. వెలిగిపోయే శరీరంకలవాడు" అని ఆజ్ఞాపించినారు.

కృత్య ఆ క్షణంలోనే పోయింది. ప్రాయోపవేశంలోఉన్నదుర్యోధనుణ్ణి కౌగిలించుకొని ఎత్తుకొని పాతాళానికి తెచ్చింది. రాక్షసుల కిచ్చింది. వారు ఆనందంతో ఆ దుర్యోధనుణ్ణి కౌగిలించుకొన్నారు. యోగక్షేమాలు విచారించినారు. తరువాత వారు దుర్యోధనునితో ఇట్లాఅన్నారు. " అయ్యా! నీవు శూరుడవు. నిన్ను చాలామందిశూరులు రక్షిస్తూఉన్నారు. నీవు భరతకులాన్ని ఉద్ధరించేవాడవు. అట్లాంటి నీవు, 'ప్రాయోపవేశం'లాంటి సాహసమెందుకు చేస్తున్నావు? అంతేకాదు ఆత్మహత్య చేసుకొన్నవాడికి లోకంలో నిందకలుగుతుంది. హీనతకలుగుతుంది. దుర్గతికూడాకలుగుతుంది. లోకవిరుద్ధాలై, మూలానికి ముప్పుకలిగించేపనుల్లోకి, నీబోటి బుద్ధిమంతులు నడుస్తారా? కాబట్టి అన్నిధర్మాలకూ, ధనాలకూ, యశస్సుకూ, భోగానికీ నాశనం కలిగించే, ఈ చెడుయోచనను విడిచిపెట్టు. ధైర్యాన్ని ప్రతాపాన్నీ అనుసరించు.

శత్రు నాశనంచేయి. నీవు కేవలం మనిషివి మాత్రమే కాదు. నీ పూర్వజన్మకు సంబంధించినకథ చెప్తాము. విను. ఓ దుర్యోధనా! పార్వతీదేవి మనసును చూరగొన్న మహానుభావుడూ. మన్మథుణ్ణీ త్రిపురాలనూ దహించినవాడూ. నల్లటికంఠం కలిగినవాడూ. కోరిన వరాలిచ్చేదేవుడూ, అయిన ఈశ్వరుడు మా తపస్సుకు మెచ్చుకొన్నాడు. ఆయన మిక్కిలిదయతో నిన్నుసృష్టించి మాకు ఆనందంగా మా అధిపతిగా ప్రసాదించినాడు. పరమశివుడు పార్వతీదేవితోకూడి నీపూర్వదేహాన్ని (బొడ్డునుండిపైకి ఉండే శరీరభాగం) స్వచ్ఛమైన వజ్రాలతో గొప్పరాళ్లతో చేసినాడు. నీ ఆ శరీరభాగం అస్త్రశస్త్రాలతో భేదింప సాధ్యంకాదు. అది(ఆ శరీరం) ఎప్పుడూ దుఃఖంలేనిది. పుష్పాలలాగా కోమలంగాకూడా ఉండేది. దేవతాస్త్రీలకూ మానవవనితలకూ కూడా మనసులలో ఆహ్లాదం కలిగించేది. అట్లాంటి నీవు, భూమి మీద పుట్టగానే నీకు సహాయం చేయాలనే మంచి ఆలోచనతో రకారకాలైన దైత్యులగుంపులు, క్షత్రియ వంశాలలో పుట్టినారు. వారంతా బాగా పరాక్రమవంతులు. దివ్యాస్త్రాలు బాగాతెలిసినవారు. శత్రువులను తరిమినవారు. వారే భగదత్తుడు మొదలైనవారు. భీష్ముడు, ద్రోణుడు, కృపుడుమొదలైనకొందరు దేవతాంశాలలో పుట్టినవారేఅయినా, వారి అభిప్రాయాలు రాక్షసావేశం పొందుతాయి. అందువల్ల వాళ్ళు దయలేకుండా మూర్ఖులవలె ప్రవర్తిస్తారు. ఒకరినొకరు దూషించుకొంటారు. ఎక్కువగా కోపగించుకొంటారు. పుత్రులు, పౌత్రులు, మిత్రులు, సోదరులు, శిష్యులు, గురువులు, బాలురు, వృద్ధులు అనే విచక్షణను పాటించరు. యుద్ధంచేసి దేవతామహిమకలవి, మనుష్యుల శక్తికనుగుణమైనవి అయిన రకరకాలైన అస్త్రశస్త్రాలతో పాండవులపక్షాన్ని నాశనంచేస్తారు. పాండవులుకూడా చుట్టరికంమరచి సాహసంతో నీతోయుద్ధంచేసిచస్తారు. నీ మనస్సులో అర్జునునివల్ల కొంతభయముంది. దాన్ని తెలుసుకొని మేముకూడా తగిన ఉపాయమాలోచించినాము. అదిఎట్లాఅంటే కృష్ణుని చేతచచ్చిన నరకాసురుని అంశం కర్ణుణ్ణి ఆవేశిస్తుంది. ఆ కారణంచేత ఆ కర్ణుడు కృష్ణార్జునులపై పూర్తివిరోధంగా ఉంటాడు. తన దివ్యాస్త్రాలతో కృష్ణార్జునులనిద్దరనూ కాల్చివేస్తాడు. ఇదంతాతెలిసి ఇంద్రుడు పాండవులను రక్షించడానికి కర్ణుడివద్దకు వస్తాడు. కర్ణుడిని మోసగించి ఆతని కవచకుండలాలను సంపాదిస్తాడు. ఇంకాభూమిమీద 'సంశప్తకుల'నే పేరుతో వెయ్యికోట్లమంది రాక్షసులు దర్పంతో పుట్టినారు. వాళ్ళచేతిలో యుద్ధంలో అర్జునుడు తప్పకచిక్కుతాడు. శత్రువులు ఎవ్వరులేకుండాపోయి ఈ భూతలమంతా నీ గొప్ప పరిపాలన క్రిందకువస్తుంది. మామీద దయతలచు. నీవే మా కందరకును తెప్పలాంటివాడవు. రాక్షసపక్షమంతా బయటపడి పోయేట్లుగా నీవు దుఃఖం పొందడంన్యాయమా? దుర్యోధనా! పో ఇంకవేరేఆలోచనమానుకో."

ఇట్లాచెప్పి, పాతాళంలోని రాక్షసశ్రేష్ఠులంతా దుర్యోధనుణ్ణి ఊరడించినారు. మళ్లీమళ్లీ అలింగనం చేసుకొన్నారు. ఆనందంగా పూజించినారు. అటుతరువాత దుర్యోధనుణ్ణి వీడుకొలిపినారు. వారిఆజ్ఞ ప్రకారం కృత్య ఆనందంగా దుర్యోధనుణ్ణి మునుపు తానుతెచ్చినచోటనేఉంచింది. దుర్యోధనుడు మనసులో

ఆశ్చర్యపడినాడు. 'జరిగిందంతా కల'అనుకొన్నాడు. తరువాత 'అదంతా నిజమే'నని నిశ్చయించినాడు. దురాశచేత చెడినబుద్ధివల్ల "పాండవులను యుద్ధంలో జయిస్తాను." అనుకొంటూ దుర్యోధనుడు శోభించినాడు. 'ఆ రాత్రి జరిగిన విషయాన్ని ఎవరికీ చెప్పకూడద'ని మనసులో నిశ్చయించుకొన్నాడు.

ఇంతలో తెల్లవారింది. కర్ణుడు తిరిగి దుర్యోధనునివద్దకు చేరినాడు. ఆయనతో ఈ విధంగా అన్నాడు. "రాజా! చచ్చిన తరువాత గొప్ప విరోధులను జయించగలమా? మరణాలు ఎక్కడైనా శుభాలను కలిగిస్తాయా! వ్యర్థంగా చస్తానంటే ఎవరికైనా మెప్పుకలుగుతుందా ? బ్రతికి ఉంటేనేకదా మానవులు గెలుపువల్ల లభించే సౌఖ్యాలను అతిశయం ఉట్టిపడేట్లు అనుభవించగలరు? కాబట్టి దుఃఖానికి దైన్యానికి సరియైన కాలంకాదిది. లే. పరాక్రమంతో శోభిల్లు". కర్ణుడీవిధంగాఅంటూ సింహంవంటి పరాక్రమం కలిగిన కౌరవశ్రేష్ఠుడైన దుర్యోధనుణ్ణి ప్రేమతో కౌగిలించుకొని పర్యంకం (పడక) నుండి లేవదీసి ఇంకా ప్రేమపూర్వకమైన మాటలతో ఇట్లాఅన్నాడు. "అర్జునుణ్ణి చూచి మనసులో నీకు భయం కలిగినట్లుంది.పదు నాలుగవఏట జరుగుబోయే భయంకరమైనయుద్ధంలో వాడిని నేను జయిస్తాను. రాజా! 'అట్లాగ'ని ఆయుధం పట్టుకొని శపథంచేస్తున్నాను."

కర్ణుని ప్రతిజ్ఞనూ రాక్షసుల మాటలనూ, తలచుకొన్నాడు దుర్యోధనుడు. ధృఢమైన నిశ్చయం చేసుకొన్నాడు. పడకదిగినాడు. "వేగంగా ప్రయాణంకండి" అని మంత్రుల నాజ్ఞాపించినాడు. ప్రీతితో ఉదయాన్నే చేయవలసిన పనులన్నీ పూర్తిచేసినాడు. ప్రకాశిస్తూ ఆనందంగా బయలు దేరిపోయి హస్తినాపురంచేరినాడు.

**తరలము.**

కడఁగి బుద్ధిబలంబునంద యకంటబుగఁజేసి యేఁ
బుడమిరాజ్యము సర్వముం దగఁబుచ్చి యిచ్చిన నిమ్ములం
గుడువ నేరక దీని నిచ్చటఁగూల ఁదన్ని, శరీరమున్
విడుతుఁగా కని నిశ్చయించెదు; వెఱ్ఱి వైతె? నరేశ్వరా! 6-32

చ. కృతముఁ దలంచి చిత్తమునఁ గిల్బిషమంతయు నుజ్జగించి, స
న్మతుల ఁబృథాతనూజుల నమానుషతేజులఁ బిల్వఁబంచి, త
త్పితృధన మైన రాజ్యము నభీష్టముగా ఁదగ నిమ్ము; నీకు నీ
క్షితివలయంబునం బరమకీర్తియుఁ బుణ్యముఁగల్గు భూవరా! 6-37

క. వారలు నీతోఁబుట్టువు; । లీరాజ్యము మీరు వారు నేకం బై పెం
పారఁగ నేలుఁడు; దీనం । గౌరవకులనాథ ! సౌఖ్యగౌరవ మొందున్. 6-38

# 43. వైష్ణవ యజ్ఞం.

**(అరణ్య 6-60 నుండి 95 వరకు.)**

**(దుర్యోధనుడు ఘోషయాత్రానంతరం చేసిన యజ్ఞమే వైష్ణవ యజ్ఞం.)**

పాండవులు అరణ్యవాసంచేసేకాలంలో ద్వైతవనంతోఉండగా, 'వారినిఅవమానించాల'ని దుర్యోధనుడు ఘోషయాత్రనెపంతో సైన్యసమేతంగా రాణులతోసహా అక్కడకు అట్టహాసంగాపోయినాడు. అక్కడ 'చిత్రసేనుడ'నే గంధర్వరాజుచేత బంధిపబడినాడు. అంతకుమునుపే కర్ణుడు చిత్రసేనునికిఓడి పారిపోయినాడు. పాండవులు వారినిగంధర్వులచెరనుండి విడిపించినారు. ఆ అవమానాన్ని భరించలేక దుర్యోధనుడు ప్రాయోపవేశం చేయడానికి పూనుకున్నాడు. ఆ రాత్రి రాక్షసులు ఆయనను పాతాళానికి తీసికొనిపోయినారు. ధైర్యంచెప్పి 'ప్రాయోపవేశాన్ని మానుకోమ'ని చెప్పి, పంపినారు. దుర్యోధనుడు ప్రాయోపవేశం మానుకొని సైన్యసమేతంగా హస్తినాపురం చేరినాడు.

ఆ తరువాత ఒకనాడు మంత్రులంతా తనచుట్టూ కూర్చునిఉండగా దుర్యోధనుడు కొలువుతీరినాడు. అప్పుడు భీష్ముడు దుర్యోధనునితో ఇట్లా అన్నాడు. "పెద్దలు నీ మేలుకోరి మంచిమాటలు చెప్తే, తెలివి తక్కువగా వాటిని లెక్కచెయ్యకుండా దుష్టాత్ములతో కలసిపోయినావు. దానిఫలిత మెట్లాఅయిందో చూచి నావుకదా? శత్రుత్వమేలేని అజాతశత్రుడైన ధర్మరాజుండబట్టి ఆ విధమైన చెడుఅవస్థను నీవు తప్పించు కొన్నావుకానీ, లేకపోతే యుద్ధంలో నీవుగంధర్వునిచేతికి చిక్కినావుకదా ? నీవూ, నీ తమ్ములూ, భార్యలూ, స్నేహితులూ, అందరనూ శత్రువులు చెరబట్టి తీసుకొనిపోతే ఏమిచెయ్యడానికీచేతకాక కర్ణుడు పారిపోయినాడు. ఈ పొగరుబోతును నీవు గొప్పగానమ్ముతావు. వీని బాహుబలాన్ని యుద్ధంలో అక్కడ కన్నులారాచూచినావా? రాజా! పాండవులు మిక్కిలి పొడవైనచేతులుకలవారు. భయంకరమైనబలం కలిగినవారు. పూజింపదగినవారు. గొప్పశౌర్యంలోనూ ఆయుధాలుప్రయోగించడంలోని నైపుణ్యంలోనూ ఈ నోటిదురుసుగలకర్ణుడు వారిలో పదారోవంతుకుకూడ సరిపోలడు. ఆ పాండవులచందం ఈ కర్ణునిచందం అక్కడ గంధర్వులతోయుద్ధంలో నిజంగానీకుతెలిసిందికదా? కులాన్నీ సంపదనూ చెరచకుండా గొప్పతనంతో ఇకనైనా ఆ పాండవులతో కలసిబ్రతకవయ్యా ! నా మాటలు వినవయ్యా! ఇది నీకుమేలుచేకూర్చేది సుమా!"

దుర్యోధనుడు ఈ భీష్ముని మాటలు విన్నాడు. కర్ణుణ్ణీ, శకునినీచూచి నవ్వినాడు. భీష్ముని మాటలనేమాత్రం ఆదరించలేదు. కర్ణుడూ, శకునీ తనతమ్ముళ్ళందరితోపాటులేచి వెంటనే అక్కడ నుండిదూరంగాపోయినాడు. భీష్ముడు తనకుజరిగిన అవమానానికి సిగ్గుపడినాడు. వెంటనేలేచి తాను కూడ తనఇంటికిపోయినాడు. అప్పుడు దుర్యోధనుడు తిరిగిముందున్నస్థలానికి వచ్చినాడు. వచ్చి మంత్రులతో యోచనచేసినాడు. "మనమిప్పుడు ఏమిచేయవలె? ఏమిచేస్తే ఇప్పుడు తరిగిపోయిన తేజస్సు తిరిగిపెరుగుతుంది?" అని అడిగినాడు. అందుకు కర్ణుడు, "దేవా! నీ కింక ఆలోచన ఎందుకు? శత్రువులులేని

ఈ భూమిని అనుభవించు." అన్నాడు. ఆ మాటలకు మిక్కిలి సంతోషించిన దుర్యోధనుడు కర్ణునితో ఇట్లాఅన్నాడు. "నీ అంతటి వీరశ్రేష్ఠుడు సహాయుడైతే కర్ణా! నాకు పొందరానిదేదైనాఉందా? ఇంకొకపని తెలిసేట్లుగావిను. ధర్మరాజు రాజసూయయాగం గౌరవంతో చేసినప్పటినుండి ఆ గొప్ప యాగంమీద కోరికకలిగిఉన్నాను. పుణ్యాత్మా! నాచేత ఆ యజ్ఞంచేయించవా?"

ఈ మాటలు విన్నకర్ణుడు దుర్యోధనునితో ఇట్లాఅన్నాడు. "అట్లే కానీలే. ఏమి? రాజా! ఇప్పుడు లోకంలోఉండే రాజులందరూ నీకు ప్రీతిగాలోబడిఉన్నవారే కదా? కాబట్టి ఆ యాగాన్ని తగినట్లుగా ప్రారంభించు. రాజులను పిలిపించు. బ్రాహ్మణసంఘాన్నంతా ఆహ్వానించు. మిక్కిలిఉత్సాహంతో గొప్పయాగశాలలూ యూపస్తంభాలూ సమకూర్చడానికి పంపించు. శోభిల్లే తినుబండారాలు సమకూర్చడానికి యోగ్యమైన వస్తువులు తెప్పించు. సహజవైభవంతో మహేంద్రుడిలాగా యజ్ఞంచేయి."

కర్ణుడిట్లాఅనగా దుర్యోధనుడు సంతోషించి, అప్పుడే పురోహితుణ్ణి పిలిపించినాడు. " రాజసూయ యాగాన్ని 'సంపూర్ణ దక్షిణలతో చేయాల'నుకుంటున్నాను. అది చేయడానికి కావలసినవాటికి మీరు ఏర్పాట్లు చేయండి". అన్నాడు. అప్పుడు పురోహితుడు తగిన పండితులతో ఆలోచించినాడు. దుర్యోధనునితో ఇట్లాఅన్నాడు. "రాజా! నీకు పాండవులు శత్రువులుకదా? వారిని యుద్ధంలో జయించిన తరువాత కానీ, ఈ రాజసూయయాగాన్ని చేయడం ఎలాసాధ్యమవుతుంది? విను. ఇప్పటికి తగినట్లుగా ఇంకొక యజ్ఞంచేయి. అది చేయడానికితగినవారందరనూ వేగంగా పిలువపంపు. రాజశ్రేష్ఠా! 'వైష్ణవమ'నే యాగంకూడ రాజసూయంలాంటిదే. పూర్వం కృష్ణుడు ఈ యాగం చేసిఉన్నాడు. ఇదే కోరదగింది. ఇది నీకు చెల్లుతుంది. అడ్డంకులేవీలేకుండా ఆ వైష్ణవయజ్ఞాన్నిచేయి. ఆ మాటలు విన్న దుర్యోధనుడు "బాగానే ఉంది." అన్నాడు. కర్ణుడుకూడా ఆ ప్రసిద్ధమైన యాగం నిర్వహించే ప్రయత్నం చేసినాడు. ఆ తరువాత దుర్యోధనుడు తనప్రయత్నాన్ని ఆనందంగా తల్లి దండ్రులకూ, ద్రోణునికీ, విదురునికీ, భీష్మునికీ, కృపునికీ, ఇంకా ఇతరమాననీయులకు తగినట్లుగా తెలిపినాడు. వారందరి అనుమతినీ పొందినాడు.

హస్తినాపురం సమీపంలో ఒకపుణ్యస్థలంలో అన్ని యజ్ఞగృహాలనూ అందంగా నిర్మింపచేసినాడు. యజ్ఞానికి కావలసిన పరికరాలనూ అన్ని వస్తువులనూ సమకూర్చడానికి తగినవారిని నియమించినాడు. ఒక శుభదినాన గొప్పబ్రాహ్మణుల సహకారంతో శాస్త్రాలప్రకారం యజ్ఞదీక్షవహించినాడు. అప్పుడు అన్ని దేశాలరాజులను పవిత్రులైనబ్రాహ్మణ శ్రేష్ఠులను, ప్రీతితో పిలవడానికి దుర్యోధనుని దూతలు ఆయనఆజ్ఞతో సంతోషంతో బయలుదేరిపోయినారు. వారిలో ఒకరిని దుశ్శాసనుడు పిలిచినాడు. "నీవు ద్వైతవనానికి పో.పాండవులను వారిఆశ్రమంలోఉండే బ్రాహ్మణులనూ దుర్యోధనునియజ్ఞానికి పిలువు" అని వాడిని ఆజ్ఞాపించినాడు.

ఆ దూతకూడ ద్వైతవనానికి పోయినాడు. ధర్మరాజును చూచినాడు. ఆయనతో, "రాజా!అపారమైన బలంకల దుర్యోధనుడు తనపరాక్రమంచేత సంపాదించిన గొప్పపదార్థాలతో గొప్పయజ్ఞంచేస్తూ ఉన్నాడు.అతిశయం శోభించేటట్లుగా నిన్నూ నీతమ్ముళ్ళనూ మహాబ్రాహ్మణులను పిలువడానికి నన్ను పంపినాడు. ఆ యాగం చూడడానికి ఆనందంగా రా". అన్నాడు. ఈ మాటలువిని ధర్మరాజు ఆ దూతతో ఇట్లాఅన్నాడు.

"పుణ్యాత్ముడైన దుర్యోధనుడు 'మహాయజ్ఞాన్ని చేస్తున్నాడు.' ఈ మాటవిని నామనసు సంతోషించింది. కులమంతా పవిత్రమైంది.విన్నావు కదా? అయినా మేము పూనుకొన్న అరణ్యవాసమూ, అజ్ఞాతవాసమూ, అనే గొప్పపూనికను తీర్చకుండా అక్కడకురావడం ఏ విధంగానూ అంగీకరించము. రాజుతో ఈ విషయం విశదంగాచెప్పు".

అప్పుడు భీముడు ఆ దూతనుచూచి, "ఓరీ! విను. పదమూడేండ్లు పూర్తిఅయిన తరువాత ధర్మరాజు మండిపోయే శస్త్రాస్త్రాల మంటలో ధృతరాష్ట్రుని కొడుకులు నూరుమందినీ బలిచేసి, హోమ గుండంలోవేసి, రణయజ్ఞం చేయడానికి వస్తాడు, కానీ అందాక రావడంజరుగదు." అన్నాడు. ఈ మాటలువిని వాడు తిరిగిపోయి ధృతరాష్ట్రుని పుత్రులకు ధర్మరాజు ఇంపైనమాటలనూ భీముని కఠినమైన మాటలనుకూడ తెలియచేసినాడు.

ఆ తరువాత కౌరవులఆజ్ఞమేరకు, భూమిపైనకల రాజులందరూ గొప్పపరాక్రమవంతుడైన దుర్యోధనునియజ్ఞాన్ని చూడడానికి హస్తినాపురానికి వచ్చినారు.వారందరికీ సత్కారాలు చేయడానికి అర్హతలను బట్టి దానాలుచేయడానికి ధృతరాష్ట్రుడు విదురుణ్ణి నియోగించినాడు. విరివిగా ప్రజలందరనూ అన్న పానాదులతో తృప్తిపరచినారు. కోరినవస్త్రాలు ఆభరణాలు దక్షిణలతో బ్రాహ్మణులు సత్కరింపబడినారు. తగినసమయాలలో తగినపనులన్నీ శాస్త్రంలో చెప్పబడినట్లుగా చేసినారు. వైష్ణవయాగం ఏ అడ్డంకులూ లేకుండా పూర్తిఅయింది.

యజ్ఞాంతంలో అవభృధస్నానంచేసి దుర్యోధనుడు ప్రకాశించినాడు. గొప్పగా బంగారంతో, రత్నాలతో, బ్రాహ్మణులను పూజించినాడు. రాజులను నానావిధాలుగా సత్కరించినాడు. అందరినీ తగినట్లుగా వీడు కొలిపినాడు.

ఆ సమయంలో యజ్ఞానికివచ్చిన చాలమందిజనం దుర్యోధనుని ముఖంముందు, " పుణ్యాత్మా! ఈ భూమిమీద నీపుణ్యమహిమ ఆశ్చర్యకరమైనది. రాజులెవరైనా ఈ విధంగా అడ్డంకులేవీలేకుండా ప్రజలందరికీ ఆనందం కలిగించేట్లు ఇంతమంచియజ్ఞం చేసినారా?దుర్యోధనా! గొప్ప వైభవంతో మునుపు హరిశ్చంద్రుడు రాజసూయాన్ని మిక్కిలినేర్పుతో చేసినాడు. ఆ విషయం పెద్దలుచెప్పగా విన్నాము. అదే రాజసూయయాగాన్ని కౌరవులలో ఉత్తముడైన ధర్మరాజుచేస్తే చూచినాము. గొప్పతనంలో ఆ రెండు యాగాలుకూడా, నీ యాగంతో సమానంకావు. పూర్వం ఈ యజ్ఞం చేయడంవల్లనేకదా రఘువు, యయాతి, భరతుడు, మొదలైనరాజులు

లో...చుట్టూ వ్యాపించినకీర్తితో ప్రకాశిస్తూ స్వర్గ లోకసుఖాలతో శోభిల్లినారు". అని పొగడినారు. అందులో కొందరు, "ఆ ధర్మరాజు రాజసూయంతో పోలిస్తే దానిలోని ఒక చిన్నభాగానికికూడ ఈ యజ్ఞవైభవం సరిపోలదు." అని మనస్సులలో అనుకొన్నారు.

ఆ తరువాత దుర్యోధనుడు ఎడతెగనిసంతోషంతో మెత్తనిమనసుకలవాడయినాడు. తమ్ములూ సామంతులూ బంధువులూ చుట్టూఉండినారు. అప్పుడు పురప్రజలుఇచ్చేఆశీర్వాదాలూ 'జయజయ' శబ్దాలూ దిక్కులన్నీనిండుకున్నాయి. ముత్తైదువులు అక్షతలుచల్లినారు. వందిమాగధులు గొప్పగా కీర్తిస్తూ కీర్తనలను పాడినారు. అట్లా దుర్యోధనుడు పురప్రవేశంచేసినాడు. రాజమందిరం ప్రవేశించినాడు. ధృతరాష్ట్రునికీ, గాంధారికీ, కృపుడికీ, ద్రోణుడికీ, భీష్మునికీ, నమస్కరించినాడు. మనస్సు వికసించగా బంగారు ఆసనంపైన కూర్చుండినాడు.

అప్పుడు కర్ణుడు దుర్యోధనునితో, "ఓ దుర్యోధనమహారాజా! ఇష్టమయిన మంచిపనులతో నీ యాగం ఏ అడ్డంకీ లేకుండా సమాప్తమయింది. అది అదృష్టంకదా? నీకు సమస్త భూమండలమూ అనుభవించదగినదే. ఇంక యుద్ధభూమిలో పాండవులను జయించి, తగిన నియమాలతో రాజసూయ యాగాన్ని చేయి. 'పాండవులను జయించడం ఏ విధంగా జరుగుతుందో?' అని చింతించవద్దు. రాజా! అర్జునుణ్ణి యుద్ధంలో చంపకుండా నేను నాకాలిగోరులను శుభ్రంచేసుకోను." అన్నాడు.

అప్పుడు కర్ణుణ్ణి కౌగిలించుకొని, "మహాత్మా ! నీ సహాయం నాకుంటే పాండవులను జయించడం ఎంతపని?" అని చెప్పి, తమ్ముళ్ళతోసహా దుర్యోధనుడు సంతోషించినాడు.

అప్పుడు ధర్మరాజు కర్ణుని ఈ ప్రతిజ్ఞను గురించి విన్నాడు. ఆ కర్ణుని బలశౌర్యాల వైభవాన్నీ భేదిందానికి వీలుకాని అతని కవచం ప్రభావాన్నీతలచుకొని, కుములుతున్న హృదయంతో రాత్రంతా కన్నులు మూతపడక చింతిస్తూనే ఉండినాడు.

**నీతి :** యజ్ఞయాగాలు చేసినవారికి తేజస్సు పెరుగుతుంది.

**చ.** **జనవర నీకుఁ బాండవులు శత్రులుగావున, వారినాజి నో**
**ర్చినమతికాక మున్న, యిటు సేయఁగ శక్యమె రాజసూయమున్ ?**
**వినుము దగంగ నిప్పటికి వేఱొక యజ్ఞముసేయు మిమ్ములం;**
**బనుపుము తత్క్రియావివిధ భంగులకుం దగువారి వేగమై.** **6-72**

**ఉ.** **వీరుఁడు గౌరవుండు, నిజవిక్రమలబ్ధ సమున్నతార్థసం**
**భారములన్ మహాధ్వరమపార బలుం డొనరించు చుండి, పెం**
**పారఁగనిన్నుఁ దమ్ములఁ మహాద్విజులం బిలు వంగఁబంచె ధా**
**త్రీరమణేశ! నెమ్మిఁజనుదెమ్ముతదధ్వరముం గనుంగొనన్.** **6-79**

# 44. ముద్గలుడి కథ.

(అరణ్య 6-114 నుండి 141 వరకు.)
(పాండవుల అరణ్యవాసకాలంలో వేదవ్యాసుడు ధర్మరా జుదుగగా చెప్పిన కథ.)

పూర్వకాలంలో 'ముద్గులుడ'నే మహాత్ముడైన బ్రాహ్మణు డొకడుండేవాడు. అతడు అతిథులపైన మిక్కిలి ప్రేమకలవాడు. విశిష్టమైన వ్రతాలు చేసేవాడు. 'అసూయ'అంటే ఏమిటోతెలియనివాడు. ఎల్లప్పుడూ సత్యమే మాట్లాడేవాడు. ఇంద్రియాలను జయించినవాడు. చాలగొప్ప పుణ్యాతుడు. చలించని మనస్సు కలవాడు.

అతడు భార్యాపుత్రులతో, కురుక్షేత్రంలో నివసించేవాడు. అతడక్కడ ఉంఛవృత్తితో బ్రతికేవాడు. పాడ్యమితో మొదలుపెట్టిపదునాలుగుదినాలు ఒక్కొక్కగింజా ఏరుకొని తూమెడువడ్లు సమకూర్చుకొనేవాడు. పదహైదవరోజున పౌర్ణమినాడు ఆ తూమెడువడ్లనువండించేవాడు. దేవతలను పూజించేవాడు. అతిథులకు అన్నం పెట్టేవాడు. మిగిలిన అన్నంతో తానూకుమారుడూ, భార్యా, శరీరయాత్ర నడుపుతూఉండేవాడు. ఈ విధంగా నిరంతరం పక్షోపవాసవ్రతం నడుపుతూఉండేవాడు.

అట్లా ఉండగా ఒకపౌర్ణమినాడు, పుణ్యాత్ముడైన దుర్వాసమహాముని, ముద్గలుడివద్దకు వచ్చినాడు. అప్పటిదుర్వాసుడి ఆకారం మిక్కుటంగా రోతపుట్టించేదిగా ఉండింది. పిచ్చిపట్టినవాడి రూపంలో కనిపించినాడు. వస్త్రాలేవీ ధరించలేదు. జుట్టువిరబోసుకొని ఉన్నాడు. పల్లెటూరిమాటలు ఎక్కువగా మాట్లాడుతున్నాడు. పెద్దగా ఆకలితో తూలిపోతూఉన్నాడు. అట్లాఉన్న దుర్వాసుణ్ణి ముద్గలుడు చూచినాడు. కొంచెంకూడ మనసులో అనుమానించలేదు. అసహ్యాపడలేదు. గౌరవంగా ఎదురుగాపోయి నాడు. అర్ఘ్యము పాద్యమూ మిక్కిలిభక్తితో, ప్రేమతో, మునిశ్రేష్ఠుడికి సమర్పించినాడు. ఆ తరువాత ఆయనకు అన్నంపెట్టినాడు. ఆ దుర్వాసుడు ఆ అన్నమంతాతిని మనస్సులో తృప్తి చెందినాడు. ఇంకా మిగిలిన అన్నాన్ని తన శరీరానికంతా పూసుకొన్నాడు. తన ఇష్టంవచ్చినచోటుకు పోయినాడు. ముద్గలుడికి అతడి భార్యాపుత్రులకు తినడానికి ఏమీమిగులలేదు.

దుర్వాసుడిట్లా ప్రతి పౌర్ణమికీ వస్తూనేఉన్నాడు. ముద్గలుడు తానుతిండిలేకుండాఉండికూడా ఆ మునిశ్రేష్ఠునికి అన్నం పెడుతూనేఉన్నాడు. ఈ విధంగా ఆరుపౌర్ణములు ముద్గలుని అన్నాన్ని దుర్వాసుడు తిన్నాడు. అయినా ముద్గలుని మనస్సులో ఏ కొరతాకనిపించలేదు. అందుచేత దుర్వాసుడు ఆశ్చర్యపడినాడు. ఆనందంలో మునిగిపోయినాడు. ముద్గలునితో ఇట్లాఅన్నాడు."సజ్జనులతో పొగడబడే ముద్గలా ! నీవు నన్ను మనస్సులో అసహ్యించుకోలేదు. అవమానం చేయలేదు. కొంచెమైనా కోపగించుకో లేదు. తప్పించుకోలేదు. స్వచ్ఛమైనభక్తితో అన్నదానాన్ని చేసినావు. ఈ తరుణంలో నిజమూ, ధైర్యమూ,

ఇంద్రియనిగ్రహమూ, ఒరులసొత్తేదీ తీసుకోకపోవడం, నీ సంపదలయినాయి. ఎప్పుడూ నాలుక రుచులకై ఆశపడుతుంది. ఓర్పునూ, ధర్మాన్నీ, ఇంద్రియ నిగ్రహాన్నీ, ఆకలినీ నాశనంచేయగలుగుతుంది. నీవు బ్రతుకు తెరువును తీర్చిదిద్దే అన్నాన్ని వదలినావు. బ్రతకాలనే కోరికనుకూడ వదలినావు. పై రెండింటి యందును నీ వాసక్తి చూపలేదు. ఇప్పుడు తపోనిధీ! నిన్నేమ'ని పొగడగలను? 'మనస్సులో ఇంద్రియాల నడవడికను సరిగా ఉండేట్లుచేసే ధర్మమే తపస్సు.' అని పెద్దలంటారు. పుణ్యాత్ముడా! అట్లాంటి తపస్సు నీయందుమాత్రమే నాకు కొత్తగా కనిపిస్తున్నది. మునిశ్రేష్ఠా! నీవల్ల నేను సంప్రీతుడనైనాను. పెద్దపెద్ద పుణ్యఫలాలన్నీ నీ చేతిలోనివే అయినాయి. నీ తపస్సు ప్రసిద్ధి పొందింది. నీ తపోవైభవాన్ని దేవతలంతా కీర్తిస్తున్నారు. నీవు ఈ శరీరంతోనే కీర్తితో దేవతలవిమానంలో స్వర్గానికి వెంటనేపోతావు."

ఈ మాటలు చెప్పి, దుర్వాసుడు తనదారిన తానుపోయినాడు. ఆ తరువాత ఒకదేవదూత ఒక విమానం తీసుకొని ముద్గలుడివద్దకు వచ్చినాడు. ఆ విమానం హంసలతో బెగ్గురు పక్షులతో కూడుకొని ఉంది. చిరుగంటలతో మనోహరంగాఅలంకరించబడిఉంది. హారాలు అలంకరించిఉన్నాయి.ఆ విమానం కామగామి. (కోరిన చోటుకు పోగలిగినది). విమానంతో వచ్చిన దేవదూత ముద్గలునితో ఇట్లా అన్నాడు. "పుణ్యాత్ముడా ! నీవు చేసినపుణ్యమువల్ల నీకు స్వర్గలోకంప్రాప్తించింది. మనసులో ఆనందంవిలసిల్లగా రా. విమానాన్ని వెంటనే ఎక్కు." ఇట్లాఅన్న దేవదూతనుచూచి ముద్గలుడు "మహాత్మా! 'దేవలోకం ఎటువంటిది? వినాల'నుకుంటున్నాను. అందులోని మంచిచెడులను తెలియచేయండి. 'మంచివారలతోమైత్రి సాప్తపదీనం' అనిచెప్తారు. కాబట్టి స్నేహాన్ని పురస్కరించుకొని నిన్నడుగుతున్నాను." అన్నాడు.

అప్పుడు ఆ దేవదూత ఆ మునీంద్రునితో ఇట్లాఅన్నాడు. "మునిశ్రేష్ఠా! ముద్గలా! స్వర్గలోకం ఈ లోకనికిపైన ఉంటుంది. అది చాలప్రకాశిస్తూ ఉంటుంది. అనేక అలంకారాలతోకూడిఉంటుంది. దివ్యులయొక్క దృష్టిని కలిగిఉంటుంది. అందులో దేవతలు తిరుగుతూఉంటారు. స్వచ్ఛమైన తపస్సు చేసినవారు, గొప్పయజ్ఞాలు చేసినవారు, సత్యసంధులు, ఉత్తములు, ఇంద్రియాలను జయించినవారు, సమబుద్ధి కలిగినవారు, దానపరులు, రణశూరులు, అక్కడ ఆనందంగా నివసిస్తారు. అప్సరసలు, సాధ్యులు, దేవర్షులు, మరుత్తులు, వసువులు, మొదలైనవారు, ఆ స్వర్గంలోనే వేరువేరుగా తగిన ప్రదేశాలల్లో ఆనందంగా ఉంటారు. ఇంకా స్వర్గలోకంలో ముప్పైమూడువేల (యోజనం అనగా ఏడున్నరమైళ్ళ పొడవు అనగా పన్నెండు కిలోమీటర్ల పొడవు.) యోజనాల వైశాల్యంకలమేరుపర్వతశిఖరం ఉంది. నందనం మొదలైన దేవతల ఉద్యానవనాలు, పుణ్యపరులకు ఆడుకొనేస్థలాలై ప్రకాశిస్తూఉంటాయి. అక్కడ ఆకలీ దప్పికా ఉండవు. చలిబాధకాని, వేడిబాధకానీ ఉండదు. ముసలితనంకానీ, రోగంకానీ కలుగదు. ఎక్కడ చూచినా అతిమనోహరంగా ఉంటుంది. సకలేంద్రియాలకు సంతృప్తి కలిగిస్తూఉంటుంది. ఇట్టి పుణ్యలోకాలకు అర్హులైన పురుషులు, విధిచేత పండినమానవ శరీరాలనువిడచి, ప్రకాశించే దివ్యదేహాలను ధరిస్తారు.

రకరకలైనఆభరణాలు ధరిస్తారు. వాడిపోనిపూలమాలలుకూడ ధరిస్తారు. ఆ విధంగా మనోహరులై కనిపిస్తారు. వారిని దేవతలు విమానంలో స్వర్గనికి తీసుకొనిపోతారు. అక్కడ దు:ఖం, భ్రమ, శ్రమ, ఆయాసం, లేకుండా రకరకాలైన సుఖాలను అనుభవిస్తూ ఉంటారు. పుణ్యాత్మా ! ఇంద్ర లోకంకంటెపైన బ్రహ్మలోకంఉంటుంది. ఆ బ్రహ్మలోకం సాటిలేకుండా వెలిగిపోయేలోకం. తన వెలుగుతో అది అన్నిలోకాలనూ ప్రకాశింప చేస్తుంది. మనువులు, బ్రహ్మలు, మునులు, అక్కడఉంటారు. అక్కడ లోభము, కోపము, పాపము, అపకీర్తి, దు:ఖం, పునర్జన్మలుండవు. ఈ లోకాలన్నీ నాశనమయ్యేటప్పుడుకూడ ఆ పొగడబడేలోకం నాశనంకాదు. ఇంద్రుడు మొదలైనవాళ్ళుకూడ 'ఆ లోకం కావాల'నుకుంటారు. స్వర్గంలోకల గుణాలను చెప్పినాను. ఇంక అందులోనిదోషాలను చెప్తాను. విను. ఈ లోకంలోచేసినపుణ్యాలన్నీ ఆ లోకంలో అనుభవిస్తారు. అంతేకాని మనిషికి ఆ స్వర్గంలో పూనుకొని పుణ్యంచేసుకోవడం సాధ్యంకాదు. చేసినపుణ్యం ఖర్చుకాగానే, తిరిగి అతణ్ణి భూమిమీదకేత్రోస్తారు. స్వర్గంలో బాగామరగిన సౌఖ్యాలు విడువడంవల్ల మనుష్యుడు దుఃఖానికి లోనౌతాడు. శక్తినీ తేజాన్ని కోల్పోయి నేలమీదపడతాడు. అంతేకాదు స్వర్గంలోఉండే జనులుకూడ, ఒకరిపై నొకరు అసూయపడడం ఉంటుంది. తాను తక్కువగాఉండడం, ఇంకొకరు గొప్పగాఉండడం. చూచి మనసులలో బాధపడుతూఉంటారు. బ్రహ్మలోకంతప్ప మిగిలిన పుణ్యలోకాలన్నింటిలో ఇదేపద్ధతి చెల్లుతుంది. ఇంకా పుణ్యంలోకాలనుండి త్రోయబడి, మానవలోకంలో భోగాలను అనుభవించే వాడయిపుడతాడు. ఈ లోకం కర్మభూమి. ఆ స్వర్గలోకం 'ఫలితం అనుభవించేభూమి' అని తెలుసుకో. నీ మీద అభిమానంతో ఇదంతా చెప్పినాను. నీ వింక ఆలస్యం చేయడం మెందుకు? రా".

ఈ మాటలు విని ముద్గలుడు కొంచెంసేపు ఆలోచించి, దేవదూతను చూచి, "ఇట్లాంటి దివ్య సుఖాలు నా కొద్దు. అట్లాంటివి పదివేలువచ్చినట్లే అనుకుంటాను. ఆ భోగాలన్ని ఆ దేవతలకే ఉండనీ. ఓ అన్నా! ఇప్పుడే నీవు, నీ ఇష్టంవచ్చినచోటుకుపో. ఎక్కడకుపోతే తిరిగి ఎప్పుడూఇక్కడకు రాకుండా ఉంటానో, అట్లాంటి ఉత్తమపదవికై ఏ విధంగానైనా ప్రయత్నంచేస్తాను." అనిచెప్పి, దేవదూతను పంపివేసినాడు.

ఆ తరువాత, ముద్గలుడు ఉంఛవృత్తిని వదలివేసినాడు. గొప్ప నిర్వికారమైన చిత్తవృత్తిని స్వీకరించి, జ్ఞానయోగంచేత, నిందనూ స్తుతినీ సమానంగాచూడడం, మంటిబెద్దనూ[redacted]ాతినీ బంగారాన్నీకూడా సమానంగాచూచే గొప్పస్థితిని పొందినాడు. ఆయనకు బ్రహ్మలోకం ప్రాప్తించింది.

**నీతి :** మోక్షాన్ని పొందడం స్వర్గాన్ని పొందడాన్ని మించినది.

**క. మనమున నింద్రియముల వ ర్తనమును సరిగా నొనర్చు ధర్మంబు దపం**
**బని చెప్పుదు; రట్టి తపం బనఘా ! నీయందు కలిగె నఖిలవభంగిన్. 6-124**

# 45. సైంధవుడు.

**(అరణ్య 6-143 నుండి 260 వరకు.)**

**(పాండవుల అరణ్యవాసంచేసేకాలం సైంధవుడు ద్రౌపదిని చెరపట్టి పాండవులతో ఓడుట.)**

పాండవులు అరణ్యవాసంలోఉండగా ఒకనాడు పాండవులందరూ వేటకుపోయినారు. వేటకు పోతూవారు, ద్రౌపదినీ ధౌమ్యుణ్ణీ తృణబిందుని ఆశ్రమంలో ఉంచినారు.

సింధుదేశపురాజైన జయద్రథుడు, సాళ్వకన్యను పెళ్ళాడాలని సైన్యంతో స్నేహితులతో ఆ దారిలో పోతూఉండినాడు. అట్లాపోతూపోతూ తృణబిందుని ఆశ్రమద్వారంలోఉండిన ద్రౌపదిని చూచినాడు. ఆ సైంధవుడు ప్రజలలో పేరుపొందిన పరాక్రమవంతుడు. తనవెంట చతురంగబలాలున్నాయి. ఆ సైంధవుడు వైభవంతోప్రకాశిస్తూ ఉన్నాడు. ఇకపోతే ద్రౌపది నల్లనిమేఘాలను ప్రకాశింపచేయడానికి మెరిసే క్రొత్తమెరుగులాఉంది. కొత్తమెరుగు మాయమవకుండా నిశ్చలంగా నిలబడినట్లుగా ఆమెఅక్కడ నిలబడిఉంది. తన సుకుమారమైనకాంతిరాశితో అడవినంతా ప్రకాశింపచేస్తూఉందామె. ఆమెకు మిక్కిలినల్లటిముంగురులు ప్రకాశిస్తూఉన్నాయి. అట్లాంటి ద్రౌపదిని చూచి, సైంధవుడు మనస్సులో మిక్కిలి ఆశ్చర్యపడినాడు.

సైంధవుడు ఆమెమీద లగ్నమైన చూపులను వెనుకకుమరలించలేకపోయినాడు. తన మనస్సు మన్మథునిగర్వానికిలోబడింది. తన స్నేహితుడైన కోటికాస్యుడిని చూచినాడు. అతనితో సంతోషంతో "ఈమెఎవరో? ఈ అడవిలో ఈ విధంగా ఒంటరిగా ఉండడానికి కారణం మేమిటో? ఆమె శ్రేష్ఠమైన దేవకన్యయా? యక్షకాంతయా? పన్నగస్త్రీయా? తెలియడంలేదు. ఈమె మనుష్య స్త్రీ కాకపోవడం మాత్రంనిజం. ఆలోచిస్తే ఇంతటిసొగసు భూమిమీదకల స్త్రీల కైవరికైనాఉంటుందా? విలాసం అతిశయించగా ఆమె తనచేతితో కడిమిచెట్టు చివరను పట్టుకొనిఉంది. ఆ చేయి లేతచిగురుటాకులాగా ఎర్రగా సుకుమారంగా ఉంది. ఆమె వసంతంలో విజృంభించిశోభిల్లే లేతలతవలె ప్రకాశిస్తూఉంది. తన సొగసైన చూపులచేత రాణిస్తూ ఉంది. అగ్నిజ్వాలలాగా నా మనస్సును నిజంగా కాల్చివేయడం మొదలు పెట్టింది. చూచినావా? ఈ పద్మాక్షి నాహృదయేశ్వరి అయితే మూడులోకాల సామ్రాజ్యమూ లభించగా పరిపాలించినట్లు శోభిల్లనా? వీరుడైన మన్మథుణ్ణి సేవకుడిగా స్వీకరించి సకలసౌఖ్యాలూ అనుభవిస్తాను. ఆమెను అంగీకరించేట్లుగా మాట్లాడు. ఈమెకూ నాకూ సంయోగం కల్పించు. దయతో నన్ను ధన్యుణ్ణి చేయి" అన్నాడు. ఇట్లాఅని ఈ పనిమీద కోటికాస్యుణ్ణి నియోగించినాడు.

వెంటనే కోటికాస్యుడు ద్రౌపదివద్దకు పోయినాడు. ప్రేమతో ఇట్లాఅన్నాడు. "భయంకరమైన జంతువులతోనిండిన ఈ అడవిలో, ఒంటరిగా ఇట్లా నీవుండడానికి కారణమేమిటి? విష్ణువువక్ష స్థలాన్నివదలి లీలకొరకై ఇక్కడవిహరిస్తున్నలక్ష్మీదేవివా? నీకు తండ్రిఅయి గొప్పగా ప్రకాశించే పుణ్యాత్ముడు ఏ వంశంవాడు? నీకు భర్తఅయి సౌఖ్యంగా బ్రతికేవాడెవడు? నీ పేరులో పొసగడంలో ఇంపారే ఆ శబ్దమేది? నాకు నిజంచెప్పు." అని ఇంకా ఇట్లా అన్నాడు.

"మా విషయం తెలుసుకోవాలంటే విను. నేను 'సురథుడ'నే పేరు గల రాజుకొడుకును. శత్రువులను బాధించేవాడిని. 'కోటికాస్యుడు'అనే పేరుతో పిలువబడేవాడను. అదిగో ఆ బంగారురథంపై ప్రకాశించే వాడు త్రిగర్తదేశపురాజు. అతడు మిక్కిలిగొప్పవాడు. అతడిపేరు క్షేమంకరుడు. ఇంక నిన్నుచూస్తూ ఉన్నాడుచూడు. వాడు ప్రకాశించే భుజాలుకలిగిన కాళింగదేశపురాజు. అదిగో అక్కడ తామరకొలను దగ్గరనుండి చూస్తూ ఉన్నవాడు, ఇక్ష్వాకువంశపు 'సుబలుడు'అనే రాజు కొడుకైన సుభగుడు. అదిగో అక్కడ ఉండేవాడు జయద్రథుడు. అతడు ఎర్రటిగుర్రాలరథాలపైన తన చుట్టూ రత్నాలఆయుధాలు ధరించి, బాగామండే అగ్నులలాగా ప్రకాశిస్తూ పన్నెండుమంది సౌవీరకుమారులున్నారు. వారందరూ ఆయనకు సహాయకులుగాఉండి ఆయనను సేవిస్తూఉంటారు. తనచుట్టూ కొన్నివేల చతురంగబలాలు కనిపిస్తున్నాయికదా? వాటిమధ్యలో గొప్పఏనుగుపైన శోభిస్తూఉండే ఆ వీరుడే సింధుసౌవీరదేశపురాజైన జయద్రథుడు. ఆ జయద్రథుడే ఇప్పుడు 'నీ విషయం తెలుసుకోవాల'ని నన్నిక్కడకు పంపినాడు".

ఈ మాటలువిన్న ద్రౌపది కొద్దిగాతత్తరపడింది. కడిమిచెట్టుకొమ్మను వదలిపెట్టింది. పైన కప్పుకొన్నవస్త్రాన్ని సవరించుకొన్నది. కోటికాస్యునితో, "అన్నా! నే నిక్కడ ఒంటరిగాఉన్నాను .నీ విక్కడకు రావడం మర్యాదగా ఉందా? పుత్రులుకలదాన్నీ, ధర్మం పాటించేదాన్నీ, అయిన నన్ను 'ఇతరస్త్రీలలాగా' అనుకొని ఎక్కువగా మాట్లాడడం నీకుతగదు. నీవు శిబివంశంలో పుట్టిన 'సురథుని కొడుకువ'ని నాకు తెలుసు. ఇక నా విషయంచెప్తాను. విను. నేను పాంచాలదేశపురాజు ద్రుపదుని కూతురను. నా పేరుకృష్ణ. పాండవులైన ధర్మజ, భీమ, అర్జున, నకుల, సహదేవుల ధర్మపత్నిని. ఆ పాండవులు నన్నీ అడవిలోఉంచి, వేటకు పోయినారు. ధర్మరాజుతూరుపునకూ భీముడుదక్షిణానికీ, అర్జునుడుపడమరకూ, నకులసహదేవులు ఉత్తరానికీ పోయినారు. వారు పుణ్యాత్ములైన రాజశ్రేష్ఠులు. ప్రకాశించే పరాక్రమం కలవారు. వారు ఇంక కొద్దిసేపట్లోనే వేటనుండి తిరిగివస్తారు. మీరు ఆ మహాత్ములచేత గౌరవింప దగినవారు. కాబట్టి పెద్దలూ, మిత్రులూ, కురువంశాన్ని పావనం చేసేవారూ, అయిన పాండవులచేత సత్కారాలను తీసికొని పోదురుగానీ, కొంచెంసేపు ఈ ఆశ్రమంలో నిలవండి." అనిచెప్పి మెల్లగా ద్రౌపది భయంతో కుటీరంలోనికి ప్రవేశించింది. కోటికాస్యుడు తిరిగిపోయి జయద్రథునితో ఆమె 'పాంచాల దేశపురాజు కూతుర'నీ, 'పాండవులభార్య' అనీ, చెప్పినాడు. ఆ మాటలువిన్నాడు సైంధవుడు. అతని మనస్సు మన్మథుని చేత చలింపచేయబడినది. ఆమెను బలవంతంగా పట్టుకోవడానికి పూనుకొన్నాడు. కొంతమందిజనంతో కుటీరంలోనికి ప్రవేశించినాడు ఆ సైంధవుడు కుటీరంలోనికి ప్రవేశించడం, సింహంనివాసంలోనికి తోడేలు పోయినట్లుగ ఉండింది. అక్కడకుపోయి ద్రౌపదినిచూచి ఇట్లాఅన్నాడు.

"వామాక్షీ! నీకు క్షేమమేనా? నీ మనసు ఎప్పుడూ ప్రేమతో ప్రకాశించే నీభర్తలయిదుగురూ క్షేమమేకదా? ఈ మాటలకు ద్రౌపది ఇలాసమాధానమిచ్చింది. "ధైర్య వంతులైన పాండవులకు క్షేమమే. రాజా! నీకు ఆరోగ్యం బాగాఉందా? కురువంశంలో శ్రేష్ఠులైన పాంవుడలఇంటికి అతిథివైనావు. కాబట్టి సముచితంగా ఆసనాన్ని స్వీకరించు. పాద్యమును గ్రహించు. అభిమానంతో రుచికరమైన జింకమాంసాలతో ఇప్పుడు విందుభోజనమారగించు. వేటకుపోయిన నా భర్తలు ఇప్పుడేవస్తారు. వారువచ్చి నీకు కావలసిన మర్యాదలు చేస్తారు . పుణ్యాత్మా ! వారి మర్యాదలు స్వీకరించి నీవూ నీ మిత్రులూ పొందిు."

ఈ విధంగా మాట్లాడిన ద్రౌపదిమాటలువిని సైంధవుడిట్లా అన్నాడు. "కమలాక్షీ! నీవు మాకు చేయదలచిన అతిథిపూజలన్నీకూడ ఏ కొరతలేకుండా పొందినట్లే. కానీ నా మనస్సు మన్మథాస్త్రాల చేత వెతచెందింది. ఇంక నన్నుధన్యుణ్ణిచేసి, తగినట్లుగా నా రథం ఎక్కు. ప్రీతితో లేచి రా. రాజ్యాన్ని పోగొట్టుకొని భయంకరమైన అడవులలో పాండవులు నివసిస్తున్నారు.సరియైన వారందరూ వారిని ఎగతాలి చేస్తున్నారు. వారికి చెడుకాలందాపురించి దీనులుగాఉన్నారు. అట్లాంటి పాండవులనుసేవిస్తే నీకు సౌఖ్యముంటుందా? నీవెంతో అమాయకపుస్త్రీవైనావు. ధనంలేని వారిని స్త్రీలు మిక్కుటంగా కోరుకుంటారా? నన్ను సమస్తమైన సింధుసౌవీరరాజ్యాధికారంతోపాటుగా ఏలుకో. నీ మనస్సుకు ఆనందంకూర్చే భోగాలన్నింటినీ హాయిగాఅనుభవించు. వేరేఊహలను వదలిపెట్టు".

ఈ మాటలువిని ద్రౌపది వణికిపోయింది. కొంత తప్పించుకొంది. వాడివైపు అసహ్యంగా చూచింది. మనసులో 'తనభర్తలు త్వరగా రావాల'ని కోరుకొన్నది. "సమాధానాలతో కొంతకాలం గడపితే ఆ లోపల భర్తలు వస్తారుకదా?" అని ఆలోచించింది. అందుకని జయద్రథునితో ఇట్లాఅన్నది "పుణ్యాత్మా! ఆలోచిస్తే, పాండవులకూ కౌరవులకూకూడ చెల్లెలైన దుస్సలకు నీవుభర్తవు. కాబట్టి నీవు నాకుకూడ తోబుట్టువువే కదా? అట్లాంటప్పుడు నీవు న్యాయంతప్పినమాటలు మాట్లాడడం తగునా? నీతి, ధర్మం, ఉన్నవంశంలో పుట్టినావు. అయ్యో! ధర్మపుతీరు తెలుసుకోవద్దా? ఇహపరలోకాలకు విరుద్ధమైన మార్గము అనుసరించడ మెందుకు?"

ఈ మాటలు విని, చెడుబుద్ధిగల సైంధవుడు, చిరునవ్వుముఖంతో ఇట్లాఅన్నాడు. "పద్మాక్షీ! రాజధర్మం వినలేదా? ఎప్పుడైనా రాజులు స్త్రీలవిషయంలో వావివరసలు వెదకనక్కరలేదుకదా? రాజులకు కావలసిన విధంగా వినోదంచేయడం చెల్లుతుంది. విను. అదికాకుండా రత్నాలవంటిస్త్రీలు అందరికీ అనుభవించదగినవారే. అంతే కానీ, ఒకడి ప్రత్యేకమైనసొత్తు అనే నియమేదైనాఉందా?"

ఈ మాటలు వినగానే ద్రౌపదికి కోపంవచ్చింది. మనసు కలతచెందింది. "ఈ పాపాత్ముడు మంచి మాటలతో పోయేట్లులేదు. కరకుమాటలతో కానీ దారికిరాడు." అని ఆలోచించింది. సైంధవుడితో ఇట్లాఅన్నది. "రాజ వంశంలో పుట్టిన నీచుడా! నా భర్తలు ప్రకటించబడిన గొప్పపరాక్రమంకలవారు.

తమశౌర్యంతో శత్రువులను జయించినవారిని స్మరించకుండా, నన్ను అవమానిస్తున్నావు. నీ అహంకారపు దుష్టవిజృంభణము ఇంతటితోపోదు. కడకునీవు భరించలేకుండాపోతావు. చెడ్డవదరుడుమానివేయి. ధర్మరాజు ధర్మాత్ముడు. మిక్కిలిభయంకరమైన పరాక్రమంకలిగినవాడు. అట్లాటిధర్మరాజును ఎదిరించడానికి పూనుకోవడం నీకు చాలఇబ్బందికరం. ఆలోచిస్తే, హిమాలయపర్వతాలలో కోపంతో ఎర్రనైనకళ్ళుకల మదగజాన్నిసమీపించి, 'అంకుశం చూపినట్లు'ంటుంది. భీముడు కోపగించినప్పుడు భయంకరమైన పిడుగుపాటులాంటివాడు. అట్లాంటి భీముడిని ఎదిరించడం 'ఎట్లుంటుంద'ంటే మదపు టేనుగులను తనవాడి గోళ్ళతో చీల్చి, రాలిన ముత్యాలతో నిండినగుహలో నిద్రపోయే 'సింహపుజూలును వేడుకగా ఊచడానికి చేరడం' లాగాఉంటుంది. నాలుకకొనతో నాకబడుతూ బాగాకనిపించే కోరపండ్లచేత భయంకరమైనపెద్దపులిని, కర్రతోకొట్టి, దాన్నిత్రోసి వేసి, ప్రక్కకుతప్పుకొనిపోతే పోవచ్చునేమో? కానీ ప్రకాశించే భయంకరమైన 'బాణాల'నే అగ్నిచేత భరించరానివాడైన 'గాండీవం' అనేవిల్లుధరించే అర్జునునికి కోపంతెప్పించి, ఏరీతిగానైనా ఎవరైనా మానంపోగోట్టుకోకుండా బ్రతికితప్పించుకొనిపోగలరా? అడ్డగించడానికి సాధ్యంకాని నకులసహదేవులకు అవమానంచేయాలని ఆలోచించడం 'ఎట్లాంటిద'ంటే శీఘ్రంగా నిప్పురవ్వలుపుట్టగా 'భయంకరమైనవిషాన్ని కక్కుతూ భయంకరమైనచేష్టలతో నాలుకలుచాచే మహాభయంకరములైన పాములజంటను సమీపించి కాళ్ళతో త్రొక్కి కోపగింపచేయాల'ను కోవడంలాంటిది. ఆ పాండవులు యుద్ధంలో పరాక్రమంతో దేవదానవులుకూడ జయించలేని పరాక్రమంకలిగినవారు. వారికి కీడుచేసిపోయి పాతాళంలో దాగుకున్నా నీకు చావుతప్పదు. అయ్యో! నీ ఆయుస్సు తీరింది. ఈ బ్రహ్మదేవుడుచేసినపనిని తప్పించడానికి నీకుసాధ్యంకాదు. తేలు, ఎంద్రకాయ చచ్చేకాలంనాటికి గర్భంధరించే విధంగా పాండవులభార్యనైన నా పైన చెడునడవడిక కలవాడవైనావు. ఇది చెడిపోయే గుర్తుకాదా?" ద్రౌపది ఇట్లాఅంటుండగానే జయద్రథుడునవ్వుతూ ద్రౌపదితో ఇట్లాఅన్నాడు. "ఓ పద్మాక్షీ! పాండవుల సంగతి నాకు తెలియదా? పిరికివానినిగా లెక్కించి మమ్ములను 'మాటలతో భయపెట్టాల'ని ఎందుకుచూస్తావు? విను. వీరవంశంలో పుట్టినవీరులం మేము. ఇతర రాజులమాదిరికాదు. మేము ఉదాత్తమైన చరిత్ర కలిగినవారము. అనవసరమైన మాటలతో తేర్చితే సరిపోదు. వేగంగా ఆ బంగారు రథంగానీ, గొప్ప ఏనుగునుకానీ ఎక్కు. బీరపుమాటలు మాట్లాడకుండా మంచిమాటలతో, నా అనుగ్రహానికి ప్రాత్రురాలవుకా.

సైంధవుని ఈ మాటలువిని ద్రౌపది తిరిగి ఇట్లాఅన్నది. " నేను వీరులకుభార్యను. వీరులకు సోదరిని. అట్లా అయికూడ, నీకు చూడడానికి, నేను 'అనాథలాగా' కనిపిస్తున్నాను. నేను నీకేవిధంగా కనిపించినా నేను నీకు చెప్పడమెందుకు? నీతో తియ్యగా మాట్లాడడమెందుకు? రాక్షసులను జయించినవాడు, యదుకులంలో సింహంవంటివాడు, అయిన శ్రీకృష్ణుడు వృష్ణికేకయసేనలతో ముల్లోకాలను దద్దరిల్ల చేస్తూ వేగంగాపరుగెత్తే గుర్రాలనుపూన్చిన రథమెక్కి నిన్నుతాకి, శక్తిలేనివాడిని చేస్తాడు. ఆ సమయంలో 'నాకు

దికుఉందనే విషయంనీకే తెలుస్తుంది. అర్జునుడు భయంకరమైన మేఘంలాగా బాణాల వర్షంకురిపిస్తాడు. ఇంద్రుని విల్లులాంటి గాండీవం యొక్క అల్లెత్రాటిధ్వని ఉరుములాగా ఉంటుంది. తన స్నేహితులు పొగడుతూ, మేఘాలనుచూచి నాట్యంచేస్తూకూతలుపెట్టే నెమళ్ళలాగాఉంటారు. ఆ అర్జునుని 'శౌర్యము' అనేనీరు, 'శత్రుపరాక్రమమ'నే వేడిని,చల్లారుస్తుంది.అట్లాంటి స్థితిలో అర్జునుని బాణవర్షానికిభయపడి, నిలబడలేక పారిపోయేటప్పుడైనా నీవు చేసినతప్పుకొరకు మనసులో దుఃఖించగలవు సుమా! ఇప్పుడు నేను చెప్పడమెందుకు? భయంకరమైన గదదెబ్బకు తలక్రిందులుగా పడిన శత్రుసేనలోని ఏనుగుల కుంభస్థలాలను చీలికలుచేస్తూ ముత్యాలతో యుద్ధభూమిని సింగారిస్తూ. వినోదంతో తన్మయంచెంది గర్వవిలాసంతో ఐకునిచంపిన భీముడురాగా కన్నులారా చూచికానీ, నీమిడిసిపాటు అణుగుతుందా? నన్ను ఇతర స్త్రీలమాదిరిగా అవమానించడంతగదు. పాతివ్రత్యమాహాత్మ్యంవల్ల ఎప్పుడూ, ఎక్కడా, ఏకీడూ నాకుకలుగదు". ఇట్లా చెప్పిన ద్రౌపది, ఆ దురాత్ముడైన సైంధవుడు తనను పట్టుకోవడానికి పూనుకోవడం గమనించింది. తమపురోహితుడైన ధౌమ్యుణ్ణి పిలుస్తూ ఏడిచింది. ఆ ధౌమ్యుడు మిక్కిలి వేగంగావచ్చేలోపలనే పాపంచేయాలని నిశ్చయించుకొన్న సైంధవుడు పూని ద్రౌపది పైటకొంగును పట్టుకొన్నాడు. ఆమె వాడిని విదల్చింది. వేగంగా వాడిని కొట్టింది. వాడుగాలి దెబ్బకు వేళ్ళు తెగివేగంగా పడిపోయేచెట్టులాగా తూలి, చిత్రంగా నేలపై పడిపోయినాడు. ఈ విధంగా నేలమీదపడి, ఆలస్యం లేకుండా తిరిగిలేచి నిలబడినాడు. లేచినవెంటనే ఆమెనులాగి రథంపై ఉంచుకొని పరివారంతోసహా పోవడం మెదలుపెట్టినాడు. అప్పుడు ద్రౌపది, పురోహితుడైన ధౌమ్యునికి మ్రొక్కింది. ఆ మహాత్ముడైన ధౌమ్యుడు సైంధవుని పేరుపెట్టి పిలిచి ఇట్లాఅన్నాడు.

"రాజకులంలోపుట్టినవారికి ఇటువంటి 'చెడుపని' చేయదంతగునా? నామాటవిను. ఈ పద్మాక్షి పుణ్యాత్మురాలు. ఆమెను వేగంగావదలిపెట్టు. పాండవులు నీమానాన్నీ ప్రాణాన్నీఎట్లైనా తీస్తారుకానీ, పోనివ్వరు. ఈ పాపం నిన్ను తప్పక చెరుస్తుంది". ఇట్లాఅంటూ పెద్దగాఅరుస్తూ వాని వెనుకనే పోయినాడు.

ఇక్కడ పాండవులు ఆ అడవిలో చాలమృగాలను చంపినారు. అందరూ ఒకచోట కలుసుకొన్నారు. అక్కడనుండి బయలుదేరి ఆశ్రమం వైపుకు వస్తూఉండినారు. అప్పుడు ధర్మరాజు తమ్ములను చూచి ఇట్లాఅన్నాడు. "సూర్యునివైపునుండి పక్షులుఅరుస్తున్నాయి. జంతువులన్నీ మిక్కిలి భయంకరంగా అరుస్తూమరలుతున్నాయి. ఇప్పుడు మనకు ఎడమవైపునుండి ముసలినక్క మిక్కిలిభయంకరంగా అరుస్తూఉంది. ఈ శకునాలను గమనిస్తే మనకు శత్రువులతో అవమానమూ యుద్ధమూకలుగుతాయి. మనస్సంతా చేయిపెట్టి కలచినట్లుగా ఉంది. శరీరం నిశ్చేష్ట మయింది. వేగంగా పోదాంరండి. ఆశ్రమంలో ద్రౌపది నొకదాన్నీ ఉంచివచ్చినాము. అయ్యో! తలచుకొంటే ధృతరాష్ట్రుని కొడుకులు మిక్కిలి క్రూరమైన

బుద్ధికలవారు. సమయంచూచి మిక్కిలికీడుచేయడానికి ప్రయత్నిస్తారు. కమలాలులేని సరోవరంలాగా చంద్రుడు లేనిరాత్రిలాగా చూడడానికి కామ్యకవనం శూన్యంగా కనిపిస్తున్నది. ఏమి కీడు కలుగుతుందో?" అట్లాఅనుకుంటూ ఆ అయిదుమంది రథాలనువేగంగాతోలుకొని ఆశ్రమానికివచ్చినారు. వారు వచ్చేటప్పటికి ద్రౌపది పరిచారికఅయిన 'ధాత్రేయిక' అనే ఒక స్త్రీ, మిక్కిలి జాలిపుట్టేటట్లుగా ఏడుస్తున్నది. ఆమెనుచూచి ధర్మరాజుసారథి ఇంద్రసేనుడు, రథంనుండి దిగదూకిపోయి "ఎందుకు నేలమీద పడిపొర్లుతూ ఏడుస్తున్నావు? నీకు అపకారంచేసిన వారెవ్వరు?" అన్నాడు. అప్పుడు ధాత్రేయిక ఇంద్రసేనునిచూచి "సైంధవుడు ద్రౌపదిని బంధించి తీసుకొనిపోయినాడు." అంటూ పెద్దగా ఏడిచింది. అప్పుడు ఇంద్రసేనుడిట్లాఅన్నాడు. "ఓ ధాత్రేయికా! ద్రౌపది, పాండవులకు బయటకు కనిపించే ప్రాణంలాంటిది. మంచి స్వభావం కలిగినది. పాంచాలరాజపుత్రికపైన మోహంచేత గ్రుడ్డివాడైన సైంధవునకు ఆమెను తీసుకొని పోయేంత ధైర్యం కలిగిందా? పోతేపోయినాడు. నేల మీదఉన్నా ఆకాశానికి వేగంగాఎగిరిపోయినా పోనిస్తారా? ఆ పాపశీలుణ్ణి కాఠిన్యంతో చంపుతారు కానీ. వీరశ్రేష్ఠులైన పాండవుల భయంకరమైన వివిధాస్త్రకౌశలం వాడుతెలియనివాడైఉంటాడు. దు:ఖపడవద్దు. శత్రువును భయంకరంగాచంపి, పాండవులు ద్రౌపదిని ఇప్పుడే తెస్తారు.

ఈ మాటలను విన్న ధాత్రేయిక కనుగొలకులనుండి కారుతున్న కన్నీళ్ళను మెల్లగా తనమృదు హస్తాలతో తుడుచుకుంటూ ఇంద్రసేనుణ్ణి చూచి ఇట్లాఅన్నది. "ఇంద్రుడితో సమానులైన అయిదుగురు రాజులను మనసులోలెక్కపెట్టకుండా ద్రౌపదిని బలాత్కారంగా కొనిపోయినప్పుడే ఆ దురాత్మునికి 'చేటు మూడింది' అని ఇంక వేరుగా చెప్పడంఎందుకు? ఇంతకుముందే వాడుపోయినాడు. చాలదూరం పోకుండా మిక్కిలివేగంగా గొప్పరథాలతో భయంకరంగాపోండి. శస్త్రాస్త్రాలను సమకూర్చుకోండి. కవచాలను తొడగండి. ఎడతెగకుండా దివ్యాస్త్రాలను ప్రయోగించండి. శత్రువులను చంపండి. ద్రౌపదిని తీసుకురండి. బూడిదలోపోసిన మహాద్రవ్యంలాగా, కుక్కతోలుతిత్తిలోపోసిన కపిలగోవుపాలలాగా, స్మశానంలో పడిన గొప్ప పూలదండలాగా, ద్రౌపది దుర్జనుడైన సైంధవుడికారణంగా చెడిపోకముందే, వేగంగా పొండి. మంచిమంత్రాలతో పవిత్రంచేయబడినవంటకం కుక్కకు యోగ్యమవుతుందా? పద్మాల పరిమళంతో కూడిన సరస్సులో వినోదంగా విహరించడం, కుళ్ళిన పీనుగులను తినేనక్కకు సరిపోతుందా? సన్ననినడుముకల ద్రౌపదీదేవి అందమైన భావాలతీరు ఈచెడుచరిత్రకల సైంధవునిపాలు కావడంతగునా?"

ఇట్లాఅంటూ ఏడుస్తూఉన్న ధాత్రేయికను ఓదార్చి, ఆ పాండవులయిదుగురూ ఆ క్షణంలోనే సన్నద్ధులైనారు. కోపంఆవేశించడంచేత పెద్దపాములలాగా బుసలుకొట్టినారు. జయద్రథుని వెంటాడినారు. దగ్గరకు చేరినారు. దాడిచేసినారు. అతడిసైన్యంవెనుక ఆక్రోశంగా మాట్లడడంవల్లశోషించి పోతూఉన్న ధౌమ్యుణ్ణి చూచినారు. నమస్కరించినారు. "మీరుఇంక దు:ఖంలేకుండా మెల్లగారండి." అనిచెప్పినారు.

తరువా మాంసంకోసం మూగే డేగలలాగా సైంధవసేనపైవ్రాలి సింహనాదాలు చేసినారు. అప్పుడు పాండవుల రథాలను వారిచిహ్నాలనుచూచి సైంధవుడు, ద్రౌపదితో ఇట్లాఅన్నాడు. "ఈ రథాలమీద వచ్చేవారు అయిదుమందీ నీ భర్తలా? వీరిలో ఎవరు ఏరకంవాడో చెప్పు. నేను తెలుసుకోవలె." ఈ మాటలువిన్న ద్రౌపది, అనాదరంచేతనూ కోపంచేతనూ సైంధవునితో ఇట్లాఅన్నది.

"ఇంక వీరిగురించి తెలిసికొన్నా తెలిసికోక పోయినా నీకు చేయడానికింకొకటేమీ లేదు. దుర్మదం తో మిక్కిలి చెడుగా ప్రవర్తించి, నీవు చేటు తెచ్చుకొన్నావు. అయినా నన్నడిగినావుకాబట్టి చెప్తాను. అంతేకాని నీవల్ల నాకు కొంచెంకూడా భయంకలగడంలేదు. సోదరులతో కూడిన ధర్మరాజును చూచినాను. ఇంక నాకంతా క్షేమమే." అనిచెప్పి, ఇంకాఇట్లాచెప్పింది.

"అదిగో ఆ రథంపై ఉన్నవాడు ధర్మరాజు. అతడు సన్నని గుండ్రని దేహంకలవాడు. స్వచ్ఛమైన బంగారురంగువాడు. వికసించిన పద్మాలవంటి కన్నులుకలవాడు. దేదీప్యమానంగా గొప్పతేజస్సుతో గొప్పగావెలుగొందేగొప్పవాడు. పుణ్యాత్ముడు. యుద్ధంలో శ్రేష్ఠుడు. భయంకరమైనయుద్ధాలలో ఎటువంటిశత్రువునైనా శరణుకోరితే దయతోరక్షిస్తాడు. నీవు చెడిపోకుండా వెంటనే నేను చెప్పినట్లుచేయి. వినయంగా 'ఆ మహాపురుషుణ్ణి ఆశ్రయించు. ఆయన నీ తప్పును క్షమిస్తాడు." అని చెప్పి, ఆ తరువాత భీముణ్ణిగురించి చెప్పడంప్రారంభించింది.

"అదిగో ఆయనే భీముడు. గొప్పవేగం, బలంకలిగిన గుర్రాలనుపూన్చిన బంగారురథంపై ఉన్నాడుచూడు. అతడు గొప్ప దేహంకలవాడు. మద్దిచెట్టులాగా శోభిల్లుతూ ప్రకాశించేవాడు. బొమముడితో పెదవి కొరుకుతూ ఉండేవాయు దేవుడిపుత్రుడతడు. యుద్ధాలలో భయంకరమైనవాడు. ఈతని పరాక్రమం అమానుషమయింది. ఎదిరించవీలుకానిది. బహుముఖమైనది. అద్భుతమైనది. గర్వించినరాజులెవరూ నిజంగా యుద్ధాలలో ఇతణ్ణి ఎదిరించడానికి భయపడతారు. ఈ మహాభుజాలుకలిగిన భీముడు పెద్దగా కోపగిస్తే ప్రళయకాలంలోని అగ్నిలాంటివాడు. ఏ విధంగానూ ఆరిపోడు." అని ఆ తరువాత అర్జునుణ్ణి గురించి ఇట్లా చెప్పింది.

"అదిగోచూడు. అతడేఅర్జునుడు. అతడు ధర్మరాజుకు ప్రియమైనతమ్ముడు. మంచిశిష్యుడు. మంచి ప్రవర్తనకలవాడు. గొప్పదాత. ఇంద్రియాలను జయించినవాడు. చెడుపనులను చేసేవారిని చూస్తే సహించడు. మిక్కిలిభయంకరమైన శౌర్యంచేత శత్రువులనుజయించినవాడు. నిర్మలమైనతేజస్సు కలిగినవాడు. ఎవరికీ జయింపశక్యంకానివాడు. కోరికలు, కోపాలు మొదలైన వికారాలు ఎక్కువగా కలిగినా మనస్సులో ధర్మమార్గానికి దెబ్బతగులనీయనివాడు. ఆతడు ఇంద్రుని కొడుకు. గొప్పతనంలో సాటిలేనివాడు."

"అదుగో అతడునకులుడు. అతడందరికీ మేలుచేసేవాడు. వినయం అలవాటుగాకలవాడు. భయంచేత దీనులైనవారికి ఆశ్రయంఇచ్చేవాడు. అస్త్రప్రయోగంలో నేర్పరి. యుద్ధంలో అందరికీ తెలిసిన పరాక్రమంకలవాడు. మంచివారిపైన, బంధువులపైన, ప్రేమకలిగినవాడు. సాటిలేని అందగాడు. గంభీరమైన మనసుకలవాడు. శుభమైనఆకారం కలిగినవాడు. పుణ్యాత్ముడు. పాండురాజుకుమారులలో రత్నంలాంటివాడు. ఈ భూమిపైన ప్రకాశంచే కీర్తికలిగినవాడు." అనిచెప్పి సహదేవుని గురించి ఇలా చెప్పింది.

"అదిగో ఆ ధీరుడు సహదేవుడు. గొప్ప పరాక్రమంకలిగినవాడు. ఆశ్చర్యకరంగా యుద్ధం చేయగలిగినవాడు. అస్త్రాలన్నీ తెలిసినవాడు. గొప్ప తెలివితేటలుకలిగినమేధావి. మాటలలో నేర్పరి. పాండవులకు ప్రియమైన తమ్ముడు. గొప్పగా ప్రకాశించే రూపంకలవాడు. నిర్వహించడంలో సమర్థత కలిగినవాడు. చిత్తవికారాలు లేనివాడు. మధ్యాహ్నపు సూర్యుడివంటి కాంతి గలిగినవాడు. గొప్పతనంలో దేవతలతో సమానుడు. కొడుకులందరిలో కుంతీదేవికి ఈతనిపై ప్రేమఎక్కువ. ఈ మహాత్ముడు భూమి వణకినా అగ్నిచల్లగాఅయినా, మనసులో తాను ధర్మంలోనే నిష్ఠకలవాడు. ఎన్నడూ సత్యం తప్పనివాడు." ఇట్లాచెప్పి, ఇంకాఇట్లాచెప్పింది.

"వీరు అయిదుమందీ వారించడానికి శక్యంకానివీరులు. వీరి బారినపడితే సముద్రంమధ్యలో భయంకరమైన మొసళ్ళ చేతకొట్టబడి, పగిలే పెద్దఓడవలె, నీ సైన్యమంతా చెదరిపోతుంది. నీవుకూడా ప్రాణాన్నో మానాన్నో పోగొట్టుకోకుండా సులభంగా తప్పించుకొనిపోగలవా ?"

ఆమె అట్లాచెప్తూఉండగానే పాండవులు సైంధవసేనతో తలపడినారు. అన్నివైపులా బాణాల గుంపులను ప్రయోగిండం మొదలుపెట్టినారు. గొప్పపరాక్రమంకలిగిన సైంధవుడు, "ప్రక్కకు కదలకండి. చుట్టుముట్టండి. కొట్టండి. నిలబడండి. పొడవండి" అంటూ తన యోధులను తనతోకలసి పోరాడడానికి పురికొలిపినాడు. వారుయుద్ధ భూమిలో స్థిరంగా నిలబడినారు. ఈ విధంగా త్రిగర్త, శిబి సింధు, సైన్యాలతో అనేకులైన రాజులు తనచుట్టూచేరి ఉండగా జయద్రథుడు నిలబడిఉన్నాడు. అట్లా నిలబడిన జయద్రథుణ్ణి చూచి, భీముడు కోపగించుకొన్నాడు. కనులు ఎర్రబడినాయి. వేగంగా రథందిగినాడు. బంగారుపిడికలిగి ఇనుముతోచేయబడిన గదనుతిప్పుతూ సైంధవునిపైకి దూకినాడు. ఆ భీమునికి అప్పుడు కోటికాస్యుడు అడ్డుపడినాడు. అతడు తనసేనతో ఆ మహావీరుడైన భీముణ్ణి చుట్టుముట్టినాడు. అప్పుడు భీముడు మదగజాలనూ రథికులనూ, పదాతులనూ, గుర్రాలనూ, కలిసిపోయేట్లు ఉత్సాహంతో నేలమట్టం చేసినాడు. వారించడానికి వీలులేకుండా అందరికీ తెలిసిన బలంకలిగిన భీముడు తన గొప్పగదాప్రవీణతను ప్రకాశింపచేసినాడు. ఈ విధంగా యుద్ధభూమిలో వీరవిహారంచేసి శత్రుసైన్యాలు చావగా ఉత్సాహంతో సింహనాదంచేసినాడు. సారథి దగ్గరగాతేగా తిరిగిరథాన్నిఎక్కినాడు. తిరిగి ధనుస్సును తీసుకొని పరాక్రమించినాడు.

ఇక ధర్మరాజుకూడ కోపగించుకొని, పూనికతో శత్రువులను మార్కొన్నాడు. విలువిద్య యొక్క విలాసం అతిశయించగా సౌవీరజాతికిచెందిన నూరుమంది రథికశ్రేష్ఠులను రూపులేకుండా చేసినాడు.

నకులుడు వాడి బాణాల సమూహాలతో యుద్ధభూమిఅంతా భయకరంగా శత్రువీరుల తలలతో నిండిపోయేట్లుచేసినాడు.

వారించడానికి వీలులేని సహదేవుడు, బాణాలవర్షంతో యుద్ధంరంగంలోని ముందుభాగంలో గుర్రాలమీదఉన్నవారిని కూల్చుతూ, వినోదంగా వీరవిహారంచేసినాడు.

'సైంధవునిసైన్యం' అనే సముద్రంలో, అర్జునుడు 'గొప్పమందర పర్వతం'లాగా తిరిగి'శత్రురాజులు' అనే గొప్పజలజంతువుల గుంపులను కుదిపివేయసాగినాడు. శత్రువులనుజయించిన ఇంద్రుని కుమారుడైన అర్జునుడు, తనవిలువిద్యానైపుణ్యం చూపినాడు. ఏనుగులగుంపులు వాటినెక్కినవారితోసహా వశంతప్పివాలిపోతూ భూమిపైకూలినాయి. సూతులూ, గుర్రాలూ, ధ్వజాలూ, రథికులతోసహా రథాలూ, ముక్కలైనాయి. వేగంగా గుర్రాలు రౌతులతోసహావశంతప్పి పడిపోయి అన్నిచోట్లా నేలనుకప్పి వేసినాయి. దట్టంగాపడిపోతూ సమ్మర్దంపెరుగగా కాల్బలాలు అన్నిచోట్లా కూలిపోయినాయి. సందడి కయ్యంపెద్దదైంది. యుద్ధరంగంలో భయంకరమైన రక్తప్రవాహం అధికమైంది. అర్జునుడు ఎడమచేత్తోనూ కుడిచేత్తోనూ మార్చిమార్చి బాణాలు ప్రయోగించిడంచూస్తే కొరివిత్రిప్పినవిధంగా ప్రకాశించింది. అర్జునుని గాండీవము'వాడిఅమ్ములకుగనిఏమో?' అనిపించింది.

ఆ తరుణంలో త్రిగర్తపతి అయిన సుధన్వుడు, గదతీసుకుని రథందిగిపోయి ధర్మరాజు గుర్రాలను కూలద్రోసినాడు. వెంటనే ధర్మరాజువాడి బాణంతో సుధన్వుని రొమ్ముచీల్చి చంపినాడు. ఆ తరువాత వేగంగాపోయి సహదేవుని రథంఎక్కినాడు.

ఇంకా త్రిగర్తులలో 'మహాముఖుడు క్షేమంకరుడు' అనేవాళ్ళు నకులుణ్ణి చుట్టుముట్టినారు. ఆ నకులుడు వారినిద్దరినీ చాలబాణాలతో నొప్పించినాడు. అప్పుడు మహాముఖుడు, క్షేమంకరుని అన్నఅయినసురథుడు, ఏనుగులగుంపుతో పూనుకున్నారు. సురథుడుగర్వితుడై తనశ్రేష్ఠమైన ఏనుగును ఆ పాండవులపైకి ఉసిగొల్పినాడు. ఆ ఏనుగు నకులుని రథపుగుర్రాలనూ పరుషంగా చంపింది. ఆ ఏనుగును చంపడానికి నకులుడు కత్తినీడాలునూ చేతులలోధరించి నేలకుదాటినాడు. ఆ సమయంలో ఏనుగు తిరిగినకులుడిమీదకువచ్చిపడింది. అప్పుడు మహాబలవంతుడైన నకులుడు ప్రక్కకు తప్పుకోకుండా భుజబలంప్రకాశించగా రకరకాలుగా కత్తితోనరకి ఆ గొప్పఏనుగుతొండాన్నీ రెండుదంతాలనూ ఖండించినాడు. ఏనుగు చేష్టలుతప్పి నేలకు ఒరిగింది. దానిపైనున్న సురథుడు భయంతో చేష్టలుడిగినాడు. అట్లాంటి శత్రువును గర్వంతో నకులుడు వెంటనే యముడికి విధేయుణ్ణి చేసినాడు. ఈ విధంగా శత్రువులు

భయపడేట్లుగా పరాక్రమంచూపి వేగంగా పోయి భీమునిరథంఎక్కి ప్రకాశించినాడు. గొప్పవాడైన భీముడు తననుమిక్కిలికోపంతోతలపడిన కోటికాస్యునిగుర్రాలనుచంపి, సూతుని కుత్తుకనరకి, మిక్కిలివాడిఅయినప్రాసంతో కోటికాస్యుని రొమ్ము పగులగొట్టినాడు. సంభ్రమంతో వాని సైన్య సమూహాలు భయంపెరిగి పోగా, పారిపోయినాయి.

ఆ తరువాత సైంధవునిచుట్టూఉన్న పన్నెండుగురు సౌవీరకుమారులు అర్జునుణ్ణిఎదిరించినారు. వారు 'అంగారకుడు, కుంజరుడు, సృంజయుడు, సుప్తకుడు, శత్రుంజయుడు, సుప్రబుద్ధుడు, శుభంకరుడు, భ్రమంకరుడు, శూరుడు, రథీ, హకుడు, బలాఢ్యుడు' అనేవారు. వారందరూ ఇక్ష్వాకు శిబి సైంధవ త్రిగర్త సైన్యాలతో కూడుకొని అర్జునుణ్ణి ఎదిరించినారు. బలమైన అమ్ముల సముదాయాలతో అర్జునుణ్ణి కప్పివేసినారు.

అర్జునునికి మిక్కిలికోపంవచ్చింది. హృదయం మండిపోయింది. భయంకరమైన గాండీవంతో భల్లాల గుంపును ప్రయోగించినాడు. వారి బాణాలన్నింటినీ ఖండించినాడు. ఆ తరువాత సౌవీరరాకుమారుల పండ్రెండుమంది విల్లులనూ నరకినాడు. పరాక్రమం ఎక్కువకాగా వెంటనే చిరునవ్వునవ్వుతూ వారందరి తలలనూ ఖండించినాడు. పొగడబడిన పరాక్రమంకలిగిన అర్జునుడు శైబ్య, ఇక్ష్వాకు, సైంధవ, త్రిగర్త, సేనలను పోనీకుండా ఆక్రమించి, వేగంగా ముక్కలు ముక్కలుగా ఖండించినాడు. అప్పుడు యుద్ధభూమి అంతా శవాలమయమైంది. అందమైన కేయూరాలూ ఇంకాఇతర వీరలాంఛనాలచేత అలంకరించబడినచేతులు ముక్కలుఅయి అన్నిచోట్లా పడిపోయినాయి. రథాలఇరుసుల, చక్రాల, నొగల, జెండాల, ముక్కలు, కత్తుల పరిఘల, శక్తుల, గదల, ముసలాల, పట్టిసాల, ప్రాసాల, చిన్న చిన్న ముక్కలు, ఎక్కడ చూచినా రాసులైపడి ఉండినాయి. 'నెత్తురు' అనేనీటి వెల్లువతో, 'మాంసం' అనేబురదతో, 'వెంద్రుకలు' అనేనాచుతో, కూడిన అపూర్వనదీప్రవాహం ఏర్పడింది. ఆ నదిలో రకరకాలైన మాంసంతినే జంతుపక్షిసమూహాలు మునుగుతూ 'కలకలా'రావాలతో ఆనందంతో విహరించినాయి. ఈ విధంగా 'గాండీవం'అనే గాలిచేత 'మండించబడిన బాణాలు'అనేఅగ్నిజ్వాలతో, 'అర్జునుడు'అనేఅగ్నిహోత్రుడు, ఒక క్షణంలోనే గొప్ప 'సౌవీరసైన్యమ'నే అడవిని కాల్చినాడు.

అట్టి యుద్ధసమ్మర్దంలో జయద్రథుడు ద్రౌపదినిదిగవిడిచి రథంతోలుకొని పరుగెత్తిపారిపోయినాడు. అప్పుడు ధర్మరాజు ధౌమ్యునివద్దఉన్న ద్రౌపదినిచూచి ఆమెను తనరథంమీదకు ఎక్కించుకొన్నాడు. సైంధవుడు పారిపోవడం అర్జునుడు తెలుసుకొన్నాడు. శత్రుసేనను చంపేఉద్రేకంతో ఉన్నభీముడితో ఇట్లా అన్నాడు. "సైంధవుడు సిగ్గువదలి పారిపోయినాడు. తేజోవిహీనమైన ఈ సేనను అనవసరంగా చంపడమెందుకు? ఆ దురాత్ముణ్ణి వెంటాడి ఇప్పుడు ప్రాణాలు తీయవలె. లే లే".

ఈ మాటలువిని భీముడు యుద్ధంచాలించినాడు. ధర్మరాజును చూచి, "అన్నా! ద్రౌపదిని తోడుకొని ధౌమ్యుడూ, మీరూ, నకులసహదేవులూ ఆశ్రమానికి తిరిగిపొండి. మేము వేగంగా సైంధవుని వెనుకనే వెంబడిస్తాము. పాతాళానికి దిగిపోయినా, అద్భుతంగా ఆకాశానికి ఎగిరిపోయినా, శత్రువును చంపకుండా వెనుతిరగము. దేవతలడ్డమైనా చంపుతాము." అన్నాడు.

అందుకు ధర్మరాజిట్లాఅన్నాడు."ఆ దురాత్ముణ్ణి చంపడంతగదు. దుస్సలనుచూచి వాడి ఈ తప్పును క్షమించవద్దా? ధృతరాష్ట్రునిభార్య గాంధారికి దుఃఖం కలిగించవచ్చునా?"

ఈ మాటలువిన్న ద్రౌపది భీమార్జునులతో " ఆ పాపాత్ముని పైన దయచూపవద్దు. తప్పక వాడినిచంపి నాకు సంతోషంకలిగించండి. అట్లాంటి ద్రోహి అన్నిరకాలచంపదగినవాడు." అన్నది.

ఆ తరువాత ధర్మరాజు ధౌమ్యుడు, ద్రౌపది, నకులుడు, సహదేవులతో కూడుకొని తిరిగి ఆశ్రమానికి పోయినాడు.

ఇక్కడ భీమార్జునులు రథాలను వేగంగా తోలుకొని పోయి, క్రోశం దూరంలో సైంధవుని చూచినారు. అప్పుడు అర్జునుడు దూరపాతబాణాలతో జయద్రథునిగుర్రాలనుచంపినాడు. సైంధవుడు ఆందోళనతో రథందిగినాడు. విల్లూ బాణాలూ వదలిపెట్టినాడు. ముఖంపాలిపోయింది. శరీరమంతా చెమటపట్టింది. ఊర్పులు ఎక్కువయినాయి. ఆ పశువులాంటి సైంధవుడు వేగంగా పరుగెత్తినాడు.

జయద్రథునిచూచి భీమార్జునులు, "ఓ పిరికి వాడా! ఇంకెక్కడకు పోతావు? నిలబడు. ఇట్లాంటి పరాక్రమాన్ని నమ్ముకొనియేనా? ఇంతటి ఔద్ధత్యం చేయడానికి పూనుకున్నావు?" అంటూ దగ్గరకు పోయినారు. సైంధవుడు వెనుదిరిగి వారినిచూచి ఒక పొద మధ్యలోనికిదూరినాడు. అదిచూచి భీముడు కోపంతో, పెదవి కొరుతూ, రథంమీదినుండి క్రిందకు దూకినాడు. ఒడిసి సైంధవుని తలపట్టుకొని నేల మీద పడేట్లులాగినాడు. వాడు పెనగబడినాడు. భీముడు సైంధవునిమెడను కాలితోత్రొక్కి కఠినమైన పిడికిటితో పొడిచినాడు. మొగం బద్దలైంది. నెత్తురు వెల్లువగాకారింది. ఒళ్ళంతా పిండితో చేసిన ఆహారంలాగా పొడిచినాడు. పైకెత్తి త్రిప్పినాడు. నేలమీద పడవేసినాడు. రొమ్మునూ ముఖాన్నీ కొట్టినాడు. ఈ రీతిగా గట్టిగా కొట్టగా సైంధవుడు స్పృహకోల్పోయినాడు. అప్పుడు అర్జునుడు, "ఓహో! కొట్టిందిక చాలు ఇంకాకొడితేచస్తాడు. కాబట్టి అన్నమాటలుతలచి వీడిమీద దయచూపు. " అన్నాడు. అప్పుడు భీముడు అర్జునునివైపు చూచి "ధర్మరాజెప్పుడూ దయచూపడంతప్ప మంచిచెడ్డలేమీ ఆలోచించడు. నీవుకూడా ఆయన మాదిరిగానే అమాయకుడివైనావు. ఈ దురాత్ముణ్ణి క్షమించడమెట్లా?" అన్నాడు.

ఆ తరువాత వాడియైన కత్తివంటి నోరుగల బాణం తీసికొని, సైంధవుని తలపై తోలులేచి పోయేట్టుగా గొరిగినాడు. చూచే వాళ్ళందరికీ నవ్వు పుట్టేటట్లుగా తలంతా అయిదుపిలకలుంచినాడు. ఈ విధంగా సైంధవుని రాజువేషాన్నిచెరచి మహాభుజబలశాలియైన భీముడు సైంధవునితో ఇట్లాఅన్నాడు. "ఓరీ! 'బ్రతకాల'నిఉంటే ఈ దినంనుండి అన్నిసభలలో నేను పాండవదాసుడను" అని చెప్తూఉండు.

ఈ మాటలువిన్న సైంధవుడు దెబ్బలకుభయపడి, "అట్లాగే చేస్తాను". అన్నాడు. ఆ తరువాత భీమార్జునులిద్దరూ సైంధవునిచేతులు వెనుకకువిరచికట్టి రథముమీద వేసుకొని ఆశ్రమానికి పోయినారు. ధర్మరాజుకు జరిగినవిషయం విన్నవించినారు. ఇదుగో వీడేపాండవదాసుడు". అన్నారు. అప్పుడు ధర్మరాజు"అట్లాగైతే వీడిని విడిచిపెట్టండి".అన్నాడు. ద్రౌపదికూడా సైంధవునిచూచినవ్వుతూ" ఈ పాపాత్ముడు మీకుదాసుడైనాడు కాబట్టి వీడినివిడిచిపెట్టండి". అనిచెప్పి విడిపించింది.

సైంధవుడు ధర్మరాజుకు ఇంకా అక్కడఉండేమునులకు మ్రొక్కినాడు. అప్పుడు ధర్మరాజు సైంధవుడితో ఇట్లాఅన్నాడు. "ఈ భూమిమీద నీవుతప్ప ఎట్లాంటి దుష్టుడుఅయినా ఇట్లాంటిపాపం చేయడానికి పూనుకొంటాడా? ఇంకపో. ధైర్యంలేనివాడవు, ఇంద్రియలోలుడవు, అయిన నిన్నుఏమని తిట్టగలను? ఇంకఎవరికీ ఇట్లాంటి చెడ్డపనులు చేయకుండా బుద్ధిమంతుడవైఉండు."

ఈ మాటలువిని సైంధవుడు సిగ్గుచేత ముఖందించుకొని, ఆ స్థలంవదలి గంగానది సముద్రంతో సంగమించే స్థలానికి పోయినాడు. అక్కడ శివుణ్ణిగురించి భక్తితోతపస్సుచేసినాడు. శివుడు సూర్యుడు ఆరాధించిన పద్మాలవంటి పాదాలుకలిగినవాడు. జగత్తుకంతా ఒకేఅధిపతి అయినవాడు. మూడులోకాలకు మూలమయినవాడు. మన్మథుని కాల్చివేసినవాడు. పార్వతికి సంతోషంకలిగించడమే ఇష్టమయినవాడు. అట్టిశివుణ్ణి మనసులో నిలుపుకొని, గొప్పదీక్షతో కాలిబొటనవ్రేలుమాత్రమే నేలమీదమోపి తపస్సు చేసినాడు.

ఆ సైంధవుడికి ఈశ్వరుడు ప్రేమతోప్రత్యక్షమైనాడు. " నీకిష్టమయింది కోరుకో " అన్నాడు. అప్పుడు సైంధవుడు శివుడికి వంగినమస్కారముచేసినాడు. "పరమేశ్వరా! పరాక్రమవంతులైన పాండవుల నయిదుగురినీ సైన్యంతోసహా యుద్ధంలో పూనుకొని జయించేట్లు వరంఅనుగ్రహించు". అన్నాడు.

అందుకు ఈశ్వరుడు, "ఇదిసాధ్యమైనపని కాదు. ఇంద్రుడుమొదలైన దేవతలకుకూడ యుద్ధంలో పాండవులను జయించడం సాధ్యంకాదు. వినలేదా? అయినా ఎట్లాగైనా నీకోరిక తీర్చవలెకదా ? అర్జునుడు ఒక్కడుతప్ప అతిపరాక్రమం కలిగినమిగిలిన నలుగురుపాండవులను నిజంగాఒకనాటి యుద్ధంలోగెలువు. లోకాలన్నీ ఏకమైనా తననుజయించలేని పరాక్రమం కలిగినవాడు అర్జునుడు. వాడిని ఎదిరించి యుద్ధంలో జయించడం నాకుకూడా చాలాకష్టమైనపని. నిజమే చెప్పినాను సుమా ! వాడికింతటి ప్రభావం నాదయవల్లనే

కలిగింది. అంతే కాకుండా, వాడు సమస్తశస్త్రాస్త్రవిద్యలు తెలిసినవాడు. ఓటమినెరుగని కీర్తి కలిగినవాడు. అన్నింటికి అధిపతిఅయినవిష్ణుడు అతనికి ఇష్టమైన స్నేహితుడుకదా? అటువంటి వీరుణ్ణి గెలవడం నీకుశక్యమా?" అనిచెప్పి ఈశ్వరుడు అంతర్ధానమైనాడు. సైంధవుడు తిరిగితనదేశంచేరినాడు.

**తరువాతి కథ :** ఆ తరువాత కౌరవపాండవులకు కురుక్షేత్రంలో యుద్ధంజరిగింది. అందులో సైంధవుడు తనబావ దుర్యోధనుని (కౌరవుల) వైపు యుద్ధంచేసినాడు. ద్రోణునిమూడవనాటియుద్ధంలో సంశప్తకులు పిలువగా అర్జునుడు ప్రధాన యుద్ధభూమినుండి ప్రక్కకుపోయి వారితో యుద్ధంచేస్తూఉండినాడు. ద్రోణుడు ధర్మరాజును బంధించదలచి పద్మవ్యూహాన్ని రచించినాడు. పాండవసేనలో కృష్ణార్జునులుతప్ప ఆ వ్యూహాన్ని ఛేదించగలిగినవారు లేరు. సుభద్రాసుతుడు అభిమన్యుడికి ఆ వ్యూహాన్ని ఛేదించడం తెలుసుకానీ సేనచుట్టుముట్టితే తిరిగి బయటకురావడంతెలియదు. ధర్మరాజు అభిమన్యుణ్ణి 'ఆ వ్యూహాన్ని ఛేదించమ'నగా ఆ సంగతిని ధర్మరాజుకు తెలియచేసినాడు. అప్పుడు భీమాదులు అభిమన్యునితో, "నీవు పద్మవ్యూహపు మొన కొంచెంచించితే, మేమంతా నీవెంటే చీల్చుకొనివస్తాము. అప్పుడు వ్యూహమే పూర్తిగా నాశన మవుతుంది. ఇబ్బందేమీ ఉండదు" అనిచెప్పి ప్రోత్సహించినారు. అభిమన్యుడు వ్యూహాన్నిఛేదించి లోపలకుపోయినాడు. కానీ భీమాదులెవరూలోనికి పోకుండా ఈశ్వరవరప్రభావంతో సైంధవుడు అడ్డగించినాడు. కౌరవవీరులందరూ చేరి ఒంటరియైన అభిమన్యుణ్ణి చంపివేసినారు. ఆ రాత్రి ఆ సంగతి తెలియగానే అర్జునుడు మరుసటిదినం సూర్యాస్తమయంలోపల 'సైంధవుణ్ణి చంపుతాన'ని ప్రతిజ్ఞ చేసినాడు. ద్రోణుడూ కర్ణుడు కృపుడూ అశ్వత్థామ, శల్యుడు దుర్యోధనుడు దుశ్శాసనుడూ మొదలైన వారంతా ఎంత ప్రయత్నించినా ఆ సైంధవుణ్ణి ఆనాడు కాపాడలేకపోయినారు.

చ. పాపవినిశ్చయుండు సతిపయ్యెదకొంగు గడంగి పట్టినం,
గోపముతో నుదల్చికొని కోమలియున్ వెస వాని ద్రోయుడుం,
బోపడి వాడు చిత్రముగ భూమితలంబునఁ ద్రెళ్ళె, మారుత
క్షేపవిభగ్నమూలమయి చెచ్చెరఁ ద్రెళ్ళు మహీరుహంబునాన్. 6-190

చ. విజయుఁ డొకండు తక్కనతివీరులఁ బార్థుల నున్న నల్వురన్
నిజ మొకనాఁటి కయ్యమున నీవు జయింపుము; ఫల్గునుండు స
ర్వజగదజయ్యు విక్రముఁడు; వానినెదుర్కొని నాకు నైనఁబో
ర జితునిఁ జేయుటెంతయు భరంబగు; నిక్కము వల్కితిం జుమీ ! 6-257

# 46. రామాయణము.

**(అరణ్యపర్వం షష్ఠాశ్వాసము 268 నుండి సప్తమాశ్వాసం167పద్యం వరకు.)**
**(పాండవుల అరణ్యవాసకాలంలో ధర్మరాజుడుగా మార్కండేయుడు చెప్పిన కథలలో ఇదిఒకటి.)**

లోకాలన్నింటిని, సృష్టించే బ్రహ్మదేవునికి చాలామంది మానసపుత్రులున్నారు. అందులో పులస్త్యుడొక్కడు. ఆ పులస్త్యుడికి 'వైశ్రవణుడు'అనే పేరుగలకొడుకు పుట్టినాడు. అతనికే 'కుబేరుడు' అనే ఇంకొకపేరుకూడా ఉండేది. ఆ వైశ్రవణుడు తనతండ్రి పులస్త్యుణ్ణి అలక్ష్యంచేసి తాత బ్రహ్మదేవుణ్ణి గురించి తీవ్రమైనతపస్సు చేసినాడు. బ్రహ్మదేవుడు ప్రసన్నుడై అతడికి కోరినవరాలను ఇచ్చినాడు. ఆ వరాలవల్ల ఆ వైశ్రవణుడు 'నలకూబరుడ'నే కొడుకునుకన్నాడు. లోకపాలకత్వాన్నికూడ పొందినాడు. 'ధనేశ్వరుడయి'నాడు. లంకా నగరాన్ని సంపాదించుకొన్నాడు. ఇంకాశంకరుడితోటి స్నేహాన్నికూడా సాధించినాడు. ఆ విధంగా వరాలుపొంది వైభవంగా ఉండినాడు.

తనను అలక్ష్యము చేసిన కొడుకు వైశ్రవణుడిపైన పులస్త్యుడికి కోపంవచ్చింది. తన శరీరంలోని సగభాగంతో 'విశ్రవసుడ'నే వాడిని సృష్టించినాడు. ఆ విశ్రవసుడిని వైశ్రవణుడికి 'కీడుచేయుమ'ని పంపినాడు. ఈ విషయం వైశ్రవణుడికి తెలిసింది. భయంకలిగింది. వెంటనే విశ్రవసుడిదగ్గరకు వచ్చినాడు. "మహాత్మా! నీవు పులస్త్యుడిలో సగభాగానివి. కాబట్టి నిన్ను ఆ విధంగా పూర్తిగా పులస్త్యుడిగానే భావించవచ్చు. అందువల్ల నేను నీ పుత్రుడను. నీకు పుత్రుడుగానే నడచుకుంటాను. మిమ్మల్ని గౌరవిస్తాను. పూజిస్తాను. నామీద దయచూపండి." అని ప్రార్థించి విశ్రవసుడి అనుగ్రహాన్ని సంపాదించినాడు. అంతేకాకుండా పుష్పోత్కట,మాలిని, బక, అనేముగ్గురు రాక్షసస్త్రీలను ఆయనకు పరిచారికలుగా* సమర్పించినాడు. వారు నృత్యంలోనూ గానంలోనూ ఆరితేరినవారు. ఆయన ఆ ముగ్గురు పరిచారికలతో గంధమాదన పర్వతానికిపోయి తపస్సుచేసుకుంటూఉండిపోయినాడు.

ఆ ముగ్గురు రాక్షసస్త్రీలు ఒకరినిమించి మరియొకరు, బాగా పరిచర్యలుచేసి ఆ తపస్వి విశ్రవసుడిని సంతోషింప చేసినారు. ఆయన సంతోషించి ఆ ముగ్గురికీ పుత్రదానం చేసినాడు. పుష్పోత్కటకు 'రావణుడు కుంభకర్ణుడు' అనే ఇద్దరుకొడుకులు జన్మించినారు. మాలినికి 'విభీషణుడ'నే కొడుకుపుట్టినాడు. బకకు 'ఖరుడ'నే పుత్రుడు, 'శూర్పణఖ' అనేపుత్రిక, కవలలుగా జన్మించినారు. ఆ నలుగురు కుమారులకూ తండ్రివిశ్రవసుడు జాతకర్మలు జరిపించినాడు. గౌరవంగా ఉపనయనాలుకూడా చేయించినాడు.

---

* విశేషము : 'పరిచారిక' అంటే ఇక్కడ సేవలు చేసే స్త్రీ అని మాత్రమే కాదు. ఆమె అతనిని శృంగార విషయంలో కూడా తృప్తిపరచవలసి ఉంటుంది. అయినా ఆమెకు ధర్మపత్ని స్థాయి మాత్రముండదు. ఉంపుడు కత్తెతో మాత్రమే సమానురాలు.

వారిలో రావణుడు పదితలలుకలిగినవాడు. గొప్పప్రకాశవంతుడు. మిక్కిలిబాహుబలం కలిగినవాడు. **లోకభయంకరుడు.** పేరుపొందిన శౌర్యంకలవాడు. ఎల్లప్పుడూ కోపంగాఉండేవాడు. కుంభకర్ణుడుకూడా రావణుడిలాంటివాడే. అంతేకాదు. చెడుగర్వంకలిగినవాడూ, మహాక్రూరుడూ, భయంకరమైన మహాకాయంకలిగినవాడూకూడా. విభీషణుడు భయంలేనివాడు. పూజింపదగినవాడూ, మంచి మనస్సుకలవాడూ. ఖరుడు సూర్యునివంటితేజస్సుకలిగినవాడూ, బ్రాహ్మణులను అవమానించేవాడూ, మాంసంతినేవాడూ, రక్తాన్నితాగేవాడూ, కఠినమైనమనస్సుకలవాడూకూడా. ఇకపోతే శూర్పణఖ పాపచరిత్ర కలిగినది. ఎప్పుడూ ధర్మకార్యాలను చెడగొట్టేది.

ఆ రాక్షసకుమారులు నలుగురు. తండ్రివద్ద వేదవేదాంగాలన్నీ నేర్చుకొన్నారు. ధనుర్వేదంలోకూడా నిపుణులైనారు. అట్లా విద్యాభ్యాసంచేస్తూ వారందరూ తండ్రివద్దనే గంధమాదనపర్వతంపై సుఖంగా ఉండినారు. ఒకనాడు అక్కడకు వైశ్రవణుడువచ్చి విశ్రవసుడికి నమస్కరించినాడు. అప్పుడానలుగురు వైశ్రవణుడి వైభవాన్నిగమనించినారు. ఆ వైభవమంతా అతనికి 'తపస్సువల్ల లభించింద'ని విన్నారు. వారికి అసూయకలిగింది. వెంటనే వాళ్ళుకూడా బ్రహ్మదేవుని గురించి తపస్సుచేయడం ప్రారంభించినారు.

రావణుడు వేసవిలో ఐదుఅగ్నులమధ్యలోనూ, వానాకాలము బయలుప్రదేశంలో వానలోనూ, మంచుకురిసే కాలంలో నీళ్లలోనూ, నిశ్చలంగా నిలబడి గాలినిమాత్రమే ఆహారంగాస్వీకరిస్తూ తపస్సు చేసినాడు.

కుంభకర్ణుడు ఆహారనియమాలను పాటించినాడు. ఇంద్రియాలను నిగ్రహించినాడు. భూమి మీదనే నిద్రిస్తూ వ్రతాలుచేస్తూ తపస్సుచేస్తూఉండినాడు.

విభీషణుడుఆకులు మాత్రమేతింటూ జపాలుచేసినాడు. వేదాన్ని అధ్యయనము చేసినాడు. నిర్మలమైన మనస్సుతో తపస్సుచేస్తూఉండినాడు.

ఖరుడూ, శూర్పణఖా తపస్సుచేసే తమసోదరులకు సేవలుచేస్తూ కాలంగడపినారు.

ఆ విధంగా ఆ ముగ్గురూ వెయ్యిసంవత్సరాలు తపస్సుచేసినారు. బ్రహ్మదేవుడు ప్రసన్నుడు కాలేదు. అప్పుడు రావణుడు తనతలనొకదాన్నినరకి మండేఅగ్నిలో ఆహుతిచేసినాడు. ఆ విధంగా ఆ తపస్సు సాగింది. కాని బ్రహ్మదేవుడు ప్రసన్నుడుకావడంలేదు. ప్రతి వెయ్యిసంవత్సరాల కొకసారి ఒకతల చొప్పున రావణుడు తొమ్మిది తలలనునరకి ఆహుతిచేసినాడు. పదివేలసంవత్సరాలు పూర్తికాగానే మిగిలిన పదవతలనుకూడా నరకడానికిపూనుకున్నాడు. అప్పుడు బ్రహ్మదేవుడు ప్రత్యక్షమైనాడు. రావణుడు తనపదోతలను నరకుకోకుండా ఆపినాడు. వాడికి ఎప్పటిలాగానే పదితలలు ఉండేటట్లుచేసి నాడు. "చావులేకుండా ఉండడంతప్పనీకిష్టమైన వరం ఏదైనా అడుగు. ఇస్తాను." అన్నాడు.

అప్పుడు రావణుడు "దేవా! దేవతలు, పిశాచులు, దైత్యులు, పన్నగులు, గంధర్వులు, రాక్షసులు విద్యాధరులు, యక్షులు, కూడా నన్ను కలతచెందించలేనివారుగా ఉండవలె. వేడుకగా ఈ విశ్వమంతటా కోరినరూపంతో కోరినవిధంగా నేను తిరగగలిగేట్లు వరమివ్వు" అన్నాడు. దయతో బ్రహ్మదేవుడు ఆ వరమతనికిచ్చినాడు. "మనుష్యజాతి ఒక్కదానితోతప్ప నీవుచెప్పిన అందరిలో ఎవరివల్లకూడా నీకుచావు భయంలేదు." అనికూడాచెప్పినాడు.

ఆ తరువాత బ్రహ్మదేవుడు కుంభకర్ణుణ్ణిచూచి, "వరమడుగు" అన్నాడు. దురదృష్టవశాత్తూ ఆ కుంభకర్ణుడు తనకు 'అధికనిద్ర వరంగాకావాల'నికోరినాడు. "అట్లేఅవుతుంది." అని బ్రహ్మదేవుడు అనుగ్రహించినాడు

పిమ్మట బ్రహ్మదేవుడు విభీషణుని కెదురుగానిలబడినాడు. విభీషణుడు చేతులుజోడించి బ్రహ్మదేవుణ్ణి ప్రస్తుతించినాడు. "ఎంతకీడుకలిగినా నామనసు పాపానికి పాల్పడకుండాఉండవలె. ప్రకాశించే బ్రహ్మాస్త్రాన్ని అనుగ్రహించండి" అని కోరినాడు. బ్రహ్మదేవుడు విభీషణునికి ఆ వరమిచ్చి ఇంకాఇట్లాఅన్నాడు". కుమారా! రాక్షసవంశంలో జన్మించికూడా 'ఎప్పుడూ ధర్మబుద్ధికలిగిఉండాల'ని అనుకోవడం ఆశ్చర్యంగాఉంది. కాబట్టి నీ మీదదయతో నీవు చావకుండా స్థిరంగా ఉండేటట్లుగా అనుగ్రహించినాను. ఇట్లాచెప్పి బ్రహ్మదేవుడు అంతర్ధానముఅయినాడు.

వరగర్వంతో గొప్పవాడైన రావణుడు ఎదురులేని పరాక్రమంతో వైశ్రవణుడి లంకానగరం పై దాడిచేసినాడు. వైశ్రవణుడు ఈ విషయం తెలుసుకొన్నాడు. చేయవలసినపనిని మనసులో ఆలోచించు కొన్నాడు. యుద్ధంచేసినా బ్రహ్మవరప్రభావంకలిగిన 'రావణుని జయించడం సాధ్యం కాద'నుకొన్నాడు. అందుచేత యుద్ధ సన్నాహాలేమీ చేయలేదు. తన ప్రజలైన కింపురుషులు యక్షులతో పాటుగా తత్తరపాటుతో పుష్పకవిమానంపై లంకానగరాన్నివదలి పారిపోయినాడు. ఈ విధంగా వైశ్రవణుడు గంధమాదన పర్వతానికి పారిపోతూఉండగా, రావణుడు అతడిని వెంబడించినాడు. ఆ వైశ్రవణుని మానాన్నీ విమానాన్నీ కూడా అపహరించినాడు. అప్పుడు యక్షేశ్వరుడైన వైశ్రవణుడు కోపగించుకొని, "పెద్దవాడనైన నన్ను అవమానించినావు కాబట్టి ఈ విమానం నీ శత్రువులపాలవుతుంది." అని శపించినాడు .

ఇదంతా చూచినారు రాక్షసులూ ఖేచరులూ. వారు ఆ రావణుడే తమకు 'సరిఅయిన నాయకుడ'ని నిర్ణయించుకొన్నారు. వారి నాయకులు రాక్షసమాయ ప్రయోగంలో దక్షుడైన రావణుణ్ణి రాక్షససామ్రాజ్యాన్ని కాపాడే సార్వభౌమునిగా ప్రేమతోపట్టాభిషిక్తుణ్ణి చేసినారు. రావణుడుకూడా బలపరాక్రమాలతో విజృంభించినాడు. పూని ఇంద్రుడుమొదలైన దేవతలనందరనూ జయించినాడు. వారివారిస్థానాలను

తానాకమించినాడు. ఎక్కువ అసూయతో లోకమంతా బాధలతో అరచేట్లుగా చేయడంచేత 'రావణుడు'అనే పేరు అతనికి సార్ధకమయింది. 'రావణుడంటే అరచేట్లు చేసేవాడు' అనే అర్ధాన్ని అతడు సార్ధకం చేసుకొన్నాడు. సర్వభూతాలకు భయంకలిగించేవాడయినాడు. అప్పుడు దేవఋషులు రాజఋషులు కలిసిపోయి ఆ రావణుడు కలిగించే ఉపద్రవాలనుగురించి అగ్నిదేవునితో మొరపెట్టుకున్నారు. ఆ అగ్నిదేవుడు వారందరనూ తీసుకొని బ్రహ్మదేవుని దగ్గరకుపోయి ఇట్లాఅన్నాడు.

"విశ్రవసుపుత్రుడైన రావణుడు గొప్పభుజబలంకలిగినవాడు. పరాక్రమంచేత ఎదురులేనివాడు. వరప్రభావం కలిగినవాడు. వాడు రాక్షసులందరకూ సార్వభౌముడు అయినాడు. అట్టిరావణుడు భయంకరంగా మూడులోకాలను బాగాపీడిస్తున్నాడు. దేవేంద్రుడుమొదలుకొని దేవతలంతా వాడికిసేవకులైనారు. రావణుడిచేత కష్టాలుపడి దీనులమై ఉండలేకపోతున్నాము. 'నీ పాదపద్మాలే శరణ్యమ'ని ఇక్కడకు చేరినాము. దయనిండిన మనస్సుతో మమ్మల్నెట్లాగైనా తగినట్లుగా స్వీకరించు. ఓ బ్రహ్మదేవా! మమ్మల్ని రక్షించినా రక్షించకపోయినా ఎక్కడైనా ఎప్పుడైనా నీవేకదా మాకుదిక్కు?"

ఈ మాటలువిని బ్రహ్మదేవుడు వారితో ఇట్లాఅన్నాడు. "ఈ విషయం నేనుముందుగానే ఆలోచించినాను. తగిన ఉపాయాన్నికూడా నిశ్చయించినాను. ఈ విషయమై నారాయణుణ్ణి ఇదివరకే ప్రార్ధించినాను. ఆ దేవుడు 'మనుష్యుడుగాజన్మిస్తాన'న్నాడు. ఆ రావణుణ్ణి తానుచంపడానికి పూనుకొన్నాడు. ఇంద్రుడు మొదలైనదేవతలుకూడా తమతమ అంశలలో కోతులుగా, ఎలుగుబంట్లుగా, పుట్టండి. రావణుడికి మనుష్యులు కోతులు ఎలుగుబంట్లతో కీడులేకుండా నేను వరమివ్వలేదు. కాబట్టి మీకింక ఏ భయము అక్కరలేదు." ఇట్లాఅన్న తరువాత బ్రహ్మదేవుడు వారిఎదురుగానే 'ధుంధుభి' అన్న గంధర్వకాంతను పిలిచినాడు. "నీవు గూనిఆకారంతో 'మంధర'అనేపేరుతో భూలోకంలోపుట్టు. నీకు చేతనైనట్లుగా దేవతలపనిని నెరవేర్చు" అని ఆజ్ఞాపించినాడు. ఆ తరువాత అగ్నితోపాటుగా ఆ ఋషులందరికీ వీడ్కోలు చెప్పినాడు.

ఒక్కొక్కరు పదివేలఏనుగులబలంతో ఎలుగుబంట్లుగానూ, కోతులుగానూ, దేవతలందరూ అన్నిచోట్లా జన్మించినారు. వారంతా కొండలలాంటి శరీరాలుకలిగినవారు. భయంకరమైన భుజబల పరాక్రమాలు కలిగినవారు. మంచిగుణాలు కలిగినవారు. ప్రళయకాలంలోని యముడిలాగా భయంకర మైనవారు. యుద్ధనైపుణ్యం కలిగినవారు. గొప్ప దర్పంకలవారు.

అదేకాలంలో 'దశరథుడ'నేరాజు అయోధ్యను పరిపాలిస్తూ ఉండేవాడు. ఆయన ఇక్ష్వాకు వంశంలోని అజునికుమారుడు. ఆ దశరథునికి ముగ్గురుభార్యలు. ఆయనకు చాలాకాలము సంతానము కలుగలేదు.

అందుకని ఆయన పుత్రకామేష్టియాగం చేసినాడు. ఆ యజ్ఞఫలంగా దశరథుడు కౌసల్యయందు రాముణ్ణి, కైకేయియందు భరతుణ్ణి, సుమిత్రయందు 'లక్ష్మణ, శత్రుఘ్నులు' అనే కవలపుత్రులను పొందినాడు.

అట్లా దశరథుడు తానుచేసుకొన్న పుణ్యంవల్ల రామ, భరత, లక్ష్మణ, శత్రుఘ్నులనే నలుగురు పుత్రులను పొందినాడు. దాంతో తనకు మూడులోకాలూ లభించినట్లు సంతోషించినాడు. ఆ కుమారులకు జాతకర్మలు ఉపనయనాలు క్రమంగా జరిపించినాడు. కుమారులు వేదవేదాంగాలను అధ్యయనంచేసినారు. ధనుర్వేదాన్ని సంపూర్ణంగా అభ్యసించి అందులో నిపుణులైనారు. అందరూ వివాహాలుకూడా చేసుకొన్నారు. అందులో రాముడు విదేహ రాజపుత్రి అయిన సీతను వివాహం చేసుకొన్నాడు.

రాముడు అపుడేవికసించిన తామరపూరేకులవంటి కనులుకలవాడు. విశాలమైన వక్షస్థలం కలిగినవాడు. మోకాళ్ళవరకుసాగిన చేతులుకలవాడు. తియ్యటిచిరునవ్వులుచిందించే ముఖంకలవాడు. మదించినఏనుగులాంటి నడకకలిగినవాడు. అపుడే యౌవనంలోనికి అడుగిడినవాడు. అందమైన తేజస్సు కలిగినవాడు. సిరికళతో అందమైనవాడు. పేరొందినకీర్తితో శోభించేవాడు. సమస్తవిద్యలూ, వేదవేదాంగాలూ, నిపుణంగా తెసినవాడు. ఇంద్రునితో సమానమైవాడు. ఇంద్రియాలను జయించినవాడు. ధర్మాలన్నీ చక్కగా తెలిసినవాడు. పౌరులచేత బంధువులచేత ఎల్లప్పుడూ పూజించబడేవాడు. దుష్టశిక్షణాశిష్టరక్షణా చేయ గలిగినవాడు. రఘువంశాన్ని పావనం చేయగలిగినవాడు. అట్లాంటి పెద్ద కొడుకును దశరథుడు మిక్కిలి ప్రేమగా చూచుకొనేవాడు. మిగతా ముగ్గురు కొడుకులు కూడా తమఅన్నరాముణ్ణి అమితంగా ప్రేమించేవారు. గౌరవించేవారు. ఎన్నడూ ఆయనమాటను మీరేవారుకారు.

దశరథుడు రాముణ్ణి యువరాజపదవికి అభిషేకించదలచినాడు. ఆప్తులైన మంత్రులందరకూ తెలిపి వారిసమ్మతిని తీసుకొన్నాడు. పురోహితులు శుభదినాన్ని నిశ్చయించినారు. ఆ శుభదినాన ఆ కార్యం చేయడానికి పూనుకొన్నాడు. భరతుడిదాది మంథర ఈ విషయంవిన్నది. ఆమె బ్రహ్మచేత దేవతలపని మీదపంపబడిన గంధర్వకాంతకదా? ఆమె రాముడిని అడవులకు పంపడానికిదే 'తగినసమయమ'నుకొన్నది. రాముడు అడవికి పోతేకాని రావణుడుచావడు. అందుకే ఆమెవేగంగా కైకేయివద్దకు పోయి ఇట్లాఅన్నది. "అయ్యో! నీపైన నీ భర్తకుఉన్నది కపటమైనప్రేమమాత్రమే. ఆ కపటప్రేమను నీవు 'నిజమ'నుకొని మనసులో మోసపోయినావు. ఆ టక్కరివాడైన దశరథుడు కౌసల్యమీది ప్రేమతో అదిగో ఆమెకుమారుడురాముడికి మిక్కిలిప్రేమతో యువరాజుగా పట్టంకట్టడానికి పూనుకొన్నాడు. ఏమి చెప్పమంటావు? కైకేయీ దేవీ! రాజు మనసుకుదూరమైనావు. నీ కొడుకును దూరంగా పారేసి, నీ సవతికొడుకే ఇకమీదట రాజ్యమేలుతాడు."

ఇట్లాఅన్న మంధరమాటలువిని కైకేయి అదరిపడింది. మిక్కిలి తత్తరపాటుతో తత్‌క్షణమే దశరథుని వద్దకుపోయింది. ఆయనతో ఏకాంతంలో ప్రేమపూర్వకంగా ఇట్లాఅన్నది. "రాజా! పూర్వం నీవు నాకు అనుగ్రహించిన ఒకవరంఉంది. అది మనస్సులోఉంచుకొని ఆ వరాన్ని ఇప్పుడుఇవ్వు. సత్యవ్రతాన్ని పాటించు."

ఆమె మాటలువిని, దశరథుడు ఇట్లాఅన్నాడు. "చంపదగనివారిని చంపడం, చంపదగిన వారిని రక్షించడం, బ్రాహ్మణుడి ధనాన్నపహరించడం తప్ప, ఎట్లాంటి పనులైనా చేస్తాను. ఇతరుల ధనాన్ని అపహరించడం, కోరిన ధనాలను దానంచేయడం మొదలైనపనులను అవిఎంతటికష్టమైనవైనాసరే, నీకు ప్రియంగాచేస్తాను. ఏంచేయాలో? చెప్పు."

ఈ మాటలువిని భరతునితల్లి కైకేయి సంతోషించి ఇట్లాఅన్నది. "రాజా! యువరాజపదవిలో భరతుణ్ణి అభిషేకించు. రాముణ్ణి పదునాలుగు సంవత్సరాలు 'అడవులలో ఉండమ'ని ఆజ్ఞాపించు. అదే నాకు గొప్పవరం."

ఈ మాటలువినగానే దశరథునికి చెవులు కొరివితోకాల్చినట్లుఅయింది. గట్టిగా పిడుగు దెబ్బతిన్నట్లుగా స్పృహతప్పి నేలమీదపడినాడు. ఇదంతా తెలుసుకొన్నాడు రాముడు. తండ్రి సత్యవ్రతానికి హాని 'కలుగకూడద'నుకొన్నాడు. ఆ క్షణమే సీతతోకలసి అడవులకుబయలుదేరినాడు. అతనివెంట లక్ష్మణుడుకూడా బయలుదేరినాడు.

రాముడు అడవులకు పోవడంవిన్న దశరథుణ్ణి పెరిగిన 'శోకమ'నే అగ్నికాల్చివేసింది." హారామా! గుణధామా!" అనిఅరుస్తూ దశరథుడు ప్రాణాలువదలినాడు. ఈ విధంగా దశరథుడు మరణించగా కైకేయి తనకొడుకు భరతుణ్ణి పిల్చింది. అతనితో, "రాజుమరణించినాడు. రాముడేమో అడవులకు పోయినాడు. ఇంక రాజుకావడానికి కావలసిన అర్హతలుకలవాడవు నీవే. కాబట్టి పట్టాభిషిక్తుడవు కా. రాజ్యాన్నంతారక్షించు." అన్నది.

ఆ మాటలకు భరతుడు కోపంచేతనూ, శోకంతోనూ, కాలిపోతూ తల్లితో, "పాపాలు లేకుండా ప్రకాశించే సూర్యవంశానికి మాలిన్యం కలిగించినావు. ఇంద్రునితో సమానమైనవాడూ మిక్కిలిధర్మాత్ముడూ అయిన భర్తను మ్రింగుకున్నావు. దయలేకుండా పొడవైనచేతులుకలిగి, వర్చస్సుకలిగి, ధైర్యవంతుడైన మా అన్నను అడవులపాలుచేసినావు. ఆయన మాకందరకు ఎంతటి ప్రీతిపాత్రుడో నీకు తెలియదా? నీవు దుర్మార్గురాలవై వదలించుకోలేని అపకీర్తిని నా నడినెత్తిన పెట్టినావు. సంపదకొరకై సమస్తజగత్తు చేత తిట్లుతిని నీకోరికతీర్చుకున్నావు. పాపజాతురాలా ! ఈ నీపాపం నన్నేమైనా చేయగలుగుతుంది. నేను ఇంకేమి చేయవలె?" అంటూ మిక్కిలిదుఃఖించినాడు.

ఎట్టకేలకు భరతుడు దుఃఖమునుండి తేరుకున్నాడు. తండ్రికి అంత్యక్రియలు పూర్తిచేసినాడు. ఆ వెంటనే మంత్రులు, సామంతులు, బ్రాహ్మణులు, పౌరులు, జానపదులు, వీరందరతోకలిసి కదలినాడు. ముగ్గురు తల్లులను వసిష్ఠ వామదేవులను ముందుంచుకున్నాడు. తాను తమ్ముడు శత్రుఘ్నునితో పాటుగా రాముణ్ణి ప్రసన్నుణ్ణి చేసుకోవడానికి చిత్రకూటపర్వతానికి పోయినాడు.

చిత్రకూటపర్వతంపైన భరతుడు రాజశ్రేష్ఠుడైనరాముణ్ణి దర్శించినాడు. ఆ రాముడు అతి సుకుమారంగా ఉన్నాడు. నీలమేఘంవంటిరూపంతో ఉన్నాడు. శిరోజాలు జడలుకట్టిఉన్నాయి. నార బట్టలూ జింకచర్మాలూ ధరించిఉన్నాడు. తెల్లనివిభూతిని పూసుకొనిఉన్నాడు. పద్మాలవంటి కన్నులు కలిగిఉన్నాడు. ఆ రాముడు మంచివాడిగా కీర్తింపబడేవాడు. మరియు కాకుత్స్థవంశాన్ని వెలుగొంద చేసే వాడుగాఉన్నాడు. అప్పుడు సీతా లక్ష్మణులతో కలిసిఉన్నాడు. ఉత్తమఋషులచే పూజింపబడుతూ ఉన్నాడు. దయనే ఆభరణంగా కలిగిఉన్నాడు.

అట్లాంటి రాముణ్ణిచూచి భరతుడు ఏడుస్తూపోయి ఆయనకాళ్లమీదపడినాడు. తండ్రి మరణ వార్తను తెలియచేసినాడు.“ దేవా! సామ్రాజ్యాన్నంతటినీభరించి మమ్మందరనూ ఏలుకోవా ?” అని ప్రార్థించినాడు. రాముడు పితృవాక్య పరిపాలనలోలగ్నమైన మనస్సుకలవాడు. అందువల్ల భరతుడు ఎన్నివిధాలుగా ఎంతగా బ్రతిమలాడినా, రాముడు రాజ్యపాలనకుఅంగీకరించలేదు.

రాముడు నచ్చచెప్పి భరతుణ్ణిత్రిప్పి పంపినాడు. భరతుడు తిరిగిపోతూ రాముడిపాదుకలు తీసుకొనిపోయినాడు. భరతుడు అట్లా తిరిగిపోయి, అయోధ్యకు పోకుండా అయోధ్య సమీపంలోని నంది గ్రామంలో నిలిచిపోయినాడు. ఆ రాముని పాదుకలనుపూజిస్తూ అక్కడనుండే రాజ్యపాలనచేస్తూ రాముడిరాకకు ఎదురుచూస్తూ ఉండిపోయినాడు.

ఇక్కడ రాముడు, “ఈ చిత్రకూటము అయోధ్యకు చాలాదగ్గరగాఉంది. అందుచేత భరతుడు మళ్లీ వస్తాడేమో? కాబట్టి దూరంగా పోవడంమంచిదేమో?” అనిఆలోచించినాడు. చిత్రకూటాన్నివదలి శరభంగునిఆశ్రమంచేరినాడు. శరభంగుని సత్కారాలను స్వీకరించినాడు. అక్కడనుండికూడా బయలుదేరి దండకారణ్యము ప్రవేశించినాడు. ఆ దండకారణ్యంలో గోదావరినదీ తీరంలో భార్యాతమ్ముళ్ళతో సహానివాసం ఏర్పాటుచేసుకొన్నాడు.

రామలక్ష్మణులు సీతతోకూడా గోదావరితీరంలో పర్ణశాలనిర్మించుకొనిఉండగా, రావణుడి చెల్లెలు శూర్పణఖ వారివద్దకువచ్చింది. వారికి కీడు చేయబోయింది. అందుకు రామ, లక్ష్మణులు ఆమెముఖం వికారమయ్యేట్లుగా ముక్కు చెవులు కోసివేసినారు.

దానితో శూర్పణఖ కోర్కై చాలామంది రాక్షసులు మహాక్రోధంతో పెద్దసైన్యంతో రామ,లక్ష్మణుల పైకి దెత్తివచ్చినారు. రాముడు గర్వించిన శత్రువులను సర్వనాశనం చేయగలిగినవాడూ. చాలాగొప్పవాడూ కూడా. అతడు తన అస్త్రవిద్యలోనినేర్పు అందరూ తెలుసుకొనేలాగా, ఆటలాగా, ఆ వచ్చిన రాక్షసులనందరనూ చంపివేసినాడు. ఈ విధంగా ఖరదూషణాదులతోపాటు పద్నాలుగువేలమందిరాక్షసులు చచ్చినారు. దాంతో దండకారణ్యంలో సాధువులకు రాక్షసభయం లేకుండాపోయింది.

అప్పుడు శూర్పణఖ వేగంగారావణుని వద్దకుచేరింది. అతని కాళ్ళపైపడిఏడ్చింది. చెల్లెలికి కలిగిన వికారరూపాన్నిచూచి రావణు డిట్లాఅన్నాడు. " చెల్లీ! నా చెల్లిపై ఇంతచేసిన వాడెవడు? తెలిసి తెలిసిఎవడు ఈనాడు వాడియైన విశాలమైన బల్లెపుటంచుపైకి దూకినాడు? తలగడపై అగ్నిని మండించి. ఈనాడెవడు నెమ్మదిగా నిద్రపోయినాడు? భయంకరమైన విషాగ్నినిక్రక్కే కోడెత్రాచును ఎవడుకాలితో తన్నినాడు? భయంకరంగా గాండ్రించి భయంకలిగించే పెద్దపులిమీసాలను లెక్కచేయకుండాలాగిన వా డెవ్వడు?అయ్యో! నిన్నెవ్వడీనాడు ఇట్లా ఎక్కువగాఅవమానించినాడు? చెప్పు. ఆలోచిస్తే ఈ జగంలో ఆయుస్సంపద ఎవ్వనికోఈనాడు నాశనంఅయింది." అని గర్వంగా గర్జించినాడు. ఆ సమయంలో అతనిముఖంనుండి చెవులనుండి 'కోపమ'నే అగ్నితో పుట్టినజ్వాలలు ఆశ్చర్యకరంగా బయటకువచ్చినాయి.

శూర్పణఖ రావణునితో రామలక్ష్మణులున్న విధానాన్నిచెప్పింది. తనకు వారివల్లనే అవమానం జరిగిందని చెప్పింది. ఖరదూషణాది రాక్షసులంతా చావడం గురించి చెప్పింది. ఇదంతా విన్న రావణుడు ఆ క్షణంలోనే లంకానగరాన్ని రక్షించడానికి అప్తులను నియోగించినాడు. పూనికతో బయలుదేరినాడు. త్రికూట కాలపర్వతాలను దాటినాడు. పశ్చిమసముద్రతీరంలో పరమేశ్వరస్థానమైన గోకర్ణానికి పోయినాడు.

అక్కడ మారీచుణ్ణి చేరినాడు. ఆ మారీచుడు పూర్వము రావణుడికి మంత్రిగాఉండేవాడు. ఆ సమయంలో ఒకనాడు విశ్వామిత్రుని యజ్ఞంనాశనంచేయడానికి తనసోదరుడు సుబాహునితోసహా పోయినాడు. ఆ యజ్ఞాన్ని రాముడు రక్షిస్తూఉండినాడు.అప్పుడు రాముడు వేసిన ఒక బాణంతో సుబాహుడు చచ్చినాడు. ఇంకొక బాణపుదెబ్బతిని మారీచుడు చాలదూరంలోపడి చావుతప్పించుకొన్నాడు. అప్పటి నుండి సన్యాసం తీసుకొని గోకర్ణక్షేత్రంలో తపస్సుచేసుకుంటూ ఉన్నాడు. ఆ మారీచుడు మాయావిద్యలు బాగాతెలిసినవాడు. రావణుడు ఇప్పుడు రామునితో 'ఎదురుపడి పోరాడాల'నుకోలేదు. ఎందుకంటే బ్రహ్మదేవుడు వరమిచ్చేటప్పుడు 'మనుష్యజాతితోతప్ప ఇతరులెవరితోనూ తనకుమరణంలేద'న్నాడు. నేడు ఎదుర్కోవలసినది మనుష్యజాతిలో ఉత్తముడైనరామునితో. అందుచేత 'మాయోపాయమే శరణ్యమ'నుకొన్నాడు. అందుకు అతనికిమారీచునితోనూ ఆతని మాయలతోనూ పనిపడింది.. ఆ కారణంగానే ఆతడిప్పుడు మారీచుణ్ణి చేరినాడు. అతనితో ఇట్లాఅన్నాడు. "విన్నావా? 'రాముడ'నేవాడొకడు మిక్కిలి గర్వంతో మనఖరుడు మొదలైనశౌర్యవంతులైన రాక్షసవీరులను చంపినాడు. ఇప్పుడు దండకారణ్యంలో

భయంలేకుండా గొప్పవాడుగా ఉన్నాడు. వాడిని అవమానించవలె. పుణ్యాత్మా! ఆ పనికి నీవు నాకు సహాయంచేయి."రావణుడిట్లా అర్థించగా మారీచుడు చాలభయపడినాడు. రావణునితో ఇట్లాఅన్నాడు.

"యుద్ధంలో రాముడి గొప్పబాహుబలం నీకు తెలియదు. అతడితో దెబ్బతిన్న నాకుతెలుసు. నా సోదరుడు సుబాహుడు అతనిచేతనే చచ్చినాడు. పరమశివుడుకూడ అతడిబాణాలవేగానికి ఓర్వగలడా? మరి ఏదుష్టుడునీకీచెడుబుద్ధి పుట్టించినాడో తెలియదుకానీ, ఈ విధంగా 'నీకు చెడేకాలం దగ్గరకు వచ్చిందేమోన'నిపిస్తున్నది. మునుపు నేను రామునితో దెబ్బలుతిని మిక్కిలి అవమానింపబడేకదా ఇట్లా తపస్సు చేసుకుంటున్నాను?రాజా! ఈనాడు ఆ మహాత్మునిమీద నీకు వైరబుద్ధిమంచిదికాదు."

మారీచుని ఆ మాటలువిని రావణుడు కోపగించుకొన్నాడు. మారీచుణ్ణిచూచి, "నా ఆజ్ఞ పాటించకపోతే ఇప్పుడే నిన్నుచంపుతాను." అన్నాడు. ఆ మాటలువిన్న మారీచుడు తన మనసులో "వీని చేత చచ్చేదానికన్నా రామునిచేత చావడం మంచిదికదా? పుణ్యలోకాలైనా లభిస్తాయి." అని భావించినాడు. వెంటనే మారీచుడు రావణునితో "మహాత్మా! నీమేలుకోరి చెప్పినాను. నీకది ఇష్టంలేకపోతే నీఆజ్ఞనే పాటిస్తాను. ఆజ్ఞాపించు" అన్నాడు.

అప్పుడు రావణుడు, "నీవు బంగారు లేడివికా. నీ వెంట్రుకలు రత్నాలుగాఉండనీ. అట్లాంటి రూపంతోపోయి సీత 'నిన్నుతనకు కావాల'నేట్లుచేయి. సీత, రాముణ్ణి నిన్నుపట్టుకొనిరావడానికి పంపుతుంది. అప్పుడు రాముడు నిన్నుపట్టుకోవడానికి పూనుకుంటాడు. అతడునీ వెంటపడతాడు. నీవు అతనికి దొరకకుండా చాలదూరం తీసుకొనిపో. నేను ఆసమయంలో సీతను అపహరిస్తాను. ప్రియమైన భార్యను పోగొట్టుకొని మనస్సుపాడై ఆ రాముడు చెడిపోతాడు." అన్నాడు. మారీచుడు, "అట్లే కానీ". అన్నాడు.

వెంటనే మారీచుడు బంగారుజింకరూపం ధరించిపోయి రాముడు, సీతా, ఉన్న చోట తిరుగుతూ ఉండినాడు. సీత ఆ బంగారు జింకను చూచింది. కుతూహలంతో 'ఆ జింకను పట్టుకొమ్మ'ని భర్తను ప్రార్థించింది. అట్లా సీతాదేవి తాను స్వయంగా మాత్రమేకాకుండా విధికూడా తన్నాపనికి ప్రోత్సహించింది. కాకపోతే 'బంగారు జింకలుండవ'ని సీతకు తెలియదా? రాముడికి తెలియదా? రాముడు ఆ బంగారు జింకను పట్టుకోవడానికి పూనుకొన్నాడు. సీతను రక్షించడానికి లక్ష్మణుణ్ణి 'ఉండమ'న్నాడు. తను ఆ బంగారు జింకను పట్టుకోవడానికి బయలుదేరినాడు. శత్రువులను మర్దించిన సాటిలేనివిలుకాడైనరాముడు పెరిగిన పరాక్రమంతో ఆలస్యంలేకుండా ఆ జింకను వెంబడించడం ప్రారంభించినాడు.అట్లా జింకను వెంబడించే రాముడు యజ్ఞమృగాన్ని వెంబడించే రుద్రుడిలాగా కనిపించినాడు.

ఆ సమయంలో ఆ బంగారుజింక రామునికి చిక్కకుండా దూరంగాపరిగెత్తుతుంది. తిరిగి చేతికందేంతదూరంలో నిలబడుతుంది. పట్టుబడకుండా చెంగుచెంగునాఎగురుతూ పొదలచాటుకు చేరి

కనబడకుండాపోతుంది. మళ్ళీకనిపిస్తుంది. పెద్దగా ఉలికిపడి వేగంగాపరుగెడుతుంది. తిరిగి చూస్తుంది. చెవులు ఎక్కుపొడుచుకొని నిలబడుతుంది. ప్రక్కదారి పడుతుంది. దుమ్ములేపుతుంది. పరధ్యానంగా ఉన్నట్లు కనిపిస్తుంది. గడ్డిమేస్తుంది. అట్లా ఆ మాయామృగం విజృంభించి తిరుగాడుతూ ఉంది. ఈ విధంగా అది రాముణ్ణి చాలదూరం తీసుకొనిపోయింది. ఆ రాముడు ఆ జింక వెంటపరుగెత్తి అలసిపోయినాడు. ఇది 'మాయామృగమై ఉంటుందేమో?'నని ఊహించినాడు. ఇంకఏమాత్రము ఆలస్యంచేయకుండా అమోఘమైనబాణాన్ని సంధించినాడు. ఆలస్యంలేకుండా ఆ జింకను కొట్టినాడు. బాణం తాకిడికి పడిపోతూ, ఆ లోపలనే రాముడి గొంతుతో "హా లక్ష్మణా! హా సీతా!" అని అరచి ఆ జింక కూలిపోయింది. ఆ కపటమృగము అట్లాపడిపోయి తన్నుకొంటూచచ్చింది.

సీత ఆ కపటపుజింక అరచిన అరపును విన్నది. ఆమె ఆ కంఠస్వరాన్ని స్పష్టంగా 'రాముడిదేన'ని భావించింది. తల్లడపడే మనసుతో, "ఓ అన్నా! లక్ష్మణా! రాక్షసులలో ప్రవేశించి మీ అన్న బాధపొందినట్లు ఉంది. పరాక్రమవంతుడా! విన్నావా? ఆ మహానుభావుడు దు:ఖంతో బాధపడుతూ నిన్నూనన్నూపిలిచినాడు. నీవు వేగంగాపోయి రాముణ్ణికాపాడు. నీవు బాగాప్రకాశించేపుణ్యమే ఆభరణంగా కలవాడవుకదా? ఈ పుణ్యకార్యాన్ని వెంటనేచేయి" అన్నది. ఆమె అట్లాఅనగానే, లక్ష్మణుడామెతో ఇట్లాఅన్నాడు.

"అమ్మా! భయపడవద్దు. యుద్ధంలో రాముణ్ణి ఎదిరించగల శూరుడు ఏలోకంలోనూలేడు. అతనికిఎట్టి పరిస్థితులలోనూ ఆపదసంభవించదు. శ్రీరాముడిప్పుడేవస్తాడు. ఆనందంగాఉండమ్మా!" లక్ష్మణుడట్లా అనడంవిని సీత లక్ష్మణుణ్ణి అనుమానించింది. ఇదికూడా దైవఘటనయే. కాకపోతే సీత ఏమిటి? లక్ష్మణుణ్ణి అనుమానించడమేమిటి? సీతాపహరణమే రావణునికి మరణశాసనంకదా? అందుకే విధిఆమె అట్లా లక్ష్మణుణ్ణి అనుమానించేట్టుగా చేసింది.

లక్ష్మణుడిపైన కోపంతోనూ 'రాముడికేమైందో'ననేభయంతోనూ సీతాదేవి మనస్సు భ్రాంతికిలోనైంది. "నీ ఆలోచన నాకుతెలుసు నీకెందుకు నాపై అనవసరమైనజాలి ? నీ కిట్లాంటిబుద్ధి ఎందుకు కలిగింది? భయంకరమైన శస్త్రాలతోనో, అగ్నితోనో వేగంగాచస్తానుకానీ, నేను నిన్నెందుకు వరిస్తాను? బెబ్బులిభార్య అయ్యో! నక్కపొందును ఆశిస్తుందా?" అని ఈ విధంగా మంచిపురుషులలో శ్రేష్ఠుడైన లక్ష్మణుణ్ణి సీతఅసహ్యంగామాట్లాడింది. లక్ష్మణుడు ఆ మాటలనువినలేక చెవులు మూసుకున్నాడు. ఆయన మనసు కలతచెందింది. సాటిలేని బాణాలూవిల్లూ తీసుకొని అన్నపోయిన వైపు పోసాగినాడు.

ఆ సమయంలో మోసంచేయడంలో నేర్పరియైన రావణుడు సీతవద్దకువచ్చినాడు. అందమైన జందెం, జుట్టు, గోచిపాత, ధాతువస్త్రం (పైపంచె), చేతికర్ర, కమండలం, దర్భలఉంగరం ఇవన్నీ కలిగి ముసలి రూపంతో, సన్యాసి వేషంతో, వచ్చినాడు. 'వచ్చినవాడు నిజమైన మునియేన'నుకొన్నది సీతాదేవి. అతణ్ణి

**మిక్కిలిప్రీతితోపూజించింది.** అడవిపళ్ళనిచ్చింది. రావణుడు ఆ పళ్ళనుస్వీకరించలేదు. కానీ **కామవికారానికిలోనై** ఆమెను చూచినాడు. ఆమెతో ఇట్లాఅన్నాడు.

"నేను రాక్షసరాజును. చాలాబలవంతుడను. 'రావణుడ'నే పేరుతో ప్రసిద్ధిచెందినవాడను. లోకమంతటా ప్రసిద్ధిపొందిన 'లంక'అనేది నానగరం. ఓ లేమా! నా భార్యవై దివ్యభోగాలనుకోరిన విధంగా అనుభవించకూడదా? ఎక్కడి రాముడు? అయ్యో ! హీనుడూ, దరిద్రుడూ, అయిన మానవుడితోకూడి అడవుల్లో అనేకకష్టాలుపడదగునా? ఇంకవేరేఆలోచనలు మనసులోమానుకో" ఇట్లాఅన్న రావణుని మాటలువిని సీత భయంతో వణికిపోతూ ఇట్లాఅన్నది.

"ఇట్లామాట్లాడడం తగునా? నేనెక్కడా? నీవెక్కడా? నక్షత్రాలతోకూడా ఆకాశమంతా నేలకూలినా, భూమిబ్రద్దలైనా, సముద్రాలన్నీ ఇంకిపోయినా, సూర్యచంద్రులు కాంతిహీనులైనా నేను ఇతరులను మనసులో కోరుకుంటానా? ఆడఏనుగు పందినిఏనాడైనా కలుస్తుందా? గొప్పపద్మాలలోని తియ్యని తేనెను గ్రోలి పరవశించిపోయేతుమ్మెద, రేగుపూలరసం ఎట్లాత్రాగుతుంది? నీవు అవివేకివైనావు?" ఇట్లా అంటూ సీత మెల్లమెల్లగా రావణుడికిదూరంగా జరిగింది. ఆ దురాత్ముడామెను మిక్కిలి భయంకరంగా బెదిరించి పట్టుకున్నాడు. ఆకాశానికి ఎగిరినాడు. లంకాపురం వైపుపోవడం ప్రారంభించినాడు. ఆమె చాల ఆవేదనపొంది ఇట్లాఅరుస్తూఏడిచింది.

"దేవతలారా! బ్రాహ్మణులారా! మూడులోకాలలోనూ గొప్పవాడై ప్రకాశించే శ్రీరాముడిభార్య సీతనునేను. నన్ను కాముకుడైనఒకరాక్షసుడు అడ్డంలేకుండా తీసుకొనిపోతూఉన్నాడు. దయతో నన్ను రక్షించరా? నన్ను రక్షించి పుణ్యాన్నీ కీర్తినీ పొందండి. ఇదిగో మీకుమ్రొక్కుతున్నాను."

ఆమె ఏడుపునూ, మాటలనూ 'జటాయువు' అన్నపక్షి విన్నాడు. ఆ జటాయువు కడుపుణ్యాత్ముడు. బలపరాక్రమాలు కలిగినవాడు. మిక్కిలిధైర్యశాలి. అతడు సూర్యునిరథసారథీ గరుత్మంతుడికి అన్నా అయిన అరుణుడి కుమారుడు. తేజస్సులో చాలాగొప్పవాడు. అతడు కొండగుహలోని తననివాసంలో విశ్రాంతి తీసుకుంటూఉండి ఆ సీత ఆలాపనలనువిన్నాడు. విన్నవెంటనే దయతో రెక్కలుకలిగిన కులపర్వతంవలె వేగంగాఆకాశానికెగిరినాడు. పెద్దగా ఉరిమేమేఘంలాగా లోకాలన్నీ బలంచెడి అదరిపోయేట్లుగాఅరుస్తూ శౌర్యంతో, "ఓరీ! దురాత్మా! ఈ వనితను భయపడకుండా ఎందుకు పట్టుకొన్నావు? ఆమెను విడిచిపెట్టు. ఈమెనువదలకుండా నీవింకెక్కడికి పోయినా నీ ప్రాణంతీస్తాను. భయంకరులైన శత్రువులను చంపేజటాయువు నీకుతెలియదా?" అనిగర్వంగాఅన్నాడు. అట్లాఅంటూ అడ్డులేని పరాక్రమంతో దేవతలశత్రువైన రావణుణ్ణిఎదుర్కొన్నాడు.

పక్షిశ్రేష్ఠుడైన జటాయువుకూ రావణుడికీజరిగిన భయంకరమైనయుద్ధం సమానత్వంతో మిక్కిలి శోభించింది. జటాయువు తనగొప్పరెక్కలతో కొట్టినాడు. రావణుడు ఇనపకట్లగుదియలు ప్రయోగించి నాడు. జటాయువు తనవాడియైన గోళ్ళతోరక్కినాడు. రావణుడు వాడిబాణాలు ప్రయోగించినాడు. జటాయువు భయంకరమైన ముక్కు తో చీరినాడు. రావణుడు నిడివిగల ఈటెలను విసరినాడు. జటాయువు తనరెక్కలతో పాదాలతో గోళ్లతోగీరి రావణాసురుడి శరీరమంతా నెత్తురుకారేట్లుగాచేసినాడు. కారేరక్తం ఎర్రనివరదనీటితో ప్రవహించే సెలయేళ్ళలాగాకనిపించింది. రావణుడు ఆ సెలయేళ్ళుకలిగిన కులపర్వతంలాగా ధైర్యంగా నిశ్చలంగా నిలిచినాడు. ఆ తరువాత సందుచూచుకొని రావణుడు కత్తితో ఆ జటాయువు రెక్కలు నరకినాడు. గాలి దెబ్బకు చెదరేమేఘంలాగా జటాయువు ముక్కలైనేల కూలినాడు. ఈ విధంగా జటాయువునుకూల్చి రావణుడు చాలావేగంగా పోతున్నాడు. అప్పుడు సీత తనకుదిక్కెవ్వరూ లేకపోవడంతో నిరాశచెందింది. ఇంతలో ఒక కొండపై కొందరువానరులు తిరుగుతూఉండగా చూచింది. తానుకట్టుకొన్న చీరకొంగుచించింది. తనఆభరణాలను అందులోమూటకట్టింది. ఆ మూటను ఆ కొండపైనవదలింది. రావణుడు లంకకు సీతనుతీసుకొనిపోయినాడు. అక్కడ అశోకవనంలో ఆమె నుంచినాడు.

ఇక్కడ రాముడు మాయామృగాన్నిచంపి తిరిగివస్తున్నాడు. తనకెదురుగావస్తున్న లక్ష్మణుణ్ణి చూచినాడు. "రాక్షసులుండే ఈ అడవిలో సీతను ఒంటిగాఉంచి ఇక్కడకువచ్చి తప్పుచేసినావు." అన్నాడు. అప్పుడు లక్ష్మణుడు 'సీతతనను అవమానించి మాట్లాడిన విధం'చెప్పినాడు. పుణ్యాత్ముడైనరాముడు మాయలేడి తనను ఆ విధంగా దూరంగా తీసికొని వచ్చినందుకూ, సీతను ఒంటిగాఅడవిలో ఉంచి తన వెనుకనే తనతమ్ముడు వచ్చినందుకూ, మనసులో చాలదుఃఖిస్తూ పర్ణశాలకుపోయినాడు. అట్లాపోయి, కదలికలులేని శరీరంలాగా ఉండే సీతలేని పర్ణశాలనుచూచి వెంటనేమూర్ఛపోయినాడు. లక్ష్మణుని ప్రయత్నంతో కొంతసేపటికి తేరుకున్నాడు. అంతట ఆ అన్నతమ్ములు ఆ ప్రదేశంలో సీతను వెతుకుతూపోతూఉండినారు. అట్లాపోతూ వజ్రాయుధపు దెబ్బకు పగిలిపోయిన కులపర్వతంలాగా పడిఉన్నగ్రద్దను చూచినారు. మనస్సులో అదికూడా 'రాక్షసమాయయే అయిఉండవచ్చున'నుకొన్నారు. అందువలన దానినికొట్టదానికి పూనుకున్నారు. ఆ జటాయువు ఆ సంగతి తెలుసుకొని " ఓ ఆర్యులారా! నేనుజటాయువుఅనే పక్షిని. అరుణుడి కుమారుడను. మీ తండ్రి దశరథునకు ఇష్టమైన స్నేహితుడను." అనగా ఆ రామలక్ష్మణులు దగ్గరకు వచ్చినారు. అప్పుడు జటాయువు వారితో రావణుడు 'సీతను తీసుకొనిపోవడం'చెప్పినాడు. ఆమెకొరకై తాను రావణునితో యుద్ధంచేయడంగురించికూడా చెప్పినాడు. ఆ తరువాత రావణుడుపోయినదిక్కును చూపించి మరణించినాడు. రామలక్ష్మణులు ఆ పక్షిరాజుకు మిక్కిలిగౌరవంతో అగ్నిసంస్కారము మొదలగు చేయవలసినపనులన్నీ తమతండ్రితోసమానంగాచేసినారు. ఆ తరువాత జటాయువు చూపిన దక్షిణదిక్కుగా పోయినారు.

రామలక్ష్మణులట్లా పోతూపోతూ 'కబంధుడ'నేవాడిని చూచినారు. ఆ కబంధునికి వక్షంలో కన్నులున్నాయి. పెద్దకడుపుఉంది. అందులోనేనోరుంది. బాగాపొడవైన రెండుచేతులున్నాయి. కులపర్వతంలాగా బాగాఎత్తైనశరీరంఉంది. చాలాభయంకరంగా కనిపిస్తున్నాడు. వికారమైన ఆకారం కలిగిఉన్నాడు. అతడు పెక్కుజంతువులను తినేవాడు. చాలబలంగలిగినవాడు. అలాంటి కబంధుడు బాహుబలంతో లక్ష్మణుణ్ణి పట్టుకున్నాడు. ఇంకమిగిలింది లక్ష్మణుణ్ణితినడమే. లక్ష్మణుడు కబంధుని చేతికిచిక్కి ఏమీ చేయలేక మిక్కిలి విచారంతో, "అన్నా ! నన్నుచూడు." అని రాముణ్ణిచూస్తూఅన్నాడు. ఇంకాఇట్లాఅన్నాడు. "అన్నా! ఆలోచిస్తే నీకుఆపదలపై ఆపదలు కలుగుతున్నాయి. మహనీయ సామ్రాజ్యం పోయింది. తండ్రి మరణించినాడు. భయంకరమైన అడవులలో మిక్కిలి దుఃఖంతో తిరిగినావు. సీతను పోగొట్టుకొని దుఃఖంతో తిరుగుతున్నావు. కడకు నేనిట్లా ఈరాక్షసుడి నోటికిచిక్కినాను. ఓ రాజా! నీవూ సీతాదేవీకలిసి పూజింపదగిన రాజ్యానికభిషిక్తులై ప్రకాశించడం ఆనందంగా చూడలేకపోయినాను. ఆలోచిస్తేనేనెట్లాంటి అభాగ్యుడినో?" అంటూ లక్ష్మణుడు దుఃఖంతో కలతచెందినాడు.

రాముడు సంభ్రమంలేకుండా పూనుకొని, "అన్నా ! లక్ష్మణా ! భయపడవద్దు. నేనుండగా నీకు ఆపద ఎందుకు కలుగుతుంది?" అంటూ వేగంగా పదునైనతనపెద్ద ఖడ్గాన్ని ఒరనుంచి తీసి ఆ రాక్షసుని ఎడమచేతిని నరకినాడు. వెంటనేలక్ష్మణుడు ఆ రాక్షసుని బారినుండి తప్పించుకున్నాడు. అట్లా తప్పించుకొన్నలక్ష్మణుడు రాహువునుండివిడవబడిన సూర్యుడిలాగావెలిగిపోయినాడు. శీఘ్రంగా వాడియైన తనకత్తితో ఆ కబంధుని కుడిచేతినిఖండించినాడు. అంతేకాక ఆ కబంధుని కడుపుచీల్చినాడు. ఆ క్షణంలో కబంధుడు దివ్యరూపం ధరించినాడు. అదిచూచి రామలక్ష్మణులిద్దరూ ఆశ్చర్యపడినారు.

"ఈ అడవిలో రాక్షసరూపంలోఉన్ననీకు, దేవతాస్వరూపంకలగడానికి కారణమేమి?" అని రాముడడుగగా కబంధుడిట్లా చెప్పినాడు. "నేను 'విశ్వావసువు' అనే గంధర్వుణ్ణి, బ్రహ్మశాపంవల్ల రాక్షసత్వంపొందినాను. మీవల్ల శాపంనుండి విముక్తిపొందినాను. 'రావణుడ'నే రాక్షసుడు సీతను తీసుకొనిపోయి లంకానగరంలో ఉంచినాడు. మీకు మేలుకలిగించేమాట చెప్తాను. వినండి. ఈ దారిలో పోగాపోగా 'పంప'అనే సరోవరం వస్తుంది. దాని కవతల 'ఋష్యమూకమ'నే కొండఉంటుంది. దాని మీద వాలి తమ్ముడైన 'సుగ్రీవుడ'నే వానరుడుంటాడు. అతనికి నలుగురుమంత్రులుంటారు. మీరతనితో స్నేహం చేయండి. దానితో మీపని జరుగుతుంది." ఇట్లా చెప్పి, గంధర్వుడు వారినివదలి తనదారిన తానుపోయినాడు.

గంధర్వుడుచూపినదారిలో రామలక్ష్మణులు పోయిపోయి పంపాసరోవరాన్నిచూచినారు. ఆ పంపాసరోవరం ఎల్లప్పుడూ అతిథులకు సత్కారంచేస్తూ ఉంటుంది. అందమైన పద్మాలతోనూ కలువలతోనూ కూడిననీళ్ళతో అతిథులకు అర్ఘ్యంఇస్తుంది. 'మెరుస్తున్న తరంగాలు' అనే చేతులతో కాళ్ళు కడుక్కోవడానికి

నీళ్ళిస్తుంది. మత్తిల్లిన చక్రవాకాలూ, బెగ్గురుపక్షులూ, తుమ్మెదలూ, హంసల అరుపులతో ఆహ్వానం పలుకుతుంది. ప్రకాశించే ప్రబ్బలిచెట్లు సమకూర్చే విడిది ఇండ్లనీడలలో విశ్రాంతిని ఇస్తుంది. మెల్లమెల్లగా వీచేగాలితో మిక్కుటమైనఎండను తగ్గిస్తుంది. ఇట్లాఇవన్నీ ఎప్పుడూ అతిథులకుఇస్తూ తనజీవితాన్ని సఫలం చేసుకుంటూఉంది, ఆ పంపాసరస్సు.

అట్లాంటి పంపాసరోవరతీరంలో రాముడు ఆ సుందరప్రదేశాలను చూచినాడు. ఆయనకు వెంటనే సీత గుర్తుకువచ్చింది. ఆమెను తలచుకుంటూ 'బావురుమ'ని ఏడ్చినాడు. అప్పుడు లక్ష్మణు దతనితో ఇట్లా అన్నాడు. "అన్నా! ఆపదలుకలిగినప్పుడు కలతచెందడం మీబోటి గొప్పవారికి తగునా? ఓర్పు వహించి నిగ్రహంతో మనస్సులోనివెతలను పారద్రోలవలె. పౌరుషం కలిగినవాడవై సీతాదేవికోసం వెతుకు. తరువాత నేర్పుతో చేయవలసిన పనిచేయవచ్చు. నీకు నేను శిష్యుడను. సహాయకుడను. సేవకుడను. తమ్ముడను. నేనుండగా నీవు దుఃఖించడమెందుకు ?" అనిచెప్పి రామునిమనసులోని వ్యాకులతను కొంతమేరకు తగ్గించగలిగినాడు.

ఆ తరువాత రామలక్ష్మణులిద్దరూ పంపాసరోవరంలో స్నానంచేసినారు దేవతలకూ పితృ దేవతలకూ తర్పణాలువదలినారు. తిరిగి ప్రయాణంసాగించినారు. ఋష్యమూకపర్వతము చేరినారు. ఆ పర్వతసానువులలో విశ్రాంతి తీసుకుంటూఉండినారు. ఆ ఋష్యమూకపర్వతం చుట్టూదట్టమైన మేఘాలు ఉన్నాయి. నిటారుగా నిలబడిన కొండకొనలున్నాయి.

అట్లావిశ్రాంతితీసికొంటున్న రామలక్ష్మణులను కొండపైనుండి సుగ్రీవుడుచూచినాడు. వారు దేదీప్యమానమైన కాంతితో వెలిగిపోతూఉన్నారు. మహావీరులుగా కనిస్తున్నారు. ఎత్తైనభుజాలుకలిగి ఉన్నారు. వారినిచూచి సుగ్రీవుడు భయపడినాడు. వాలి పంపగా 'తనను చంపడానికి వచ్చినారేమో?' నని అనుమానించినాడు. తన మంత్రులతో ఆలోచించినాడు. వారందరూకలసివారివివరాలు 'తెలుసు కోవాల'నుకొన్నారు. ఎల్లప్పుడూ ఉత్సాహంగాఉండేవాడూ, చాలాతెలివైనవాడూ, శౌర్యవంతుడూ, ఉత్తముడూ, హిమవంతుడిలా స్థిరంగాఉండేవాడూ, అయిన హనుమంతుణ్ణి ఆ పనికైపంపినారు. హనుమంతుడు పోయి రామలక్ష్మణుల విషయమంతా తెలుసుకొనివచ్చి సుగ్రీవునికి చెప్పినాడు. రాముడికి సుగ్రీవుడికి స్నేహము చేయించినాడు.

రామలక్ష్మణులు, సుగ్రీవుడూ ఆయన నలుగురు మంత్రులూకలసి వాలిఉండే కిష్కింధానగరానికి పోయినారు. సుగ్రీవుడు వాలి ఇంటిముందరనిలబడినాడు. గర్వంగాసింహనాదంచేసినాడు. జబ్బలు చరచుకొన్నాడు. ఆ శబ్దాలను వాలివిన్నాడు. అడ్డగించలేనిపరాక్రమంతో పొంగిపోయినాడు. యుద్ధసన్నాహంతో బయలుదేరినాడు. అప్పుడా వాలిభార్యతార అతణ్ణి ముందుకుపోకుండాఆపి "ఈ నాటి

సుగ్రీవుడివైఖరిచూస్తే అతడు 'బలవంతుల సహాయంతో వచ్చినట్ల'నిపిస్తున్నది. 'అది ఎట్లా'అంటే దశరథునికుమారుడైన రామునిభార్యను రావణుడు అపహరించినాడు. అందువల్ల తానూలక్ష్మణుడూ సుగ్రీవుని సహాయంకోరినారు. రాముడు 'ఆ సుగ్రీవుని పనిపూర్తి చేయాల'ని 'పూనుకొన్నాడ'ని విన్నాను. అదీకాక మహాబలం కలిగినమైందుడూ, ద్వివిదుడూ, లోకాతీతపరాక్రమం కలిగిన హనుమంతుడూ, మహామేధావిఅయినజాంబవంతుడూ, అతనికి మంత్రులుగా ఉన్నారు. కాబట్టి నీవిప్పుడు యుద్ధానికి పోవడం నాకిష్టంలేదు." అన్నది.

ఆ తార మాటలను 'సుగ్రీవుని మీదగల అభిమానంతో చెప్పిన మాటలు'గా వాలిఅనుకొన్నాడు. అందుచేతనవ్వుతూ ఆ మాటలను కొద్దిగాకూడలెక్కచేయలేదు. మహాబలపరాక్రమాలతో బయలు దేరినాడు. ఇట్లాపోయి ఎదురుగా కనిపించిన సుగ్రీవుణ్ణిచూచినాడు. "ఓరీ! నీచుడా! నేనిట్లాంటి పోట్లాటల్లో చాలాసార్లు నిన్నుతన్నితరిమినాను. సిగ్గులేకుండా పారిపోయినావు. ఇప్పుడు నీకు ఉన్నట్లుండి ఇంత ధైర్యము ఎక్కడనుండివచ్చింది? చెప్పు." అన్నాడు. ఇందుకు సుగ్రీవుడు నవ్వుముఖంతో, "భార్యనూ రాజ్యాన్నీ పోగొట్టుకొన్నాను. యుద్ధంలో ఓడిపోయినాను. అయ్యో! ఇట్లాంటి బ్రతుకెందుకు? అనిపించింది. తెగించినాను. విజృంభించి నీతో యుద్ధానికివచ్చినాను. ఇంక నీవుకూడా యుద్ధానికి సిద్ధం కా. ఇంతకు ముందులాగాకాదు. ఈనాడు నేను పాతసుగ్రీవుడనుకాను. నిన్ను చంపిగానీ పోను." అంటూ భయంకరంగా గర్జించినాడు. వాలిని ఎదుర్కొన్నాడు.

ఈ విధంగా తలపడిన వాలిసుగ్రీవు లిరువురూ జనులతో పొగడబడే ప్రభావం కలవారు. గొప్ప బలగర్వంకలవారు. భయంకరమైనశత్రువుల తేజాన్నిహరించేవారు. ఎల్లప్పుడూ కీర్తినీ జయాన్నీ కాంక్షించేవారు. పెద్దపెద్దచెట్లూ, రాళ్ళూగోళ్ళూ ఆయుధాలుగా కలిగినవారు. ఆ వానరవీరులిద్దరూ ఒకరినొకరు కోపంతో ముఖాలుఎర్రబడగా ఎదుర్కొన్నారు. పెద్దపెద్దచెట్లను పెరికి ఒకరిపైఒకరు విసరుకున్నారు. ఆ చెట్లన్నీ కఠినమైన వారివక్షస్థలాలనుతాకి ముక్కలైపోయినాయి. ఇంకాపూనుకొని ప్రకాశించేవిధంగా కఠినమైనరాళ్ళతో ఒకరినొకరు నొప్పించుకొనసాగినారు. ఆ రాళ్ళు ఒండొరుల దేహాల పైపడి పొడి పొడి అయిపోయినాయి.

సమీపంలోని చెట్లూ రాళ్ళూ అయిపోయినాయి. ఆ తరువాత వారిద్దరూ కుతూహలంగా మల్ల యుద్ధానికి దిగినారు. ఒకరినొకరు పట్టుకుంటూ, లాగుకుంటూ ఉన్నారు. ఒకరికొకరు దూరంగా పోయేవారు. ఒంగేవారు. లొంగేవారు. పట్టుదలతో ఒకరినొకరు మించేవాళ్ళు. ఒకరి ఔద్ధత్యాన్ని ఇంకొకరు సహించే వారుకాదు. పరాక్రమంతో శత్రుత్వం పెంచుకుంటూ పోరాడినారు. వారిద్దరి పోరాటం రెండు మదపుటేనుగులు తమతొండాలతో ఒకదాన్నొకటి లాగుకునే ఆటలాగా స్పష్టంగాకనిపించింది. ఇంకా ఒకరి శరీరాన్నొకరు పండ్లతోనూ గోళ్ళతోనూ చీల్చుకున్నారు. వానరవీరులు రక్తధారలలో తడిసిపూచిన

అశోకవృక్షాలలాగునఉండినారు. పట్టుదలలు ప్రకాశించగా పోరాడేటప్పుడు వాలిసుగ్రీవులిద్దరూ సమానమైనబలం రూపం పరాక్రమం కలిగిఉన్నారు. అందుచేత ఆ అన్నదమ్ములిద్దరిలో ఎవరుఎవరో? రాముడు గుర్తించలేక పోయినాడు. కలత చెందిన హృదయంతో ఊరకచూస్తూఉన్నాడు. అప్పుడు హనుమంతుడు రాముడిగుర్తుకోసం ఒక చిగురుటాకులమాలను సుగ్రీవుడిమెడలో వేసినాడు. ఆ తరువాత రాముడు అమోఘబాణం సంధించినాడు. వాలిరొమ్ము పగిలేట్లుగాకొట్టినాడు. ఆ దెబ్బకు వాలినేలకూలినాడు. నేలకూలినవాలి, రాముణ్ణినిందిస్తూ మరణించినాడు.

ఈ విధంగా రాముడు వాలిని చంపి, సుగ్రీవుణ్ణి వానర రాజ్యానికి ఆనందంగా పట్టంకట్టినాడు. ఆ సుగ్రీవుడు రామునికి నమస్కరించి, "దేవా ! ఈ వేసవిలో మిగిలిన ఈ కొద్దికాలమూ, వానాకాలమూ, గడచిన తరువాత సీతను వెతకడానికి ప్రయత్నించడం మంచిది." అన్నాడు. రామలక్ష్మణులిద్దరికీమాల్యవంత పర్వతంపైన విడిది ఏర్పాటుచేసినాడు. తాను కిష్కింధానగరంలోఉండినాడు.

వేసవి పూర్తిఅయింది. వానాకాలం ప్రవేశించింది. మేఘాల సామ్రాజ్యం వేసవిలోని ఎండలనూ వాటి వల్లకలిగే చెమటలనూ లేకుండాచేసింది. లోకాన్నంతా సంతోషింపచేసింది. 'ఉరుములు' అనే తూర్యనాదాలు బాగావినిపించినాయి. 'బెగ్గురుపక్షుల రెక్కల'నే చామరాలతో 'నెమలిపింఛాల' గొడుగులతో లక్ష్మీనిలయంలాగా ఆ మేఘసామ్రాజ్యంశోభించింది.

ఆ సమయంలో లంకలో రావణుడి చెరలోపడినసీత, ఉరిలోచిక్కిన జింకపిల్లలాగాఉండింది. ఎల్లప్పుడూ భర్తనేధ్యానిస్తూ బాధలుఅధికంకాగా తెలివితప్పిపడిపోతూఉండింది. ఆమెకు కాపుగా త్ర్యక్షి, లలాటాక్షి, త్రిస్తని, ఏకపాద, దీర్ఘజిహ్వ, త్రిజట, ఏకలోచన, మొదలైనవారు చాలామంది వికారమైన ఆకారాలతో సీతను చుట్టుముట్టి ఉండేవారు. పగలూ రాత్రీ సీతను ఊరకే భయపెట్టేవారు. త్రిలోకాధిపతియైన రావణుని ఈ దుష్టమానవస్త్రీ అంగీకరించడంలేదు. 'దానిని పట్టుకొని ముక్కలు చేసికొని కండలు తిందామ'నేవారు. ఈ మాటలుఅన్నీవింటూ కన్నీరుకారుస్తూ ఆ సీత గద్గదకంఠంతో (బొంగురు పోయిన గొంతుతో) ఆ రాక్షస స్త్రీలనుచూచి "అమ్మలారా! మీరు మీకుబుద్ధిపుట్టినట్లు చేసుకోండి. ఎందుకాలస్యం? నేను రాముణ్ణితప్ప ఇంకొకపురుషుణ్ణి మనసులోకూడా తలచుకోను. ఇదినిజం, నాకు జీవించాలని కూడలేదు." అన్నది.

ఆ సీత తెగువను గురించి రావణునికి చెప్పడానికి కొంతమందిపోయినారు. అప్పుడు త్రిజట సీత వద్దకుచేరింది. ఆ త్రిజట ఎల్లప్పుడూ ప్రీతిగా మాట్లాడే గుణంకలిగింది. ధర్మం తెలిసినది. ఆమె సీతతో ఇట్లాఅన్నది. "అమ్మా! నీకెంతో ఆనందకరంగా ఒకవార్తచెప్తాను. నామాట నిజంగా నమ్ము. అవింధ్యుడనే వృద్ధ రాక్షసుడొకడున్నాడు. వాడు పుణ్యాత్ముడు. అతడు రాముడి మేలుకోరేవాడు. అతడే నిన్నోదార్చడానికి నన్ను పంపినాడు. నిన్ను పోగొట్టుకొన్న తరువాత రాముడు లక్ష్మణునితో కలిసి వానరరాజైన సుగ్రీవుడితో

స్నేహముచేసినాడు. ఆ రాముడు సుగ్రీవుడిసహాయంతో నిన్నువిడిపించడానికి ఉద్యుక్తుడైఉన్నాడు. రావణునికి రంభకారణంగా నలకూబరుడిచ్చిన శాపము ఉంది. కాబట్టి రావణుడు నిన్ను బలాత్కరించలేడు. అందుచేత నీకు ఆ భయంలేదు. అంతేకాదు. ఈ దుర్మార్గుడికి కీడును సూచించేస్వప్నము నాకు వచ్చింది. దాని వివరాలు చెప్తూతానువిను.

రావణుడు గాడిదలుపూనిన రథంమీద పోతూఉన్నాడు. చెదిరినవెంట్రుకలు అతనికి వెనుకన వ్రేలాడుతూఉన్నాయి. అతనిశరీరం ఎక్కువగానూనెతోనిండిఉంది. అతడు దక్షణదిక్కుకుపోతూ ఉండినాడు. ఇదంతా నేనుకలకన్నాను. ఇంకా అతనిచుట్టూ కుంభకర్ణుడు మొదలైనవారంతాఉన్నారు. వాళ్ళంతా ఎర్రటి పూలమాలలు ధరించిఉన్నారు. ఎర్రటి మైపూతలు పూసుకొనిఉన్నారు. వారందరకూ జుట్లుజారి చెదిరి క్రిందకువేళాడుతూఉన్నాయి. వారంతానగ్నంగా కనిపించినారు. ఆ రీతిలో వారందరూ రావణునితోకూడి యముడిదిశకుపోవడం స్పష్టంగాకనిపించింది. అంతేకాదు విభీషణుడు తన నలుగురి మంత్రులతోపాటుగా తెల్లనికొండకొమ్మున శోభిల్లడంకలకన్నాను. అతడు అందమైనతెల్లని గొడుగును ధరించిఉన్నాడు. తెల్లనిపూలమాలనుకూడాధరించిఉన్నాడు. తెల్లనిమైపూతలుపూసుకొని ఉన్నాడు. అతడు ధైర్యమూ, తెలివీ కలిగిఉన్నాడు. ఇంకా రాముని తెల్లని కీర్తి విశ్వమంతానిండింది. రాముడు తాను తనతమ్ముడూ కలిసి బాగాఎత్తైన ఏనుగు మెడపైన ఆనందంగాఉండడం చూచినాను. వారిద్దరూ ఆనందంగా మంచి తేనెతో కలిసిన పాయసాన్ని సుఖంగాతింటూ ఉండడంకూడాచూచినాను. ఇదంతా నిజం. నీవేమో ఏడుస్తూ తొట్రుపడే నడకతో ఉత్తరంవైపునకు పోతూఉండటం చూచినాను. నీవుపులిచేత దెబ్బతిని వళ్ళంతారక్తంక్రమ్మికోగా కనిపించినావు. నాకల నిజమవుతుంది. ఇంక ఏడవవద్దు. లోకాలన్నింటినీ జయించినవాడూ సాటిలేని వేగంకలిగినవాడూ పుణ్యాత్ముడూఅయిన నీ భర్తను నీవు త్వరలో కలుసుకోగలుగుతావు."ఈ త్రిజటమాటలు 'నిజమేఅవుతాయ'ని భావించి సీత దుఃఖం కొంతమేరకు తగ్గించుకొన్నది. ఆశతోఉండింది.

అక్కడ రావణుడు సీతను తలచుకొంటూ వశంతప్పిన మనసు కలిగినవాడైనాడు. అదే సమయంలో సీతకు కావలిగా ఉన్నకొందరు రాక్షసస్త్రీలు రావణుణ్ణి కలుసుకొన్నారు. వారు సీతయొక్క తెగింపును గురించి వివరించినారు. రావణుడు దేవతలనూ దానవులనూ గంధర్వులనూ జయించగలిగినాడు. కానీ మన్మథుని విజృంభణనుమాత్రము అడ్డగించలేకపోయినాడు. దివ్యమైనమాలలూ, వస్త్రాలు, ఆభరణాలూధరించి నడయాడే కల్పవృక్షంలాగా తయారయినాడు. కానీ అదేసమయంలో శ్మశానంలోని మర్రిచెట్టులాగా అందంగాఉంటూకూడా మిక్కిలి భయంకరంగాఉండినాడు. అతడు ఆ విధంగా వేష ధారణ చేసుకొని అశోకవనంలోనికి ప్రవేశించినాడు. అతడట్లా సీతదగ్గరకువచ్చి, అనురాగం తొణకిసలాడగా ఇట్లాఅన్నాడు.

"ఓవనితా! అనవసరమైన దుఃఖంలోపడిఎందుకునవసిపోతావు? వెలుగొందే ఆభరణాలు అలకరించుకొని నన్ను దయతోఏలుకోకూడదా? ఇంక వేలకొలది మాటలెందుకు? దేవతల,యక్షుల, రాక్షసుల, కిన్నరుల, పన్నగుల, అందమైనస్త్రీల నెవరినీ మనసులో లెక్కించకుండా, నేను అనురాగంతో నిన్ను మనస్సులో ఆరాధించడం నీ భాగ్యంకాదా? ఇదంతా నీవు తెలుసుకోలేకపోతున్నావు. గర్వపు ఆలోచనలు నీవద్దనాకెందుకు? కానీ రాముడంటే ఎవడు? గొప్పతనాన్నీ రాజ్యాన్నీ పోగొట్టుకొని దుఃఖంలో మునిగిపోయిన ఒక నీచమానవుడు. వాడిపైన ఎక్కువప్రేమ చూపుతూ ఎక్కువ దుఃఖంతో మనసు తల్లడిల్లగా ఇట్లాఉండడం 'ఏవిధంగా సుఖమం'టావు? చెప్పు. నేను అన్నిలోకాలనూ పాలించే వాడను. పదునాలుగుకోట్లనిశాచరులూ, ఇరువదిఎనిమిదికోట్లరాక్షసులూ, ఎనుబదిఆరుకోట్లయక్షులూ, నాసేవకులు. అన్నిధనాలకు అధిపతియైన యక్షేశ్వరుడు నాకు అన్న. బ్రహ్మదేవుడితో సమానుడైన విశ్రవసుడు నాతండ్రి. కుబేరునికి వినోదంకలిగించే గంధర్వకన్యలూ అప్సరసలూ నన్నుకూడా కొలుస్తుంటారు. 'పంచమలోక పాలకుడన'ని మూడులోకాలూ నన్ను కీర్తిస్తాయి. దేవేంద్రుని ఇంట్లోఉన్నట్లే నాఇంట్లోనూ తినుబండారాలు తరగకుండాఉంటాయి. ఇట్లాంటి నా వైభవానికంతటికీ నా జీవితానికే అధికారిణివై సుఖంగా భోగాలను అనుభవించు." రావణుడిట్లా అనగానే సీత కోపంతోనూ శోకంతోనూ వ్యాకులత చెందింది. వాడివైపుకూడ చూడకుండా ఒకగడ్డిపోచనుచూస్తూ ఇట్లాఅన్నది.

"అయ్యో! నేను పరాయిస్త్రీని. బలంలేనిదాన్ని. పతివ్రతను. అందునా ఒక మనుష్య స్త్రీని. నీ వేమో రాక్షసుడవు. ప్రేమ కొంచెంకూడాలేని నా పొందులో నీకు కలిగేసౌఖ్యమదిఎంత? అదీకాక మొదటివాడైన బ్రహ్మదేవుడి మనుమడవు. లోకపాలురతో సమానమైనవాడవు. ఈశ్వరుని స్నేహితుడైన ధనపతికి తమ్ముడవు. ఇంతటివాడవైన నీవుధర్మం తెలుసుకొని దుర్మార్గాన్ని వదలవద్దా ? సిగ్గులేకుండా ఇట్లాంటి గర్వపుమాటలు మాట్లాడవచ్చునా?" అంటూ సీత పైటచెరుగుతో ముఖాన్నికప్పుకొంది. అతిదీనంగా ఏడ్చింది. ఆ దురాత్ముడు ఇంకాకొన్నిచెడుమాటలుమాట్లాడి మాయమయినాడు. సీత కూడా ఎప్పటిలాగానే రాక్షసస్త్రీల రక్షణలో ఉండిపోయింది.

మాల్యవంతపర్వతగుహా మందిరంలో విడిసిఉండినరాముడు, వర్షాకాలాన్ని ఎట్టకేలకుగడపి వేసినాడు. ఆ వర్షాకాలం కొత్తమొలకలచేత సుందరమైంది. కానీ రాముడికి మాత్రం సీత వియోగంచేత దాన్ని ఓర్చుకోవడం కష్టమైంది. అట్లాఉండగా ఒకరోజు రాముడు లక్ష్మణుతో "చూచినావా ? లక్ష్మణా! సుగ్రీవుని పనికిరానితనం. ఆవిధంగా పగనుఅణచివేసి మనంకపిరాజ్యమిస్తే తీసుకొని, ఇంద్రియసుఖాలతో ఎంతో పరవశించిపోయినాడు. మనవైపు చూడడంకూడలేదు. మనతోచేసుకున్నఒప్పందాన్ని తాను నెరవేర్చవద్దా? వానరాధముడు చాలకృతఘ్నుడైనాడు. పుణ్యాత్ముడా! నీ విప్పుడే కిష్కింధకు పో. సుగ్రీవుడు కుత్సితుడైన దుర్మార్గుడు. తనపనియందుమాత్రమే నిష్ఠకలవాడు. మిక్కుటంగా కామపరవశుడైనవాడు. నీవు పూనుకొని

వాడిని వాలిపోయినమార్గంలోనే పంపించి రా. ఇంకఇక్కడ ఆలస్యంచేయడమెందుకు? అయితే నీవు అక్కడకు పోకముందే సుగ్రీవుడు మనమీదప్రేమతో మనపనికి తగిన ప్రయత్నంచేసిఉంటే మాత్రం వాణ్ణేమీ చేయవద్దు. తోడ్కోని రా" అన్నాడు.

రాముడిఆజ్ఞతో లక్ష్మణుడు పొడవైనవిల్లు చేత్తోపట్టుకొని కిష్కింధకు వేగంగాపోయినాడు. సుగ్రీవుడుకూడ తత్తరపాటుతో అప్పులూతానూ లక్ష్మణునికి ప్రీతితో స్వాగతంచెప్పి, తగినవిధంగా పూజించినాడు. రామునిఆజ్ఞను గురించి లక్ష్మణుడు సుగ్రీవునికి చెప్పినాడు. అది విన్నసుగ్రీవుడికి భయంతో శరీరంవణికింది. సుగ్రీవుడు లక్ష్మణుడితో "అయ్యో! నేను ఎందుకు కృతఘ్నుడనవుతాను? సీతాదేవిని వెతకడానికి బలవంతులు బుద్ధిమంతులుఅయిన చాలామందివానరవీరులను నాలుగుదిక్కులకూ పంపినాను. వారుకూడా అన్ని అడవులు, కొండలు, సాగరాలు, నగరాలు, గ్రామాలు, నదులతో కూడిన భూమిఅంతా వెదకి 'ఒకనెలలోపల తిరిగివస్తామ'ని ప్రతిజ్ఞచేసిపోయినారు. ఇంక ఆ నెలకు ఐదుదినాలే కొరత. ఇంతే. ఆ తరువాత 'సీతాదేవి వార్త తెలుసుకొని దేవరను కొలచవలె'నని ఉన్నాను." అన్నాడు. ఆ మాటలువిని సంతోషించి, లక్ష్మణుడు సుగ్రీవుని తోడుకొనిపోయి ఆ రాముణ్ణి దర్శింపచేసినాడు. పొందికగా సుగ్రీవుడుచేసినపని విశేషాలు వివరించినాడు. అదివిని రాముడు మిక్కిలి సంతోషపడినాడు.

అటుపిమ్మట కొద్ది దినాలకు తూర్పు, పడమర, ఉత్తర దిక్కులకుపోయిన వానరులందరూ వచ్చి రాముణ్ణి చూచినారు. "దేవా! 'సముద్రమ'నే మొలనూలుతో చుట్టబడిన భూమండలమంతా వెదకినాము. దేవిమాకు కనిపించలేదు."అని చెప్పినారు. రాముడుదుఃఖించినాడు. రావణుడి లంకానగరం దక్షిణం వైపున ఉన్నదని కబంధుడు చెప్పినసంగతి బాగాగుర్తుకువచ్చింది. కాబట్టి దక్షిణదిక్కుకుపోయిన వానరులవల్ల సీతవిషయం తెలుస్తుందన్న ఆశతో బ్రతికిఉండినాడు. ఇంకొకనెల జరిగిన తరువాతకొందరువానరులు పరిగెత్తుకొనివచ్చి సుగ్రీవునితో ఇట్లాఅన్నారు.

"నీవునేడూ, వాలినాడూ, ప్రేమతో చూచుకొనే పెద్దతోటకదామధువనం? దాన్ని ఈ నాడు మనఅంగదుడు, హనుమంతుడు మొదలైనవాళ్ళు బలవంతంగా కొల్లగొట్టి పండ్లన్నీ తింటున్నారు. ఆ తోటకావలివారమైన మమ్మందరనూ అవమానించినారు."

ఆ మాటలువినగానే మనస్సులో, "అంగదుడు మొదలైనవాళ్ళు సీతాదేవిని వెదకడానికి దక్షిణ దిక్కుకు పోయినవారు. కాబట్టి ఇదివారు సీతాదేవిని చూచివచ్చిన ఉత్సాహమైఉంటుంది. కాకపోతే ఇట్లా చేయడానికి భయపడరా? రాజకార్యం సిద్ధంచేసేవారికి ఇట్లాంటి చనువు ఎక్కడైనా ఉండేదే కదా?" అని ఊహించినాడు. ఆ విషయం రాముడికి వివరించి చెప్పినాడు.

దక్షిణంవైపు సీతాదేవిని వెదకివచ్చిన వానరులు మధువనంలోని తేనెనుత్రాగినారు. చాలా తీయని కమ్మ్ని పండ్లు కోరికతోతిన్నారు. దట్టంగాఉండే నీడలనుమెచ్చుకొన్నారు. పిల్లగాలులచల్లదనాల పరిమళాల నిండుదనానికి మిక్కిలిపరవశించి పోయినారు. మధువనంఅంతా కలయతిరిగి విహరించి తృప్తిపడినారు. అందరూ కూడుకొనిపోయి సుగ్రీవుడు లక్ష్మణులతోకూడా ఉన్న రాముణ్ణి దర్శించినారు. దండప్రణామాలు చేసినారు. రాముడు వారి ముఖకవలికలను చూచి, "వారు నిశ్చయంగా సీతనుచూచి వచ్చినారు." అనుకొన్నాడు. అప్పుడు మిక్కిలిబుద్ధిశాలిఅయిన హనుమంతుడు రామునికి చేతులుజోడించి.

"సీతాదేవిని చూచినాను. రామా !" అన్నాడు. తిరిగి ఇట్లాఅన్నాడు. "కొండలు, నదులు, అరణ్యాలు, నగరాలు, సముద్రాలతోకూడిన భూవలయమంతావెదకి దక్షిణదిశలో సీతాదేవిని చూడగలిగినాము. దయచేసివినండి. దేవా! మేమంతా తొలుతగా అన్నిచోట్లాఒళ్లంతా కళ్ళుపెట్టుకొని దేవిని వెదకుతూ పోయినాము. అట్లాపోయి ఒకచోట అద్భుతమైన భూమిలోని సొరంగాన్నిచూచి దానిలోనికి దూరినాము. అదిఎల్లప్పుడూ చీకటిగాఉండేది. చాలా కీటకాలు కలిగిఉన్నది. అట్టి సొరంగంలో చాలాయోజనాల దూరం పోయినాము. అప్పుడు ఎదురుగా సూర్యరశ్మి లాగా ప్రకాశించే ఒక నగరం కనిపించింది. అక్కడ తపస్సు చేసుకొంటున్న ఒకస్త్రీ కనిపించింది. ఆమె మమ్మల్నాదరించింది. తన పేరు 'ప్రభావతి'* అనీ ఆ నగరము 'మయునిపురం' అనీ చెప్పింది. తియ్యని తినుబండారాలను మా అందరికి తినడానికి ఇచ్చింది. అవితిని మేమందరమూ తృప్తిచెందినాము. ఆ తరువాత ఆమెచెప్పినమార్గంలో సొరంగంనుండి బయటపడినాము. అక్కడనుండి సహ్యాద్రి దర్దురశైలాలు దాటినాము. మలయ శైలశిఖరము ఎక్కినాము. అప్పుడు అక్కడనుండి మాకు సముద్రం కనిపించింది. ఆ సముద్రపుటలలు ఆకాశాన్నంటుతూ ఉన్నాయి. అందులో రకరకాలైన ఎండ్రకాయలు, పాములు భయంకరమైన మొసళ్ళు విజృంభించిఉన్నాయి. లోతైన నీటితో దాటడానికి వీలులేకుండాఉందా సముద్రము అది బాగావెడల్పుగా భయంకరంగా ఉంది. దాన్నిచూచి, 'ఇది సముద్రము. ఈ వరకు గలభూమిలో సీతాదేవికొరకు వెదకినాము. అయినా ఆమెను చూడలేక పోయినాము. ఈ సముద్రాన్ని దాటిపోవడానికి ఎవరికీ సాధ్యంకాదు. 'సీతాదేవి కనబడలేదు.' అనిపోయి రాముడికిచెప్పి, ఆయన మనసుకు బాధకలిగించడంకంటే మనమిక్కడే చావడంమేలు. వేరే ఆలోచనలెందుకు?' అనుకొన్నాము. అందరము ఏకగ్రీవంగా చావడానికే నిశ్చయించుకొన్నాము. అట్లా అనుకొని తిండితినక పస్తులుండి చద్దామనుకొన్నాము. మనస్సులు నిగ్రహించుకొని 'రామునిపనిపైన మరణించిన జటాయువు ధన్యుడైనాడు. మనంకూడాఅదే విధంగా పుణ్యలోకాలుపొందుదాం' అని మాలోమేము

* మహాభారతంలో ఆరణ్యపర్వం సప్తమాశ్వాసంలో 15వ పద్యం (వచనం)లో 'ప్రభావతి' అని చెప్పబడిన తపస్విని రామాయణంలో 'స్వయంప్రభ' అన్న పేరుతో కనిపిస్తుంది.

మాట్లాడుకుంటూఉండినాము. అప్పుడు కొండశిఖరమువలె ఎత్తైనవాడు చాలగొప్పబలంకలిగినవాడు పక్షులలోశ్రేష్ఠుడూఅయిన ఒక్కడు చక్కగా మేమున్నచోటుకువచ్చినాడు. 'అయ్యలారా! 'జటాయువు' అంటున్నారు. మీరెవరు? చెప్పండి. నేనా జటాయువుకు అన్నను. మేమిద్దరం అరుణుని కుమారులం. నా పేరు సంపాతి. సంతోషంగా నేనూ తమ్ముడూ సూర్యమండలానికి పోయే కుతూహలంతో ఒక్కనాడు ఆకాశంలోనికి ఎగిరిపోయినాము. అట్లాఆకాశంలో పోగాపోగా సూర్యుని వేడిమిచేత నారెక్కలు మాడిపోయినాయి. నాతమ్ముడి రెక్కలుమాత్రముమాడలేదు. అప్పటినుండి నేనీకొండమీదనుండి ఎక్కడకుపోలేక ఇక్కడనేఉన్నాను. నాతమ్ముడెట్లా ఉన్నాడోతెలియదు. నాకు మిక్కిలి ప్రీతి కలిగేటట్లుగా నా తమ్ముడిగురించిచెప్పరా?' అన్నాడు. సంపాతి అట్లాఅనగా మేమతనికి మీ విషయాన్నీ రావణుడు సీతాదేవిని తీసుకొనిపోవడం, ఆమె కొరకై జటాయువు రావణుడితో యుద్ధం చెయ్యడం, చావడంగురించి చెప్పినాము. అదివిని సంపాతి మిక్కిలిదుఃఖించినాడు. మా విషయం వివరంగా అడిగితెలుసుకున్నాడు. ఆ తరువాత మాతోఇట్లాఅన్నాడు. "రావణుడు నాకుతెలుసు. ఆ రాక్షసుడు సహించలేని పరాక్రమంకలిగినవాడు. ఈ సముద్ర మధ్యంలోఉండే 'లంక'అనే పట్టణం అతని నివాసము. మీరక్కడ సీతాదేవిని చూడగలరు పొండి. ప్రయత్నంచేసి వెదకండి." సంపాతి ఇట్లాచెప్పి తనదారిన తాను పోయినాడు.

అందరం సముద్రం దాటడానికి ఉపాయాన్ని గురించి ఆలోచిస్తూ ఉన్నప్పుడు ఏ ఒక్కడూ ఉత్సాహం చూపలేదు. రామా! అప్పుడు నేనుపూనుకొన్నాను. తమఆజ్ఞ, మాతండ్రి వాయుదేవుడిదయ నాకు బలాన్ని కలిగించినాయి. ఎత్తైన కెరటాలుకలిగి పెద్దపెద్ద పాములతోనూ, మొసళ్ళతోనూ, భయంకరంగా, కనిపించే సముద్రాన్ని జనులకు ఆశ్చర్యాన్ని కలిగిస్తూదాటినాను. ఆ ఉప్పుసముద్రమధ్యంలో త్రికూట పర్వతంమీదఉందా లంకానగరం. ఎత్తైన విశాలమైన బంగారు, మణులు చెక్కబడినభవనాలతో బాగా ప్రకాశిస్తూఉంది. దానివైభవం ఇంకెక్కడాలేదు. దేవా! అక్కడ సీతాదేవిని వెదకుతూ ప్రవేశించి తగినట్లుగా అనేకవిధాల వెదకినాను. ఒకచోట రావణుడి అంతఃపురానికిదగ్గరలో అశోకవనంలో సీతాదేవిని చూచినాను. ఆమె కన్నీరుజడివానలాగా ఎడతెగకుండాకారడంవల్ల పాచిపట్టిన అందమైనచెక్కిళ్ళు కలిగిఉంది. వశంతప్పి ఒరిగిపోయిన తీగవంటిదేహంతో దగ్గరలోనిచెట్టు ఆధారంగా కూర్చొనిఉంది. బయటకువచ్చే నిట్టూర్పులవేడిమివల్ల చిగురుటాకులవంటి ఆమెపెదవులుపగిలి పండుటాకులవలె అయిఉన్నాయి. ఆలోచనలతో కలతచెంది తలఊపుతూ ఉన్నదాపుణ్యమూర్తి. ఆమె ఉత్తమసౌందర్యం కలిగిఉంది. వంచినముఖంతో దీనంగాఉన్నదామె. 'హారామా' అంటూ దుఃఖిస్తూఉండటంవల్ల ఆమెను సీతాదేవిగా గుర్తించినాను. 'అమ్మా! సీతాదేవీ! నేను రామునిదూతను వాయుదేవుడికుమారుణ్ణి. నిన్ను వెదకడానికి ఇక్కడకువచ్చినాను. రామలక్ష్మణులు మిక్కిలిక్షేమంగాఉన్నారు. వానరరాజైన సుగ్రీవుడు వారితో స్నేహముచేసి రాముడి కార్యము నెరవేర్చడానికి పూనుకొన్నాడు. ఇంక ఆలస్యం చేయకుండా నీ భర్త ఇక్కడకు వస్తాడు.

దుఃఖించవద్దు ఊరుకోవమ్మా! నేను రాక్షసుడను కానుసుమా! నిజంగా వానరుడను. నీ మనసులో అనుమానం వదలిపెట్టు' అన్నాను.

కొంచెంసేపు యోచనచేసి ఉత్సాహంతో ఆ సీతాదేవి, 'అన్నా! నిన్ను గుర్తించినాను. అది 'ఎట్లా అంటే' రామునిహితం కోరే అవింధ్యుడనే వృద్ధ రాక్షసుడొకడున్నాడు. అతడు ఇంతకుముందే ఇదంతా త్రిజటచేత నాకుచెప్పిపంపినాడు. అతనిమాటలు అబద్ధాలుకావు. రాముడు, సుగ్రీవుని సహాయం కలిగిఉన్నాడుకాబట్టి ఇంక ఆలస్యంలేకుండా రాముణ్ణి తోడుకొనివచ్చి నాకు సంతృప్తికలిగించు. నీకు జయం కలుగుతుంది పో.' అని తన శిరోభూషణమైన ఈ రత్నాన్ని మీకుగుర్తుగా నా చేతి కిచ్చింది. ఇంకా చిత్రకూటంలో జరిగిన కాకివిషయంకూడా 'నీకు గుర్తుగా చెప్పుము'న్నది. ఆ తర్వాత నన్ను 'పొమ్మ'న్నది. అట్లా ఆమెచేత అనుమతిపొంది, లంకానగరాన్ని కాల్చి, ఇదంతా మీకు చెప్పడానికి వచ్చినాను." అనిచెప్పి, హనుమంతుడు సీతహృదయమే ఈ రత్నముఅయిందేమో అనిపించే ఆ సీతాదేవి శిరోరత్నాన్ని రాముడికి సమర్పించినాడు.

రాముడు ఆ మనోహరమైన రత్నాన్ని గుండెకు హత్తుకొన్నాడు. దాంతో ఆయనకు గగుర్పాటు కలిగింది. కొంచెంసేపు కళ్ళు మూసుకొని సీతాదేవి కుచంపై సుఖంగా నిద్రించినట్లుగా ఉండిపోయినాడు. ఈ విధంగా రాముడు సీతవిషయంవిని ఆమెనుకలుసుకునే కుతూహలంతో కూడినవేగిరపాటుతో సుగ్రీవుణ్ణి చూచి, "దండయాత్రకు సిద్ధంచేయుమ"న్నాడు. సుగ్రీవుడు, "తమ ఆజ్ఞ ప్రకారమే చేస్తాన"న్నాడు.

సుగ్రీవుడు నాలుగువైపుల వానర నాయకులను పిలువడానికి పంపినాడు. ధీరులూ, ఉద్ధతులూ సాటిలేనివారూ అయిన గజుడు, గవయుడూ, రెండువందలకోట్ల వానరవీరులతో రామునికి తోడుపడడానికి పూనికతో వచ్చినారు. 'కుముదుడ'నేవాడు అరవైకోట్ల వానరవీరులతో మూడులోకాలూ దద్దరిల్లేటట్లు దండువిడిసి శ్రీరాముణ్ణి కలిసినాడు. లెక్కించలేనంత వానరసేనతో దధిముఖుడు రాముడికి ప్రియంగా భూమిఅదరేట్లుగా వచ్చినాడు. లక్షకోట్ల ఎలుగుబంట్లు కొలువగా నల్లని మేఘాలవలె భయంకరమైన రూపంతో సాటిలేని బలంకలిగిన జాంబవంతుడు రామునికార్యానికై పూనుకొని వచ్చినాడు. ఇంకా అనేకులు అనేక వేలసంఖ్యల సైన్యంతోకూడా వచ్చినారు.

ఈ రకంగాకూడిన వానరవీరులు రకరకాలైన ఆకారాలుకలిగినవారు. గొప్పబలం శౌర్యం కలవారు. అతిభయంకరంగా విజృంభించి విర్రవీగుతూ, వెనుకకువస్తూ, దగ్గరకువస్తూ పరుగెత్తుతూ, తిరుగుతూ, కనబడకుండాపోతూ, మలుపులు తిరుగుతూ, గర్వంతో కొండగుహల్లో చెట్లల్లో అడవుల్లో ఏటిగట్టుల్లో ఆనందంగా సంచరిస్తూఉన్నారు.

మహానుభావుడూ ప్రియమైనతమ్ముడూ అయిన లక్ష్మణుడు దేదీప్యమానంగా వెలిగిపోతూ భయంలేకుండా రాముణ్ణి అనుసరించినాడు. సుగ్రీవుని సైనికసమూహమంతా రాముడివెంటకదలింది. 'గర్వించిన శత్రువులనే మంచును కరిగించే సూర్యుడిలాగా రాముడు బయలుదేరినాడు. ఆ వానరసైన్యానికంతటికీ దారిచూపుతూ యుద్ధోత్సాహంకల హనుమంతుడు ముందు నడచినాడు. అంగదుడు నీలుడు నలుడు మొదలైనవీరులు మిక్కిలిఉత్సాహంతో ఆయాదిక్కులను రక్షిస్తూ రాక్షసుణ్ణి జయించాలనే కోరికతో ప్రయత్నాలు తగినట్లుచేసి భయంకరంగా దండువెడలినారు .

ఈ విధంగా బయలుదేరి అడవిపండ్లూ నీళ్ళూబాగా ఉండేచోట్ల ఆగుతూ, కపిసైన్యంకొన్ని రోజులకు దక్షిణసముద్రతీరం చేరింది. ఆ సైన్యం రెండవసముద్రంలాగా గొప్పగాధ్వనిచేస్తూఉండింది. అప్పుడు రాముడు సుగ్రీవుణ్ణిచూచి, ఇట్లాఅన్నాడు. "మనసైన్యం చాలపెద్దది. సముద్రమేమో దాటరానిది. సుగ్రీవా! ఈ సముద్రాన్ని దాటడానికి తగినఉపాయమొకటినిశ్చయించు." అన్నాడు. అప్పుడు రాముణ్ణి చూచికొందరు 'బలమైనతెప్పలమీద దాటుదామ'న్నారు. కొందరు 'పెద్దపెద్ద పడవలను నిర్మించి దాటుదామ'న్నారు. అదంతావిని రాముడు మెల్లగానవ్వుతూ ఇట్లాఅన్నాడు. "మీరు చెప్పేవి తగిన ఉపాయాలేఅయినా లెక్కలేనంతటి వానరసేనకంతా పడవలు తెప్పలుచాలినన్ని నిర్మించడం ఆలోచిస్తే అసాధ్యం. నూరుయోజనాల పొడవైన సముద్రాన్ని పడవలలో తెప్పలలో దాటేటప్పుడు శత్రువులు సందుచూచి మీద పడిచంపరా? అంతేకాకుండా అల్పులైనవర్తకుల మాదిరిగా పడవలమీద, తెప్పలమీద, పోతే వీరులకు తేజస్సు కలుగుతుందా? కాబట్టి మీరు చెప్పే ఈ పద్ధతులు నాకునచ్చలేదు. మీరంతా నా మనస్సులోని నిశ్చయాన్ని వినండి? వ్రతంచేసి దీక్షతో ఉపవాసవిధానంతో సముద్రుణ్ణి పూజిస్తాను. నాకీ సముద్రుడు ప్రసన్నుడై దారిఇస్తేమేలే. అట్లాకాకుండా నన్నొకసామాన్యమానవుడిగాతలచి సహకరించకపోతే మనుష్యులకు సాధ్యంకాని కోపవేగంతో 'మండింపబడిన బాణాలు' అనేఅగ్నితో ఈ సముద్రజలాలన్నింటిని ఇంకింపచేస్తాను. ఒక్కక్షణంలో నీళ్ళన్నీఆవిరైపోయేటట్లు చేస్తాను."

అట్లాచెప్పిన రాముడు తానూతన తమ్ముడూ ఉపవాసంచేసి, దర్భలమీద పండుకొని, సముద్రుణ్ణి ప్రార్థించినారు. సముద్రుడు తనలో నివసించే జలచరాలన్నీ తన పరివారంలాగా వెంటరాగా రాముని ఎదుట ప్రత్యక్షమయినాడు. "అయ్యా! నీ యందు నాకు ప్రీతి కలిగింది. నీకేది ఇష్టమో చెప్పు. చేస్తాను". అన్నాడు. అందుకు రాముడు, "సముద్రుడా! నాకు లంకపైకి దండుతో పోవడానికి దారిఇవ్వు. అట్లాదారి ఇవ్వకపోతే సూర్యునితోసమానమైన నాదివ్యాస్త్రాలతో నిన్ను ఎండిపోయేట్లు చేస్తాను." అన్నాడు. ఆమాటలకు సముద్రుడు రామునితో ఇట్లాఅన్నాడు.

"రామా! నీపనికి నేనేవిధమైనఆటంకం కలిగించడానికైనా జంకుతాను. నా మాటవిను. జనులందరూ చూస్తూఉండగా నీకిప్పుడు నేనుదారిఇస్తే ఇకపై భూమిమీద ప్రతివాడు తనదివ్యాస్త్ర బలంతో

నన్నుసాధించాలనుకొంటాడు. మీసేనలో మేధావియైనవాడూ, విశ్వకర్మకుమారుడూ, శిల్పకర్మ బాగాతెలిసినవాడూ, 'నలుడనే ఒక కపివీరుడున్నాడు. వాడుపూనుకొని నాలోచెట్లుకొండలువేస్తే వాటిని నేనుధరిస్తాను. నీకదివారధిగా ఉపయోగపడుతుంది. నీవు నీసేనతో ఆ వారధిమీదుగాపోయి శత్రువులను జయించు." అని రాముణ్ణి అంగీకరింపచేసి సముద్రుడు అదృశ్యుడయినాడు.

రాముడు, నలుణ్ణి పిలిపించి 'సేతుబంధనం చేయుమ'ని ఆజ్ఞాపించినాడు. వానరులనేకవేలమంది నలుదిక్కులకు పరుగెత్తి కొండశిఖరాలూ చెట్లూవిరిచి తెచ్చిఇస్తూఉంటే ఆ నలుడు సముద్రంలో నూరు యోజనాలపొడువునా పదియోజనాలవెడల్పుతో చాలగట్టిసేతువును నిర్మించినాడు.

ఆ సమయంలో వినయమేభూషణంగాకల విభీషణుడు అన్నమీదఅలిగి తనఅప్తులూతానూ ప్రీతిగావచ్చి, నిండినభక్తితో రాజశ్రేష్ఠుడైన రాముడినిశరణువేడినాడు. ఆ రాక్షసశ్రేష్ఠుని ఆకారమూ, మనసులోని భావాలనుతెలిపే ముఖకవలికలను రాముడు జాగ్రత్తగా గమనించినాడు. రాముడు ఆ 'విభీషణునికి రావణుని వైభవమంతా ఇస్తాన'ని ప్రతిజ్ఞచేసినాడు. అతనికి లక్ష్మణునితో స్నేహముకూడ కల్పించినాడు.

ఆ వెంటనే అడ్డంలేకుండా వానరసైన్యంతో ముందుకుకదలినాడు. విభీషణుణ్ణి ముందుంచు కొన్నాడు. మహాభయంకరంగా వారిధిని, వారధిపైదాటినాడు. ఈ విధంగా సేతువుపై సముద్రాన్ని దాటి త్రికూటపర్వతాన్నెక్కి, లంకానగరంచుట్టూ 'సైనికశిబిరాలు' నిర్మించడానికిఆజ్ఞాపించినాడు. లంక చుట్టూఉండే తాటిచెట్లు, ఏలకులచెట్లు, అగరువృక్షాలు, మద్దిచెట్లు, తమలపాకులతీగలు, మామిడిచెట్లు, వేపచెట్లు, నేరేడుచెట్లచేత అందంగాఉండే అడవులలో వానరసైన్యంవిడిసింది.

రావణునిచారులు 'శుకుడు, సారణుడు' అనేవారు వానరాకారాలుతాల్చి వానరసేనా శిబిరాలలో సేనవివరాలకొరకై తిరుగుతూఉండినారు. ఆ విషయం తెలుసుకొని విభీషణుడు వారిని పట్టించి రాముడికి సమర్పించినాడు. ఆ రాముడువారికి తనసైన్యాన్నంతా చూపించడానికి ఏర్పాటుచేసి విడిచిపెట్టినాడు. ఈ సేనాబాహుళ్యవిశేషాన్ని శుకసారణులిద్దరూచూచి లంకానగరంప్రవేశించినారు. రావణుణ్ణి, దర్శించినారు. 'కపిసైన్యం జయించరానిద'ని రావణుడికి విన్నవించుకున్నారు. రామలక్ష్మణుల తేజో విశేషాన్నికూడా వివరించిచెప్పినారు. రావణుడు దానినేమాత్రం లెక్కచేయకుండా యుద్ధానికి సిద్ధమైనాడు.

లంకకోటకు రాళ్ళువిసరేయంత్రాల నమర్చినారు. ఎత్తైనబురుజులతో ఆ కోట భయాన్నికలిగిస్తూ ఉంది. ఆ కోటపొడవైన జెండాలతోనిండిఉంది. తోమరాలు, ముద్గరాలు, కొరువులు, రోకళ్ళు, ఈటెలు, బాణాలు, శతఘ్నులు, కలిగిన యోధవీరులుఆకోటను రక్షిస్తూఉన్నారు. వారందరూ భయంకరమైనయుద్ధాలు చేయడంలో ధైర్యంకలిగినవారు. గుర్రాలు, రథాలు ఏనుగులతోనిండి భయంకరమై ఉందాకోట. ఆ కోటకు ఏడుప్రాకారాలుఉన్నాయి. దాటలేని పరిఘఉంది. రావణుడు గడ్డి, కట్టెలు, నీరు,

తిండిపదార్థాలు మొదలైనవస్తువులతో లంకను నింపిఉంచినాడు. గొప్పగా రక్షణ ఏర్పాటుచేసుకొనిఉన్నాడు. శత్రువులను జయించాలనే మిక్కుటమైన కోరికతోఉండినాడు.

ఇక్కడ రాముడు సుగ్రీవునితో కలిసిఉండి అంగదుణ్ణి చూచి, "నీవు రావణుడివద్దకుపోయి అతనికి తగిన విధంగా మంచిగాచెప్పి, 'సీతను విడవడం తనకేమేల'ని చెప్పుమ"ని నియోగించినాడు. ఆ పని మీద అంగదుడు లంకద్వారాన్ని అడ్డంలేనినడకతో దాటినాడు. అనుమానంలేకుండా రాక్షససైన్యం తననుచూచి భయపడుతూఉండగా లీలగానగరంలోనికిపోయినాడు. రావణునికొలువుకూటము చేరినాడు. అక్కడమిత్రులతో కొలువున్న రావణుణ్ణిచూచి ప్రకాశించేఆకారంతో ఇట్లాఅన్నాడు.

"రాముడు విలువిద్యలో అందరికీ గురువులాంటివాడు. ఆయన మీతో 'ఇట్లా' అనమని నన్ను పంపినాడు. ఆయనచెప్పినమాటలు స్పష్టంగావిను. 'అపరాధం చేయనివారిని అడవులలో ఉన్న సాధువులుఅయిన తపస్వులను చాలామందినిచంపినావు. పతివ్రతలైన దేవతల భార్యలను చెరపట్టి లోకాలన్నింటికీ అపకారము చేసినావు. 'ఇదంతా ఒకఎత్తుఅయితే పరాక్రమంతో నన్నుఎదిరించడం ఒకఎత్తు' అని చెప్పడమెందుకు? బలంతో మంచివీరుడవై యుద్ధానికి రా. అట్లాకాకపోతే నన్నుశరణు చొచ్చి సీతను నాకు అప్పచెప్పు. ఇంకొక విధంగా నీవు బ్రతికిఉండడంకుదరదు. నీ ప్రాణం నావాడి 'బాణాల'నే పాములకు ఆహారంకావలసిందే. ఇదినిజం. మనిషినిఅయిన నారీతిని అనుమానం పొయ్యేటట్లుగా యుద్ధభూమిలోచూడు. విను. 'రాక్షసులు' అనేపేరులేకుండా చేయకుండా ఊరకనే పోనిస్తానా?' అని 'నన్ననమ'న్నాడు" అని చెప్పేఅంగదుని కఠినమైనమాటలకు రావణుడు కోపగించుకున్నాడు.

రావణుడి అభిప్రాయంతెలుసుకొని నలుగురురాక్షసులు వేగంగాఅంగదుని చుట్టూచేరి పట్టుకున్నారు. అంగదుడు ఆ పట్టుకొన్న రాక్షసులతోకూడా బాగాఎగిరి భవనశిఖరంపైకి దాటినాడు. ఆ త్రోపుడు వేగానికి ఆ నలుగురు రాక్షసులు ముక్కలుముక్కలై కూలినారు. అంగదుడు భవనశిఖరంనుండి నేరుగావానరసేనా శిబిరంమధ్యలోనికి దుమికినాడు. రాముడికి తాను పోయివచ్చిన విషయం విన్నవించినాడు.

ఆ తరువాత రాముడి అనుమతితో తాటిచెట్లు, మద్దిచెట్లు, పదునైన రాళ్ళు, చేతులతో పుచ్చుకొని కులశైలాలవలె ఎత్తైనశరీరాలతో భయంకరులై రకరకాలైన రంగులుకలిగినవారూ, గంభీరమైన భయంకరమైనబలంకలిగినవారూ. యముడితో సమానూలూఅయిన వానరులు యుద్ధసన్నాహాలు చేసినారు. ఏ దిక్కు చూచినా తోకలేకనిపిస్తున్నాయి.

వానర వీరులంతా గుమిగూడి అరుపులశబ్దాలు అతిశయించగా, పొంగినడిచే వానరసైన్యంలో గొప్పఅలలతో కనిపించే సముద్రపుసౌందర్యం కనిపించింది. కోటముందుఉన్న భయంకరదానవ సైన్యాన్ని వానరసేన సులభంగా పారతోలింది. ఆ కోటను నాలుగు వైపుల రక్షించే రాక్షసవీరులను మహాభయంకరంగా

కూలద్రోసి ఎత్తైనజెండాలు, గోపురాలు, మేడలు, బురుజులు, మొదలైనవాటిని ఆ కపివీరులు ఒక్క క్షణంలోనే తారుమారు చేసినారు.

ఇంకా ప్రాకారంపై ఉండే గదలు, పరిఘలు,కుంతాలు మొదలైనవాటిని లంకానగరంమధ్యలోనికి విసరడం ప్రారభించినారు వానరవీరులు. బాలురు వృద్ధులతోసహా పౌరులందరూ హాహాకారాలతో కలత చెందినారు. అప్పుడు రావణుడు పంపిన పెక్కువేలకోట్లమంది రాక్షసులుపోయి, "ఎక్కడ? ఎక్కడ?" అని ముట్టడించి, వానరులను పారద్రోలి ఎప్పటిలాగా కోటగోడలను తిరిగి ఆక్రమించి నిలబడినారు. ఆ సమయంలో ఇంతకుముందు కోతులు ఆక్రమించడంచేత కపిలవర్ణంలో ఉన్నకోట తిరిగి రాక్షసులు ఆక్రమించడంచేత మేఘాలరంగుకు మారింది. కపిసేన పారిపోయింది.

వెంటనే రామలక్ష్మణులుఇద్దరూ యుద్ధానికిపూనుకున్నారు. అదిచూచి కపిసేనఅంతా తిరిగి ఉద్యమించి కోటనుముట్టడించింది. ఇట్లాముట్టడించగా కోటనురక్షించేరాక్షసవీరులు, వానరసేన కోటను చేరకుండా రాళ్ళు, భల్లాలు, గండ్రగొడ్డళ్ళూ, చిల్లకోలలు, కొరువులు, బాణాలు, ఈటెలు మున్నగునవి ప్రయోగించినారు. వానరులు వాటిని లెక్కచేయకుండా చెట్లు, రాళ్ళు ప్రయోగిస్తూ పూనుకొని కోటగోడలపైకి ప్రాకినారు. అప్పుడు ఇరువైపుల వారికి జుట్లాజుట్లాపట్టుకొనే యుద్ధంజరిగింది. ఆ తరువాత రావణుడుపంపగా 'పర్వతుడు, ప్రఘసుడు, ఖరుడు, క్రోధవశుడు, ప్రరుజుడు,' అనే ఐదుమంది రాక్షసులు చాలామంది రాక్షసపిశాచసేనలతోకూడి నగరం బయటకువచ్చినారు. వచ్చి మాయచేసినారు. కనబడకుండా కపిసైన్యాన్ని నొప్పించడం ప్రారంభించినారు. అది చూచినాడు విభీషణుడు. ఆ విభీషణుడు భయంకరమైన పరాక్రమము కలిగినవాడు. శత్రువుల గర్వంఅణచగలిగినవాడు. మహాస్త్రాలెన్నో తెలిసినవాడు. మాయాయుద్ధంలో కూడా విశారదుడు. అట్టివిభీషణుడు గొప్పగా కోపగించుకొనివచ్చి ఆ రాక్షసవీరుల మాయను పట్టుదలను క్షణంలో అణచివేసి వారందరనూ చంపివేసినాడు.

ఆ విభీషణుడి బాణాల దెబ్బలకు చాలబాధపడిన సగంరాక్షససేన నేలకూలింది. మిగిలిన సగం భయంతోపరుగెత్తి లంకానగరపు కోటలోనికిపారిపోయింది. ఇదంతావిని రావణుడికి కోపం పుట్టింది. మంత్రులతోకూడి తానేస్వయంగా యుద్ధరంగానికి బయలుదేరినాడు. మదపుటేనుగుల గుర్రాల సైనికుల అడుగుల బరువుతో భూమిబద్దలయింది. ఈ విధంగా బయలుదేరి భేదించడానికి శక్యంకాని శుక్రవ్యూహాన్ని ఏర్పరచుకొని వానరసైన్యంపైకి దండెత్తినాడు. అదిచూచి రాముడు బృహస్పతి వ్యూహాన్ని ఏర్పాటు చేసుకొని విజృంభించి ఎదుర్కొన్నాడు. ఆ రెండుసేనలూ అకాలంలో కలతచెందిన రెండుసముద్రాలలాగా ఒకదానొక్కటి ఎదుర్కొన్నాయి. అప్పుడు రాముడు రావణుడితో తలపడినాడు. లక్ష్మణుడు ఇంద్రజిత్తుతో పోరాడినాడు. సుగ్రీవుడు విరూపాక్షుడితో యుద్ధంచేసినాడు. తారుడు నిఖర్వటుని ఎదిరించినాడు. అట్లారెండువైపులవారికి దేవతలకూ రాక్షసులకూ మునుపుజరిగినయుద్ధంలాగా భయంకరమైన యుద్ధంజరిగింది.

అందులో లక్ష్మణుడు వాడియైన బాణాలగుంపులతో ఇంద్రజిత్తును ఆక్రమించినాడు. ఆ ఇంద్రజిత్తు యుద్ధరంగం విడచిపోకుండా ఆ లక్ష్మణుణ్ణి అమ్ములవానలో ముంచినాడు. రాముడూ రావణుడూకూడ విజృభించినారు. ఆ బాణవర్షంలో తడిసిపోయి ఇద్దరూకూడ వేగంతగ్గియుద్ధంలో తమకుతామే తృప్తిచెందినారు.

ఆ తరువాత రావణుడు తనబాహుబలంతో రాముడిపరాక్రమాన్ని ఆపడం 'అసాధ్యమ'ని తెలుసుకొన్నాడు. శౌర్యాన్నీ పూనికనూవదలి వేగంగాతిరిగి లంకానగరంచేరినాడు. రాక్షససేన భయపడి పారిపోసాగింది. ప్రహస్తుడుమాత్రం భయంలేకుండా సముచితంగా మిక్కిలిభయంకరంగా కనిపిస్తూ ఎదురించేసన్నాహంచేసినాడు. అతణ్ణిచూచి ఆ రాక్షససేనలన్నీ తిరిగి యుద్ధోత్సాహాన్ని పుంజుకున్నాయి. విభీషణుడువిజృంభించి భయంకరమైన వానరసేనతోకూడి అడ్డులేకుండా ఎదుర్కొన్నాడు. అప్పుడు ఆ రెండుసేనలకూ అద్భుతమైన మహాయుద్ధంజరిగింది.

యుద్ధంలో చేయితిరిగిన ప్రహస్తుడు యుద్ధవిద్యాక్రీడలలో నేర్పరి. అతడు గర్వించి పూనికతో విభీషణుణ్ణి ఎదిరించినాడు. మిక్కిలిఅతిశయంతో వారిద్దరూ ఒకరిమీదఒకరు వందలకొద్దీ బాణాలను ప్రయోగించినారు. ఆ బాణాలు వాడిగా ఎముకలలాగా భయంకరంగాఉన్నాయి. అవి నెమలి ఈకల పుంభాలు కలిగిఉన్నాయి. మేఘాలు క్రమ్ముకొన్న కొండలలాగా వారిద్దరూ ఒప్పారినారు.

ప్రహస్తుడు దగ్గరకుపోయి సింహనాదంచేసి వేగంగా పరిఘనెత్తుకొని మదించిన ఏనుగు భయంకరంగా తొండంతో బాదినట్లుగా, అసూయతో దయలేకుండా విభీషణుణ్ణి కొట్టినాడు. ఆ విభీషణుడు అంతటి దెబ్బకుకూడ కొంచెమైనా కదలకుండా హేమకూటపర్వతంలాగా నిలబడి గొప్పగా కోపం కలిగినవాడై గర్వంతోప్రకాశించి శక్తినిపూన్చిమంత్రించి ప్రహస్తుణ్ణి కొట్టినాడు. ఆ శక్తి నూరుగంటలతో అలంకరించబడిఉంది. లోకాలన్నింటినీ సంహరించగలిగిన భయంకరమైనఅగ్నిజ్వాలలతో ప్రకాశించింది. విభీషణుడు అట్లాంటి శక్తిని ప్రయోగించగా దానినిష్ఠురమైన తాకిడిచేత రొమ్ముబద్దలై వజ్రాయుధంచేత ముక్కలుచేయబడిన కొండలాగా ఆ ప్రహస్తుడు నేలకూలినాడు.

ఈ విధంగా ప్రహస్తుడు పడిపోగా ఆసేనలు తిరుగుముఖంపట్టగా, ధూమ్రాక్షుడు కోపంతో ఎఱ్ఱబడినకన్నులతో తనరాక్షససమూహంతో పరుగెత్తుకొంటూవచ్చినాడు. తనతోపాటువచ్చిన రాక్షస సేనదట్టమైన మబ్బులసమూహంలాగా నల్లగాకనిపించింది. వారినిచూచి వానరసేన చలించింది. బలంతగ్గి తొలగిపోవడానికి ప్రయత్నించింది. అదిచూచి ఆంజనేయుడు జయించరానివాడై నిలబడగా, ఆటోపంగా ఎప్పటిలాగా వానరసేనాపతులు కూడుకొన్నారు. అప్పుడు ధూమ్రాక్షుడిచేత రక్షించబడే రాక్షససేనకూ, ఆంజనేయుడిచేత రక్షించబడేవానరసేనకూ భయంకరమైనయుద్ధంజరిగింది.

ఆ భయంకరమైన యుద్ధంలో వానరసేన విజృభించింది. నిష్ఠురమైన కాలిదెబ్బలతో రథాలు దొరలిపోయినాయి. రాళ్ళదెబ్బలతో బాధతోకూడిన ఘీంకారాలతో ఏనుగులు తూలిపడిపోయినాయి. ఎత్తైన చెట్లదెబ్బలతో గుర్రాలు చచ్చిపోయినాయి. తీవ్రమైన గోళ్లతోనూ. పండ్లతోనూ చేసినకాట్లతో శరీరాలు ఛేదించబడి నేలమీదపడి తన్నుకొనే వీరరాక్షసభటులు అయినారు. అట్లా మిక్కిలిశౌర్యం కలిగిన కపివీరులచేత నొప్పించబడి రాక్షససేన కొంతభాగం భయంతో పరుగెత్తింది. కొంతభాగం బలహీనమై నిలబడిపోయింది. మిగిలినభాగం ధ్రూమాక్షుడివెనుకన ఒదిగిపోయింది.

చూచి ధూమ్రాక్షుడు జగత్తును సంహరించే వేగంతో ప్రకాశించే నల్లటి మేఘంలాగా ఉరుములాంటి సింహనాదంతో పూనుకొని వందలకొద్దీ బాణాలతో జడివాన కురిపిస్తూ చూడశక్యంకాని ప్రయత్నం ప్రారంభించగా, వానరసేనాసమూహాలు క్షోభించినాయి. తూలిపోయినాయి. కూలిపోయినాయి. బలమూ పట్టుదలా చెదరిపోగా నొప్పిపడినాయి. పారిపోయినాయి.

ఆ ధూమ్రాక్షుని విజృంభణాన్ని సహించలేకపోయినాడు హనుమంతుడు. వాయువేగంతో వచ్చినాడు. సింహనాదంచేసినాడు. ధూమ్రాక్షుణ్ణి కవిసినాడు. ఇంద్రునికి ప్రహ్లాదునికి జరిగినట్లుగా ఆ ఇద్దరికీ భయంకరమైనయుద్ధం జరిగింది. ఆ ధూమ్రాక్షుడు చాలాపరిఘలు గదలూ ఆశ్చర్యకరంగా హనుమంతునిపైన ప్రయోగించినాడు. హనుమంతుడేమో పెద్దపెద్ద రాళ్ళకొండలు పెద్దపెద్దచెట్లు ధూమ్రాక్షుణ్ణిమీద కురిపించినాడు. ఈ విధంగా చాలాసేపు యుద్ధంజరిగింది. కొంతసేపటికి లంకను కాల్చిన హనుమంతుడు లాఘవంగా నడచినాడు. ధూమ్రాక్షుణ్ణి సమీపించినాడు. తనవిశాలభుజస్కందాలపై మోసుకొని వచ్చిన పెద్ద వృక్షాన్ని గురిచూచి ఉత్సాహంగా విసరినాడు. ఆ దెబ్బకు ధూమ్రాక్షుడు తట్టుకోలేక ముఖంనుండి నెత్తురు కారుతుండగా ఆ నెత్తుటి బురదలో ముందరిభాగం మునిగిపోయిన శరీరంనుండి ప్రాణాలుకోల్పోయినాడు.

ఈ విధంగా ధూమ్రాక్షుడు చావగా, కపి సైనికులు కేకలుపెట్టినారు. హనుమంతుణ్ణి రకారకాలుగా పొగడినారు. రాక్షసులను సంభ్రమంతో పారద్రోలినారు. మిగిలినరాక్షసులంతా పారిపోయిలంకానగరం ప్రవేశించినారు.

పారిపోయివచ్చిన రాక్షసులు రావణుడికి ప్రహస్తుడు ధూమ్రాక్షుడు చచ్చినవిధం తెలిపినారు. రావణుడు కన్నీటితో నిట్టూర్పులతో పాలిపోయిన ముఖంతో "ఉన్నవారంతా మరణించినారు. కుంభకర్ణుడు ఉండికూడా లేనివాడే అయినాడు. వీడిని మేలుకొల్పవలెనా? లేక నేనూ నా కొడుకులూ మాత్సర్యంవీడక శత్రువులతో సమానంగా యుద్ధంచేయవలెనా?". అని ఆలోచించి రావణుడు కుంభకర్ణుణ్ణి మేలుకొల్పడమేఅప్పటికి

తగినపనిగా నిశ్చయించినాడు. కుంభకర్ణుని పడకటింటికి పోయినాడు. 'అతడిని మేలుకొలుపుమ'ని సేవకులను ఆజ్ఞాపించినాడు.

భేరుల మృదంగాలశబ్దాలు కాహళాలగంటల కలనాదాలు భయంకరమైన సింహనాదాలు చేసినారాసేవకులు. చాలాసేపటికి కుంభకర్ణుడు శరీరాన్ని కదలించి వతికలతిరిగినాడు. కన్నులుతెరచి, "హూ" అని పెద్దగాఆవులించినాడు. కొంతతెలివితెచ్చుకున్నాడు. చుట్టూచూచినాడు. ఎదురుగాఉన్న రావణుడు తనప్రియమైనతమ్ముణ్ణిచూచి, "ఇట్లాంటి వింతనిద్రలు ఎవరిలోనైనాఉన్నాయా? ఎవరేమైపోయినారో నీకు తెలియదు. నీవు ధన్యుడవు. మనకు దాపురించిన ఆపదలను గురించివింటావా? దశరథుని కొడుకైన రాముడిభార్యసీతను నేను అపహరించినాను. అందుకు వాడు కోపగించుకున్నాడు. చాలా వానరసైన్యాన్ని కూర్చుకున్నాడు. వారితోవచ్చి సముద్రాన్ని బంధించినాడు. మనకోటపై దండెత్తినాడు. మమ్ములనందరనూ బాణాలతో నేలకూలుస్తున్నాడు. ప్రహస్తుడు మొదలైన వీరులు చాలామందిచచ్చినారు. నీవుతప్ప ఇతరులుఎవరూవాడినిజయించలేరు. కాబట్టి లే. వేగంగా శత్రువుమీదికిపోయి యుద్ధంచేసిగెలువు. దూషణుని తమ్ములు వజ్రవేగుడు ప్రమాథుడు నీకు తోడ్పడతారు." అన్నాడు. అందుకు కుంభకర్ణుడు, "అట్లే కానీ." అని కావలసినఆయుధాలను సమకూర్చుకుని తోడుగా యుద్ధవీరులను తీసుకొని లంకకోటనుండి బయటకు నడిచినాడు. కానీ పాపమాతడు ఇంకానిద్రనుండి పూర్తిగా తేరుకోనేలేదు.

అట్లాబయటకువచ్చిన కుంభకర్ణుడు భయంకరమైన దావానలజ్వాలలాగా ఉండేఎర్రని వెంట్రుకలు కలిగినవాడు. దట్టమైనమేఘపురంగు కలిగినవాడు. మిక్కుటమైన కోపంతోకూడిన క్రూరమైన కనుకొనలనుండి పెద్దపెద్దఅగ్గిరవ్వలు రాల్చుతున్నాడు. వాడు భయంకరమైన ముఖంకలిగినవాడు. పండ్లుకొరకడంచేత కారేనెత్తురుతో తడిసిన పెదవులుకలిగినవాడు. పొడవైన చేతులుకలవాడు. నడిచేటప్పుడు వాడికాళ్ళ బరువుతో భూమివంగి పోతూవుంది. వాడుమూడు లోకాలనూ గెలువగలబలం కలవాడు. అట్లాంటి రాక్షసవీరుణ్ణిచూచి వానరవీరులంతా ఆశ్చర్యపడినారు.

కుంభకర్ణుడు తనమనసులో వానరవీరులను ఏమాత్రం లెక్కచెయ్యలేదు. మిక్కుటమైనబలంతో రామలక్ష్మణులవైపు మిక్కుటమైన వేగంతో మార్కొనడానికి బయలుదేరినాడు. కానీ వానరవీరులు పెద్దపెద్ద చెట్లూ పిడుగులలాంటి మహాభయంకరమైన రాళ్ళూ విసరి భయకరంగా కుంభకర్ణుణ్ణి కొట్టడం ప్రారంభించినారు. కొందరు బలంతో వేగంగాసమీపించి అతని శరీరాన్ని భయంకరమైన గోర్లతో, పండ్లతో గీరి కొరికి చించినారు. అట్లావానరసైన్యం విజృంభించివేగంగా కుంభకర్ణుణ్ణి ముందుకు పోకుండానిలబెట్టింది.

దీనితో కుంభకర్ణుడు నిద్రనుండి ఇంకాకొంత తేరుకున్నాడు. కపివీరులు ఏమిచేసినా లెక్క చేయకుండా స్థిరంగా నిలబడి, ఒక్కసారిగా ఆ కపిసైన్యాన్ని పారవశ్యంతో మింగడం మొదలుపెట్టినాడు. ఆ మింగడం

'ప్రళయకాలంలో నిండినగర్వంతోనూ కోపవేగంతోనూ యముడు జనాన్ని మింగుతున్నాడేమో'నని అనిపించింది.

ఈ విధంగా బలుడు, చండబలుడు వజ్రబాహుడు మొదలన చాలామంది వానరసేనాధిపతులనూ చాలావేల సంఖ్యలో వానరసైన్యాన్నీమ్రింగినాడు. ఇంకా గదతీసుకొని ముందుకువస్తూఉన్న ఆ కుంభకర్ణుణ్ణి సుగ్రీవుడు ఎదుర్కొన్నాడు. మద్దిచెట్టుతో వాడి నడినెత్తిని భయంకరంగా గురిచూచికొట్టినాడు. ఆ వేటుతో కుంభకర్ణుడు పూర్తిగా నిద్రనుండిమేలుకున్నాడు. వెంటనేపూనికతో రెండుచేతులూ ముందుకుచాచి వేగంతోకూడిన పిచ్చిఆవేశంతో సింహనాదంచేసి సుగ్రీవునిపట్టుకున్నాడు.

ఈ విధంగా పట్టుబడినసుగ్రీవుని దిట్టఅయిన లక్ష్మణుడు ఎదురుగాచూసినాడు. బాగా కోపించినాడు. కుంభకర్ణుణ్ణి పిడుగువంటి గొప్పబాణంతో గట్టిగాకొట్టినాడు. ఆ బాణం కుంభకర్ణుని రొమ్ములో దూరిబయటకుపోయింది. కుంభకర్ణుడు మిక్కిలిగా బాధపొందినాడు. ఆగ్రహించినాడు. వేగంగా సుగ్రీవుని వదలిపెట్టి పెద్దరాతిని తీసుకున్నాడు. బలంగా లక్ష్మణునివైపు పరుగెత్తుకొనివచ్చినాడు. ధీరుడుఅయిన లక్ష్మణుడు రెండుబాణాలతో కుంభకర్ణుడి రెండుచేతులనూ నరకినాడు. మాయాబలంలో గొప్పవాడైన ఆ కుంభకర్ణుడు నాలుగుచేతులతోకనిపించినాడు. లక్ష్మణుడు ఆ నాలుగుచేతులను వాడిబాణాలతో నరకినాడు. వాడు ఇంకాచాలాచేతులు తలలుకలిగిన వాడుగా కనిపించినాడు. అప్పుడు లక్ష్మణుడు కోపగించుకొని బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించినాడు. కుంభకర్ణుడు కొండకూలినట్లు కూలినాడు.

ఈ విధంగా కుంభకర్ణుడు చావడంచూచి దూషణుని తమ్ములు వజ్రవేగుడూ, ప్రమాథుడూ, లక్ష్మణునితో తలపడినారు. దట్టమైనఅమ్ములప్రవాహంలోలక్ష్మణుణ్ణి ముంచివేసినారు. అప్పుడు లక్ష్మణుడుకూడా వారిపైలెక్కలేనన్ని బాణసముహాలను ప్రయోగించినాడు. అప్పుడు ఒక్కక్షణం యుద్ధంచూచే వారికి గగుర్పాటుకలిగింది. ఆ తరువాత హనుమంతుడు వేగంగా పరుగెత్తుకొనివచ్చి ఆ మహారాక్షసుల మీదవిజృంభణంతో రెండుగొప్పకొండశిఖరాలను గురిచూచివేసినాడు. ఆకారాలునశించి అణిగిపోయి చెప్పడానికికాని చూపడానికికాని లేకుండా ఆ ఇద్దరురాక్షసులు చచ్చినారు. అప్పుడు వానరవీరులంతా గొప్పఉత్సాహంతో అరచినారు. రాక్షససైన్యం కలతచెందింది. మిక్కిలిభయపడింది. నలువైపులకు చెదరింది. లంకఎనిమిది వాకిళ్ళగుండా లంకలోనికిదూరింది. లంక పౌరులంతా భయపడిపోయినారు.

అప్పుడు తనప్రియమైనతమ్ముడుకుంభకర్ణుడు యముడిదగ్గరకు చేరడాన్నీ, దూషణుని తమ్ముల మరణవృత్తాంతాన్నీ, విని రావణుడు ఎంతోదుఃఖంతో వణకిపోయినాడు. వశంతప్పిఏడ్చినాడు. ఆ సమయంలో రావణునికొడుకు మేఘనాదుడు కవచంధరించినాడు. అమ్ములపొదిని కట్టుకున్నాడు. భయంకరమైనవిల్లును చేత్తోపట్టుకున్నాడు. కృపాణం మొదలైన ఆయుధాలన్నీ రథంలోనింపినాడు. ఇంద్రుని

జయించిన ఆ మేఘనాదుడు తండ్రిదగ్గరకువచ్చినాడు. "తండ్రీ! రాక్షసరాజా! నేను ఉండగా నీవు దుఃఖించడం ఎందుకు?. ఏ విధంగానైనా లోకంలో నీ శత్రువులకు పరాక్రమముచెల్లుతుందా? దేవేంద్రుడుమొదలైన దేవతలవిజృంభణాన్నిఅణచివేసి సాటిలేని గొప్పతనంతో ప్రకాశిస్తూఉన్ననీకు కోతుల గుంపులను ఓడించడం ఎంతపని? దేవా! నన్ను దయతో యుద్ధానికి పంపు. కూడుకున్న కొండ ముచ్చులను కోతులను భయంకరంగాకదిసి కోపంతోచెండాడుతాను. దేదీప్యమానంగా ప్రకాశించే భయంకరమైన పలురకాలబాణాలతో వీరనృత్యంచేస్తాను. వేగంగా రాజకుమారులిరువురనూ అవలీలగా సమీపించిచేతులు విరచికట్టివేస్తాను. పట్టుకొని తీసుకొనివస్తాను" అన్నాడు. మేఘనాదుడు ఇట్లా అనగా రావణుడు దుః ఖంనుండి తేరుకొన్నాడు. ఆ తరువాత తనప్రియమైనకుమారుడు మేఘనాదునితో ఇట్లాఅన్నాడు.

"నీ పరాక్రమలీల నిజంగా నాకుతెలియదా? కుమారా! నీ భుజబలప్రదర్శనం వల్లనే కదా నాకింత ప్రఖ్యాతీ సంపదా కలిగింది? దేవతలందరతోసహా దేవేంద్రుణ్ణి గర్వంతో తీసుకొనివచ్చి నీవు నాకుబంటుగా చేయలేదా? మాయలు బాగాతెలిసినవాడవు. గొప్పగొప్ప దివ్యాస్త్రాలు కలిగినవాడవు. యుద్ధంలో శత్రువులందరూ భయపడేట్లుగా కనిపించి కనిపించకుండా, నిరూపించడానికి వీలులేకుండా, పూనుకొని చిక్కుపరచు. నీమహాభయంకరాలైన బాణప్రయోగాలను రామలక్ష్మణు లోర్వగలరా? పుణ్యాత్మా! శత్రుబలాన్నంతటినీ మిగలకుండాచంపి, యుద్ధంలోచచ్చిన మనజనాల ఋణం తీర్చుకో. ఆలస్యం లేకుండా పోయిరా. యుద్ధంచేసి అందరనూచంపు." రావణుడు మేఘనాదునితో ఇట్లాచెప్పి, కౌగిలించికొని వీడుకొలిపినాడు. మేఘనాదుడే ఇంద్రుని జయించినందున 'ఇంద్రజిత్తు' అని పిలువబడినాడు. అతడు వెంటనే వేగంగా రథంఎక్కి లంకాపురం వెలుపలికివచ్చినాడు. అదిచూచి వానరవీరులు కేకలు పెడుతూ ఎదురునడచినారు. ఇంద్రజిత్తు ఆ వానరవీరులను ఏమాత్రం లెక్కచేయకుండా చేయెత్తి లక్ష్మణుణ్ణి పిలిచినాడు.

ఇంద్రజిత్తుపిలుపును స్వీకరించినాడు లక్ష్మణుడు. భూమ్యాకాశాల మధ్యభాగమంతా అతని వింటినారిధ్వని ప్రతిధ్వనించింది. మదపుటేనుగునుచూచిన సింహంలాగా ఆటోపంతో విజృంభించినాడు. వారిద్దరూకూడా శత్రువులను చెండాడేవారు. ఎప్పుడూ అపజయం తెలియనివారు. కులపర్వతాల వంటివారు. సముద్రాలలాగా ధీరులు. విలువిద్యలో నేర్పరులు. జయించడం సాధ్యంకానివారు. గొప్ప జయాన్ని కోరేవారు. అట్లాంటి ఆ ఇద్దరూ సింహనాదాలుచేసి మూడులోకాలకు భయంకరంగా ఒకరి నొకరు ఎదిరించినారు.

మత్సరము అతిశయించగా ఒకరినొకరు చిచ్చరపిడుగులవంటి బాణాలతో వేగంగానొప్పించుకొన్నారు. అప్పుడక్కడ విలువిద్యాకౌశలం ఇరువురియందూ సమానంగా కనిపించింది. తనకంటే అప్పుడు మేఘనాదుడు మించడానికి ప్రయత్నించేవాడు. లక్ష్మణుడు కూడా మేఘనాదునికంటే ముందుగానే సాటి లేని బాణాలతో అతిశయంగా ప్రకాశించేవాడు. అప్పుడు గొప్పతోమరాలను చాలావేగంగా లక్ష్మణుడు ఇంద్రజిత్తుపైన ప్రయోగించినాడు. ఎడతెగని ఆ తోమరాలను ఇంద్రజిత్తు చిన్నచిన్న ముక్కలుగాచేసినాడు.

ఆ సమయంలో అంగదుడు పూనుకొని లక్ష్మణుణ్ణి అతిక్రమించి, మిక్కుటమైన వేగంతో ఇంద్రజిత్తును సమీపించి పెద్దచెట్టుతో తలపైనకొట్టినాడు. ఆ దెబ్బకు ఇంద్రజిత్తు కొంచెంకూడా చలించకుండా అంగదుణ్ణి చంపడానికి వాడియైన ప్రాసాన్ని ఎత్తుకొన్నాడు. ఆ ప్రాసాన్ని లక్ష్మణుడు త్రుంచివేసినాడు. అప్పుడు ఇంద్రజిత్తు గదాదండం ప్రయోగించి అంగదుని రొమ్ముపై కొట్టినాడు. అంగదుడు తప్పుకోకుండా విజృంభించి మద్దిచెట్టుతో ఆ రాక్షసునిరథాన్ని గుర్రాలు సారథితోసహా పచ్చడిఅయ్యేటట్లు కొట్టినాడు.

ఆ విధంగా విరథుడైన మేఘనాదుడు అక్కడనే అంతర్ధానమై ఆకాశానికి ఎగిరినాడు. ఆ తరువాత 'అతడు ఏ పక్కకుదూకుతాడో? ఎవరిని ఏమిచేస్తాడో?' అనుకుంటూ మిక్కిలి భయపడి కపిసేనలు దర్పంవదలినాయి.

ఇంద్రజిత్తు విజృంభించినాడు. ఉరుముతూ ప్రళయకాలంలోని మేఘంలాగా కనిపించినాడు. దట్టమైన భయంకరమైన పిడుగులాంటి బాణాల గుంపులను కురిపించినాడు. వానరసేనను చంపినాడు. పరాక్రమంతో కలచివేసినాడు. ఆయువుపట్లు నొచ్చేటట్లుగా బాణాలసముద్రంలో రామలక్ష్మణులను ముంచినాడు. ఆ ఇంద్రజిత్తు మాయాయుద్ధంలో ఆరితేరినవాడు. అదృశ్యదేహం కలిగినవాడు. అట్టి ఇంద్రవిరోధియైన మేఘనాదునిపైన ధీయుక్తులైన రామలక్ష్మణులు కోపంతో శబ్దభేదిదివ్యాస్త్రాలను ప్రయోగించినారు.

ఆ మేఘనాదునిపై కోపంతో సుగ్రీవుడుమొదలైన వానరవీరులు చెట్లూ, రాళ్ళూ, తీసుకొని ఆకాశానికి ఎగిరినారు. ఆ రాక్షసుడు వారినందరనూ భయపడేటట్లు కొట్టినాడు. వానరవీరులంతా భయపడి తిరిగి భూమికిచేరినారు. మేఘనాదుడంతటితో నిలబడకుండా వాడిబాణాలు ప్రయోగించి రామలక్ష్మణులను పెద్దగా నొప్పించినాడు. అన్నాతమ్ముడుకూడా నిశ్చేష్టులయినారు. నేలమీదికి ఒరిగినారు. ప్రళయకాలంలో పడిపోయిన సూర్యచంద్రులలాగా నేలమీదపడి కనిపించినారు. కపిసేనభయపడింది. మేఘనాదుడు సింహనాదముచేసినాడు.

వరప్రభావంతో గొప్పవాడైన ఆ రాక్షసుడు గర్వంతో వారించశక్యంకాని భరించడానికివీలులేని నాగాస్త్రాలతో ఆ రామలక్ష్మణులను బంధించినాడు. ఆ రామలక్ష్మణులిరువురూ కూడా మిక్కిలి గొప్పవారు. రాజులలోశ్రేష్ఠులు, దేదీప్యమానమైన పరాక్రమం కలిగినవారు. దేవతలతో సమానమైనవారు. కోసల దేశపురాకుమారులు. పొగడదగినవారు. తేజస్సుకలిగినవారు. అయినా అప్పుడునాగాస్త్రాలతో వారు బంధింపబడినారు.

ఆ సమయంలో సుగ్రీవుడు, సుషేణుడు, జాంబవంతుడు, మొదలైన కపివీరులు రామలక్ష్మణులు పడి ఉన్నచోటుకు చేరినారు. ఏంచేయాలో వారికితెలియడంలేదు. అందుకు దుఃఖిస్తూఉన్నారు. అప్పుడే అక్కడికి చేరిన విభీషణుడు వారందరనూ ఓదార్చినాడు. బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించినాడు. ఆ రామలక్ష్మణుల

నాగబంధనాలు వదలినాయి. సుగ్రీవుడు 'విశల్యకరణి'అనే ఔషధంతో రామలక్ష్మణుల దేహాలలోని శల్యాలను తొలగింప చేసినాడు. ఈ విధంగా మేలుకొన్న రామలక్ష్మణులు తిరిగియుద్ధానికి పూనుకొన్నారు. అప్పుడు విభీషణుడు రామునికి నమస్కరించి ఇట్లాఅన్నాడు.

రాజా! ఈ దివ్యజలం తీసుకోండి. ఈ దివ్యజలాన్ని కుబేరుడుపంపినాడు. 'శ్వేతుడ'నే యక్షుడు తెచ్చినాడు. ఈ జలంతో కళ్ళుతుడుచుకోండి.అట్లా ఆ జలంతో కళ్ళుతుడుచుకొంటే కనబడని సమస్తమూ స్పష్టంగా కనిపిస్తుంది. విభీషణుడిట్లా అనగానే రామలక్ష్మణులు ఆ నీటితో కళ్ళుతుడుచుకొన్నారు. అప్పుడు ఆకాశంలో తిరుగుతూఉన్న గర్విష్ఠిఅయిన రావణుని పెద్దకొడుకు మేఘనాదుడు వారికి స్పష్టంగా కనిపించినాడు.

వెంటనే రామలక్ష్మణులు విజృంభించినారు. మేఘనాదుడు రామలక్ష్మణులకు స్పష్టంగా కనిపిస్తూ ఉండినాడు. అందువల్ల మేఘనాదుడి మాయాయుద్ధం చెల్లలేదు.ఆ రాక్షసుడు తానుచేసిన ప్రయత్నము వ్యర్థముకావడానికి ఆశ్చర్యపడినాడు. తాను తిరిగి 'వెళ్ళిహోమంచేయాల'నుకొన్నాడు. ఈ విషయం తెలుసుకొని విభీషణుడు లక్ష్మణుణ్ణిచూచి "ఈ నీచుడు హోమంపూర్తిచేస్తేవాణ్ణి ఎవరూగెలువలేరు. నీవిప్పుడే వాణ్ణి వెంబడించిచంపు."అన్నాడు.

అంతట లక్ష్మణుడు సింహనాదంచేసినాడు. మేఘనాదుని వెంటపడినాడు. పిడుగులతోసమాన మైనబాణాలు ప్రయోగించినాడు. మేఘనాదుడు కోపగించుకొన్నాడు. వేగంగా వెనుదిరిగినాడు. లక్ష్మణుణ్ణి ఎదుర్కొన్నాడు. లక్ష్మణుడి శరీరంలోనికి వెలుగొందే బాణాలునాటినాడు. ఆ విధంగా తలపడి ఆ వీరులిద్దరూ రెండు గొప్ప ఏనుగులవలె, భయంకరములైన రెండుపులులలాగా, రెండుసింహాల మాదిరిగా, చాలా భయంకరమైన యుద్ధంచేయడం ప్రారంభించినారు. రాక్షససేనా, వానరసేనాకూడా ఆశ్చర్యంతో వారిద్దరియుద్ధాన్ని చూస్తూ ఉండిపోయినాయి.

లక్ష్మణుడు ఇంద్రజిత్తు పైవేగంగా ఒకేసారి వాడిబాణాలు ప్రయోగించినాడు. ఆ ఇంద్రజిత్తుకూడా లక్ష్మణుడిపై ఎనిమిదిబాణాలను వ్యవధిలేకుండా శరీరమంతటా నాటేట్లుగా ప్రయోగించినాడు. వాడిబాణాలు శరీరంలోనాటుకోగా లక్ష్మణుడు ఒకింతబాధపడినాడు. వెంటనే తేరుకొన్నాడు. 'కోపమ'నే అగ్ని ప్రజ్వలించగా లక్ష్మణుడు తన గొప్పధనుస్సుయొక్క అల్లెత్రాటిధ్వని విస్తరించేట్లు చేసినాడు. ఇంద్రజిత్తు మీదికి విజృంభించినాడు. వాడిఅయిన రెండుబాణాలతో అతివేగంగా వాడి రెండుచేతులూనరకినాడు. వెనువెంటనే పరాక్రమదక్షుడైన లక్ష్మణుడు కులపర్వతశిఖరాన్నిఖండించిన వజ్రాయుధంలాంటి వాడిభల్లంప్రయోగించినాడు.

వెలిగిపోయే కుండలాలతో ప్రకాశించే ఇంద్రజిత్తు తలనేలమీద పడింది. ఈ విధంగా ఇంద్రజిత్తు కొమ్మలునరకిన చెట్టులాగా పడిపోవడంచూచి రాక్షససైన్యం భయపడి పారిపోయింది. వానరసైన్యం విజృంభించి సింహనాదాలుచేసింది.

కుమారుడి మరణవార్త స్పష్టంగావిని రావణుడు దుఃఖంచేత వశంతప్పి కన్నీరు కారగా "హా" అంటూ పదినోళ్ళూ తెరచిగట్టిగా ఏడ్చినాడు. దుఃఖాన్నిభరించలేకపోయినాడు. "ఈ వినాశనానికి మూలకారణం సీతే కదా?" అనుకొన్నాడు. "ఆమెనుచంపడమే తత్క్షణకర్తవ్యమ"ని భావించినాడు. అశోకవనానికి పరుగు పరుగున పోయినాడు. కోపంచేత కలతచెంది సీతను చంపడానికి చంద్రహాసాన్ని ఒరనుండి బయటకు పెరికినాడు.

అప్పుడు వయసులోనూ వినయంలోనూ పెద్దవాడైన అవింధ్యుడు రావణుణ్ణి ఆపి, "రావణా! ఇది నీకు తగునా? దేవేంద్రుడు మొదలైనవారినంతా యుద్ధంలో జయించినావు. మూడులోకాలలో పేరుపొంది ఉన్నావు. అట్టి నీవు 'స్త్రీని వధిస్తాన'నడం అవమానకరం కాదా? చేతనైతే విజృంభించి రాముణ్ణి గెలువు. స్త్రీని చంపితే నీకుగొప్పతనము వస్తుందా?" అన్నాడు.

ఆ మాటలతో సీతపైన రావణుడి కోపంచల్లారింది. రావణుడు యుద్ధసన్నాహంతో రథమెక్కినాడు. దర్పంశోభిల్లగా సమస్తసేనాసమన్వితుండై పురంవెలుపలకు నడచినాడు. అప్పుడు సుగ్రీవుడు మున్నగు వానరులందరూ గొప్పయుద్ధంకోసం వేగిరపడినారు. విజృంభించినారు. చెట్లూ రాళ్ళూ చేతుల్లో పూన్చుకొన్నారు. తోకలుతిప్పుతూ రావణుడిముందునడచే రాక్షససేనలను ఎదుర్కొన్నారు. అప్పుడు యుద్ధం మిక్కిలిభయంకరంగాసాగింది. ఆ సమయంలో మాయలన్నింటిలోనూ నిపుణుడైన రావణుడు మాయను ప్రదర్శించినాడు. ఆ మాయచేత ఆ రావణుడి దేహంనుండి భయంకరమైన గదలూ, శక్తులూ, ఖడ్గాలూ, కోదండాలూ ధరించిన వేలకొద్దీ గర్వించిన రాక్షసవీరులు పుట్టినారు. వాళ్ళందరనూ రాముడు దట్టమైన బాణాలగుంపులతో అవలీలగా ముక్కలుముక్కలు చేసినాడు. ఆ రావణుడు ఇంకొక్క మాయ ప్రయోగించినాడు. రామలక్ష్మణుల వంటిరూపాలు చాలాపుట్టినాయి. ఆ అన్నాతమ్ముళ్ళు ఆశ్చర్యపడినారు. కానీ కలతచెందలేదు. బాణాలుప్రయోగించి ఆ మాయారూపాన్నింటినీ త్రుంచివేసినారు.

ఆ సమయంలో ఇంద్రుడు మాతలితో తనరథాన్ని రాముడికిపంపినాడు. ఆ రథం ఉదయించే సూర్యబింబంలాగా వెలిగిపోతూఉంది. ప్రకాశించేగుర్రాలను కలిగిఉంది. మిక్కుటమైనవేగంలో సాటి లేనిదారథం. ఆ రథపుజెండాకాంతులు వెలిగిపోతూఉన్నాయి. ఆ రథాన్నితెచ్చి మాతలి భక్తితో ప్రేమతో రామునికి సమర్పించి ఇట్లాఅన్నాడు. "రాజా! ఇది ఇంద్రునితేరు. మునుపు ఈ తేరెక్కి ఇంద్రుడు భయంకరమయిన యుద్ధాలలో గొప్ప రాక్షసరాజుల ననేకులను తరిమినాడు. ఈ రథాన్నెక్కి నీవు కూడా

మూడులోకాల్లో దర్పంతో తలెత్తుకొని తిరిగే రావణుణ్ణి వధించు. నా సారథ్యంలోనినేర్పునూ సహాయాన్నీ పొందు."

ఆ మాటలువిని రాముడు మాతలినిఆదరించినాడు. ఆ రథంఎక్కినాడు. వింటినారిధ్వని మ్రోగుతుండగా శత్రు సమూహాన్ని అస్త్రాలలో ముంచినాడు. ఆ సమయంలో రావణుడు ప్రళయ కాలంలోని అగ్నివలె సహించరాని ఆకారంతో రాముడిపైకి తేరునుభయంకరంగాపరుగెత్తించినాడు. గర్వించి అతిశయించి అమ్ముల వెల్లువను దిక్కులన్నింటా నింపినాడు. ఆ రావణుడి ఉద్ధతినిచూచి ఆకాశంలో ఉండిన దేవతలు భయపడినారు. ఈ విధంగా తలపడి రామరావణులు భయంకరంగాయుద్ధంచేయడం ప్రారభించినారు. అప్పుడు రావణుడు దట్టమైన అగ్నిశిఖలచేత భయంకరమైన శూలాన్ని రాముని మీద ప్రయోగించినాడు. రాముడు దాన్నితునాతునకలు చేసినాడు. మాత్సర్యంతో అతిశయించి రావణుడింకా వరుసగా వందలూ, వేలసంఖ్యలలో శూలాలు, భిండివాలాలు, తోమరాలు, బాణాలు ప్రయోగించి ఆకాశమంతా అస్త్రాలతో నింపినాడు. అన్ని భూతాలు 'హాహా' కారాలతో వ్యాకులం చెందినాయి. రావణుడి సేనలో సంతోషంగా భేరులు మొదలైన తూర్యనాదాలు సింహనాదాలు ప్రతిధ్వనించినాయి. కొంతసేపటికి రావణునిచేత ప్రయోగించబడిన శస్త్రాస్త్రాలమంటనంతా ఎడతెగకుండా ప్రయోగించే బాణవర్షాల వెల్లువచేతమ్రింగి 'రాముడ'నే మేఘము మిక్కిలి విక్రమంతో అతిశయించింది. సకల వానరసేనా సంతోషంతో మిక్కిలి కోలాహలంగా మారింది.

ఆ తరువాత అందమైన బంగారుపింజలకాంతిచేత ప్రకాశించేదీ వాడియైన ముఖంకలిగిందీ దేవతలు, యక్షులు, మునులు, సిద్ధులు, సాధ్యులు మొదలైన వారందరికీ ఆనందం కలిగించేదీ అయి ప్రకాశించే బాణాన్ని వీరవరుడైన రాముడు తీసుకొన్నాడు. బ్రహ్మాస్త్రాన్ని అందులో ఆవహింపచేసినాడు. వింటికి సంధించినాడు. అదిచూచి జగములన్నీ జయజయధ్వానాలు చేసినాయి. రాముడు నారిని వేగంగాలాగి తీవ్రంగా ఆ బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించినాడు. ఆ అస్త్రము పూనుకొని కల్పాంతంలో అగ్ని లాగా రావణుణ్ణి కాల్చిబూడిదచేసింది.

అప్పుడు ఆకాశంలో దివ్యతూర్యనాదాలు విజృంభించినాయి. చావకమిగిలిన రాక్షసులంతా కలతచెంది పారిపోయినారు. గంధర్వగానాలూ అప్సరసల నాట్యాలూ జరిగినాయి. ఇంద్రుడు మొద లైనదేవతలంతావచ్చి రాముణ్ణి పొగడుతూ ఆనందించినారు.

అన్నిలోకాలనూ దోచుకొన్నవాడూ, భయంకరమై ఆకారంకలవాడూ, పదిముఖాలుకలిగినవాడూ, అయిన రావణుడు రాముడిబాణంవాతపడగా, మూడులోకాలలోను ఒకేసారి పండుగజరుపుకున్నారు. అంతట విస్తారమైన కీర్తిని పొందినవాడూ, శరణాగత రక్షకుడూ, దయార్ద్రహృదయుడూ, శత్రువులను జయించేవాడూ, అయిన శ్రీరాముడు తమ్ముడులక్ష్మణునితోకలసి మిక్కిలిసంతోషించినాడు.

లంకాపట్టణానికి రాజుగా రాక్షసులకు ప్రభువుగా పుణ్యాత్ముడూ రాక్షస సమూహాన్ని పెంపొందించే వాడూ అయిన విభీషణునికి రాముడు పట్టముకట్టినాడు.

ఆ తరువాత అవింధ్యుడు విభీషణునితో కలిసి సీతాదేవిని తగిన వాహనంలో ఉంచుకొని రాముని వద్దకు తెచ్చి "దేవా ! పరిగ్రహించు" అని విన్నవించినాడు. అప్పుడు సీత మిక్కుటంగా మాసినశరీరం కలిగిఉంది. చినిగిపోయి మాసిపోయినవస్త్రాన్ని ధరించిఉంది. కన్నీరు నిరంతరం కార్చడంవల్ల చెక్కిళ్ళపై చారికలుఏర్పడిఉన్నాయి. చిక్కుపడి జడలుజడలుగా అల్లుకొని ఉన్నజుట్టు ముడినికలిగిఉన్నది. అట్లా దీనంగాఉండి చిరకాలదుఃఖభారంచేత వేగిన దానిని తనకుప్రియమైన భార్యయైన సీతాదేవిని ప్రస్తుతించబడిన నడవడికకల రాముడు అప్రియంగాచూచినాడు. ఎక్కువగా మనోవ్యథ చెందుతూ ఆమెతో, "అతి మిక్కిలి దుష్టాచారుడైన రావణుడింతకాలము తనయింటిలో ఉంచుకొనిఉన్న నిన్ను నేను స్వీకరిస్తే, నా చరిత్రకు ధర్మహాని కలుగదా? అవమానానికి ప్రతీకారంగా శత్రువును చంపినాను. కానీ నీ కొరకుకాదు. నీ నడవడిక మంచిదైనాకానీ, చెడ్డదైనాకానీ నిన్ను నేను నిజంగా పరిగ్రహించలేను. నీ విధం కుక్కవాతపడినహవ్యంలాగాఅయింది. వేగంగా నీ కిష్టమైన చోటుకు పో" అన్నాడు.

ఆ మాటలు సీతకు చెవులు కాల్చినట్లయినాయి. ఓర్పునశించగా కన్నీళ్లతో చలించే సీత మొదలు నరకితే ఒరిగిపోయే అరటిచెట్టులాగా తల్లడపడుతూ నేలకూలింది. పరిజనులంతా ఆశ్చర్యపడినారు. చింతా క్రాంతులయినారు. సంతోషంగా ఎర్రగాఉండిన వారిముఖాలు తెల్లపోయినాయి. ముఖాలు వంచి ఏం చేయాలో తెలియక పెద్దదుఃఖంతో కొయ్యబారిపోయినారు. సీతాదేవి మెల్లగాకొంతసేపునకు స్పృహలోనికి వచ్చింది. కదలలేనిశరీరంతో వేగంగాకన్నీరుకారగా చేతులుజోడించి రాముణ్ణిచూచి గద్గదస్వరంతో ఇట్లాఅన్నది.

"నీకు ధర్మహాని కలుగకుండా జనులందరికీ నా విషయంలో నిజంతెలిసేట్లు, రాజా! నేను అగ్నిలో ప్రవేశించి బయటకువస్తాను చూడు. ఈ కోరికను దయతో నాకుప్రసాదించు. నాబుద్ధి ఎప్పుడూ నీ పాదాలనే స్మరిస్తూ ఉంటుంది. అంతేకాని ఇంకేమీ ఎప్పుడూస్మరించదు. ఇంతే సుమా! ఇట్లాకాక ఇంకోవిధమైతే ఈ భూమీ, అగ్నిదేవుడూ, గాలిదేవుడూ, చంద్రుడూ, సూర్యుడూ, అంగీకరించక ఇప్పుడే నన్నుకాల్చివేయరా? దేవతలు చెడ్డనుసహిస్తారా?"

సీతాదేవి ఈ మాటలు అన్నవెంటనే పృథివి మొదలైన భూతాలు తమతమ కంఠస్వరాలు మ్రోగగా అందరూ వినేట్లుగా వారివారి పేర్లు చెప్పుకొని ఇట్లాఅన్నారు. "విను. రాజా! సీత ఉత్తమురాలు సుమా! సందేహపడనవసరములేదు. మాకుబాగాతెలుసు. ఏ విషయంలోనైనా జనులెవరూ మమ్మల్నిమోసం చేయలేరు."

భూతాలు ఇట్లాఅన్న తరువాత అందరు దేవతలు మునులతోసహా బ్రహ్మదేవుడు అక్కడకు వచ్చినాడు. రాముడు వారందరనీ సత్కరించినాడు. తరువాత బ్రహ్మదేవుడు రాముడితో ఇట్లాఅన్నాడు. "రామా! సకలభూతాలకు సహించరానివాడైన రావణుణ్ణిచంపి, లోకాలన్నింటికీ మేలుచేసినావు. విను. నలకూబరుని శాపంచేత రావణుడు పరస్త్రీలను బలాత్కారము చేయడానికి వీలుకాదు. కాబట్టి నీధర్మపత్నిలో ఒకపాపంకూడాలేదు. నీవు అనుమానంలేకుండా ఈ పతివ్రతను స్వీకరించి నెమ్మదిగాఅయోధ్యకు పో." ఇట్లాచెప్పిన తరువాత రాముడికి ప్రియంగా యుద్ధంలో మరణించిన వానరుల నందరనూ బ్రతికించి బ్రహ్మదేవుడు అంతర్ధానమైనాడు. మాతలికూడా రాముడివద్ద వీడ్కోలుపొంది వేయిగుర్రాలతోకూడినరథాన్ని తీసుకొని స్వర్గానికిపోయినాడు.

రాముడు శత్రువులు లేనివాడై సీతతో కూడుకొని పుష్పక విమానమెక్కినాడు. ఆ పుష్పకవిమానం చెక్కబడిన మణుల కాంతులతోనూ ప్రకాశిస్తున్న క్రొత్తపువ్వులతోనూ ప్రకాశిస్తున్నది. ఆ పుష్పకవిమానం తొలుత వైశ్రవణుడిది. అతణ్ణి జయించి రావణుడు గ్రహించినాడు. నేడు రాముడు రావణుని చంపిదానిని స్వాధీనము చేసుకున్నాడు. ఆ విధంగా వైశ్రవణుడి (కుబేరుడి) శాపం ఫలించింది. ఆ పుష్పకవిమానంమీద సంతోషంతో తన్మయత్వంతో రాముడు సముద్రాన్నిదాటి అయోధ్యానగరానికి తృప్తిగాచేరినాడు. భరతుడు శత్రుఘ్నుడు ఇతర బంధుజనులు పరిజనులూ అందరూ రాముణ్ణి అభినందించినారు.

వసిష్ఠుడు వామదేవుడు రామపట్టాభిషేకానికి ఏర్పాట్లు కావించినారు. రాముడు అయోధ్యరాజుగా పట్టాభిషిక్తుడయినాడు. సుగ్రీవుడు విభీషణుడు మొదలైన స్నేహితులను రాముడు మంచిబహుమానాలతో సత్కరించివీడుకొలిపినాడు.

పిమ్మట రాముడు ఇష్టమైనసౌఖ్యాలుఅనుభవించినాడు. నిరంతరం దానాలుచేసినాడు. గొప్పగొప్పయజ్ఞాలు చేసినాడు. కీర్తిని పొందినాడు. కొన్నివేలసంవత్సరాలు భూమినిపరిపాలించినాడు.

**నీతి :** ధర్మమెప్పుడూ జయిస్తుంది.

**విశేషం :** సూర్య వంశంలో సూర్యుని తరువాత శ్రీరాముడికి ముందు ఉండినవారిలో ఇక్ష్వాకువు రఘువు, కాకుత్స్థుడు గొప్పవారు. అందుచేత ఆ వంశాన్ని వారిపేర్లతోకూడా పిలుస్తారు.

**ఉ.** **భూరిభుజుండు విశ్రవసుపుత్త్రుఁడు పంక్తిముఖుండు దర్పదు**
**ర్వారుఁడు రాక్షసేంద్రుఁడు భవద్వరశక్తినవధ్యుఁడై మహా**
**ఘోరముగాఁ ద్రిలోకములకుం గడుఁబీడ యొనర్పఁజొచ్చె; వృ**
**త్రారి పురోగమత్రిదశులందఱుఁ గింకరులైరి వానికిన్.** **6-289**

ఉ.	దానవుచేత cగష్టపడి దైన్యము నొందుట కోర్వలేక నీ
దైన పదాంబుజంబులభయంబని చేరితి; మింక మమ్మునె
ట్లైనcగృపార్ద్రమానసుcడ వై తగ cజేకొనవయ్య! మాకు ది
క్కైనను గాకయున్న cగమలాసన ! నీవ కదయ్య యెయ్యెడన్.	6-290

ఉత్సాహము :

వినవె రాముcడనcగ నొకడు విపులదర్పహృదయుcడై
మన ఖరుండు లోనుగా సమగ్రశౌర్యు లైన య
ద్దనుజవరులcదునిమి, యిపుడు దండకస్థలంబునం
దొనర నిర్భయత్వ మొప్పనున్న వాcడు మేటి యై.	6-318

చ.	ఎఱుగవు గాక రాఘవునుదీర్ఘభుజాబలరూఢి నాజిలో
నుఱక తదీయబాణరయమోర్వ వశంబె పినాకికైన ?ను
క్కఱు మతి నీకు నిత్తెఱcగు గాదన కే ఖలుcడొక్కొబుద్ధిగా c
గఱపినవాcడు; సేటునకు cగాలము సేరెనొ గాక యిమ్మెయిన్.	6-320

ఉ.	దేవతలార యో ధరణిదేవతలార !జగత్త్రయోన్నతుం
డై వెలుcగొందురామునికులాంగన జానకి నేను; నన్నుమో
హావిలుcడొక్క రక్క సుcడనర్గళుcడై కొనిపోయెదుం; గృపం
గావరె!పుణ్యమున్యశముcగైకొనరే!యిదె మీకు మ్రొక్కెదన్.	6-343

క.	అనియేడ్వcగcదద్వచనములనఘుcడుగిరిగహ్వరాంతరాలయగతుcడై
వినియరుణసుతుcడుతేజోఘనుcడుజటాయువనుపక్షికారుణ్యమునన్.	6-344

ఉ.	ఉరమునయందు cగన్నులుc, బృథూదరదేశమునందునోరుc, బ్ర
స్ఫురితభుజద్వయంబుc, గులభూమిధరోన్నతభావముం గరం
బరుదుగ నుగ్రమైన వికృతాకృతితోడ నశేషసత్త్వఘ
స్మరుcడగుచున్నవాని cబటుసత్త్వు cగబంధునిc గాంచి రచ్చటన్.	6-357

ఆ.	అక్కబంధు దామిషార్థియై లక్ష్మణు cబట్టికొనియె బాహుబల మెలర్ప;
నతcడుcగడువిషణ్ణుcడై'యన్న!నను జూడు'!మనుచురాము జూచియనియె మఱియు.	6-358

చ. అనిమిషయక్ష రాక్షస వియచ్చర కిన్నర పన్నగాసురాం
*గనలఁగరంబు చిత్తమునఁ గైకొన కే ననురాగలీలమై*
*నినుమదినాదరించుటిది నీదగుభాగ్యము గాదె? యింతయున్*
వనిత!యెఱుంగ వైతి;గరువంపువిచారము లేల నీయెడన్. 6-405

ఉ. తేనెలు గ్రోలి క్రోలి, కడుఁదియ్యనిపండు లింపు సొం
పొనఁగ నాని యాని, పరపందిననీడలు మెచ్చిమెచ్చి, మం
దానిలశైత్యసౌరభసమగ్రతకుం గడుఁజొక్కి చొక్కి, యు
ద్యానమునందు మారుతసుతప్రముఖుల్ విహరించి తృప్తులై. 7-11

ఉ. కూడిన కొండప్రుచ్చులను గ్రోఁతుల నుగ్రత ముట్టి కిన్కఁ జెం
డాడెద; నుజ్జ్వలోగ్రవివిధాంబకచుంబితదిఙ్ముఖుండ నై
యాడెద వీరనృత్యము; రయంబునఁ బార్థివసూను లిద్దఱం
గ్రీడయపోలెఁ గిట్టి పెడకేలుగఁగట్టెదఁ; బట్టి తెచ్చెదన్. 7-111

# 47. సావిత్రి కథ.

(అరణ్య 7-170 నుండి 279 వరకు.)

(పాండవుల అరణ్యావాసకాలంలో ధర్మరాజుఅడుగగా మార్కండేయుడు చెప్పినకథలలో ఇదిఒకటి.)

పూర్వకాలంలో 'అశ్వపతి' అనే గొప్ప రాజొకడుండేవాడు. అతడు మద్రదేశాధిపతి. అతడు సంతానం కోసం చాలనిష్ఠతో పద్దెనిమిదిసంవత్సరాలు సావిత్రీదేవినిఆరాధించినాడు. ఆ రాజుకు సావిత్రీదేవి ప్రత్యక్షమైంది. 'వరమడుగు' అన్నది. ఆమెఅట్లాఅనగానే అశ్వపతి వినయంగా నమస్కరించినాడు. "కుమారుణ్ణికోరుతున్నాను" అన్నాడు. సావిత్రీదేవి, "నీకు కుమార్తెయేపుడుతుంది" అన్నది. అందుకు అశ్వపతి, "తల్లీ నీదయవల్ల నాకోరిక తీరవద్దా?" అని విన్నవించుకొన్నాడు. ఆ సావిత్రీదేవి గొప్పదయతో వికసించిన పద్మంవంటిహృదయంతో "నేను నీకోరికగురించి ముందేబ్రహ్మకు చెప్పినాను. కానీ అతడేమో నీకు కుమార్తె పుట్టేట్లు నిర్ణయించినాడు. ఆ దేవుని ఆజ్ఞకు తిరుగులేదుకదా? విను. ఆ కుమార్తెవల్ల నీకు ఆ తరువాత నూరుమందిపుత్రులు పుడతారు. సంతోషించు" అని అనుగ్రహించి అదృశ్యమయింది.

అశ్వపతి మహారాజు సావిత్రీదేవిదయవల్ల తనభార్య మాధవియందు 'సావిత్రి' అనే కూతురును కన్నాడు. ఆమెను మిక్కిలి శ్రద్ధతోపెంచినాడు. కొంతకాలానికి ఆ పద్మాక్షి సావిత్రి యౌవనవతి అయింది. ఆమె సౌందర్యము సిద్ధ, సాధ్య, యక్ష, దేవకన్యల సౌందర్యాన్ని అతిక్రమించింది.

అశ్వపతి తన ప్రియపుత్రికనుచూచి, "ఈమెకు గుణాల్లోనూ, వయసులోనూ, రూపంలోనూ తగినభర్తను ఎట్లాసంపాదించవలె?" అనుకుంటూ అన్నిచోట్లా ఆనందంగా వెతుకుతూఉండినాడు. అదేసమయంలో సావిత్రికూడా సాళ్వదేశపురాజు ద్యుమత్సేనునికుమారుడుసత్యవంతుడు 'రూపవంతుడ'నీ, 'గుణవంతుడ'నీ విన్నది. అతనిపై మనసు పడింది. కానీ సిగ్గుచేత ఎవరికీ చెప్పకుండా ఉండిపోయింది.

కాలం ఇట్లాజరుగుతుండగా ఒకానొకనాడు అశ్వపతివద్దకు నారదమహర్షి వచ్చినాడు. అశ్వపతి ఆయనకు పరిచర్యలుచేసినాడు. నారదుడు సంతోషించినాడు. ఆ తరువాత అశ్వపతిమహారాజూ నారదమహర్షీ ఏవేవో మంచిమాటలు మాట్లాడుకుంటూఉండినారు.

అప్పుడు రాజుకూతురు సావిత్రి అక్కడకు ప్రకాశిస్తూ వచ్చింది. ఆ సమయంలో ఆమెను పెక్కుమంది చెలులు సేవిస్తూ ఉన్నారు. 'మన్మథుని సంపదంతా ఈ సావిత్రిగా మారిందా?' అన్నట్లు కనిపించిందామె. ఆమె ఈ విధంగా వచ్చి, చెలులను దూరంగా నిలిపింది. చతురంగా అందంగా ఆ లేజవరాలు విలాసమూ తియ్యదనాలను కలిగిస్తూవచ్చి తండ్రికి మ్రొక్కింది. ఆ తండ్రికి ఆమెమీది అనురాగంతో మనస్సులో ఉత్సాహం కలిగింది. ఆమెను కౌగిలించుకొన్నాడు. ఎత్తి తనతొడపైన కూర్చుండబెట్టుకున్నాడు. ఆమెను ముద్దుచేస్తూఉండినాడు.

ఇదంతా చూస్తున్న నారదుడు ఆ లేజవరాలినిచూచి అశ్వపతితో, "ఈ కన్యను తగినవరునకు ఇవ్వకుండా ఇట్లాఎందుకుంచుకున్నావు?" అన్నాడు. ఆమాటలువిన్న అశ్వపతి, కుమారితో ఇట్లా అన్నాడు.

"అమ్మా! నీ గుణాలకూ రూపానికీ నడవడికకూ తగినవరుణ్ణి నీవే సంతోషంగావెతుకుకో. నీ మనసుకు నచ్చిన రాకుమారుణ్ణి కోరుకొనివరించు. ఇదే నాకుఇష్టమైనది." అన్నాడు.

అప్పుడు సావిత్రి కొంచెం సిగ్గుపడింది. ఎక్కువగా కోరికఉండడంవల్ల సిగ్గును ప్రక్కకు నెట్టింది. ఆ శక్తితో ప్రేరేపించబడిన మనసుతో తండ్రితో ఇట్లాఅన్నది. "రాజా! గొప్ప కీర్తికలిగిన సాళ్వరాజ కుమారుడు సత్యవంతుడు. నాకు భర్తగా మనసులో కోరుతున్నాను. అతనికి నన్నుసంతోషముగా ఇవ్వు. ఆ సాళ్వరాజు ద్యుమత్సేనుడుకూడా దైవయోగం చేతచూపు కోల్పోయిఉన్నాడు. శత్రువులచేత రాజ్యాన్నికూడా పోగొట్టుకున్నాడు. భార్యా కుమారులతోసహా అడవులలోఉన్నాడు. అయినా నేనుసత్యవంతుణ్ణే వివాహమాడతాను."

ఈ మాటలువిన్న అశ్వపతి నారదుణ్ణి చూచి, "మునీంద్రా ! నీకు తెలియనివారులేరు. సావిత్రి వరించినకుమారుడు ఎటువంటివాడు. వాడి గుణాలనూ రూపాన్నీ నడవడికనూచెప్పండి" అనగా నారదుడిట్లా అన్నాడు.

"రాజా! సత్యమే మాట్లాడడంవల్ల అతడు 'సత్యవంతుడ'నే పేరుతో శోభిల్లుతున్నాడు. అంతేకాక అతనికి 'చిత్రాశ్వుడ'నే ఇంకొకపేరు కూడాఉంది. అతడు తేజస్సులో ఇంద్రుణ్ణి పోలినవాడు. బుద్ధిలో బృహస్పతివంటివాడు. శూరత్వంలో ఇంద్రుణ్ణీ ఓర్పులో భూమినీ పోలినవాడు. కాంతిలో చంద్రునికి సమానమైనవాడు. 'రూపంలో ఆశ్వినులతో సమానుడ'నే విధంగా శోభిల్లుతూఉంటాడు. తపస్సు, శమము, దమము, దానము, బ్రాహ్మణ భక్తి, మహానుభావత్వం అతనిలో కనిపించినంతగా ఇతరులలో కనిపించవు. ఇదంతానిజం." ఇట్లాచెప్పి, ఇంకాఇట్లాఅన్నాడు. "అయితే వాడికి ఒకగండంఉంది. వివాహమైన తరువాత సరిగా ఒకసంవత్సరానికి మరణిస్తాడు. ఇది నీకు చెప్పవలసినవిషయంకాబట్టి చెప్తున్నాను".

ఈ మాటలువిని అశ్వపతి, కూతురుముఖంచూచి "తల్లీ! ఈ మహాత్మునికి దేవరహస్యాలు కూడా తెలుస్తాయి. ఇతని మాటలకు తిరుగుండదు. నీకు అటువంటి వరుడెందుకు? ఇంకొకణ్ణి వెతుకుకో." అన్నాడు. అందుకు సావిత్రి ఇట్లాఅన్నది.

"సత్యవంతుడు ఎట్లాంటి వాడైనాకానీ, నేనింక వేరొకరిని వరించలేను." సావిత్రి ఇట్లాఅనగానే అశ్వపతి నారదునిదిక్కుచూచినాడు. అప్పుడు నారదుడిట్లాఅన్నాడు. "ఓ రాజా! నీప్రియపుత్రిక సుగుణాలరాశి. ఈమె ఆలోచనను మనంమార్చలేము. ఇంక అనుమానాలెందుకు? ఈమెను వెంటనే ఆ

రాజకుమారుడికిఇవ్వు, ఈ పద్మముఖి చేసిన గొప్ప పుణ్యం వల్లనైనా ఆమె ప్రియుడు దీర్ఘమైనిండైన ఆయువు కలవాడవుగాక !" 'నారదుని ఈ మాటలకు అశ్వపతి అంగీకరించినాడు. నారదునికి మ్రొక్కినాడు. "నీవు మాకుపూజ్యుడైనగురువువు. నీవు ఆదేశించినట్లే చేస్తాను" అన్నాడు. నారదుడు సావిత్రిని దీవించి తనదారిన తానుపోయినాడు.

ఆ తరువాత ఒక పుణ్యమయిన రోజున అశ్వపతి బంధువులనూ, మంత్రులు, పెద్దలనూ, పురోహితులనూ సావిత్రినీ తోడుకొనినాడు. వివాహానికి కావలసిన వస్తువులన్నీ తీసుకున్నాడు. అరణ్యాలలో ఉండి తపస్సు చేసికుంటున్న ద్యుమత్సేనుడి దగ్గరకుపోయినాడు. ఆ ద్యుమత్సేనుడుకూడా తత్తరపాటుతో అశ్వపతికి అర్ఘ్యము పాద్యము మొదలైన మర్యాదలను చేసినాడు, తగిన విధంగా ప్రేమగా మాట్లాడినాడు. సుజనులచే పూజింపబడే ద్యుమత్సేనుడు 'అశ్వపతిరాకకు కారణంతెలుపమ'ని కోరినాడు. అశ్వపతి ఆనందంగా ద్యుమత్సేనునితో, "రాజా! ఈ కన్య నాకూతురు. మావంశాన్ని తరింపచేసే తెప్ప. నా మాట మీదిగౌరవంతో ఈమెను నీకోడలిగా స్వీకరించు." అనిచెప్పినాడు. సావిత్రిచేత ద్యుమత్సేనునికి నమస్కారము చేయించినాడు. ఇంకా "రాజా! నీ కొడుకు సత్యవంతునకు ఈ కన్య తగినది. ఈ కన్యకు నీకొడుకుకూడా తగినవాడే. సాటిలేని లక్షణాలతో కూడినవారిద్దరూ ఒకరికొకరు సరియైనజోడు". అనగా అశ్వపతితో ద్యుమత్సేనుడిట్లాఅన్నాడు.

"రాజా! మేము రాజ్యంపోగొట్టుకొని భయంకరమైన అడవులకు వచ్చి, ఈ విధంగా తపస్సు చేసుకుంటున్నాము. ఈమె చిన్నపిల్ల. అంతేకాక సుకుమారి. ఈమె అడవిలోఉండి మాతోపాటు కష్టాలను సహించగలదా?"

అందుకు సమాధానంగా అశ్వపతి ద్యుమత్సేనునితో ఇట్లాఅన్నాడు. "సంపదా, దారిద్ర్యము శాశ్వతమైనవి కావు. సంపద కలిగినప్పుడు ఆనందిస్తూ దారిద్ర్యం వచ్చినప్పుడు కలతచెందుతూఉండడం ధైర్యవంతులు చేస్తారా? ఇంతవరకూ నాకుబాగాతెలుసు. రాజా! చెప్తాను. విను. చిన్నపిల్ల అనడం ఎందుకు? అంత తక్కువదేంకాదు. గొప్పదనంలో ఈమె పేర్కొనదగినది . చాల ధైర్యవతి. నా ప్రార్థనను ప్రీతిగా స్వీకరించకపోవడం నీకు న్యాయమా?"

ఆ మాటలువిన్న గ్రుడ్డిరాజు ద్యుమత్సేనుడు ఆ వివాహ సంబంధానికి సంతోషించినాడు. ఆ ఆశ్రమం దగ్గరలోకల మునులను కూర్చుకున్నాడు.ఒక శుభలగ్నంలో సత్యవంతునకు సావిత్రికి పెండ్లి చేసినాడు.అశ్వపతి కూతురికి అల్లుడికి రకరకాలైనవస్త్రాలు, ఆభరణాలు, ఇంకా ఇతరవస్తువులు విశేషంగాఇచ్చి తననగరానికి తిరిగిపోయినాడు.

ఆ తర్వాత సావిత్రి, అందమైన భూషణాలు వస్త్రాలతోకూడిన విలాసాలనువదలివేసింది . అడవులలో ఉండవలసినవిధంగా నారచీరలు, జింకచర్మాలు, వస్త్రాలుగా, ధరించింది. మిక్కిలి భక్తితో విడువకుండా భర్తకు పరిచర్య చేయడంలో ఆసక్తితో ఉండింది. ఆమె అణకువ మరియు మెత్తని మన్ననలతో అత్తమామల మనసులను రంజింపచేసింది. వారు 'సంతోషం'అనే అమృతంలో తేలిఆడినారు.

సావిత్రికూడా నారదుడుచెప్పినట్లు వివాహదినంనుండి ప్రతిదినం రోజులులెక్కించుకుంటూ ఉండింది. అట్లా నాలుగుదినాలు తక్కువగా సంవత్సరకాలంగడిచింది. సావిత్రి, "ఆ తరువాత నాల్గోదినం పతిచనిపోయేదినమ"ని మనసులోనే లెక్కించుకొన్నది. ఆ నాటినుండి మిక్కిలినిష్ఠతో చాలా బరువైన'త్రిరాత్రోపవాసం' అనే గొప్పవ్రతాన్ని చేయడానికి పూనుకొన్నది. ద్యుమత్సేనుడందుకు ఆశ్చర్య పడినాడు. కోడలిని పిలిచి, "తల్లీ! ఎందుకు ఇంతకఠినమైననోమును మొదలుపెట్టినావు?" అన్నాడు. అందుకు సావిత్రి వినయంతో ఇట్లాఅన్నది. "మీరు నా వ్రతంలోని కష్టానికి చింతించవద్దు. 'గొప్ప శుభాలు కలగాల'నికోరి ఈ వ్రతాన్ని చేయపూనినాను. అందుకుకారణం మీకుతరువాతతెలుస్తుంది." అందుకు ద్యుమత్సేనుడు, "అట్లైతే నీకు మేలుకలుగుగాక!" అంటూ ఆశీర్వదించి అనుమతించినాడు.

ఆ తరువాత నాలుగోరోజున, సావిత్రి తెల్లవారక మునుపేమేలుకొన్నది. "తనభర్త మరణించే రోజిది" అని మనసులో పెద్దగా దుఃఖించింది. అయినా ఉదయంచేయవలసిన పనులన్నీ పూర్తిచేసింది భర్తకు సరిఅయిన పవిత్రమైనసేవను మిక్కిలిప్రీతితోచేసింది. అత్తకూ మామకు అక్కడున్న వృద్ధులకు వేరువేరుగా నమస్కారాలు చేసింది. ఆనందంగా వారందరూ తనకు సౌభాగ్యం వర్ధిల్లాలని ఇచ్చే దీవనలను మనసులోనే స్వీకరించింది. అంతలో ప్రొద్దెక్కింది. మామ కోడలిని పిలిచి గౌరవంగా, "అమ్మా! మిక్కిలి కఠోరమైన వ్రతమిది. దీనిని పూనికతో పూర్తిచేసినావు. మూడురోజులతో అదిముగిసింది. ఎంతోఅలసి పోయినావు. ఇంక ఆలస్యంలేకుండా పారణచేయవచ్చుకదా?"అన్నాడు. అప్పుడుసావిత్రిమామతో ఇట్లాఅన్నది.

"రాజా! ప్రొద్దు క్రుంకేంతవరకు ఈ రోజుకూడా నేను భోజనంచేయకూడదు. ఈ విధంగా వ్రతం ప్రారంభించకముందే నేను నిశ్చయించుకొన్న'నియమ'మిది". ఈ మాటలువిని ద్యుమత్సేనుడు మౌనం వహించినాడు.

ఆ తరువాత సత్యవంతుడు సమిధలు దర్భలు పండ్లు తేవడానికి అడవికి బయలుదేరినాడు. అది చూచి సావిత్రి అతనిదగ్గరకుచేరింది. "అడవికి నీతోపాటు నేనుకూడావస్తాను. నన్నుకూడా తీసుకొనిపో."అన్నది. అందుకు సత్యవంతుడు, 'నీవు త్రిరాత్రోపవాసం చేసిఎంతో అలసిపోయిఉన్నావు. అడవికిరాలేవు" అన్నాడు. అప్పుడు సావిత్రి తిరిగి సత్యవంతునితో ఇట్లాఅన్నది. "ఉపవాసంతో కూడిన బడలిక ఏ కొంచెమూ నామనసులో కనిపించడంలేదు. 'ఈ అడవి ప్రకాశించే పూలు, చిగురులూ పండ్లు,

తీగలు, చెట్లతోనూ నిండిఉంద'ని విన్నాను. చూడాలని మనసులో కోరిక కలిగింది. నన్నడ్డగించ వద్దు. ఈ మాత్రం చనువుతోకూడినకోరికను ఏవిధంగానైనా ఇవ్వడానికి నీవు నాకుతగినవాడవు". ఈ మాటలువిని సత్యవంతుడు, "అట్లే కానీ రా." అనగానే సావిత్రి వేగంగాపోయి భార్యతోకూడిఉన్న మామకు నమస్కరించింది. "మీ కొడుకు అడవికి సమిధలుతేవడానికిపోతున్నాడు. నాకుకూడా అతనికితోడుగాపోయి 'అడవి చూడాల'నేకోరిక కలిగింది. మీరు నాకీవరం దయతో ఇవ్వవలసింది." అని ప్రార్థించింది. వారు, "ఈమె ఎప్పుడూ ఏదీఅడుగదు. ఇట్లా పోవడం ఈమె కిష్టంగా కనిపిస్తున్నది.మేము అడ్డుపెట్టడ మెందుకు?" అనుకొని అనుమతించినారు. ఆమె ఆ ఇద్దరి కాళ్ళకు మ్రొక్కి సెలవుతీసుకున్నది. మనస్సులో ఉబికివచ్చే దుఃఖాన్ని అణచుకున్నది. పద్మంలాంటి ముఖంలో వెలుగొందే చిరునవ్వుతో భర్త మనస్సు చిగురించగా ఆమె సత్యవంతునితోపాటు అడవికిపోయింది. ఈ విధంగా ఆ దంపతులు మెల్లగినడకలతొ పోయి దగ్గరలోని అడవిలోనికి ప్రవేశించినారు.

భర్త అడవిలో చాలావిషయాలను వేరువేరుగా చూపుతూ ప్రేమగా చెప్పుతూపోతూ ఉండగా సావిత్రి చూస్తూ వింటూపోతూఉంది. కాని తనమనస్సులోని వికారాన్ని ఏమాత్రం బయటబడనివ్వలేదు. భర్తకు ఇష్టంకలిగేటట్లు మాట్లాడుతూ అతని తీరుతెన్నులను గమనిస్తూఉండింది.

ఆ తరువాత సత్యవంతుడు తియ్యటిపండ్లుకోస్తూ తనతోపాటు తెచ్చినగంపను నింపినాడు. ఒకచోట గండ్రగొడ్డలితో కట్టెలు నరకుతూ ఉండినాడు. అప్పుడు అతనికి శ్రమతోచింది. తూలిపోయి గొడ్డలిని నేలపై వదలినాడు.నిట్టూర్పులతోనూ విషాదం పొందిన ముఖంతోనూ సావిత్రిని చూచినాడు."నాకు శరీరం స్వాధీనంలోలేదు. 'భ్రమపొందిన'ట్లు మనస్సు తూలిపోతుంది. తల పూనికతో శూలాలతోనూ, బాణాలతోనూ, 'నొప్పించినట్లు'ఉంది. నిలువలేకుండాఉన్నాను. కొంచెంసేపు అలసటతీరేటట్లు నీవద్ద పడుకుంటాను." అన్నాడు.

సావిత్రి మెత్తనితత్తరపాటుతో తనఒడిని భర్తకు దిండుగాచేసింది. సత్యవంతుడు మెల్లగా ఒరిగి, మూర్ఛపోయి 'కదలికలు లేకుండా ఉండినట్ల'యినాడు. ఆ తరువాత కొంతసేపటికి ఎదురుగా ఒక పురుషుడు చేతిలోపాశముధరించి, మిక్కిలి వేగిరపాటుతో సత్యవంతుణ్ణి సమీపించడం సావిత్రి చూచింది. ఆ దివ్యపురుషుడు 'నల్లనిమబ్బు'లాగా శోభించే 'కాటుక'వంటి రూపంకలవాడు. అతడు భయంకరమైన పొడవాటి వాడికోరలు కలిగిఉన్నాడు. ప్రళయకాలంలోని అగ్నిశిఖలవలె భయంకరంగా మండుతున్నాడు. లోకంలోని జనులందరికీ భయంకలిగిస్తున్నాడు. ఆ దివ్యుడు పాశంతో తనభర్తను సమీపించడంచూచి, భయంతో భర్తతలను మెల్లగా తనతొడమీదనుండి క్రిందకుదించింది. లేచినిలబడింది. ఆ దివ్యపురుషుడికి నమస్కరించింది. "అయ్యా! నీవెవరు? ఇక్కడకు ఏమిచేయాలని వచ్చినావు?" అన్నది.

అందుకా దివ్యపురుషుడిట్లాఅన్నాడు. "ఓ పద్మాక్షీ! నేను కాలుణ్ణి సుమా! నీవు నన్ను నీ గొప్ప పాతివ్రత్య మాహత్మ్యంవల్ల చూడగలిగినావు. ఇతరులు చూడలేరు. ఇదిగో నీ భర్తకు మరణించేకాలం వచ్చింది. వీడు గొప్ప పుణ్యాలరాశి. కాబట్టి ఇతరులను పంపకుండా నేనే ఇతణ్ణి త్వరగా తీసుకొని పోవడానికి వచ్చినాను." ఆ యముడు సావిత్రితో ఇట్లాచెప్పి భయంకరంగా సత్యవంతుని శరీరంలో జిట్టెడు పొడవుతో ప్రకాశించేజీవుణ్ణి బయటకులాగినాడు. వేగంగా చాలాపొడవుగా భయంకరంగాఉండే త్రాళ్ళతో బంధించినాడు. ఆ జీవుణ్ణి తీసుకొని వేగంగా దక్షిణంవైపుకు భయంకరమైనమార్గంలో పోవడం ప్రారంభించినాడు.

అప్పుడు సావిత్రికి మనస్సులో దుఃఖం పెరిగిపోయింది. భర్తదేహాన్ని ఒకచోట భద్రంగా దాచి పెట్టింది. తన పద్మాలవంటిపాదాలు తొట్రుపడుతుండగా ఆ యముడివెంట తానుకూడా పోవడం ప్రారంభించింది. ఆమెనుచూచి యముడు "లతాంగీ! ఇట్లా ఎందుకు వస్తావు? రావద్దు. ఇక నిలువు. ఇకమీదట దారిఅంతా నీవురాలేనిది." అనగా యముడితో సావిత్రి ఇట్లాఅన్నది.

"భర్తలెక్కడకుపోతే భార్యలుకూడా అక్కడకు పోవలెకదా? నీదయవల్లా, నాపతిభక్తివల్లా, ఓ యమధర్మరాజా! నేనుపోలేనిచోటుందా? అన్ని మార్గాలలోను ధర్మమార్గం ముఖ్యమైనది. అట్లాంటి ధర్మానికి ఆధారంగా 'సజ్జనులలో శ్రేష్ఠుడవ'ని ప్రసిద్ధి పొందిన నీ దర్శనంవల్ల గొప్పశుభాలు పొందకుండా నేను వ్యర్థజనులమాదిరిగా ఊరికేఎట్లాతిరిగిపోతాను."

యమధర్మరాజు ఆమె మాట్లాడిన తెలివితోకూడినమాటలకు ఆశ్చర్యపడినాడు. సావిత్రితో ఇట్లా అన్నాడు."లతాంగీ ! నీ గొప్ప మాటలతీరుకు నాకు మనస్సులో మెప్పుకలిగింది. 'నీ భర్త జీవించడం' అనే ఒకటితప్ప ఏదైనా ఇంకొకవరం కోరుకో. ఇస్తాను."

ఆ మాటలు విని సావిత్రి చేతులు జోడించింది. యమధర్మరాజుతో "శత్రువులతో అపజయం పొంది అడవుల్లో ఎడతెగని వ్రతాలుచేస్తూఉన్న గొప్పమహాత్ముడైన సాళ్వరాజుకు చూపు వచ్చేట్లుగా నీ మనస్సుల్లో దయతలచవా?" అన్నది.

వెంటనే యమధర్మరాజు, "అట్లే అవుతుంది. ఇంక ఈ వైపునకు రావద్దు. సంతోషంగా మానుకో." అనిచెప్పి, యముడు వేగంగాపోవడంప్రారంభించినాడు. సావిత్రికూడా అక్కడనిలబడకుండా ఆయన వెంటనేపోయింది.

ఇట్లా పోయిపోయి తిరిగియముడితో సావిత్రి, "దేవా! ఆర్యులైనవారు ఆలస్యం చేయకుండా మాటలతో మనస్సుతో చేతులతో ఎవరికీ హింసచేయడానికి పూనుకోరు. ఎక్కడైనా దీనులను దయతో కాపాడడానికే చూస్తారు. మనసులో ఆశ్రయించినవారికి ఎక్కువగా సంతోషాన్ని కలిగిస్తారు. ఇవన్నీ ఆర్యులధర్మాలు.

నీకు తెలియనిదేమున్నది? ధర్మంనడిచే తీరులన్నీ నీ సంకల్పానికి లోబడినవే కావడంవల్లకదా లోకంచేత పొగడబడుతూ 'సమవర్తి' అనేపేరు నీకు కలిగింది? ప్రాణికోటిని తగు విధంగా నియమిస్తావు. కనుక నిన్ను పెద్దలు 'యముడ'ంటారు. పాపాలను శమింప చేయడం (అణచడం) వలన 'శమనుడ'వైనావు." అన్నది.

ఈ మాటలన్నీవిన్న యముడు సావిత్రితో ఇట్లాఅన్నాడు. "దప్పిగొన్నవాణ్ణి చల్లనిమంచుతో కూడిన నీళ్ళు ఎట్లా సంతోషింపచేస్తాయో అట్లాగే పాపాలు పోగొట్టే నీ సమంజసమైన మాటలతీరు నా ఆత్మను తృప్తిపరచింది. కాబట్టి సత్యవంతుని ప్రాణంకాకుండా ఇతర కోరిక ఏదైనా చెప్పు. తీరుస్తాను."

వెంటనే సావిత్రి "దేవా! శత్రువులచేత అపహరించబడినరాజ్యం ఎప్పటిలాగా ద్యుమత్సేనునికి ప్రాప్తించేటట్లు దయచూడు". అనికోరింది. అందుకు యముడు "అట్లే అవుతుంది." అనిచెప్పి, ఇంకా ఇట్లాఅన్నాడు. "పద్మాక్షీ! రావద్దు. ఇంకఇక్కడే నిలువు. వదలని నీపతిభక్తి నీ భర్తకు చెందింది. ఇది చొరరానిత్రోవ నీ కోరికలన్నీ తీరినాయికదా. నీవింక ముందుకురావడానికి అనుమతిలేదు."

ఈ మాటలువిని సావిత్రి ఇట్లాఅన్నది."ధర్మాత్ములు తాముచేసే ధర్మాలు ఏపరిస్థితులలోనూ తప్పరు. ధార్మికుల హృదయాలలో భ్రాంతిగానీ, తాపంకానీ పుట్టదు. కాబట్టి భర్తను అనుసరించిపోవడం ఏ రీతిగానైనా విడువవచ్చునా. ఏవిధంగానైనా భ్రాంతిపొందకుండా నిష్ఠతో ధర్మాన్నినిలుపవద్దా?"

ఈ మాటలకు యముడిట్లాఅన్నాడు. "సావిత్రీ! నీవు ధర్మాలమీద ఆసక్తికలదానవు. కాబట్టి ఇంకొకవరమిస్తాను. భర్తప్రాణాలుకాకుండా కావలసిన ఇంకొకకోరిక అడుగు."

యముడిట్లా అనగానే సావిత్రి చేతులు జోడించి, "మా తండ్రి అశ్వపతికి పుత్రులులేరు. ఆయనకు నూరుమంది పుత్రులు కలుగవలె." అని కోరగా, "అట్లే అయ్యేట్లు ఇచ్చినాను." అని చెప్పి యమధర్మరాజు "నీవు చాలదూరం వచ్చి అలసిపోయినావు. ఇంక తిరిగి పోవడం మంచిది." అనగా ఆ పతివ్రత అయిన సావిత్రి ఇట్లా అన్నది.

"నాకు అలసట ఎక్కడున్నది? మనసు భర్త పద్మాలవంటి పాదాలపై ప్రేమతో మిక్కిలి భక్తితో శోభిల్లుతూఉంది. మగడిఅండతప్ప ఇతరం ధర్మమవుతుందా? ఇంకా ఒకవిన్నపం చేస్తాను. తమ ధర్మాన్ని నిర్వహించడంలో నిష్ఠకల పుణ్యాత్ములు అరుదుగా ఉంటారు. భూమిమీద వారు పవిత్రమైన తీర్థాలతో సమానమైనవారు. అందుచేత వారిసమాగమంవల్ల అన్ని పాపాలూపోతాయి. వారి గొప్పతనం వల్లనేకదా చంద్రుడు సూర్యుడూ గతులుతప్పకుండా శోభతో తిరుగుతూఉంటారు. సర్వసముద్రాలుకూడ ఆకులంలేకుండా వెలుగొందుతూఉన్నాయి. కులపర్వతాలు నిశ్చలంగా ఉండగలుగుతున్నాయి. భూమి సకలప్రాణులనూ తానేభరిస్తూ గౌరవాన్ని పొందుతూఉంది." అనిచెప్పి, ఇంకాఇట్లాఅన్నది. "ఏడు మాటలు మాట్లాడినా

ఏడడుగులు కలసినడిచినా ఎవరైనా ఆర్యులకు చుట్టాలవుతారు. అంటే ఇంతసేపు నీతో మాట్లాడడం వల్లా ఇంతదూరం నీతోకలిసినడవడంవల్లా నేను మీ 'చుట్టమ'నని వేరే చెప్పడమెందుకు? కాబట్టి చుట్టాలకోరిక తీర్చడం తప్పనిసరిగా నెరవేర్చవలసిన ధర్మంకదా?" ఈ మాటలువిన్న యముడు ఆమెవైపుచూచి, నీ పై నాకనుగ్రహం కలిగింది. నీకిష్టమైన వరంఒకటిస్తాను. అడుగు." అన్నాడు.

వెంటనే సావిత్రి ఇట్లాఅన్నది. "ఇంతకుముందు నీవు సత్యవంతునిబ్రతుకును ఉపాయంగా తొలగించి ఇతరాల నిస్తానని చెప్పేవాడవు. కానీ ఇప్పుడట్లా చెప్పలేదు. అంటే నీవు నాకు 'సంపూర్ణంగా ఆనందం కలిగించాల'ను కొంటున్నట్లు తెలిసి పోతూఉంది. ఇంక సంతోషంగా అడుగుతాను. ధర్మరాజా! భర్తనుండి ఎడబాటు భరించరానిది. భర్తలేని స్త్రీని శుభకార్యాలలోనికి రానీయరు. కాబట్టి నా భర్త సత్యవంతుణ్ణి తిరిగి బ్రతికేట్టుచేయి.అతడు సాటిలేని కీర్తి కలిగినవాడు. మంచిగుణాలు కలిగినవాడూ సాళ్వభూపతి కుమారుడు."

ఆ మాటలువిని యముడు, "అట్లే చేస్తాను" అనిచెప్పి ఆ క్షణమే తానుబంధించిన పాశాలనుండి సత్యవంతుణ్ణి విడచివేసినాడు.సావిత్రితో ఇట్లాఅన్నాడు. "ఇదిగో సావిత్రీ! నీ భర్తనుతీసుకో. ఇంకమీద వీడు నాలుగువందలఏండ్లు బ్రతుకుతాడు. నూరుమందిపుత్రులనుపొందుతాడు. యశస్సును పెంచుకుంటాడు. దేవతలందరనూ ఎడతెగకుండా చేసేయగాలతో తృప్తిపరుస్తాడు. తనవంశంలో శ్రేష్ఠుడవుతాడు." ఇట్లా సావిత్రిని ఆశీర్వదించి యముడు అంతర్ధానమైనాడు.

ఆ సావిత్రి తిరిగివచ్చి ఎప్పటిలాగా భర్తతలను తొడలపైఉంచుకొనికూర్చున్నది. ఆ తరువాత కొంతసేపటికి సత్యవంతునిలో కదలిక వచ్చింది. స్పృహవచ్చి సత్యవంతుడు భార్యనుచూచి ఇట్లాఅన్నాడు "చాలాసేపు నిద్రపోయినాను. సావిత్రీ! నన్నులేపవద్దా? బలవంతుడొకడు నన్ను చాలావేగంగా పట్టుకొని నా శక్తి పోయేటట్లులాగినాడు. అతడెవరో చెప్పు? 'అది కలకాదు. నిజమేన'నిపిస్తున్నది. నాకు మనస్సులో భయంకలిగింది."

ఆ మాటలువిని సావిత్రి భర్తతోఇట్లాఅన్నది. "ఓ రాకుమారా! నీకు ఇదంతారేపుచెప్తాను. ఇప్పుడు చీకటిపడి రాత్రి అయింది. ఇక్కడ ఆలస్యం చేయడం మంచిదికాదు. అదిగో రాక్షసులు ఇక్కడా అక్కడా మహాభయంకరమైన ఆకారాలతో సందడిగా తిరుగాడసాగినారు. భయంకరమైన నక్కలకూతలు తీక్షణాలై ఆకాశాన్నంటుతున్నాయి. పెద్దపెద్ద గుంపులుగాకూడి జంతువులన్నీ తిరుగాడుతున్నాయి. చూడు. వాటిపాదాలశబ్దాలుకూడ ఎక్కువగా ఉన్నాయి. నాకు భయంతో వణకుపుట్టుతూఉంది." అని చెప్పి, ఇంకా ఇట్లాచెప్పింది.

"ఇంతేకాకుండా నీవు ఆలస్యంచేయడంవల్ల, మీ తల్లి తండ్రీ ఇప్పటికే మిక్కిలి దుఃఖపడుతూ ఉంటారు. వేగంగా వారికి సంతోషంకలిగించు."

ఈ విధంగా చెప్పిన తరువాత సావిత్రి సత్యవంతుడి దుఃఖంతోకూడిన చేష్టలను గమనించింది. తిరిగి ఇట్లా అన్నది. "చీకటి అధికంగా వ్యాపించింది. మనఆశ్రమం కూడాచాలా దూరంగాఉంది. మనసులో అలసటకూడా ఇప్పటికింకా నిన్నువదలలేదు. అట్లైతే ఇప్పుడుపోవడమెందుకు? ఆనందంగా ఈ రాత్రికి ఇక్కడనేఉండి రేపుపోదామా? ఏమంటావు?"

ఈ మాటలకు సత్యవంతుడు సావిత్రితో, "తలనొప్పిపోయింది. నా శరీరానికి తగినంతబలం వచ్చింది. మెల్లగా నడవగలను. తల్లిదండ్రులను చూడకుండా ఈ అడవిలో ఎట్లాఉండగలను? ఇంతకు ముందెప్పుడూ వారినివదలి ఇంతసేపు ఆలస్యంచేయలేదు. ఈ రోజు ఇంతఆలస్యానికి ఎంత దుఃఖించినారో? ఎట్లున్నారో? చీకటిపడిన తరువాత మా తల్లీ నన్నెపుడూ ఇల్లువదలి బయటకు పోనియ్యదు. ఈనాడు అడవిలో అర్ధరాత్రి వేళకుకూడా ఇల్లు చేరకపోవడానికి ఎట్లా దుఃఖిస్తూఉందో తెలియదు. వృద్ధులైన నా తల్లిదండ్రులు కౌగిటిలో నన్నుగట్టిగా పట్టుకొని తలనువాసనచూస్తూ కన్నీరు కారుస్తూ, "కుమారా! మా శరీరాలు ప్రాణాలుఅన్నీ నీవే. నీవు తెప్పగా 'సంసారమ'నే సముద్రాన్ని దాటి 'తీరంచేరాల'నుకొంటున్నాము సుమా! అన్నా! కన్నులులేనిమాకు కళ్ళూ కాళ్ళూ అన్నీనీవే కదన్నా?' అంటూ ఈ విధంగా మిక్కిలి ప్రేమతో ప్రతిదినం వాత్సల్యంచూపుతారు. అయ్యో! ఈ రోజేమైనారో? అడవికివచ్చి త్వరగా పండ్లూ వేళ్ళూ తీసుకొని ఆలస్యం చేయకుండా అప్పుడే పోలేక పోయినాను. దైవందెబ్బతో ఇంతగా చిక్కుపడినాను. ఏమి చేయగలను? నేనుండేచోటు తెలియక మాతండ్రి మిక్కిలి దుఃఖంతో భయపడి ఆశ్రమంలో ఉండేవాండ్రనందరనూ మాటిమాటికీ అడుగుతూ ఉంటాడు. నా సమాచారం తెలియక ఇప్పటికే ఆ వృద్ధులు గుండెలు పగిలి ప్రాణాలువిడిచిఉంటారు. ఇంక ఆశ్రమానికి పోయేపనేముంది? నేనుకూడా ఇక్కడే ప్రాణాలువిడుస్తాను." అని రకరకాలుగా దుఃఖించి కన్నీరు కార్చినాడు.

అప్పుడు సావిత్రి సత్యవంతుణ్ణి ఓదార్చింది. లేత తామరతూడులవంటి తన చేతులతో కౌగిలించు కొని అతణ్ణిలేవతీసింది. లేవనెత్తగా సత్యవంతుడు మెల్లగాలేచినాడు. దుమ్ముతోనిండిన శరీరాన్ని తుడుచుకొన్నాడు. అక్కడనే ఒకచెట్టుకొమ్మకు పండ్లబుట్టను ఉపాయంగా తగిలించినారు. ప్రకాశించే గండ్రగొడ్డలిని తీసుకున్నారు. మెత్తని తత్తరపాటుతో సావిత్రి భర్తఎడమచేయి తనఎడమ భుజంపైన ఉంచుకొన్నది. అట్లే సత్యవంతుణ్ణి కౌగిలిలోనే ఉంచుకొనిమెల్లమెల్లగా ఆశ్రమంవైపునకు పోసాగింది.

అప్పుడు అక్కడ వృద్ధరాజు ద్యుమత్సేనుడికి కళ్ళువచ్చినాయి. అన్నిచోట్లనూచూచినాడు. "తన ఆత్మకు కన్నులవంటి ప్రియమైన కుమారుడు అడవిలో ఎప్పుడూ ఉండనంతసేపు ఎందుకు ఆలస్యం చేసినాడో?" అనుకుంటూ దీనంగా కన్నులులేని వానిలాగా భార్యతోసహా ఏడ్చినాడు. కొడుకు కొరకై ఇక్కడాఅక్కడా వెతకసాగినాడు. వాత్సల్యంతో తనకుమారుడి మంచిగుణాలన్నింటినీ వరుసగా కోటివిధాలుగా చెప్పుకుంటూ, "మునులారా! సత్యవంతుణ్ణి ఏ అడవిలోనూ చూడలేదా?" అంటూ "హా! కుమారా!" అంటూ, ధైర్యం

కోల్పోయినాడు. అప్పుడు ఆశ్రమంలోని మునులందరూ ఆ ద్యుమత్సేనునీ చుట్టూచేరినారు. ఆయనకు కన్నులు రావడానికి ఆశ్చర్యపడినారు. తగిన మాటలతో అతణ్ణి ఓదార్చుతూ ఉండినారు. ఆ తరువాత ఒక ముహూర్తకాలానికి సావిత్రితోకూడి సత్యవంతుడు ఆశ్రమానికి చేరినాడు. అప్పుడా వృద్ధదంపతులు మిక్కిలి ఆనందంతో అతణ్ణి కౌగిలించుకొన్నారు. తలనువాసనచూచినారు. మునులు మిక్కిలి సంతోషించినారు. అప్పుడా ద్యుమత్సేనుడు కొడుకునుచూచి, "అయ్యా! ఇట్లా అడవిలో ఎందుకు ఆలస్యంచేసినావు?" అని అడిగినాడు. అందుకు సత్యవంతు డిట్లాఅన్నాడు.

"నేను సావిత్రితోపాటు అడవికిపోయినాను. అక్కడ పండ్లు కోసి బుట్టనింపినాను. ఆ తరువాత కట్టెలు కొట్టడం మొదలుపెట్టినాను. అప్పుడు పెద్దగా తలనొప్పి వచ్చింది. నిలువలేక పోయినాను. కలలో ఒక పురుషుడు నన్ను తనకైవసం చేసుకొన్నాడు." ఇట్లాఅంటూ ఇంకాచెప్పబోయేటప్పుడు సావిత్రి మామతో ఇట్లాఅన్నది.

"ఈ రాజకుమారునికి 'ఈ రోజే మరణమ'ని ఇంతకుముందే నారదముని నాకు చెప్పిఉండినాడు. ఆ మునిశ్రేష్ఠుని మాటతిరుగులేనిది కదా? అందువల్ల నేను ఏమరకుండా ఈ దినము ఇతనితో పాటు అడవికి పోయినాను. అక్కడ ఈయననిద్రించేటప్పుడు అక్కడికి యముడువచ్చినాడు. వచ్చి నా భర్త ప్రాణాలు తీసుకొని పోతూఉండినాడు. ఆయన వెనుకనే నేనుకూడా పోయినాను. రకరకాలుగా సత్యం ధర్మం మొదలైన వాటితో ఆయనను పొగడినాను. ఆయన గొప్ప దయగల మనసుతో నాకు ఆనందంగా నాలుగు వరాలను ఇచ్చినాడు. అందులో ఒక వరంవల్ల తిరిగి ఈయన బ్రతికినాడు. ఇంకొకవరం మీకు చూపు తెప్పించింది. ఇంక మిగిలిన రెండు వరాలలోనొకదానివల్ల మీరు తిరిగి రాజ్యాన్ని పొందడం, రెండవదానివల్ల మా తండ్రికి నూరుమంది పుత్రులు జన్మించడం జరుగుతుంది."

ఈ మాటలువిని అత్తమామ లిద్దరూ ఎక్కువ సంతోషంచేత చల్లనిమనస్సులతో కోడలితో "తల్లీ! నీ చరిత్ర కీర్తించదగింది. 'ఆపద'అనే సముద్రంలో మునిగిపోయే మావంశాన్ని అభివృద్ధిచెందేట్లుగా తెప్పవై దాటించినావు."అని అభినందించినారు. అప్పుడు ఆ చంద్రముఖి సావిత్రిని మునిశ్రేష్ఠులందరూ పొగడుతూ బుజ్జగించినారు. వారిద్దరనూ దీవించినారు. తమతమ గృహాలకు చేరినారు.

ఆ తరువాత కొద్దిదినాలకే ద్యుమత్సేనునికి ఆప్తులైన మంత్రులూ ప్రధానసేవకులూ రాజ్యంలోని పెద్దలూ కూడుకొని సంతోషంగా ద్యుమత్సేనుడివద్దకువచ్చినారు. వినయంతో, "రాజా! నీ శత్రువు తన స్నేహితులతో ఏర్పడిన విరోధంవల్ల బంధువులుసహాయులతోకూడా చనిపోయినాడు. జనులందరూ ఏకగ్రీవంగా ఇప్పుడు నిన్నురాజుగాపట్టముకట్టడానికి వచ్చినారు. నీ జయాన్ని గురించిన చాటింపు భూమిఅంతా వ్యాపించింది. భద్రగజాన్నిఎక్కివేగంగా ఇంకకదులు. నీ తపోబలంచేత నీకుచూపు కూడా వచ్చింది. అట్లాంటి నిన్నుచూడగలిగిన మా అదృష్టంవల్ల మా కన్నులు చల్లబడినాయి". అన్నారు.

ద్యుమత్సేనుడానందించి ఆ క్షణంలోనే ఆ ఆశ్రమంలోని మునులను వీడ్కొని కొడుకూ తానూ ఏనుగునెక్కి విరివిఅయిన చతురంగబలాలతో నగరానికిపోయినాడు. రాజుగా తిరిగిపట్టాభిషిక్తు డయినాడు. సత్యవంతుడు యువరాజైనాడు. ఈ విధంగా ద్యుమత్సేనుడు గొప్ప ఐశ్వర్యం వహించినాడు.

ఇట్లా సావిత్రి తనమగణ్ణీ, అత్తమామలనూ, తల్లిదండ్రులనూ, తననూ, అందరినీ తాను గొప్పగాఉద్ధరించింది.

**నీతి :** పాతివ్రత్యమూ, మంచినడవడికలతో శుభమే జరుగుతుంది.

**మ.** **ఉపవాసశ్రమ మించుకేనియును నాయుల్లంబునం దోఁప; దీ**
**విపినంబుజ్జ్వలపుష్పపల్లవఫలావిర్భూత నానాలతా**
**గపరీతం బన వెందుఁ; జూడఁగ మదిం గౌతూహలంబయ్యె; న**
**న్నుపరోధింపకు; మింతపట్టు చనవీయుక్తుండ వెబ్భంగులన్.** **7-209**

# 48. సూర్యుడు - కర్ణుడు.

**(అరణ్య 7-283 నుండి 308 వరకు.)**

**(సూర్యుడు కర్ణుడితో ఇంద్రుడికి 'కవచకుండలాలు ఇవ్వవద్ద'ని చెప్పుట.)**

పాండవులు అరణ్యవాసం చేస్తూఉన్నారు. దాదాపు పన్నెండేండ్లూ పూర్తిఅయినాయి. ఆ సమయంలో ఇంద్రుడు పాండవులకు మేలుచేయదలచుకొన్నాడు. వారికి కర్ణుడివల్ల అపదలుకలుగకుండా అతని 'కవచకుండలాలు హరించాల'నుకొన్నాడు. ఆ ఇంద్రుని ఆలోచనను సూర్యుడుపసికట్టినాడు. ఈ విషయం తనకుమారుడైన కర్ణుడికిచెప్పి 'హెచ్చరించాల'నుకొన్నాడు. వెంటనే సూర్యుడు బ్రాహ్మణాకారం ధరించినాడు. కర్ణునివద్దకువచ్చినాడు. ఒంటరిగాఉన్న కర్ణుడితో ప్రేమతెలిసేట్లుగా ఇట్లాఅన్నాడు.

"ఓ కర్ణా! మంచివారితో పొగడబడేవాడా! మంచిగుణాలే అభరణాలుగా కలవాడా! నీకు 'మేలుకలగాల'ని కోరుకొనేవాణ్ణినేను. అందుకనే నీకు ఒకవిషయం రహస్యంగా చెప్పడానికివచ్చినాను. నా మాటలు సంతోషంగా విను. పాండవులమీది పక్షపాతంతో ఇంద్రుడు నీ కవచకుండలాలను మోసంతో 'తీసుకోవాల'నుకుంటున్నాడు. నీవు బ్రాహ్మణులమీద ప్రేమకలవాడవు. బ్రాహ్మణులేది అడిగితే దాన్ని 'మోసంచేయకుండాఇస్తావ'ని ఇంద్రుడికి తెలుసు. కాబట్టి ఆ ఇంద్రుడు నీ వద్దకు కపట బ్రాహ్మణుడైవచ్చి అడుగుతాడు. నీవుమాత్రం కవచకుండలాలు ఇవ్వవద్దు. 'రత్నాలు బంగారం మొదలైన పదార్థాలు ఇస్తాన'నిచెప్పు. ప్రార్థించు. ఇంకా ఏ విధంగానైనా సమాధానపరచి పంపించివేయి. అట్లా కాకుండా కవచకుండలాలు అతనికిఇస్తే నీవు మరణిస్తావు. ఈ మహనీయవస్తువులురెండూ అమృతంతో నిండినవి సుమా! ఇవి ఉంటే మూడులోకాల్లోని సమస్తశత్రుసమూహమూకూడ నిన్నుచంపలేదు. నీవు ఎల్లప్పుడూ సుఖంగా మిక్కిలిఆనందంగాప్రకాశిస్తావు. నీకు నేను ఇది నీమేలుకొరకే చెప్పినాను. మోసపోవద్దు."

ఈ మాటలు విన్న కర్ణుడు, వినయంతో ఇట్లాఅన్నాడు. "బ్రాహ్మణరూపంలోవచ్చినదేవతవు నీవు. పుణ్యాత్ముడా! నీ వెవరివో నాకుచెప్పు." అప్పుడాబ్రాహ్మణుడు, "నేనుసూర్యుణ్ణి. మనసులో నీ మీద కలప్రేమతో నీవు చేయవలసినపనిని ఉపదేశించడానికి వచ్చినాను." అనిచెప్పినాడు.

ఈ మాటలువినగానే కర్ణుడు సంభ్రమంతోలేచినాడు. నమస్కారముచేసినాడు. వినయంతో ఇట్లాఅన్నాడు. "దేవా! నీవు వేలుపువు. నీవు నాకు అతిమిక్కిలి శ్రేయస్సును కోరేవాడవు. అందువల్ల నేను ధన్యుడనైనాను. ఒక విన్నపంచేస్తాను. విను. బ్రాహ్మణసమూహంకోరితే ప్రాణాలనైనాఇవ్వడం నా ప్రతిజ్ఞ. సూర్యదేవా! ఈ విషయం లోకానికంతాతెలుసు. అట్లాకాకపోయినా ఇంద్రుడంతటివాడు కోరి నన్నడగడానికివస్తే కవచం, కుండలాలు నేనువిడువలేనివా? లోకాలన్నింటిలోనిండిన నాకీర్తికి వెలితి చేసి అశాశ్వతమైన శరీరంకోసం ఈ విధంగా పుట్టిననప్పటినుండిచేసే దానవ్రతాన్ని ఈ నాడు విడువడం

న్యాయమా? మనసులో పాండవులపై పక్షపాతంతో మారువేషంలో రాక్షసులందరనూజయించిన ఇంద్రుడు నన్ను యాచించడానికివస్తే ఆ ఇంద్రునికీర్తి తగ్గిపోతుంది. నా కీర్తి మూడులోకాల్లోనూ ఉన్నతంగా ప్రకాశిస్తుంది. ఇది ఎట్లాచూచినా నా పుణ్యమేసుమా! కీర్తిని విడువలేను. కీర్తితో ప్రవర్తిస్తూఉంటే చావువస్తేచస్తాను. లోకంలో 'అపకీర్తికంటే చావుమేల'నే మాటను మహాత్మా! వినలేదా? 'కీర్తియే పుణ్యలోకాలనిస్తుంది. కీర్తియే తల్లిలాగా కాపాడుతుంది. మంచి కీర్తియే ఆయువు. అదే సంపదాకూడా. కీర్తిలేనివాడు శవంతోసమానుడు. దుష్కీర్తి కలిగినవాడిని అన్నికీడులుచేరి నాశనంచేస్తాయి.' అని జగత్తుకు హితంగా భక్తులబాధలు తొలగించే బ్రహ్మదేవుడు అనలేదా? 'బ్రాహ్మణులు కోరితే సంపదలో తక్కువ చేయక దానం చేయేడం ఒకటి, బలవంతులైన శత్రువులను చంపడమొకటి, యుద్ధంలో చావడమొకటి, శరణు చొచ్చినవారిని శత్రువునైనా దయదలిచి కాపాడడమొకటి, స్త్రీలకూ బ్రాహ్మణులకూ బాలురకూ దీనులకూ కలిగినఆపదను వేగంగాతొలగించడమొకటి' ఇవి నాకువ్రతాలు. ఇందులో ఏ ఒకటితప్పినా కీర్తిని పోగొట్టుకుంటాను. కాబట్టి ఇంద్రునికి కవచకుండలాలిస్తాను."

ఇట్లాఅన్న కర్ణునితో సూర్యుడు తిరిగిఇట్లాఅన్నాడు."మిక్కిలిహితులైనవారు మేలుకలిగేట్లు చెప్పేమాటలు నీవు వినడంలేదు. నీవు మిక్కిలి అమాయకుడవు. నీకు తెలివితేటలతోకూడినతీరు తెలియడంలేదు. చెడిపోకుండా విను. కర్ణా! నీకు తెలిసేట్లు చెప్తాను. తనకు, తనకుమారులకు, భార్యలకు, తల్లి దండ్రులకు, బంధువులకు కీడుకలగనిమార్గంలో కీర్తినిపొందడం మంచిదేకానీ, అందరూచెడే ఆ కీర్తిఎందుకు? కాబట్టి నీవు నీప్రాణాలు కాపాడుకో. కీర్తిఅట్లుండనీ. నీవు బ్రతికిఉంటే తరువాత కీర్తి చేరదా? భార్యలూ కొడుకులూ సంపదలూ బంధువులూ సార్వభౌమతేజవైభవమూ ఇట్లాంటివన్నీకూడ ప్రాణంఉంటే ఇంపుగాశోభిస్తాయి. చచ్చినమనిషి వేగంగా బూడిదఅయిపోతాడుకానీ కీర్తి గొప్పతనాన్ని చూడగలుగుతాడా? చచ్చినవాడికీర్తి ఆలోచిస్తే శవానికిఅలకారంచేసినట్లే సుమా! నీవు నాకు చాలాభక్తుడవ్వడంవల్ల భక్తులను రక్షించడం చేయదగినపని కావడంవల్ల ఇట్లా నేను నీకు అన్నీచెప్పవలసి వచ్చింది. ఇంకా దేవరహస్యంఒకటుంది. అందువల్ల నాకు నీపట్లవాత్సల్యం ఎక్కువగా ఉంది. ఆ రహస్యాన్ని నేను ఇప్పుడు చెప్పను. తరువాత నీకు అదేతెలుస్తుంది. నీకూ అర్జునునికి ఎడతెగని పగవుంది. మీఇద్దరికీ తప్పక యుద్ధంజరుగుతుంది. అందులో నీవు సహజకవచకుండలాలు కలిగి ఉండడంచేత నిన్నర్జునుడు జయించలేడు. అట్లా కాకుండా కవచకుండలాలు పోగొట్టుకుంటే గొప్పఆపద ఏర్పడుతుంది".

ఈ మాటలకు కర్ణుడిట్లా అన్నాడు. "దేవా! పద్మినీవల్లభా ! సూర్య భగవానుడా! నీవు దయగల వాడవు. ఎప్పుడూ భక్తులకు శోభకూర్చడంలోనే లగ్నమైన మనస్సుకలవాడవు. కాబట్టే పూనుకొని నాపై ప్రేమతో మేలుకలిగే పద్ధతిలో చెప్పినావు. నిన్నొక్కటి ప్రార్థిస్తున్నాను. దయతో నేను చెప్పేఎదురు మాటలను క్షమించదగును. నేను అసత్యానికెంత భయపడతానో అంతగా యముడికికూడభయపడను. ఇంతకుముందు

పూనినవ్రతాన్నివదలి చెడుమార్గంలో పోగలనా? నన్ను మాన్పడం తగునా? అర్జునుడు 'జయింపరానివాడ'ని అనుకోవద్దు. నీకుకూడా నా దివ్యాస్త్రాలవిషయంతెలుసు. పరశురాముడూ ద్రోణుడూ నాకిచ్చిన దివ్యాస్త్రాలు తక్కువవికావు. కాబట్టి యుద్ధంలో అర్జునుణ్ణి తప్పక చంపగలుగుతాను. నీవు ఇంకొకఆలోచన చేయకుండా నాకుఅనుమతినిఇవ్వు."

సూర్యుడు కర్ణునిమాటలను విన్నాడు. కొంచెంసేపు ఆలోచించినాడు. కర్ణుని 'దృఢనిశ్చయాన్ని మార్చలేన'ని తెలుసుకున్నాడు. కర్ణుడు పూర్తిగానాశనంకాకుండా వేరొకమార్గము ఆలోచించినాడు. కర్ణుణ్ణి చూచి, "కుమారా! ఎట్లాగైనా నీ 'నిశ్చయమ'దే అయితే నామాట ఇంకొకటివిను. ఇంద్రునివద్ద భయంకరమైన అడ్డులేని 'శక్తి' అనే ఆయుధముఒకటిఉంది. దాన్ని వినయంగాఅడుగు. ముందుగా ఇంద్రునివద్దనుండి ఆ దివ్యశక్తిని తీసుకొని ఆ తరువాతనే కవచకుండలాలుఇవ్వు. ఇట్లాఅయితే నీకు కొంతైనా మేలుకలుగుతుంది. ఆ శక్తి యుద్ధంలో శత్రువులనుచంపి వేగంగాతిరిగి చేతికివస్తుంది. దానితోనే పూర్వము ఇంద్రుడు వేలసంఖ్యల్లో భయంకరమైన రాక్షసులగుంపులను చంపినాడు. మహా భుజబలముకలిగిన కర్ణా! నీకు ఆ భయంకరమైనఆయుధం దొరికితే శత్రువులను తప్పకగెలుస్తావు." అనిచెప్పి సూర్యుడు అంతర్ధానమైనాడు.

అప్పటి నుండి కర్ణుడు "ఇంద్రుడెప్పుడొస్తాడా?" అని ఎదురుచూస్తూఉండినాడు.

**నీతి :** పాటించేవ్రతానికి భంగం కలిగించరాదు. ప్రాణంకంటే కీర్తియేగొప్పది.

**మ.** **మతిఁగుంతీసుత పక్షపాతి యగుచున్ మాయాస్వరూపంబుతో**
**జితదైత్యుండు శతక్రతుండు నను భిక్షింపంగ నేతెంచు న**
**ట్టి తెఱంగైనఁదదీయకీర్తియ చుమీ డిందుం; ద్రిలోకీసము**
**న్నతమై యొప్పు మదీయకీర్తి; యిదిసూ నాపుణ్య మెఱ్ఱంగులన్.** **7-292**

**ఆ.** **కీర్తి విడువ ఁజాలఁ; గీర్తితో మెలఁగంగ ఁజావు వచ్చెనేని ఁజత్తుఁగాని;**
**జగములోన 'నెల్ల సడికంటె ఁజావు మే ల' నఁగ ఁబరగు మాట యనఘ!వినవె?** **7-293**

# 49. కుంతి - కర్ణుడు - ఇంద్రుడు.

**(అరణ్య 7-310 నుండి 375 వరకు.)**

**(కర్ణుడు కుంతీచేతితో 'అర్జునుడుతప్ప మిగిలిన పాండవులునలుగురనూ చంపన'నుట.)**

పూర్వము 'కుంతిభోజుడ'నే రాజొకడుండేవాడు. ఒకానొకనాడు ఆ కుంతిభోజునిఇంటికి 'దుర్వాసుడ'నేమహర్షి అతిథిఅయివచ్చినాడు. కుంతిభోజుడు ఆయననుసత్కరించినాడు. దుర్వాసుడు ఆ సత్కారాలను స్వీకరించినతరువాత ఇట్లాఅన్నాడు."నాకు నీ ఇంటిలో కొంతకాలం ఉండడానికి ఇష్టమయింది. నేను నీ ఇంట ఉన్నంతకాలం నీవూ నీసేవకులూ నాకు అచ్చమైనభక్తితో సేవచేయవలె. ఇట్లాచేయగలవా?" అందుకు కుంతిభోజుడు వెంటనేఅంగీకరించినాడు.

వెంటనే తనకూతురు 'పృథ'అనేపేరుగల కన్యను అక్కడకు పిలిపించినాడు. ఆమెకు ఆ మహామునిని చూపినాడు. "పద్మాక్షీ! ఈ బ్రాహ్మణుడు దేవతలతో సమానమైనవాడు.కోరికతో మనఇంట్లో ఉండకోరినాడు. నేనుకూడా అందుకంగీకరించినాను. నీవు మిక్కిలి ధైర్యశాలివి. మంచి వినయంకలదానవు. సేవచేసేగుణం కలదానవు. సేవించు. ఈతడు ఎప్పుడు ఏదికోరినా అదిసమకూర్చి సంతోషంగాఇచ్చి ఈ మహాత్ముణ్ణి సంతోషింపచేయి. ఆయన మనసులో ఎప్పుడుకోపగించుకోకుండాచూడు. విను. బ్రాహ్మణశ్రేష్ఠులు కొంచెంకోపగించుకున్నా భూమినంతా బూడిదచేయగలుగుతారు. వారు తపస్సుచేత గొప్పవారు. అడ్డగించలేని తేజస్సు కలవారు. బ్రాహ్మణులను అవమానించడం వల్లనే కదా వాతాపి, దండకుడు మొదలైనవారు గొప్పతనంపోయి చెడిపోయినారు. ఈ లోకాలన్నీ బ్రాహ్మణుల ఆదరణవల్లనేకదా బ్రతికి ఉన్నాయి? నీవు పసిదానవైనా ఎంతోగుణవంతురాలవు. గురువులపైనా, పెద్దలపైనా, బ్రాహ్మణులపైనా చాలాభక్తి చూపిస్తావు. బంధువులు, చెలులు, కావలసినవారు పౌరులు అంతఃపురంలోనివారు నిన్ను ప్రేమతో పొగడనివారులేరు. నిన్ను నేనేరీతిగా పొగడగలను? యదుకులంలోపుట్టి నా కూతురివై నీవు మిక్కిలిసుఖంగాపెరిగినావు. నీరూపం యౌవనపుసొంపు మూడులోకాలలోనూ అందమైనవి. ఇట్లాంటి నీ చరిత్రము ఇతరఆడుబిడ్డలలో ఎక్కడఉంది? నీ గొప్పతనాన్నంతా తెలుసుకొనేకదా 'అగ్నితో సమానుడైన ఈ మహామునిని ఆరాధించడం' అనేభారం నీమీదపెడుతున్నాను? నీవుకూడా గర్వాన్నీ అహంకారాన్నీ దూరంగాపెట్టి ఈ పుణ్యపురుషుణ్ణి సంతృప్తుణ్ణిచేసి ధన్యవుకా" అన్నాడు. ఆ మాటలన్నీవిన్న పృథాకన్య తనతండ్రితో ఇట్లాఅన్నది.

"నేనెప్పుడూ బ్రాహ్మణులను 'సేవించాల'ని మనసులో కోరుకుంటూఉంటాను. నేనునిత్యం కోరే కోర్కె నేడుసమకూరింది. అంతేకాకుండా మహారాజా! నీవుకోరిన విధంగాచేయడం నా అదృష్టంకాదా? ఈ భారము నా మీదపెట్టి మీరు నెమ్మదిగా విశ్రాంతితీసుకోండి."

ఆ వృద్ధ మాటలకు కుంతిభోజుడు మిక్కిలిసంతోషించినాడు. దుర్వాసునకు ఆ కన్యనుచూపినాడు. "తెలియక ఈమెతప్పుచేస్తే తమరుసహించవలసిఉంది. ఆమెకుపనులు చక్కగానేర్పించి ప్రేమగాసేవలు పొందడంతగును. 'పిల్లలూ, స్త్రీలు, వృద్ధులు తప్పులుచేస్తార'ని తమకు తెలుసుకదా? ఒక వేళ వాళ్ళుతప్పుచేసినా పరిపూర్ణమైనశాంతపరులైన తపస్వులుమరచిపోతారుకానీ, కోపగించుకోరు."అనిచెప్పి, ఆమెను ఆయనకు అప్పగించినాడు. తరువాత రాజు మునీంద్రునికి వెన్నెలలాగా తెల్లగాఉన్న సౌధంలోశయనం ఆసనం మొదలైన సాధనాలను ఏర్పాటు చేయించినాడు. కోరిన ఆహారాన్ని తయారుచేయడానికి కావలసిన పదార్థాలన్నింటినీ సమకూర్చినాడు. ఆ తరువాత తనపని పూర్తిఅయిందన్న తృప్తితో సంతోషంగా విశ్రమించినాడు.

ఆ సమయంలో కుంతీదేవి ఆ బ్రాహ్మణోత్తముణ్ణి సేవించింది. ఆమె ఆ సేవలో చిత్తశుద్ధిఉంది. దీక్షఉంది. భక్తిఉంది. వినయమూఉంది. ఆమె ఆయనను దేవతలను సేవించే విధంగా సేవించింది.

ఆ దుర్వాసుడు ఆ కుంతి 'చిత్తశుద్ధిని తెలుసుకోవాల'నుకున్నాడు. ఒకసారి 'పొద్దున్నే వస్తాన'ని చెప్పిపోయి సాయంత్రంవస్తాడు. ఆయన ఏసమయంలోవచ్చినా ఆ కుంతి అప్పటికప్పుడే కొత్తగా భక్ష్యాలూభోజ్యాలూ మొదలైనవి తయారుచేసి అమర్చేది. అలసిపోయేదికాదు. మనసులోకూడా ఎప్పుడూ కోపగించుకోదు. ఇట్లా కాలంసాగుతూఉంది. కుంతిభోజుడుకూడా ప్రతిదినం కూతురినిపిలిపించి, దుర్వాసుని చర్యలనుగురించి అడిగేవాడు. ఆ కుంతికూడా ఆ దుర్వాసునితీరునూ తానుసేవించే పద్ధతిని తెలియచేస్తూఉండేది. ఇదివిని రాజు సంతోషిస్తూఉండేవాడు.

అట్లా ఒక సంవత్సరకాలం గడచింది. దుర్వాసుడు సంతోషించినాడు. కుంతినిచూచి, "నీవు చేసిన సేవనుమెచ్చుకొన్నాను. నీకిష్టమైనవిఅడుగు. ఇస్తాను."అన్నాడు. ఆమె చేతులుజోడించి, "మీరు నావల్ల సంతోషపడినారు. ఇందుకు మా తండ్రి చాలసంతోషిస్తాడు. ఇదిచాలునాకు. ఇంకా వేరే ఎందుకు?" అన్నది. అప్పుడు దుర్వాసుడు "అట్లాఅయితే ఇదుగో ఈ మంత్రంతీసుకో. దీనివల్ల నీవేదేవతను ఆహ్వానిస్తే ఆ దేవతవచ్చి నీ ఆధీనంలోఉంటాడు." అన్నాడు. ఇంకొకమాటఅనడానికి భయపడి కుంతికూడా, "తమదయ." అన్నది. ఆ దుర్వాసుడు ఆమెకు ఆ మంత్రాన్ని శాస్త్రంలో చెప్పబడినవిధంగా ఉపదేశించినాడు. ఆ తరువాత తనదారిన తానుపోయినాడు.

తరువాత కొంతకాలానికి ఒకనాడు "బ్రాహ్మణశ్రేష్ఠుడు మనసులో దయతలచి నాకీ మంత్రాన్ని ఇచ్చినాడు. ఈ మంత్రము ఎట్లాంటిదో చూస్తాను." అనుకొన్న కుంతి ఇష్టంగా ఋతుస్నానం చేసింది. తూరుపుకొండచరియలమీద ప్రకాశించే సూర్యుణ్ణిచూచింది. సూర్యుణ్ణి చూడగానే వికసించేపద్మంలాగా ఆమెమనసులో సూర్యునిపైన అనురాగంఅంకురించింది. సహజ కవచకుండలాలతో అందంగాఉన్న ఆ

సూర్యుని ఆకారవైభవానికి లొంగిపోయింది. "దేవా! నీతో సమానంగా అందంగాఉండే కుమారుణ్ణి దయతో నాకుప్రసాదించవా?" అని మనసులోఅనుకొన్నది. మంత్రాన్ని ఉచ్చరించింది. సూర్యుడువెంటనే తనయోగబలంతో ఇంకొకఆకారంధరించినాడు. సాధారణంగా ఆకాశంలో వెలుగొందేసూర్యుడు మాత్రము అట్లేఉన్నాడు. ఆ ఇంకొక ఆకారంతో కుంతివద్దకు వచ్చినాడు. తియ్యని కంఠస్వరంతో ఆ కుంతితో ఇట్లాఅన్నాడు. "కుంతీ! నీ మంత్రబలంతో వచ్చినాను. నేను నీవాడనైనాను. నీ మనసు కిష్టమయినదాన్ని దేన్నిచేయమంటావు? నిజంచెప్పు." ఈ మాటలువిని, కుంతి సూర్యునితో, "ఏనేమీలేదు. కుతూహలంతో నేనుమంత్రాన్నిఉచ్చరించినాను. ఇంత మాత్రానికే నీవిక్కడకు రావాలా? దేవా! నీవు తిరిగి వెంటనే పో." అందుకు సూర్యుడిట్లా అన్నాడు.

"కుంతీ! తిరిగిపోవడం తప్పుతుందా? ఇంతకుముందు నీవు మనసులో ఏమనికోరినావో? ఆ విషయం ఇప్పుడు చెప్పకూడదా? తేజంలో నాతోసమానుడైనవాడూ సహజకవచకుండలాలు కలిగినవాడూ మంచివారు మెచ్చుకొనేవాడూఅయిన కుమారుణ్ణి నావల్ల నిజంగా నీవు పొందకోరలేదా? కాబట్టి ఇప్పుడు నాతోపొందును అంగీకరించు. నీవు కోరినపుత్రుడుపుడతాడు. ఇట్లా చేయకపోతే నిన్నూ నీతల్లిదండ్రులను బూడిదచేస్తాను. ఇంక నీనడవడిక తెలియకుండా గర్వంతో నీకుమంత్రాన్ని ఉపదేశించినమునిని కూడా ఈ క్షణంలోనే కాల్చివేస్తాను. అదిగో ఆకాశంనుండి ఇంద్రుడు మొదలైన దేవతాశ్రేష్ఠులు నీ వల్లచిక్కుపడిఉన్న నన్నుచూచి నవ్వుతున్నారు. ఇదిగోచూడు. నీకు దివ్యదృష్టిఇచ్చినాను."

ఈ మాటలువిన్న కుంతి మనసులో మిక్కిలిలజ్జకులోనైంది. సూర్యునితో "పుణ్యాత్మా! నన్నివ్వడానికి అధికారంకలవారు నాతల్లిదండ్రులే కదా? నేను వనితాధర్మాన్ని విడువవచ్చునా? ఇట్లయితే వంశానికి కీడుకలుగదా? మంత్రబలం తెలుసుకోవాలనే కుతూహలంతో తప్పుచేసినాను. మహాత్మా! దీనిని తప్పుగా భావించక ఎట్లాగైనా నా చిన్నతనాన్ని క్షమించు" అంటూ ఇంకాఅనేకప్రకారాలుగా సూర్యుణ్ణి బుజ్జగించడానికి ప్రయత్నించింది. కానీ ఆయన పట్టుదలను ఏ విధంగానూ వెనుకకు మరలింప లేకపోయింది. భయంఎక్కువయింది.అయినా సాహసించి సూర్యునితో ఇట్లాఅన్నది."సంతోషం చిగురించగా బంధువులూ పెద్దలూకలసి ధర్మంగా పెండ్లిచేసిన తరువాతకదా శృంగారం సక్రమమవుతుంది? అంతేకానీ కులాన్నీ శీలాన్నీవదలి ఈ విధంగా స్త్రీలు వేడుకచేయడం భావ్యమా? బంధువులపై ప్రేమ కలిగిననన్ను ఈ విధంగా నిర్బంధము చేయవచ్చునా? అధర్మమార్గంలో ఇట్లా చేయడంవల్ల స్వచ్ఛమైన నీకీర్తి మలినమైపోదా? దేవా! లోకాల్లో ధర్మమూ సత్యమూ నీయవియేకావా? నీకు తెలియని ధర్మాలున్నాయా? ఇట్లాంటిది నీ బుద్ధికి న్యాయమైతే నేనడ్డుచెప్తానా? ఏమైనా కానీ. నీ ఇష్టమైనట్లే చేయి. ఆ తరువాత వచ్చేనిందను భరిస్తాను."

ఈ మాటలు విని, సూర్యుడు ఆ చంద్రముఖినిచూచి, "తల్లి దండ్రులు బంధువులు నిన్నివ్వడానికి అధికారులుకారు. విను. నీకు నీవే అధికారిణివి. కోరిక (కామాలు) లన్నీ కోరి పొందగలిగినది కాబట్టి 'కన్య'అనేమాటపుట్టింది.అంతేకాదు.తన పనులుతాను చేసుకోవడంలో నీకు కీడుకలుగదు. నేను అధర్మంగా ఎందుకు నడుచుకొంటాను? నాతో సంగమమువల్ల నీ కన్యావ్రతం చెడదు. అధిక తేజంకలిగిన కొడుకు పుడతాడు. నీకు ఒక్క నిందకూడాకలుగదు. ఇది సత్యం". అనిచెప్పి, ఆమెను ఒప్పించినాడు. ఆమెతో సంగమించినాడు. సంతోషించినాడు. ఆమెకు గర్భాధానంచేసి ఆకాశం లోనికిపోయి తనఅసలు మూర్తిలో కలిసిపోయినాడు.

అటుతరువాత కుంతిగర్భము శుక్లపక్షపు చంద్రుడిలాగా క్రమంగా పెరిగింది. బాగా కనిపిస్తూ ఉండింది. అయినా సూర్యుని మహిమవల్ల లోకానికి తెలియకుండాఉండింది. ఈ విషయము దాది కూతురు ఒక్కదానికే తెలుసు. ఇట్లా ఉంటూ పదవనెలలో ఒకనాటిరాత్రి కన్యకాంతఃపురంలో కుంతి కొడుకును కన్నది. ఆ కొడుకు సహజమైన కవచకుండలాలతో అలంకరింపబడినాడు. ఆ బిడ్డకు తెల్లని కోమలమైన కన్నులున్నాయి. పొడవైనచేతులున్నాయి. అందమైన దేహంఉంది. బాలసూర్యుడివంటి తేజస్సువుంది. ఇట్లాపుట్టిన ఆ అపురూపమైన శిశువును చూచింది. కుంతి. 'లోకంలోఅపవాదు వస్తుంది' కదా? అని భయపడింది. మనసులో కలతచెందింది. ఆలోచించింది. ఆ వెంటనే ఒకపెట్టెలో ఆ బాలుడిని జాగ్రత్తగాపెట్టింది. చాలాగట్టిగా ఆ పెట్టెను ఒక తెప్పకుకట్టింది. ఆ పెట్టెను తీసుకొని తాను తన చెలికత్తెతోకలసి బయలుదేరింది. నగరానికి సమీపంలో వుండే అశ్వనదీతీరం చేరింది. ఆ పెట్టెనూ తెప్పనూ ఆ అశ్వనదీ ప్రవాహంలో వదలింది.

అట్లాబిడ్డను నదిలోవదలిన తరువాత కుంతి ఇట్లా ప్రలాపిస్తూ ఏడిచింది. "కొడుకా! నేను నోచిన నోములు నిన్ను కనడానికిమాత్రమే సరిపోయినాయి. నిన్నుపెంచి మన్నించి ప్రేమతో నీ సంరక్షణను అనుభవించేపుణ్యం నేను పూర్తిగాఎందుకుచేసుకోలేదో ? ఏ పుణ్యసతికి నీ వింక కుమారుడవై ఎక్కడ పడతావో నాకు తెలియదు. ఏ పుణ్యాత్మురాలో ఎప్పుడూ నిన్ను పుత్రునిగా చూడడానికి మంచి కలలను కంటుంది. ప్రేమతో దుమ్ములో ఆడుకుంటూ మెల్లగా నడుస్తూ 'తియ్యని జిలిబిలి పలుకులు' అనే అమృతాన్ని చెవుల్లో కురిపిస్తూ వెడల్పైనకన్నులతో చిన్ననవ్వుతో శుభలక్షణాలతో ప్రకాశించేనిన్ను ఏ స్త్రీ గట్టిగా పట్టుకొని గుండెకుహత్తుకొని ఆనందంగా పెక్కురీతులుగా అనుకుంటూ నవ్వుతూ ముద్దులాడుతుందో? మనోహరమైనయౌవనం ప్రకాశించే విలాసంతో ప్రకాశించి నీవు సుందరంగానూ, భయంకరంగానూ ఒప్పుతావు. భయంకరమైన అడవిలోపుట్టిన సింహంలాగాఉంటావు. స్త్రీలు నీ సౌందర్యాన్ని ధైర్యం కోల్పోయి చూస్తారు. శత్రువులుకూడా ధైర్యం కోల్పోయి నీ భయంకరత్వాన్ని చూస్తారు. నీవు ఎక్కడ ఉన్నాఎప్పుడూ నిన్నుకన్నులారా చూడకలుగుతాడు కనుక కుమారా! నిన్నుకన్న సూర్యుడు చాలాధన్యుడై నాడు. 'ఎందుక'ంటే

అదు. చూడడానికి నీవు ఎక్కడఉన్నా వీలుఉంటుంది. కానీ నేనే భాగ్యంలేని దాని నైనాను. సూర్యుడు అరచేతిలో మరుగుపడడం ఎక్కడైనాఉందా? కాబట్టి నిన్ను ప్రేమగా ఇంకాకొంత కాలం తరువాతనైనా చూస్తానుగాక'. నీ పొగడబడే అంగసౌష్ఠవం చెవులకుఉండే మణికుండలాలు చాలా గొప్పదైన వజ్రంవంటి కఠినమైనకవచము నిన్ను నాకు తెలియచేయకుండా ఉండనిస్తాయా? స్వర్గంలో భూమిమీద, ఆకాశంలో, దిక్కుల్లో, గాలిలో, అగ్నిలో, సముద్రాలలో, భయంకరమైన అడవులలో నీకు శుభం కలుగుకాక! దిక్పాలకులు, సిద్ధులు, సాధ్యులు రుద్రులు, ఆశ్వినులు, లోకాలూ, సూర్యుడు, చంద్రుడూ నిన్ను దయతో రక్షిస్తూఉంటారు." ఇట్లా ఏడుస్తూ కుంతి అక్కడ ఆలస్యంగా ఉండడానికి భయపడింది. వేగంగా రహస్యంగా కన్య కాంతః పురానికి తిరిగివచ్చి ఎప్పటిలాగా ఉండిపోయింది.

అక్కడ ఆ పెట్టె అశ్వనదిలో ప్రయాణంచేసి చర్మణ్వతికి చేరింది. చర్మణ్వతినుండి యమునలో కలిసింది. అక్కడనుండి గంగానదిలోనికి పోయింది. ఆ గంగానదిలో ప్రవహిస్తూ సూతదేశంలో పంపా నగరంవద్ద పోతూఉండింది.

ఆ సమయంలో ఒకసూతుడు అక్కడగంగలో తనభార్యతోసహా జలకేళిసల్పుతూ ఉండినాడు. ఆతడు ధృతరాష్ట్రుని స్నేహితుడైన అతిరథుడనే సూతుడు. ఆ సూతుడు ఎత్తైన అలలతోపాటు కొట్టుకొని వచ్చే పెట్టెను పట్టితెప్పించినాడు. తెలివితో రహస్యంగా ఆపెట్టెనుతెరచి అందులోని ఆ బాలుణ్ణి ఆనందంగాపట్టి ఎత్తుకొన్నాడు. ఆ తరువాత అతడు తనభార్యరాధనుచూచి "బిడ్డలులేనిమనకు మనపాలిట దేవుడెవరో ఈ బాలకుణ్ణిచ్చినాడు. పద్మాక్షీ! వీడు మనుష్యులకు పుట్టినవాడుకాడుసుమా!" అనిచెప్పి బాలుణ్ణి ఆమెచేతికిచ్చినాడు.

ఆ రాధ ఆ బాలుణ్ణి తీసుకొని రొమ్ముకు అదుముకొన్నది. అధికమైన ప్రేమవల్ల అమెకు బాలింతలాగా చన్నులనుండి పాలుకారినాయి. ఇట్లా ఆ దంపతులు ఆనందంతో కుమారుణ్ణి తీసుకొని తమఇంటికి పోయినారు. తమ కులసాంప్రదాయాల ననుసరించి పుట్టినపుడు చేసే సంస్కారాలుచేసినారు. సహసజమైనకుండలాలతో అలంకరించబడిన చెవులు (కర్ణములు) కల వాడవడంవల్ల వారు ఆ బాలుడికి 'కర్ణుడ'నే పేరుపెట్టినారు. ఇంకా బంగారుకవచం ధరించినవాడు (వసువర్మధరుడు) కాబట్టి 'వసుసేనుడ'నేపేరుకూడా బ్రాహ్మణులుపెట్టినారు. ఈ విధంగా సూర్యునికుమారుడు సూతుని కుమారుడైనాడు.

ఈ విషయమంతా కుంతి తనఆప్తులైనచారులవల్ల విన్నది. ఆవేదనను తగ్గించుకొన్నది. కాలక్రమంలో కర్ణుణ్ణి అతిరథుడు ద్రోణాచార్యునివద్ద అస్త్రవిద్య నేర్చుకోవడానికి ఉంచినాడు. ఆ సూతసుతుడు ఇంకా కృపాచార్యునివద్ద, పరశురామునివద్ద, వివిధాస్త్రాలు సంపాదించినాడు. క్రమంగా దుర్యోధనునితో

గాఢమైన స్నేహం కలవాడయినాడు. అతనికి సంతోషం కలిగించడానికై అర్జునునిపై అసూయతో పాండవులకనిష్టమైనపనులు చేస్తూఉండినాడు.

కర్ణుడి అస్త్రవీర్యాన్నీ, సహజకవచకుండలాల కీర్తినీ, మనసులో ఆలోచిస్తూ ధర్మరాజు మిక్కిలి భయపడుతూఉండేవాడు. అతడు ఛేదించడానికి వీలుకాని 'బలంకలవాడ'ని ఎప్పుడూ ధైర్యాన్నివదలి అడవిలో బాధపడుతూనేఉండినాడు.

అట్లాభయపడుతూ బాధపడుతూఉండిన ధర్మరాజుకు సంతోషంకలిగించడంకోసం కర్ణుడి కవచకుండలాలనుహరించాలనుకున్నాడు ఇంద్రుడు. ఒకరోజు ఆయనబ్రాహ్మణరూపంలో కర్ణునివద్దకు పోయినాడు. అది మధ్యాహ్నసమయం. ఆ సమయంలో కర్ణుడు సూర్యుణ్ణి ఆరాధిస్తూ ఉండినాడు. బ్రాహ్మణరూపంలోని ఇంద్రుడు కర్ణుణ్ణిచూచి "భిక్షాందేహి." అన్నాడు.

అపుడు కర్ణుడు ఆ బ్రాహ్మణునితో, "మృదువైన విలాసంతో కూడిన శృంగారవతులైన యువతులు కావలసినా, అధికమైనపంటలతోనిండినఊర్లు కావలిసినా, ప్రకాశిస్తున్న మణులతో బంగారంతో కూడిన ఆభరణాలు, గోవులు, ధనాలు కావలసినా, కోరుకో. తప్పకఇస్తాను" అన్నాడు.

అందుకు ఇంద్రుడు కర్ణుడితో, "విను ఇవేవీ నాకుఇష్టాలుకావు. నీ కుండలాలు, నీ పొగడబడే కవచముఇస్తే తీసుకొంటాను. నీ కిష్టమయితే ఇయ్యి" అన్నాడు.

ఇంద్రుడిట్లా అనగానే కర్ణుడు, "అయ్యో! నేను 'గొప్ప వస్తువులు ఇష్టంగా ఇస్తాన'ంటే బ్రాహ్మణశ్రేష్టా! ఆలోచిస్తే ప్రయోజనంలేని వాటిని ఈ విధంగా కోరుతున్నావు. మిక్కిలి అమాయకుడవైనావు. ఈ విధంగా ఇంతకు ముందెవ్వరైనా ఎవరినైనా ఏ లోకంలోనైనా కోరినారా? కుండలాలూ కవచమూఅట్లుండనీ, పుణ్యాత్మా! ఇంకేవైనాధనాలుకోరుకో. నీ కోరిక తీరుస్తాను. గొప్ప చరిత్ర కలిగినవాడా! ఇంకేమీ అనవద్దు". అన్నాడు.

కర్ణుడెన్నిచెప్పినా ఆ బ్రాహ్మణుడు అంగీకరించలేదు. కవచకుండలాలపైనే అభిలాషచూపి మాట్లాడినాడు. కర్ణుడు అతనిని ప్రార్థించినాడు, పూజించినాడు, ఎన్నో మణులు బంగారం మొదలైన వస్తువులు ఇవ్వచూపినాడు. ఏవిధంగాను ఒప్పించలేక పోయినాడు. కడకు కర్ణుడు, "నాకీ కవచ కుండలాలు సహజంగా శరీరంతోపాటుగాపుట్టినవి. ఇవి లేకపోతే నాకు యుద్ధభూమిలో గొప్ప విరోధులచేత పరాజయం కలుగుతుంది. కాబట్టి వాటిని మీకివ్వలేను, బ్రాహ్మణశ్రేష్టా! నన్ను వేధించకుండా పెక్కుగ్రామాలూ పెక్కుసంపదలూకలిగిన నా రాజ్యంఇస్తాను. తీసుకో." అన్నాడు. అట్లా అన్నప్పటికీకూడా ఆ బ్రాహ్మణునిలో అనుకూలత కనిపించలేదు.

అపుడు కర్ణుడు చిరునవ్వుముఖంతో మాయాబ్రాహ్మణుణ్ణిచూచి ఇట్లాఅన్నాడు. "నిన్ను నేను తెలుసుకొన్నాను. నీవుఇంద్రుడవు. మూడు లోకాలూ నీ రక్షణయందే నిష్కల్మషంగా ప్రకాశిస్తూ ఉంటాయి. అట్టి నిన్ను నేను వేడుకోవడం యుక్తంగా ఉంటుంది కానీ, నన్ను మోసగించి నీ అవసరం తీర్చుకోవడానికి నీవు నన్ను వేడుకోవడం తగినపనియేనా? చెప్పు".

అందుకు ఇంద్రుడు ఇట్లాఅన్నాడు. "మీ తండ్రి సూర్యుడు ఇదంతాఇంతకు ముందే నీకు ఇష్టంగా చెప్పినాడు. కాబట్టి నీవు తెలుసుకొన్నావు. పుణ్యాత్మా! మాబోటివారికి ఇష్టమయిన పనిచేయడానికి నీవింక ఆలస్యంచేయడమెందుకు?"

వెంటనే కర్ణుడు, "దేవా అట్లాఅయితే శత్రువులనందరనూచంపే అడ్డంలేని నీ శక్తి ఆయుధాన్ని నాకు దయతోఇచ్చి కవచకుండలాలు తీసుకో." అన్నాడు.

అప్పుడు ఇంద్రుడు, "శక్తినిస్తాను, స్పష్టంగావిను, యుద్ధంలో నా శత్రువులను వేగంగాచంపి అదితిరిగి నా చేతికి వస్తూఉంటుంది. నీకు నేనివ్వడం ఆ విధంగాకాదు. లోకంలో ఎక్కడైనా జయించవీలుకాని శత్రువును ఒకణ్ణి వేగంగాచంపుతుంది. ఆ తరువాతతిరిగి నా దగ్గరికి వచ్చినన్నుసేవిస్తుంది. ఇది నియమంగా శక్తిని స్వీకరించు." అన్నాడు.

ఈ మాటకు కర్ణుడు, "నాకుఉన్నశత్రువు ఒక్కడే. వాణ్ణి చంపడమే నాకోరిక." అన్నాడు. అప్పుడు ఇంద్రుడు నవ్వుముఖంతో, " కర్ణా! నీ కోరిక నిజంగా నాకు తెలుసు. భయంకరమైన శౌర్యంతో తేజోవంతుడైన అర్జునుణ్ణి చంపాలని చూస్తూఉన్నావు. నీకిది ఎట్లావీలవుతుంది? దయకు లొంగేవాడూ మూడులోకాలూ తనకులోబడినవాడూ నాశనంలేనివాడూ అయిన నారాయణుడు ఆ మహాత్మునికి రక్షకుడు. అందుచేత ఎవరైనా వాడినిసాధించలేరు." అని వివరంగా చెప్పినాడు.

అప్పుడు కర్ణుడు, "అది అట్లుండనీ సహజమైన కవచకుండలాలు ఒలిచిఇస్తే నాదేహం వికృతమవుతుంది కదా? దీన్ని గురించి 'ఏమ'ని ఆలోచిస్తావు?" అన్నాడు.

అందుకు ఇంద్రుడు, "నీ శరీరం నీ తండ్రిఅయిన సూర్యునికిరణాలకాంతి ఎట్లాంటిదో అట్లాంటి కాంతితో శోభిస్తుంది". అనిచెప్పి, ఆ కర్ణుడికి తనఅమోఘమైన శక్తినిచ్చినాడు. తరువాత ఇట్లా అన్నాడు."దీనిని ఆపదకాలంలోతప్ప ఇతరసమయాల్లో ప్రయోగిస్తే నీకపాయమవుతుంది".

ఆ తరువాత కర్ణుడు తనకవచకుండలాలు తీసిఇచ్చినాడు. గొప్పపదునైన ఆయుధంతో అంగాలకు ఎక్కడా వికారంలేకుండా కవచాన్నిఒలవడం మొదలుపెట్టినప్పుడు "హో" అని కిన్నర, యక్ష, సిద్ధ, సాధ్యులు ఆకాశంనుండి కేకలుపెట్టినారు. మంగళవాద్యాలు ఆకాశంలో వినిపించినాయి. ఆశ్చర్యకరంగా వారంతా కర్ణుని పైనప్రేమతో పూలవానకురిపించినారు.

ఈ విధంగా ఇంద్రుడు కర్ణునికి కవచకుండలాలు లేకుండాచేసి ఆనందంతోవికసించినఆకారంతో స్వర్గానికి పోయినాడు.

**నీతి :** వ్రతములను వదలరాదు.

**తే.** కార్య మొక్కటియును లేదు; కౌతుకమున నేను మంత్రంబు నొడివితి; నింతమాత్రఁ
జేసి నీకు నిచ్చుటికి విచ్చేయ నేల? దివికి నరుగుము క్రమ్మఱ దేవ! నీవు. **7-328**

**ఉ.** 'క్రమ్మఱి పోక తప్పెడినె? కామిని! యేమని మున్ను నీవు చి
త్తమ్మునఁ గోరి? తద్విధము దప్పక యిప్పుడు బల్కరాదె? తే
జమ్మున మత్సమానుఁ గవచస్ఫుటకుండల మండితాంగు స
త్సమ్మతు బుత్రుగోరవె నిజమ్ముగ నావలనం దలోదరీ! **7-330**

**చ.** అలఘునిశాతశస్త్రమున నంగము లెల్లను నిర్వికారుఁ డై
యొలువఁ దొడంగినట్టియెడ 'హో' యని కిన్నర యక్షసిద్ధ సా
ధ్యులు దివినుండి యార్చుచును దూర్యరవంబు సెలంగ నద్భుతం
బెలయఁగ బుష్పవృష్టి గురియించిరి కర్ణునిపై బ్రియంబునన్. **7-374**

# 50. యక్షప్రశ్నలు.

**(అరణ్య 7-377 నుండి 467 వరకు.)**

**(యమధర్మరాజు యక్షరూపంలో ధర్మరాజును ప్రశ్నించి సమాధానాలను పొందుట.)**

పాండవులు అరణ్యవాసకాలంలో కామ్యకవనంలో మార్కండేయమహర్షి చెప్పినపుణ్యకథలన్నీ విని ఆ తరువాత తిరిగి ద్వైతవనానికి పోయినారు. ఆ ద్వైతవనంలో ఒకనాడు ఆశ్రమంలో ధర్మరాజు సుఖంగా కూర్చుని ఉన్నాడు. అక్కడకు అప్పుడు ఒక బ్రాహ్మణుడు తత్తరపాటుతో వచ్చినాడు. వచ్చీరాగానే ఇట్లా అన్నాడు. "రాజా! నేను నాఅరణిని చెట్టుకొమ్మకు తగిలించిఉండినాను. ఒక జింక అతివేగంగా వచ్చి, ఆ చెట్టు కొమ్మను రాచుకొన్నది. అప్పుడాఅరణి దానికొమ్ములకు తగులుకున్నది. అ జింక అరణిని కొమ్ములకు తగల్చుకొని పారిపోయింది.అది లేకపోతే నాకు నిత్యానుష్ఠానానికి లోటుకలుగుతుంది. కాబట్టి ఆ అరణిని నాకు తెచ్చివ్వడానికి ఎవరినైనాపంపవా?"

ఆ మాటలువిని ధర్మరాజు ఆ క్షణంలోనే పెద్దవిల్లుచేతపూని తమ్ములూ తానూకూడి ఎంతో వేగంగా ఆ జింకపోయినవైపునకు పోయినారు. చుట్టుముట్టినారు. వెలుగులుచిందే తీవ్రబాణాలు వేసినారు. అయినా అద్భుతంగా ఒకబాణంకూడా ఆ జింకనుచేరలేదు. తాకలేదు. ఆ జింకకూడా వారిని చాలాదూరం రప్పించుకొన్నది. అట్లాపోయి భయంకరారణ్యంలో మాయమైంది. పాండవులు తమప్రయత్నం చెడిపోయినందుకు దుఃఖపడినారు. వారందరూ మిక్కిలి అలసటచెందినారు. చల్లనినీడకలిగిన ఒక మర్రిచెట్టు నీడకుచేరినారు. విశ్రాంతి తీసుకుంటూఉండినారు. అప్పుడు నకులుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

"మన కులం గొప్పది. శీలం గొప్పగాఉంది. మనకు దయమీదనే ఇష్టంఉంది. ధర్మం పైననే బుద్ధిఉంది. అట్లాంటిమనకు ఈ విధమైనఅలజడిరావడానికి కారణమేమో?"

అందుకు గొప్పవివేకంకలిగిన ధర్మరాజు నకులునితో ఇట్లాఅన్నాడు. "విను. సుఖానికి దుఃఖానికి కారణం తానుఇంతకు మునుపుచేసిన కర్మయే. 'ఇది కారణమ'ని వేరేదేదీ ఉండదు."

అప్పుడు భీముడు నకులునితో ఇట్లాఅన్నాడు. "ప్రాతికామిపోయి ద్రౌపదిని కొలువులోనికి తెచ్చినప్పుడు కోపంతోవిజృంభించి ధృతరాష్ట్రుని కొడుకులనందరనూచంపనందున ఇట్లాంటి ఆపదపుట్టింది".

అప్పుడు అర్జునుడు ఇట్లాఅన్నాడు."తమ్ముడా! సభలో కర్ణుడు అతిశయించి మాట్లాడిన పరుషమైన మాటలువినికూడా కోపగించుకోకుండా నేనుతప్పుకొని పిరికివాడివలె అడవికి ఇట్లారావడంవల్ల మనకు దాటలేనిదుఃఖాలు ఆగకుండాదాపురించినాయి."

ఆ తరువాత సహదేవుడు ఇట్లాఅన్నాడు. "పుణ్యాత్ముడా! చెడునడవడిక కలిగిన కపటపు జూదమాడే శకునిని నేను ఆలస్యంలేకుండా అప్పుడేచంపనందున అడవుల్లో ఇట్లాంటి చెడుదశపాలైనాము".

ఈ విధంగా అందరూ ఎవరికి తోచినట్లుగా వారు మాట్లాడుతూఉండగా ధర్మరాజు నకులుణ్ణి చూచి, "నీ సోదరులందరూ మిక్కిలి దప్పికకొనిఉన్నారు. నీవీచెట్టెక్కి నీళ్ళుండే వైపు తెలుసుకో." అన్నాడు.

వెంటనే నకులుడు ఆ చెట్టునెక్కి అన్నిదిక్కులూ పరిశీలించినాడు. 'దూరంలో నీళ్ళున్నాయ'ని అన్నకు చెప్పినాడు. ధర్మరాజు, "అట్లైతే నీవుపోయి నీళ్ళుత్రాగి మాకుకూడతీసుకొనిరా" అన్నాడు.

నకులుడు చెట్టుదిగి వేగంగా నీళ్ళున్న దిక్కుగాపోయినాడు. పోయి ఎదురుగా చాల మనోహరంగాఉండే తటాకాన్ని చూచినాడు. అందులోనికిదిగి నీళ్ళుత్రాగబోయినాడు.

అప్పుడొక శరీరంలేనిప్రాణి, "ఓ అన్నా! ఈ తటాకంనాది. 'నీవీ నీళ్ళు త్రాగాల'నుకుంటే నేనడిగే ప్రశ్నలకు బుద్ధిమంతుడవై సమాధానాలనివ్వు" అన్నది.

నకులుడు ఆ మాటలను లెక్కచెయ్యకుండా ఆ కొలనులోని తియ్యనినీరు త్రాగినాడు. చైతన్యం లేనివాడై ఆ చెరువు గట్టుమీదపడిపోయినాడు.

అక్కడ దర్మరాజు సహదేవుణ్ణిచూచి, "నకులుడు నీళ్ళకోసంపోయి ఆలస్యంచేసినాడు. నీవుపోయి అతడిని తోడ్కొని నీళ్ళు తీసుకొని రా.పో." అన్నాడు.

సహదేవుడు మిక్కిలివేగంగాపోయినాడు. ఆ చెరువుగట్టునపడిఉన్న నకులుడితీరును చూచినాడు. ఆశ్చర్యంకలిగింది. దు:ఖంకలిగింది. కలవరపాటుకూడాకలిగింది. "ఇది ఎందుకయిందో?" అని ఆలోచిస్తూ ఉండినాడు. అప్పుడు తనకు ఎక్కువగా ఉన్న దప్పికను తట్టుకోలేక పోయినాడు. నీళ్ళు త్రాగాలనే కోరికతో కొలనులోనికిదిగినాడు.

అప్పుడు అదేఅశరీరవాణి ఇట్లాఅన్నది. "పుణ్యాత్ముడా! ఈ చెరువునాది. సాహసంచేసి ప్రవేశించకూడదు. నా ప్రశ్నలకు తగినట్లుగా సమాదానాలిచ్చి నీకు కావలసినట్లు నీళ్ళుతీసుకో."

ఈ మాటలను లెక్క చేయకుండా గొప్పవాడైన సహదేవుడు ఆ నీళ్ళు త్రాగి వెంటనే విషమెక్కిన విధంగా స్పృహకోల్పోయినాడు. పెద్దమద్దిచెట్టులాగా కూలిపోయినాడు.

నకులుడు సహదేవుడూ తిరిగి రాకపోవడానికి ధర్మరాజుకు మనసులో దుఃఖంపెరిగింది. అర్జునుణ్ణిచూచి "అన్నా ! నీ ప్రియమైన తమ్ముళ్ళుపోయి చాలసేపయింది. ఈ అడవిలో ఏం జరిగిందో? వేగంగా నీవుపోయి వారినితోడ్కొని నీళ్ళుతీసుకొనిరా." అన్నాడు.

గొప్పభుజాలుకలఅర్జునుడు మిక్కిలివేగంగాపోయి చెరువుగట్టునపడిఉన్న నకుల సహదేవులను చూచినాడు. వారిద్దరూ అడ్డగించలేని గొప్పశౌర్యంకలవారు. అట్లాంటివారు పడిపోయి ఉండడంచూచి అర్జునుడు ఆశ్చర్యపడినాడు మనసులో మిక్కిలి దుఃఖంకలిగింది. నాలుగుదిక్కులా పరికించి చూచినాడు.

ఎవ్వరూ కనిపించలేదు. తనకు మిక్కుటమైన దాహంవేసింది. అలసట కలిగింది. నీళ్ళు త్రాగాలని పూనుకొని కొలను సమీపించినాడు. అర్జునుడట్లా కొలను సమీపించగానే అదే శరీరంలేనిభూతం, "బలంతో ప్రవేశిస్తే ఎట్లాంటి వారికైనా ప్రాణంమీదకువస్తుంది. ఈ చెరువునాది. దప్పిక పోయేట్లు 'నీళ్ళు త్రాగాల'ంటే నేను వేసే ప్రశ్నలకు సమాధానాల నివ్వు" అనగా అర్జునుడు మనసులో కోపంచెందినాడు. "దొంగలాగా కనబడకుండా నిలబడి అడ్డుమాటలు మాట్లాడితే చెల్లనిస్తానా? వేగంగా నీ గొంతు మూగపోయేట్లు చేస్తాను. ఇప్పుడేచూడు." అంటూ అర్జునుడు శబ్దభేది బాణాలగుంపులను ఆశబ్దం వచ్చేవైపు ప్రయోగించినాడు. అల్లెత్రాటిశబ్దం అన్నివైపులా నిండింది. ఇట్లా బాణాలువేసిన తరువాతకూడ ఇంతకుమునుపటి మాటలే తిరిగి వినిపించినాయి. అప్పుడు అర్జునుడు, "ఆ మాటలవిషయం తరువాతచూస్తాను. ముందు నీళ్ళు త్రాగుతాను." అనుకుంటూ కొలనులోనికి దిగి నీళ్ళుత్రాగినాడు. వశంతప్పిన హృదయంతో నేలపై ఒరిగినాడు.

ఎంతకూ అర్జున,నకుల, సహదేవులు తిరిగిరాకపోవడంతో ధర్మరాజు, భీముణ్ణి చూచి "ఇంతవరకు నీతమ్ములు ఆలస్యం చేయడానికి కారణమేమో? నీవుపో." అన్నాడు. భీముడు వాయువేగంతో ఆ ముగ్గురుపోయినదారిలో పోయినాడు. ఆ కొలనుగట్టుపైన నిదురమైకంలోఉన్న వారివలెపడిఉన్న తమ్ములనుచూచినాడు. దుఃఖించినాడు. "ఇది మనుష్యులు చేసినపనికాదు. ఇంద్రుడు, కిన్నరులు, పన్నగులు, మొదలైన దేవతలుచేసినపని అయిఉండవచ్చు. దీనినంతా స్పష్టంగా తరువాత చూస్తాను." అనుకున్నాడు భీముడు. ఆ భీముడు భయంలేనివాడు. ముందుగా దప్పిక 'తీర్చుకోవాల'నుకున్నాడు. చెరువులోనికిదిగినాడు. "అయ్యా! నీవు ఇట్లాఎందుకు సాహసంచేస్తావు? ఈ కొలనును నేను పూర్వమే ఆక్రమించిఉన్నాను. అందుచేత ప్రస్తుతం ఈ కొలనునాది. నీకు చేతనైతే నేనడిగే ప్రశ్నలకు సమాధానాలనిచ్చి నీళ్ళు త్రాగు." ఆ మాటలు లెక్కచెయ్యకుండా భీముడుకూడా నీళ్ళుత్రాగినాడు. అక్కడనే మూర్ఛపోయిపడిపోయినాడు.

ఇక్కడ ధర్మరాజుకు తమ్ములు నలుగురూ ఒకేసారి ఆ విధంగా ఆలస్యం చేయడం, దు:ఖం కలిగించింది. తానుస్వయంగాలేచి తమ్ములుపోయినదారిలో పోయినాడు. పుణ్యాత్ముడైన ఆ ధర్మరాజు అడవిలో పోతూఉన్నాడు. ఆ అడవి మహాభయంకరంగాఉంది. మనుష్యుల అలికిడిలేదు. దారులే కనిపించడంలేదు. దట్టంగా చెట్లూ, పొదలు, తీగలుఉండి నడవడానికి వీలులేకుండా ఉంది. ఏనుగులు, సింహాలు, శరభాలు, శార్దూలాలు, పందులు, దున్నపోతులు, అడవిలో నిండా తిరుగుతున్నాయి. రకరకాలైనపక్షులఅరుపులతో అడవి భయంకరంగాఉంది. అట్లాంటి విశాలమైన అడవిలో ధర్మరాజు తమ్ములను వెతుకుతూ పోయిపోయి చెరువుగట్టునుచేరినాడు. అక్కడ పడిపోయిఉన్న తమ్ములను చూచినాడు. ఆ పడినవారు పూరువంశంలో శ్రేష్ఠులు. వారంతా మితిలేనిబలంకలిగినవారు. నిర్మలమైన బుద్ధికలవారు. గొప్ప పుణ్యమే 'ధనంగా'కలవారు. వీరులలో శ్రేష్ఠులు. అట్లాంటివారు ప్రళయంలో పడిపోయిన 'లోకపాలకుల'లాగా ధర్మరాజుకు కనిపించినారు. వారినిచూచి మనస్సులో తల్లడిల్లినాడు. నిట్టూర్చినాడు. ముఖంపాలిపోయింది. ఓర్పు కదలిపోయింది.

మనసులో ఆశ్చర్యపడినాడు. దుఃఖంతో కన్నీరుకారింది. కళ్ళుకన్నీటితోనిండి కనులకుచూపు ఆనలేదు. స్పృహ తప్పబోయినాడు. కొంతసేపు ఆయన అక్కడ బొమ్మలోగీసిన రూపంలాగా నిశ్చేష్టుడై ఉండినాడు. ఆ తరువాత కొంతసేపటికి ధైర్యం తెచ్చుకొన్నాడు. ఆ నలుగురిని తిరిగిచూచినాడు. నాలుగువైపులా పరికించిచూచినాడు. మనస్సులో "ఇతరులెవరూ వచ్చినట్లు గానీ పోయినట్లుగానీ కనిపించడంలేదు. యుద్ధంజరిగిన గుర్తులులేవు. ఈ గొప్పభుజాలు కలిగినతమ్ముళ్ళ శరీరాలమీద గాయాలేంకనిపించడంలేదు. వీరు ఎందుకుఇట్లాఅయినారో? క్రూరుడైన శకుని పెక్కుమాయలు తెలిసిననాడు. అయ్యో! ఆ దురాత్ములు ఆగకుండా ఏదైనా మోసంచేసి ఇట్లాచేసినారేమో? ఎవరైనా చెడుబుద్ధికలవారిని పాపాలుచేసేవారిని మనస్సులో నమ్ముతారా? నా తమ్ముళ్ళ ముఖాల్లో తెలివితగ్గలేదు. కాళ్ళు చేతుల్లో కాంతిచెడలేదు. వీళ్ళు పడిపోవడానికి కారణము 'ఈ నీళ్ళలోని విషంచేతనేమో;' అనుకోడానికి వీలులేదు. ఏమీ మాయయో? తెలియడంలేదు. భూమినీ, అన్ని సంపదలనూ శత్రువుల పాలుచేసినాము. ఈ అడవికి వచ్చినాము. భయంకరమైన మృగాలగుంపుల పొందులోఉన్నాము. అట్లాంటిమమ్మల్నివెంటాడి బ్రహ్మ అనాథలనుచేసినట్లు ఇట్లాచేసినాడే? ఇంక ఎక్కడకుపోగలను? అంతులేని దుఃఖాన్ని ఎట్లాదాటగలను. మాతల్లి కుంతీదేవి తనకొడుకులు శోకంతో దైన్యం పొందినందుకు ఎప్పుడూ పొక్కుతూ ఉంటుంది. ఆ పుణ్యచరిత్ర కలిగిన మాతల్లి నా కెదురుగా వచ్చి కౌగిలించుకొని "కుమారా! ఆనాడు నీవు తమ్ములూ కలసి అడవికి పోయినారు కదా? ఇప్పుడా తమ్ములేరీ? ఎక్కడకు పోయినారు? నీవొకడివే వచ్చినావెందుకు?" అంటే నేనేంచెప్పగలను? ద్రోణుడు, విదురుడు, భీష్ముడు కృపుడు నన్నుఆనందంగా కుశలమడిగితే 'కుశలమేమ'ని చెప్పగలను? 'ఎక్కడా తప్పించుకోలేని ఆపద వచ్చిందికదా?' అని చాలావిధాలుగా దుఃఖించినాడు.

ఆ ధర్మరాజు అంతదుఃఖంలోనూ దప్పికను ఓర్చుకోలేకపోయినాడు. నీళ్లు త్రాగడానికి సరోవరంలోనికి దిగినాడు. ఇదివరకులాగానే శరీరంలేనిభూత మిట్లాఅన్నది "రాజా! విను. నేనొక కొంగను. ఈ చెరువు నా సొత్తు. నీ తమ్ములు నామాట వినక నీళ్ళుత్రాగి ఈ విధంగా మరణించినారు. నీవుకూడమిక్కిలిభ్రాంతితో సాహసం చేస్తే, అట్లాగేఅవుతుందిసుమా! మునుముందుగానే అడ్డంచెప్పినాను. నేనడిగే ప్రశ్నలకు సమాధానాలిచ్చి నీళ్ళుత్రాగు."

ఈ మాటలువిని ధర్మరాజు ఆకాశంలో శబ్దంవచ్చినవైపు ముఖంపెట్టి, "అయ్యా! నీవు కొంగరూపంలో ఉన్న రుద్రుడవో, అగ్నివో, గాలివో, అయిఉంటావు. అట్లాకాకపోతే కులపర్వతాల వంటి నాతమ్ములను కూల్చేంతటి బలం పక్షులకెక్కడా ఉండదు. దేవతలు రాక్షసులు గంధర్వులు యక్షులు మొదలైనవారు జయించలేని ఆ వీరులను ఈ విధంగా చేసినావు. సంబంధం లేనివాడివిగా తప్పుకొనిఉన్నావు. నాకు ఆశ్చర్యం, భయం, కుతూహలం ఒక్కసారిగా పుట్టుతున్నాయి. నీవు ఎవరవు? నీఆలోచన ఏమిటి? చెప్పి నాహృదయవేదన తొలగించవా?" అన్నాడు. అందుకాకనబడని భూతం "కౌరవేంద్రా! నేను

